ప్రతులకు : ... ఫోన్ 230

మొదటి కూర్పు, 1983 — శ్రీ శుక బ్రహ్మాశ్రమము
కాపీలు - 2,000 — శ్రీ శుకబ్రహ్మాశ్రమము (పోస్టు)
కాపీ రైటు రిజిష్టర్డు — శ్రీ కాళహస్తి
చిత్తూరుజిల్లా, పిన్ - 517 640

తిరుమల తిరుపతి దేవస్థానము వారు ఈ గ్రంథ ముద్రణకు రు. 2-708 (రెండువేల ఏడువందల ఎనిమిది రూపాయలు సహాయము చేసిరి. వారికి మా ధన్యవాదములు.

ఇట్లు
ప్రకాశకులు



వెల :

అరుణా ప్రింటర్స్, తెనాలి

# విషయసూచిక

పేజీ నెం.

పేజీ నెం.



# తా ర క వి ద్య

పూర్వ మొకానొక పండితుడు సర్వవిద్యాపారంగతుడు పాదచారియై యాత్ర చేసికొనుచు పోవుచుండెను. దారిలో నొకచోట నదియొకటి అడ్డము రాగా దానిని దాటవలసివచ్చెను. నదిలో నీరు వెల్లువలుగ ప్రవహించుచుండెను. ఒడ్డున ఒక బెస్తవాడు చిన్న పడవ నొకదానిని ఉంచుకొని యుండుట జూచి ఆ పండితుడు వానితో సంభాషించి అవలి యొడ్డునకు పోవుటకు ఏర్పాటు చేసికొనెను. ఇరువురును తెప్పలోనికి ఎక్కిరి. బెస్తవాడు పడవను నడుపుచుండెను. పండితుడు నావలో కూర్చొని దీర్ఘాలోచనాతత్పరుడై యుండెను. ఏమి ఊహ జనించినదో కాని అకస్మాత్తుగ నాతడు ఆ పల్లెవానిని పిలిచి ఓయీ! తర్కవిద్య నీవేమైన అభ్యసించినావా? అని అడిగెను. బెస్తవాడు పడవను నడుపుచునే "లేదని" జవాబిచ్చెను. అటుపిమ్మట వారిరువురి మధ్య ఈ క్రింది సంభాషణము నడచెను.

పండితుడు—ఛీ, ఛీ, తర్కవిద్య నేర్వని జీవితము జీవితమేనా? అట్టి అపూర్వ విద్యను నేర్చుకొననందువలన నీ జీవితములోని పాతికభాగము వ్యర్థమై పోయినదని నేను తలంచుచున్నాను. ఇప్పుడైనను నావంటివారి దగ్గర నేర్చుకొని బాగుపడుము! అయితే సరే కాని మీమాంస ఏమైన చదివినావా?

బెస్తవాడు—బాబూ! మీమాంస సంగతి నాకు ఏమీ తెలియదు. మా మాంసం సంగతి మాత్రము తెలుసును.

పం:—ఓరీ వెఱ్ఱివాడా! మీమాంస నేర్చుకొనని వాడవైనావా! అది నేర్వనందువలన నీ జీవితములో మఱియొక పాతిక భాగము వృథా అయినదని నేను భావించుచున్నాను. పోనీ జ్యోతిష్యము చదివినావా?

బెస్త—బాబూ అది అంతకంటెను నాచేత కాదు.

పం:—నారాయణ! నారాయణ! జీవితములో ముప్పాతిక భాగము నాశనము చేసికొనినావురా! ఛీ వెధవా! తర్క, మీమాంస, జ్యోతిషములను మూడు శాస్త్రములను తెలియనివాడు ముప్పాతిక జీవితము దండుగ చేసికొనినట్లయని గ్రహింపుము." ఈ ప్రకారము వారిద్దరి మధ్య సంభాషణము జరుగుచుండగా పడవ సరిగా నది మధ్యభాగమును చేరెను. నీటి ప్రవాహము చాల వడిగా నుండెను.

ఇంతలో పెనుగాలి వీవదొడగెను. తుఫాను చెలరేగెను. నదీ జలము ఉత్తాలతరంగసంయుక్తమై భీతిని గొలుపుచుండెను. పడవ తరంగముల తాకిడికి డోలాయమానమగు చుండెను. ఇంతలో పడవలోనికి నీరు ప్రవేశించెను. తత్ఫలితముగ పడవ నెమ్మదిగా మునుగజొచ్చెను. ఆ ఘోర విపత్సమయమున బెస్తవాడు పండితుని బిలిచి 'అయ్యా బాబూ, తమకు ఈత విద్య వచ్చునా?' యనిఅడుగగా "రాదని" జవాబిచ్చెను. అది విని ఆ పల్లెవాడు "మహాప్రభూ!" తర్క మీమాంస జ్యోతిషములు చదువనందున నా జీవితంలో ముప్పాతికభాగము మాత్రమే నాశనమైనది. "ఈతవిద్య" రానందు వలన తమ జీవిత మిపుడు మొత్తము మొత్తముగానే (100%) నాశనమై పోయినది. అని పలికి యూరకుండెను. ఇంతలో పడవ మునిగి పోయెను. పండితుడు గంగార్పణ మయ్యెను. బెస్తవాడు ఈదుకొని ఒడ్డు చేరెను. చూచితిరా! నదీ ప్రవాహ మధ్యమున కావలసిన విద్య ఏది? ఈతవిద్య. ఆ సమయమున తర్కముగాని, మీమాంసగ్గాని, జ్యోతిషముగాని, హిస్టరీగాని, జాగ్రఫీగాని, ఆల్జిబ్రాగాని, జ్యామెట్రీగాని ఏదియు జీవుని రక్షింపజాలదు. మునుగువానికి ఈత విద్య ఒక్కటియే శరణ్యము. అట్లే జీవుడు సంసార సాగర మధ్యమున గ్రుంకు లిడుచున్నాడు. అట్టివానికి తరుణోపాయము బ్రహ్మవిద్యయే. అక్షర పరబ్రహ్మతత్త్వమే. ఆ విద్య ఒక్కటియే జీవుని

తరింపజేయగలదు. గనుకనే దానికి "తారక విద్య" యని పేరు వచ్చినది. భవదుఃఖశమనమునకై మనుజుడద్దానిని తప్పక పరిగ్రహించ వలయును.

నీతి :— నదిని దాటుటకు ఓడ అవసరమైనట్లు సంసారమును దాటుటకు బ్రహ్మవిద్య అవసరము కావున దానిని బడయుటకై జీవుడు ప్రయత్నించవలయును



# ఏకత్వానుభూతి

పూర్వకాలమున ఒక గురువుండెడివాడు. అతనికొక శిష్యుడుండెను. గురువునకాతడు సేవాశుశ్రూషలు గావించుచుండెను. ఇట్లుండ కొంతకాలమునకా గురువు యొద్ద మఱియొక శిష్యుడు వచ్చి చేరెను. ఇరువురును భక్తితో గురువును సేవించుచుండిరి. ఒకనాడు మధ్యాహ్న సమయమున గురువు దూరప్రదేశము నుండి తిరిగివచ్చి బడలికచే చాపపై ఒకింత సేదదీర్చుకొనెను. పరుండబోవునప్పుడు తన మొదటి శిష్యుని పిలచి 'ఒరే! నాయనా! కాళ్లునొప్పిగా నున్నవి. కొంచము సేవ ఒత్తరా!' యని ఆదేశించెను అతడట్లే గురువును సేవించుటకు వచ్చుచుండగా, ఇంతలో రెండవ శిష్యుడు ఒక ఆక్షేపణ (Point of Order) తెచ్చెను. అతడు గురువుతో 'మహాత్మా! ఇతడు పాతవాడు. చాలాకాలమునుండియు మీ సేవచేయుచున్నాడు. తత్ఫలితముగా ఇప్పటికే బండెడు పుణ్యమును మూటకట్టుకొని వేసెను నేనింతవరకు గురుసేవాలభ్యమగు రవ్వంత పుణ్యమునైనను నోచుకొనలేదు. ఉన్న కాస్త పుణ్యమును, ఇరువురును పంచుకొనవలెనే కాని అంతయుఅతని పాలిటనే పడుట న్యాయవిరుద్ధము. కాబట్టి నేటికతని నిలిపివైచి నాకే ఈ అవకాశము యిప్పించ వేడెద!' అని ప్రార్థించెను. మొదటి శిష్యుడు ఏమియు తక్కువ తినిన

వాడు కాదు. అతడు వెంటనే ఉగ్రుడై 'స్వామీ! గురువర్యా!' అతని వాక్యములను వినకుడు. కొత్తగా వచ్చెను కనుక కాళ్లు పిసుకుట అతనికి సరిగా తెలి యదు. అనవసరముగా తమకు బాధకు గురియగుదురు. ఏ ఉద్యోగమునందైనను, అనుభవమునకే ఎక్కువ ప్రాధాన్య మొసంగుట లోకధర్మము; తమకు తెలియనిది ఏమున్నది?' యని చెప్పి యూరకుండెను. ఈ ప్రకారముగా ఆ యిద్దరు శిష్యులు గురువునకు లేనిపోని ఒక సమస్యను తెచ్చిపెట్టిరి. మాయాబంధము ఛేదించి వేయుట గూడ ఆ గురువునకు సులభమనిపించెనుగాని ఈ పరమానంద శిష్యులిరువురికిని రాజీ చేయుట మాత్రము మహాదుస్తర మనిపించెను.

ఏమిచేయుటకు తోచక, తుదకొ 'మధ్యేమార్గ' మవ లంబింప నిశ్చయించి, ఇరువురిని దగ్గరకు పిలిచి, 'ఓ శిష్యనాయన లారా! భగవంతుడు నాకు రెండు కాళ్లు ఇచ్చియున్నాడు. కనుక చెరియొక కాలు పంచుకొని సేవించుడు. ఈ పీడకు ఇదియే విరుగుడు?' అని చెప్పి యరుండెను.

శిష్యులిద్దఱున్ను, 'షేష్ షేష్' అని సంతోషించి అట్లే చెరియొక కాళ్ళు పంచుకొని సేవించుచుండిరి. వైషమ్యము అసలు వుండరాదు. ఉండినచో అది యేదియో ఒక రూపమున బయటకు వెడల గ్రక్కబడుచునే యుండును.

ఈ శిష్యుల విషయమట్లే అయినది. పొరపాటున ఒకరు పిసుకుచుండిన కాలు మరియొక దానికి కొద్దిగా తగిలెను. అవతలివాడు కోపగించి, 'ఏమిరా! ఒళ్ళు దగ్గర పెట్టుకొని పని చెయ్యి' అని మందలించి, ప్రతీకారచర్యగా తాను ఒత్తుచుండిన గురువుకాలు ఎత్తి అమాంతముగ అవతలదాని మీద విసరివేసెను. వాడున్ను రుద్రాకారమును ధరించి, ఓరే! నాకాలును కొట్టెదవా? "నీకాలు" పని పట్టెదను చూడు! అని రోషావేశపూరితుడై దగ్గరనేయున్న గురువుగారి కమండలువును తీసికొని దానితో అవతలి కాలుమీద బలవంతముగ కొట్టెను. వాడున్ను ప్రతిక్రియాకృతి వహించి, గురువుగారి యోగదండము తీసికొని ఇవతలికాలును చావమోదెను. ఈ 'గలాటా' అంతయు చూచి, గురువుగారు నిద్రలేచిరి. శిష్యుడు శిష్యుడు పోట్లాడుకొని, గురువుకాళ్లు చప్పగా నాశనముచేసిరి. గురువు బాధతో 'ఏమిటిరా ఈ గల్లంతు!' అని అడుగగా ఆ శిష్యులిరువురును, మహాత్మా! తాము ఊరకుండుడు! ఇది మా అంతరంగ వ్యవహారము (domestic affair) ఇదేదో తేలవలె. వాడి కాలు గొప్పా, నా కాలు గొప్పా' అని పలికిరి. అంతట గురువు 'ఓరీ నీకాలు, వాడి కాలు ఏమిటిరా, ఆ రెండును నా కాళ్లేకదరా! ఎంత తెలివి తక్కువ వారురా బాబు!' అని తిట్టి ఇరువురిని దూరముగా పంపివేసెను.

అట్లే ప్రపంచమందలి జీవరాసులందరును పరమాత్మ

యొక్క అవయవములు. అవయవములు వేఱు వేఱుగా కన్పించినను, 'అవయవి' దృష్ట్యా వానియన్నింటియందును ఏకత్వమే కలదు. దృష్టాంతమందలి గురువుగారి ఒక కాలు మఱియొక కాలును తన్నుట ఎంతి హాస్యాస్పదమయిన విషయమో, ఒక ప్రాణి మఱియొక ప్రాణితో పోట్లాడుట, అతనిని ద్వేషించుట, హింసించుట అంత హాస్యాస్పదమే యగును.

నీతి ౹:– ప్రపంచమంతయు భగవత్స్వరూపమని యెంచి సర్వులయెడ ప్రేమ, దయ కలిగియుండుము; ఎవరిని ద్వేషింపరాదు.

# అలసత్వమును పారద్రోలవలెను

పూర్వమొకానొక పట్టణమునకు సమీపముగ నొక కుగ్రామముండెను. అందనేక రైతుజనులు కాపురముండుచుండిరి. ఒకనాటి రేయి గ్రామస్థులందఱును నిదురించుచుండ అర్ధరాత్రి సమయమున ఊరిలోని గుడిసెలకు నిప్పంటుకొని ధగ ధగ మండిపోవుచుండెను. గ్రామస్థులందఱున్ను నిద్రలేచి వారివారి సామానులన్నియు బయటకులాగి, ఆ పిదప ఏమి చేయవలెనో తోచక అందఱు ఒక రచ్చబండపై తమ కర్తవ్యమును ఆలోచింపదొడగిరి గ్రామశాసన సభయొక్క అత్యవసర సమావేశమది. అందొకడు లేచి 'మహాజనులారా! ఇది తామసించుటకు సమయము కాదు. వెంటనే ఇంటికి ఒక్కొక్కరు చొప్పున వెళ్లి కాటాకులు పెరికివేసి నిప్పును ఆర్పవలెను.' అను అభిప్రాయ మొసంగెను. మరి యొకడు తక్షణమే లేచి 'గౌరవ సభ్యుని అభిప్రాయముతో నేనేకీభవించను. ఏలననగా ఆ కార్యమువలన నిప్పు పూర్తిగా శమించదు. కావున సమీపముననే పట్టణము కలదు. ఎవరైనను అచటికి పరుగెత్తి వెళ్లి నిప్పు చల్లార్చు యంత్రము (Fire Engine) ను తీసికొని వచ్చినచో ఒక్క నిముసములో అది నిప్పంతయును చల్లార్చివేయగలదు' అని చెప్పి కూర్చుండెను. ఈ ప్రకారముగ ఒక్కొక్కరు వారివారికి తోచిన అమూల్య

భావములను, సలహాలను చెప్పుచుండగా ఆ ప్రజాసభామధ్యము నుండి ఒక పెద్దమనిషి లేచి 'అయ్యా! ఈ మాటలన్నియు కట్టి పెట్టండి. మీరిచ్చిన సలహాలలో ఒకటియు సందర్భోచితముగ లేదు. నేనెంతయో ఆలోచించి చక్కని ఉపాయమును చెప్పుచున్నాను. దానిని విని ఆచరణలో పెట్టితిరా గ్రామమును అగ్నికి ఆహుతి కాకుండ తప్పించగలము. లేకున్న మొత్తము పరశురామప్రీతి కాకుండ మానదు. నేను చెప్పబోవు ఉపాయమేమనగా, గ్రామస్థులందరును వారి వారి పలుగులు, పారలు తెచ్చి సమీపముననే ఒక బావిని త్రవ్వినచో కావలసినన్ని నీళ్లు దొరుకును. ఆ నీటిచే ఎంతటి అగ్నినైనను సులభముగ ఆర్పివేయవచ్చును. కావున కర్తవ్యమునకు గడంగుడు' అని ఆనతిచ్చెను. అది విని అందరును పక్కున నవ్విరి. అట్లే నవరంధ్రములతో ఈ దేహమను పంజరమున ప్రాణమను పక్షి ఏ క్షణములోనైనను ఎగిరి పోవుటకు సిద్ధముగ నున్న ఈ సమయమున వ్యాధులు, విఘ్నములు, వియోగములు, అశాంతికర పరిస్థితులు తండోపతండములుగ వచ్చి మీదపడుచుండ, మీనమేషములు లెక్కపెట్టుచు, కడతేరు మార్గమును గూర్చి ఆలోచింపక దైవధ్యానమునకు ఇంకను చాలా సమయమున్నదిలే' అని తామసించు జనుల యొక్క యోచన బావి త్రవ్వ బూనుని యొక్క యోచనవలెనే యుండును.

కనుకనే భర్తృహరి

'సంవీప్తే భవనే తు కూపఖననం ప్రత్యుద్యమః కీదృశః'

అని గంభీరముగ ప్రశ్నించి, అట్టి దీర్ఘసూత్రులను పరిహసించెను. పైనదెల్పిన కూప సాదృశ్యమునే యాతడు తన యీ వాక్యముల ద్వారా వ్యక్తము చేసెను. కావున విజ్ఞుడగువాడు బాగుగా యోచించి అమూల్యమగు ఈ మానవ జీవితమును భోగములందుగాక యోగమునందే వినియోగించుచు ఆత్మజ్ఞానమును శీఘ్రముగా సంపాదించి జన్మసాఫల్యమును బొందవలెను. భగవంతుని పాదపద్మములను ఆశ్రయించి భవరోగమును బాపుకొనవలెను.

నీతి :- అలసింపక సర్వేశ్వరుని శీఘ్రముగ శరణు పొందవలెను.



# ఆత్మసాక్షాత్కార మెట్లు కలుగును?

పూర్వకాలమున ఒకానొక ధార్మికచిత్తుడగు రాజుండెను. విశాలమగు తన రాజప్రసాదముయొక్క మహోన్నత కుడ్యముపై మహాభారత యుద్ధసమయమున శ్రీకృష్ణపరమాత్మ రథముపై గూర్చుండి అర్జునునకు గీతోపదేశము చేయుచుండిన పవిత్రదృశ్యమును చిత్రింపించవలెనని యాతనికి అభిలాష జనించెను. అతదర్థమునకై యాతడు తన దేశమందలి సుప్రసిద్ధులగు చిత్రకారులందఱిని రప్పించి వారినందఱిని పరీక్షించి అందులో మహాప్రజ్ఞావంతులగు యువకునిమాత్రము ఎన్నుకొనెను. ఆ యువకుని తన రాజభవనము యొక్క కుడ్య అంతస్సుపైకి తీసికొనివెళ్ళి 'ఓ చిత్రకారుడా! గీతపై నాకు మక్కువ జనించినది. గీతాచిత్రమును నిరంతరం నా కళ్లెదుట చూచుకొని ఆనందించవలెనను కుతూహలము కలిగినది. గీతోపదేశము చేయుచుండు పార్థసారథి యొక్క పావన ముఖారవిందమును సదా సర్వకాలములందును సందర్శించి కృతార్థుడను కాదల్చితిని. కావున [illegible] తీసికొని వానిపై గీతోపదేశ చిత్రమును లిఖింపుడు. [illegible]యము 6 మాసములు, ఉత్తమ చిత్రమునకు బహుమానము 10 వేల రూప్యములు. మీ భోజనము వసతి [illegible] మేము భరించెదము. మీరు మాత్రము పరాగచిత్రముతో

జీవకళ ఉట్టిపడుచుండు విధముగ వానిని చిత్రింపుడు, అని వారితో పలికెను. వారట్లే యంగీకరించిరి. వారికివ్వబడిన గోడలు ఎదురెదురుగ నుండెను. మఱుసటిరోజు నిర్ణీతసమయమున పోటీ ప్రారంభమయ్యెను. ఇరువురును వారివారి నైపుణ్యమును చూపుటకు కృతనిశ్చయులైరి. ఒకరి చిత్తరువును మఱియొకరు 'కాపీ' కొట్టకుండ గోడలపై పెద్ద తెరలు దించబడెను. ఆ తెరల వెనుక వారు తమ కార్యమును దీక్షతో నుపక్రమించిరి. 7 నెలలు గడచెను. బహుమానమును నిర్ణయించుటకై ప్రముఖులగు నిర్ణేతలు (Judges) రప్పింపబడిరి. మొదటిగోడకు తగిలించిన తెర యెత్తబడెను, చిత్తరువు కంటకు కొట్టినట్లు అగుపడెను. సాక్షాత్ శ్రీకృష్ణమూర్తియే ఆ పార్శ్వమున వెలసెనా అనిపించునంతటి సహజగాంభీర్య లావణ్యములతో తొణికిసలాడుచుండెను. ఆ చిత్రరాజము చిత్రకారుడు తన పంచప్రాణములను దానియందు ధారబోసెనా యనిపించుచుండెను. అది గాంచి నిర్ణేతలలో చాలమంది 'ఇదియే రెండిటిలో ఉత్తమచిత్రము కావచ్చును' అని మనంబున ఊహాగానము చేసికొనిరి. అయినను తుదినిర్ణయము చేయుటకు రెండవదికూడ చూడవలెనుగదా అని యెంచి దానికి ఎదురుగానే ఉన్న రెండవగోడను సమీక్షించిరి.

ఆ రెండవవాని పరిస్థితి యెట్లున్నదనిన, ఆ ఏడు నెలలూ లక్షణముగా మూడుపూటలు రాజభోజనమును ఆరగించుచు

చిత్రకుడును ఒకింతైనను లిఖింపక ఊరక నేయుండెను. అయితే ఒక గాజుపెంకును తీసికొని గోడయావత్తు దానితో బాగుగా రుద్దుచుండెను. ఈ ఆఱునెలలు అదేపనిగా రుద్దగా రుద్దగా చివఱకు ఆ గోడ నున్నగా అద్దమువలె తయారయ్యెను. ఏ సమయమున ఆ గోడకు తగిలించబడిన తెర మెత్తివేయ బడెనో, ఆ సమయముననే అద్దమువలెనున్న ఆ గోడలో ఎదుటవాని చిత్రము ప్రతిబింబించెను. నిర్ణేతలందఱును ఆశ్చర్యచకితులైరి. ఆహా! ఎట్టి చిత్రము నీతడు లిఖించెను. మొదటివాడు రంగులతో వ్రాసెను. ఈతడు రంగులు లేకనే రంగులను సృష్టించెనే. మొదటివాడు గోడపై గీసెను. ఈతడు గోడలోపల గీసెనే! పైగా చిత్రము అద్దమునందు వలె తళతళ మెరయుచున్నదే! ఓహో! అద్భుతము! ఎట్టి చాకచక్యము! అని దానిని ముక్కంటముగ పొగడుచు దానిని లిఖించిన వానికే ప్రథమ బహుమానమును సమర్పించివైచిరి!! చూచితిరా! చిత్రకుడేమియు లిఖింపకున్నను పారితోషికము బడయగల ఘనత నాతడెట్లు సంపాదించగల్గెనో! ఉన్న వస్తువును శుద్ధమొనర్చుటయే అతడు చేసినపని. క్రొత్తి వస్తువును తెచ్చి చేర్చుటకాదు.

అట్లే ఆత్మసాక్షాత్కారమును బడయగోరు ముముక్షువు క్రొత్తగా ఒక వస్తువును అది దేవుడైనను సరే-తనలో

నూతనముగ తీసికొని రావలసిన పనిలేదు. ఆ దేవుడు తనలో సిద్ధముగా నున్నాడు. క్షేత్రజ్ఞరూపమున వెలయుచున్నాడు. (అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః): కాని జీవుని మలినమనస్సు చేత కప్పబడి అనుభూతుడు కాకయున్నాడు. అనేక జన్మార్జిత ఘనీభూత వాసనా జాలముచే తిరోహితుడై వర్తించుచున్నాడు. ఎపుడామనస్సు అభ్యాసవశమున శుద్ధ పడునో; నిర్మలముకురమున ప్రతిబింబమువలె అట్టి నిర్మలాంతఃకరణమున ఆత్మతేజము తన్నగా భాసించును. అదియే ఆత్మసాక్షాత్కారము.

నీతి :- మనోనిర్మలత్వమే ఆత్మసాక్షాత్కారమునకు ఏకైక మార్గము.

# దానశీలత్వము

పూర్వమొకప్పుడు కర్ణుడు తన గృహమున అభ్యంజన స్నానము చేయుచుండెనట. నవరత్న ఖచితమగు నొకపాత్రలో నూనె, మరియొక పాత్రలో నున్నిపిండి మొదలగునవి ప్రక్క-నుంచుకొని ఒక చోట కూర్చొని నూనెతో స్వయముగా తలంటుకొనుచుండెను. సరిగా ఆదే సమయమున శ్రీ కృష్ణమూర్తి అతనిగృహమునకు విచ్చేసెను. కర్ణుడు తలంటుకొనుచుండుటయు, ప్రక్కనే మరకతమాణిక్యములు పొదగబడిన విలువైన పాత్ర యుండుటయు చూచి, ఆ నటనసూత్రధారి కర్ణునితో తనకాపాత్ర కావలయునని అడిగెను. ఇంద్రునకు తన కవచకుండలములనే దానమొసంగివైచి 'దానకర్ణుడ'ని లోకమున విఖ్యాతినొందిన అమ్మహనీయుడు సాక్షాత్ పరమాత్మయే వచ్చి అడిగినప్పుడు ఇక వెనుకకు తగ్గునా ! వెంటనే యతడు (కుడిచేతితో తలంటుకొనుచుండెను గనుక) తన ఎడమ చేతితోనే దానిని పరిగ్రహించి శ్రీకృష్ణునకివ్వదొడగెను. కాని శ్రీకృష్ణు డద్దానిని స్వీకరింపక, 'కర్ణా! ఎడమ చేతితోనా నాకు సమర్పించుట ? శిష్టాచారము నీకు తెలియదా ? అని యడుగ నంతట కర్ణుడిట్లు సమాధాన మొసంగెను...

**క్షణం చిత్తం క్షణం విత్తం క్షణం జీవితమావయోః**
**యమస్య కరుణా నాస్తి ధర్మస్య త్వరితా గతిః**

ఓ కృష్ణా! ఇప్పుడున్న ధనము మఱుక్షణమున మాయమై పోవచ్చును; ఇప్పుడున్న జీవితము ఉత్తరక్షణమున అంతమై పోవచ్చును. యమధర్మరాజు ఎవరిపై నను విచక్షణచూపడు జీవుల ధర్మబుద్ధి త్వరితగతిని మార్పునొందుచుండును! కాబట్టి తలంచుకొనుచున్న కుడిచేతిని (నూనెచేతిని) కడుగుకొని దానితో నీకు ఆ పాత్రనిచ్చులోపల నా బుద్ధి ఏమి మారి పోవునో! అంతవఱకు నాజీవితముండునో లేదో - అను విచికిత్స నాలో కలుగ, తత్క్షణమే నేను ఎడమచేతితో దానిని నీకిచ్చి వేయ దొడంగితిని. అంతియేకాని తెలియక కాదు'—కర్ణుని అధ్యాత్మభావ పరిపూర్ణములగు ఆ వాక్యములను విని శ్రీకృష్ణుడు లోలోన చాల సంతసించెను.

లుబ్ధత్వము మహాప్రమాదకరమైన గుణము. కామ, క్రోధ, లోభములను 'అగ్రదుష్టత్రయము'లో అది స్థానమును సంపాదించు కొనగల్గినది.

త్రివిధం నరకస్యేదం ద్వారం నాశనమాత్మనః
కామక్రోధ స్తథాలోభ స్తస్మాదేత త్త్రయం త్యజేత్.

(16.21)

'కామక్రోధ లోభములు మనుజునకు నరకద్వారములు - ఆత్మ వినాశకరములు. కావున వానిని త్యజించి వేయవలెన'ని శ్రీకృష్ణభగవానుడు ఆనతిచ్చియుండలేదా? కావున త్యాగ

శీలురై మెలగవలెను. దానపరత్వము వలవరచుకొనవలెను. ఈనాడు లోకములో ఎందరో దరిద్రులను మనము చూచుచున్నాము. కూటికిగుడ్డకు కఱవైపోయి నానాబాధలను పొందుచు వీధులలో తిరుగాడుచుండు ఈ దరిద్రులెవరు? ఇట్టి దీనస్థితి వీరికేల సంభవించినది? భగవంతునకు వీరిపై ప్రత్యేక పక్షపాతము కలదా? లేదు. "నమే ద్వేష్యోఽస్తి న ప్రియః" నాకెవనిపైనను ద్వేషములేదని అతడు చెప్పనే చెప్పెను. కొందరు తిని త్రాగి లక్షణముగ ఆనందించుచుండ పాపము వీరికిమాత్రమేల ఇట్టి శోచనీయస్థితి ఘటిల్లినది? పూర్వ దానధర్మములు చేయని కారణము చేతనే ఇట్టివారికి దౌర్భాగ్యము సంభవించినది.

## అదానదోషేణ భవేద్దరిద్రః

అని శాస్త్రము ఐక్యకంఠముతో బలుకుచున్నది. ఆ స్మృ. 'దానము చేయని దోషముచే జీవుడు దరిద్రుడై జన్మించును.' తా మనుభవించు దానిలో తృణమో పణమో మఱియొకరి కిచ్చుట నేర్చుకొనవలెను. ఈ శరీర నిర్మాణమును జూచిన, భగవంతుడు ఒకరికిచ్చు పద్ధతిలోనే చేతిని సృష్టించెను. చేతులు క్రిందకు వాల్చియున్నప్పుడు వానిని గమనించినచో ఈ సత్యము బోధపడగలదు. ఇమ్ము, ఇమ్ము (give-give) ఇదియే జీవిత రహస్యము.

The less I have the more I am

అను నానుడి ప్రకారము ఇతరులకు దానధర్మములు చేయుచు తన స్వంతమునకై మనుజుడు ఎంతెంత తక్కువ వినియోగించుకొనుచున్నాడో అంతంత గొప్పవాడుగ నాతడు పరిగణింపబడు చుండును.

సీ॥ :- దానధర్మములను వెనువెంటనే చేయవలెను. జీవితము క్షణభంగురమని గుర్తెరిగి ధర్మకార్యములను విరివిగ చేయవలెను.

# గురుదక్షిణ

పూర్వము జనకమహారాజు మిథిలానగరమున రాజ్య
మేలుచుండెను. రాజ్యకార్యములతో పాటు దైవచింతన, పర
మార్థ విచారణ జరుపుచు తెల్లగా సలుపుచుండెను. ఆధ్యాత్మ
తత్త్వ జిజ్ఞాస తీవ్రతరముకాగా జనకమహారాజు తన దేశములో
నలుమూలలనుండి ప్రకటన గావించెను. "ఈ దేశములో గల
పండితులు, తత్త్వజ్ఞులు, వేదాంతులు ఎవరెవరు కలరో వారం
దఱును రాజధానికి వచ్చి రాజునకు బ్రహ్మజ్ఞానోపదేశము
చేయవలెను. అనుభవపూర్వకముగా బోధించవలెను కాని
నోటిమాటలతో కాదు. గుఱ్ఱపు రికాబులో ఒకకాలు పెట్టి,
మరియొక రికాబులో కాలు పెట్టులోపల - అనగా క్షణకాల
ములో బ్రహ్మానుభూతిని కలిగించవలెను. అట్లు కలిగింపలేని
వారందఱును దేశము నుంచి వెడల గొట్టబడును'— అని
దండోరా వేయించెను. రాజుగారి యీ ప్రకటన దేశములో
గొప్ప సంచలనము కలుగజేసెను. పండితులు, కవులు, శాస్త్ర
వేత్తలు భూపాలునకు ఆత్మతత్త్వానుభూతి కలుగజేయు గట్టి
సంపత్తి సామర్థ్యము లేనివారగుటచే దేశబహిష్కరణ శిక్షకు
భయపడి అత్యంత చింతాక్రాంతులై యుండిరి. [illegible]
సమీపించుట కెవరును సాహసించలేదు. అట్టి [illegible]
వను మహర్షి యచటికి పోవుచుండెను. ప్రజల [illegible] విచార



గ్రస్తులై యుండుట ఆది కారణములచే వారు జరిగిన విష
యమును సవిస్తరముగా తెలియజేసిరి. అష్టావక్రుడు వార
లకు అభయమొసంగి వెంటనే రాజప్రసాదమున కరిగి రాజుతో
తాను బ్రహ్మజ్ఞానము నుపదేశించెదనని ధైర్యముతో బలికెను.
భూపాలుడంగీకరించెను. "ఉపదేశము ఏకాంత స్థలమునందే
చేయవలెను గాని బహిరంగముగ గాదు. కావున సమీ
పారణ్యమునకు బోవుదము రండు" అని యమ్మునీశ్వరుడు
పలుక రాజు తన అశ్వమును, కొందరు సైనికులను వెంటనిడు
కొని సమీప కాననమునకు బయలుదేరెను.

త్రోవలో నొకచోట సైన్యమును నిలిపివేసి, గురు
శిష్యులిరువురును నిర్జన ప్రదేశమునకు పోయిరి. జనకుడచట
తన గుఱ్ఱపు రికాబులో కాలుపెట్టెను. 'రెండవ రికాబులో
కాలుపెట్టులోపల బ్రహ్మానుభూతి కలిగింపవలెను', - ఇది
సమస్య. అత్తఱి అష్టావక్రమునీంద్రుడు బోధకు ముందుగా
గురుదక్షిణ నివ్వవలసినదిగా రాజును కోరెను. తానేది కోరు
కొనినదానిని తప్పక నొసంగెదనని జనకుడు పలికెను. తక్షణమే
అమ్మునివర్యుడు 'నీ మనస్సును నా కొసంగుము' అని యాదే
శింప, జనకుడట్లే చేసెను. మనస్త్యాగముచే జనకుని శరీరము
గుఱ్ఱముపై నిశ్చేష్టముగ నుండిపోయెను. (డ్రైవరులేని బండి
వలె) దేహము కదలక మెదలక నుండెను. అట్టి స్థితిలో నాతని
నచట వదలివైచి అష్టావక్రుడు వెడలిపోయెను. దూరముగా

నున్న సైనికులు రాజుకై నిరీక్షించి వారి జాడ యెచ్చటను
లేమి వారే స్వయముగా వెదకుటకై వయనమైరి. ఒకచోట
గట్టముపై తాము నిశ్చేష్టుడుగ నుండుటజూచి వారాశ్చర్య
నిమగ్నులై అష్టావక్రుడేదియో సమ్మోహన మంత్రమును
ప్రయోగించెనని భావించి వెంటనే యాతని వెతికి తోడి
తెచ్చిరి. అష్టావక్రుడు జనకుని స్పృశింపగనే యాతనికి స్పృహ
కలిగెను. 'జనక మహారాజా! నీవు ధన్యుడవు త్రుటికాలములో
బ్రహ్మానుభూతి కలుగుటకు అనువుగా నీ హృదయమును
అత్యంత పరిశుద్ధ మొనర్చుకొంటివి. మనస్సును ఒక పదార్థ
మువలె త్యజించివేయు సమర్థతను బడసితివి. ఇక నీకు క్రొ
త్తగా బోధించవలసినది లేదు. ఆత్మకు అడ్డుగానున్న మన
స్సును తొలగించుటయే అన్ని బోధలయొక్క సారాంశము.
అన్ని సాధనల యొక్క పర్యవసానము. అదియే అమనస్కస్థితి.
మనస్సు అను అడ్డు తొలగించిన శేషించునదే ఆత్మ. అట్టి
ఆత్మానుభూతియే మోక్షము. మనోలయము ద్వారా, మన
స్త్యాగము ద్వారా నీవట్టి మహోచ్చస్థితిని బడసితివి. కావున
ధన్యుడవు' అని అష్టావక్రమునీంద్రుడు జనకునితో పలుక,
అంతట జనకుడు తనకట్టి సులభమగు మోక్షోపాయమును
బోధించిన యా సద్గురువర్యునకు సాష్టాంగవందన మాచరిం
చెను. తదుపరి యందఱున్నూ తిరిగి నగరమునకు బోయిరి.

స్థితి :- మనస్సును బహిర్ముఖముగ పోనీయక అంతర్ముఖమగు ఆత్మయందు లయింపజేసి ఆత్మరూపుడై వర్తించుటయే మోక్షము. అట్టి ముఖ్యప్రాధాన్య శాశ్వత స్థితినే జీవుడు సాధించవలెను. అదియే వాస్తవమగు గురుదక్షిణ.

# భగవానుడు సర్వవ్యాపి

ఒకనాడు కాలేజివిద్యార్థి పెద్దపరీక్షలు (Annual Exami_
nation) సమీపించినపుడు తాను గణితశాస్త్రములో చాల
వెనుకబడి యుండుటచే పరీక్షయందు ఉత్తీర్ణుడగుట కష్టమని
తలంచి ఆ గ్రామములోని దేవాలయమునకుపోయి దేవునకు
నమస్కరించి "మహానుభావా! రేపటి దినము గణిత పరీక్ష.
నాకావిద్యలో ప్రావీణ్యము లేదు. పరీక్ష తప్పినచో విద్యార్థి
సంఘములో నగుబాట్లపాలగుదను. కావున దయయుంచి
అద్దానియందు నన్ను కడతేర్చినచో నీకు పులిహోర, చక్కెర
పొంగలితో చక్కని నైవేద్యము సమర్పించుకొందను.
దేవా! పాహి! పాహి!" అని మొరపెట్టుకొని ఇంటికి వెడలి
పోయెను. మరునాటి రోజు పరీక్ష ప్రారంభించెను. ప్రశ్నపత్రి
ములు అందరికిని పంచి పెట్టబడెను. మన కథానాయకుడగు
విద్యార్థికిన్ని ఇవ్వబడెను. కాని ఏమని చెప్పవచ్చును! అతని
ఆనందమునకు మేరయే లేదు. అన్నియు అతనకు తెలిసిన లెక్కలే!
కావున అత్యానందముతో భగవానునకు లోలోన జోహారు
లర్పించుకొనుచు చకచక ఒకగంటలో అన్ని లెక్కలను నిర్దు
ష్టముగ చేసిపారవేసెను. పరీక్ష కాలము 3 గంటలు ఏర్పాటు
చేయబడెను. కావున మన విద్యార్థికి యింకను 2 గంటల
కాలము మిగిలియేయున్నది. ఊరకనే కూర్చొనుట దేనికని
తలంచి అతడు కొన్ని తెల్ల కాగితములను తీసికొని, దానిపై

మరుసటి రోజు భగవంతునకు సమర్పించ వలసిన నైవేద్య
మునకు కావలసిన వస్తువుల జాబితా తయారు చేయనారంభిం
చెను. పులిహోరకు బియ్యము, నూనె, చింతపండు, మిరప
కాయలు, పసుపు మున్నగునవియు, చక్కెర పొంగలికి బియ్య
ము, చక్కెర, పెసరపప్పు, నెయ్యి, జీడిపప్పు, ద్రాక్ష ఇత్యా
దులును ఏయే పరిమాణములో కావలయునో అంతయు వ్రాసి
పెట్టెను. ఇంతలో అతనికొక ఆలోచన తట్టెను. భగవంతు
నకు రుచు లెందుకు? విలాసము లెందుకు? కావున ద్రాక్ష అన
వసరము. జీడిపప్పు అంతకంటె అనవసరము, అని తలంచి ఆ
రెండు పేర్లను దానికగు ఖర్చున్ను జాబితాలో కొట్టివేసెను.
మరల కొంతసేపు దీర్ఘాలోచనచేసి చక్కెర సగానికి సగం
తగ్గించెను. పిదప గీతయందలి "కట్వామ్లలవణాత్యుష్ణ" అను
శ్లోకము జ్ఞాపకమునకు రాగా, దేవునకు పులుపు, కారం ఇష్ట
ముండదని నిశ్చయించి ఆయా వస్తువులను తీసివేసెను. ఈ
ప్రకారముగ తాను వ్రాసిన వస్తువులన్నింటిని కొట్టివేయ
టయో, తగ్గించుటయో జరుపుచుండెను. తుట్టతుదకు అతని
కొక ఊహ జనించెను. అసలు దేవునకు ఈ గొడవయంతయు
దేనికి? ఇంతఖర్చు ఎందులకు? "పత్రంపుష్పం ఫలం తోయం"
అని చెప్పియే యున్నాడుకదా! అవి యిచ్చుకుంటే చాలదా?
అని భావించి ఇతఃపూర్వము వ్రాసిన జాబితా మొత్తం కొట్టి
పారవేసెను. మరల యోచించి 'పత్రిపుష్ప ఫలాదులలో
కూడ, ఫలములు, పుష్పములు, పత్రములు ఈ కాలములో

తప్పు ఇచ్చినదాని కొరకవ్వ ఒక్క తోయమే (నీళ్లు) అందు బాటులో ఉన్నది. దొడ్డిలో బావియున్నంతవరకు దానికి దిగులు లేదు అని తలంచి దేవునకు తోయము (జలము) మాత్రము సమర్పించుటకు తీర్మానించెను. మరల దానిని కూడ రద్దుచేసి నీళ్లు తోడునట్టి ఆ ప్రయాసకూడ ఏల? మానసికముగా నీళ్ళు సమర్పించినట్లు భావించిన చాలదా? అనుకొనెను. ఈ ప్రకారముగ వానిని మనంబున భావనా పరంపరలుగ పరుగులెత్తుచుండ, పరీక్షా సమయము పూర్తికాగా పరీక్షాధికారి ఆ విద్యార్థివద్దకు తటాలున వచ్చి "Answer papers please, quick" (జవాబు కాగితములు త్వరగా ఇవ్వండి) అని అరచెను. ఆ తొట్రుపాటులో ఆ విద్యార్థి పులిహోర, చక్కెరపొంగలి ఖ్యాపత్తు కాగితములను మడతపెట్టి అధికారికి ఇచ్చివేసి, తాను వ్రాసిన అసలు లెక్కల కాగితములను మడతపెట్టి ఇంటికి తీసికొని వెళ్లెను. ఇంటికి రాగానే తండ్రి ఏమిరా? లెక్కలు బాగుగా వ్రాసినావా? అని అడుగ అద్భుతముగా వ్రాసితిని, భగవంతుడు కరుణించినాడు. అన్నియు తేలిక లెక్కలే వచ్చినవి! అని కుమారుడు బదులు చెప్పెను. ఇంతలో తండ్రి, ఏదిరా! ప్రశ్నపత్రము మాతము ఇటు తెమ్ము", అని అడుగ, కుమారుడు తాను తెచ్చిన కాగితములను చూపెను. అవి చూచి తండ్రి సంభ్రమ చిత్తుడయ్యెను. 'ఇది ఏమిరా? నీవు పరీక్షలో వ్రాసిన లెక్కల కాగితములు (Answer papers)

అధికారికి ఇవ్వక ఇంటికి తెచ్చినావేమి? అయ్యో! ఎంత పొర పాటు చేసితివి? అని మందలింపగా, కుమారుడది చూచి లోలోన దుఃఖముచే కుమిలిపోవుచు నేను దేవుని మోసగింప టకు యత్నించితిని ఫలితముగా నేనే మోసపోతిని. ఇక ఎన్నడును ఇట్టి మోసకృత్యమును చేయను. దయామయుడు, భక్తవత్సలుడు, నాపై కరుణామృత వర్షము కురిపించి నన్ను గట్టెక్కించి నప్పటికిని నేనే చేతులార దానిని జారవిడుచు కొంటిని. ఇట్టి దుర్బుద్ధి ఇక మీదట నాకెన్నడును కలుగ కుండుగాక అని పరితపించెను.

కావున భగవంతుని యునికి ఏదియో ఒక చోటున మాత్రము కలదని తలంపక బ్రహ్మాండమందలి ప్రతి అణువు నందును, జీవులయొక్క ప్రతి సంకల్పమునందును ఓతప్రోతమై వెలయుచుండునని నిశ్చయింపవలెను. భగవంతుడు ప్రతివాని యొక్క హృదయముననే దాగి అతి సూక్ష్మములైన సంకల్ప ములనుగూడ వీక్షించుచుండ ఇక వస్తువులను గూర్చి బాహ్య కార్యములను గూర్చి వేరుగ చెప్పవలెనా? కావున దేవుని ఎవరును మోసగించలేరు. ఒకవేళ మోసగించుటకు యత్నిం చితిరా, వారు పతనమై పోవుదురని గ్రహించుట మంచిది.

**నీతి :- భగవానుడు సర్వత్ర వెలయుచున్నాడని గ్రహించి మనస్సునందు ఏ దోషమున్ను లేక నిర్మల జీవితమును గడుపవలెను.**

# సర్వత్యాగము

పూర్వము శిఖిధ్వజుడను రాజుండెను. అతనికి చూడాల యను భార్య కలదు. పూర్వజన్మ పుణ్యసంస్కారము వలన ఇరువురికిని చక్కని వైరాగ్యముదయించెను. ప్రతిదినము వారు కొంతసేపు ఆధ్యాత్మిక తత్త్వ విచారణ గావించుకొను చుండెడివారు. వారిరువురిలో చూడాల హృదయము అతి నిర్మలముగను, రాగద్వేషరహితముగను క్రోధాదికషాయ వర్జితముగను నుండుటచే మెత్తటి మట్టియందు నాటబడిన బీజమువలె ఆమెకు శీఘ్రముగా ఆత్మజ్ఞానోదయమయ్యెను. భర్తయగు శిఖిధ్వజుని చిత్తమింకను పరిపాకమును బొందలేదు. శాస్త్రములందు వైరాగ్యము గూర్చి, సర్వత్యాగమును బోధింపబడిన యంశములను వినుచుండునపుడు అతని హృదయమందు ఆవేశము జనించుచుండెను. రాజ్యాధికార్యములన్నిటిని వదలివేసి ఏకాంతమునకు పారిపోవు సంకల్పము లుదయించుచుండెను. కాని తన యీ హృద్గత భావములను భార్య కెరిగింపక లోలోన వాపోవుచుండెను. ఒకనాటి రేయి సరిగా అర్థరాత్రివేళ నిద్రలేచి భార్యను, కుటుంబమును, రాజ్యమును పరిత్యాగముచేసి ఎవరికి తెలియకుండగనే పట్టణము వెలుపలకుపోయి అరణ్యములగుండ బయనించి బహుదూరమునకేగి తన పట్టువస్త్రములన్నియు పారవేసి నారవస్త్రములు ధరించి ఒకానొక నిర్జనవనమున నొక పర్ణకుటీరము నిర్మించుకొని, జపమాల, కమం

దులువు, ఆసనము గ్రహించి అచ్చోట వసించుచుండెను. నాటిరాత్రి చూడాల నిద్రలేచిచూడ పడకపై భర్త శిఖధ్వజుడు లేడు. రాజభవనము, పట్టణము అంతయు వెదకెను, వెదకించెను. కాని కానరాలేదు. పెక్కుసిద్ధులు సంపాదించియున్న సాధ్వీమణి కనుక, ఆమె వెంటనే ఆకాశ మార్గముగుండా చని నలువైపుల బహుదూరము వరకు వెదుకగా ఒకానొక నిర్జనారణ్యమున కుటీరము వేసుకొని కాలము గడుపుచున్న తన భర్తను గాంచగలిగెను. కాని అతని కార్యక్రమమునకు అవరోధమును కల్పించుటకు ఇష్టములేక "కొంతకాల మీతడిట్లే యుండుగాక" యని తలంచి యింటికి తిరిగిపోయి రాజ్య కార్యములను స్వయముగనే చూచుకొనుచుండెను. కొన్ని వత్సరములు గడచెను. అటుపిమ్మట ఒకనాడు భార్య చూడాల కుంభుడను బ్రాహ్మణకుమార వేషమును ధరించి ఆకాశమార్గముగుండా పోయి భర్త శిఖధ్వజుని పర్ణశాలముందు వ్రాలెను. అత్తరి ఆ యిరువురి మధ్య ఈ క్రింది సంభాషణము నడచెను.

(కుంభుని వేషమున నున్న) చూడాల :- మీరెవరు? ఏల యింత నిర్జన ప్రదేశమున నున్నారు?

శిఖధ్వజుడు : నేను పూర్వము మహారాజును. చూడాల అను పేరు గల చక్కని భార్య నాకు గలదు. వైరాగ్యము జనింప అంతయు విడిచిపెట్టి, కర్మసన్న్యాసము చేసి ఇచట నున్నాను.

చూ .- మీకు మనశ్శాంతి కలుగుచున్నదా?

శి .- అదితప్ప తక్కినవన్నియు కలుగుచున్నవి.

చూ .- మీరు తివ్వాధారి నవలంబించితిరి. కనుకనే మీకు మనశ్శాంతి కలుగుటలేదు. శాస్త్రములు సర్వత్యాగము మోక్షహేతువని వచించినవి కాని మీరు చేసినది సర్వత్యాగము కాదు. రాజ్యము, పరిజనులు, భార్య, కుటుంబము మొదలగు బాహ్యావస్తువులను మీరు విడనాడితిరే కాని, మనస్సున గల దృశ్య సంకల్పములను, వాసనలను, విడనాడలేదు. వానిని వదలుటయే ముఖ్య సన్న్యాసలక్షణము. అదియే సర్వత్యాగము. అంతియేకాని భార్యను, బిడ్డలను వదలి అరణ్యములకు పరువెత్తుటకాదు ఒకవేళ అట్లు పరువెత్తి పోయినను, మీ నీడ మీ వెంట నుండునట్లు ఆ దృశ్యవాసనలు కామాది కషాయములు మిమ్ములను వదలిపోవు. అవి ఉన్నంతవరకు ఎంత ఏకాంత ప్రదేశమున నున్నను శివునకు లభ్యము కాదు. అవి లేనపుడు గృహమందున్నను, రాజ్యము పాలించుచున్నను, ప్రశాంతియే మిమ్ముల వరించును. నిష్కామ బుద్ధితో, అనాసక్తి పూర్వకముగా కర్మలను చేయుచు, రాగా చిత్తము శుద్ధపడి, జ్ఞానముదయించవ కర్మసన్న్యాసము దాని యంతట నదియే సిద్ధించును. అంతియే కాని మొదటనే కర్మలను వదలి పోరాదు. అని ఈ ప్రకారముగ చక్కని జ్ఞానప్రబోధము

గావించి భార్యయగు చూడాల తన భర్తయగు శిఖిధ్వజున కంతట తన నిజరూపమును జూపి రాజధానికి దోడ్కొనిపోయి రాజ్యాధికారమును (నిక్షేపముగ) నిర్వర్తింప జేసెను.

నీతి :- సర్వత్యాగమనగా మనస్సునందలి దుష్ట సంకల్పములను వాసనలను త్యజించుటయే యగును. అద్దానినే జీవుడు అవలంబించ వలెను.

* * * *
* * * * *

5)

# దృశ్యపదార్థములు నశ్వరములు

పూర్వకాల మొక మహారాజుండెడివాడు. అతడు అత్యంత శ్రీమంతుడును, యువకుడును, ధార్మికబుద్ధి కలవాడును అయి యుండెను. అతనికొక గురువుండెను. మంత్రోపదేశము చేయవలసినదిగా ఆ గురువును చాలకాలము రాజు ప్రార్థించుచు రాగా ఒకనాడాతడందులకియ్యకొనెను, మంత్రము నుపదేశించుట మాత్రము చాలదనియు, ఆ మంత్రము నిరంతరము తనకు జ్ఞాపకముండులాగున ఏదైన ఉపాయమును గూడ వచింపవలెననియు రాజు తన గురువర్యుని ప్రార్థించెను. అతడందులకంగీకరించి 'ఇదికూడ ఎప్పటికైనను నశించి పోవును' అను అర్థమిచ్చు 'Even this shall pass away' అను ఆంగ్లవాక్యమును రాజుగారి వ్రేలియుంగరముపై చెక్కించి అదియే మహామంత్రమనియు, ఉంగరమును చూచినప్పుడెల్ల అది జ్ఞాపకమునకు వచ్చుచుండును గాన ఇక మఱచుటకు అవకాశమే లేదనియు చెప్పి పంపివైచెను. భూపతి ఆనందభరితుడై నిజస్థానమున కరిగెను. ఆ రోజు గడిచి పోయెను. మఱుసటిదినము రాజు నిద్రలేవగనే వందిమాగధులు అతనిచుట్టుచేరి 'నీవు ఇంద్రుడవు, చంద్రుడవు' అని స్తుతింపసాగిరి. అంతట భూపాలుని దృష్టి అకస్మాత్తుగ తన వ్రేలియుంగరముపై బడెను. వెంటనే మహామంత్రము దృగ్గోచరమయ్యెను. 'ఇదికూడ ఎప్పటికైనను నశించిపోవునదే';

ఈనా కీర్తి, ఈ వైభవము, ఈ స్తోత్రములు - మూణ్ణాళ్ళ ముచ్చట్లు (Fame is a slow decay) అని తలంచి మనంబున వారి స్తుతి పాఠములచే ప్రభావితుడు కాక యుండెను.

కొంతకాలము గడచినది. ఒకనాడు సామంతరాజులు నలుదెసల తాము జయించిన రాజ్యములనుండి కొల్లగొట్టి తెచ్చిన రత్నములను, వజ్రవైడూర్యములను, సువర్ణాద్యాభరణములను ఆస్థానమున మహారాజ సమ్ముఖమున కుప్పలు కుప్పలుగా పోసిరి. రాజయొక్క ఆనందమునకు మేరలేదు. కాని ఆ హర్షోత్కర్ష సమయమున కటాలున అతని దృష్టి ఉంగరముపై కిపోగా, గురుప్రోక్త మహామంత్రము, తదర్థము జ్ఞప్తికి వచ్చెను. 'ఇదికూడ ఎప్పటికైనను నశించిపోవును.' కావున ఈ రత్నరాసులను జూచి మురిసిపోగూడదు. ఈ సిరిసంపదలు ఏనుగు తిన్న వెలగపండును బోలియుండును. ఈనాటి లక్షాధికారి విధివైపరీత్యముచే రేపు భిక్షాధికారియై పోవును. ఇట్టి చంచల వైభవములందు మమత్వమేల! అని లోలోన తలంచుకొని సంపదలయందు నిర్లేపుడై వర్తించెను. మరి కొంతకాలము గడచిన మీదట రాజునకు వివాహము నిశ్చయమయ్యెను. దూరదూర ప్రాంతములందుగల మహారాజులందరును శుభముహూర్తమునకు విచ్చేసిరి. వివాహక్రతువు పూర్తియయ్యెను. నాటిరాత్రి వధూవరుల ఊరేగింపునకు సర్వసన్నాహములు గావింపబడెను. నవరత్న ఖచితములగు

బంగారు పల్లకిలో నూతన దంపతులను ఆసీనులజేసి భాజాలాం
ఛనములతో బ్రహ్మాండమైన ఊరేగింపును సాగించిరి. మేళ
తాళములు, నృత్యములు, గీతములు వీనితోగూడి ఆ దృశ్యము
కనులపండువుగ కనిపించుచుండెను. పెండ్లిపెద్దలు ముందు
నడచుచుండ, వెనుక దివ్యాలంకారములతో శోభించుచున్న
పల్లకియందు వధూవరు లాసీనులై వచ్చుచుండిరి. జయజయ
ధ్వానములచే దిక్కులు పిక్కటిల్లుచుండెను. ఆ యానందాతి
రేక సమయమున అకస్మాత్తుగా రాజదృష్టి చేతియుంగరముపై
బడెను. 'ఇదికూడ ఎప్పటికైనను నశించిపోవును,' అను ఆ
మంత్రము స్మృతి పథమున మెఱయ 'నా యెదురుగ కూర్చొ
నియున్న ఈ పెండ్లికూతురు కాలగర్భమున ఎప్పటికైనను
విలీనమైపోవు ఒకానొక పాంచభౌతిక పదార్థము మాత్రమే.
ఇది రక్తమాంసములతోగూడిన తోలుబొమ్మయే. పంచభూత
ముల సమ్మేళనము వలన ఏర్పడిన ఆకృతిమాత్రమే
(Human flesh is clay)' అని తలంచి లోలోన విరాగమును
బొందెను. అప్పటినుండియు నాతడు పైకి వ్యవహారార్థము
రాజవిధులను నిర్వర్తించుచున్నను, లోలోన ప్రపంచము
యొక్క వాస్తవ స్వరూపమును గుర్తెరుగుటచే పరమవిరక్తి
గలవాడై, నిర్లేపుడై మెలగుచు నిరతిశయశాంతిని బొంద
గల్గెను.

నీతి :- ప్రపంచములో గల సమస్తపదార్థములు నశ్వరములనియు, సుఖముగాని, దుఃఖముగాని ఎల్లకాలమందు ఉండవనియు తలంచి మనుజుడు ధైర్యయుతుడై, వైరాగ్యోపేతుడై వర్తించవలెను.

# సుఖమునకు రాజబాట

పూర్వమొకప్పుడు ఒకానొక వర్తకుడు కొంత డబ్బును మూటకట్టుకొని యాత్రచేయుటకై బయల్వెడలెను. దారిలో అచటచట సత్రమునందో, దేవాలయమునందో, విశ్రమించుచు ప్రయాణము కొనసాగించుచుండెను. వర్తకుని యొద్దగల డబ్బుమూటను జూచి మరియొకనికి దానిని తస్కరించవలెనను దుర్బుద్ధి జనించి స్నేహితునివలె నటించి మెల్లగా అతని చెంత చేరెను. ఇద్దరును పరమమిత్రులవలె మెలగుచు యాత్ర సల్పుచుండిరి. ఒకనాటి రేయి ఇద్దరును ఒక సత్రమునందలి గదిలో నుండిరి. వర్తకుడు గాఢనిద్ర పోవుచుండ, ఆ కపట మిత్రుడు నెమ్మదిగా లేచి డబ్బుమూటకొరకై గదియంతయు వెదకెను. వర్తకుని పెట్టె, సంచులు, చొక్కా, మూటలు అన్నియు విప్పిచూచెను. కాని డబ్బుమూట కనిపించలేదు. మరల మరల వెతకెను. కాని కనిపించలేదు. మరునటిరోజు ఉదయమున తన స్నేహితునితో మాట్లాడుచు మాటల సందర్భములో 'రాత్రి నీ డబ్బుమూట ఎచట దాచితివి' అని ప్రశ్నించగ అతడు 'నీ దిండు క్రిందనే' అని జవాబిచ్చెను. కపట మిత్రుడు ఆశ్చర్యపడెను. వర్తకుడు తన మిత్రుని వాంఛను గ్రహించి అతడెట్లయినను తన ధనమును అపహరించునని తలంచి ఆ మూటను ప్రతిరోజూ ఆ మిత్రుని తల (దిండు) క్రిందనే దాచుచుండెను. ఏలయనగా దొంగ అన్నిచోట్ల

వెదకునుగాని తన త్రిప్పి (దిండు) క్రింద వెతకడు. వర్తకునకో, నాంగటను చెప్పు అభ్యాసము కలదు కనుక తన ధనరక్షణ కొరకై యీ చక్కనిఉపాయము అవలంభించెను. ఆ ప్రకారమే జీవుడు బ్రహ్మానందవారాశిని తన హృదయమునందే ఉంచుకొని ప్రపంచమంతయు ఆనందము కొరకు వెతకుచున్నాడు. కానియెంత వెతకినను ఆశాశ్వతానందమాతనికి బయట ఎచటనులభించుటలేదు. అది అంతరంగమునందేకలదు. అరవాస్య మతనికి తెలియక అజ్ఞానవశమున బయట తుచ్ఛసుఖములకై తిరుగాడుచున్నాడు. 'భిన్నత్యాత్మని యత్సుఖమ్', 'సుఖము క్షయమున్నతే,' 'యోఽన్తః సుఖో' ఇత్యాది వాక్యముల ద్వారా శ్రీ కృష్ణపరమాత్మ అక్షయసుఖము లోపలనే కలదని స్పష్టము చేసియున్నాడు.

ప్రతిరోజు గాఢనిద్ర పోవునపుడు బాహ్యవస్తువులనన్నిటిని మఱచి, సంకల్పములను కూడవదలి జీవుడుఅవిచ్ఛిన్నమగు (Homogeneous) సుఖము తనయందే అనుభవించుచుండుట చూచు చున్నారము కదా! ఆ సమయమున ఎట్టి దుఃఖము కూడ స్ఫురణకు రాక జీవునకు పరమశాంతి కలుగుచుండును. అజ్ఞానస్థితిలో మనస్సుయొక్క తాత్కాలిక ఉపశమనమాత్ర మగు సుషుప్తియందే ఇంత సుఖము జీవునకు అభ్యంతరము లభించుచుండ, ఇక జ్ఞానస్థితిలో మనస్సుయొక్క శాశ్వత ఉపశమనరూపమగు సమాధిస్థితియందెంత సుఖము లభించగలదు!

కాబట్టి అట్టి అనంతాత్మసుఖప్రాప్తికై బాహ్య అల్పసుఖము
లను జీవుడు పరిత్యజించ వలసియుండును. దానినే విషయ
విరక్తి యందురు. కొంత త్యాగమవలంబించి ఈ కార్య
మును సాధించినచో ఫలితము అఖండ దైవప్రాప్తియే.

కావున విజ్ఞులగువారు తమ అమూల్య మానవజన్మను
సార్థకము చేసుకొనుటకొరకు ప్రయత్నశీలురై, విషయసుఖము
లను పరిత్యజించుచు ఇంద్రియనిగ్రహమును సాధించు
కామక్రోధాదుల వేగమును అణచుచుండును. జీవితకాలము
అతిస్వల్పము. తెలిసికొనవలసిన ధర్మములా పెక్కుగలవు.
ఆచరించవలసిన సాధనలా అనేకములున్నవి. విఘ్నము
లెక్కలేనన్ని వచ్చి పైబడుచున్నవి. ఇట్టి స్థితిలో జీవుడు ఎంత
త్వరితముగ తన లక్ష్యమును సాధింపగల్గునో అంత శ్రేయస్కర
ము. మృత్యువు ప్రతినిమిషము జీవుని కబళించుటకు
ప్రక్కనే వేచియున్నది. వార్థక్య, రోగాదులు హుంకరించు
చుచు మీదపడబోవుచున్నవి. కావున వానివలన అపాయము
కలుగకపూర్వమే, మృత్యువు దాపురించక మునుపే, ఇంద్రి
యముల శక్తి ఉడుగక పూర్వమే వైరాగ్యాభ్యాసాది
సాధనలను అభ్యసించి స్వస్వరూపానుభవమును పొందవల
యుండును. మరణించిన పిదప మానవజన్మ వచ్చునను
'గ్యారంటీ' లేదు. ఆ ప్రకారముగ భగవంతుడు మనకు వాగ్దాన
పత్రమేదియు నివ్వలేదు. ఒకవేళ ఇతరలోకములందు జన్మ

చరిత్ర్యా అచట పరమార్థసాధనలకు అనుగుణ్యమైన వాతా
వరణముండదు. అవిఅన్నియు భోగభూములేగాని యోగ
భూములు కావు. కర్మభూములంతకంటెను కావు. భూలోక
మొకటియే చక్కని కర్మక్షేత్రము. పాపము చేసినచో నర
కమునకు, పుణ్యముచేసినచో స్వర్గమునకు, జ్ఞానము పొంది
నచో మోక్షమునకు ఇక్కడనుండియే జీవునకు నేఁలో
పర్మిట్టు (Passport) దొరకును. తన గమ్యమును తాను
ఇచటనే నిర్ణయించుకొన వచ్చును, కాబట్టి త్వరలో సద్గురువు
నాశ్రయించి తరణోపాయమును ఎఱుంగవలెను. అది యేదియో
గూఢమైన శ్రీకృష్ణమూర్తి గీతయందు వెల్లడిం
చియే యున్నాడు

> శక్నోతీహైవ యః సోఢుం ప్రాక్శరీరవిమోక్షణాత్
> కామక్రోధోద్భవం వేగం స యుక్తస్స సుఖీనరః.
>
> (౫:౨౩)

పరమార్థసుఖము ఎవనికి లభించును? కామక్రోధాదు
లను నిగ్రహింపగలిగిన వానికి. వానిని ఎప్పుడు నిగ్రహించ
వలెను? ఈ శరీరము పతనము కాకపూర్వమే. అనగా
మృత్యువాసన్న మగుటకు ముందే, ఎచట నిగ్రహించవలెను?
ఇచటనే, ఈ మానవజన్మ యందే, ఈ భూలోకమునందే,
(ఇహైవ)—ఇవ్విధముగ పరమాత్మ అధ్యాత్మసుఖప్రాప్తికి
రాజబాటను చూపెను. కోరికలను తగ్గించుకొనవలెను.

ఆశలను విడనాడవలెను. విషయసుఖములను పరిత్యజించ వలెను. భోగాభిలాషను దూరీకృత మొనర్చుకొనవలెను. కామ క్రోధాదులను అణచవలెను. అట్టి ప్రశాంతస్థితిని తన హృదయస్థమగు ఆత్మానందరూప అఖండసుఖము చక్కగా అనుభూతమగును.

**నీతి :- పరమార్థమగు సుఖము తనయందే కలదు. మనస్సును నిగ్రహించి, నిర్మలమొనర్చి, అంతర్ముఖము చేసి అట్టి సుఖమును జీవుడు అనుభూత మొనర్చుకొన వలెను.**

# త్యాగమహిమ

పూర్వము ధర్మరాజును అంత్యకాలమున కర్మదేవతలు స్వర్గమునకు గొనిపోవుచు నరక సమీపమునుండి పోవుచుండ మహాపుణ్యమూర్తి, ధర్మమూర్తి యగు అతని రాకచే భీకర సంతాపమయమగు నరక మంతయును శీతలవాయువులు వీవ దొడగెను. [నరక మంతయు 'ఏయిర్ కండిషండ్' (air-conditioned) గా మారిపోయినదన్న మాట.] దానిచే నరక బాధితులందరును విస్మితులై, వారి తాప ముపశమింప జొచ్చెను. దీనికి కారణమేమి? యని వారందరు విచారింప, ధర్మనిష్ఠుడగు పాండవాగ్రజుని యునికి యని తెలుసుకొనిరి. తత్క్షణమే ఆ పాపులందఱును ఒక సంఘము (sinner's society) గా ఏర్పడి పరుగెత్తుకొని వెళ్ళి ధర్మనందను నిట్లు వేడుకొనిరి. "మహాత్మా! తామెవరో మహాపుణ్యశీలురుగ గన్పట్టుచున్నారు. లేకున్న తమ రాకచే ఈ ఘోరతాపత్రయాగ్ని పరిపూరితమగు నరకలోకమున శీతలచ్ఛాయలు క్రమ్ముకొనవు. మాపై దయగలిగి తాము కొంతకాలమిచటనే నివసించినచో మా భయంకర సంతాపములు సమసిపోగలవు. మేము హాయి ననుభవింపగలము. ఇచ్చోనున్నచో తమకెంత ప్రయాసముగ నుండినను, ఇందఱి నరకవాసుల శ్రేయస్సుకొరకై తమరీ త్యాగమునకు ఒడిగట్టవలెను." పాపుల యా వాక్యముల నాలకించి దయార్ద్రహృదయుడగు ధర్మరాజందులకంగీకరింప నిశ్చ

యుంచెను. కాని ఇంతలో స్వర్గమునుండి దేవభటులేతెంచి
ధర్మరాజును "ఆర్యా! తమ శిక్ష పూర్తి అయినది. ఇక స్వర్గ
మునకు కదలుడు!" అని ఆదేశించిరి. అంతటను ధర్మరాజు
"నా పుణ్యమంతయు ఈ పాపులకు త్యాగము చేసివైచితిని.
దాని నంతయు వీరికి ధారాదత్త మొనర్చితిని. ఇక స్వర్గమున
కేగుటకు నాకు పుణ్యము మిగులలేదు' అని పలికెను. ఆ దేవ
భటులంతట "ఓ పావనమూర్తీ! తామా పుణ్యమును త్యాగము
చేసినందువలన తమ పుణ్యము వృద్ధి ద్విగుణీకృతమై యొప్పారు
చున్నది! (కోటింతలు అయినది). కావున ఇక మీరు
విలంబనము చేయక స్వర్గమునకు దయచేయుడు! అని ప్రార్థిం
చుకొనిరట! చూచితిరా! త్యాగముయొక్క మహిమాతి
శయము.

**నీతి** :— కొంత కష్టమునకు ఓర్చియైనను
ఇంద్రియార్థముల వలన గలుగు అల్పసుఖములను ఎట్ల
యినను త్యాగమొనర్చినచో, ఇంద్రియములను
కొంత సంయమనము చేసినచో ఆత్మానందమను
మహత్తర ఫలితము లభింపగలదు.

# బ్రహ్మర్షిత్వ మెట్లు లభించును.

పూర్వకాలమున విశ్వామిత్రుడు ఘోరతపంబొనర్చి రాజర్షి యను బిరుదొను బడసెను. అంతటితో తృప్తిగొందక ఇంకను పెక్కుసాధనలు చేసి బ్రహ్మర్షి యని ప్రజలందరిచేతను అనిపించుకొనెను. ఒక్క వశిష్ఠుడు మాత్రము అతనిని రాజర్షి యనియే సంబోధించు చుండెను. అది విశ్వామిత్రునకు బాధాకరముగ నుండెను. 'బ్రహ్మర్షిత్వమునకవసరమైనసాధనలెల్లన నాయందు లోపించినవా! ఏల వసిష్ఠుడిట్లు రాజర్షి యనియే నన్ను 'గూర్చి' పలుకుచుండెను!, అని తలంచి అతడింకను తీవ్రముగ తపముచేయ మొదలిడెను. కాని అప్పటికిని వసిష్ఠు డాతనిని రాజర్షి యనియే పిలుచుచుండెను. ఆ వాక్యమును సహింపలేక ఒకనాటిరాత్రి విశ్వామిత్రుడు పదునైన ఖడ్గమును చేకొని తన్ను కించపరచుచున్న వసిష్ఠుని శిరంబును ఛేదించి వేయ దలంచి అతని కుటీరమునకు సమీపమున ఒకానొక పొదలో దాగుకొని సమయమునకై నిరీక్షించుచుండెను.

ఇంతలో నాటిరాత్రి తన కార్యములన్నియు నిర్వర్తించుకొని వశిష్ఠుడు అరుంధతితో సహా కుటీరము వెలుపలకువచ్చి నొక రాతిదిన్నెపై కూర్చుండెను. అది పున్నమినాటి రాత్రి. నలువైపుల శీతలచ్ఛాయలను వెదజల్లుచు చంద్రుడు ఆహ్లాదకరముగ ప్రకాశించుచుండెను. అదిచూచి అరుంధతి వసిష్ఠునితో 'నాథా' నేడు వెన్నెల యెంత చక్కగానున్నది!' అనెను.

అంతట వసిష్ఠుడు 'ఓహో విశ్వామిత్రుని కీర్తివలె ఈ వెన్నెల దిగంతముల వ్యాపించి ప్రకాశ నానంద మొసగుచున్నది' అని పలికెను. వసిష్ఠుని ముఖతః వెలువడిన ఆ వాక్యములను వినిన తోడనే విశ్వామిత్రుని కన్నుల నీరు క్రమ్మెను. 'ఆహా! యింత కాలమునుండియు ఎవనిని శత్రురూపముగ దలంచుచున్నానో అట్టి వసిష్ఠమహర్షి నాపై ఎంతకరుణ, సదభిప్రాయము కలిగి యున్నాడు! ఇట్టి దయాశీలునా వధించుట! ఛీ! ఈ నా జీవితమునకు ధిక్కారము!' అని తలంచుకొని ఖడ్గమును పారవేసి పరుగెత్తుకొని వెళ్లి అమాంతముగ వసిష్ఠుని పాదములపైబడి సాష్టాంగదండ ప్రణామము నాచరించెను. వసిష్ఠు డాతనిని లేవనెత్తి, 'ఏమండీ బ్రహ్మర్షిగారు! ఎప్పుడు దయచేసినారు?' అని ప్రశ్నించెను. వెంటనే విశ్వామిత్రుడు 'మునీంద్రా! యింతకాలము వరకు నన్ను రాజర్షి అని పిలుచుచు ఇపుడేల బ్రహ్మర్షి అని పిలిచితిరి?' అని యడుగ 'ఇంతవరకు మీయందు అహంకారము, గర్వము పూర్తిగా శమించలేదు. మహాత్ముల యెడల, బ్రహ్మనిష్ఠులయెడల, సద్గురువులయెడల, పరమాత్ముని యెడల మీకు పూర్ణభక్తి కలుగలేదు. ఇప్పుడు కలిగినది. కాబట్టి బ్రహ్మర్షు లయితిరి. అహంకారము చచ్చుట, వినయ విధేయత లావిర్భవించుట-ఇవియే బ్రహ్మర్షిత్వమునకు గుఱుతులు' అని వశిష్ఠమునీంద్రుడు పలికెను. కాబట్టి ఇట్టి విన

యాది సద్గుణములను లెస్సగ నభ్యసించి బ్రహ్మర్షిత్వమును బడసి జీవితములను ధన్య మొనర్చుకొందురుగాక!

నీతి :– వినయము, నిరహంకారము, నిరభి మానము కలిగి యుండుటయే బ్రహ్మర్షిత్వము. కావున అట్టి మహోన్నత గుణములను జీవుడు అవలం బించ వలయును.

***

# లోకోత్తర సౌందర్యము

పూర్వ మొక ధనికుడు చక్కని గృహమును నిర్మింప దలంచి తన సేవకునకు కొంత ద్రవ్యము నిచ్చి గరుకుతనము లేక నున్నగా, సొంపుగానున్న కొన్ని కొయ్య స్తంభములను ఆశ్చర్యమునకై కొని తీసుకురావలసినదిగా ఆదేశించెను. వాడు అనేక గ్రామములు, పట్టణములు తిరిగి తిరిగి, ఎచట చూచినను కొయ్యలు ఇకింత గరుకుగానే యుండుటవలన అవి యన్నియు తన యజమానికి పనికిరావని నిశ్చయించుకొనెను, అద్భుతమగు టేకుకొయ్యనుగూడ పైనమును వలన తిరస్కరించివేసెను. తుట్టతుదకు ఒకానొక గ్రామము చివరగల అరటితోట పై అతని దృష్టిపడెను. ఆ అరటి స్తంభములను జూచి 'ఆహా! ఇవి ఎంత నునుపుగా నున్నవి! ఎంత సొగసుగా కన్పించుచున్నవి! గరుకుతనము ఏ కోశమునగూడ లేదే! చూచిన వారి మనస్సులనెల్ల తమ సౌందర్యాతిశయముచేనట్లు ఆకర్షించివేయుచున్నవి! మా యజమాని అదృష్టము పండినది! దైవికముగ అద్భుతమగు స్తంభములు దొరికినవి. ఇక వీనిని వదలగూడదు' అని నిశ్చయించుకొని అత్యధిక మూల్యము చెల్లించి వాని నన్నింటిని బండ్లపై వేసికొని యజమానియొద్దకు గొనిపోయెను. ధనికుడు గద్దించుచు 'ఏమిరా! ఎందుకు పనికిరానివి తెచ్చినావు!' అని వానినడుగ, 'ప్రభూ! తమ యదృష్ట వశమున ఇంతవరకు ఎవరికిని దొరకనట్టి చక్కని నునుపైన

స్తంభములే కొట్టినావే' అని భృత్యుడు పలికెను. ధనికుడంతట 'ఓరి వెఱ్ఱివాడా! పైపై సౌందర్యము చూచి నీవు మోస పోయితివి. ఈ స్తంభములకు లోన చేవలేదు. సత్తువలేదు. ఒట్టి పట్టలు మాత్రమే ఇందు కలవు. ఇట్టి తుచ్ఛపదార్థము లపై ఎంత డబ్బు తగులబోసితివిరా మూర్ఖుడా!' అని సేవకుని మందలించి అతని అవివేకమునకు అచ్చెరువొందెను.

ప్రపంచక జనులయొక్క స్థితి సరిగా ఇదేవిధముగ నున్నది. పై పై మెరుగులు చూచి వారు మోసపోవుచు న్నారు. దీర్ఘముగ విచారించుట లేదు. సున్నపుముద్దలను జూచి వెన్నముద్దలని భ్రమించుచున్నారు. విచారించి చూచి నచో దృశ్యవస్తువులందు వాస్తవమగు సౌందర్యముకాని, వాస్తవమగు సుఖముకాని లేవు. నశించిపోవు పదార్థములకు సౌందర్యమెచట? అట్టివాని యందు సుఖమెచట? ఒకవేళ సౌందర్యమనునది వానియందున్నచో త్రికాలములందును అది మారకుండ నుండవలెను. ఈ దినము ఎంతయో చక్కగనున్న పూలమాల రేపటికిని ముడుచుకొనిపోవు చున్నది. ఈ దినము సుగంధమును వెదజల్లిన ఆ వస్తువే కొలది దినములకు కుళ్ళి దుర్గంధమును వ్యాపింపజేయుచున్నది. నేడు యౌవనమున లోకైకసుందరి (Miss universe) యని ఖ్యాతి బడసిన మగువ కొంతకాలమునకు వార్ధక్యముచే కబ ళింపబడి కురూపిణియగుచున్నది. లేక వ్యాధులచే నాక్రమింప

ఒడి అందవిహీనయగుచున్నది. ఈ దినము మనలను ఎంతయో ఆకర్షించిన స్వాదుభోజనము రేపటికి పాడిపోవుచున్నది. ఎల్లుండికి బూజుపట్టి దగ్గఱకు వచ్చినంత మాత్రమున వాంతిని గలుగజేయు చున్నది. ఇట్టి వస్తువులయందా మనము సౌంద ర్యమును జూచుట! ఒకవేళ చూచినను అది ఏ పాటిది?

'A thing of beauty is a joy for ever'

'సుందరవస్తువు ఎల్లప్పుడు సుఖమును గలుగజేయును' అను సూక్తి కలదు. అయితే వస్తువే అస్థిరమై, కొంతకాలము నకు నామరూపములు లేకుండ జాటిపోవుచుండగా ఇక నది ఎల్లప్పుడు ఎట్లు సుఖమును గలుగ జేయగలదు? కావున ఎల్ల కాలములందును ఉండు పరమాత్మ ఒకటియే ఈ ప్రపంచమున సుందరమైనవస్తువు కాని, నశ్వరములగు పాంచభౌతికపదార్థ ములుకాదు. ఒకవేళ దృశ్యవస్తువులందెవరైన రమణీయత్వ మును జూచినచో అది ఆపాతరమణీయత్వముగునేకాని శాశ్వత సౌందర్యముకానేరదు. అట్టిదానివలన ముముక్షువు లకే ప్రయో జనమున్ను లేదు. కావున లోకోత్తర సౌందర్యము ఒక్క పరమాత్మయందే కలదని నిశ్చయించి వారినే ఆశ్రయించ వలెను.

**నీతి:- శాశ్వతమైనదే పరమ సుందరమైనది. కావున జీవుడు శాశ్వతపరమాత్మనే ఆశ్రయించి తరించ వలెనుగాని, నశ్వర ప్రాపంచిక పదార్థములను కాదు.**

# అనేకత్వములో ఏకత్వము

ఒకానొక గ్రామమునందు ఒక పెద్ద దేవాలయము కలదు. అందులో నొకభాగమందు అన్నివైపుల అద్దము లమర్చిన ఒక గది కలదు. భగవత్కైంకర్యము కొఱకు, దేవుని ఉత్సవాలసేవ నిమిత్తము పెద్దలు ఆగదిని యేర్పాటు చేసిరి. లోన దైవవిగ్రహముంచినచో చుట్టునున్న అద్దములలో ప్రతిబింబించి అనేక విగ్రహములుగ అది గోచరించి చూపరులకు ఆనందము గొల్పుచుండును.

ఇట్లుండ ఒకనాడు ఆగది తలుపు తెఱచియుండ, లోనికి ఒక కుక్క ప్రవేశించెను. ఆగది చుట్టును, పైనను, క్రిందను నలువైపులను అద్దములమర్చియుండుటచే, కుక్క అన్నిటియందును ప్రతిబింబింప అనేక కుక్కలుగ గోచరించెను. కుక్కకు సహజముగ మఱియొక కుక్కను జూచినచో రోషము, కోపము గల్గుచుండును. అందుచేత ఆ కుక్క ఎదురుగ అద్దమందు మఱియొక కుక్క కనబడుటచే సహింపజాలక క్రోధావేశముచే దానిపైకి ఎగిరెను. ఫలితముగ దానిముక్కు అద్దమునకు తగిలి గాయపడెను. ఆబాధకు తట్టుకొనలేక వెనుకకుతిరిగి చూడ, వెనుక గల అద్దములో మఱియొక కుక్క కనబడెను. ప్రక్కకుజూడ అచటను ఒకకుక్క కనబడెను. ఈ ప్రకారముగ దశదిశలందుండును తనరూపము లనేకములు దానికి దృగ్గోచరమయ్యెను. ఇక, జ్ఞానహీనమగునకు హద్దుపద్దులు లేకుండెను

ఒక్కొక్క అద్దముపైకి ఎగురుట, ముక్కు చితుకుట, ఒడలు పూర్తిగ నలిగిపోవుట జరుగుచుండెను. తత్ఫలితముగ ఆ కుక్క శరీరము పూర్తిగ నలిగిపోవ, గాయములు ఎక్కువగా తగిలి రక్తము ధారధారగ ప్రవహింపజొచ్చెను. కొద్దిసేపటికి అది క్రిందపడి మరణించెను.

అది మరణించిన కొంత సేపటికి పూజారి ఏదియో పని మీద ఆ అద్దములగదిలోపలికి వచ్చెను. చూడగా నట కుక్క చచ్చిపడియుండెను. గదియంతయు రక్తసిక్తమైయుండెను. కారణమేదియో అతనికి తెలియకుండెను. వెంటనే యతడు దేవాలయ పరిచారకులను పిలిపించి కుక్కను దూరముగా పారవేయించి, గదియంతయు శుద్ధముగ కడిగించివైచెను. తరువాత ఆ పూజారి తన ముఖమును అచటగల అద్దములలో చూచుకొని, జుట్టు సవరించుకొని, బొట్టు సరిచేసికొని బయటకు పోయెను.

కుక్కకు తెలివి లేనందువలన అద్దములందు ప్రతిఫలించిన కుక్కలన్నియు తానేయని గ్రహింపనేరక, అవి వేర్వేరని భావించి వినాశమును కొనితెచ్చుకొనెను. పూజారి అద్దములందు ప్రతిబింబించిన స్వరూపములన్నియు తనవేయనియు, తానే అద్దములందు ఆ ప్రకారముగ వివిధముగ కానుపించు చున్నాడనియు గ్రహించుట వలన ఆనందమును [illegible] చేసెను. ఇదియే వారువురికి గల భేదము.



అట్లే ప్రపంచమున ఒకే ఆత్మవస్తువు, దైవవస్తువు భిన్న భిన్న ఉపాధులతో గూడి కనిపించుచున్నది. అజ్ఞాని ఆ ఉపాధులు వేఱు అనిభావించి పరస్పర విద్వేషమును పెంపొందించుకొనుచు, అశాంతికిలోనై కథలోని కక్కినవలె పతనమొంది పోవుచున్నాడు. జ్ఞాని సమస్తము తానే (ఆత్మయే) యనియు వివిధ ఉపాధులను అద్దములందు తన స్వరూపమే గోచరించుచున్నదనియు నిశ్చయించి, చరాచర ప్రాణికోట్లయెడల కరుణా దయాశీలవాడై, వానికి ఉపకారమొనర్చుచు జీవితమును పరమానందమయమొనర్చుకొనుచున్నాడు. (కథలోని పూజారి వలె).

కాబట్టి అనేకత్వమునందు ఏకత్వమును వీక్షింపగల్గు శక్తిని సంపాదించవలెను. ఈ ప్రపంచమున వాస్తవముగ భిన్నత్వమనునది లేనేలేదని కృతనిశ్చయుడై మెలగవలెను. "అవిభక్తం విభక్తేషు" అను గీతాసూత్రమును చెప్పగ హృదయంగమమొనర్చుకొని ప్రాణికోట్లయెడల దయ, కరుణ వర్తింపవలెను. అపుడే జీవుడు కృతార్థుడు కాగల్గును. కావున జీవులారా! భిన్నదృష్టిని దూరదోలుడు! ఏకత్వదృష్టిని అవలంబింపుడు! సృష్టియంతయు ఒకే ఆత్మస్వరూపమును అద్వయదృష్టిని స్వీకరించి ధన్యులుకండు!

**నీతి :-** ప్రపంచమంతయు భగవత్స్వరూపముగా భావించి ప్రాణికోట్లయెడల దయ కలిగియుండవలెను.

# పుణ్యముయొక్క అమోఘఫలితము

పూర్వము ద్రౌపదీదేవిని నిండు సభయందు దుశ్శాసనుడు మానభంగ మొనర్చుటకు ఉద్యమించెను. ఆ త్రుటి ఆ దేవి తన్ను రక్షింపుమని శ్రీకృష్ణుని ప్రార్థింపగా ఆతడాతురయొక్క ధర్మరక్షాస్తును తక్షణమే జగత్ - ప్రభుత్వము (Universal Government) యొక్క కర్మవిభాగమును చూచుచున్న దేశీయాంగశాఖకు వ్రాసి దానియొక్క మంచిచెడ్డలను గూర్చి విచారింప వలసినదిగా ఆ శాఖాధిపతికి ఆదేశమొసంగెను. ఆ ఉద్యోగి వెంటనే పాత ఫైళ్ళన్నియు తెప్పించి ద్రౌపదిదేవి పూర్వజన్మలలో చేసిన పుణ్యములను వెదుకసాగెను. దస్త్రము ఇటునిటు త్రిప్పగా ఆమె చరిత్రకు సంబంధించిన యొక్క పుటము కానిపించెను. పూర్వము ఒకానొక జన్మలో ద్రౌపది సముద్రస్నానము చేసెను. అది పర్వదినము గనుక అనేక జనులు స్నానార్థమట చేరెంచిరి. ఆ తరుణమున స్నానముచేయుచున్న ఒక సాధుపుంగవునియొక్క కౌపీనము తరంగముల వేగమునకు కొట్టుకొనిపోవ అతడు బయటికి వచ్చుటకు సిగ్గుపడి నీటిలోనే నానుచుండెను. దూరమున స్నానముచేయుచున్న ద్రౌపది సాధుపుంగవుని యవస్థ గమనించి వెంటనే తన చీరలోని కొంతభాగమును చింపి సాధువుయొద్దకు విసరివేసెను. అతడది ధరించి సంతోషముతో వెడలిపోయెను. ఈ స్వల్ప వస్త్రదానవిషయము కర్మవిభాగపు రికార్డులో వ్రాయబడి యుండెను! ఈ సంగతి విను వెంటనే ఆ శాఖాధిపతి శ్రీకృష్ణ

పరమాత్మను తెలుప, ఆర్తత్రాణపరాయణుడగు అమ్మహనీయుడు 'భక్తిణమే ద్రౌపది పూర్వము దానమొసంగిన ఆ చిన్ని వస్త్రమును అక్షయమై ద్రౌపదిని కాపాడుగాక!' అని సంకల్పించెను. ఏనాడో చేసికొనిన స్వల్పపుణ్యము శాఖోపశాఖలుగ విస్తరించి బ్రహ్మాండమైన సుకృతముగమారి మహోపకారమును చేసిపెట్టినది. అట్లే ఏనాడో చేసికొనిన స్వల్పపాపము ఫలించు సమయమున గొప్ప అపకారమును కలుగజేయ వచ్చును. పరీక్షిత్తు వేళాకోళమునకు శమీకమహర్షి మెడలో చచ్చినపామును చిన్నదొకదానిని వేయగా, ఆ చిన్నపామే విశాలాకృతిగల తక్షకుడను పాముగా తయారై అతనిని బాధించిన సంగతి జగద్విదితమే కదా!

కాబట్టి తమ పుణ్యపాపముల విషయమై జనులు అత్యంత జాగరూకులై మెలగవలెను. పాపములను రహితమొనర్చి పుణ్యములను నిరతిగా నాచరించుటకు పూనుకొనవలెను. దుస్సంకల్పములను, దుర్వృత్తులను పారద్రోలి, సత్సంకల్పములను, సద్వృత్తులను ఆశ్రయింపవలెను. ఏ పుణ్యమును, చేయుదు నిట్లో, ఉద్రేకుడు యమధర్మరాజు ప్రశ్నించుకాలమున దేబరించి చూడవలసి వచ్చును.

**నీతి :-** తాను చేసికొనిన పుణ్యమే తన్ను రక్షించును. కావున మోక్షకాంక్షి విరివిగ పుణ్యకార్యముల నాచరించవలెను.

ఇట్లుండ ఒకానొక గ్రామమునకు వెలుపల ఒక సాధువు కౌపీనమును ధరించి ఎచటికో పోవుచుండెను. ఆ మంగళగజము అతనిని సమీపించి అకస్మాత్తుగ అతని మెడలో పుష్పమాల పడవైచెను. అందఱును హర్షధ్వానములను చేసిరి. "నీవు రాజువైతివి"- అని మంత్రు లాతనితో చెప్ప అతడందులకు అంగీకరింపడయ్యె. 'బ్రహ్మానందమున ఓలలాడు నాకు ఈ అల్ప రాజ్యసుఖములతో పని యేమి!'—అని యాతడు పలికెను. కాని మంత్రులు, సైనికులు మున్నగువారు బలవంతముగ నాతని తీసికొని వెళ్లి పట్టువస్త్రములను కట్టించి రాజ సింహాసనముపై గూర్చుండబెట్టిరి.

అంతట ఆ సాధువు రాజకోశాగారమును సమీపించి, అమూల్యవస్తువులను దాచియుంచు ఇనపపెట్టె నొకదానిని ఖాళీ చేయించి అందులో తన కౌపీనమును దాచియుంచెను. తన పూర్వపు వైరాగ్యమున కది చిహ్నమని తలంచి, రాజ్యాధికారము వచ్చినను దానిని గౌరవించి దానికి సముచిత స్థానమొసంగి, దాని ద్వారా తన పూర్వపు వైరాగ్యదశను నిరంతరము సంస్మరించుచుండెను. ఈ ప్రకారము ఆ సాధువు రాజగద్దెపై గూర్చుండి నాలుగు సంవత్సరములు మంత్రుల ద్వారా రాజ్యపాలనము చేసెను. రాజప్రాసాదమునందు తిరుగుచున్నను రాజలాంఛనములను ధరించినను, రాజ్యాధికారములను చెలాయించుచున్నను తన యా కౌపీనమును, తన వైరాగ్యజీవిత

మున్ను, తన నిరంకుశ దైవనిష్ఠను, తన పారమార్థిక స్వచ్ఛంద దశను స్మరణకు తెచ్చుకొనుచుండెను. దేహము వ్యవహార మందును చిత్తము దైవనిష్ఠయందును నిలుకడ గలిగియుండెను.

ఇట్లుండ కొంతకాలమునకు ఆ రాజ్యముపైకి శత్రువులు దండెత్తివచ్చిరి. సైనికాధికారి రాజాజ్ఞను గైకొని వారలను తిరుమగొట్టుటకై సాధువుయొద్దకు రాగా 'మనము నాలుగు సంవత్సరములు రాజ్యము పాలించితిమి గదా, ఆ శత్రువు లను గూడ కొంతకాలము రాజ్యము పాలింపనీ'—అని హితము చెప్పి సాధువు వెంటనే కోశాగారము కడకేగి, ఇనుప పెట్టె నుండి తన పాత గోచీ బైటకు తీసి, దానిని ధరించి, పట్టు వస్త్రములను వదలివేసి, రాజలాంఛనములను త్యజించివైచి తన దారిని తాను పోయెను. మంత్రులు, సామంతులు, సైని కులు అదిచూచి పలాయనము చిత్తగించిరి. రాజ్యమును శత్రువు లాక్రమించివేసిరి.

కథలోని సాధువుగారు నాలుగు వత్సరములు లోక వ్యవహారమును సల్పినను, ప్రవృత్తియందు గడపినను, తన దృష్టినంతను నివృత్తియందే యెట్లుంచెనో తన లక్ష్యమగు దైవసాక్షాత్కారము నెట్లు మఱవలేదో, వైరాగ్యదశయందే మనస్సు నెట్లు కేంద్రీకరించెనో, అట్లే జనులు సంసారమం దున్నను లోకవ్యవహారము సల్పుచున్నను లక్ష్యమగు పర

మాత్మను అనవరతము స్మరించుచు జీవితమును పవిత్రవంత ముగ చేసుకొనవలెను.

**నీతి :- దైవందిన జీవితమందు భగవత్స్మరణ కలిగియుండవలెను.**

‡‡ ‡‡ ‡‡

# నిరంతర సాధన

పూర్వమొక అమాయకుడగు పల్లెటూరు మనిషి మూడుమైళ్ళ దూరములోనున్న తన గ్రామమునకు పోవుచుండెను. సాయం సమయమైనది. చీకటి పడుచుండెను. క్రమముగ దట్టమైన అంధకారము నలుదెసల వ్యాపించెను. వెనువెంటనే అతడు తన చేతియందున్న లాంతరు వెలిగించి ఏదియో ఒక భావన అకస్మాత్తుగ మనంబు నావరింప అట్లే చతికిలబడి కూర్చుండి ఏడ్చుచుండెను. సమీపముననే పోవుచున్న ఒకానొక పాంథు డతని దీనస్థితి జూచి దగ్గరకువచ్చి "ఏమయ్యా ఏడ్చుచున్నావు" అని యడుగ నాతడిట్లు ప్రత్యుత్తర మొసంగెను "బాబూ! ఏమని చెప్పుదును. గొప్ప సంకట మేర్పడినది. నేను పోవల్సిన గ్రామమింకను రెండు మైళ్ళదూరములో నున్నది. కాటుకవలె దట్టమైన చీకటి యావరించినది. చేతిలో ఈ చిన్నలాంతరు కలదు. దీనిప్రకాశము పదిగజముల దూరమువరకు మాత్రము పోవుచున్నది. రెండుమైళ్లు ఎచట! పదిగజము లెచట! రెండుమైళ్లు చీకటి పోగొట్టగల బ్రహ్మాండమైన లైటుండిననే నే నివుడు ఊరు చేరగలను. లేకున్న నాగతి యింతే. ఈ దౌర్భాగ్యపు లాంతరుకు అంతశక్తి లేకపోయెనే ఏమి చేయుదును! ఘోర విపత్తువచ్చి మీదపడినది మహాప్రభూ" అని చెప్పి వెక్కి వెక్కి ఏడ్వదొడగెను. ఆ వాక్యములను విని పాంథుడు పక పక నవ్వి "ఓయీ వెఱ్ఱివాడా" లెమ్ము, లాంతరు చేతిలో

బట్టుకొని నడక సాగింపుము. దాని కాంతి అల్పమైనను, పది గజముల దూరమే పోగలిగినను, దానిని చేతబూని నడువ సాగినచో పదిగజములు మరల పదిగజములు ఈ ప్రకారముగ దారియంతయు వెలుగును చిమ్మును. ఒకచోట కూర్చొనినచో మాత్రము ఈ పని సాధ్య పడదు. కాబట్టి కార్యశీలుడవు కమ్ము, సోమరితనమును దూరీకరింపుము. అని హితవు చెప్పి వెడలిపోయెను. అతడట్లే ఆచరించి గమ్యస్థానము చేరి సుఖించెను.

కావున ఏ ఒకింత భక్తి కాని, వైరాగ్యము కాని, విచారణగాని, యున్నప్పటికిని ఆ చిన్ని ప్రకాశమును ఆలంబనగా దీసికొని సాధనను ప్రతినిత్యము విడువకుండ చేయుచున్నచో విశాల సాంద్ర అజ్ఞానాంధకారమంతయు పటాపంచలై తుదకు 'మోక్షస్థితి' కలుగగలదు.

“దైవసాక్షాత్కారము నేనెట్లు పొందగలను!” అని ఎవరును నిరుత్సాహ పడవలసిన పనిలేదు. దైవత్వము మహాత్ముల ఒక్కరి సొత్తుకాదు. అది ప్రతి జీవియొక్కయు జన్మహక్కు. తన జన్మహక్కు కొరకై ప్రతివాడును పాటు పడవచ్చును కూడను. తాను ఆధ్యాత్మిక రంగమున ఎక్కువ అనుభవము ప్రవేశము లేనివాడైనప్పటికిని ప్రయత్నము విడువక శ్రద్ధతో ఒకింతైనను ప్రతి దినముసాధన చేయుదుం

తినచో గమ్యస్థానము తప్పక చేరగలడు. దుఃఖించవలసిన పనిలేదు. అధైర్య పడవలసిన అవసరములేదు. "నేను చేయునది స్వల్పసాధన కదా, ఇంతగొప్ప సంసారసాగరమును ఎట్లు తరించగలను? ఇంత దట్టమైన అజ్ఞానాంధకారమును ఎట్లు ఛేదింపగలను?" అని గృహస్థులు మున్నగువారు దిగులు పడవలసిన పనిలేదు. అయితే పరిశ్రమ వదలగూడదు. సాధన విరమించగూడదు.

"యోజనానాం సహస్రాణి యాతిగచ్ఛన్ పిపీలికా।
అగచ్ఛన్ వైనతేయోపి పదమేకం నగచ్ఛతి."

"నడకసాగించు చుండినచో చీమకూడ వేలకొలది మైళ్ళ దూరమును దాటిపోగలదు. నడకసాగించనిచో, గరుత్మంతుడైనప్పటికిని ఒక్క అడుగైనను దాటలేడు" కాబట్టి ఎవరికైనను శక్తి, యుక్తి, విజ్ఞానము, శాస్త్రపాండిత్యము, అల్పమైనప్పటికీ దాని వలన భయపడ నవసరములేదు. ఆ ఉన్న ఒకింతశక్తితోనే ప్రారంభించి తన పైనను, అచంచల విశ్వాసము గల్గియుండి సాధనను విడువకుండ ఆచరించుచుండి నచో అచిరకాలము లోనే మహామహా ధురంధరులు పొందిన లక్ష్యమును అతడుకూడ పొందకల్గును.

"నమే భక్తః ప్రణశ్యతి" నాభక్తుడు చెడడు అని భగవానుడు హామీ ఇచ్చి ఉన్నాడు కదా! ఇక భయనేల?

**నీతి :— ఒకింత సాధనయైనను విడువకుండ ప్రతినిత్యము ఆచరించుచుండినచో జీవుడు లక్ష్యమును చేరగల్గును. నిరుత్సాహము పనికిరాదు.**

# పరిపూర్ణ విశ్వాసము

ఒకానొక గ్రామములో ఒక బీదకుటుంబము కాపురము చేయుచుండెను. ఆ యింటి యజమానికి ఒకే ఒక కుమారు డుండెను. ఆతడు పసిబాలుడు. ఐదుసంవత్సరముల ప్రాయము గలవాడు. ఏకైక పుత్రుడు. కాబట్టి తల్లిదండ్రులా బిడ్డను ఎంతయో గారాబముగ పెంచుకొనుచుండిరి. ఒకనాడు సాయం సమయమున ఆ బాలుడు ఇంటియందు ఆటలాడుకొనుచుండెను. ఇంతలో సూర్యుడస్తాద్రిం గ్రుంకగా చీకటిపడెను. నలుదెసల గాఢాంధకారము వ్యాపించెను. పిల్లవాడు సమీపమునగల ఒకానొక పొదలో కాలుపెట్టగా అందుగల ఒక నాగుపాము అతనిని కాటువేసెను. బాలుడు కెవ్వుమని ఏడ్వసాగెను. విషము శరీరమంతటను వ్యాపించుటఁబట్టియు, నాగుపాము విషము మహాప్రమాదకరమగుటఁ బట్టియు, పిల్లవాని వయస్సు చాల తక్కువగుటచే బాధను తట్టుకొనలేక పొర్లుటఁ బట్టియు క్రిందపడి విలవిల తన్నుకొనుచు పెద్దగ రోదనము చేయ దొడగెను.

పిల్లవాని యేడ్పు వినగానే తల్లిదండ్రులును, చుట్టుప్రక్కల నున్న జనము హుటాహుటి అచ్చోటికి పరుగెత్తుకొని వచ్చిరి. పాముకొరకు వెదకిరి. కాని అది కనిపించలేదు. అది యెప్పుడో పారిపోయినది. అపుడు తల్లిదండ్రులు మిక్కిలి ఆవేదనతో గూడినవారై, ఆందోళనా తత్పరులై, విషగ్రస్తుడగు తమ కుమారుని ఇంటికి తీసికొని వెళ్లి పలువిధములగు ఉపచర్యలను

చేయసాగిరి. కాని ఫలితము లేకపోయెను. మాంత్రికుని పిలిపించి అతని ద్వారా విషహరణ మంత్రమును గాని, విష నివారణమూలికను గాని ప్రయోగింపజేసినచో బాధ తగ్గగల దనియు, ప్రమాదము తొలగిపోగలదనియు అచట సమావేశ మైన వారిలోనొకడు సూచింపగా, అది సమంజసమని భావించి కొందఱు తక్షణమే మాంత్రికుని కొరకై పరుగెత్తి కొద్ది సేపటిలో నతనిని తోడ్కొని వచ్చిరి.

మాంత్రికుడు బాలుని బాగుగా పరీక్షించి కరచినది గొప్ప నాగుపామనియు, కరచి చాలసేపగుటచే విషము శరీర మంతయు వ్యాపించినదనియు, ఆ బాలుడు బ్రతుకుట సందే హాస్పదమనియు, ఐనను ఒకానొక తీగయొక్క ఆకురసము పిండి ఆ పసరు పిల్లవాని నోటిలో పోసినచో అతడు బ్రతుక గలడనియు చెప్పగా, వెనువెంటనే ఆ తీగ కొఱకై అందఱును నలుదిక్కుల వెదకసాగిరి. రాత్రిసమయమగుటచే చేతిలో దీపములను పట్టుకొని ఆ గ్రామస్థులందరును మాంత్రికుని వెంటదీసికొని గ్రామములోను, గ్రామపరిసరములలోను ప్రతి చోటు, ప్రతితీగ పరీక్షించిరి. కాని అవసరమైనతీగ మాత్రము దొరకలేదు. అపుడందఱును తిరిగివచ్చిరి.

ఇచ్చట బాలుని పరిస్థితి ప్రమాదస్థాయి చేరుకొనినది. విషహారకమగు లత కొఱకై బయటకు వెడలిన మాంత్రికుడు, బాలునితండ్రి, తదితరులు ఇంటికి వచ్చునప్పటికి పిల్లవాని

ప్రాణములు పోయెను. అందఱును దుఃఖసాగరములో మునిగి పోయిరి. తల్లిదండ్రుల కన్నీరు కాల్వలై పారదొడంగెను. ఏకైక పుత్రుడు, బీదకుటుంబము. ఇక చేయునదేమి కలదు ? విధి బలీయమైనది.

ఇంతలో మాంత్రికుడు ఊరంతయు తిరిగి వచ్చుటచే పాద ప్రక్షాళనము చేసికొనదలంచి ఆ యింటి దొడ్డిలోనికి పోగా, అచట నొకమూల ఒక చిన్నతీగె అల్లుకొనియుండుట చూచి, దాని సమీపమునకు పోయి పరీక్షించి చూడగా అది ఇంతవఱకు తాను ఊరంతయు గాలించి వెదకుచున్నట్టి తీగె అయియుండుటవలన ఆశ్చర్యచకితుడై, ఇంటివారందఱిని పిలిచి చూపించి, "అయ్యో! ఎంతపొరపాటు జరిగినది! ఏ తీగకొరకై బయట ఊరంతయు వెదకినానో, ఆ తీగె మీ యింటిలోనే యున్నది, కాని ఇప్పుడు పరిస్థితి చేయిదాటి పోయినది. ఏమి చేయుటకును లేదు. పిల్లవాడు మరణించినాడు. అయినను దీనిని జాగ్రత్తపరచినచో భావికాలమున ఎవరికైనను చక్కగా ఉపయోగపడగలదు. ఈ తీగెయొక్క ఆకులను పిండి రసము తీసి ఆ రసము విషగ్రస్తుని నోటిలో పోసినచో తక్షణము విషము హరించిపోవును. కావున జ్ఞాపకముంచుకొనుడు" అని చెప్పి వెడలిపోయెను.

మరునాడు ఉదయమున పిల్లవాని తల్లిదండ్రులు మృత బాలునకొనర్ప వలసిన విధి పూర్వక క్రియల నాచరించి,

జను వెంటనే దొడ్డిలోనికిపోయి ఆ లతకు చుట్టు కంచెనాటి, దానికి పాదుచేసి, నీళ్లుపోసి, ఎవరును తాకకుండ, త్రుంపకుండ ఉండుటకై తగు జాగ్రత్త వహించిరి. ఇదివరలో ఆ లతనే వారు అనాదరణ చేసియుండిరి. కారణమేమి? దాని మహిమ తెలియనందువలన దానిలో విషహరణశక్తి కలదని యెఱుగక పోవుటవలన ఇదివరలో ఆ తీగను ఉపేక్షించిరి. దాని విషయమై అశ్రద్ధ చేసిరి. ఇప్పుడు శ్రద్ధవహించుటకు కారణము దాని ప్రభావము మాంత్రికుని ద్వారా తెలిసికొనుటయే.

అట్లే భగవానుని యొక్కయు, గీతాది సచ్ఛాస్త్రముల యొక్కయు, సద్గురువుల యొక్కయు మహిమను, ప్రభావమును పెద్దలవలన, గుర్తెరిగి, వారిపై పరిపూర్ణ విశ్వాసము కలిగి జనన మరణరూప భవరోగమును పోగొట్టుకొని జనులు పరమశాంతిని సంపూర్ణానందమును అనుభవింతురు గాక!

నీతి: భగవంతుని యొక్క సద్గురువుల యొక్క శాస్త్రము యొక్క పరిపూర్ణ విశ్వాసము గలిగి యుండవలెను.

# అంతులేని ఆశ

పూర్వ మొక ధనికు డుండెడివాడు. అతనికి వందల కొలది యకరముల భూసంపద కలదు. కాని దానితో సంతృప్తిని బొందలేదు. వేలకొలది యకరముల నేల ఎచటనైనను చవుకగా లభించినచో కొనివేయవలెనను తలంపు గలిగి యుండెను. ఇంతలో హిమవత్పర్వత ప్రాంతమున విశాలమగు పీఠ భూమి కలదని అది అరణ్య మందలి కోయరాజుల వశముండు కలదని అతని కెవరో చెప్పిరి. వెంటనే ధనికు డచటికి ప్రయాణము సాగించెను. పట్టణమందు లభించు విచిత్రములైన ఆట వస్తువులను, తినుబండారములను ఒక పెద్దబుట్టలో వేసి కొని అతడు హిమవత్పర్వత ప్రాంతములకు పయనమయ్యెను.

అచటికి వెళ్ళి, కోయరాజును సమీపించి, వారి బిడ్డలకు తాను తెచ్చిన ఆట బొమ్మలను, ఫలహారములను పంచిపెట్టెను కోయరాజు మహదానంద భరితుడై 'సేట్ జీ' మీ రాక ఏలకో వచింపుడు! మీ యభీష్టమును నెరవేర్చెదను. అని మాట యిచ్చెను. వెంటనే ధనికుడు తనకు ఆ పరిసరమున కొంత నేల కావలెనని కోరగా, అందులకు కోయరాజు, 'అట్లే ఇచ్చెదను. దానికి మీరేమియు క్రయమునుగూడ చెల్లింప నక్కర లేదు. ఎంతయో నేల వ్యర్థముగ ఇచట పడియున్నది. దానిని మీరు సాగుచేసికొని ఉపయోగించుకొనవచ్చును. అయితే ఒక షరతుపై దాని నిచ్చెదను. రేపు ఉదయము సరిగా 6 గంటలకు మీ రిచట నుండి బయలుదేరి మీ యిష్టము వచ్చి

నంతదూరము నడచి మరల తిరిగి సాయంత్రం 6 గం॥లకు ఈ చోటికి చేరవలెను. నీవు నడచి నంతదూరపు నేలయంతయు నీదే! అని కోయరాజు ధనికునకు చెప్పెను.

ఆ వాక్యములను వినగనే ధనికుని యానందమునకు మేరలేదు. తన జీవితము కృతార్థమైనదని తలంచెను. తన ఉద్దేశము నెరవేరినది ఆనందపరవశు డయ్యెను. మరునాటి రోజు ఉదయము 6 గం॥లు ఎప్పుడు వచ్చునాయని వేచి యుండెను. తెల్లవారినది. సరిగా నిర్ణీతసమయమునకు కోయరాజువచ్చి ధనికునకు ఒక స్థలము గుర్తుచూపి అచ్చోట నుండి ఎంతదూరమైనను నడచి పోవచ్చు ననియు, అయితే సాయంత్రము 6గం॥లకు తిరిగి అక్కడ చేరుకొన వలసియుండు ననియు ఆదేశించెను. ధనికుడు బహుస్థూలకాయుడు. పొట్టి మనిషి. నడక ప్రారంభించెను. నడచినచో కొద్దిస్థలమే రాగల దనియు, పరుగెత్తినచో చాలస్థలమును ఆక్రమించుకొనవచ్చు ననియు తలంచి ధనికుడు వేగముగ పరుగెత్త నారంభించెను. దారిలో ఒక చిన్న కాలువ అడ్డువచ్చెను. దిగిపోయినచో ఆలస్య మగుననియెంచి దానిని ఒకదూకు దూకెను. కాలు జారిపడి, ఎట్లనో లేచి మరల కుంటుచు పరుగెత్త నారంభించెను. అది గ్రీష్మ ఋతువు. మధ్యాహ్న సమయమున ఎండలో ఘులఘులమాడుచు, చెమట కార్చుకొనుచు, పరుగిడుచున్న ఆ ధనికుని అవస్థజూచి జాలిపడి ఒకరు 'అయ్యో! ఈ పాత్రి -

లోని మంచినీళ్లు త్రాగి దప్పిక తీర్చుకొనుడు' అని ప్రార్థన చేసి
ఇవ్వగా ధనికుడు తృణీకరించి 'ఈ సమయమున నన్నేమియు
పలుకరించకుడు. మీరిచ్చు నీళ్లు త్రాగులోపల ఇంకను కొంత
స్థలమును నేను ఆక్రమించుకొనగలను' అని పలికి తన పరు
గును కొనసాగించెను.

ఈ ప్రకారముగ ఆహారము లేక, నీళ్లు లేక, మండు
టెండలో తల తిరుగుచుండ, కాలి దెబ్బతో వ్యథపడుచు ను
ధనికుడు ఎక్కువ నేలను సంపాదించవలెనను పేరాశచే ఆరో
గ్యమును, దేహస్థితిని గూడ లెక్కచేయక, తిరుగుదారిపట్టి
పరుగెత్తి పరుగెత్తి తుదకు ప్రారంభించిన చోటుకు పది గజ
ములదూరములో శోషచే క్రిందపడిపోయెను. కోయరాజు,
తదితరులగు స్థానిక పెద్దలు హుటాహుటి అచ్చోటికి పరుగున
వచ్చిచూడగా, ధనికుడు స్పృహతప్పి పడియుండెను. అతని
నాడి సన్నగిల్లుచుండెను. రెండు మూడు నిముషములలో ధని
కుని ప్రాణవాయువు ఎగిరిపోయెను. అందులకు చింతాక్రాంతులై
ఇక చేయునదేమియు లేక, కోయరాజు ధనికుడు ఎంత పొడుగు
ఉండెనో కొలిపించి, అంత పొడుగుమాత్రము గొయ్యి [illegible]
త్రవ్వించి ధనికుని అందులో పూడ్చిపెట్టి సమాధిచేసెను.

జనుల ఆశకు అంతులేదు. అంతులేని ఆశనే తృష్ణయం
దురు. అట్టి తృష్ణను ముముక్షువులు తప్పక విసర్జింపవలెను.
దానిచే మనుజునకు శాంతి ఏ మాత్రము ముంపనేరదు. భగ

వంతు ఇచ్చినదానితో సంతృప్తినొంది ఉన్న కొలదికాలము ఆ పరాత్పరుని దివ్యనామోచ్చారణాదులందు అనుభూతులందు గడిపి ధన్యత జెందవలెను. చూచితిరా! ఆ ధనికుడు వేల కొలది యకరముల నేలను ఒక దెబ్బతో కొట్టవేయవలెనని సంకల్పించినను, అతని పెట్టిన ఖిలావ నెరవేరవేగా, తుదకు అతనిపాదముగు ఎన్ని అడుగులో అంత మాత్రపు నేలయే అతనికి దక్కెను. అతనికే కాదు, ఎవనికైనను తుదకు దక్కెనది అంతమాత్రపు నేలయే. కాబట్టి ఆశాపాశ శతంబులను విచ్ఛిన్న మొనర్చి, తృష్ణను దూరముగ పారద్రోలి నిత్య సంతృప్తుడై భగవద్భక్తియుక్తుడై మనుజుడు తన జీవితమును పరిశుద్ధ మొనర్చుకొని కృతార్థుడు కావలయును.

**నీతి :-** ఆశను వదలివైచి, భోగజాలమును దూరీకరించి, ఉన్న స్వల్పపదార్థముతో సంతృప్తి నొంది యుండవలెను.

## అహంకారమునకు తగిన ప్రాయశ్చిత్తము

ఒకానొక గ్రామమున ఒక ఉపాధ్యాయుడు కలడు. అతడు పూర్ణభాషయందు ఎమ్. ఎ. ప్యాసయి గణితమున ప్రత్యేక ప్రావీణ్యమును కూడ బడసెను. అతనిది బట్టతల. ఒకరోజున అతడు దూరమునయున్న మరియొక గ్రామమునకు పాదచారియై పోవుచుండెను. అది మిట్టమధ్యాహ్నసమయము. ఎండ మలమల మాడుచుండెను. చేతిలో గొడుగులేదు. పైగా బట్టతల. విశ్రమించుటకు దారిలో ఒక్క చెట్టుకూడ కనిపించలేదు. ఈ పరిస్థితిలో నాతనికి ఒక అరమైలు దూరములో బ్రహ్మాండమైన మఱ్ఱిచెట్టు గోచరించెను. సేద తీర్చుకొను నిమిత్తమతడు త్వరితముగ ఆ చెట్టుయొద్దకు దారితీసి, దానిని సమీపించినవాడై కొంతసేపు అద్దానిఛాయయందు విశ్రమించదలచి అచట నొక గుడ్డపరచి, దానిపై వెల్లకిల పరుండెను.

అట్లు పరుండి విశాలముగ శాఖోపశాఖలతో విస్తరించియున్న ఆ వటవృక్షమునంతను బాగుగ పరికించుచుండెను. ఇంతలో నాతనిదృష్టి అతిస్వల్పములుగనున్న మఱ్ఱికాయలపై బడెను. వెంటనే పరిహారముగ ఆలోచింప మొదలిడెను. ఈ చెట్టును సృష్టించిన దెవరు? దేవుడు గదా! మరి దేవునకు లెక్కల విషయములో, అనుభవము లేదా? దేవుడు గణిత శాస్త్రము చదువుకొనలేదా? లేనిచో ఇంత బ్రహ్మాండమైన

మఱ్ఱిచెట్టునకు ఇంత సన్నకాయలు పెట్టునా? రామరామ! చిన్నగుమ్మడి తీగకే దాదాపు 80 పౌనుల పెద్ద గుమ్మడి కాయను ఏర్పాటుచేసిన భగవంతుడు ఇంత పెద్ద మఱ్ఱిచెట్టుకు ఎంత పెద్ద మఱ్ఱికాయను కల్పించవలెను? దాదాపు అరటన్ను కాయ ఉండవలెను. లెక్కలలో నిష్పత్తి, అనుపాతము (Ratio and proportion) అను పాఠమును భగవంతుడు చదువలేదేమో? చదివియుండినచో ఈ ప్రకారము సృష్టిచేయడు. అల్పుడనగు నాకే నిష్పత్తినిగూర్చిన విజ్ఞానమెంతయో కలదే, ఇక దేవున కేల లేకున్నది? అని ఈ ప్రకారముగ అహంకార వశమున ఏమియో ప్రేలుచుండెను.

ఇంతలో ఒక చిన్న సంఘటన జరిగెను. గాలి జోరున వీచగా ఒక చిన్న మఱ్ఱికాయ చెట్టుపైనుండి వ్రాలి సరిగా గురిపెట్టి కొట్టినట్లు ఆ లెక్కల మాష్టరుగారి బట్టతలపై సూటిగ వచ్చిపడెను. వేగముగా పడుటలో, కాయ చిన్నదైనను చురుకైన దెబ్బతీసెను. మాష్టరుగారి బుఱ్ఱ గింగురుమనెను. భగవద్విమర్శనారూప మనోవీథులలో విహరించుచున్న ఆ మాష్టరుగారు తోడనే తెప్పరించుకొని తల గీరుకొనుచు "ఎంతటి ప్రమాదము తప్పినది! ఈ చిన్నకాయ దెబ్బకే నా తల గింగురుమన్నది, నేను ఊహించినట్లు అరటన్ను కాయ గనుక ఈ చెట్టునకు ఉండియున్నచో ఇక నా ప్రాణమిప్పటికే మృత్యులోకమునకు దాటిపట్టెడిది. ఆహా! భగవంతు డెంతటి

కరుణామయుడు! మఱి వృక్షము కాబట్టి ఎందరో బాటసా
రులు దాని క్రింద తలదాచుకొనుటకై వచ్చెదరని తలంచి ఆ
పరాత్పరుడు వారికి బాధ కలుగకుండులాగున చిన్నకాయను
ఆ చెట్టునకు ఏర్పాటు చేసెను. ఓహో! భగవానునకు
లెక్కలే కాదు, నీతిశాస్త్రముకూడ తెలియును!, God knows
not only Mathematics but ethics also!" అని లెక్క చేసి దైవ
విషయమై తా నూహించినది తప్పని గ్రహించి భగవం
తుని క్షమాపణ వేడుకొనెను. ఆ విస్మృత మాటల తలపోసి
కొనుచు తన దారిని తాను పోయెను.

కావున, జనులారా! గర్వము పనికిరాదు. అహం
కారము పనికిరాదు. తన చదువులు, తన సంపదలు, తనకీర్తులు
చూచుకొని మురిసిపోరాదు. వాని నాధారముగ జేసికొని
భగవంతుని, సృష్టిని విమర్శింపరాదు. విద్యతోపాటు విన
యము, భక్తి, సౌశీల్యము వృద్ధినొందవలెను. అల్పజ్ఞుడగు
జీవుడెచట! పరిమితములు లేని బుద్ధిశక్తి యెచట! సర్వజ్ఞు
డగు ఈశ్వరుడెచట! ఈ అనంతసృష్టి విలాసమెచట! కావున
'దాసోఽహం' భావనగల్గి, ఆ దివ్యతేజస్సంపన్నునియెడ, ఆ
పరాత్పరునియెడ విధేయులై జనులు భక్తిప్రపత్తులతో గుడి
మెలగవలెను. ఏనాటికైనను భగవదనుగ్రహమే జీవులను కడ
తేర్చునదియని తెలియవలెను. అహంకారమును, గర్వమును,

దర్పమును పారద్రోలి సర్వేశ్వరుని యెడల పరిపూర్ణ భక్తిభావమును శీఘ్రముగ అలవరచుకొనవలెను.

**నీతి:—** విద్యతోబాటు వినయము గలిగి యుండవలెను. భగవంతునిపై పూర్ణ విశ్వాసము గలవారై యుండవలెను.

⁂

# భక్తితోగూడిన ధ్యానికే విలువ

పూర్వకాలమున ఒకానొక గ్రామమున ఒక భక్తుడు నివసించుచుండెను. అతడు 'ఓమ్ నమో నారాయణాయ' అను అష్టాక్షరీ మహామంత్రమును నిరంతరము జపించుచుండెడివాడు. తన పూజా మందిరములో శ్రీమన్నారాయణుని విగ్రహము నెదుట కూర్చొని భక్తిపూర్వకముగ ప్రతిదినము పై మంత్రమును పురశ్చరణ చేయుచుండెను. ప్రాపంచిక పదార్థములపై అతనికి ఏమాత్రము ఆసక్తి లేకుండెను. వైరాగ్యసంపన్నుడై భోగ వస్తుజాలమును తెన్నగా పరిత్యజించి, దృష్టిని బహిర్ముఖముగ ప్రసరింపజేయక, నారాయణుడే తనకు దిక్కని నమ్మినవాడై మనోవాక్కాయములచే, ఆయననే హృదయమున సంస్మరించుచు నుండెను.

ఇట్లుండ, ఒకనాడతడు ప్రతిదిన పద్ధతి ప్రకారము ఉదయముననే స్నానాదులను నిర్వర్తించుకొని శుచిర్భూతుడై తన పూజామందిరమున శ్రీమన్నారాయణుని దివ్యమంగళ విగ్రహము నెదుట కూర్చుండి దృష్టిని భ్రూమధ్యమున నిలిపి ఏకాగ్ర దృష్టితో నారాయణుని భావించుచు, అష్టాక్షరీ మంత్రము జపించుచుండ, అతని భక్తికి, అపారమైన శ్రద్ధకు మెచ్చి వైకుంఠనాథుడు శంఖ చక్ర గదాద్యాయుధుడై ఆకస్మికముగ ఆ పూజా మందిరమున ప్రత్యక్షమయ్యెను. భగవానుని ప్రత్యక్షముగ దర్శింపగల్గు మహాభాగ్యము ఉదయించుటచే ఇక ఆ

భక్తుని ఆనందమునకు మేరయే లేకుండెను. తదేక దృష్టితో, ఆనంద పరవశత్వముతో, ఉత్కంఠితహృదయముతో అతడు భగవానుని పరిపూర్ణరూపమును వీక్షించుచుండెను. స్తుతిచేయుటకు తోచకుండెను. అది భగవానుని ఆకస్మిక గమనము (Surprise visit) అగుటవల్లనను, దేవుని సత్కరించుటకు ముందుగా ఏ విధమైన ఏర్పాట్లు చేసియుంచుకొనక పోవుటవలనను, కడు బీదవాడగుటచేతను భగవంతునికి నివేదించుటకు తగిన వస్తుసంభారములు లేక యుండుట వలనను, ఇంటికి వచ్చిన ఆ లోకోత్తర అతిథిని ఎట్లు సత్కరించవలెనో తోచక, ఆతని మనస్సు తొట్రుపాటుపడుచు నుండెను.

భగవద్దివ్యస్వరూపసందర్శనజనిత మహదానందపరిపూరిత హృదయసహితుడగు ఆ భక్తుడు తత్సమయమున తన పూరిపాకయందలి మూలనున్న చేరిపారమీద ఒకపక్కగా ఒక అరటి పండు అతనికి దృగ్గోచరమయ్యెను. తోడనే పరుగెత్తికొని వెళ్ళి దానిని చేతపట్టుకొని వచ్చి, ఆ త్వత్ప్రసాదమునే యని భగవంతునకు నివేదింపదలంచి, ఆనంద పారవశ్యమునే ఒడలు గానరాకుండ తనను నారాయణుని దివ్యపాద పద్మములపై నిల్పియుండ, తొందరతో ఆ అరటి పండును ఒలిచి లోనిగుజ్జును పారవైచి తొక్కను దేవునకు పెట్టెను. భక్తిరసముచే ఘనీభూతమైన ఆ తొక్కను భగవానుడపుడు ఆనందముతో స్వీకరించి, భుజించి, అంతర్ధానమొందెను.

'తిరుపతి గోవిందస్వామికి' ఆ భక్తుడు తన పొరపాటును గుర్తెరిగి పశ్చాత్తాపతప్తుడై, భగవానునకు గొప్ప అపచారము చేసితినని తలంచి అత్యంతఖిన్నుడై, ఏమిచేయుటకు తోచక, హృదయము వేదనలో క్రుంగుచుండ గొప్ప పరితాపమును పొందుచుండెను. 'అయ్యో! నే నేలట్లు చేసితిని! సామాన్య మానవునికైనను అరటితొక్కను ఎవ్వరును ఇవ్వరే! ఇక చతుర్దశ భువనాధిపతియగు శ్రీమన్నారాయణునికి నేనేల ఇట్టి తుచ్ఛవస్తువు నొసంగితి?' అని పలువిధముల తలపోయుచు తుదకు గుండె నిబ్బరము కలుగజేసికొని ఈ క్రింది దృఢనిశ్చయమునకు వచ్చెను. 'ఇక విచారించిన ప్రయోజనము లేదు. మరల భగవానుని త్వరలోనే నేను ప్రత్యక్షమొనర్చుకొనెదను. అతడు భక్తవత్సలుడు. కావున పరిపూర్ణభక్తితో, అకుంఠిత దీక్షతో అష్టాక్షరి మహామంత్రమును జపించుచు, అతనిని ధ్యానించినచో తిరిగి యతడు ప్రత్యక్షము కాగలడు.'

అయితే ఈసారి పూర్వము చేసిన పొరపాటు మరల జరుగకుండుటకు నిమిత్తము ముందుగనే యతడు చాల జాగ్రత్త పడెను. ఒక గెల అరటిపండ్లు తెప్పించి దేవుని విగ్రహము ముందు పెట్టి, 'ఈ సారి భగవంతుడు అకస్మాత్తుగ ఇచటికి వచ్చినప్పటికిని ఈసారి పండు ఒలిచి, గుజ్జుమాత్రమే దేవునకు పెట్టి తొక్క పారవేసెదను' అని కృతనిశ్చయుడై ఆ గెల్లలోని ఒక్కొక్క పండు త్రుంచి తొక్కతీసి గుజ్జును గట్టిగా చేతితో

వచ్చినపుడు దేవుని కిచ్చునట్లుగా అభ్యాసము (Rehearsal) చేయ దొడంగెను. ఈ ప్రకారము గెలలోని అన్ని పండ్లను ఒక్కొక్కటిగ తీసికొని గుజ్జును గట్టిగా పట్టుకొను అభ్యాసముచేసి ఆ పనియందు చక్కని ప్రావీణ్యమును బడసెను. "ఇక దేవుడు ఎపుడొచ్చినను పరవాలేదు. ఈసారి గుజ్జుమాత్రమే నివేదింప బడగలదుగాని తొక్కకాదు" అని బాగుగ నిశ్చయించుకొని మరల తన పూజాగృహమున ప్రతిదినము పూజచేయ దొడంగెను.

ఇట్లుండ, ఒకనాడు అతని భక్తికి మెచ్చి శ్రీమన్నారాయణుడు మరల ప్రత్యక్షమయ్యెను. పూర్వపు అభ్యాసము దృఢపడి యుండుటచే వెంటనే అతడు ప్రక్కనున్న అరటిపండును పట్టుకొని జాగ్రత్తగ ఒలిచి గుజ్జును గట్టిగపట్టుకొని తొక్కను పారవైచి, ఆ గుజ్జును భగవానుని నోటిలో పెట్టెను. కాని భగవానుడు దానిని భుజింపక ఊసివేసెను. అపుడా భక్తుడు దుఃఖాక్రాంతుడై విలపించుచు, భగవానుని పాదపద్మములపై పడి, ఏల తాము భుజింపలేదని ప్రార్థింప అతడిట్లు నుడివెను :– 'అయ్యా! పూర్వము నీవు నాకు తొక్కను నివేదించినపుడు నీ మనస్సు నా పాదపద్మములపై సంలగ్నమైయుండుట వలన ఆహారమైన ఆ వస్తువు భక్తిరసముచే తడుపబడి అమృత తుల్యమై యుండుటచే నేనదానిని భుజించితిని. ఈసారి వచ్చినపుడు నీవు గుజ్జును ఇచ్చినప్పటికిని నీ మనస్సంతయు

అరటిపండు పైననే లగ్నమైయుండుటవలన, వస్తువు మంచి దైనను భక్తి రసహీనమై యుండుటవలన అది విషతుల్యముగా మారినది. అందుచే నే నద్దానిని భుజింపక పారవేసితిని.' అని చెప్పి యంతర్ధానమొందెను.

అప్పటినుండియు ఆ భక్తుడు తెలివితెచ్చుకొని భగవన్నివేదనాది కార్యములందు వస్తువుకంటె భక్తికే ప్రాధాన్యత నొసంగుచు వచ్చి క్రమముగ భగవదనుగ్రహమునకు పాత్రుడు కాగల్గెను. దేవుడు తనకు "ఏది ఒసంగిరి" చూడడు 'ఎట్లు ఒసంగిరి' అని చూచును. కాబట్టి జనులు పూజాప్రార్థనాదులందు భక్తికి ప్రాధాన్యమిచ్చి దానిని బాగుగ అభివృద్ధి నొందించుకొనుచుండవలెను.

**అణ్వప్యుపాహృతం భక్తైః ప్రేమ్ణా భూర్యేవ మే భవేత్**
**భూర్యప్యభక్తోపహృతం న మే తోషాయ కల్పతే.**

'కొంచెమైనను భక్తితో, ప్రేమతో ఒసంగబడినది కొండంత కాగలదు. కొండంత ఇచ్చినను భక్తితో కూడి యుండనిచో అది నాకు సంతుష్టిని కలుగజేయజాలదు'— అను ఈ భగవద్వాక్యమును సర్వులును స్మృతిపథమున నుంచు

కాని సర్వేశ్వరునియెడల అనన్య భక్తిభావమును పెంపొం
దించుకొనుదురుగాక!

నీతి :- భక్తితో గూడినప్పుడే వస్తువునకు
విలువ ఏర్పడును.

0—0

# లోకోభిన్నరుచిః

అరేబియా దేశములో ఎడారి ప్రదేశము ఎక్కువగా కలదు. అందుచేత అచట వస్తుసామాగ్రిని ఒకచోటనుండి మఱియొక చోటికి చేరవేసికొనుటకు గాడిదలను ఎక్కువగా వాడుచుందురు. ఆ దేశమున మార్కెట్టులలో గాడిదల వ్యాపారము ముమ్మరముగా సాగుచుండును. ఒకనాడు ఒకానొక వృద్ధుడు తన మనుమని వెంటబెట్టుకొని వారి యింటి అవసరములకొఱకై ఒక గాడిదను కొని తెచ్చుటకై తన గ్రామములోని మార్కెట్టునకు వెళ్ళెను. అతడు తనకు నచ్చిన ఒక గాడిదను ఖరీదు చేసికొని దానిని నడిపించుకొనుచు యింటికి తిరిగి వెళ్ళుచుండెను.

త్రోవలో కొందఱు జనులు దానిని జూచి వృద్ధునితో నిట్లనిరి— 'తాతా! ఎంతయో డబ్బు ధారబోసి గాడిదను కొనుక్కొని, దానిని ఉపయోగించుకొనకుండ ఊరక నడిపించుకొని పోవుచున్నావేమి? నీవు వయస్సు చెల్లినవాడవు. నీ మనుమడు చాల పసివాడు. గాడిదను ప్రక్కన బెట్టుకొని ఇరువురును నడచిపోవలసిన గ్రహచారమేమి? ఇద్దఱును దానిపై నెక్కి ఇంటికిపోయిన బాగుగా నుండును! ఆ వాక్యములను విని తత్క్షణమే వృద్ధుడు, తన మనుమని గాడిదపై గూర్చుండ బెట్టి తానుగూడ అతని సరసన పైన గూర్చుండి ప్రయాణమై పోవుచుండెను.

కొంత దూరమేగిన పిదప మఱికొందఱు కనిపించి, వృద్ధునితో నిట్లనిరి—ఓయీ! వెఱ్ఱివాడా! చిన్న గాడిదపై ఇద్దరు ఎక్కి కూర్చొనినచో దానికి భారము కాదా! కాబట్టి నీవు దిగు. పసిపిల్లవాడు ఒక్కడు దానిపై ఎక్కిపోయిన చాలును! ఆ వాక్యములను వినగానే వృద్ధుడు వారు చెప్పినది సమంజసముగానే ఉన్నదని తలంచి తాను దిగి మనుమని గాడిదపైనే ఉంచి గాడిదను నడిపించుకొని పోవుచుండెను.

ఇట్లు కొంతదూరమేగగా, త్రోవలో ఇంక కొందఱు అగుపించి "ఓయీ వెఱ్ఱితాతా! ఇదేమిపని! వృద్ధుడవై బలహీనుడవై కాటికి కాళ్లు జాపుకొని అశక్తుడవైయున్న నీవు నడచుటయేమి? ఆరోగ్యవంతుడుగా నున్న నీ మనుమడు పైకెక్కి కూర్చొనుటయేమి? ఇదెక్కడి న్యాయము! కాబట్టి అతనిని క్రిందకు దింపి నీవు పైకెక్కి ప్రయాణించుము. లేకున్న దారిలోనే అలసటవచ్చి పడిపోదువు అని పలికిరి. ఆ వాక్యములను వినగానే వృద్ధుడు తన దౌహిత్రుని క్రిందకు దింపి తాను పైకెక్కి ప్రయాణించుచుండెను.

ఇంతలో మఱికొంద అగుపించి "తాతగారూ! ఎంతో ఖర్చుపెట్టి గాడిదను కొనుక్కొని ఇద్దరూ పైకెక్కి కూర్చొనక ఒకరిని క్రింద నడిపించుకొని పోవుచున్నారేమి? మీ యిద్దరి బరువు దానికొక లెక్కా! అని చెప్పి వెడలిపోయిరి.

తోడనే వృద్ధుడు తన మనుమనికూడ పైకెక్కించుకొని పయ
నమై పోవుచుండెను,

కొంతసేపటికి దారిలో గొందఱు దృశ్యమును జూచి
'తాతా' గాడిద చాలసేపు మీ యిద్దరిని మోసినది. కాబట్టి
మీరున్ను దానిని కొంతసేపు మోయుట న్యాయము ధర్మము
అని చెప్పి వెళ్ళిపోయిరి. ఆ వాక్యములోని సారస్యమును గమ
నించి వృద్ధుడు వెంటనే క్రిందకు దిగి మనుమనికూడ దింపి,
గాడిదను క్రిందపడవేసి కాళ్లు కట్టి ఒక కఱ్ఱకు వ్రేలాడదీసి
యిరువురును దానిని మోసుకొని పోవ దొడంగిరి. జనులది
చూచి పకాపకా నవ్వసాగిరి.

ఈ విధముగ దారి పొడుగునా ఒక్కొక్కరు ఒక్కొక్క
వాక్యము చెప్పుచుండ దాని ప్రకారము ఆచరించుచు పోయిన
ఆ గ్రామస్థుడగు వృద్ధుడు చివరకు జనులలో నగుబాటు
పాలయ్యెను.

కావున అధ్యాత్మ క్షేత్రమున చరించు సాధకుడు దారిన
పోవు జనులందఱియొక్క సలహాలను పాటించుచు పోయినచో,
తుదకు అశాంతిపాలై పోవును. కావున అనుభవజ్ఞుడగు సద్గు
రువుయొక్కయు, సచ్ఛాస్త్రముల యొక్కయు ఆదేశము
ప్రకారము నడచుకొనిన మాత్రము చాలును. లోకు లందఱిని
ఎవరును మెప్పించలేరు. మహాత్ముల వాక్యమే, సచ్ఛాస్త్రముల
ఆదేశమే ముముక్షువులకు శరణ్యము.

**నీతి :-** లోకులు భిన్న భిన్న భావములు కల వారై యుందురు. కాబట్టి ముముక్షువగు సాధకుడు మహాత్ముల ఆదేశము ప్రకారమే నడచుకొనవలెనేకాని జనసామాన్యము యొక్క దృష్టి ననుసరించకాదు.

0 = 0

# సోమరి శిష్యుడు

ఒకానొకాశ్రమములో ఒక గురువు ఒక శిష్యుడు నివసించుచుండిరి. ఇరువురకును వేఱు వేఱు కుటీరములు కలవు. ఆ కుటీరములు తాటియాకులతో బాగుగ కప్పబడి యుండెను. ఒకనాడు సాయంసమయమున గొప్ప పెనుగాలివీచగా గురువుగారి కుటీరముపై గల తాటియాకులలో రెండు ఊడి గాలికి కొట్టుకొనిపోయెను. గురువు వెంటనే శిష్యునిపిలిచి 'ఒరే నాయనా! కుటీరముపై తాటియాకులలో రెండు లేచిపోయినవి. ఎక్కడకుపోయినవో చూచి తెచ్చి వాటిని యథాస్థానములో పెట్టరా!'—అనెను. శిష్యుడు ఏ ఘడియలో పుట్టెనోగాని సోమరితనమును బాగుగా అలవాటు చేసికొనెను. మూర్తీభవించిన మహాబద్ధకమే అతడు. తమోగుణము అతనికి ఒడలంతా వ్యాపించియుండెను. కూర్చున్నవాడు లేవలేడు. గీతలో చెప్పిన 'దీర్ఘసూత్రి'కి వాడు ప్రబలదృష్టాంతము. ఇట్టి స్థితిలో అతడు గుర్వాజ్ఞను పాలించునా? వెంటనే యతడు గురువుగారికి సమాధానమును చెప్పివైచెను.—'మహాప్రభో! ఇపుడు చీకటిపడినది. చీకటిలో ఎక్కడ వెదకుదును? వెదకినా అవి కనిపించునా? కనిపించినా వాటిని తెచ్చి కుటీరముపై పెట్టుట ఎట్లు? ఎచట చూచిన అంధకారబంధురముగా నున్నది. కాబట్టి రేపు ప్రొద్దున తప్పకుండా తెచ్చి కప్పెదను. క్షమించండి!—

ఆరోజు రాత్రి ఎట్లో గడచిపోయెను. రాత్రింతయు చలిగాలిచేతను, వర్షపుతుంపరలచేతను గురువుగారు చాల బాధపడిరి. తాటియాకులు లేచిపోవుటచే, ఏర్పడిన బిలము నుండి వర్షజలము లోనికి పడుటవలన గురువుగారి కుటీరము లోని పుస్తకములు, దర్భాసనము, కమండలువు, జపమాల మొదలైనవన్నీ తడిచిపోయెను. తెల్లవారగనే గురువు శిష్యుని కేక వేసెను. కాని వాడు అతినిద్రలో ఉండుటవలన పలుక లేదు. మూడు కేకలు వేసినప్పటికి రానందుచే గురువు తానే శిష్యుని కుటీరము వద్దకు పోయి ఆ కలియుగ కుంభకర్ణుని నిద్రలేపి తన కుటీరమునకు గొనివచ్చి ఓరే శంభూ! ఆ రెండు తాటాకులు కప్పరా! అనెను. వెంటనే శిష్యుడు కండ్లు నలుపు కొనుచు 'స్వామీ! వర్షము జోరున కురియుచున్నది. ఈ సమయమున కప్పుటకు సాధ్యపడదు. వర్షము ఆగిన వెంటనే తమ ఆజ్ఞ పాలింపగలవాడను" అని చెప్పి మరల పరుండెను. కొంతసేపటికి దైవము అనుకూలించుటచే వర్షము క్రమముగ తగ్గుచువచ్చి మరికొంతసేపటికి పూర్తిగ నిలిచిపోయెను. వెంటనే గురుదేవుడు శిష్యునిలేపి ఈ ప్రకారముగ చెప్పెను. "ఓరే శంభూ! వర్షము ఆగిపోయినది. ఆ రెండు ఆకులు కప్పరా!"—ఆ వాక్యములను విని శిష్యుడు ఆలోచనలో పడెను.

శిష్యుని ఆలోచనచూచి గురువు అతడు కార్యమును ఉపక్రమింపబోవుచున్నాడని పరమానందపడెను. ఇక తన

కుటీరము బాగుపడవలెనని ఉవ్విళ్ళూరెను. కాని ఎంతసేపు వేచియుండినను శిష్యుడు కదలలేదు. అంతట గురువు ఆశ్చర్య సంభరితమానసుడై శిష్యుని యిట్లు ప్రశ్నించెను — 'ఏమిరా! శంభూ! వర్షము ఆగిపోయి చాలసేపయినది! తాటాకులు కప్ప వేమి? వెంటనే శిష్యుడు ఈ ప్రకారముగ ప్రత్యుత్తర మిచ్చెను--'మహాప్రభూ! తమ ఆజ్ఞను శిరసావహించవలెననియే నా అభిప్రాయము. కాని ఇప్పుడువర్షము ఆగిపోయినది కాబట్టి కప్పవలసిన అవసరము నాకు కనిపించుట లేదు. చక్కటి ఎండ కాయుచున్నది. ఈ సారి మరల వర్షమువచ్చినచో", అని చెప్ప నెమ్మదిగా తన కుటీరమునకు వెడలి పోవుచుండ గురువు వానిని ఆపి కూర్చుండబెట్టి — 'ఒరే శంభూ! ఇంత సోమరిగా ఉన్న నీవు ఎప్పుడు కడతేరుతావు? ఏపుడు చేయవలసిన పనిని అపుడే చేయవలె. ఈ దైవమార్గములో, పరమార్థమార్గములో సోమరి తనమునకు ఏమాత్రము చోటీయగూడదు. తెలిసినదా? అని అడుగగా శిష్యుడు బ్రహ్మాండంగా తెలిసినదని జవాబు చెప్పి హృదయపరివర్తన గావించుకొని తోడనే వెళ్ళి ఆకొంగ ఆకులుకప్పి వైచెను.

(చిన్నవయస్సులో ఉన్నవారికి "ధ్యానము చేసికొనుడు" అని చెప్పినచో ఇప్పుడు దాని అవసరమేమి? వార్థక్యము వచ్చి.. పిదప "ధ్యానముచేసికొనుడు" అని చెప్పినచో 'ఈ దుర్బల స్థితిలో మేము ధ్యానము ఎట్లు చేసికొనగలము?' అని

ప్రత్యుత్తరము చెప్పుదురు వారి వాక్యములు కథలోని స్వామి శిష్యుని వాక్యములనే పోలియుండును. కావున అట్టి అలక్ష్యమును దులిపివైచి బాల్యమునుండియే జనుల భగవద్ధ్యాన పరాయణులై తరించుదురుగాక )

**నీతి :-ఏ క్షేత్రమందును సోమరితనము నరులవలేశమైనను చోటీయరాదు.**

o - o

# విషయవ్యామోహము

ఒకానొక ప్రాంతమున దట్టమైన అడవి యొకటి కలదు. కొన్ని మైళ్లవరకు బ్రహ్మాండముగ విస్తరించియున్న ఆ యరణ్యము జనులకు అత్యంత భీతావహముగ నుండుటవలన దాని సమీపమునకే ఎవరును పోవుట లేదు. భయంకరములైన సింహ వ్యాఘ్రాది ఘాతుకజీవులెన్నియో ఆ నిబిడారణ్యమున స్థిరనివాసమేర్పరచుకొని యుండెను.

ఇట్లుండగ ఒకనాడొక గార్దభము (గాడిద) ఆ ప్రాంతమున సంచరించుచు ఆ యరణ్య సమీపమునకు వచ్చి త్రోవ తప్పి ఆ భీకరారణ్యమునందు ప్రవేశించెను. ప్రవేశించిన కొద్దిసేపటికే దినకరుడస్తాద్రిగ్రుంకెను. నలువైపుల చీకటి క్రమ్ముకొనెను. పాపమా గాడిద అరణ్యమున తిరుగాడుచు అంధకారబంధురమైన ఆ వనప్రదేశమున చిక్కుకొని దారి తెన్ను తెలియక ఫొల్లసందులలో నడచుచు, అచటచట రాళ్లు రప్పలు తగుల్కొని క్రిందపడుచు, లేచుచు అత్యంత బాధాకరముగ తన గమనమును కొనసాగించుచుండెను, కాని ఎంత సేపు నడచినను ఘోరారణ్యము కాబట్టియు, నిశీథసమయమగుటఁబట్టియు దిక్కు తెలియక అందే నానా అవస్థలు పడుచుండెనేకాని, తప్పించుకొని బయటపడలేదు.

ఇట్టి విపత్కర పరిస్థితియందా గార్దభము మెల్లమెల్లగా ముందునకు జనుచుండ కాలుజారి ఒక పెద్ద గోతియందు పడి

పోయెను. దొర్లుచు దొర్లుచు అది గోతియొక్క అధోభాగ
మును చేర అచట కంటక వృక్షములు దట్టముగా నుండుట
వలన ముండ్లు గ్రుచ్చుకొనగా దాని శరీరమునుండి రక్తము
కారజొచ్చెను ఆ సమయమున అనతిదూరమున సింహగర్జన
వినిపించెను. అరణ్యమున చిక్కుకుపోయిన ఆ గాడిద తనకు
అవసానకాలము సమీపించెనని భావించి ఏమిచేయుటకు
తోచక మెల్లగా ఆ గోతినుండి పైకి ఎగబ్రాకుటకు నిశ్చ
యించి రెండడుగులు ముందుకువేసెనో లేదో, సమీపముననే
యున్న ఒక తేనెతుట్టెకు దాని శరీరము తగులగా అది పగిలి
అందుండి తేనె కారజొచ్చెను. తమ నివాసమును గాడిద
విచ్ఛిన్నమొనర్చిన కారణముచే తేనెటీగలు దానిపై పగ
బూని దానిని చుట్టుముట్టి కుట్ట నారంభించెను. ఒకవైపు ముండ్ల
బాధ, మరియొకవైపు తేనెటీగలబాధ, వేరొకవైపు సింహము
యొక్క ఆగమనమును గూర్చిన భీతి - ఇవియన్నియు సతమత
మొనర్చుచున్నప్పటికిని ఆ సమయమున గాడిద తన తల
పైకెత్తి సాలుకబారి, కారుచున్న తేనెబొట్లను నాకదొడం
గెను 'ఆహా! విషయవ్యామోహమెంతటి బలవత్తరమైనది! —
అను యీ ఉపమానమును శ్రీ వసిష్ఠమహర్షి యీ క్రింది
శ్లోకముద్వారా శ్రీరామచంద్రునకు తెలియజేసెను.

సంతప్తోవంధలవ ప్రేషత్యుద్ధరకద్వరం
అకస్మాత్ప్రచ్యుత మధుబిందు ఘుక్కరబోయథా।

ఘోరారణ్యమున నానా బాధల నొందుచున్నప్పటికిని గాడిద తల్లపైకెత్తి తేనెబొట్టును నాకుచున్న చందమున మనుజుడు సంసారమున నానాయాతనల ననుభవించుచున్నప్పటికిని విషయలవలేశముకొఱకై పరుగులిడుచు అల్పవిషయానందము కొఱకై అఱ్ఱులుచాచుచు, దానినే యనుభవించుచు కాలక్షేపము చేయుచున్నాడు! అహా! ఎంత ఆశ్చర్యము!"

**నీతి** :— మనుజుడు అల్ప విషయ సుఖములకొఱకై జీవితమును ధారబోయక, వాటియెడల విరక్తి కలిగి, మనస్సును వానినుండి మరలించి, శాశ్వతమై పరిపూర్ణమైనట్టి ఆత్మానందమునే అన్వేషించి, దానిచే తనజన్మను ధన్యము గావించుకొనవలెను. విషయలంపటుడై చెడిపోరాదు. తన చుట్టునున్న సాంసారిక క్లేశములను అధిగమించుటకు ఆ దుఃఖములనుండి విడుదల పొందుటకు ఆత్మసాక్షాత్కార మొక్కటియే ఏకైక ఉపాయమని నిశ్చయించి అద్దానికొఱకే అహర్నిశములు పాటుపడవలెనే కాని క్షణిక సుఖములకొఱకై ప్రాకులాడరాదు.

‡‡ ‡‡ ‡‡

# ఉపనిషత్కథ

## రైక్వుడు

(ఈ రైక్వుని వృత్తాంతము ఛాందోగ్యోపనిషత్తునందు కలదు)

పూర్వము జానశ్రుతి అను రాజుండెడివాడు. అతడు మహా వృషమను రాజ్యమును పాలించుచుండెను. అతడు దయార్ద్రహృదయుడు, ధర్మయుక్తముగ ప్రజలను పాలించువాడు దానధర్మములు చేయుటయందతడు చాల పేరు బడసెను ఎన్నియో సత్రములను కట్టించెను. అనాథులకు, పాంథులకు వసతిగృహములను నిర్మించెను ఈ ప్రకారముగ ఆ రాజు లోకమున గొప్పకీర్తిని వహించెను.

ఒకనాటి సాయంసమయమున ఆ రాజు తన ప్రాసాదము యొక్క పైభాగమున విశ్రమించియుండ అతని నెత్తిపై ఆకాశమున రెండు రాజహంసలు అతి వేగముగ ఎగురుచు పోవుచుండెను. అవి పరస్పరము సంభాషించుకొనుచు ప్రయాణము సాగించుచుండ, రాజు ఆ పక్షుల వాక్యములను వినుచుండెను

అందు మొగపక్షితో ఆడపక్షి యిట్లనెను— "ఓయీ! ఈ జానశ్రుతి రాజునుండి ఆవిర్భవించుచున్న ప్రకాశవంతమగు జ్యోతిని నీవు చూడలేదా! దానిని దాటకుము. బాధ నొందెదవు. అతని కీర్తిరూపప్రకాశపుంజము లోకమున వ్యాపించియున్నది ఈకాలమున ఆ రాజువలె కీర్తి వహించినవాడు, దానధర్మములొనర్చినవాడు మఱియొకడెవడును లేడు". ఆ వాక్యములను

వినగనే ఆడపక్షి నవ్వి ఈ ప్రకారము వచించెను – "నన్నేల ఇవ్విధముగ భయపెట్టెదవు? మన మానసమున ఎగురువారము కావున లోకములో ఎచటెచట ఎవరెవరు మహనీయులున్నది, తక్కినవారికంటె మనకే బాగుగ తెలియును బండిక్రిందనున్న రైక్వునికంటె ఈతడేమి గొప్పవాడు? అతని కీర్తి చెంత ఈతని కీర్తి ఒక లెక్కలోనిదా? రైక్వుడు తన మహిమచేతను, తన ఆధ్యాత్మిక ఔన్నత్యముచేతను అనేకమంది ప్రజలను తన వైపునకు ఆకర్షించుకొనుచున్నాడు. అతడు పేరుప్రఖ్యాతులను కోరడు గొప్పవైరాగ్యముకలవాడు. నిరంతరమాత్మస్థితియందున్నవాడై గంభీరముగ వర్తించుచుండును." ఈ ప్రకారముగ ఆ రెండుపక్షులు తమలో తాము సంభాషించుకొనుచు ఎగిరిపోయెను.

ఇంతలో సూర్యుడస్తమింప రాత్రి ప్రవేశించెను. పక్షుల వాక్యములను వినిన జానశ్రుతి రాజునకు ఒకే కలవరము పుట్టెను. పక్షులు సూచించిన ఈ రైక్వు డెవడు? నా కంటె ఎంతయో కీర్తి ప్రతిష్ఠలను అధికముగ లోకమున అత డార్జించెననియు, అతడు గొప్ప మహిమాన్వితుడనియు ఈ పక్షులు చెప్పుచున్నవే! ఆ రైక్వుడెచట నున్నాడో కనుగొనవలెను, అందులకుపాయమేమి? మార్గమేమి? అని ఆలోచించుచు రాజు పరుండెను.

మరునాడుదయమున వందిమాగధులు ఉషఃకాలికగ రాజును స్తోత్రము చేయసాగిరి. అతడింద్రుడు, చంద్రుడు

అని కీర్తింపసాగిరి. ఆ వాక్యము లాతని కేమియు రోచకము లుగ గన్పట్టలేదు. తనకంటె గొప్పవాఁ డొకడుండ తన కేల ఈ ప్రశంసలని యతడు తలపోసి ఆ వందిమాగధులను వారించి, రైక్వుడను మహాత్ముఁ డెచట నున్నాఁడో? తన రాజ్యమంతయు వెదకి రమ్మని వారలను పంపెను. వారలట్లు వెడలి యూరూర ఎంత వెదకినను అట్టి మహనీయు డెవడును ఎచ్చటను గన్పట్ట కుండెను. రాజు మరల రెండవసారి వారలను పంపి గొప్ప అధ్యాత్మవిద్యాసంపన్నులు, బ్రహ్మజ్ఞానులు ఉండుచోట వెదకి రమ్మనెను. వారు పోయి మహావృష రాజ్యమందలి గ్రామ గ్రామము వెదకసాగిరి. అంతట ఒకానొక సుదూర గ్రామ మున ఒక బండిక్రింద ఒక మహనీయుడు కూర్చొనియుండు టను జూచిరి. అతడే రైక్వుడని తెలిసికొనిరి. పైకిచూచుటకు అతఁడొక సామాన్యవ్యక్తిగ కనుపించెను. అందువలన రాజ సేవకులు అతడే రైక్వుడని మొదట నమ్మలేదు. అయినను జనులందఱును పలుకు వాక్యములను విశ్వసించి వెంటనే రైక్వుని వృత్తాంతమును రాజుకడ కేగి విన్నవించుకొనిరి.

అంతట జానశ్రుతిరాజు పరమసంతోషమును బొంది ఆ మహాత్ముని సందర్శింపగోరి, ఆఱువందల చక్కటి పాడి యావులను, రథతురగాదులను, పెక్కు బంగారునాణెములను, సైనికులను, పరివారమును వెంటనిడుకొని రైక్వునియొద్దకు పయనమైరి. అచటికి వెళ్ళి ఆ మహనీయునకు నమస్కరించి,

చేతులు జోడించుకొని నిలబడి, తాను తెచ్చిన కానుకలను గ్రహింపవలసినదిగా వేడుకొని పూర్ణశాంతిగాందుటకు మార్గమును బోధింపవలసినదిగా ప్రార్థించెను. కాని రైక్వుడు ఆ రాజధనమును, ఆ పురస్కారములను జూచి ఏమాత్రము సంతోషించక పైపెచ్చు రాజుతో నిట్లనియె— "ఓయీ! ఏల ఈ పదార్థములన్నింటిని నా కొరకై వ్యర్థము చేయుచున్నావు? ఇవిగాని, వందలకొలది రాజ్యములు గాని, అధ్యాత్మ విద్యను కొనలేవు. దైవవిద్య, పరమార్థవిద్య, బాహ్యవస్తువులచే లభించునదికాదు. ఇది నా కవసరము లేదు. తీసికొనిపొమ్ము!"

ఆ వాక్యములను వినగనే రాజు పరమాశ్చర్యపడి, రైక్వునియొక్క గంభీరత్వమును, వైరాగ్యమును లోలోన కొనియాడి, బోధను, ఉపదేశమును బడయు వాలనందులకు చింతించి సపరివారముగ తన స్థానమునకు వెడలిపోయెను. రాజభవనమునకు వెడలినదిమొదలు తిరిగి ఆ బ్రహ్మజ్ఞుని దర్శింపవలెనను అభిలాష రాజునకు తీవ్రముగ కలుగుచుండెను. కొంతకాలమున కతడు మరల రైక్వుని యొద్దకు నిరాడంబరముగజని, ప్రణామమాచరించి అధ్యాత్మవిద్య నుపదేశింప వేడుకొనెను.

అపుడు రైక్వుడు రాజుయొక్క నిరాడంబరత్వమునకు, పరమార్థజిజ్ఞాసకు సంతోషించి ఈ ప్రకారముగ నతనికి

బోధించెను ఈ ప్రపంచమున ఆత్మయే సర్వశక్తులకు మూలము. సర్వదేవతలకు ఆధారము, సర్వపదార్థములకును అధిష్టానము. అభిమానము, గర్వము, డంబము మున్నగువానిని మనుజుడు వదిలివేసి విశుద్ధహృదయముతో అట్టి ఆత్మ నన్వేషింపవలెను. ఆత్మనెఱుంగువాడే సమస్తము నెఱుంగును సకలసుఖములను అనుభవించును! సద్గురువగు రైక్వుని యా దివ్యబోధనాలకించి, రాజు పరమానందభరితుడై తన రాజ్యమునకు వెడలి ఆ ప్రకార మాచరించి కృతార్థుడయ్యెను. రైక్వుడు వసించిన యా గ్రామము అప్పటినుండియు రైక్వపర్ణమని ప్రసిద్ధిజెందెను.

**నీతి :— సమస్త ప్రపంచమునకు ఆత్మయే ఆధారము. ఆత్మసాక్షాత్కారమే జీవుని ఏకైకలక్ష్యము.**



13)

## ఉపకారమే మానవుని స్వభావము

ఒకానొక గ్రామసమీపమున ఒక నది ప్రవహించుచుండెను. గ్రామస్థులనేకులు ఆ నదిలో నిత్యము స్నానమాచరించుచుండురు. ఒకనాటి ప్రాతఃకాలమున ఒక సాధువు ఆ నదిలో స్నానముచేయుట కేతెంచెను. అతడు పాదచారియై తీర్థయాత్రచేయుచు సరిగా ఆ దినమున తద్గ్రామసమీపమునకు వచ్చియుండుటచే స్నానార్థమానదిచెంతకు వచ్చెను. ఆ సమయమున గ్రామస్థులనేకులు ఆ నదిలో స్నానముచేయుచుండిరి.

సాధువు నీటిలో దిగగనే నదీప్రవాహములో ఒక తేలు కొట్టుకొనిపోవుచుండుట చూచెను. వెంటనే అతని హృదయము కరిగి దానినెట్లైనను కాపాడవలెనని తలంచి దానిని దోసిటితో పట్టుకొనెను. తక్షణమే ఆ తేలు సాధువును అంట బాధించెను. బాధకు తట్టుకొనలేక సాధువా తేలును నీటిలో విడిచిపెట్టెను నదీప్రవాహమున అది కొట్టుకొనిపోవుట చూచి సాధువు దయార్ద్రహృదయుడై దానిని రక్షింపనెంచి మరల దానిని రక్షింపనెంచి దానిని పట్టుకొనెను. కాని ఈ పర్యాయముకూడ అది కుట్టుటచే దానిని నీటిలో వదలివైచెను. కాని మూడవ పర్యాయము దానిని నెట్లైనను కాపాడనెంచి సాధువు నీటి ప్రవాహములో కొట్టుకొనిపోవుచున్న తేలును

బోధించెను ఈ ప్రపంచమున ఆత్మయే సర్వశక్తులకు మూలము. సర్వదేవతలకు ఆధారము, సర్వపదార్థములకును అధిష్ఠానము. అభిమానము, గర్వము, డంబము మున్నగువానిని మనుజుడు వదిలివేసి విశుద్ధహృదయముతో అట్టి ఆత్మ నన్వేషింపవలెను. ఆత్మనెఱుంగువాడే సమస్తము నెఱుంగును. సకలసుఖములను అనుభవించును! సద్గురువగు రైక్వుని యీ దివ్యబోధనాలకించి, రాజు పరమానందభరితుడై తన రాజ్యమునకు వెడలి ఆ ప్రకార మాచరించి కృతార్థుడయ్యెను. రైక్వుడు వసించిన యీ గ్రామము అప్పటినుండియు రైక్వపర్ణమని ప్రసిద్ధిజెందెను.

**నీతి :— సమస్త ప్రపంచమునకు ఆత్మయే ఆధారము. ఆత్మసాక్షాత్కారమే జీవుని ఏకైకలక్ష్యము.**



13)

## ఉపకారమే మానవుని స్వభావము

ఒకానొక గ్రామసమీపమున ఒక నది ప్రవహించుచుండెను. గ్రామస్థులనేకులు ఆ నదిలో నిత్యము స్నానమాచరించుచుండురు. ఒకనాటి ప్రాతఃకాలమున ఒక సాధువు ఆ నదిలో స్నానముచేయుట కేతెంచెను. అతడు పాదచారియై తీర్థయాత్రచేయుచు సరిగా ఆ దినమున తద్గ్రామసమీపమునకు వచ్చియుండుటచే స్నానార్థమానదిచెంతకు వచ్చెను. ఆ సమయమున గ్రామస్థులనేకులు ఆ నదిలో స్నానముచేయుచుండిరి.

సాధువు నీటిలో దిగగన్నే నదీప్రవాహములో ఒక తేలు కొట్టుకొనిపోవుచుండుట చూచెను. వెంటనే అతని హృదయము కరిగి దానినెట్లైనను కాపాడవలెనని తలంచి దానిని దోసిటితో పట్టుకొనెను. తక్షణమే ఆ తేలు సాధువును అంట బాధించెను. బాధకు తట్టుకొనలేక సాధువా తేలును నీటిలో విడిచిపెట్టెను. నదీప్రవాహమున అది కొట్టుకొనిపోవుట చూచి సాధువు దయార్ద్రహృదయుడై దానిని రక్షింపనెంచి మరల దానిని రక్షింపనెంచి దానిని పట్టుకొనెను. కాని ఈ పర్యాయముకూడ అది కుట్టుటచే దానిని నీటిలో వదలివైచెను. కాని మూడవ పర్యాయము దానినెట్లైనను కాపాడనెంచి సాధువు నీటి ప్రవాహములో కొట్టుకొనిపోవుచున్న తేలును

బోధించెను ఈ ప్రపంచమున ఆత్మయే సర్వశక్తులకు మూలము. సర్వదేవతలకు ఆధారము, సర్వపదార్థములకును అధిష్ఠానము. అభిమానము, గర్వము, డంబము మున్నగువానిని మనుజుడు వదిలివేసి విశుద్ధహృదయముతో అట్టి ఆత్మ నన్వేషింపవలెను. ఆత్మ నెఱుంగువాడే సమస్తము నెఱుంగును. సకలసుఖములను అనుభవించును' సద్గురువగు రైక్వుని యా దివ్యబోధనాలకించి, రాజు పరమానందభరితుడై తన రాజ్యమును వదలి ఆ ప్రకార మాచరించి కృతార్థుడయ్యెను. రైక్వుడు వసించిన యీ గ్రామము అప్పటినుండియు రైక్వపర్ణమని ప్రసిద్ధిజెందెను.

**నీతి .— సమస్త ప్రపంచమునకు ఆత్మయే ఆధారము. ఆత్మసాక్షాత్కారమే జీవుని ఏకైకలక్ష్యము.**



13)

## ఉపకారమే మానవుని స్వభావము

ఒకానొక గ్రామసమీపమున ఒక నది ప్రవహించుచుండెను. గ్రామస్థులనేకులు ఆ నదిలో నిత్యము స్నానమాచరించుచుందురు. ఒకనాటి ప్రాతఃకాలమున ఒక సాధువు ఆ నదిలో స్నానముచేయుట కేతెంచెను. అతడు పాదచారియై తీర్థయాత్రచేయుచు సరిగా ఆ దినమున ఆగ్రామసమీపమునకు వచ్చియుండుటచే స్నానార్థమానదిచెంతకు వచ్చెను. ఆ సమయమున గ్రామస్థులనేకులు ఆ నదిలో స్నానముచేయుచుండిరి.

సాధువు నీటిలో దిగగనే నదీప్రవాహములో ఒక తేలు కొట్టుకొనిపోవుచుండుట చూచెను. వెంటనే అతని హృదయము కరిగి దాని నెట్లైనను కాపాడవలెనని తలంచి దానిని దోసిటితో పట్టుకొనెను. తక్షణమే ఆ తేలు సాధువును అంటి బాధించెను. బాధకు తట్టుకొనలేక సాధువా తేలును నీటిలో విడిచిపెట్టెను. నదీప్రవాహమున అది కొట్టుకొనిపోవుట చూచి సాధువు దయార్ద్రహృదయుడై దానిని రక్షింపనెంచి మరల దానిని రక్షింపనెంచి దానిని పట్టుకొనెను. కాని ఈ పర్యాయముకూడ అది కుట్టుటచే దానిని నీటిలో వదలివైచెను. కాని మూడవ పర్యాయము దాని నెట్లైనను కాపాడనెంచి సాధువు నీటి ప్రవాహములో కొట్టుకొనిపోవుచున్న తేలును

మనగత్తి కొంబడించుచుండ, స్నానముచేయుచున్న వర్తకులు సాధువుయొక్క వింత చర్యలు చూచి అపహాస్యము చేయసాగిరి.

"ఓ సాధువుగారు! తేలు మీకు అపకారము చేసినది. ఒక పర్యాయము కాదు. రెండుసార్లు, ఈ ప్రకారముగ అపకారము చేసిన ప్రాణిని మీరేల అవస్థపడి కాపాడ దలంచుచున్నారు? మీమతి ఏమైన భ్రమించినదా?" అని ఆ వర్తకులు సాధువును ప్రశ్నింప సాధువు ఆ తేలు నట్లో కాపాడి తీరమునకు వచ్చి వారితో నిట్లనియె —

"నాయనలారా! నామతి ఏమాత్రము చెడలేదు, ఆ తేలు నాకొక పాఠమును బోధించినది. తేలుయొక్క నైజము అపకారము చేయుట. మనుజునియొక్క నైజము ఉపకారము చేయుట. తేలు తన స్వభావమగు అపకారమును వదలలేదు. అట్టిచో ఇక మనుజుడు తన స్వభావమును ఏల వదలవలయును? నైజగుణమును వదలరాదని తేలు తనచర్యద్వారా నాకు బోధించినది. కాబట్టి మనుజుడు తన ప్రేమస్వభావమును, తన పరోపకారభావమును ఏకాలమందును త్యజించరాదు.

"పరప్రాణులందు దయగలిగియుండుట, చేతనైనంత వరకు ఇతరులకు ఉపకారము, సహాయముచేయుట, దయార్ద్ర హృదయులై వర్తించుట, దయాదాక్షిణ్యములను మానవకోటికే కాక జన్తుకోటికికూడ విస్తరింప జేయుట — జనులు నేర్చుకొనవలెను. ఇదియే అనుష్ఠాన వేదాంతము. ఇదియే

వాస్తవదేవతార్చన. ఇదియే సర్వేశ్వరునకు పరమప్రీతికరమైన ధర్మము."

ఈ ప్రకారముగ ఆ సాధువు అచట చేరిన ఆశేషజనావళికి చక్కని హితబోధకావించి, వారలను ఆశ్చర్యభరితులుగను, ధర్మమార్గావలంబులుగను గావించెను.

**నీతి :— మానవుని స్వభావము ఉపకారమే కాని అపకారము కాదు. కాబట్టి చేతనైనంత వఱకు పరప్రాణికి మానవుడు ఉపకారమే చేయుచుండవలెను.**

## ## ##

## దృష్టిని పునీత మొనర్చుకొనవలెను.

పూర్వము తుకారాం అను పరమభక్తుడు కలడు. పండరినాథుడగు విఠల్‌దేవుని అతడు సదా కీర్తించుచుండెను. భజన, సంకీర్తన అనిన అతనికి పరమప్రీతి. 'జై విఠల్ జై విఠల్' అని నిరంతర మాతడు విఠల్‌నాథుని భజించుచుండెను అతడు గ్రామగ్రామమున సంచరించుచు ప్రజలకు భక్తిప్రబోధము గావించుచు నామస్మరణ, భగవత్సంకీర్తనాదులయొక్క మహిమను ప్రజలకు తేటతెల్ల మొనర్చుచు నుండెను.

ఒకనాడతడు ఒక గ్రామమునకు విచ్చేసెను ఆ గ్రామస్తు లందఱును అతనిని సగౌరవముగ ఆహ్వానించి ఆదరించి నాటిరేయి తుకారాంగారిచే సంకీర్తనమును ఏర్పాటు చేసిరి. తత్సంకీర్తనమును ఆలకించుటకు, భజనాదులందు పాల్గొనుటకు గ్రామములోనివారు పెక్కుమ వచ్చిరి. రాత్రి తుకారాం సంకీర్తనము ఆరంభించునరికి ప్రజలు కొన్ని వేలమంది హాజరై ప్రశాంతచిత్తులై, భగవన్నామామృతముయొక్క మాధుర్యమును గ్రోలుటకు ఉత్సుకతను ప్రదర్శించిరి. సభయంతయు పరమ ప్రశాంతముగ నుండెను. అత్తతి తుకారాం తన సంకీర్తనమును ఉపక్రమించెను.

జనులు ఆనందపరవశులగుచుండిరి. భగవన్నామమును బిగ్గరగ ఉచ్చరించుచు తుకారాం బ్రహ్మానందవారాశిలో నిమగ్ను డగుచుండెను. ఆ దృశ్యము వర్ణనాతీతము. ఈ ప్రకారముగ తుకారాం తన సంకీర్తనమును కొనసాగించుచుండ

ఇంతలో సమయము 11 గంటలు దాటినది. సభలో ఒక్కొ-
క్కరు లేచి తమ ఇండ్లకు పోసాగిరి. అర్ధరాత్రి యగుసరికి
సగముమంది లేచిపోయిరి. కాని తుకారాం అకుంఠితదీక్షతో,
భగవత్తన్మయత్వములో తన భజనను కొనసాగించుచునే
యుండెను. ఇంతలో తెల్లవారెను. అప్పటికి సభలోనివా
రందఱును స్థానమును విడిచి వెళ్లిపోయిరి. ఒక్కడు
మాత్రము కూర్చొనియే యుండెను.

తెల్లవారినపిదప తుకారాం తన సంకీర్తనమును విరమించి
కండ్లు తెఱచిచూచుసరికి అందఱును వెళ్లిపోయియుండుటయు
ఒక్కడుమాత్రము అచట ఆసీనుడై యుండుటయు గమనించెను.
వెంటనే తుకారాం ఆ కూర్చున్నవానిని తనయొద్దకు పిలిచి,
నాయనా! నీవు ధన్యుడవు! పుణ్యాత్ముడవు. ఏమియనిన;
గ్రామస్థులందఱును వెడలిపోయినప్పటికిని, భగవన్నామశ్రవణా
సక్తిచే నీ వొకడవు ఇచటనే యుంటివి సరియే కాని, క్రిందటి
రాత్రి నేను భజన చేయు సమయమున అర్ధరాత్రివేళ సాక్షాత్
పండరినాథుడగు విఠల దేవుడు నా ప్రక్కనే యుండి నాతో
బాటు నృత్యము చేసెను. నీవు చూచితివా? అని యడిగెను.
నేను చూడలేదని యాతడు ప్రత్యుత్తరించెను. నీ నేత్రముల
కేదైన వ్యాధియున్నదా యని యడిగెను. లేదనియు దృష్టి
చక్కగా నున్నదనియు అతడు జవాబొసంగెను. అట్టిచో నా
ప్రక్కనేయున్న పండరినాథుని అపుడు నీవేల చూడకుంటివి?
అసలు నీ వెందులకిచట కూర్చొనియున్నావు? అని తుకారాం

ప్రశ్నింప, అతడు 'తమరు కూర్చొనిన చాప నాది, తమరు లేచినపిదప దానిని తీసికొనివెళ్లు నిమిత్తమే ఇచట కూర్చొని యున్నాను' అని చెప్పెను.

అప్పుడు తుకారాం ఆశ్చర్యపడి అహా! జనులు ప్రపంచిక వస్తువులపై ప్రీతిచే ప్రత్యక్షముగనున్న భగవానుని కూడ చూడలేకున్నారు. ఈ గ్రామస్థుడు చాపపై ప్రీతిచే, 'చాప చాప' అని కలవరించుచు సాక్షాత్ దైవము ఎదుట పడినప్పటికిని చూడజాలకుండెను. ఎంత ఘోరము! ప్రాపంచిక దృష్టిచే దైవదృష్టి మూతపడిపోయెను" అని విస్తుపోయెను. మఱియు జనులకు ప్రాపంచిక పదార్థములపై గల ప్రీతిలో ఏ కొంత భాగమైనను దైవము యెడల నున్నచో వారెప్పుడును మోక్షము పొందియుండెడివారు అనియు తలంచెను.

[కాబట్టి 'జనులారా' దృష్టిని పవిత్ర మొనర్చుకొనుడు. నశ్వర పదార్థములపై ఆసక్తినిరగ్గించుకొని శాశ్వత పరమాత్మ యెడల ఆసక్తిని పెంపొందించుకొనుడు. భగవద్భక్తిని, వైరాగ్యమును అభివృద్ధి చేసికొనుడు' అని మహనీయులు ప్రబోధించుచున్నారు.]

నీతి :- దృష్టిని పవిత్ర మొనర్చుకొనవలెను. దైవదృష్టి, ఆత్మదృష్టి, విశాలభావము గలిగి యుండవలెను.

# దేవునకు ప్రథమస్థానము

## (GOD FIRST)

అదియొక మహాపట్టణము. పట్టణ మధ్యభాగమున పురపాలక మందిరము (Town Hall) కలదు. బ్రహ్మాండమైన సౌధమది. అందు తఱచు మహాత్ములయొక్క ఉపన్యాసములు జరుగుచుండును. ఆ పట్టణమునకు ఏ మహనీయుడు ఏతెంచినను వారి భాషణము అచ్చోటనే ఏర్పాటు చేయబడుచుండును. కొన్ని వందలమంది చక్కగ కూర్చొని వినుటను అచట అవకాశము కలదు.

ఒకనాడొక గొప్పతపస్వి, విద్యావంతుడు, ఆధ్యాత్మిక అనుభూతిని బడసినవాడు నగు మహనీయు డా పట్టణమునకు విచ్చేయ, ఊరి పెద్దలాతనిని గౌరవించి, ఆదరించి నాటి రేయి ఆ పురపాలక భవనమందు వారి ఉపన్యాసము నేర్పరచిరి. వారి భాషణమును వినుటకు ప్రజలు తండోపతండములుగ వచ్చిరి. విశాలమగు ఆ సభాభవనమంతయు జనులచే క్రిక్కిరిసి పోయెను. రాత్రి 7 గంటలకు వక్త ఇంగ్లీషులో తన ప్రసంగమును ప్రారంభించి సరిగా 8 గం॥లకు ముగించెను. ముగించుటకు ముందుగా అతడు శ్రోతలందరిని ఉద్దేశించి ఇట్లు పలికెను-

'ఓ ముముక్షువులారా! జిజ్ఞాసువులారా! మీరందఱును ఇపుడు శ్రద్ధాభక్తులతో కూడి ఒక గంటసేపు అనేక పారమార్థిక విషయములను గూర్చి వింటిరి. మీరందఱికీ అది

డన్నియు జ్ఞాపకమున్నవో లేవో నాకు తెలియదు. అయి
నను మీకొక్క అనుకూలముకొఱకై నే నిపుడు చెప్పిన
గంటసేపు ఉపన్యాసముయొక్క సారాంశము నంతను ఒక్క
వాక్యములో చెప్పెదను వ్రాసికొనుడు—' అని వచింపవెంటనే
సభలోనున్న వారందఱును తమతమ జేబులలోనున్న నోటు
పుస్తకములను, కలములను తీసి ఆ సారభూతమగు వాక్యమును
వ్రాసికొనుటకై సిద్ధపడిరి. అతడు ఏమి చెప్పునో యని ఒడ
లంతా చెవులుచేసికొని కాచుకొనియుండిరి. అపుడా ధర్మ
ప్రబోధకు డట్లు తన ఉపన్యాససారమును ఒక్క వాక్యములో
గంభీరముగ చెప్పివైచెను.

"God first, world next, myself last" 'మొదట
దేవుడు, పిదప ప్రపంచము, చివరికి నేను' దానియర్థమేమ
నగా—ప్రతిదినము నిద్రలేవగనే మొట్టమొదట దేవుని స్మరిం
పుము. ఆ పిదప లోకములో ఎవరికైన ఉపకారము చేయుము.
ఆ తరువాతనే నీ వ్యవహారము, నీ భోజనాదులు మున్నగు
వానినిగూర్చి పట్టించుకొనుము

ఈ చక్కనివాక్యమును ఉపన్యాసకుని ఆదేశము ననుస
రించి సభలోని వారందఱును శ్రద్ధతో వ్రాసికొని వారివారి
ఇండ్లకు వెళ్లిరి. కాని ఆ సభలో ఒక్కనియొద్దమాత్రము
పుస్తకముగాని, కలముగాని లేదు. అయినను ఇంటికి వెళ్లగనే
వ్రాసికొందునని తలంచి ఆ వాక్యమును దారిలో చక్కగ

మననము చేసికొనుచు పోవుచుండెను. కాని, అది యొక మహా పట్టణమగుటచే త్రోవలో బస్సులు, లారీలు, బండ్లు మున్నగు వానిని తప్పించుకొని పోవలసివచ్చుటచే అతని ఏకాగ్రత కుంటు పడుచుండెను తత్ఫలితముగ తాను విన్న వాక్యము World first, God next' myself last—' 'అని మననము చేయు చుండెను. తిరా, ఇంటికి చేరునరికి త్రోవలోని విక్షేపముల వలన చిత్తైకాగ్రత ఇంకను చెడిపోగా, పుస్తకము తీసికొని తాను విన్న వాక్యము Myself first, world next, God last—' నేను మొదట, ప్రపంచము తరువాత, దేవుడు చివరికి—' అని వ్రాసికొనెను.

ఇపుడు ప్రపంచములో పెక్కురు అజ్ఞానవశమున కట్టి నిర్ణయమే కలిగియున్నారు. ఉదయము నిద్రలేవగనే మొట్ట మొదట తన శరీరాదుల విషయమే పట్టించుకొనుచు దైవమును విస్మరించు చున్నారు. ఇది చాల ఘోరము. తన్ను సృష్టించి, పాలించి, పోషించునట్టి వృద్ధతపరమాత్మను మఱచి ప్రవర్తించుట భయంకర పాపము. (To forget God is sin.) కావున దైవమునకు తన నిత్య జీవితములో ప్రథమస్థాన మొసంగ వలెను. పురపాలక భవనములో ఉపన్యాసకుడు చెప్పిన అంతిమ వాక్యము —

God first, world next, myself last' "దేవుడు మొదట' ప్రపంచము తరువాత, ఆఖరికి నేను' చాల సారవంతమైనది.

కావున ముముక్షువులెల్లరు ఆ కార్యమును కంఠస్థముచే, అర్థమును మననము చేయుచు నిత్యజీవిత వ్యవహారము(ల) అద్దానిని కార్యాన్వితి మొనర్చుచు నుండవలెను. ఈ ప్రకారముగ భగవదాశ్రియము వలనను (God first) లోకోపకారము వలనను (World next) దేహాభిమాన రాహిత్యమువలన (Myself last) మానవునకు మహత్తరశ్రీయ మొనగూడగల(దు).

నీతి :— జీవిత కార్యములలో, దైనందిన వ్యవహారములలో భగవంతునకు ప్రథమస్థాన మొసం(గ)వలెను.

## ## ##

# అంధపరంపర

ఒకనాటి చంద్రగ్రహణసమయమున సముద్రస్నానమాచరించుటకై వేలకొలది జనులు సముద్రతీరమున చేరిరి. కొందరు స్నానమాచరించుచుండిరి. మరికొందరు ఒడ్డున తిరుగాడుచుండిరి. సముద్రతీరమంతయు జనసందోహముచే కోలాహలముగ నుండెను. ఆ సమయమున నొకానొక సాధువు స్నానార్థమేతెంచి ఒడ్డున నిలబడి ఏదియో ఆలోచించుచుండెను అతనియొద్ద ఒక,, రాగికమండలువు ఉండెను. దానిని చేత గైకొని నీళ్ళలో దిగినచో తరంగముల తాకిడికి అది కొట్టుకొనిపోవచ్చును. పోనిండు, ఒడ్డున ఎచ్చటనైన ఉంచెదమా యనిన, స్నానముచేసివచ్చులోపల దానిని నెవ్వరైన ఎత్తుకొనిపోవచ్చును. ఈ డోలాయమానపరిస్థితులలో ఆ సాధువు ఆచ్చోట స్నానముచేయుట కియ్యకొనక, దూరముగపోయి, సముద్రపుటొడ్డున ఎవరును లేనిచోటును చేరుకొనెను. అచ్చోట తీరమున ఒక చిన్నగోతిని త్రవ్వి అందులో తన రాగిచెంబును ఉంచి దానిపై ఇసుకతో ఒక కుప్పచేసి స్నానము చేయుటకు పోయెను.

సాధువుగారు తానుచేసినపని ఎవరును చూడలేదని భావించి సంతుష్టుడయ్యెను. కాని దూరమునుండి ఒకవ్యక్తి అదియంతయు గమనించుచుండెను. ఆ వ్యక్తి తనలో ఇట్లు వితర్కించుకొనును—"సాధువు సామాన్యుడు కాడు. ఎంతయో తపస్సు చేసిన మహాత్ముడు. ఎన్నియో శాస్త్రములను తిరుగ

చేసినవాడు. అట్టివాడు ఏదిచేసినను ప్రమాణపూర్వకముగనే చేయును. చంద్రగ్రహణ సమయమున సముద్రతీరమున ఇసుకలో శివలింగము చేసినచో ఏదియో గొప్ప పుణ్యము ఉండును గనుకనే ఈ గ్రహణసమయమున అతడు లింగమును నిర్మించెను. మఱియు అతడు లింగమును నిర్మించినస్థలమున్న ఏదియో మహిమతో కూడియుండును. లేనిచో ఆ చోటునే లింగనిర్మాణమున కాతడెందులకు ఎన్నుకొనియుండును? కాబట్టి ఆ పుణ్యభాగ్యమును నేనును పొందెదను" అని తలంచి ఆ లింగముప్రక్కన అదే కొలతతో నతడు మఱియొక లింగమును ఇసుకతో చేసి స్నానముచేయుటకు వెడలెను.

ఇంతలో మఱియొకడు దానిని చూచి గ్రహణసమయమున ఆ పుణ్యమును తా నెందులకు పోగొట్టుకొనవలెనని తలంచి దాని ప్రక్కన ఇంకొక లింగమును చేసెను. ఈ ప్రకారముగ ఒకరిని చూచి మఱియొకరు ఆ సముద్రమున ఇసుకతో లింగములను చేయ మొదలిడిరి. సాధువుగారు స్నానము చేసి తిరిగి వచ్చుసరికి అచట కొన్నివందల లింగములు ఏర్పడి యుండెను. ఇక తన రాగి చెంబు ఏలింగములో ఉన్నదో అతనికి అంతుపట్టలేదు. ఆశ్చర్యచకితుడై, జనులయొక్క అంధపరంపరనుగూర్చి ఖేదముొంది ఆకడి శ్లోకమును చెప్ప దొడగను—

**గతానుగతికో లోకో న లోకః పారమార్థికః**
**పేతా సైకతలింగేన వినష్టంతామ్రభాజనమ్.**

అనగా, జనులలో పెక్కురు యుక్తాయుక్తములను విచారించక గుడ్డిగా పను లాచరించుచుందురు. ఒకరుచేసిన పని ఎందుకాఅని ఆలోచించకనే వారు చేసిన దానిని అనుకరించుచుందురు. ఏదియెట్లున్నను సముద్రస్నానమునకు వచ్చిన ఇసుకకుప్పను చేయుట వలన నా రాగిచెంబు గల్లంతు అయినది అహా! జనులది ఎట్టి అంధపరంపర' అని వాపోవదొడగెను.

అదేవిధముగ, జనులలో పెక్కురు తమ పూర్వీకులు ఏ ప్రకారము బహిర్ముఖదృష్టికలవారై, ప్రపంచవ్యవహార నిమగ్నులై, దృశ్యవ్యామోహమునబడి కొట్టుకొనిపోయిరో, ఆ ప్రకారము తామున్ను ఆచరించుచున్నారే కాని 'తా మెవరు? తమ నిజస్వరూపమేమి, ఎచ్చటనుండి వచ్చినారు. ఎచటికి పోవలెను, జీవితపరమావధియేది' అని పరమార్థమును విచారించువారు చాల అరుదు. కనుక అట్టి అంధపరంపరను విడనాడి జగద్వ్యవహారములతో బాటు తా నెవరో, జగత్తేమియో, దైవమును పొందుటెట్లో చక్కగ విచారించి, మానవజీవితమును సార్థక మొనర్చుకొనుట శ్రేయస్కరము.

**నీతి:—దేనినిగ్రుడ్డిగా అనుకరించగూడదు. అది యుక్తమా? అయుక్తమా అని వివేకముతో యోచించవలెను.**

# రిక్త హస్తములు

పూర్వము గ్రీసుదేశమున అలెగ్జాండరు అను గొప్ప రాజు కలడు. అతడు తన శౌర్యధైర్య పరాక్రమములచే పెక్కు పరిసర రాజ్యములను జయించి తదుపరి ఆసియాదేశముపై దండెత్తెను. ఆసియా ఖండమునగూడ అనేక రాజ్యములను కొల్లగొట్టి, ధనమంతయు దోచుకొని, తాను సంపాదించిన యా సిరిసంపదలను, సువర్ణంబును, రత్న రాసులను గోనెలందు, పెట్టెలందు పైచికొని తిరిగి తన స్వస్థానమగు పశ్చిమ దేశమునకు పయనమయ్యెను.

పూర్వకాలమున రైలుబండ్లుగాని, విమానములుగాని లేవు. కావున గుఱ్ఱములపై ఏనుగులపై ఆ సామగ్రినంతను మెల్లగ తరలించుకొని పోవుచుండెను. అక్కడక్కడ కొన్ని మజిలీలు ఏర్పాటుచేసికొని మంత్రులు, సైనికులు మొదలైన వారు వెంటరాగా కొన్ని గుడారములు వేసికొని మార్గమధ్యమున సేదదీర్చుకొనుచు అలెగ్జాండరు విజయోత్సాహములతో స్వదేశమునకు చనుచుండెను.

ఇట్లుండ ఒకనాడు అలెగ్జాండరు చక్రవర్తికి ఆరోగ్యము క్రమముగ క్షీణింపదొడగెను. అత్తరి అందఱును ప్రయాణ కార్యక్రమమును నిలిపివైచి తమ ప్రభువుయొక్క స్వాస్థ్య విషయముందే దృష్టిని నిలిపి అతనికి ఆరోగ్యము కలుగుటకై పరిపరివిధముల ప్రయత్నములు చేయదొడంగిరి. గొప్ప గొప్ప

వైద్యులను పిలిపించిరి. పేరుగొన్న హకీములను రప్పించిరి. ఒక వైద్యమేమి, అన్నిరకముల వైద్యములను చేయించిరి. అన్ని మందులను వాడిచూచిరి. కాని విధి బలీయమైనది. ఎంతటి రాజాధిరాజైనను తన కర్మఫలితమును అనుభవించక తీరదుకదా!

రాజుగారికి శరీరములో ఉష్ణము ప్రబలుచుండెను. వైద్యులు నిరాశను ప్రకటింపసాగిరి. మంత్రులు, సామంతులు కింకర్తవ్యవిమూఢులై ఏమిచేయుటకు తోచక రాజా చెంత తదేకదృష్టితో నిలబడియుండిరి. ఇక అవసానకాలము సమీపించినదనియే అందరును తలంచిరి. ఆ రాత్రి అలెగ్జాండరు తన మంత్రులను దగ్గరకు పిలిచి ఈ ప్రకారముగ వారల నాదేశించెను — ఓ మంత్రులారా! నా ఆరోగ్యము దినదినము క్షీణించుచున్నది. మీరు నావిషయమై చేయవలసిన కార్యము లన్నిటిని చక్కగా చేయుచున్నారు. కాని నా కర్మఫలితము మఱియొక విధముగ నున్నది. జరుగవలసినది జరిగియే తీరును. ఇక నే నెక్కువదినములు జీవించు ఆశ లేదు. కఫవాతపిత్తములు నా దేహము నాక్రమించి స్మృతిజ్ఞానము లోపింపకపూర్వమే మీకొక చిన్నసలహా చెప్పదలంచినాను.

ఏమనగా, 'ఈ శరీరమునుండి ప్రాణవాయువు వెడలి పోయిన వెంటనే సంప్రదాయానుసారము దీనిని ఒకపెట్టె (Coffin) లో పెట్టి స్మశానమునకు తీసికొనివెళ్ళి మీరు ఖన

నము చేయుదురు. నేను మహారాజును కాబట్టి సామాన్య మానవునివలె కాక పెద్ద ఆటోపముతో ఈ శరీరమును ఊరేగించుచు శ్మశానమునకు తీసికొని పోవుదురు. ఆ విషయము నాకు ముందుగనే బాగుగ తెలియును. అయితే నేను మీకు చెప్పవలసినది ఏమనగా, నా మృతశరీరమును ఉంచునట్టి పెట్టెను తయారుచేయించునపుడు అందు చేతులు పెట్టుచోట రెండు పెద్ద రంధ్రములను ఏర్పాటుచేయుడు.

ఆ వాక్యములను వినగనే మంత్రులు సంభ్రమచిత్తులై ఏ కారణముచే రాజిట్లు నుడువుచున్నాడో తెలియక, తికమక పడుచుండిరి. 'పెట్టెలో ఆ ప్రకారముగ రంధ్రములు ఏర్పాటు చేయుడని చెప్పుటలో గల అంతర్యమేమి ? దీనియందేదియో గొప్పకారణ ముండియుండవలెను. ఆ కారణమును ప్రభువు జీవించియున్నపుడే అతనివలన మనము తెలిసికొనుటయుత్తము' అని మంత్రులందరు యోచించుకొని ఎట్టకేలకు ధైర్యము వహించి అలెగ్జాండరు చక్రవర్తిని సమీపించి యిట్లడిగిరి—

మహాప్రభో ! ఇంతవరకు చరిత్రలో కని విని యెరుంగని విశేషమును తాము సెలవిచ్చితిరి. ఎవ్వరైనను చనిపోయినచో ఒక పెట్టెలో పరుండబెట్టి శ్మశానమునకు తీసికొనిపోవుదురు. అంతియేకాని ఆ పెట్టెకు చేతులయొద్ద రంధ్రములు వేయించరు. కాని తాము రంధ్రములు వేయించులాగున

చెప్పితిరి. ఇదియొక అపూర్వవిషయము. అట్లెందులకొన
ర్చితిరో సెలవియ్య ప్రార్థన.

మంత్రుల ఆ వినయాన్విత వాక్యములను విని అలెగ్జాండ
రిట్లు ప్రత్యుత్తర మొసగెను —

'ఓ మంత్రులారా! ప్రయోజనము లేక ఎవరును ఏ
కార్యమును చేయుట కుపక్రమింపరు. నేను మృతినొందిన
వెనుక మీరు నన్ను పెట్టెలో పరుండబెట్టి మూతవేసి ఊరే
గించెదరు. వేలకొలది జనులు ఆ ఊరేగింపును తిలకించెదరు.
శ్మశానమువఱకు కోలాహలముగానుండును. పెట్టెలో నన్ను
పరుండబెట్టి ఊరేగించునపుడు చేతులుండుచోట పెట్టెకు రంధ్ర
ములున్నచో ఆ రంధ్రములలోనుండ నా చేతులు బయటకు
వచ్చి వ్రేలాడును. ఇంతవఱకు జనులలో గొప్ప అపోహ
ఒకటి వ్యాపించియున్నది. అదియేదనగా, దేశదేశములలో
అలెగ్జాండరు కొల్లగొట్టిన ధనమునంతను పరలోకమునకు తీసి
కొని వెళ్ళుచున్నాడేమో యని జనులు తలంచుచున్నారు.
అట్లేమియు తీసికొనివెళ్ళుట లేదని నేను వారికి ఋజువుపఱచ
వలసియున్నది. నా చేతులు బయటకు కన్పించినచో ఆ రిక్త
హస్తములనుజూచి జనులందఱును — 'ఓహో! అలెగ్జాండరు
ఒట్టిచేతులతోనే పరలోకమునకు పోవుచున్నాడే! కాని ధనమును,
సంపదను వెంటగైకొని వెళ్లుట లేదు. కోట్లకొలది ధనరాసులను,
వజ్రవైడూర్యములను జీవితములో సంపాదించినప్పటికి అంత్య

కాలములో, పరలోక ప్రయాణకాలములో ఒక్క చిల్లి గవ్వైనా వెంటతీసికొని వెళ్లుటలేదు—(Alexander is passing away with empty hands) అని నిశ్చయించుకొనగలరు. ఈ ప్రకారము సత్యము నవగతి మొనర్చుకొని వారు జీవితమును నా వలె ధనకనకవస్తువాహన రాజ్యాదివిభవములందు ధార పోయక సత్యవస్తు సంపాదనమున వినియోగించగలరు"—

ప్రభువుయొక్క ఆ వాక్యములను శిరసావహించి మంత్రులాదులు కొద్దిరోజులలో సంభవించిన అలెగ్జాండరు మరణానంతరము ఆ ప్రకారమే చేసిరి. అలెగ్జాండరు తన యీ చర్యద్వారా లోకమునకొక గొప్ప నీతిని బోధించెను. భౌతిక సంపదఏదియు జీవునకు శాశ్వతముకాదని అతడు ప్రపంచమునకు చాటెను. కావున జనులు సావధానచిత్తులై తమకు శాశ్వతముగ ఉపకరించునట్టి సత్యదయాధర్మములను చేపట్టి, అసత్యములగు దృశ్యపదార్థములందు విరక్తిని, శాశ్వతమగు దైవమందు ఆసక్తిని కలుగజేసికొని జీవితమును ధన్యమొనర్చుకొందురుగాక!

**నీతి :— మరణించునపుడు ప్రాపంచిక పదార్థమేదియు మనుజుని వెంటరాదు. కాబట్టి విషయభోగములయెడల విరాగము కలిగి వెంటవచ్చు పుణ్యమును అధిక మొనర్చుకొనవలెను.**

# కనువిప్పు

దాదాపు అరువది సంవత్సరముల క్రిందటిమాట. గుజరాతు ప్రాంతమందలి ఒక విద్యార్థి విశ్వవిద్యాలయమందు పట్టభద్రుడై ఉన్నత విద్యకొఱకై పశ్చిమదేశమునకు వెళ్ళెను. అతడు చాల చురుకైన విద్యార్థి. ప్రతి తరగతి యందును తక్కిన విద్యార్థులందరికంటెను ఎక్కువ మార్కులు సంపాదించుచుండెను. అందువలన గవర్నమెంటువారు ఉచితవేతనమును (Scholarship) ఇచ్చి ఐ. సి. ఎస్ (I C S) అను పెద్ద పరీక్ష కొఱకు చదువుటకై లండన్ పట్టణమునకు అతనిని పంపిరి. అతనిపేరు త్రివేది. గుజరాతుప్రాంతంలోని వారిపేర్లు ద్వివేది, త్రివేది, చతుర్వేది—అని ఈ ప్రకారంగా తరచు ఉండుచుండును. ఆ త్రివేది అను విద్యార్థి ఉన్నతపరీక్ష కొఱకై చక్కగ చదివి, పరీక్ష వ్రాసి, ఆ లండన్ పట్టణమందు, తత్పరిసరమందు చూడవలసిన విశేషస్థలము లన్నిటిని చూచి తిరిగి భారతదేశమునకు పయనమగుటకు సంసిద్ధుడగుచుండెను.

ఆ కాలమున లండన్ పట్టణమున ఒక మహావిద్వాంసుడు, ప్రజ్ఞాశాలి, అద్భుతశీలసంపన్నుడు, తపస్వి అయిన ఒక మహానుభావుడు నివసించుచుండెను. అతనిపేరు మాక్స్ముల్లరు (Maxmuller), అతని పవిత్రతనుజూచి మోక్షముల్లరు అని కూడ కొందరు పిలుచుచుందురు. వివేకానందస్వామి అతని గుణగణము ను విని నేరులో వారిని సందర్శించి, వారి

ఔన్నత్యమునకు, తపశ్శక్తికి అచ్చెరువొంది యుండెను. మాక్సుముల్లరు వేదములన్నిటిని ఇంగ్లీషుభాషలోనికి అనువదించెను. పైన తెలిపిన త్రివేది అను విద్యార్థి తన విద్యాభ్యాసంగమును పూర్తిచేసికొని భారతదేశమునకు తిరిగివచ్చు తరుణమున, మిత్రుడొకడు మాక్సుముల్లరుయొక్క ఖ్యాతిని గూర్చి అతనికి వివరించిచెప్పి, వారిని తప్పక దర్శించి పోవుట శ్రేయస్కరమని సలహా నొసంగెను.

అట్లే ఆ విద్యార్థి మాక్సుముల్లరుగారిని దర్శించుటకై వారి గృహమునకేగెను. అట్లు వెడలి, ఇల్లు చేరగనే తన పేరు ఒక చీటిపై వ్రాసి దర్శనమునకు అనుమతించవలసినదిగ కోరి దానిని గేటువద్దనున్న సేవకునకు ఇచ్చి లోనికి పంపెను అదే సమయమున మాక్సుముల్లరు ఇంటిలోపల తనగదిలో కూర్చుండి యజుర్వేదముయొక్క అనువాదమును ఇంగ్లీషులోనికి గావించుచుండిరి. అపుడొక కఠినమైన సంస్కృతపదము వారికి సందర్భించగా, దాని సరియైన ఇంగ్లీషు పదమేదియోయని దీర్ఘముగ విచారించుచుండిరి. ఎంత విచారించినను, వారికి ఆ సంస్కృతపదముయొక్క అర్థముగాని, దానికి సరియైన ఇంగ్లీషుపదముగాని స్ఫురణకు రాకుండెను. అయ్యవసరమున నతడు తన మనంబులో నిట్లు భావించుకొనుచుండెను— భారతదేశము వేదములకు పుట్టినిల్లు. అచట వేదశాస్త్రములను క్షుణ్ణముగ తెలిసిన విద్వాంసులెందరో ఉందురు. వేదముల

లోని ప్రతి పదమునకు అర్థమును వారు వివరించి చెప్పగలరు. అయితే వారి సహాయము ఇపుడు నాకెట్లు లభించగలదు! దాదాపు నాలుగువేలమైళ్ళ దూరమునయున్న భారతదేశవాసులలో నాకిపుడు సంబంధమెట్లు కలుగగలదు! వేదాధ్యయన కుశలురగు పండితు లెవరైన భారతదేశమునుండి ఇచ్చోటికి వచ్చినచో ఈ సమయమున నాకెంత మేలుకలుగును! నా అనువాదము నిరాటంకముగ సాగిపోవునుగదా! కాని ఇది అంతయు నా ఊహాప్రపంచము. ఎక్కడ భారతదేశము! ఎక్కడ లండన్ పట్టణము!—

అని ఈ ప్రకారముగ ఋషివర్యులగు ఆ మాక్సుముల్లరు తలపోయుచుండగా ఇంతలో సేవకుడొకడువచ్చి ఒక చీటితెచ్చి వారికిచ్చెను. ఆ చీటిలో ఇట్లు కలదు. 'Trivedi from India has come for interview'— "భారతదేశమునుండి త్రివేది అను వారు శ్రీవారిదర్శనమునకై వచ్చిరి"—ఆ వాక్యములను చదువగనే మాక్సుముల్లరుగారికి పరమానందము కలిగెను. ఒడలంతయు గగుర్పాటు చెందెను. "ఓహో! 'త్రివేది'— అనగా మూడువేదములను చదివినవారెవరో ఇచటికి వచ్చినారు! ఒక వేదమేకాదు, మూడువేదములు.— నా అదృష్టము పండినది. చక్కని ఘనపాఠీ భారతదేశమునుండి ఇచ్చటకు వచ్చినాడు. అతనివలన నా సంశయము తీర్చుకొందును! అని తలంచి వెంటనే వారిని లోనికి తీసికొనిరావలయునని సేవకునకు

ఆజ్ఞాపించెను. త్రివేది లోనికిరాగానే వారికి సముచిత ఆసన మొసంగి గౌరవించెను. అపుడు వారిరువురకును ఈ క్రింది సంభాషణము జరిగెను.

మాక్స్ ముల్లరు . మీరెవరు ?

త్రివేది ; నేను భారతదేశమునుండి ఐ. సి. ఎస్. పరీక్షకొఱకై చదువులకు లండన్ వచ్చిన విద్యార్థిని.

మా . మీరు నాయొద్దకు వచ్చిన పనియేమి ?

త్రి : మా పరీక్షలు పూర్తిఅయినవి. తిరిగి భారతదేశమునకు పోవుచున్నాను. తమకీర్తి విని తాము భారతావనికి పరమ ఆప్తులని తెలిసికొని తమదర్శనము చేసికొని వెళ్లుటకై వచ్చినాను.

మా ' ఇపుడు స్వదేశమునకుపోయి మీరేమి చేయుదురు ?

త్రి : నేను చదివిన పరీక్ష చాలపెద్దది (I. C S). అందు ఉత్తీర్ణుడను కాగానే ప్రభుత్వమువారే నాకొక పెద్ద ఉద్యోగమును కల్పించెదరు.

మా : ఉద్యోగము వచ్చినపిదప మీరేమి చేసెదరు ?

త్రి . నా విధులను సక్రమముగ నిర్వహించుచు ప్రభుత్వము వారిచ్చు నెలకు వెయ్యిరూపాయల జీతముతో నా జీవితమును హాయిగా గడుపుదును.

మా : తరువాత ఏమిచేసెదవు ?

శ్రీ : వివాహము చేసికొందును.

మా : తరువాత ?

శ్రీ : ఇక తరువాత చెప్పవలసిన పనియేమి ? ఒకటి, రెండు, మూడు.. ఇంటినిండా సైన్యం.

మా : ఓహో ! సంతానమా ! సరే, తరువాత ?

శ్రీ : పిల్లలు, నేను, నా సంసారము, నా ఆనందము !—జీవితమును హాయిగా వెళ్ళబుచ్చెదను.

మా : తరువాత ?

శ్రీ : తరువాత కొంతకాలమునకు నా వయః పరిమితి 55 సం॥ కాగా; ఉద్యోగమునుండి రిటైర్ అగుదును.

మా : తరువాత ?

శ్రీ : తరువాత ఇక ఏమియు పనిఉండదు కావున తీరికగా కాలం గడుపుదును.

మా : తరువాత ?

శ్రీ : వృద్ధుడనగుదును.

మా తరువాత ?

త్రి. చనిపోవుదును.

మా : తరువాత ?

త్రి. మహాప్రభో! ఆ తరువాత విషయము నాకు తెలియదు క్షమింపుడు.

మా మీరెవరో అంతయు తెలిసినవారని నేను మొదటిలో ఊహించితిని, భారతదేశమునుండి వచ్చినవారు కాబట్టి ప్రాచీన సంస్కృతి బాగుగ ఎఱిఁగియుందురని భావించితిని. త్రివేది అనుపేరు వినగానే మూడు వేదములును మీకు కంఠస్థములై యుండునని తలంచితిని తీరా విచారించునరికి భారతీయ వేదాంతవాఙ్మయమంతా మీ... కేమాత్రము పరిచయముగాని, అనుభవముగా ఉన్నట్లు కనిపించలేదు.

మహాశయా! ఒక్కమాట వినుడు. జీవించియున్నపుడు మానవుడు అనుభవించు భోగభాగ్యములుగాని, ప్రాపంచిక విలాసములుగాని, ఐశ్వర్యములుగాని, గొప్పకావు. మరణించిన వెనుక తానేస్థితిని బొందునో, తనయొక్క స్వరూపమేవాస్తవముగ నట్టిదో, దానిని తెలిసికొనుటయే గొప్పవిషయము తాను మరణించువాడు కాదనియు,భౌతిక స్వరూపముతోగా

నామరూపాత్మకమగు దృశ్యముతో గాని తన కేలాటి సంబంధము
లేదనియు, తాను నిత్యశుద్ధ బుద్ధముక్తమగు ఆత్మస్వరూపుడని
యెరుంగుటలోనే మానవుని మానవత్వ మిమిడియున్నది.
మానవుడు జీవించునది ఇట్టి ఆత్మవిజ్ఞానము తెలిసికొనుట
కొరకే. ఇట్టి స్వరూపానుభూతిని బడయుటకొఱకే జీవి
యున్నది. కావున మీ రే యుద్యోగమును చేసినను ఏ రంగ
మున పనిచేసినను, దీనిని మీరు తెలిసికొనుట చాల
ఆవశ్యకము. తాను నాశరహితమగు ఆత్ముడని ఏ క్షణమున
మానవుడు తెలిసికొనునో, ఆ క్షణముననే తన జన్మసార్థకమైన
దని యతడు తలంపవలెను. జీవితలక్ష్యమగు ఆత్మసాక్షాత్కార
మును మనుజుడు ఎంత శీఘ్రముగా బడయగల్గునో అంత
ధన్యుడు కాగలడు. కాబట్టి మీ లౌకికజీవనముతో బాటు
పారమార్థిక విజ్ఞానమునుగూడ అభివృద్ధిపరచుకొనుడు. మీ
పూర్వీకులగు మహాత్ములయొక్క పవిత్రరక్తము మీలో ప్రవ
హించుచున్నది. ఈ సత్యమును మీ రేనాటికిని మఱువకుడు.
మీరు మహర్షులయొక్క సంతానమను విషయమును ఎన్న
డును విస్మరింపకుడు !

మాక్స్‌ముల్లరుయొక్క ఆ గంభీరవిజ్ఞానపరిపూర్ణములగు
వాక్యములను వినగనే భారతవిద్యార్థియొక్క హృదయము
నందు ఆధ్యాత్మికస్పందనము మెఱుపువలె ఒక్క పర్యాయ
మావిర్భవించెను. అతడు తన భావిజీవితమునుగూర్చి తీవ్రముగ

పర్యాలోచింపసాగెను. ఋషివర్యుని వాక్యములచే అతనికి కనువిప్పు కలిగెను. అప్పటినుండియు అతడు దైవదృష్టిని చక్కగ అలవఱచుకొని జీవితమును సద్వినియోగపరచుకొనెను.

**నీతి :—** అశాశ్వతపదార్థములకై జీవితమును ధారవోయక శాశ్వతపరమాత్మకొఱకే యత్నించి జీవితమును సార్థక మొనర్చుకొనవలయును.

\# \# \#

# ప్రాపంచిక వైభవములు క్షణికములు

పూర్వం మొకానాక దేశమున ఒక మహారాజు కలడు. అతడు తాను, తన పరివారమును నివశించుటకై గొప్పగొప్ప హార్మ్యములను, లావణ్యము తొణికిసలాడు సుందరభవనములను పెక్కింటిని నిర్మింపజేసికొనెను. వందలకొలది పరిచారకులు, రాజప్రాసాదములందు సేవకై వినియోగింపబడిరి. ఆ రాజు తనయొక్క కీర్తిని, వైభవమును తలంచుకొనుచు, ఇతరులకు చెప్పుకొనుచు విఱ్ఱవీగుచుండెను. తన్నుమించినవాడు త్రిభువనములం దెవడును లేడను అహంభావము గలిగియుండెను. ప్రజలందఱును తన అదుపు ఆజ్ఞలకు లోబడియుండుట చూచియు, తన పలుకుబడి దేశదేశములందును వ్యాపించియుండుట గాంచియు తన మహోన్నత రాజపదవిని తలంచుకొని ఉబ్బిపోవుచుండెను.

ఇట్లుండ కొంతకాలమునకు రాజుగారి దేహమునకు ఏదియో రుగ్మత సంభవించెను. సాధారణముగ జన్మాంతర సుకృతఫలితముచే జనులకు ఆరోగ్యాది అనుకూలపరిస్థితులును దుష్కృతఫలితముచే రోగాది ప్రతికూలపరిస్థితులును తటస్థించుచుండును. ఆరోగ్యము చెడుటవలన రాజుగారికి స్వాస్థ్యమును చేకూర్చుటకై పెద్దపెద్ద వైద్యులు రప్పించబడిరి. చేయవలసిన ప్రయోగములన్నియు చేయబడినవి. కాని రోగము తగ్గకపోగ దిన దినము ప్రవర్ధమానమగుచుండెను. రాజుగారి శాతి

కాయము నానాటికి కృశించి పోవుచుండెను. అట్టి పరిస్థితిల
ఆ నృపాలుని ధనముగాని, బంధువులుగాని, పరివారముగా
సేవకులుగాని, మైత్రిగాని, ప్రతిష్ఠగాని, అతని దేహస్వాస్థ్యము
కాపాడలేకపోయెను. తుట్టతుదకు ఆ భూపాలుని శరీరము ఒ
కంకాళముగా మారిపోయెను. శ్వాసపీల్చుటకుకూడ రాజున
కష్టమైపోయెను. ఈ ప్రకారముగ ఆ భూపాలుడు బహుకాలమ
దుర్భర వేదన అనుభవించి ఒకనాటిరేయి బంధుగులందఱు
చుట్టుముట్టి ఏడ్చుచుండ తన భౌతిక దేహమును పరిత్యజించెను

అపుడు మంత్రులందఱును సమావేశమై రాజున
చేయవలసిన అంత్యక్రియలకొఱకు ఏర్పాట్లను సన్నాహములు
కూర్చిచర్చించిరి. తక్షణమే నిపుణులను రప్పించి ఒక బ్రహ్మాం
మైన చప్పరమును కట్టించిరి. దానిని సర్వవిధముల పుష
మాలలచే అలంకరించిరి. మఱునాడుదయమున రాజుగా
శవమును దానిలోనుంచి కుసుమహారములతో, వివిధ వాద్య
ములతో శ్మశానమునకు గొప్ప ఊరేగింపుతో బయలుదేరి
ఆ ప్రాంతమంతటికిని అధినేత కాబట్టి రాజుగారి అంతిమదర్శ
మునకై వేలాది జనులు ప్రోగైరి. చుట్టుప్రక్కలనుండి జను
తిండోపతండములుగ వచ్చి రాజుగారి అంతిమయాత్రలో
పాల్గొనిరి. ఊరేగింపు దాదాపు ఒక మైలు దూరమువఱ
వ్యాపించెను. జనుల కోలాహలము మిన్నుముట్టుచుండెను
ముందుగ బ్యాండువాద్యంవారు, వారివెనుక సన్నాయివాద్య

వారు, వారివెనుక నాట్యబృందము, వారివెనుక కోలాటము వేయువారు, వారివెనుక ప్రజలు, వారివెనుక మంత్రులు, వారివెనుక రాజబంధువులు, వారివెనుక రాజాగారి శవము ఉన్న చప్పరము — ఈ ప్రకారముగ బ్రహ్మాండమైన ఊరేగింపు రుద్రభూమికి బయలుదేరి పోవుచుండెను.

ఇట్లుండ, ఊరేగింపు సగము దూరము అతిక్రమించి, అకస్మాత్తుగ ఆకాశము మేఘావృతముకాగా అత్తటి కుంభ వృష్టి కురిసెను. ఊరేగింపులోనివారందఱు చప్పగ తడిచిపోవు చుండిరి. ముందుగ నడచుచున్న వారిలో ఒకడు ఆ రోజే క్రొత్త చెప్పులు ధరించి వచ్చెను. ఆ నూతన పాదరక్షలు వానలో తడిచిపోయినచో చెడిపోవునని నిశ్చయించి అతడు వీథిప్రక్కనేయున్న ఒక ఇంటిలో దూరి ఆ యింటియజమానితో 'అయ్యా' మహారాజుగారి అంతిమయాత్రలో పాల్గొనుటకై వచ్చిన నాకు ఈ వర్షమువలన పెద్ద ఆటంక మేర్పడినది. నేను తడిచిపోయినను పరవాలేదు. ఈ నా క్రొత్తచెప్పులు తడిచి నచో మరల ఎందుకును పనికిరావు. కాబట్టి మీరు కొంత పెద్దమనస్సుచేసి ఈ నా పాదరక్షలను నేను శ్మశానమునుండి తిరిగి వచ్చువఱకు మీ యింటిలో ఎక్కడైన ఒకమూలపెట్టి యుంచుడు. ఈ చిన్నసహాయముచేసినచో మీకు నేనెంతయో ఋణపడియుందును అని విన్నవించుకొనెను. వెంటనే ఇంటి యజమాని అందులకు సమ్మతింపగా, ఆ వ్యక్తి తన క్రొత్త

చెప్పులను ఆ యింటిలో ఒక మూల దాచి తిరిగి ఊరేగింపులో
పాల్గొనెను.

వర్షము ఏమాత్రము తగ్గలేదు. తగ్గకపోగా ఇంకను
బలపడెను. హోరున చలిగాలియు వీచుచుండెను. ఆ వర్షము
యొక్క ధాటికి తట్టుకొనలేక ఊరేగింపులోని జనులు చిందర
వందరగా పారిపోయి ప్రక్క ప్రక్కనగల ఇండ్లలో తలదాచు
కొనిరి. కుంభవర్షమువలన రాజుగారి శవము ముద్దగా తడిచి
పోవుచుండెను. అది చూచి మంత్రులందరును, వర్షము
నిలుచువరకు రాజుగారి శవమునుదింపి ప్రక్కన ఏదైన ఇంటిలో
కొద్దిసేపుంచిన బాగుండునని ఏకగ్రీవ తీర్మానమును గావించు
కొని సరిగా ఇదివరకు చెప్పులు పెట్టిన ఇంటికే వచ్చి ఆ యింటి
ఆసామి నిట్లడిగిరి – 'ఏమయ్యా' మీ ఇంటిలో ఒకమూల
రాజుగారి శవమును కొద్దిసేపు ఉంచనిమ్ము. వర్షము ఆగి
పోగానే మరల తీసికొనిపోయెదము'. కాని ఇంటి యజమాని
అందులకేమాత్రము అంగీకరించలేదు. 'భూమితలక్రిందులైనను
ఈ పనికి నేను పూనుకొనను' అని యతడు జవాబిచ్చెను.
ప్రక్కనే నిలబడియున్న ఒకడు 'ఏమయ్యా! ఇప్పుడే ఎవరివో
చెప్పులు మీ ఇంటిలో ఉండనిచ్చితివి కదా! రాజాధిరాజు
దేశాధినేత, భువనైకశాస్త అయిన భూపాలుని శవమును
ఉంచుకొనుటకేల తిరస్కరించుచున్నావు?' అని ప్రశ్నిం
అందులకా గృహయజమాని ఇట్లు ప్రత్యుత్తర మొసంగెను

'మహాశయా! మీరు చెప్పినది సత్యమే. రాజుగారు జీవించియున్నప్పుడే వారి దేహమును అందఱు గౌరవించుదురు. కాని మరణించిన తరువాత ఆ దేహమునకు విలువ ఉండదు. దాని నెవరును తమ గృహములందుంచుటకైనను అనుమతించరు. దేనినైనా, తద్దకు చెప్పాలనైనా తమ యింట్లయందుంచుటకు జనులు సమ్మతింపదురు కాని, శవమును మాత్రము పెట్టుకొనుటకు అంగీకరింపరు." ఆ వాక్యములను వినగనే మంత్రులందరును తమలో ఇట్లనుకొనిరి- అహో! ఈ రాజత్వమున కేపాటి విలువ! బ్రతికియున్నప్పుడు సామ్రాజ్యములన్నియు అరచేతిలో నున్నప్పటికిని, చనిపోయిన పిదప పాదరక్షలకంటె హీనమైన స్థితిని బొందుటయా! ఓహో! ఏమి ఈ కీర్తులు, ఈ ప్రతిష్ఠలు, ఈ వైభవములు, ఈ రాజగౌరవములు! అన్నియు మూణ్ణాళ్ళముచ్చటలేకదా! శరీరములో ప్రాణవాయువు ఉన్నంతవఱకే ఈ ఆర్భాటమంతయు, అది కాస్తా ఈ దేహమును వీడిపోయినచో మిగిలినదానికి విలువే లేదు. దానిని ఎవరును గౌరవింపరు. అది శ్మశానములో దొర్లాడుచు శునక శృంగాలములకు భక్ష్యమైపోవలసినదే—'

కావున క్షణికములై, అశాశ్వతములై, దేహావసాన పర్యంతములైనట్టి దృశ్యవిభవములను, ప్రాపంచిక సంపదలను గొప్పగా తలంచక, వానియెడల వైరాగ్యభావము గలవారై, శాశ్వతమై నిరతిశయానందప్రదమైనట్టి ఆత్మయొక్క అను

భూతిని బడయుటయందే జనులు తమ జీవితములను వినియో
గింతురు గాక!

యావత్పవనో నివసతి దేహే
తావత్పృచ్ఛతి కుశలం గేహే
గతవతి వాయౌ దేహాపాయే
భార్యా బిభ్యతి తస్మిన్కాయే
భజగోవిందం భజగోవిందం
భజగోవిందం మూఢమతే.

'ఈ దేహమందు ప్రాణవాయువుండునంతవఱకే అంద
రును ఇంటికివచ్చి కుశలప్రశ్నలు వేయుచు ఆదరించుచుందురు
ఆ ప్రాణవాయువు శరీరమును వదలిపోయినచో మిగిలిన శ
వమును జూచి స్వంత భార్యకూడ భీతినొందుచుండును. కాబట్టి
నశ్వరములగు దేహాదులందు మమత్వముం వీడి శాశ్వతుడగు
గోవిందుని భజింపుడు.'

అను శ్రీ శంకరాచార్యుల మహోపదేశమును జనుల
నిరంతరము మననము చేయుచు జీవితములను భక్తిమయమ
లుగ నొనర్చుకొందురు గాక!

**నీతి :— దేహాభిమానమును వదలిపెట్టి ఆత్మయే
తానను భావమును మననము చేయుచు పవిత్ర జీ
వితమును గడుపవలెను.**

17]

# వైరాగ్యోద్దీపనము

పూర్వము భోజరాజను గొప్ప నృపాలు డుండెను. అతడు ధార్మిక హృదయుడు, అద్భుతశీలసంపన్నుడు, మహా పండితుడు అయి విరాజిల్లుచుండెను. లక్ష్మి, సరస్వతి—ఇరువురును ఒక చోటకూడియున్న సందర్భములు ప్రపంచములో చాల అరుదుగ నుండును. భోజరాజునకు సంపదతో పాటు పాండిత్యప్రకర్షకూడ యుండుటవలన, ఆ దేవీ ద్వయము యొక్క చక్కని సమ్మేళన మాతనియందు గోచరించుచుండెను. అతని యాస్థానము సదా పండితప్రకాండులచేతను, విద్యావైదగ్ధ్యము తొణికిసలాడు గొప్ప కవిపుంగవులచేతను కిటకిట లాడుచుండును. ఎందఱో కవీశ్వరులను, విద్యావంతులను ఆ భూపాలుడు తన ద్రవ్యముచే పరిపోషించుచుండెను. అష్టదిగ్గజము లాతని కొలువునందే యధివసించియుండిరను విషయము సర్వు లెఱింగినదే గదా!

అట్టి మహిమాన్వితుడైన భోజరాజుయొక్క ఆస్థానమందు, ఆమ్మహీపతియొక్క పరిపోషణము క్రిందనున్న వెలయుచున్న పండిత బృందములో వేదశాస్త్రపారంగతుడును, కవిత్వము చెప్పగలుగుటలో మేటియు, ఆశుకవిత్వమునం దారితేరినవాడునగు ఒక విద్వాంసు డుండెను. అతడు ప్రతి

దినము రాజభవనమునకు వచ్చుచు, రాజసాన్నిధ్యమందు
విద్యావైదుష్యమును ప్రకటించుచు మహీపతియొక్క మ
నలను బడయుచు నుండెను. అతని పోషణాదికములను ర
చూచుచుండెను. అయితే ఆ పండితునకు ఒక పెద్ద చిక
వచ్చి నెత్తిన పడినది. ఏమనగా వయంబడి తక్కువ, కుట
బము పెద్దది. కుటుంబసభ్యులైన భార్య, బిడ్డలు, మనుమ
మనుమరాండ్రు - వీరి సంఖ్య లెక్కకు మించియుండుట
రాజుగారిచ్చు వేతనము అతని కుటుంబనిర్వాహణమునకు
మాత్రము చాలకుండెను. అందుచే కుటుంబపోషణ మాత్ర
ఒక పెద్ద సమస్య అయి కూర్చుండెను. ఆ సమస్యను పరిహ
రించుట కాతఁ డెన్నియో ఉపాయములను అన్వేషిం
చుండెను.

తుట్టతుద కాతని కొక విచిత్రమైన ఊహ జనించె
జననింద్యమైన ఒక భావన యతనికి కలిగెను. భోజరాజు
ఆస్థానములోను, భవనాంతరములందును అనేక విలువగల
వస్తువులు అచటచట పడియుండునుగదా! వానిలో ఏ ఒ
రెండు దొంగిలించుకొని పోయినచో కనీస మొకసంవత్సర
వఱకైనను కుటుంబ భారమును గూర్చిన ప్రశ్నయే యుండ
అను నిట్టి హేయమైన సంకల్ప మాతనిహృదయమందు
చెను. "ఈపని చేయవచ్చునా, చేయకూడదా అను విచ
ఏమాత్రిము చేయక, కుటుంబపోషణ రూపలక్ష్యముమాత్ర

మనంబున నిడుకొని యాతడు చోరత్వమునకు గడంగెను ధనాశచే యాతని మతిభ్రష్టమయ్యెను. 'సమ్మోహాత్ స్మృతి విభ్రమః' అనునట్లు అపుడాతడు యుక్తాయుక్తములను గూర్చిన స్మృతినే కోల్పోయెను.

తన దుస్సంకల్పమును కార్యాన్వితము చేయదలంచి ఆపండితుడొకనాటి రేయి అందఱును గాఢనిద్రలో తన్మయులై యుండ, భోజరాజుగారి ప్రాసాదమందు దొడ్డిదారిగుండా ప్రవేశించెను. బహుకాలము రాజాస్థానమునందు కొలువులో నున్న వ్యక్తి కాబట్టి భవనాంతరాళములో ఏవస్తు వెక్కడున్నది బాగుగ పరిచయము కలవాడు ఆ పండితుడు అందుచేత ఒక సంచి చేతబట్టుకొని విలువైనవస్తువులను దానిలో వేసికొనుటకు సిద్ధపడుచుండెను. మొట్టమొదట ఒక సువర్ణ హార మాతని కంటబడెను. అత్తఱి అతని ఆనందమునకు మేరలేకుండెను. ఆహా! ఆఱునెలల బత్తెము లభించినది కదా యని సంబరపడతొచ్చెను. ఆ ఆమూల్యహారమును తీసి సంచిలో వేయుచుండగా, సర్వశాస్త్రపారంగతుడైన ఆ పండితునకు తత్క్షణము గరుడపురాణములోని ఒకానొక శ్లోకము జ్ఞాపకమునకు వచ్చెను 'సువర్ణమును అపహరించు వాడు పదివేల సంవత్సరములు కుంభీపాకనరకములోబడి నానా యాతన లనుభవించవలసివచ్చును' అని శ్లోకార్థమై యున్నది. ఛీ, ఛీ! ఈ చిన్నవస్తువుకొఱకు ఇన్ని వేలసంవత్సరములు

నరకబాధ ననుభవించవలసివచ్చునే' యని భీతిల్లి తోడనే ఆ సువర్ణహారమును క్రింద వదలివేసెను.

వెనువెంటనే మరల కుటుంబబాధ స్ఫురణకు వచ్చెను. ఏమైనను సరియే ఈసారి తప్పక ఏదైనా విలువగలవస్తువును అపహరించుకొనిపోవలసినదేయని కృతనిశ్చయుడై సమీపమనే ఒక నవరత్నఖచితఆభరణము పడియుండుటఁజూచి దానెత్తుకొని సంచిలో వేయఁదొడగెను. కాని ఈసారి యతనికి మనుస్మృతిలోని ఒక శ్లోకము జ్ఞాపకమునకు వచ్చెను. 'దొంగతనము మహాపాపము. అస్తేయము పరమధర్మము. దొంగతనముగావించువాడు రౌరవాది మహానరకములను బొందును' అని ఆ శ్లోకార్థము. పండితుని హృదయఫలకమున ఆ శ్లోకము మెఱయగనే, తోడనే యతడా వస్తువును క్రింద పారవైచెను. ఈప్రకారముగ ఆ రాత్రియంతయు రాజభవనమున ఒక్కొక వస్తువును గ్రహించుటయు, వెంటనే శాస్త్రప్రమాణము స్ఫురణకురాగా దానిని వదలివేయుటయు జరుగుచుండెను.

ఇంతలో తెల్లవారవచ్చెను. రాజభటులు తనపట్టుకొందురను భీతిచే అత్తరి ఆ పండితుడు భోజరాజు పరుండిన మంచము క్రిందదూరి దాగుకొనెను. తెల్లవారగా భోజరాజు నిద్రలేచెను. మంచముపై కూర్చుండి నలుదెసల పరికించెను. ఎదురుగా సుందరస్త్రీలు సేవచేయుటకై నిల

యుండిరి. భృత్యులుచేతులుకట్టుకొని రాజాజ్ఞకై వేచియుండిరి. కిటికీలగుండా బయటకు దృష్టిని ప్రసరింప అచట సైనికులు బారులుతీర్చి నిలువఁబడియుండిరి. సైన్యమందలి ఏనుగులు, గుఱ్ఱములు బలిష్ఠములై ఉత్సాహవంతములుగ చూపట్టు చుండెను. ఇదియంతయుగాంచి, భోజరాజు తన రాజ్యవైభవ మును తలపోసికొని తలపోసికొని సంబరపడుచు, తన యా భోగభాగ్యములను జూచి మురిసిపోవుచు, ఆనందమున తన్మ యుఁడై ఆ తన్మయస్థితియందు దిగువ శ్లోకమును అతువుగ చెప్ప దొడఁగెను.—

చేతోహరా యువతయః సుహృదోఽనుకూలాః
సద్బాంధవాః ప్రణయగర్భగిరశ్చ భృత్యాః
గర్జన్తి దన్తినివహా స్తరలా స్తురంగాః
. .... . . ..

అని ఈ ప్రకారముగ శ్లోకముయొక్క మూడుపాదము లను అందఱును వినునట్లు పెద్దగా చెప్పెను. నాలుగవ పాద మునుగూడ పెద్దగా చెప్పబోవుచుండెను. ఇంతవఱకు చెప్పిన ఆ మూడుభాగముల శ్లోకముయొక్క అర్థమేమనగా.—

'ఆహా! నాభాగ్యమెట్టిది! నాకొలువునందున్న స్త్రీలు మహాసౌందర్యవంతులు, చిత్తమును హరించువారు, ...

మిత్రులులనుకూలురు, మద్భావానుగుణ్యముగ వర్తించువారు
నాబంధువులు చాల ఉత్తములు, సత్పురుషులు, నాసేవకుల
నాఆజ్ఞానువర్తులు, నాసేవయందలి ఏనుగులు అనంతముతో
శబ్దమొనర్చుచున్నవి. గుఱ్ఱములు సకిలించుచు యుద్ధమున
సన్నద్ధములై యున్నవి.'

ఈప్రకారము భోజరాజు తన రాజవైభవమును
స్మరించుచు కవీశ్వరుడు కావున తన యాభావములను ఛంద
స్సమొనర్చి శ్లోకరూపముగ చెప్పుచు, శ్లోకములోని మూడు
పాదములను పూర్తిచేసి నాల్గవపాదము చెప్పబోవుచుండగ
రాజుగారి మంచముక్రింద దాగుకొని అంతయు వినుచున్న
కవిశేఖరునకు ఆశుకవిత్వము పొంగిపొరలగా, దానిని ఆపుకొన
లేక నాలుగవపాదమును అతడే ఈక్రిందిప్రకారముగ పూరించి
లైచి బిగ్గరగా చెప్పెను.

'సమ్మీలనే నయనయోః నహి కించిదస్తి'

కన్ను మూసిన పిదప ఇవియేవియు ఉండవు—అని ఆ పాదము
నొక్క అర్థము. అనగా 'ఓరాజా! నీ వైభవమును జూచు
కొని, ఏమేమో సంబరపడుచున్నావు నీకున్నస్త్రీలు, బంధు
వులు, మిత్రులు, సేవకులు, సైనికులు, ఏనుగులు, గుఱ్ఱములు
లొట్టిపిట్టలు—వీనినన్నింటిని తలంచుకొని మురిసిపోవుచున్నావు.

అనియేమో గొప్పగా భావించుచునావు ? ఇవన్నియు ఎన్నాళ్లుందును? కన్నుమూసిన పిదప అవన్నీ యేమగును ? మరణించిన వెనుక నీకూ వానికీ ఏమి సంబంధము ? అట్టి తాత్కాలిక, క్షణిక, నశ్వరపదార్థములను జూచి చిందులు త్రొక్కనేల ?

ఇట్టి అపూర్వ అర్థభావనతో గూడి వైరాగ్యోద్దీపకమైన వాక్యము రాజునకు వెంటనే కనువిప్పుగలిగించెను. తన పొరపాటును రాజు గుర్తించెను. అశాశ్వతమైనదానిని శాశ్వతముగ తలంచుటయే ఆ పొరపాటు. ప్రాపంచిక వైభవాదులను గొప్పగ భావించుటయే ఆ పొరపాటు, భోగభాగ్యములే కర్తవ్యములని నమ్ముటయే ఆ పొరపాటు, ఇకమీదట అట్టి దోషము, అట్టి అవివేకము తనకు కలుగ కుండులాగునను శాశ్వతవస్తువగు పరమాత్మనే నమ్ముకొని ప్రవర్తించులాగునను, రాజు కృతనిశ్చయుడయ్యెను. ఇట్టి మహత్తర వైరాగ్యోద్బోధకవాక్యమును మంచముక్రిందనుండి ఎవరు చెప్పిరో చూడుడని భృత్యులకాజ్ఞాపింప, ఇంతలో మంచము క్రిందనుండి తన యాస్థానమందున్నట్టి కవిశేఖరుడు బయటకు వచ్చెను. రాజు ఆశ్చర్యపడి, జరిగిన వృత్తాంతమంతయు అతనివలన తెలిసికొని, పండితుని కుటుంబపోషణార్థము కొంత ద్రవ్యమిచ్చి భౌతిక ప్రపంచము సత్యమని నమ్మియున్న తనకు, ఒకశ్లోక

పాదము చేతనే మనస్సు మార్చివేసి, సత్యస్థితిని అవగాహ మొనర్పజేసిన యతనికి తన కృతజ్ఞతలను తెలిపి పంపివైచె

కావున జనులు దృశ్యపదార్థములపై మమత్వము వదలి, వానిని గొప్పగా తలంచక శాశ్వతపరమాత్మ అన్వేషించి ధన్యులయ్యెదరుగాక!

**నీతి :- ప్రాపంచిక వైభవములు క్షణికములు వానిని నమ్ముకొనక శాశ్వతపరమాత్మ కొఱకే యత్నించుచు, త్వరలో ఆత్మానుభూతిని బడయవలెను.**



# పుట్టుకతో వచ్చిన బుద్ధి

ఒకానొక పట్టణమందు ప్రసూతి వైద్యాలయ మొకటి కలదు. ఉదారవంతుడగు ఒక ధనికుడు తన విరాళముచేత ఆవైద్యాలయమును కట్టించెను. ఆధునిక వైద్యసదుపాయములు ఇతర సౌకర్యములు ఎన్నియో అచట ఉండుటవలన మహిళా లోకమున కది వరప్రసాదముగ నుండెను. ఆ వైద్యాలయమునందు ఒకనాడు ప్రసవమునకై వచ్చిన ఒక లలనామణికి మగపిల్లవాడు పుట్టెను. పుట్టిన కొద్దిరోజులకు తల్లిపాలు చాలనందున ఆ వైద్యాలయములోని ఒక నర్సు చంటిపిల్లవానికి పాలిచ్చుచు జాగ్రతగ సాకుచుండెను. ఆదేమిచిత్రమోకాని ఒక రోజున ఆ పసివానికి చేతివ్రేళ్ళు గట్టిగా ముడుచుకుపోయినవి. పిల్లవాడు తన చేతిని తెరవలేకుండెను. తల్లియొక్క మనస్సు ఆందోళన లో పడిపోయెను. పుట్టకపుట్టక చాలకాలమునకు పుట్టిన పిల్ల వానికి పుట్టుకతోనే వ్యాధి సంక్రమించెనుగదా యని తల్లి చింతాగ్రస్త యయ్యెను.

పిల్లవాని వ్యాధిసమాచారము వైద్యాలయ మంతయు పాకెను. కొందరు డాక్టర్లు వచ్చి పిల్లవానిచేయి ముడుచు కొనిపోయి యుండుట చూచి, తద్రోగ నివారణకై ఏవేవో చికిత్సలు చేసిరి. కాని పిల్లవాడు తన చేతివ్రేళ్ళను తెరవలేదు తల్లికి ఆందోళన ఎక్కువగు చుండెను. ఇంతలో తల్లి

వైద్యాలయముయొక్క ప్రధాన వైద్యురాలి యొద్దకు పరుగున
వెళ్ళి తన కుమారుని దీనావస్థను ఆమెకు విశదపఱచి, పిల్లవాని
వ్యాధి నివారణకై తగు చికిత్స శీఘ్రముగ ఒనర్పవలసినదిగా,
ప్రాథేయపడెను. తల్లియొక్క ఆర్తనాదము విని వైద్యురాలు
తగిన పరికరములను తీసికొని, పరివారమును వెంటబెట్టుకొని,
సర్వసన్నాహముతో రోగి కడకు బయలుదేరెను. రోగి ఉన్న
గదిలోనికి ప్రవేశించి ప్రధాన వైద్యురాలు తన పరికరములలో
నున్న తమైన ఒక దానిచే పిల్లవాని చేతి వ్రేళ్ళను బలవంతముగా
ఒక్కొక్కదానిని తెరచెను. వ్రేళ్ళన్నియు తెరచుకొన్నవి.
పిల్లవాని చేతిలో ఒక ఉంగరము కానుపించెను. ప్రక్క
నున్నవారందరును ఆశ్చర్యచకితులైరి. వైద్యురాలి విస్మ
యమునకు అంతులేకుండెను. తీరా విచారించి చూడగా ఆ
ఉంగరము పిల్లవానికి పాలిచ్చిన నర్సుదని తేలిపోయినది. ఆ
నర్సు పిల్లవానికి పాలిచ్చుచుండగా పిల్లవాడు దానిని చల్లగ
దొంగిలించి తన పిడికిలిలో నుంచుకొనెను. అదీ జరిగిన కథ.
అంతేకాని పిల్లవానికి జబ్బూలేదు, మరేమీ లేదు. వెంటనే
వైద్యురాలు నర్సును పిలిపించి ఆపై అంగుళీయకమును
ఆమెకు తిరిగి ఇప్పించి పిల్లవానికి వ్యాధి ఏమియులేదని తల్లికి
ధైర్యముచెప్పి వెడలిపోయెను.

పిల్లవానికి పుట్టుకతోనే దొంగబుద్ధి ఏర్పడెను. ఆ బుద్ధి
ఈ జన్మలో వచ్చినదికాదు. పూర్వజన్మలో అతి దొంగ

గజదొంగ అయి యుండవచ్చును. ఆ దొంగబుద్ధియే ఈ జన్మలో పుట్టుకతోనే సంక్రమించినది. దీనినే పూర్వజన్మ వాసన యని చెప్పుదురు. జీవితములోని అనుభవము లన్నియు జనులలో సంస్కారరూపమున బీజరూపేణ చిత్తమున నిగూఢముగ నుండును; తగిన అదను చూచుకొని అయ్యవి ఆ యా సమయములందు ప్రకోపించుచుండును. కొందఱికి సత్యము, శాంతము, దయ, పరోపకారము మొదలగు మంచి సంస్కారము లుండును. మఱికొందఱికి హింస, అపకారము, దొంగతనము మొదలగు చెడ్డ సంస్కారము లుండును. విజ్ఞుడగువాడు వానిని జాగరూకతతో కనిపెట్టి దుస్సంస్కారములను ప్రయత్నపూర్వకముగ రూపుమాపి, సత్సంస్కారములను అభివృద్ధి పరచుకొనవలెను.

**నీతి : ప్రతివారు తమ మనస్సును బాగుగా పరిశోధించి దుష్టవాసనలను, దుశ్శీలమును పోగొట్టుకొని, సద్వాసనలను, సచ్ఛీలమును పెంపొందించుకొనవలెను.**

# ముచ్చటైన మూడు ప్రశ్నలు

పూర్వకాలమున ఒకానొక మహారాజు ఉండెడివాడు. అతడు గొప్ప ధార్మికహృదయము కలవాడు భగవద్భక్తుడు. శాస్త్రవిచారణయం దాతనికి ప్రీతి ఎక్కువ. అతని ఆస్థానమున అనేక పండితులు, వేదవేదాంగ పారంగతులు, శాస్త్రార్థకోవిదులు సదా విరాజమానులై యుందురు. అతని రాజభవనమున నిరంతరము ఏదియో ఒకమూల దైవచర్చ జరుగుచునే యుండును. ఈ ప్రకారముగ రాజప్రసాదమున చక్కని దైవగంధము వ్యాపించియుండెను.

ఇట్లున్నప్పటికిని ఆ రాజుగారి మనంబున ఏదియో ఒక కొరత బాధించుచుండెను. ఎన్ని చదివినప్పటికిని, ఎన్ని విన్నప్పటికిని అతనికి పూర్ణ సంతృప్తి కలుగలేదు. ఆధ్యాత్మక్షేత్రమున కొన్ని సంశయము లాతనిని వేధించుచునే యుండెను. ఆ సంశయములను పరిపూర్ణముగ నివారించువాడుగాని, వానికి తగినసలహా చెప్పువాడుగాని ఆస్థానమునగల పండితబృందమునం దెవరును లేకపోయిరి. అందుచే రాజు మిగుల ఖిన్నుడయి స్వకీయసంశయవిచ్ఛేదమునకు దారి ఏదియా యని పరిపరివిధముల ఆలోచించుచుండెను.

ఇట్లుండ ఒకనా డాతని చిత్తకుహరమున అకస్మాత్తుగ పరిష్కారమార్గము మెఱుపువలె స్ఫురించెను.

రాజుగారికి ఆస్థానమందు రాజవంశమునకు పౌరో
హిత్యమును నెరపునట్టి మహాపండితుడొకడుండెను. అతడు
శాస్త్రవిచారణయందు గొప్ప నేర్పరి. వాదవివాదములందు
ప్రతిపక్షులను క్షణములో కూలద్రోయగల వాక్పటిమగలవాడు.
అయితే అతడు పాండిత్యప్రకర్షగలవాడేగాని అనుభవ
శూన్యుడు. వాచా వేదాంతియేకాని అనుష్ఠానతత్పరుడు కాడు
ఈ విషయము రాజుగారికి తెలియదు. అతడు మహాశాస్త్ర
పండితుడు కావున బహుకాలమునుండి తన్ను బాధించుచున్న
సంశయములను త్రుటిలో తొలగించివేయగల స్తోమత యత
నికి తప్పక ఉండియుండునని, పైగా రాజపురోహితుడు కావున
రాజావసరములను తీర్చవలసిన బాధ్యత అతనిపైనున్నదనియు
నిశ్చయించి రాజు ఒకనాడు పురోహితుని తనయొద్దకు ఏకాంత
ముగ పిలిచి ఈ ప్రకారముగ నుడివెను:—

పండితోత్తమా! చాలకాలమునుండి మూడుసందేహ
ములు నన్ను పీడించుచున్నవి. ఎన్నియో గ్రంథములను తిరుగ
వేసితిని, ఎందరో పెద్దలను ప్రశ్నించితిని. దాని సరియైన
సమాధానము నాకు దొరకలేదు. అందుచే హృదయమందు
గొప్ప ఆందోళన జనింప మహాబాధితుడనై తుట్టతుదకు
నాయాస్థానమందుగల మీరొక్కరే తత్సంశయనివారణ
మున సమర్థులని ఊహించి మిమ్ములనిచటికి పిలిపించితిని. మీరు

మా రాజకులపురోహితులు, మీ తాతముత్తాతలెందరో మా రాజవంశమునకు మహత్తరసేవ చేసియుండిరి. రాజునకుగల సంశయములను నివారింపవలసినది ఆస్థానపురోహితుడే గదా. పూర్వము శ్రీరామచంద్రునకు కలిగిన సంశయావళినంతను రఘువంశ పురోహితుడును, కులగురువునగు వశిష్ఠమహర్షి యోగవాసిష్ఠరూపదివ్యపరమార్థబోధచే విచ్ఛిన్నమొనర్చి వేసిన సంగతి మీకు తెలిసినదే కదా. కావున నన్ను బాధించుచున్న మూడు సంశయములను ఇపుడు మీ ముందు పెట్టుచున్నాను. వానిని మీరు స్వయముగాగాని, ఇతరులతో సంప్రదించిగాని, లేక శాస్త్రములను పరిశోధించిగాని, లేక మఱి యేవిధముగనైననుగాని బాగుగా విచారించి సరిగా ఆఱుమాసములైన పిదప నాకు తగు సమాధానమొసంగవలసినది. అట్లు మీరు ఆ వ్యవధి లోపల నాకు తగిన ప్రత్యుత్తర మొసంగనిచో నాయాస్థానము నుండేకాదు, నా దేశమునుండికూడ మిమ్ములను బహిష్కరించివైచెదను. కాబట్టి బాగుగా యోచించి కార్యమును నెరవేర్చవలసినది. ఆ ప్రశ్నలేవియో వినుడు:—

(1) దేవుడు ఎచట నున్నాడు?

(2) దేవుడు ఏవైపు చూచుచున్నాడు?

(3) దేవుడు ఏపని చేయుచున్నాడు?

ఈ ప్రకారముగ రాజు తనపురోహితుని శాసించి పంపివైచెను.

పురోహితుడు రాజుయొక్క ఆ వాక్యములను వినగనే భయకంపితుడయ్యెను. అతడు శాస్త్రవేదాంతియే కాని అనుభవముకలవాడుకాడు. శాస్త్రపాండిత్యము కలవాడేకాని శాస్త్రానుభూతి కలవాడు కాడు. ముఖమునందు సమస్తవిద్యలు కలవాడేకాని, హృదయమందు కలవాడుకాడు. రాజడిగిన ప్రశ్నలక్కు బ్రహ్మానుభూతిగల మహనీయుడే తగిన సమాధానము చెప్పగలడుకాని, పైపైన శాస్త్రపరిశోధన చేసినవాడు చెప్పజాలడు. ఇక్కారణమున ఆ పురోహితుడు వ్యాకుల చిత్తుడై భగ్నహృదయుడై ఇంటికివెళ్లి, అన్నపానములను కూడ స్వీకరింపక, దిగులుతో, దుఃఖముతో, తీవ్రవేదనతో మంచముపై పడియుండెను.

ఆ పురోహితుని ఇంటియందు గోవులను మేపుచు పనిపాటలు చేసికొనుచుండునట్టి గోపాలబాలు డొకడుండెను. అతడు పదునాఱు సంవత్సరముల ప్రాయముగలవాడు. పూర్వజన్మసుకృతముచే చిన్ననాటినుండియు అతనికి భక్తి చక్కగ అలవడినది. నిరంతరము ఏదియో భగవన్నామము ఉచ్చరించుచు తనపని చేసికొనుచుండును. దైవకటాక్షము చేతను, భగవద్భక్తిప్రభావముచేతను అతని హృదయమం దొకింత జ్ఞానముస్ను ఆవిర్భవించెను. అయితే ఈ విషయ

ఎవరికిని తెలియదు. ఇట్లుండగ ఒకనాడు తన యజమానుడగు రాజపురోహితుడు వ్యాకులచిత్తుడై పడియుండుటం జూచి, గోపాలు డతనిని సమీపించి వినయముతో ప్రశ్నించి, అతని దీనత్వమునకు కారణమరసి యతనితో నిట్లనియె—

"మహాత్మా! మీరిక దిగులుపడవలదు. అయుక్తములైన విషయములు రాజుగారిట్లు కబురుచేయుదురు (ఒక చీటీమీద వ్రాసి) 'కారణాంతరములచే రాజపురోహితుడవగు నేను ఆస్థానము నకు రాజాలకున్నాను. నేను చెప్పవలసిన జవాబులను నా తరపున నా ప్రతినిధియైన ఈతడు చెప్పును.' ఆ చీటిని నేను తీసికొనివెళ్లి రాజునకిచ్చి తగు సమాధానమొసంగి అతనిని తృప్తిపరచి వచ్చెదను" అని చెప్పగా పురోహితుడు మహదానందభరితుడై అందుల కియ్యకొనెను.

ఆరుమాసములు ఒక్క క్షణమువలె గడచిపోయెను. నిర్ణీత సమయమే తెంచెను. మహాత్మ్యపూర్ణములైన మూడు గొప్ప ఆధ్యాత్మిక ప్రశ్నలకు సమాధానములు రానుండుటచే ఇట్టి ప్రవచనమువలన తనకొకనికేగాక ఆశేషజనానీకమునకు కూడ మేలు కలుగవలెనని యాశించి రాజు నిర్ణీతసమయము నకు ముందుగానే దేశదేశములందు, గ్రామగ్రామములందు దండోరా వేయించి, పరమార్థజిజ్ఞాసువులకు సంశయవిచ్ఛేద మున గొప్పతరుణ మేతెంచినది, కావున యావన్మంది సహా

లమునకు విచ్చేసి అధ్యాత్మజ్ఞానామృతమును తనివితీర పానము చేసి కృతార్థులుకండని ప్రకటించెను. తత్ఫలితముగ ఆ నిర్దిష్టదినమున, నిర్ణీతకాలమగు రాత్రి 8 గంటల సమయమున రాజాస్థానమంతయు భగవద్భక్తులచే, అధ్యాత్మజిజ్ఞాసువులచే, భాగవతులచే క్రిక్కిరిసిపోయెను. ఎప్పుడు మూడు ప్రశ్నలకు సమాధానము వచ్చునాయని జనులందఱును తీవ్రజిజ్ఞాసతో నొడలంతయును చెవులుచేసికొని కూర్చుండిరి వారిమధ్యలో ఎత్తైన సింహాసనముపైన రాజు ఠీవిగ ఆసీనుడై యుండెను. సరిగా రాత్రి ఎనిమిది గంటలైనది.

ఇంతలో ఎవరో ఒక బాలుడు నల్లనివర్ణము, చింపిరి గుడ్డలు, చిఱుతప్రాయముగలవాడు ఒక ఉత్తరముతీసికొని రాజభవనములో ప్రవేశించి పురోహితుని యుత్తరమును ద్వారపాలకునిద్వారా రాజునకు చేర్చెను. రాజు ఉత్తరము చదువుకొని సంతోషించి ఆ గోపాలుని సగౌరవముగ లోనికి రానిచ్చి ప్రశ్నలకు జవాబులు చెప్పవలసినదిగా కోరెను. వేలకొలది జిజ్ఞాసువులచే కిటకిటలాడుచున్న ఆ రాజప్రసాద మధ్యమున ఎత్తైనసింహాసనముపై రాజు కూర్చొనియుండ ఆ బాలుడు రాజును సంభోధించి ఇట్లనెను— 'ఓ మహారాజా! లోకములో ఒక సంప్రదాయము కలదు ఒక గురుశిష్య న్యాయము కలదు. బోధించువాడు గురువు. బోధింపబడు

వాడు శిష్యుడు. బోధించునప్పుడు గురువు ఉన్నతస్థాన మధిష్ఠించి యుండుటయు, శిష్యుడు భక్తిభావముతో క్రింద చేతులుకట్టుకొని యుండుటయు లోకాచారము. తదనుసారము మిపుడు బోధించు నేను గురువును, వినునట్టి నీవు శిష్యుడవు అయియున్నాము. గురువు ఉన్నతస్థాన మధిష్ఠించవలెను కావున నేను సింహాసనముపై నెక్కెదను. శిష్యుడు క్రింద చేతులుకట్టుకొని నిలబడవలెను. కాబట్టి మీరు సింహాసనముపై నుండి దిగవలెను'.—

గోపాలు డిట్లు పలుక, ఆ వాక్యములు సహేతుకములు గాను, యుక్తియుక్తములుగాను ఉండుటచేత రాజు సింహాసనమునుండి క్రిందకు దిగి చేతులుకట్టుకొని నిలబడగా, గోపాలుడు సింహాసనమునెక్కి పైన కూర్చుండెను. ఇక ప్రశ్నలకు సమాధానము చెప్పుమని రాజు కోరగా గోపాలుడు 'మహాశయా! ఏదైన శుభకార్యము ప్రారంభించుటకు ముందుగా దీపారాధన చేయవలెను. దేవునకు పూజ, అభిషేకము చేయవలెను. కాబట్టి ఒక ప్రమిదెలో దీపము వెలిగించి తెప్పించవలెను. అభిషేకమునకై ఒక గ్లాసులో పాలుపోసి తెప్పించవలెను.' అని చెప్పగా, రాజట్లే కావించెను. తదుపరి పూజాదికములు ఒనర్పబడెను.

ఇక మొదటి ప్రశ్న — "దేవు డెచట నున్నాడు" అను దానికి సమాధానమును చెప్పవలసినదిగా రాజు కోరగా,

అంతట వారిరువురికిని ఈ క్రిందివిధముగ సంభాషణ జరిగను:—

గోపాలుడు.—ఓ రాజా! ఆ పాలపాత్రను పైకెత్తి జాగ్రత్తగ పరిశీలించి దానిలో వెన్న ఎక్కడ ఉన్నదో ముందుగా నాకు చెప్పుము. అటుపిమ్మట నీప్రశ్నకు నేను సమాధానమును చెప్పెదను.

రాజు :— (పాలను జాగ్రత్తగ నలువైపుల పరిశీలించి) మహాత్మా! పాలలో వెన్న అంతటను వ్యాపించి యున్నది.

గో.—అట్లే దేవుడు సమస్తచరాచరములందును నిగూఢముగ వ్యాపించియున్నాడు. అతడు లేని చోటులేదు.

రా.—గురుదేవా! చక్కటి సమాధానము చెప్పినావు. కృతజ్ఞుడను. ఇక రెండవప్రశ్న—దేవుడు ఏవైపు చూచుచున్నాడు? అనుదానికి సమాధానమును చెప్ప ప్రార్థన.

గో.—ఓ రాజా! ఆ ప్రమిదెలోని దీపము ఏవైపు చూచుచున్నదో ముందుగా నాకు చెప్పగోరెదను.

రా.—మహాత్మా! దీపము అన్నివైపుల చూచుచున్నది.

గో:—అల్లే దేవుడున్ను ఒక దిక్కునకాక, సర్వదిక్కుల చూచుచున్నాడు, సమస్త ప్రాణులయొక్క హృదయాంతర్వర్తియై సమస్తమును పరికించుచున్నాడు.

రా.—భేష్! చక్కగ సెలవిచ్చినావు. ఇక మూడవప్రశ్న దేవుడు ఏపని చేయుచున్నాడు? అనుదానికి సమాధానము చెప్పవేడెదను.

గో:—రాజా! దేవుడు చేయుపని ఇప్పుడే కనిపించలేదా ఒకరని సింహాసనముపైనుండి క్రిందకు దించుట. వేరొకరిని సింహాసనముపై కూర్చుండబెట్టుట - ఇది దేవుని పని అనగా ధనగర్వము, అధికారగర్వ కలిగియున్నవారిని క్రిందకు త్రోయుట. వినయము, దయత, శ్రద్ధ, భక్తి కలిగియున్నవారిని పైకి లేపుట దేవుడు చేయుపని పాపాత్ములను నరకమున త్రోయుట, పుణ్యాత్ములను, ధర్మాత్ములను స్వర్గధామమునకు చేర్చుట- ఇదియే దేవుని పని.

'ఓ రాజా! ఈ ప్రకారముగ మీరడిగిన మూడు ప్రశ్నలకును ప్రత్యుత్తరమును చెప్పినాను, నేను చెప్పదలుచున్నాను పాలలో వెన్నవలె సర్వత్రనైవ వ్యాపించియున్నాడు కావునను, దీపమువలె సర్వసాక్షి దశదిశలు వీక్షించుచున్నాడు కావునను, ధర్మనిష్ఠుల

ఉద్ధరించి, అధర్మపరాయణులను శిక్షించుచున్నాడు కావు నను ఓ రాజా! మీరున్ను, తదితరులున్ను సర్వత్ర దైవ సాన్నిధ్యముననే అనుభవించుచు, ఏ పాపముచేయక, హృదయమును నిర్మలమొనర్చుకొని దైవసాక్షాత్కార మును అచిరకాలములోనే బడసి జీవితమును ధన్యమొనర్చు కొందురుగాక! సర్వేశ్వరుడు అనుగ్రహించుగాక!' అని చెప్పి గోపాలుడు సభాస్థలమును విడిచివెళ్లెను.

సభాసదులందఱును రాజును ఆ బాలుని అఖండప్రజ్ఞకు, పరమార్థానుభవమునకు ఆశ్చర్యపొంది అట్టి దివ్యబోధలను వినగలందులకు తమ జీవితములు ధన్యములైనవని తలంచి, అతడు బోధించిన ప్రకారమే తమతమ జీవితములందనుస రించుటకు కృతనిశ్చయులైరి.

**నీతి : భగవంతుడు సర్వవ్యాపకుడు — అను విశ్వాసముగలిగి పాపకార్యము లవలేశమైనను చేయక, ధర్మబుద్ధి, పవిత్రాచరణ గలిగియుండవలయును.**

# అనంత సుఖమునకు బాట

పూర్వకాలమున పశ్చిమ దేశమునందు ఒక్కానొక మల్ల యుద్ధ ప్రవీణుడుండెను. అతడు ఆజానుబాహుడు, భీమబలుడు, గొప్ప వస్తాదు. కుస్తీయందు ఎందరినో ఒక్క పెట్టున ఓడించి వైచి జగద్విఖ్యాతికాంచెను. భూమండలమంతటను సంచరించి మల్లులందరిని పరాజితులుగచేసి జగదేకవీరుడు (World-Champion in wrestling) అను ప్రఖ్యాతిని బడసెను. అతని శరీరము చూచుటకు చాల సుందరముగను, ఆరోగ్యవంతముగను నుండెను. తన భుజబలమును, తన సౌందర్యమును, తన జగద్విఖ్యాతిని జూచి అతడు మురిసిపోవుచుండెను.

ఒకనాడా మల్లునకొక ఊహ జనించెను. అతడు తనలో తానిట్లు వితర్కించుకొనెను — 'నేను మహాబలవంతుడను, శక్తిశాలిని. నాబలమ్ము, నాతేజమ్ము, నాపరాక్రమము ఇంకను వృద్ధికావలెనన్న ఉపాయమేమి ? ప్రపంచములో అత్యంత పరాక్రమశాలియైన ప్రాణి ఏదైనా నున్నచో దానిని నిరంతరము స్మరణ చేయుచున్నచో నాకు ఉత్సాహము, సాహసము ఇనుమడించును. అట్టి ప్రాణి ఒకటే కలదు. అదియే సింహము. దాని పరాక్రమమునకు, ధైర్యమునకు అంతులేదు. పెద్దపెద్ద గజరాజములనుకూడ త్రుటిలో పడగొట్టివైచును. కాబట్టి అది నిరంతరము స్మరణకు వచ్చుటెట్లు ?

నాచేతిపై సింహపుబొమ్మను పచ్చపొడిపించుకొనినచో, అది ఎల్లప్పుడు నాకు దృష్టిగోచరమగుచుండును, కావున దాని దర్శనమాత్రముచే నాకు అపరిమిత ధైర్యస్థైర్యములు గలుగగలవు.

ఈప్రకారముగ తనలో తాను సమాలోచించుకొని ఆ మల్లయుద్ధప్రవీణుడు పచ్చపొడుచువాని కొరకని తనయింటికి పిలుచుకొనివచ్చి తన చేతిపై సింహముయొక్క బొమ్మను వేయవలెనని ఆదేశించి అందులకు ధర నిర్ణయించుకొనెను. వెంటనే పచ్చపొడుచువాడు సూది మొదలైన తన పరికరములను తెచ్చి మల్లునితో "ఓయీ! నీచేయిజాపుము. నీవు నావంక చూడవద్దు. ఒకింతబాధగా ఉన్నను ఓర్చుకొనుము. కొద్దిసేపు ఓర్చుకొనినచో సింహపుబొమ్మ శాశ్వతముగా నీ చేతిపై వెలయగలదు" అనిచెప్పి తన పనికి ఉపక్రమించెను.

ఎంత రౌద్రాగ్రేసరుడైనను సూదితో పొడుచునప్పుడు నొప్పి కలుగక మానదు. ఆ సూదిపోట్లను భరింపలేక మల్లుడు పచ్చపొడుచువానితో నిట్లనెను— "అయ్యా! సింహమును ఎక్కడ ప్రారంభించినారు?

పచ్చపొడుచువాడు — తోకదగ్గర

మల్లుడు — సరేగాని, నాకు వేసేసింహానికి తోకలేకపోయినా

ఫరవాలేదు. తోక మినహాయించి మిగతా సింహం వేయండి.

అంతట పచ్చపొడుచువాడట్లే కావించెను అయినను మరల కొంతసేపటికి ఆ సూదిపోట్లను భరింపలేక మల్లుడు వానితో నిట్లనెను—

అయ్యా! మరల ఎక్కడ ప్రారంభించినారు?

పచ్చపొడుచువాడు—పొట్టదగ్గర.

మల్లుడు — అయ్యా! దయచేసి నా సింహానికి పొట్ట ఎగర కొట్టండి. ఏమీ ఫరవాలేదు. ఈబాధ భరించలేకుండా ఉన్నాను.

పచ్చపొడుచువాడట్లే కావించెను. మరి కొంతసేపటికి మల్లుడు ఆబాధయు సహించలేక, మహాప్రభో ఇప్పుడెక్కడ మొదలు పెట్టినారు! అని అడుగగా "తలదగ్గర" అని జవాబు వచ్చెను. 'క్షమించండి, నాసింహానికి తలలేకపోయినా పరవాలేదు, మిగతాది వేయండి!" అని మల్లుడు శాసించెను. ఆ వాక్యములను వినగనే పచ్చవేయువానికి రోషము మండిపోయెను, విసుగుపుట్టెను. 'ఇదెక్కడి పచ్చయ్యా! తలలేదు, తోకలేదు, పొట్టలేదు. ఇక నీ సింహానికి నామరూపాలే ఎక్కడ? ఇట్టి సింహం వేయించుకుంటేఏమి, వేయించుకొనకపోతే ఏమి? ఈపని నాకుగిట్టదు" అని పలికి ధుమధుమ

లాడుచు, చీదరించుకొనుచు వెడలిపోయెను.

కొద్దిసేపు ఓర్చుకొనినచో యావజ్జీవితము సింహచిత్రమును దర్శించు సౌభాగ్య మాతనికి అబ్బియుండెడిది. అల్పసుఖమును త్యజించినచో అధికసుఖము కలిగియుండెడిది. కాని అతడట్లు కావింపలేదు. కనుకనే నిరంతర సింహదర్శన లబ్ధ మహోత్సాహమును అనవసరముగ గోల్పోయెను.

అట్లే అపారమగు ఆత్మానందమును, బ్రహ్మానందమును అనుభవింపవలెనన్న విషయజనితమగు ఒకింత అల్పసుఖమును మానవుడు త్యాగము చేయవలసియున్నాడు. బహు జన్మార్జిత స్వభావ ప్రాబల్యమువలన మనుజు డా యల్పసుఖమును, విషయానందమును, దృశ్యసౌఖ్యాదులను వదల లేకున్నాడు. తత్ఫలితముగ చిత్తమునకు ఏకాగ్రత, పవిత్రత లేమి అనంతమగు బ్రహ్మానందమును గోల్పోవుచున్నాడు. కాబట్టి విజ్ఞుడగువాడు సాధనయందు ఇంద్రియ నిగ్రహాదులందు ఎన్ని కష్టములైనను ఓర్చుకొని, ఒకింత నిబ్బరముతో విషయసుఖమును త్యాగమొనర్చి, భగవత్కృపకు పాత్రుడై, అపారమగు ఆత్మానందమును బడసి జీవితమును ధన్యమొనర్చుకొనవలెను.

**నీతి : అనంతమగు ఆత్మసుఖమును బడయ దలంచువారు విషయ సుఖమును దూరముగ నుంచవలెను. కష్టసహిష్ణుతగలిగి దైవము కొఱకై అనవరతము యత్నించవలెను.**

## మతిచే గతి

పూర్వమొకానొక వర్తకుడు పాదచారియై కాశీ యాత్రకు బయలుదేరెను. త్రోవలో అచటచట విశ్రాంతి తీసికొనుచు తనగమనమును కొనసాగించుచుండెను. అది గ్రీష్మ ఋతువు. మండువేసవి యగుటవలన ప్రయాణము కొనసాగించుట దుష్కరముగా నుండెను. అయినను పట్టుదల విడనాడక అతడు యాత్ర చేయుచునేయుండెను. ఊరువిడిచి కొన్ని వందలమైళ్ళు అప్రయాసముగ కష్టములను లెక్కసేయక దాటిపోయెను. ఇంతలో దారిలో నొక ఎడారిప్రదేశము ఎదురయ్యెను. దానినిగూడ త్వరితముగ దాటివేయ దలంచి వర్తకుడు అందు ప్రవేశించెను. అది మిట్టమధ్యాహ్నసమయము. పాదరక్షలు లేవు. గొడుగులేదు. కాళ్ళక్రింద

తాపము, తలపైన తాపము, ఇక వాని యవస్థ చెప్పతరము కాదు. అన్ని బాధలు సహించుకొనుచు నడచి పోవుచుండెను. ఆ యెడారి ప్రదేశములో విశ్రమించుటకు ఒక్క చెట్టయైన కానుపించకుండెను.

ఇంతలో అదృష్టము పండెనా యనునట్లు అనతి దూరమున ఒకానొక వృక్షమాతనికి దృగ్గోచర మయ్యెను. చక చక వాని పైపునకు నడచివెళ్ళెను. ఎట్టకేలకు దానినిచేరి ఆ వృక్షచ్ఛాయ యందొకింతసేపు విశ్రమించెను. పూర్వమెపుడో ఏ మహాశీయుడో, ఏ బ్రహ్మనిష్ఠుడో, ఏ తపస్సంపన్నుడో ఆ చెట్టుక్రింద ధ్యాననిష్ఠ సలిపి యుండుటవలన ఆ వృక్షమునకు ల్పవృక్షముయొక్క శక్తి ఆవిర్భవించెను. అనగా ఆ చెట్టు క్రింద ఎవరు ఏది సంకల్పించుదురో అది నెరవేరి పోవుచుండెను. వరు దేనిని అభిలషించుదురో ఆ వస్తువు వారికచట ప్రత్యక్షంగుచుండెను. ' ఇట్టి అమోఘమైన శక్తి ఆ వృక్షమునకు లదని ఆ వర్తకుడెఱుగడు. ఎండలో అలసి అలసి సొమ్మసిల్లిందపడియున్న ఆ వర్తకుడు ఒడలంతయు చెమటకారుచుండ, స్నానము చేయుటకు ఈ ప్రాంతమున నీరు ఒక చుక్కైనను దే! నీరుండినచో ఎంత హాయిగా నుండును! ' అని సంకల్పించెను. తోడనే ఆ చెట్టుపై నుండి గంగా ప్రవాహము లె నీరు జలజల క్రిందకు పడజొచ్చెను. కల్పవృక్షమహిమ

ఆ చెట్టు కుండుటచే ఆ విధముగ సంభవించెను. పర్తకునకు ఆ చెట్టుయొక్క కల్పవృక్షశక్తిని గూర్చిన పరిచయము లేనందుచే ఆ జలప్రపాతమున కచ్చెరువొందెను. తోడనే వర్తకుడు ఆ జలధారలందు స్నానముచేసి సేదదీర్చికొనెను.

తదుపరి యాతడు ఆకలి మండిపోవుచున్నది, ఎవ్వరైన భోజన మిడినచో నాకెంతో హాయిగ నుండును! అని భావించెను. అది కల్పవృక్ష మగుటవలన తత్క్షణ మాతని యా సంకల్పమున్ను నెరవేరెను. పంచభక్ష్య పరమాన్నములతో నిండిన ఒక విస్తరి ఆ చెట్టుక్రింద ప్రత్యక్షమయ్యెను యాత్రికుని ఆనందము చెప్పనలవికాదు. ఒకచెంప ఆశ్చర్యము, ఒకచెంప సంతోషము ఆతని మనంబున ప్రాదుర్భవింప జొచ్చెను. ఇది ఏమి యింద్రజాలము? అని అచ్చెరువొంది క్షుద్బాధా పరితప్తుడగు నతడు కాలయాపన చేయక ఆ మృష్టాన్నమును ఆరగించి వేసెను. తదుపరి యతడు 'జనసంచారము లేని ఈ చోటు నాకు భయమును గొల్పుచున్నది. ఇంటియొద్దనున్న నా భార్య ఇచటికి వచ్చినచో నాకెంతయో సహాయకారిగ నుండగలదు" అని సంకల్పించెను. సంకల్పించుటయే తడవుగా అతని భార్య అచ్చోట ప్రత్యక్షమయ్యెను. ఇది యంతయు ఆ కల్పవృక్షము యొక్క మహిమాతిశయమే కాని అన్యము కాదు. అయినను వర్తకుడా రహస్య మెఱుం

గజాల కుండెను. వెయ్యి మైళ్ళ దూరమున నున్న నాభార్య ఇచటికి ఎట్లు అరుదెంచ గలదు ? ఈమె నాభార్యయేనా, లేక ఏదైన దయ్యమా ? అని అనుకొనెను. తోడనే కల్పవృక్ష శక్తిచే దయ్యముగా మారిపోయెను. ఆ దయ్యమును చూచి వర్తకుడు ఇది నన్ను మింగివేయునేమో ? అని శంకించెను. తత్క్షణమే ఆ దయ్యము వాని పైబడి మింగివైచెను.

కల్పవృక్షము క్రిందనున్నప్పటికి వర్తకుడు తన వినాశమును తానే కొనితెచ్చుకొనెను. మహోన్నత అవకాశములను జారవిడుచుకొని పతనము పొందెను. భగవంతుడు కల్పవృక్షము వంటివాడు. ఎవరు ఏదేని యభిలషించి తనను ప్రార్థించుదురో దానిదాని నతడు వారికి అందచేయుచుండును. విజ్ఞుడగువాడు శ్రేయస్కరమైన దానినే కోరుకొనును, బంధ విముక్తినే అభిలషించును. భగవానుని పాదపద్మముల సేవా భాగ్యమునే వాంఛించును. అజ్ఞాని అల్పములగు ప్రాపంచిక సౌఖ్యములను, నశ్వరములగు భోగ్యపదార్థములను వాంఛించి పతనమును తానే కొనితెచ్చుకొనును. (కథలోని వర్తకునివలె) మతినిబట్టియే గతియు ఏర్పడుననుట తథ్యము. సన్మతిచే సద్గతి, దుర్మతిచే దుర్గతి సంభవించు చుండును. భగవానుని యనుగ్రహము లోకమున ఎల్లెడల వ్యాపించియే యున్నది. తదనుగ్రహచ్ఛాయలందు వసించియున్న జీవుడు ఉన్నతాశయ

ములు గలిగి, ఉదాత్తగుణములతో విరాజిల్లుచు, క్షుద్ర ప్రాపంచిక వాంఛలను పరిత్యజించి, మోక్షకాంక్షులై వర్తించినచో, పరమేశ్వరుని కృపాకటాక్షముచే మోక్షమాతనికి కరతలామలకము కాగలదు.

**నీతి : నశ్వర ప్రాపంచిక పదార్థములను కోరక, శాశ్వత దైవానుభూతినే వాంఛించుచు, అద్దానికొరకై తీవ్రతరయత్న మాచరించ వలయును.**

## అంత్యకాల స్మరణ

కన్నడ దేశమందలి బికానేర పట్టణమున పూర్వమొక ధనికుడు కాపురముండెను. అతడు అగర్భశ్రీమంతుడు. పెక్కు భవనములు, క్షేత్రములు అతనికి కలవు. తాను తన కుటుంబము నివసించుటకై ఒక నాలుగంతస్తుల మేడను ప్రత్యేకించి బహుసుందరముగ నిర్మించుకొనెను. అందు సకల భోగభాగ్యములను అనుభవించుచుండెను. అతనికి ప్రాపంచిక సంపద విస్తృతముగ నున్నదేకాని దైవసంపద కొంచమైనను లేదు. భగవంతునిపై విశ్వాసమతనికి ఏమాత్రమును లేదు. భగవన్నామ ముచ్చరించుమని, పుణ్యకార్యము లాచరించుమని ఎవరెన్ని చెప్పినను అతడు లక్ష్యపెట్టక ప్రాపంచిక సంపదే

డతేచ్చునను నమ్మకము గలిగి భోగలాలసుడై, దైవ
తి కాలము గడుపుచుండెను.

కాలచక్రము వేగముగ పరిభ్రమించుచుండెను. కొంత
ర కతనికి వార్థక్యము దాపురించెను. అంగములు
గ శైథిల్యము నొందజొచ్చెను. శరీరము శుష్కింప
ం. ఇట్టి పరిస్థితిలో ఒకనాడతనికి తీవ్రమైన వ్యాధియు
ంచెను. గొప్ప గొప్ప వైద్యులువచ్చి చికిత్స
ండిరి. కాని వ్యాధి తగ్గుముఖము పట్టలేదు. దుర్మత
సముగ అధికము కాజొచ్చెను. భిషగ్వర్యులు నిరాశను
దొడగిరి. అత్తతి ఆతని బంధువులు, ఆప్తులు అత్య
హావేశము జరిపి భవనముయొక్క మూడవఅంతస్తులో
నున్న ఆ రోగిని నెమ్మదిగ క్రిందకు దించి దొడ్డిలోగల
కొట్టమునందు పరుండబెట్టిరి.

వితములో ఒక్క పుణ్యకార్యమైనను చేయనివాడును,
పర్యాయమైనను భగవన్నామమును ఉచ్చరించని
పైపెచ్చు ఎన్నియో పాపకార్యములను చేసినవాడు
నికి సద్గతి లభించుటెట్లు? అని బంధువర్గము తలపోసి
మార్గము నన్వేషించుచుండిరి. పూజ్యులగు మహా
, గొప్ప తపస్సంపన్నులను, బ్రహ్మనిష్ఠులను, అను
ఈ విషయమై ప్రశ్నించిరి. 'అయ్యా! మా బంధు

వర్గములో ఒకడు జీవితమందేలాంటి పుణ్యకార్యమును చేయలేదు. ఇపుడు వృద్ధుడై, రోగగ్రస్తుడై, కాటికి కాళ్ళు చాపుకొనియున్నాడు. ఇట్టి పరిస్థితిలో అతడు తరించుట సద్గతి నొందుటకు ఏదైన మార్గముకలదా?' అని వారు పెద్దలను అడిగిరి. వారందరు ఏకగ్రీవముగ ఒకే ప్రత్యుత్తరమిచ్చిరి — 'ఓ జిజ్ఞాసువులారా! బాల్యమందుగాని, యౌవనమందుగాని, వార్ధక్యమందుగాని, అవసానదశయందుగాని ఏకాలమందైనను మనుజునకు శ్రేయము నొసంగునది దైవచింతనయే, భగవన్నామస్మరణయే'—అని వారు తెలిపిరి.

ఆ వాక్యములను వినిన వెంటనే ధనికుని బాంధవులందరును రివ్వున పరువెత్తి రోగియొక్క మంచముచుట్టు చేరి 'బావగారూ! మామగారూ! నాన్నగారూ! "నారాయణ" అనండి, "రామరామ" అనండి, "కృష్ణ కృష్ణ" అనండి' అని ఎన్ని పర్యాయములు బిగ్గరగా అరచినను, చెవిలో ఊదినను అతడు ఏమియు పలుకలేదు. కండ్లు తెరచి ఎదుటనున్న వారి మాత్రము చూచుచుండెను. అట్టి విపత్కర పరిస్థితియందు బాంధవుల కేమిచేయుటకును తోచలేదు. "ఈతడు అభాగ్యుడు. కనీసము అంత్యకాలమందైనను దేవుని స్మరించు పుణ్యమును నోచుకొనలేదు. భగవన్నామమును ఉచ్చరించలేదు, ఎట్టి ఘోరనరకమును జెందునో" అని బంధువర్గము

పరితపించుచుండ, అకస్మాత్తుగ రోగియొక్క ముఖమునుండి ఏదియో శబ్దజాలము బయల్వెడలుచున్నట్లును, అతడేదియో ఉచ్చరించుచున్నట్లును వారు కనిపెట్టిరి. తక్షణము వారు చెవులు నిక్కపొడుచుకొని అతని నోటి సమీపమునకుపోయి అతడేమి పలుకుచున్నాడో వినజొచ్చిరి. 'క, క, క' అను మూడు అక్షరములయొక్క శబ్దముమాత్రము వారు వినగల్గిరి. రోగి 'క, క, క' అని మాత్రము పలికి ఊరకుండెను.

వెంటనే ప్రజ్ఞావంతులగు బంధువులందఱును ఇట్లు యోచించిరి—'క, క, క,' అను మూడక్షరముల యొక్క అర్థమేమైయుండును ? ఇది ఏదైనా భగవన్నామమా ? లేక దేవత లాతనికి చివరి ఘడియలలో ఏదైనా ఇట్టి మంత్రమును ఉపదేశించినారా ? లేక అవి ఏవైనా గొప్ప బీజాక్షరములై యుండునా ? ఒకవేళ అయియున్నచో మనముకూడ అంత్యకాలములో ఈ ప్రకారముగ క, క, క అనినచో మనకుకూడ సద్గతి లభించునుగదా ! కాబట్టి దీని అంతర్యమేమియో తెలిసికొనుట మంచిది. అయితే దానిని ఇతరు లెవరును చెప్పలేరు. ఉచ్చారణచేసిన రోగియే చెప్పగలడు. అని నిర్ణయించుకొని బంధువర్గమంతయు అతని చెవియొద్ద చేరి ఏకకంఠముతో "నాన్నగారూ, బావగారూ ! మీరు పలికిన 'క, క, క' అను మంత్రముయొక్క అర్థమేమిటి ? త్వరగా చెప్పండి" అని బిగ్గఱగా

అరచిరి, కాని రోగి ప్రత్యుత్తర మీయలేదు, అందరు 'నిరాశ' పరిపూరితులైరి

కాని ధైర్యము వీడక వారందఱు తక్షణమే ఆ పట్టణములో గొప్ప ప్రాక్టీసు కలిగి పేరుమోగినట్టి ఒక డాక్టరు నొద్దకు వెళ్ళి 'మహాప్రభో! మహాశ్రీమంతుడైన మా బంధువొకడు చివరి ఘడియలలో ఏమియో బీజాక్షరములు పలికినాడు, బహుశా దేవతలు బోధించిన మంత్రమేమో అని దాని అర్థము తెలిసికొనవలెనని మేమందరము కుతూహలాయత్త చిత్తులమై యున్నాము. అతడు నోరు తెరచి మాట్లాడుటలేదు. ఇంకను కొద్దిక్షణములు మాత్రమే అతనికి మిగిలియున్నవి. తమరు దయచేసి ఏదైనా పటుతరమైన, మహాశక్తివంతమైన ఇంజక్షన్ అతనికి ఇచ్చి కొంచెము మాట్లాడునట్లుచేసితిరా, మీ ఋణము మేము తప్పక తీర్చుకొనగలము.' అని చెప్పిరి తోడనే డాక్టరు తన మందులపెట్టెను చంకనిడుకొని, స్టెతస్కోపును మెడలో ధరించి కారులో హుటాహుటి రోగియొద్దకు పయనమయ్యెను. రోగిని సమీపించి, నాడి పరీక్షించి, ఇంకను స్పృహ ఉన్నదని పలికి సద్యఃఫలితము నొసంగగల అద్భుతమగు ఇంజక్షన్ ఒకటి ఇచ్చెను వెంటనే ఫలితము చేకూరినది. రోగి కదలజొచ్చెను. మాట్లాడసాగెను.

ఇదియే అదను అని తలంచి బంధువులందఱును అతని చుట్టుచేరి 'నాన్నగారూ' మీరు పలికిన క, క, క అను మంత్రముయొక్క భావ్యం కొంచెం సెలవివ్వండి" అని ప్రార్థించిరి. వెంటనే అతడు "కరు కసబరికె మన్ను కడియుత్తదె" అని తానుచ్చరించిన బీజాక్షరములయొక్క వివరణమును తెలియజేసెను. దాని అర్థమేమనగా 'దూడ చీపురుకట్ట తినివేస్తున్నది"—కాబట్టి దానిని తీసి జాగ్రత్తచేయండి—అని. అతడు కన్నడ దేశస్థుడు కాబట్టి కన్నడభాషలో చెప్పెను. పశువుల కొట్టములో అతనిని పరుండబెట్టినందున అతని దృష్టి చీపురుకట్ట కొరికివేయుచున్న దూడపై ప్రసరించగా పై వాక్యము నుచ్చరించెను. అంత్యకాలమున అతనిని తాను సంపాదించిన కొలది ధనము వదలిపోవుచున్నది. సుందర భవనము వదలిపోవుచున్నది. భార్య, బిడ్డలు వదలిపోవుచున్నారు. సమస్త భోగభాగ్యములు, సంపదలు వదలిపోవుచున్నవి. ఇదియంతయు పోవుచున్నప్పటికి ఒక్క చీపురుకట్ట పోవుచున్నదే అను దిగులు అతనికి పట్టినది! ఎంత హాస్యాస్పదమైన విషయము! ఎంత శోచనీయమైనదశ! తన్నుచ్చరించినవారిని కడతేర్చునట్టి సర్వేశ్వరుని విస్మరించి, పవిత్రమైన భగవన్నామమును స్మరింపక అంత్యకాలములో తుచ్ఛమైన ప్రపంచ వస్తువులనే తలంచుకొనుచు, అందును హీనతరమైన ఒకానొక అల్పవస్తువును [చీపురును] భావించుచు ఆ ధనికుడు జీవితమును వ్యర్థపఱచుకొనెను.

తస్మాత్సర్వేషుకాలేషు మామనుస్మర అని భగవా పలికినట్లు జీవితమం దెల్ల వేళలందును దైవస్మరణచేయ పవిత్ర భావనలను గలిగియుండువానికే అంత్యకాలమున అట్టి నిర్మలభావములు వచ్చుచుండును. కాబట్టి ప్రతివా తమ జీవితమందలి ప్రతి ఘడియకూడ మహామూల్యవం గ్రహించి, భగవచ్చింతన యందును, పరోపకారమంద పుణ్యకార్యాచరణయందును దానిని వినియోగించుచు ప సంస్కారమును నేర్పరచుకొనినచో అంత్యకాలమందును ఉత్తమభావనలే జనింపే, భగవత్సాన్నిధ్యమును జేరి జీవిత ధన్యమొనర్చుకొన గలరు.

**నీతి :— జీవితకాలమంతయు దైవభావన యుండినచో అంత్యకాలమున అట్టి పవిత్ర దైవభా కలిగియుండి తరించును.**

## ఘనవాసన

ఒకానొక గజదొంగ అర్ధరాత్రివేళ జనసంకీర్ణ ఒకానొక పట్టణమందలి ఒక ధనికుని ఇంటిలో కన్నమువే చుండ ఇంటిలోనివారు ఆ చప్పుడుకు మేలుకొని కేకలు వేయ ఇరుగుపొరుగువారు లేచి పారిపోవుచున్న ఆ దొంగను త పట్టుకొని పోలీసుల కప్పగించిరి. పోలీసువారు అతనిపై

నమోదుచేసి న్యాయస్థానమందు విచారణ జరిపించిరి. పెక్కు-
మంది సాక్షులయొక్క అభిప్రాయమునుకూడ గైకొనిరి. తుట్ట
తుదకు న్యాయాధికారి అతడు అపరాధము చేసినట్లు పరిపూర్ణ
ముగ రుజువైనందువలన పది సంవత్సరముల కఠినఖైదును
విధించెను. దొంగ విధిలేక ఆ శిక్షను కారాగారమున అను
భవించుచుండెను. కొంతకాలమునకు శిక్షా కాలపరిమితి
పూర్తికాగా జైలు అధికారులు అతని విడుదలకు ఉత్తరువు
చేసిరి. కారాగార కవాటము అతని కొఱకు బార్లగా
తెరవబడెను. జైలునుండి దొంగ బయటకు పోవుచుండగా
ఇంతలో జైలు అధికారి అతని శిక్షాకాలపరిమితి యొక్క
అసలు విషయమై జరిగిన ఒకచిన్న పొరపాటును గమనించుట
సంభవించెను. 'శిక్షాకాలము' పది సంవత్సరములనియుండగా
రెండురోజులు అధికముగా అతడు జైలునందుంచబడెను. అది
గమనించి అధికారి జైలువదలి పోవుచున్న ఆ దొంగను వెనుకకు
పిలిచి "నాయనా! నీ శిక్షాకాలము రెండురోజులక్రితమే పూర్తి
అయినది. పొరపాటున రెండురోజులు అధికముగా నిన్ను
జైలునందుంచుట జరిగినది. ఈ విషయమై నీవేమియు ఆందో
ళన చెందకుము" అని వచింప వెంటనే ఆ దొంగ అధికారితో
'అయ్యా! జరిగినదానికి తమరేమియు కంగారు పడవద్దు.
రాబోయే శిక్షలో ఆ రెండురోజులు నాకు తగ్గించుకొనిన
చాలును" అని పలికి వెడలిపోయెను.

పది సంవత్సరకాలము కారాగారమున కఠినశిక్ష అనుభవించినప్పటికిని దొంగకు హృదయ పరిణామము కలుగలేదు. మఱియొక దొంగతనమునకు అప్పుడే నాంది ఏర్పాటు చేసికొనుచుండెను. ఇదియే ఘనవాసన. ఈ ప్రకారముగ జనులలో బహుజనాభ్యాసర్బది దుష్టవాసనలు కారణదేహమందు నిగూఢముగ దాగుకొని పలువిధముగ వారి చరిత్రను మలినపఱచుచున్నది. వానిని జాగ్రత్తగ గమనించి శుభసంస్కారములచే రూపుమాపి హృదయమును దోషరహితముగ కావించుకొనినతప్ప శాంతికి వేఱు మార్గములేదు. వివేకము నాశ్రయించి ప్రయత్నపూర్వకముగ దుష్టవాసనలను చిత్తమునుండి తొలగించివేయుటయే మానవజీవితముయొక్క ఏకైక లక్ష్యము. అపుడు మాత్రమే జీవుడు పరమాత్మను సాక్షాత్కరించుకొని జన్మసాఫల్యమును నొందగల్గును.

నీతి:— చెడ్డపనిని మరల మరల ఆచరించుచుండినచో అది ఘనవాసనగా పరిణమించును. కావున సత్కార్యములద్వారా వానిని అరికట్టి, తొలగించుకొని, మంచి అలవాట్లవే కలిగియుండులాగున అభ్యసించవలయును.

# సుఖదుఃఖములు-క్షణికములు

పూర్వకాలమున ఒకానొక భాగవతార్ అచటచట హరికథలను చెప్పుకొనుచు తన జీవికను నిర్వహించుకొనుచుండెను. వక్తృత్వమునందు అతనికీడేసాటి అనర్గళముగ ఉపన్యసింపగలడు. శ్రావ్యమైన కంఠము, చక్కని స్వరము గలవాడు. అతని వాగ్ధాటికి, సమయోచిత పదప్రయోగమునకు, ఉపమానాత్మకబోధకు జనులచ్చెరువొందుచుండిరి. మనోరంజకముగ హరికథలనుచెప్పుటలో గొప్ప పేరుప్రఖ్యాతులను పడయుటవలన అనేకులతనిని వారి వారి గ్రామములో కథ చెప్పించుటకై ఆహ్వానించుచుండిరి. ఈ ప్రకారముగ అతనికి అనుపమఖ్యాతి లభించెను.

ఇట్లుండ ఒకనాడు ఒక గ్రామమందలి పెద్దలందరు కలిసిమాట్లాడుకొని అతని నెట్లైన తమ గ్రామమునకు రప్పించి హరికథ చెప్పించుటకు నిశ్చయించుకొనిరి. అందులకై వారొక ఆహ్వానసంఘమును ఏర్పాటుచేసిరి భాగవతారుగారు సామాన్యవ్యక్తులు కారు గనుకను అలౌకిక మేధాశక్తి, పాండిత్యగరిమ, బోధనాపటుత్వము కలవారు గనుకను, ప్రజలను తమ దివ్యప్రవచనములచే ఉర్రూతలూగించుసామర్థ్యము గలవారు కనుకను, అట్టివారిచే హరికథ చెప్పించినచో తమ గ్రామమునకే గొప్పప్రతిష్ఠ కలుగగలదని భావించి వారొకా-

ర్యమున కుపక్రమించిరి. మహారాజులు వారిచే హరి
చెప్పించి ఘనముగ సన్మానించి పంపుటకై గ్రామస్థులు క
నిశ్చయులైరి.

ముహూర్తము నిర్ణయించబడెను. రాత్రి 9 గం
నుండి హరికథ ప్రారంభమగును. 8 గం||ల నుండియే జను
తండోపతండములుగ వచ్చి సభాస్థలమున ఆసీనులగుచుండి
ఎప్పుడు ఆ దివ్యవాక్కును శ్రవణానందముగ విందుమాయని
శ్రోతలు ఉవ్విళ్లూరుచుండిరి. సరిగా 9 గం||లకు భాగవతా
గారు వేదికపైకివచ్చి నిలబడిరి. ఆహ్వానసంఘమువా
కథకునికొఱకై ముందుగనే ఒక బ్రహ్మాండమైన పుష్పమాల
తయారుచేయుంచియుంచిరి అది ఇంతవఱకు కనివినియెఱు
గని బహుసుందరమైన మాల. భాగవతార్ గారికి త
గ్రామము తరపున అపూర్వస్వాగతము కావింపనెం
ఆహ్వానసంఘమువారు ఏబదిరూప్యములు వెచ్చించి ఆ సుంద
రమణీయకుసుమమాలను కట్టించియుంచిరి. సరిగా రా
9 గం||లకు భాగవతార్ గారు వేదికపైకి ఎక్కగనే వ
మెడలో వేయుటకై ఆహ్వానసంఘ కార్యదర్శిగారు (తాను
ఒక్కడు మోయలేకపోవుటచే) పుష్పమాలను మఱొకనిసహా
యముచే మోసికొనివచ్చుచుండెను. ఇరువురు వ్యక్తు
మోయలేక మోయలేక ఒక పెద్ద పుష్పమాలను తనయొద్ద

చ్చుచుండుటను భాగవతార్ గమనించిరి. అట్టి సుందర
ాలను తానింతవఱకెచటను చూచియుండ లేదు. ఇక ఒక్క
ామములో తనకు అపూర్వ, అలౌకిక సన్మానము జరుగనున్న
) యాతడు గ్రహించి తనలో తానిట్లు అనుకొనెను -"అహా!
ంత పెద్దమాల! ఎట్టి కుసుమరాసుల సమూహము! గులాబి,
మంతి, మల్లె, సంపెంగ మొదలైన రకరకముల పుష్పము లు
ర్చబడియున్న ఈ అద్భుత పుష్పమాలను నాజీవితములో
ందివఱకెన్నడును చూచియుండలేదు. అహో! ఎంత ఘన
న్మానము నాకు జరుగబోవుచున్నది! ఈ రోజు నా జీవిత
ంను చెప్పుకొనదగిన విశేషదినము (Today is the most
ppiest day in my life)" - అని ఈ ప్రకారముగ ఆ వారి
ా శిరోమణి తనలో తాను భావించుకొని ఉప్పొంగు
ండెను.

ఇట్లుండ కొద్దిసేపటికి కార్యదర్శులు భాగవతార్ గారి
ిడలో పుష్పమాలను వేసిరి. సభికులు ఆనంద పరవశులై
ప్పట్లు కొట్టిరి. ఇక కథ ప్రారంభము కానున్నది. అట్టి
ిలో భాగవతార్ గారు ఒక్క విపరీతమైన వేదనను అనుభవించు
న్నట్లు ప్రజలు గమనించిరి. అతని ముఖకవళికలో ఏదియో
ార్పువచ్చినట్లు, అతిదెండులలో బాధపడుచున్నట్లు శ్రోతలు
ెసికొనిరి. అతడు తన పై వస్త్రము ను దులుపుకొను.

చుండెను. ఒడలంతయు చేతులతో పదేపదే తుడుచుకొను చుండెను. జనుల కేదియు బోధపడలేదు. హరికథ ప్రారంభించకుండ ఈతడేమి నానాఅవస్థలు పడుచున్నాడని శ్రోతలు కంగారుపడుచుండిరి. జరిగిన విషయమేమనగా ఆ పుష్పమాలలోని గులాబిపువ్వులలో ఎఱ్ఱ చీమలు ఉన్నవి అవి భాగవతార్ గారి ఒడలంతయు ప్రాకి కుట్టదొడంగెను ఆ వేదన దుర్భరముగనుండెను. పుష్పమాల తీసివేయుదమా, ఉంచుకొందుమా, ప్రాణసంకటము—ఈ పరిస్థితిలోపడి భాగవతార్ గారు నానాయాతనలనుభవించుచు 'ఈరోజు నాజీవితములో మహాదౌర్భాగ్యమైనదివసము [Today is the most miserable day in my life]' అని వాపోవదొడగెను. తోడనే యతడు ఇతరుల సహాయముచే ఆమాలను తీసివైచి ప్రక్కన ఉంచి కథా ప్రవచనమును ఉపక్రమించెను.

చూచితిరా! మహాసుఖకరమైనదివసము ఒక క్షణములో మహాదుఃఖకరమైన దివసముగా పరిణమించినది. జీవితము సుఖదుఃఖముల సముచ్చయము. కావున సుఖముకలిగినపుడు పొంగరాదు. దుఃఖములు వచ్చినపుడు క్రుంగరాదు. ప్రాపించిన వస్తువులద్వారా లభించు సుఖమునుజూచి మురిసిపోరాదు. దృశ్యపదార్థములవలన కలుగు సుఖము క్షణికమైనది. దానిని నమ్మరాదు. వెనువెంటనే దుఃఖమువచ్చి ఆవరించునను విషయమును మఱువరాదు.

'సమ దుఃఖ సుఖం ధీరం' అని గీతాచార్యుడు సెలవిచ్చినట్లు సుఖదుఃఖములందు సమభావముకలిగి, ఆ రెండిటిని లెక్క చేయక, నిరతిశయ ఆత్మసుఖమునకై యత్నించుటయే విజ్ఞుడు చేయవలసిన పని.

**నీతి : సుఖము వచ్చినపుడు పొంగరాదు. దుఃఖము వచ్చినపుడు కృంగరాదు. సుఖదుఃఖములందు సమభావము కలిగియుండవలెను.**

## జ్ఞానోదయము

పూర్వకాలమున ఒకానొక పట్టణమున ఒక ధనికుడుండెడివాడు. అతడు వ్యాపారముద్వారా లక్షలకొలది ఆస్తిని సంపాదించెను. ఒకనాడతని కొక సంకల్పము జనించెను. అదియేదనగా ఈ ప్రపంచమున ఎందరో చక్కని గృహములను సౌధములను నిర్మించుకొని కాపురముండుచున్నారు. నాకు పరమాత్ముడు కోట్లకొలది ధనమును ప్రసాదించినాడు. అట్టిచో ఈ చిన్న గృహమునందే నాజీవితము ను గడుపనేల ? బ్రహ్మాండమైన ప్రాసాదమును, రాజభవనమును వల నిర్మించుకొని కాపురముండరాదు ? కావున ఎన్ని లక్షలద్రవ్యము

నైనను ఖర్చుపెట్టి ఇంతవఱకు కని విని యెఱుగనట్టి, అపూర్వ భవనమును నిర్మించుకొని అందు నివశించెదను .. అని ఈ ప్రకారముగ ఆ ధనికుడు గొప్పగొప్ప మేస్త్రీలను వేలకొలది కార్మికులను నియోగించి రెండు సంవత్సరములలో రమణీయముగు హర్మ్యమొకదానిని నిర్మింపజేసెను.

ఆ ప్రాసాదము అత్యంత మనోహరముగ నున్నదై రాజభవనములను గూడ మఱపింప చేయుచుండెను. పది అంతస్తులుగల బ్రహ్మాండమైన సౌధమది, ప్రతి అంతస్తునందును నవీనపద్ధతులతో ఏర్పాటుచేయబడిన చిత్ర విచిత్ర పరికరములెన్నియో, అమర్చబడి కనులపండువుగా నుండెను. ముఖ్యముగా అన్నిటికంటె పైనున్న అంతస్తు ప్రత్యేక అలంకారములతో గూడినదై, స్నానపానాది సమస్త సౌకర్యములతో గూడి, చూచుటకు ముచ్చట గొలుపుచుండెను. ధనికుడు క్రిందనున్న తొమ్మిది అంతస్తులను అద్దెకిచ్చి తాను మాత్రము కుటుంబముతో సహా పదవ అంతస్తునందు కాపురముండుచుండెను. కనుకనే అద్దానిని ఎంతయో మనోహరముగ తీర్చిదిద్దెను. ఆ భవనము, అందును ముఖ్యముగ ధనికుడు స్వయముగ వసించు పదవ అంతస్తు చూపరులకు దిగ్భ్రమ గొలుపుచు మయుని సృష్టిని జ్ఞాపకమునకుదెచ్చుచుండెను.

ధనికుడు తాను నిర్మించిన గృహమును జూచి మురిసి పోవుచుండెను. ఆ పట్టణమునకు పెద్దలెవరు విచ్చేసినను, వారిని తన గృహమునకు తీసికొనివచ్చి అంతయు చూపించి పంపుచుండెను. ఒక విజిటర్స్ బుక్ [Visitors Book] ఏర్పాటు చేసి తన భవనమును గూర్చి ఇతరులచే వారి అభిప్రాయము లను అందు లిఖింప జేయుచుండెను. ప్రతివారును తామిట్టి సర్వాంగ సుందరభవనము నింతవఱకెచటను కని విని యుండ లేదనియు, ఇది లోకోత్తర సుందర భవనమనియు అందు వ్రాసి వెళ్లుచుండిరి. వారి యీ అభిప్రాయములను తిలకించి ధనికుడు పరమానంద భరితుడగుచుండెను.

ఇట్లుండగ ఒకనాడా పట్టణమునకొక సాధువు విచ్చేసెను. ధనికుడు ఆ సాధువుగారిని తన యింటికి ఆహ్వానించి భిక్ష ఏర్పాటుచేసి, భోజనానంతరము తన గృహమంతయు అతనికి చూపెను. క్రిందనున్న తొమ్మిది అంతస్తులను ముందుగా చూపి తుదకు తాను స్వయముగ నివసించుచున్న పదవ అంతస్తునకు సాధువుగారిని తీసికొనివెళ్లి, అచటగల ప్రతివస్తు వును వివరించిచెప్పుచు అంతయు చూపెట్టెను. సాధువుగారు అచటచట గల ఆధునిక సౌకర్యములను, మిరుమిట్లు గొలుపు చిత్రవిచిత్ర వస్తుసామగ్రిని, అలంకారములను జూచి పరమాశ్చర్యము నొందెను. ఈ ప్రకారముగ అంతయు చూపిం

చిన పిదప ధనికుడు 'మహాత్మా! ఈ గృహమును గూర్చి
మీ యభిప్రాయమును తెలియజేయుడని కోరగా, అంతట
సాధువుగారిట్లు వచించిరి—'ఓయీ! ఇట్టి దివ్యభవనమును
నేనింతవఱకెచటను చూచియుండలేదు. ఇది అపూర్వముగ
నున్నదై చూపరులకు మహోల్లాసమును గలుగజేయుచున్నదను
టలో ఏలాంటి సందియమును లేదు. అయితే ఒక్క విషయ
ము మాత్రము నాకు చాలదిగులు కలుగుచున్నది. ఈ
మిద్దెపై మీరు చనిపోయినపుడు మిమ్ములను దింపుట కష్టము.
మీ శవమును పది అంతస్తులు దింపవలెనన్న చాల కష్టము!'

ఆ వాక్యములను వినగనే ధనికుని గుండె బ్రద్దలయ్యెను.
భవిష్యత్తులో తనకు మృత్యువు సంభవించుననిగాని, అపుడు
తనకును తన భవనమునకును ఎడబాటు కలుగునని అతడు
కలలోనైన నూహించలేదు. తాను, తన భవనము శాశ్వత
మని తలంచి దానిని గాంచి మైమరచి పోవుచుండెను. అట్టి
సమయమున సాధువుగారు ధనికునకు కనువిప్పు కలిగించెను.
భవిష్యత్తులో జరుగబోవు ఒక మహాప్రమాదము నాతనికి
గుర్తునకు తెచ్చెను. అదియే మృత్యువు. దానిని మఱచి
జనులు భోగవిలాసములలో మునిగి, ప్రాపంచిక వ్యవహారము
లలో నిమగ్నులై, నామరూప జగత్తు సత్యమని నమ్మి విషయ
ముల వెంట పరుగిడుచు తమ సౌందర్యము, తమకీర్తి, తమ

అధికారము, తమ ప్రతిష్ఠ తమ గృహారామాదులు చూచి మురిసిపోవుచున్నారు. సాధువు వచించిన వాక్యముద్వారా ధనవంతునకు ప్రపంచవస్తు స్వరూపము దృగ్గోచరమయ్యెను. బాహ్యవస్తువుల క్షణికత్వము అనుభూతమయ్యెను. అతనికి జ్ఞానోదయము కలిగెను. అప్పటినుండియు అతడు తన భవనముపైగాని, ఇతర వస్తువులపైగాని మమత్వముంచక, అట్టి క్షణిక వస్తుజాలముపై విరక్తిగలిగి శాశ్వతమగు పరమాత్మనే ఆశ్రయించి, జప, ధ్యానపరాయణుడై జీవితమును సద్వినియోగ పఱచుకొనెను.

జనులు తమ సంపదలను, వైభవములను జూచి విఱ్ఱవీగరాదు.

'మా కురు ధన జన యౌవనగర్వం
హరతి నిమేషాత్కాలస్సర్వం'

అను శంకర భగవత్పాదుల వాక్యానుసారము అవియన్నియు కాలగర్భమున అంతరించిపోవును. గోవిందుడొకడే శాశ్వతుడు. కావున ఆ పరమాత్మనే భజించవలెను. (భజగోవిందం) అతనినే ఆశ్రయించవలెను. బాహ్యవస్తువులన్నియు, తుదకు దేహము కూడ కాలక్రమమున నశించిపోవు

నను పరమరత్యమును ఏ కాలమందును మఱువరాదు. ఈ ప్రకార మెఱింగి, వ్యవహార మాచరించుచున్నప్పటికి దేని యందును తగుల్కొనక, భగవంతుని ఆశ్రయించి కాలము గడుపువాడు ధన్యుడు. అట్టివాడు బాహ్యవస్తువులపై మమత్వ ముంచక తన హృదయస్థ పరమాత్మను ఈ జీవితమందే సాక్షాత్కరించుకొని కృతార్థుడు కాగలడు. అట్టి ఆత్మ సాక్షాత్కారమే జీవితపరమార్థమని సర్వులు గుర్తెరిగి అద్దాని యత్నపూర్వకముగ బడసి ధన్యులు కావలయును.

**నీతి : ప్రాపంచిక వైభవములు అశాశ్వతములు వానిని చూచి మురిసిపోరాదు. తాముచేసిన పుణ్యమే, తానుపొందిన ఆత్మజ్ఞానమే తన్ను రక్షించును.**



23]

# యద్భావం తద్భవతి

పూర్వ మొకానొక వర్తకునకు తీర్థయాత్ర చేయవలెనను సంకల్ప ముదయించినది. యాత్రకు కావలసిన పాథేయమును, ద్రవ్యమును గైకొని అతడు పాదచారియై ఇల్లు విడిచి ఏకాకిగ బయలుదేరెను. త్రోవలో అచటచట సత్రములందు, ధర్మశాలలందు అన్నము వండుకొని తినుచు, విశ్రమించుచు అతడు తన యాత్రను కొనసాగించుచుండెను. ఆరు మాసములు గడచినవి. కొన్ని వందలమైళ్లు ప్రయాణము జరిగినది, అతడు వెళ్లదలచిన పుణ్యక్షేత్రము ఇంకను చాల దూరమున నుండెను. కాని పట్టుదల వీడక యాత్రికుడు గమనము సల్పుచుండెను.

ఇట్లుండ ఒకనాటి మిట్టమధ్యాహ్న సమయమున, ఎండ తీవ్రముగ కాయుచుండ, కాలికి చెప్పులుగాని, తలపై గొడుగు గాని లేనందువలన యాత్రికునకు నడక దుర్భరముగా నుండెను. దినకరుని తీక్ష్ణ కిరణసంజాతము పాంథుని శరీరము మిక్కుటమగు తాపమును కలుగజేయుచుండెను. విశ్రమించుటకు చుట్టుప్రక్కల ఎచటగూడ ఒక చెట్టుగాని, ఒక ఇల్లుగాని లేకుండెను. ఒకవైపు ఆకలిబాధ, మరొకవైపు ఎండవేడిమి వలన — వీనితో యాత్రికుడు సతమతమై పోవుచుండెను. ఇట్టి స్థితిలో దవ్వున బ్రహ్మాండమైన వృక్షమొకటి అతనికి గోచరిం

చెను. అది ఒక అరమైలు దూరమున నుండెను. పాంథుడు
వడివడిగ దానివైపునకు తన నడకను కొనసాగించెను. ఎట్ట
కేలకు అద్దానిని జేరి దాని శీతలచ్ఛాయయందు ఒకింతసేపు
విశ్రమించెను.

అది మధ్యాహ్నము ఒంటిగంట సమయము. ఒడలం
తయు చెమట కారుచుండ తుడుచుకొనుచు 'సమీపమున
ఎచటనైన జలాశయమున్నచో స్నానముచేసిన బాగుండును'
అని అతడు సంకల్పించెను. తోడనే వృక్షముపైనుండి జల
జల నీళ్లు రాలజొచ్చెను. ఆకాశగంగ అవిర్భవించెనా యను
నట్లు దివ్యస్రోతము వృక్షాగ్రమునుండి క్రిందకు ప్రవహింప
దొడగెను. 'ఇది ఏమి ఆశ్చర్యము!' అని పాంథుడు విస్తు
పోయెను. పూర్వ మేమహనీయుడో ఆ చెట్టుక్రింద గొప్ప
తపస్సు చేసినందువలన ఆ చెట్టునకు కల్పవృక్షముయొక్క శక్తి
ఆవిర్భవించెను. అనగా దానిక్రింద ఎవరు ఏది సంకల్పించిన
అది నెరవేరుచుండెను. పాంథున కావిషయము తెలియదు.
కనుకనే ఆ జలప్రవాహమును జూచి అచ్చెరు వొందెను

యాత్రికుడు ఆ మందాకినీసలిలధారలయందు స్నాన
మొనర్చి, సేద తీర్చుకొని, కొద్దిసేపు విశ్రమించి 'ఆకలి మండి
పోవుచున్నది, చక్కని భోజనమెవరైన తెచ్చిపెట్టినచో ఎంత
బాగుండును!' అని సంకల్పించెను. కల్పవృక్షముక్రింద ఇట్టి

సంకల్పము చేసెను కావున తక్షణమే అచ్చోట పంచభక్ష్య పరమాన్నములతో నిండిన విస్తర ప్రత్యక్షమయ్యెను. బాటసారియొక్క ఆనందమునకు మేర లేకుండెను. 'అహా! ఇది యేమివింత! భగవంతుడు నాపై ఎంతటి కరుణామృతమును వర్షించుచున్నాడు!' అని లోలోన భావించుకొనుచు ప్రఫుల్లిత చేతస్కుడై దివ్యమగు ఆయాహారమును కడుపార భుజించెను.

భోజనానంతరము తిరిగి యాతడిట్లు సంకల్పించెను—"ఇది ఏకాంతస్థలము. ఒంటరిగా నుండుటకు నాకు భయము కల్గుచున్నది. సహాయకులెవరును లేరు. ఇంటియొద్ద నున్న, నా భార్య ఇచటికిగనుక విచ్చేసినచో నాకెంతయో ధైర్యము చేకూరగలదు." అది కల్పవృక్షము కావున వెంటనే అతని సంకల్పము నెరవేరెను. ఎక్కడనో ఉన్న అర్ధాంగి ఆ చెట్టు క్రింద ప్రత్యక్షమయ్యెను. అయితే భార్యనుజూచి అతడు ఆనందపడలేదు. అతనిలో ఈ పరిణామము నొక వితర్కము జనింపసాగెను.—'కొన్నివందల మైళ్ళ దూరముననున్న నా ధర్మపత్ని ఇచటికి ఎట్లు రాగలదు? అసాధ్యము. ఈమె నిజముగా నా భార్యయో, లేక ఏదైన దయ్యామో!'—ఇట్లు సంకల్పించుటయే తరువాయి భార్య అదృశ్యమై అచట ఒక దయ్యము ప్రత్యక్షమయ్యెను. ఆ దయ్యమునుజూచి యతడు "ఈ దయ్యము నన్ను మ్రింగివేయునేమో" అని యనుకొనెను. తోడనే అది వానిపైబడి పీకి తినివైచెను. యాత్రికుడు

మరణించెను.

కల్పవృక్షము క్రింద చేరినప్పటికిని యాత్రికుడు తన మృత్యువును తానే తెచ్చుకొనెను. తన వినాశమును తానే కలుగజేసికొనెను. జీవులయొక్క స్థితి ఈ ప్రకారముగనే ఉన్నది. తాను వాస్తవముగ మోక్షస్వరూపుడయ్యు, ఆ విషయము మఱచిపోయి తాను అల్పుడని భావించి సంసార కూపమున పడి తన బంధనమును తానే కల్పించుకొనుచున్నాడు. తత్ఫలితముగ అనేక జన్మలనుండి దుఃఖయాతనల ననుభవించుచున్నాడు. 'సక్రమముగ ఉపయోగించుకొనినచో, తన మనస్సే తన్ను ఉద్ధరించగలదు. అజాగ్రత్తగనున్నచో, సోమరితనమును వహించినచో, తమోగుణమును ఆశ్రయించినచో, తన మనస్సే తన్ను అంధకూపమునకు చేర్చగలదు. "యద్భావం తద్భవతి" [తానెట్లు తలంచునో అట్లగును]— అను విధమున తనయొక్క నిత్యశుద్ధముక్త ఆత్మస్వరూపమును గూర్చి నిరంతరము చింతన చేయుచుండినచో, అట్టి దివ్యరూపుడే తాను కాగలడు. అట్లుకాక అపవిత్ర సంకల్పములు కలిగి, క్షణికమై, నశ్వరమై, మలమూత్రములతో నిండియుండు దేహమే తానని భావించుకొనినచో బంధనమున చిక్కుకొని, జననమరణరూపబాధల ననుభవించగలడు. కావున తన ఉద్ధారమునకు జీవుడు తానే కర్త. అట్లే తన పతనమునకు తానే కారకుడు. ఈ సత్యమును గుర్తెఱిగి మనుజుడు నిరం

తను ఊర్ధ్వదృష్టి, ఊర్ధ్వభావములు ఉన్నతాశయములు గలిగి—Look up, aim high — అనునట్లు మహోన్నత పరమాత్మ దృక్పథము గలవాడై తరించుగాక!

నీతి :— మనుజుడు తన్ను తానే ఉద్ధరించుకొనవలెను. ఆత్మానుభూతినిబడసి అమూల్యమగు మానవజన్మను సార్థకపఱచుకొనవలెను. పవిత్రమగు మానవజన్మను దురుపయోగము చేయరాదు.

# దుష్కర్మ ఫలితము

పూర్వకాలమున ఒకానొక పట్టణ ప్రాంతమున గజదొంగ ఒకడు కాపురముండెను. అతడు దొంగతనమున ఆరితేరినవాడు. ప్రజల సొత్తు క్రమముగ హరించి, దారిదోపిళ్లు చేసి, పలువురను వధించి ఎన్ని పర్యాయములో జైలుశిక్ష అనుభవించినవాడు. అతని హృదయమున దయాదాక్షిణ్యములకు చోటులేదు. అతనికి రాత్రి పగలువంటిది. నిర్భయముగ భీకరారణ్యములందు, నిర్జన పర్వతప్రాంతములందు నిశీథసమయమున సంచరించుచుండెను. అమాయకులను దోచుకొనుటలో అందెవేసినచేయి అతడు. ఈ ప్రకారముగ అతడు తన జీవితమును భ్రష్టమొనర్చుకొనుచు, పాపమును మూటగట్టుకొను చుండెను.

ఇట్లుండఁ ఒకనాఁడు ఒకానొకచోట హరికథ జరుగుచుండఁగా, జనులు తండోపతండములుగ నచటకువచ్చి నిశ్చల భక్తితో భగవత్కథాశ్రవణము గావించుచుండఁగా, తాళ మృదంగాదుల మధుర ధ్వనులు భక్తుల వీనులకు సోకి తన్మయ మొనర్చుచుండఁగా, ఆ వేడుకఁగాంచుటకై వచ్చిన జనులమధ్య ఆ దొంగ కొద్దిసేపు కూర్చుండెను. అత్తఱి ధర్మమును గూర్చిన ప్రసంగము నడుచుచుండెను. అమూల్యమైన మానవజీవితమును పాపభూయిష్ఠమైన కార్యములందు వ్యర్థము చేసినచో, తత్ఫలితముగ జీవుడు ఘోర యమయాతనలను అనుభవింపవలసివచ్చుననెడు సిద్ధాంతమును కథకుడు మనోరంజకముగ ప్రతిపాదించుచుండెను. ఆ వాక్యములు వినగనే తస్కరుని హృదయమందు ఒకింతపరిణామము కలుగ నారంభించెను: “ఈ పాపపు బ్రతుకేల ? జానెడు పొట్టకొఱకై అవినీతికరములైన కార్యముల నాచరించుట సిగ్గుచేటు. భవిష్యత్కాలమున ఏది శ్రేయమును ఒనగూర్చునో ఏది శాశ్వతసుఖమొసంగునో దానినే ఆశ్రయించవలెనుగాని నీచ కార్యములకు గడంగి ఒకింత ప్రాపంచిక సుఖమును తాత్కాలికముగ సంపాదించుటకై యత్నింపరాదు. పాపముయొక్క భయంకర పరిణామములను ఇప్పుడే యోచించుకొని సత్పథమున జనుటకై కృతనిశ్చయుడను కావలయును.—అని ఈ ప్రకారముగ ఆ చోరశిఖామణి తనలో తాను వితర్కించుకొనుచుండెను.

కాని మాయ బలీయమైనది. దుర్వాసనలు తొలగుట కష్టము. అవి యున్నచోట మంద వైరాగ్యములు పనిచేయవు. బహుకాలము చిత్తమున ఘనీభవించియున్న పాపసంస్కారములు అకస్మాత్తుగ తొలగుట మాటలా ? అవి ఒక రాగాన జీవుని వదలవు. పెద్దల సహవాసముచే ఒకింతపరమార్థ గంధము అంటినను అది నిలుచుట కష్టము. వాసనాప్రాబల్యముచే పాతసంస్కారములు జనులందు ఎగిరెగి పడుచుండును. అదేవిధముగ మన గజదొంగకును హరికథా శ్రవణముచే ఒకింత ధర్మబుద్ధి ఉదయించినను బహుకాలము చిత్తకుహరమున రూఢిపడియున్న దొంగబుద్ధి అతనిని పూర్తిగ విడువలేదు. అందుచే అతడొక నిశ్చయము కావించుకొనెను. "ఇప్పటికి నా జీవితమున ఎన్నివందల పర్యాయములో దొంగతనము చేసితిని. దొంగతనము పాపమను విషయము ఇపుడు ఖాయమైపోయినది. ఇకమీదట అట్టి పాపకృత్యమెన్నడును చేయరాదను సంకల్పముకూడ నాయందు కలుగుచున్నది. కాని పొరపాటు బహుకాలప్రవాహముచే అలవాటుగా మారియున్నది. కాబట్టి ఒక్కసారిగా అమాంతముగ ఈ దుర్వ్యసనమును వదలలేకున్నాను. అందుచేత ఇప్పుడు ఒక్క పర్యాయము మాత్రము ఒకానొక పెద్ద దొంగతనముచేసి ఆ మీదట దానిని పూర్తిగ మానివేసెదను. లోకమున అందరికంటె శ్రీమంతుడు రాజు. కాబట్టి నేటిరాత్రి రాజుగారి

ఇంట్లో దొంగతనము చేసి, అదియే నా జీవితములో చివరి దొంగతనముగా భావించి ఇకమీదట దానికి భరతవాక్యమును పలికెదను."

అని ఈ ప్రకారముగ నిశ్చయించి ఆ తస్కరశిరోమణి ఒక జ్యోతిష్కునియొద్దకు వెళ్లి "మహాత్మా! రాజుగారింటి యందు దొంగతనము చేయుటకు ఒక చక్కని ముహూర్తమును, తాము నిర్ణయించి చెప్పవలెను. అందులకు యోగ్యమగు కట్నమును చెల్లించెదను"—అని పలుకగా జ్యోతిష్కుడు కన్నెఱ్ఱచేసి, "ఓయీ! మేము పెండ్లిండ్లకు, గృహప్రవేశములకు లగ్నములు పెట్టువారమేకాని దొంగతనములకు కాదు. నీ వాక్యములను ఎవరైన కొంపతీసి వినినచో నిన్ను, నన్ను కూడ (శ్రీ) కృష్ణజన్మస్థానమునకు తీసికొని వెళ్లెదరు. కావున ఇక నీ ప్రసంగమును కట్టిపెట్టి శీఘ్రముగ ఇచ్చోటు వదలి పొమ్ము" అని గద్దించి చెప్పెను. వెంటనే గజదొంగ జ్యోతిష్కుని చెవిలో ఏదియో రహస్యముగ చెప్పెను. ఆ మాటలు వినగనే జ్యోతిష్కుడు పరమానందముతో చిందులు త్రొక్కుచు తనయొద్దనున్న జ్యోతిష్య గ్రంథములన్నిటిని తిరుగవేయనారంభించెను. జ్యోతిష్కుని చెవిలో దొంగ చెప్పినది- "చౌర్యగము స్వాహా" అను యుక్తివాక్యము, అనగా "ఓ జ్యోతిష్కుడుగారూ! రాజుగారింట్లో దొంగిలించిన ధనములో

నీకు సగం, నాకు సగం!" ఆ వాక్యము వినగనే సిద్ధాంతి ఆనందడోలికలలో ఊగులాడుచు, తనకు రాజుగారి సంపదలో కొంతిభాగము తప్పక రానున్నదని సంతసించి, తిథివార వర్జ్యములను లెక్కగట్టుచు ఒక చక్కనిముహూర్తమును నిశ్చయించి దొంగకు చెప్పెను. "నేటిదినము అర్థరాత్రి 12 గం॥ల 9 నిముషములకు నీవు రాజుగారింట్లో ప్రవేశించినచో అద్భుతముగు కార్యసాఫల్యము సిద్ధించును." అని సిద్ధాంతి పలుకగా దొంగ ఆ సమయమును గుర్తుపెట్టుకొని వెడలిపోయెను.

అది నిశీథసమయము, అర్థరాత్రి సమీపించుచుండెను. అంధకారము నలుదెసల దట్టముగా వ్యాపించియుండెను. రాజభవనమున అందఱును గాఢనిద్రలో నుండిరి. ఆ ముహూర్తబలమేమిమోకాని, రాజప్రాసాదము యొక్క ద్వారపాలకులు కూడ అత్తఱి నిద్రలో తన్మయులై యుండిరి. అందుచే దొంగ నిరాటంకముగ లోనికి ప్రవేశింపగలైను. జాగత్ప్రపంచముయొక్క స్ఫృహయే ఎవరికిని లేనందున దొంగ నిరాఘాటముగ తనపని సాగించుకొని పోవుచుండెను. తాను తెచ్చిన సంచులనిండా బంగారివు పాత్రలను, విలువగల ఆభరణాదులను వేసికొని మూటగట్టుచుండెను. మరల ఇట్టి సుముహూర్తము, ఇట్టి మహదవకాశము దొఱకుట దుర్లభమని భావించి దొంగ చాలసేపు దొంగతనము చేయనారంభించెను.

ఇంతలో తెల్లవారెను. రక్షక భటులు నిద్రలేచి దొంగను పట్టుకొనిరి. వానిని పాశములచే బంధించివైచి రాజుగారి యొద్దకు గొనిపోయిరి. నృపాలు డంతయు విచారించి వీపుపై బెత్తములతో నూరుదెబ్బలు అతనిని కొట్టునట్లు ఆజ్ఞాపించెను.

రాజాజ్ఞ ననుసరించి భటు లాతనిని దూరముగ తీసికొని వెళ్లి వీపుపై ప్రహారములు సల్పుచు దెబ్బలను లెక్కపెట్టు చుండిరి. ఏబదిదెబ్బలు తినినమీదట దొంగ భటులతో 'ఓయీ! ఇక నన్ను కొట్టవద్దు. నా భాగస్థుడొకడున్నాడు. తక్కిన యాభై దెబ్బలు అతనిని కొట్టవలయును. మేము చేసికొనిన ఒడంబడిక ప్రకారము సగము ఆస్తి అతనికి దక్కవలెను!" ఆ వాక్యములను వినినతోడనే భటులు నివ్వెరపోయి, జరిగిన వృత్తాంత మంతయు తెలిసికొని, దొంగతనమునకు లగ్నము పెట్టిన జ్యోతిష్కుని చెవి మెలిపెట్టి అచటికి తీసికొనివచ్చి వీపువంచి తక్కిన యాభై దెబ్బలు అతనిచే తినిపించిరి. పాప మార్గమును ప్రోత్సహించిన కారణముచే పాపఫలితమగు దుఃఖమును జ్యోతిష్కు డనుభవింపవలసి వచ్చెను.

కర్తా కారయితా చైవ ప్రేరకశ్చానుమోదకః
పుణ్యకార్యే పాపకార్యే చత్వార స్సమభాగినః

అనునట్లు పుణ్యకార్యమందుగాని,పాపకార్యమందుగాని చేసిన వాడు,చేయించినవాడు, ప్రోత్సహించినవాడు, అనుమోదించిన

వారు, నలుగురుకూడ సమానముగ ఫలితము లను బొందిరి. పుణ్యకార్య తత్పరులు సుఖమును సమానముగ పంచుకొందురు పాపాచరణ శీలురు దుఃఖమును సమానముగ పంచుకొందురు భయందు దొంగతనముచేసిన గజదొంగ దొంగతనమును ప్రోత్సహించిన జ్యోతిష్కుడు ఇరువురును శిక్ష సమానముగ అనుభవించిరి. కాబట్టి పాపకార్యముల నెపుడును చేయరాదు వానిని ప్రోత్సహించను రాదు దుష్కర్మల యొక్క దారుణ ఫలితములను ముందుగనే ఊహించి ఆపాపకర్మలకు శాశ్వతముగ తిలోదకము లొసంగవలెను. కర్మసిద్ధాంతము అపరిహార్యమైనది కావున జీవుడు తాను చేయుకర్మ పవిత్రవంతమై, దైవగంధయుతమై, పాపరహితమైన పరోపకారయుక్తమై యుండులాగున చూడవలెను. అపుడే జీవితము చక్కగ రాణించును. భగవదనుగ్రహమున్ను జీవునకు సంప్రాప్తమగును మానవత్వము సార్థకమగుట కిట్టి సదాచారము జనులాశ్రయించవలెను. దుష్కృత్యములను ఏకాలమందును దరికి జేర్చరాదు. సంసారదుఃఖమంతరించుట కిదియే ఏకైక మార్గము.

**నీతి:- పాపము యొక్క ఫలితము దుఃఖమని యెఱిగి పాపకర్మను లవలేశమైనను చేయరాదు.**

# మనస్త్యాగమే పరమానందహేతువు

పూర్వ మొకానొక పట్టణపరిసర ప్రాంతములందు గొప్పపర్వత మొకటి కలదు. అది సుదూరముగ విస్తరించి గగనచుంబితవృక్షరాజములతో శోభిల్లుచు దట్టమైన అడవులతోగూడి శోభాయమానముగనుండెను. ఆ పర్వతముయొక్క దక్షిణభాగమున ఒక పెద్దగుహ కలదు. ఆ గుహలో ఒక తపస్వి ధ్యానము చేసికొనుచుండెను. కందమూలములను, ఫలములను భుజించి, సమీపమునే ప్రవహించు సెలయేటిలో నీరు త్రాగి ఆ మహాత్ముడు తన జీవికను నిర్వహించుకొనుచు ఆత్మానుభూతిని బడయుటకొఱకై తీవ్రతరతప మాచరించుచుండెను. కొంతకాలమున చిత్తమునగల వాసనాదిమాలిన్యము తొలగిపోయి హృదయము పరిశుద్ధముకాగా ఆత్మసాక్షాత్కారమును బడయగల్గెను. 'ఉద్యోగినం' పురుషసింహముపైతి లక్ష్మీః— అనునట్లు మహోన్నతపరమార్థయత్నశీలుడైన ఆ యోగిపుంగవునకు అచిరకాలములో మోక్షలక్ష్మీప్రాప్తి సిద్ధించెను. జీవిత లక్ష్యము సిద్ధించెనుగదాయని యతడు పరమానందపడుచు కాలమును గడుపదొడంగెను.

ఇట్లుండ ఒకనాడు తత్పర్వతసమీపవర్తియైన పట్టణము యొక్క రాజు గురూపదేశమును బడయదలంచి మహాత్ముల కొఱకై తీవ్రముగు అన్వేషణను కొనసాగించుచు భాగ్యవశమున

ఆ పర్వతగుహాయందు తపమాచరించుచున్న ఆ యోగీశ్వరుని కడ కేతెంచెను. సద్గురూత్తముడగు ఆ మహనీయునకు సాష్టాంగ వందన మాచరించి నృపాలుడీ ప్రకారముగ వినయాన్వితుడై తన యభిప్రాయమును నివేదించుకొనెను—

“మహాత్మా! సంసారమొక బ్రహ్మాండమైన నరక కూపముగనాకు కన్పించుచున్నది. నాకు లలనామణులు కలరు, ఐశ్వర్యము కలదు, ఉత్తుంగభవనములు కలవు, సైన్యము కలదు, కీర్తిప్రతిష్టలు కలవు. కాని ఏమిలాభము! ఉండవలసినది మాత్రములేదు. శాంతి ఒకటియే చాల కొఱతగా నున్నది. ఎన్నియున్నను మనశ్శాంతిలేనిచో జీవునకు ఆనందమెచట! అహోరాత్రములు మనస్సులో ఒకటే యాతన. రాగద్వేషములతో, మానావమానములతో, అభిమాన ఆసక్తులతో మనస్సు తల్లడిల్లిపోవుచున్నది. సంపద యున్నదేకాని శాంతి లేదు. కాబట్టి మహాత్మా! గురుదేవా! ఈ ఘోరసంసారసాగరము నుండి సముత్తరించు ఉపాయమేదియో సెలవిండు. సాంసారిక యాతనలను తప్పించుకొను మార్గమును కరుణతో బోధింపుడు ఈ దుర్భర అశాంతి పరిస్థితులలో మీరేమాకు శ్రీరామరక్ష. మీ దయాదృష్టిని మాపై ప్రసరించి ఈ భీషణ దావానలము నుండి మమ్ము రక్షించి కడతేర్పుడు!”

భూపతియొక్క యాదీనవచనములను ఆలకించి బ్రహ్మవిద్వరిష్ఠుడగు ఆ తపస్వి క్షణకాలము మౌనమువహించి

అంతఃస్తుష్టుడై, ఒకింతయోచనచేసి తిరిగి యా రాజుతో నిట్లనియె—'నృపాలా! భయపడవలసిన పనిలేదు. నీవు చెప్పినదంతయు పరమసత్యము. ఆత్మజ్ఞానము లేనివారికి ఈ సంసారమువలె దుష్పారముగ, అనంతముగ గన్పడును కాని స్వస్వరూపానుభూతి కలవారికీ బ్రహ్మాండమంతయు గోష్పదము వలె అల్పముగ కానుపించును. శాంతికి మార్గమును నేనిప్పుడే నీకు బోధించెదను అయితే ముందుగా నీవొక కార్యమును చేయవలెను. నీవు వెళ్లి దేశ దేశములు తిరిగి ప్రపంచములో ఎందుకును పనికిరానివస్తువేదియో తెలిసికొని నాయొద్దకు రమ్ము తరువాత నీకు బోధగావించెదను!'

గురుదేవుని యాజ్ఞను శిరసావహించి వెనువెంటనే రాజు అచ్చోటువీడి చనెను. గ్రామగ్రామములు తిరిగెను. పట్టణము లన్నియు గాలించెను. అనేకులతో సంప్రదించెను. కాని, పనికి రాని వస్తువేదియు అతనికి గోచరింపలేదు. ఏవస్తువు చూచి నను ఏదియో ఒక పనికి ఉపయోగించుచునే యున్నది. అట్టిచో ఇక పనికిరాని వస్తువేవి కలవు?—అని రాజు ఆలోచించుచుండెను గురుదేవుని ప్రశ్నకు ఏమి సమాధానము చెప్పవలెనో రాజు నకు తోచకుండెను. ఈప్రకారము ఒక నెలరోజులు గడచెను. కాని కార్యసాఫల్యము కాలేదు. పనికిరానివస్తువేదియు రాజునకు కన్పట్టకుండెను. తుదకు హతాశుడై తన యసమర్థతను గురు

దేవునకు విన్నవింపఁదలించి అతడు ధ్యానమొనరించుచుండిన పర్వతగుహాస్థైపునకు వడినమై పోవుచుండెను. ఇంతలో మార్గమధ్యము న నొకచోట దుర్గంధపూరితమైన మలము పడియుండుటనుగాంచి అది యెందులకు పనికిరాని నికృష్ట వస్తు వని భావించి గురుదేవుని ప్రశ్నకు భాగ్యవశమున తగు సమాధానము లభించెనని హర్షోత్ఫుల్లమానసుడై త్వరితముగ గిరికందరమును చేరుకొనెను.

ఇట్లు గురుసన్నిధానమునకు పూజ్యపాదులకు భక్తి ప్రపత్తులతో ప్రణమిల్లి నతశిరుడై చేతులు కట్టుకొని ఇట్లు వచించెను — దేవా! తమ యాజ్ఞ మేరకు దేశదేశములు సంచరించి ఎందుకు పనికిరాని వస్తువేదియో తెలిసికొనివచ్చి తిని. మానవుడు విసర్జించిన మలము అతి నికృష్టమై, హీనమై, దుర్గంధపరిపూర్ణమై, హేయమై, సర్వులచే దూష్యమై ఎందు కును పనికిరాని వ్యర్థవస్తువుగ నాకు తోచినది!

రాజుయొక్క ఆ వాక్యములను విని గురుదేవుడిట్లు ప్రబోధించెను. — "భూపాలా! మనము అన్నింటికంటె నికృష్ట వస్తువని నీవు చెప్పితివిగదా. ఆ మలమెట్లు ఏర్పడినది? ఏ యంత్రము దాని నా ప్రకారముగ తయారుచేసినది? దేహమను యంత్రము. తెలిసినదా? క్రిందటిరోజు రాత్రి మనుష్యుడు పంచభక్ష్య పరమాన్నము, చక్కని స్వాదిష్ఠ

భోజనము, గారెలు, బూరెలు, మధురాతిమధురములైన పిండివంటలు సుష్టుగ తిని పడుకొని హాయిగ నిద్రించి ఉదయము నిద్రలేచినపుడు అరమణీయవస్తువులే ఈ హీనమగు మలరూపముగ పరిణమించి దేహమునుండి బహిర్గతములగు చున్నవి. అసుగంధ భోజ్యపదార్థములే ఈ దుర్గంధహేయ పదార్థముగ మారిపోవుచున్నవి. దీనికి కారణమేమి? ఎద్దాని సాహచర్యముచే మంచి వస్తువు చెడ్డవస్తువుగ మారిపోయినది? మానవదేహమే దీని కంతకును కారణమని యెఱుఁగుము.

ఓరాజా! లోకములో కొన్ని యంత్రములు కలవు. ఆయంత్రములు గోధుమలు, బియ్యము, పప్పుదినుసులు మొదలైన వానిని పిండిచేయును. వానినే పిండిమరలు [ Flour Mills ] అందురు. ఆ యంత్రములో గోధుమలువేసి ఆడించిన, క్రింద గోధుమపిండిపడును, పైన బియ్యమువేసిన క్రింద బియ్యపుపిండి పడును. వానిలో పైనవేసిన వస్తువు, క్రిందరాలు వస్తువు రెండును పవిత్రములుగనే యుండును. కాని అదేమి విచిత్రమోకాని, ఈ దేహమనుపిండిమరలో పైన (నోటిలో) లడ్డుమొదలైన మంచి వస్తువులు వేసినచో క్రింద పాడు వస్తువుగ తయారై బయటకు వెడలుచున్నవి. ఓరాజా! నీవు మలమునుచూచి ప్రపంచములలో కెల్ల పనికిరానివస్తువుగ దానిని వర్ణించితివి. అట్టి మలమునకు కారణభూతమైన ఈ దేహము మాటేమి? ఎంతయో చక్కని పదార్థమును

మలముగ మార్చివేచు యంత్రము ఉత్తమమైనదా! నికృష్ట మైనదా! రాజా! నీవే ఆలోచించుకొనుము.

ఇంతియేకాదు, అటువంటి దేహమును 'నేను' అనుకొను మనస్సు ఇంకను ఎంత నీచమైనది? అట్టి నశ్వరహీనతర దేహముపై అభిమానముంచి అదియే తానని భావించు అజ్ఞాన యుక్త మనస్సు ప్రపంచములో అన్ని పదార్థములకంటెను నీచమైనదని నా అభిప్రాయము. అట్టి అజ్ఞానపూరిత మనస్సును త్యాగ మొనర్చినవాడే లోకమున పరమానందమును బొంద గలడు. దేహాభిమానముగల మనస్సు మహాప్రమాదములను తెచ్చిపెట్టును. జీవుని సంసారబంధనమున బద్ధుని జేయును. కావున అట్టి మనస్సును త్యజించుటయే పరమశాంతికి ఏకైక మార్గము. ఓరాజా! నీవును చక్కగా విచారణసల్పి, మనస్సునందలి దోషములను పరిహరించి, అద్దానిని అధిష్ఠానమగు ఆత్మయందు లయింపజేయుము. అభిమానయుక్తమైన, దోషయుక్తమైన మనస్సుయొక్క ఉనికియే బంధము. అద్దాని త్యాగమే మోక్షము. కావున మనస్త్యాగమే పరమానంద హేతువని యెఱిగి ఓరాజా! నీవును చక్కని సాధనద్వారా, శమదమాదుల అభ్యాసముద్వారా అట్టి మనోలయస్థితిని బొంది సుఖింపుము.

శుకదేవునియొక్క యీ గంభీరవచనములను, అపూర్వమగు బోధను విని రాజు పరమానందపడి 'మహాత్మా! తమ

యాజ్ఞ మేరకు అట్లే కావించెదను. ఇట్టి నిరుపమాన బోధను విను భాగ్యము కల్గినందులకు నేను ఎంతయో ధన్యుడను, కృతకృత్యుడను. తమ పరిపూర్ణ కటాక్షము నాపై నుండు లాగున అనుగ్రహింపుము, అని వచించి సాష్టాంగ దండ ప్రణామ మాచరించి శ్రద్ధాంజలి ఘటించి అచ్చోటువీడి చనెను. కాబట్టి మనస్త్యాగమే పరమానందహేతువని ముముక్షువు లెల్లరు గ్రహించి అట్టి మహోత్కృష్ట స్థితికై చక్కని సాధన గావించవలెను. మనస్సునందలి తమోగుణ రజోగుణములను, వాసనాది దోషములను నిర్మూలించుటకై తీవ్రతర యత్నము గావింపవలెను. ప్రయత్నవంతునకు అసాధ్యమైన కార్యము ముల్లోకములందును ఏదియు లేదు.

**నీతి : మలిన మనస్సే జీవునకు బంధహేతువు. కాబట్టి మనోమాలిన్యమును తొలగించి వైచినచో నిర్మలమనస్సు అధిష్ఠానమగు ఆత్మయందు లయమై జీవునకు పరమానందమును కలుగజేయును.**

# దీపమున్నప్పుడే ఇల్లు చక్కబెట్టుకొనుము

పూర్వమొకానొక పట్టణమందు ఒక గొప్ప శ్రీమంతుడు నివసించుచుండెను. అతడు వ్యాపారముద్వారా లక్షలు గడించెను. విలువగలిగిన భవనములెన్నియో అతనికి గలవు. పాడిపంటలు సమృద్ధిగ నుండెను. అతనికిగాని, అతని కుటుంబమునకుగాని ఏ విధమైన లోటు లేదు. భోగభాగ్యములతో అతడు తులతూగుచుండెను. అంతటితో తృప్తిగలిగి హాయిగ ఉండవచ్చుగదా! కాని ఆశయనునది ఒక మహాపిశాచము. దానిని ఆశ్రయించువారు చిల్లులబుట్టతో నీళ్లు తోడువారివలె నుందురు. ఆ బుట్ట ఎప్పటికిని నిండదు. పైకి వచ్చునప్పటికి బుట్ట ఖాళీగా అయిపోవును. అట్లే తృష్ణను సేవించువారికి పరిపూర్ణత్వ మెప్పటికిని కలుగదు. తృప్తియనునది వారి గ్రంథకోశములోనే యుండదు.

ధనికునకు బోలెడు ఆస్తియున్నప్పటికిని తృప్తిపడక అనేక మార్గములద్వారా ఇంకను విత్తమార్జించుటకు పథకములను వేయసాగెను. అందులకై యతడు అసత్యము, ద్రోహము, అన్యాయము, మోసము మొదలగు హేయగుణములను ఆశ్రయింపదొడగెను. ఈ ప్రకారముగ క్రమక్రమముగ జీవితమును భ్రష్టమొనర్చుకొనెను. అదిచూచి అతని

ఆ మిత్రులలో నొకడు, ఒకింత పరమార్థచింత గలవాడు అతనికిట్లు హితోపదేశము చేసెను—

మిత్రమా! మాయయొక్క వలలో పడిపోవుచున్నావు. ఒకింత తెప్పరించుకొని నీభవితవ్యమును జాగ్రత్తగ ఆలోచించుకొనుము. జీవితములు క్షణికములు. పాంచభౌతికమైన ఈ శరీరము, కొలది రోజులలో పంచభూతములలో విలయమై పోగలదు. అత్తరి నీ దేహముతో నేకాక, నీ దేహసంబంధులతో నేకాక, నీవు సేకరించిన ధన కనక వస్తువాహన క్షేత్రములతో నేకాక ప్రపంచములోని సమస్త పదార్థములతోను నీకు వియోగము సంభవించగలదు. ఏదైన పుణ్యమో, పురుషార్థమో జీవితములో సంపాదించుకొనినచో అదియే భవిష్యత్తునందు నీకు శ్రేయమును ఒనగూర్చగలదు. పుణ్యము దారిబత్తెమువంటిది, దానిని ఎంత అభివృద్ధి పఱచుకొనిన అంతమంచిది. కాబట్టి భక్తిని అలవాటుచేసికొనుము. ప్రతి దినము కొద్దిసేపైనను భగవన్నామమును జపింపుము. జగత్తున కంతటికి కారణభూతుడైన పరాత్పరునియొక్క అనుగ్రహమును సంపాదించుటకై యత్నింపుము.'

ఈ ప్రకారముగ ధనికుని మిత్రుడు పరిపరి విధముల అతనికి హితబోధ కావించెను. కాని చెవిటివానికి శంఖము వినిపించనట్లు కరుడుకట్టిన అజ్ఞానముతో నిండియున్న అతని

హృదయమును ఆ బోధలు ఒకింతైనను ప్రభావిత మొనర్ప జాలకుండెను. అందుచే నతడు యథారీతి పాపమయ జీవిత మునే కొనసాగించుచుండెను. ఒక్కనాడైనను దైవచింతన గాని, నామస్మరణగాని, అతడు చేయలేదు.

ఇట్లుండ కొంతకాలమున కా ధనికునకు వార్ధక్యము దాపురించెను. కాలము ఎవరికొఱకును ఆగదు కదా! అది సమస్త పదార్థములకును పరిణామమును కలుగజేసికొనుచు పోవుచుండెను. తత్ఫలితముగ కాలక్రమమున ధనికుని శరీరము కృశించ నారంభించెను. దంతములు రాలజొచ్చెను. చూపు మందగించెను. దేహదార్ఢ్యము తగ్గదొడగెను. వ్యాధులు శతృవులపగిది తనువు నాక్రమింపసాగెను. ఒకనాడతనికి తీవ్రమైన జ్వరము, వాంతులు, భేదులు ప్రారంభమయ్యెను. సతీసుతులు, బంధుమిత్రాదులందఱు అతని పడకదగ్గర గుమి గూడి అత్యంత అనుభవసంపన్నుడైన భిషగ్వరునిచే ఔషధము నిప్పించుచుండిరి. కాని ఫలితము లేకపోయెను. ధనికునికు వ్యాధి ప్రబలము కాజొచ్చెను. అత్తఱి బంధుగులందఱును అతని మంచమును బయటవైచి, చుట్టునుమూగి, దుఃఖించుచు కింకర్తవ్య విమూఢులై పడియుండిరి.

అట్టి విపత్కర సమయమున అచ్చోటనున్న ధనికుని బంధువులలో నొకనికి ఒక చక్కని ఊహతట్టెను. — శాస్త్రము

లలో అంత్యకాలమున భగవన్నామమును స్మరించు వానికి సద్గతి కలుగునని వచింపబడినదికదా! గీతయందును అట్లే చెప్పబడియున్నదికదా! ఇప్పుడితనికి అంత్యకాల మాసన్నమైనది కావున! మనమందఱముకలిసి ఈతనిచే భగవన్నామమును ఉచ్చరింపజేసెదము — దానిచే నితనికి సద్గతులు కలుగును."— అని నిశ్చయించి యతడు తన శుభసంకల్పమును ప్రక్కనున్న వారందఱికి తెలియజేయ వారందఱు 'భేష్ భేష్! చక్కని ఊహ. జీవితమంతయు ఇతడు పొరపడి పాపముచేసెను, ఇక ఈ చివరి దశలోనైనను పుణ్యము సంపాదించుకొనుట శ్రేయస్కరము. కాబట్టి ఏదియోవిధముగ ఈతనిచే నామస్మరణ చేయించుట మన విద్యుక్తధర్మము' అని ఆలోచించినవారై రోగియొక్క మంచము చుట్టుచేరి, కుమారులు బంధువులు అందఱును అతని చెవిలో 'నారాయణ' అను శబ్దమును పలుకుచుండిరి. 'నాయనా! నారాయణ అనండి. మీ పాపములన్నియు తొలగిపోతవి. ఒక్కసారైనా అనండి! తండ్రీ! నారాయణ అని ఒక్కసారిచెప్పండి!" ఈ ప్రకారముగపుత్రులు బిగ్గరగా సంబోధించుచుండిరి. కాని ఆ దౌర్భాగ్యుడు నోరు విప్పనేలేదు పాపముపండిన జీవికి పుణ్యముచేయుటకు మనసొప్పదు కదా! కావున అతడు తనసద్గతికై మిగిలియున్న ఆ చివరి అవకాశమునుకూడ ధారపోసికొనుచుండెను.

ఆ పరిస్థితినంతను గమనించి అచటనున్న వారలలో సుసీశిల ప్రజ్ఞావంతుడైన రొకడు తత్క్షణము ఆ యూరిలోని గొప్ప వైద్యునికడకు పరుగెత్తుకొనివెళ్లి "అయ్యా! మహాత్మా! మా పెద్దనాయనగారు కోటీశ్వరులు. అంత్యకాలము వచ్చినది. ఇక కొద్ది ఘడియలలో దేహయాత్ర పూర్తిచేయనున్నారు. అతనికి శరీరస్పృహ పూర్తిగాపోలేదు. ఇటునటు కదలుచున్నాడు. కాబట్టి భగవన్నామమును ఒక్కసారైన అతనిచే ఉచ్చరింపచేయుటకు ఒకింతశక్తి చేకూర్చగల్గు శక్తివంతమైన "ఇంజక్షన్" తమవద్ద ఏదైన నున్నచో దానిని తీసికొనిరండి. శరవేగముతో మనముపోయి అతనికి మేలు చేకూర్చెదము. ఒక్కక్షణ మాలస్యమైనచో పరిస్థితి తారుమారై పోగలదు ఇందులకై మీకెంత ద్రవ్యమైనను సమర్పించి మీ ఋణమును నేము తీర్చుకొనగలము'— అని వచింప పేరుమోగిన ఆ వైద్యుడు తత్క్షణము బయలుదేరి వేగముగ రోగిచెంతకు జని మంచి ఇంజక్షన్ ఒకటి ఇవ్వగా రోగి నెమ్మదిగా పలుక నారంభించెను.

అదను చూచుకొని వెంటనే కుమారులందఱు నాయనా! నారాయణ అనండి. నారాయణ అనండి! అని పలుమారు చెప్పినను ప్రయోజనము లేకపోయెను. అత్తరి అచ్చటనున్న వారిలో గణితశాస్త్రప్రవీణుడైన ఒకానొకనికి ఇట్టి ఆలోచన తట్టెను.—"ఇతడు నారాయణ అను మొత్తముపదము అనలేక

పోవుచున్నాడు దానిలో సగమైన అనగలిగినచో, అనగా "నారా" అని అనినచో సగము [50%] పుణ్యము లభించును. కాబట్టి ఇతనిచే "నారా" అని అనిపించుటకై కృషిచేసెదము. ఈ ప్రకారముగ నిశ్చయించుకొని అతడు పరుగెత్తుకొని బజారునకు వెళ్ళి ఒకపిసెడు నారపీచు తెచ్చి రోగికండ్ల ముందుగా దానిని వ్రేలాడదీసి "అయ్యా! తండ్రీ! ఇది ఏమిటో చెప్పండి" అని పెద్దగా ప్రశ్నింప తక్షణమే రోగి దానినిచూచి 'ఇదేమిటా ? ఇది "పీచు" అని చెప్పి మరణించెను. పాపము ధనికునకు నారా అను పదములోని సగము పుణ్యముకూడ దక్కలేదు.! ఎట్టి దౌర్భాగ్యము!

జీవితమంతయును రామనామస్మరణము చేయువానికి అంత్యకాలమున రామనామమే స్మరణకు వచ్చును. జీవిత మంతయు సర్వేశ్వరుని పదపంకేరుహములను సేవించువానికి నీవసానకాలమున ఆ సర్వేశ్వరుడే స్మృతిపథమునకు వచ్చును. అట్లుకాక యావజ్జీవితము విశ్వంభరుని మైమరచి కుక్షింభరులై మెలగినచో ఇక అంత్యకాలమున దివ్యమగు భగవత్స్మరణ యెట్లు కలుగ గలదు ?

"తస్మాత్స 'ర్వేషుకాలేషు మామనుస్మర యుధ్యచ", ఎల్లకాలములందును తన్ను స్మరించుచు వారివారి జీవిత వ్యవహారము లాచరించుకొనుడని గీతాచార్యుడైన శ్రీకృష్ణ

పరమాత్మ కరుణతో జనులకు బోధించిన వాక్యమును మఱువక జీవితములో ప్రతిక్షణము దైవస్మృతియందు గడుపుట శ్రేయస్కరము. బాల్యయౌవనములందే, పరిస్థితులు అనుకూలముగ నున్నప్పుడే రోగములు దాపురించక పూర్వమే, శరీరము స్వస్థముగ నున్నప్పుడే జ్ఞాపకశక్తి మందగించకమునుపే జనులు దైవధ్యానపరులై, ఆత్మవిజ్ఞానమును సముపార్జించి ధన్యులు కావలయును. దీపమున్నప్పుడే ఇల్లు చక్కబెట్టుకొనవలెను.

**నీతి : జీవితము క్షణికము. చేయవలసిన ఆధ్యాత్మిక సాధనలెన్నియో కలవు. కావున ఆరోగ్యము చక్కగా ఉన్నప్పుడే సాధనలను లెస్సగ ఆచరించి తరించవలెను.**

## అసూయను త్యజించవలెను

పూర్వమొకానొక గ్రామమునందు ఇరువురు వ్యక్తులు ఉండిరి. వారికి ఒకరిపై మరియొకరికి పరమవిద్వేషము, ఈర్ష్య, అసూయా ఉండుచుండెను. ఒకరినిచూచి మఱియొకరు ఓర్చలేరు. ఒకడు వృద్ధినొందుచుండిన, మఱియొకడు దానినిచూచి బాధపడుచుండెను. ఒకనికి కష్టము కలిగిన మఱియొకడు

ఆనందముతో చిందులు త్రొక్కుచుండెను. ఈ ప్రకారము వారిలో ఒకనిపై మఱియొకనికి అసూయ తాండవించుచుండెను

అసూయ అనునది ఒక మహాదుర్గుణము. ఎన్ని సుగుణములున్నప్పటికిని అసూయ అను ఈ ఒక్క దుర్గుణమున్నచో తక్కిన గుణములన్నియు నిర్వీర్యములై శోభావిహీనములై యుండును. కళాయిలేని పాత్రలో వండిన పప్పువులును చెడిపోవునట్లు అసూయాగ్రస్తునియందు ఏ యితరసుగుణమున్న శోభించదు. రాణించదు. దుర్యోధనునకు బలము, ఉత్సాహము, శక్తి, సామర్థ్యము, ప్రజ్ఞ మొదలైనవి ఎన్నియో ఉన్నప్పటికిని, అసూయ అను ఒక్క దుర్గుణము వానియన్నింటిని నాశనముచేసివైచి అతని జీవితమునకే ఎసరు తెచ్చిపెట్టిన విషయము లోకవిదితమేకదా! భగవద్గీతలో శ్రీకృష్ణ పరమాత్మ అర్జునుని సంబోధించునపుడు "అనసూయవే" అను పదమును ప్రయోగించి "అసూయలేని ఓ అర్జునా! నీకు ఈ అతి రహస్యమైన జ్ఞానమును ఉపదేశించుచున్నాను" అని పల్కియుండుట గమనింపదగినది. అసూయ లేనివానికే చక్కని జ్ఞానోపదేశము లభించును. అసూయ అను ఈ ఘోరమైన దుర్గుణమునకు ముముక్షువులు ఎంత దూరముగ నుండిన అంత మంచిది.

కథలోని ఆ యిరువురు వ్యక్తులు అసూయాగ్రస్తులై ఒకరిపై ఒకరు కారములు, మిరియములు నూరుకొనుచు,

కనపించిన చోట్లనెల్ల ఒకరిపై ఒకరు దుమ్మెత్తిపోసికొనుచు
కాలము గడుపుచుండిరి. ఇట్లుండ ఒకనాడు వారిలో నొకనికి
బ్రహ్మదేవుని ఉపాసించి కొన్నిసిద్ధులు సంపాదించవలెనను
కోరిక జనింపగా అతడు ఊరుబయటగల ఒకానొక ఏకాంత
ప్రదేశమునకు పయనమై ఒక చెట్టుక్రింద కూర్చొని ఆహార
మును వర్జించి తీవ్రముగ తపముచేయ నారంభించెను. ఈ
సంగతి తెలిసికొని అతని శత్రువు "వాడు తపస్సుచేసినచో
నేను మాత్రము అతనికి తీసిపోవుదునా ? నాకు తపస్సుచేయ
కాహతులేదా ?' అని భావించి ఆ గ్రామము బయట మరి
యొక చోటుకుపోయి ఒక చెట్టుక్రింద కూర్చొని మొదటివానివలె
బ్రహ్మదేవునిగూర్చి తపము ప్రారంభించెను. ఈ సంగతి
మొదటివానికి ఎట్లో తెలిసిపోయెను.

కొంతకాలమునకు బ్రహ్మదేవుడు వారల తపస్సునకు
మెచ్చి వరముల నొసంగుటకై మొదటివానియొద్దకువచ్చి
'ఓయీ! నీ తపస్సునకానందించితిని. ఏదైన వరము కోరు
కొనుము' అని పలుకగా నతడు 'మహాత్మా! ఈ గ్రామము
బయట వేఱొకచోట నాకు గిట్టనివాడొకడు తపస్సుచేయు
చున్నాడు. ముందు వానివద్దకేగి అతడేమి కోరుకొనునో
తెలిసికొని అతడు కోరినదానికి రెట్టింపు నాకు దయచేయుడు'
అని ప్రార్థించెను. బ్రహ్మదేవు డందుల కంగీకరించి రెండవ
వానియొద్దకువెళ్ళి, "ఓయీ! నీ తపస్సునకు మెచ్చితిని. ఏదైన

వరము కోరుకొనుము” అని పలుక, అందుల కా రెండవవాడు 'మహాత్మా! తాము మొదటివానియొద్దకు వెళ్లిరా? అతడేమి కోరుకొనెను?” అని ప్రశ్నించెను. బ్రహ్మదేవుడు “అతడేమియు కోరుకొనలేదు. ముందు నీయొద్దకు వెళ్లి నీవు కోరుదానిని తెలిసికొని దానికి రెట్టింపుయిచ్చిన చాలును అని పలికె”ననగా, అవు డా రెండవవాడు “అట్లైనచో మహాత్మా! నాకు ఒక కన్ను పోగొట్టుము” అని ప్రార్థించెను. బ్రహ్మదేవుడు తథాస్తు అని చెప్పి అంతర్ధానమయ్యెను. తోడనే ఆ రెండవ వానికి ఒక కన్ను గ్రుడ్డిఅయ్యెను. అతడు కోరినదానికి రెట్టింపు ఫలితము మొదటివానికిన్ని లభ్యమయ్యెను. అనగా మొదటి వానికి రెండు కండ్లు గ్రుడ్డిఅయ్యెను. అతడు పూర్తి గ్రుడ్డి వాడుగా మారిపోయెను.

అసూయయొక్క నగ్నతాండవము ఇచ్చోట చక్కగా దృగ్గోచరమగుచున్నది. మొదటివానిపై అసూయచే వాని నట్లైన బాధించవలెనని తలంచి, వానిని పూర్తిగ్రుడ్డివానిగ చేయదలంచి రెండవవాడు తన ఒక కంటినిగూడ వదలుకొని, ఏకాక్షుడగుటకు సిద్ధపడెను. అవతలవానిని బాధించునిమిత్తము తానుకూడ బాధపడుటకై సంసిద్ధుడయ్యెను. ఇది యెంత హేయమైన స్థితియో విజ్ఞులు యోచించవలెను. ఒక్క ప్రాణికి అపకారము తలపెట్టినచో అది సాక్షాత్ భగవంతునికిచేయు

అపచారమే కాగలదని ఎంత శీఘ్రముగ మనుజుడు గ్రహించ గల్గిన అంతమంచిది. కాబట్టి పరప్రాణికి హితమునే వాంఛించుచు, ప్రాణికోట్లయెడల దయకలిగి, జీవకారుణ్యము కల వాడై, ఎల్లెడల భగవంతుని అస్తిత్వమును అనుభూతమొనర్చు కొనుచు జీవుడు పరమార్థపథమున అగ్రేసరుడు కావలయును. అసూయ అను ఘోర దుర్గుణమును మొదలంట పెరికివైచి హృదయమును నిష్కంటక మొనర్చుకొనవలెను. పవిత్ర హృదయమే దైవనిలయమని జనులు సదా జ్ఞప్తియందుంచు కొందురుగాక!

**నీతి : అసూయ నీచమైన దుర్గుణము. దానిని మానవుడు ఏకాలమందును దరికి చేర్చరాదు.**

## దేహదృష్టిని విడనాడవలెను

మిథిలా నగరమును జనకమహారాజు పరిపాలించు రోజులవి. జనకభూపాలుడు గొప్ప ధార్మికసంపన్నుడు. ఆధ్యాత్మికజిజ్ఞాస పరిపూర్ణముగ కలవాడు. అష్టావక్రుడు, యాజ్ఞవల్క్యుడు మొదలైన అనుభూతిపరులగు గురువరేణ్యుల యొద్ద బ్రహ్మజ్ఞానమును బడసినవాడు.

అట్టి మైథిలేశుడగు జనకుడు ఒకనాడు తన యాస్థాన మున బ్రహ్మాండమైనసభ నొకదానిని జరుపుచుండెను. ఆసభకు గొప్ప గొప్ప పండితులు, కవులు, భాషాప్రవీణులు, శాస్త్ర కోవిదులు పలువురు విచ్చేసిరి. పండితప్రకాండులచే, విద్యాధురంధరులచే ఆ సభ కిటకిటలాడుచుండెను. సభ ప్రశాంతముగ జరుగుచుండ, సభ్యులు తమ పాండిత్యప్రకర్షను వెలిబుచ్చుచుండ, ఒక్కొక్కరు తమతమ విద్యావైదుష్య మును భూపాలునకు పరిచయముచేయుచుండ ఇంతలో ఆ సభాభవనములోనికి ఒకానొక మహర్షి ప్రవేశించి నేరులో భూపతియున్న స్థానమున కరుదెంచుచుండెను. అతనిపేరు అష్టావక్రుడు. శరీరమున ఎనిమిది వంకరలుండుటవలన అష్టా వక్రుడనుపేరు కలిగినది. అతడు గొప్ప తపస్సుచేసిన మహా నీయుడు, బహుకాలము తత్త్వవిచారణ సలిపి, తీవ్రసాధన యొనర్చి ఇంద్రియములను, మనస్సును అదుపులోనికి తెచ్చు కొని స్వస్వరూప పరమాత్మ సాక్షాత్కారమును బొందిన మహర్షిసత్తముడతడు. అతని ముఖము బ్రహ్మవర్చస్సుచే దేదీప్యమానముగ ప్రకాశించుచుండెను.

అట్టి మహనీయుడగు ఋషిసత్తముడు సభాభవన ములో ప్రవేశించుటతోడనే, సభలో ఆసీనులైన కవిశేఖరులు పండిత ప్రకాండులు, ఆ మహర్షియొక్క శారీరక దేహమందలి వంకరలను చూచి ఒక్కుమ్మడి పకపక నవ్విరి. ఈ ప్రకార

ముగ సభ్యులందరును తన్నుగాంచి బిగ్గరగ నవ్వుచుండ వారలను జూచి అష్టావక్రుడున్ను పెద్దగా నవ్వెను. ఇంతలో జనకమహారాజు తన సింహాసనముపై నుండి దిగివచ్చి ఆ ఋషివర్యున కెదురేగి వారిని ఆహ్వానించి సత్కరించి ఉన్నతాసనముపై గూర్చుండబెట్టెను. తదుపరి సభా కార్యకలాపములన్నియు ఉచితరీతి నెరవేర్చబడెను. కొంత తడవునకు సభా సమాప్తముకాగా సభ్యులు వారివారి గృహములకు నిష్క్రమించిరి.

సభ్యులందఱును వెడలిన పిదప జనకమహారాజు వినయాన్వితుడై అష్టావక్రుని ఈ ప్రకారముగ ప్రశ్నించెను— "మహాత్మా! తాము సభలో ప్రవేశించగనే ఇచట ఆసీనులైన వారందఱును ఒక్కసారిగా నవ్విరి. ఆ నవ్వునకు కారణమేదియో నాకు తెలియును. తమ శరీరమందలి వంకరలు చూచి వారు నవ్వియుందురు. కాని తమరేల వారిని చూచి నవ్విరో నాకు అర్థమగుటలేదు. మహాత్మా! తాము నవ్వుటకు గలకారణ మేదియో దయచేసి తెలుపప్రార్థన" ఆ వాక్యములను విని గురుదేవు డీ ప్రకారముగ సముచిత సమాధానమొసంగెను.

ఓ రాజా! "పండితుల సమావేశము జరుగనున్నది. తాము దయచేయుడు"—అని మీరు నన్నాహ్వానించిరి. అందులకు నేను చాల సంతోషించితిని. అట్టి అపూర్వ అవకాశము

లభించెనుగదా అని లోలోన పరమానందపడితిని. కాని తీరా, సభలోనికి ప్రవేశించగనే సభ్యులయొక్క ప్రవర్తన, వారి వైఖరి చూచి నాకు పట్టరాని నవ్వు వచ్చినది. మాదిగవారి సభలోనికి జనకుడు నన్నే ఆహ్వానించెనను వితర్కము నాలో కలిగినది.

ఋషిపుంగవుని యీ వచనములను వినగనే జనకు డాశ్చర్యచకితుడై దేవా! ఇట్లేల వచించుచున్నారు? మహా మహా పండితులందఱును విచ్చేసిన దీనిని మాదిగవారి సభ అని ఏల వాక్రుచ్చుచున్నారు? అని ప్రశ్నింప అంతట ఆచార్యుడిట్లు వచించెను.

"భూపాలా! మనుజులలో మూడు తరగతుల వారుందురు. కొందఱికి దేహదృష్టి, కొందరికి మనోదృష్టి మఱి కొందరికి ఆత్మదృష్టి యుండును. ఒక ప్రాణిని చూడగా నీ బాహ్య ఆకారము మాత్రమే కొందఱికి గోచరించుచుండును. వారి రూపురేఖలు, వారి సౌందర్యము, వారి కట్టు, వారి బొట్టు, వారి జాతి, వారికులము, వారి రంగు—ఇవి మాత్రమే వారి దృష్టికి అగపడుచుండెను ఇట్టివారు దేహదృష్టికలవారు. మఱికొందరికి ఒక ప్రాణిని చూడగనే అతని విద్వత్తు, అతని పాండితీ ప్రకర్ష, అతని సాహిత్యసంపద, అతని చదువుసంధ్యలు, గోచరించుచుండెను. ఇట్టివారు మనోదృష్టి కలవారు. మఱి కొందఱు ఒక ప్రాణిని చూడగనే అతని హృదయమందు

వెలుగొందుచున్న సర్వభూతాంతర్వర్తియగు పరమాత్మయే గోచరించును. ఇట్టివారు ఆత్మదృష్టి కలవారు. వీరుత్తమోత్తములు. మనోదృష్టి కలవారు మధ్యములు. దేహదృష్టి కలవారు అధములు. ఎన్ని విద్యలు కలిగియున్నను భౌతికదృష్టిని, స్థూలదృష్టిని, దేహదృష్టిని విడనాడనిచో, ఆత్మదృష్టిని సంపాదించనిచో ఆ విద్యలన్నియు నిరుపయోగములే యగును. ఏ జాతికైనను మానవుడు ఆత్మదృష్టిని సంపాదించియే తీరవలెను. అదియే జీవిత లక్ష్యము. జన్మసార్థకత కదియే ఏకైక విధానము.

"ఓ రాజా! మాదిగవారు సామాన్యముగ చెప్పులు మొదలైనవి కుట్టుచుందురు. చర్మముపైననే వారు తమదృష్టిని సదా ప్రసరించుచుందురు. గొప్ప పండితుడైనను చర్మముపైననే ఎవని దృష్టియుండునో, ఎవడు దేహమును మాత్రమే చూచుచు దేహియగు ఆత్మను విస్మరించుచుండునో అతడు మహామేధావియైనను దేహదృష్టి కలిగియుండుటవలన మాదిగవానితో సమానుడేయగును. ఓ రాజా! మీరు సమావేశపరచినది పండితమహాసభయని పేర్కొంటిరి. కాని ఆసభలో ఆసీనులైన వారందరు నాదేహమునే చూచిరికాని, నాఆత్మను గాదు. నా చర్మమునే వీక్షించిరికాని నాలోని చిత్స్వరూపమునుగాదు. నా దేహవికారములనే గమనించి నవ్విరి కాని దేహాంతర్గత పరమాత్మను సందర్శించలేదు. తోలుపైననే

దృష్టికలవారు దేహభ్రాంతిని విడనాడనివారు ఎంత చదువు చదువుకొనియున్నను మాదిగవారి చర్యను (చర్మావలోకనము) అవలంభించినవారే యగుదురు. జనకమహారాజు నన్ను పండితులసభకు ఆహ్వానించనేకాని అచట కూర్చొనినవారిందఱు మాదిగవారుగ కన్పించుచున్నారే! అని నాకు నవ్వు వచ్చినది.

ఈ ప్రకారముగ అష్టావక్రమునీంద్రుడు చక్కని హితవాక్యములను పలుకగా జనకభూపాలుడుఅచ్చెరువొంది, ఆత్మదృష్టియొక్క ప్రాశస్త్యమును, దేహదృష్టియొక్క నికృష్టత్వమును గుర్తెరిగినవాడై సదా ఆత్మావలోకన తత్పరుడై జీవితమును చరితార్థ మొనర్చుకొనెను.

కావున జనులు అభ్యాసవశమున దేహదృష్టిని క్రమక్రమముగ విడనాడవలయును. తాము వాస్తవముగ శాశ్వత ఆత్మయేకాని క్షణికమగు దేహముకాదని మరలమరల భావించుచుండవలెను. ఎంతటి విద్యావైదుష్యము కలిగియున్నను తాను దేహమేయని తలంచువానికి ఏకాలమందును శాంతి కలుగనేరదు. కావున శరీర భావనను వీడి ఆత్మభావనను బలపఱచుకొనుచు జీవితమును పరమానందమయముగ నొనర్చుకొనవలయును!

నీతి: మానవుని యథార్థస్వరూపము ఆత్మయే కాని దేహముకాదు. కాబట్టి జడమైన దేహముపై అభిమానమును వదలి ఆత్మయే తానని భావించుచు పరమానంద మనుభవించవలయును.

# సృష్టియందు మానవుని ప్రత్యేకత

పూర్వ మొకానొక యరణ్యమున అనేకమృగములు నివసించుచు చక్కగ కాలక్షేపము చేయుచుండెను. ఒకనా డొక నక్కకు అకస్మికముగా నొక ఊహపుట్టెను. బ్రహ్మదేవుడు ఎనుబదినాలుగు లక్షల జీవరాసులను విశ్వమునసృజింప ఒక్క మానవుడే ప్రాణులందరిలోను గొప్పవాడుగ ఏల చలామణి యగుచున్నాడు! బలములోగాని, ఆకారములోగాని, ఊహాపోహాలలోగాని, తిండిలోగాని, మోసములోగాని మానవునిమించిన శక్తియుక్తులు గల ప్రాణికోట్లెన్నియో యుండ మానవుడు తానే గొప్పయని తలంచుట వెఱ్ఱి! శాస్త్రాదులా ప్రకారము ఆదేశించుటయు, అందులకు సమ్మతించుటయు చాల ఘోరము, అది కేవలము పక్షపాతమే యగును. కావున నిజానిజములు తేలవలెను. ప్రపంచములో మానవుని యాధిక్యతను నేనిపుడు 'సవాల్' చేయగలను ఈ విషయము

కాడో పేడో తేలువఱకు నేనిక నిదురపోను. అని నిశ్చయించి అదేపని గట్టుకొని అరణ్యమంతయు తిరిగి తిరిగి ప్రతి మృగమునకును తనకు గల్గిన అభిప్రాయమును నచ్చచెప్పి, వానిని రెచ్చగొట్టి, వానికి రోషావేశములను గల్పించి తన వెనుక వేసుకొనగల్గెను. ఈ ప్రకారముగ అరణ్యములోని జంతుజాలమంతటిని నొక్క ఒకచోట సమావేశపఱచి, ఆచతుష్పద మహాసభయందిట్లు ఉపన్యసింపదొడగెను.

"సోదరులారా! మన మృగ జాతియొక్క చరిత్రయందు నేడుసువర్ణాక్షరములతో లిఖింపదగిన సుదినమైయున్నదని మీరందరును జ్ఞప్తియం దుంచుకొనవలెను. ఏలననగా ఈనాడొక మహోత్తర నిర్ణయము గావింపబడనున్నది. ఈ అనంత విశ్వమందు కోట్లకొలది ప్రాణికోటులుండ, ఒక్క మానవుడు స్వార్థచింతనచే ప్రేరితుడై తన్ను సర్వోపరిస్థానమున నిలబెట్టుకొని యున్నాడు. అతని యభిప్రాయమునకు శాస్త్రములున్ను తాళముకొట్టినవి. ఇది సహింపరాని విషయము. దీనిని చులకనగా వదలిపేయుట మన మృగజాతికే తీరని కళంకము. బలమందా, యోచనయందా, ఆకారమందా దేనియందు వానికంటె మనము తక్కువ? సోదరులారా! తీవ్రముగా యోచింపుడు! మనజాతిపై అభిమానము గల్గియుండుడు! మన జాతిలోగల అమానుషశక్తులను ధంకా ప్రయోగించి నలుగురికిని చాటుడు. 'సృష్టిలో మానవుడు కాదు,

ఒకానొక జంతువే సర్వోపరిస్థాన మలంకరించుచున్నది' అను తీర్మానమును ఏకగ్రీవముగ సర్వులును ఆమోదించునంతవఱ కును మనకర్తవ్యము అపూర్ణముగనే యుండునని మఱువకుడు. ఈకార్యసాధనమునకై మన మందఱమును ఇవుడు సమీపమున గల ఒకానొక మహర్షిసత్తముని యొద్దకుబోయి విషయమంతయు సాకల్యముగ మతనికి మనవి చేసెదము. మీమీ శక్తులను, స్వభావములను అతని సమ్ముఖమున వ్యక్తముచేయుడు" అని గంభీరముగ బలికి ఆ జంతువుల నన్నిటిని అటకు గొనిపోయెను.

మహర్షి యొక్క అధ్యక్షత క్రింద జంతునివహమంతయు సమావేశమయ్యెను. అన్నియు నిశ్చలముగ గూర్చుండినవి, ఇంతలో ఏనుగులేచి "మహాత్మా! నాకు గల బలములో నూఱవవంతైనను మనుష్యునకు లేదు. ఆకారము చూతమా నా మోకాలంత స్వరూపము కూడ అతనికిలేదు. అట్టిచో మానవుడేల గొప్పవాడగును?" అని రోషముతో బల్కి కూర్చుండెను. ఇంతలో సింహములేచి తన పరాక్రమమును చాటుకొని మానవుని యల్పత్వమును బుజావుచేసెను. ఇట్లు అన్ని జీవరాసులున్ను తమ విలక్షణ గుణములను ఉగ్గడించి, జంతువుల శ్రేష్ఠత్వమును చాటుకొనెను. మఱియు అమ్మర్షిని తీర్పు నివ్వవలసినదిగా వేడుకొనెను. ఆ ఋత్తమహర్షి వాని

వాదములన్నిటిని ప్రశాంతముగా నాలకించి తుదకిట్లు పలికెను- "ఓ మృగసత్తములారా! మీరు చెప్పినదియంతయు పరమ సత్యము!' మీమీ శక్తులముందు మానవుడు గణనకేరాడు. కాని ఒక్క విషయములో మాత్రము మానవుడు మిక్కిలి యధికుడు. పుట్టుకతో వచ్చిన దుష్టసంస్కారములను మీరు మార్చుకొనలేరు. మానవుడు మార్చుకొనగలడు. ఇదియే అతని ఆధిక్యతకు కారణము. ఇదియే మీకును అతనికి గల భేదము.' ఋషిసత్తముని గంభీరవిజ్ఞానపూరితములగు ఆ పలుకులను విని నక్క తక్షణమే లేచి 'అయ్యా! మహానుభావా! పుట్టుకతో వచ్చిన దుష్టసంస్కారమును మార్చుకొనగల్గుటచే మానవు డధికుడని తాము సెలవిచ్చితిరిగదా! అట్లు మార్చుకొననిచో?' అని ప్రశ్నించెను 'మార్చుకొననిచో మీయందరికంటెను మనుజుడు నీచాతినీచుడే" అని యాతడు తేల్చిచెప్పివేసెను. న్యాయపరిపూర్ణములును, పక్షపాతరహితములు నగు అమ్మహర్షి వాక్యములను విని జంతువులన్నియు 'భేష్ భేష్' అని సంస్తుతించుచు అచ్చోటువీడి చనెను.

నీతి : తమయందలి దుష్ట సంస్కారములను జనులు ప్రయత్నపూర్వకముగ తొలగించుకొని సత్య సంస్కారములను కలుగజేసికొనవలయును.

# నిరుపమాన ధైర్యము

పూర్వము అలెగ్జాండరు అను చక్రవర్తి అనేక దేశము లను జయించి తుట్టతుదకు భారతదేశమునుగూడ జయింప నెంచి సింధు నదీప్రాంతమున అడుగుపెట్టెను. ఆ నదీతీరమున ఒకానొక తపస్వి నివసించుచుండెను. అలెగ్జాండరు సైన్యసమే తుడై ఆ మార్గము గుండ బోవుచుండ ఆ బ్రహ్మనిష్ఠుడచ్చో టనే కూర్చొనియుండెను. లేవలేదు. సామ్రాజ్యాధిపతియగు తన్ను జూచి లేవలేదను కోపమున అతని శిరస్సును ఛేదించి వేయుటకై అలెగ్జాండరు తన ఖడ్గమును పైకిదీయ సాధువు పకపక నవ్వెను. అంతట అలెగ్జాండరు చకితుడై "నిన్ను చంపుటకు ఉద్యమింప నీవేల నవ్వుచున్నావు ? ఇట్టి వైపరీ త్యమును నేనెన్నడును గాంచలేదే ! నవ్వుటకు కారణమేమి" యని యడుగ నా ఋషిపుంగవుడిట్లు వచించెను. "నీవు నన్ను చంపెద నంటివి, అందులకు నాకు నవ్వురాని నవ్వు వచ్చి నది, ఏలయనిన, నేను నిత్య, సత్య ఆత్మస్వరూపుడను.

నైనం ఛిన్దన్తి శస్త్రాణి నైనం దహతి పావకః
న చైనం క్లేదయన్త్యాపో న శోషయతి మారుతః

[గీత 2-23]

నేను శస్త్రములచే ఛేదింపబడువాడనుకాను. అగ్నిచే దహింప బడు వాడనుకాను, నీటిచే తడుపబడువాడనుకాను. గాలిచే

ఎండింపబడు వాడనుకాను. నేను సచ్చిదానంద పరిశుద్ధస్వరు పుడను. భౌతిక శక్తులు నన్నేమియు చేయజాలవు" అని తీవి పలికెను. అలెగ్జాండరు దిగ్భ్రమజెంది భారతదేశములో మృత్యువునుగూడ ధిక్కరించు నట్టి మహిమాతిశయముగ గిన జనులున్నారే! ఆహా! ఇట్టి ఆధ్యాత్మిక వైభవముతో గూడిన పరమపావన ప్రదేశముపై దండెత్తుట అపచారము నైతిక సంపత్తిచేతులతూగు మహర్షుల కాలవాలమైన భార దేశమున కివియే నా జోహారులు! అని మ్రొక్కి వెనుక మరలపోయెను.

ఇంతి ధైర్యము, ఇంత నిర్భయత్వము ఆత్మజ్ఞానమ చేతప్ప మఱి దేని చేతను గలుగనేరవు. ద్వితీయాద్వై భయం భవతి" అను శ్రుతి ప్రకారము ఆత్మకంటె వేఱు మఱియొక వస్తువు సత్యమని నమ్మినచో వెంటనే భయ ముదయించును. అజ్ఞానజనులు దృశ్యమును సత్యమని నమ్మి భయమును, దుఃఖమును పొందుచున్నారు.

జ్ఞాని దృశ్యమును నశ్వరముగను, ఆత్మను శాశ్వతమ గను నమ్మి నిర్భయత్వమును, అనంతానందమును బడయు చున్నాడు. కావున మనుజునకు బలవీర్య తేజములు, ఉత్సాహ గాంభీర్యాదులు ఆత్మజ్ఞానమువలననే కలుగగలవు.

నీతి — ఆత్మజ్ఞానము వలన అఖండ ధైర్యము
పము కలుగును కావున అద్దానిని మానవుడు తన
మునందు తప్పక బడయవలెను.

# జిత్తులమారి మనసు

పూర్వ మొకానొక గ్రామమున మధ్యతరగతికి జెందిన
న్య గృహస్థుడొకడు నివసించుచుండెను. అతడు
కుడు. పూర్వజన్మ పుణ్యసంస్కారమువలన దైవభక్తి
పకారబుద్ధి అతనికి చక్కగ అలవాటుపడెను. ఎచటనైన
థగాని పురాణముగాని, ఆధ్యాత్మిక కాలక్షేపముగాని
చుండినచో ఎన్నిపనులున్నను విడిచిపెట్టి అచ్చోటికేగి
కథాశ్రవణము చేయుచుండు వాడతడు.

ఇట్లుండ ఒకనాడు ఆ గ్రామమున ఒకానొక హరికథా
శ్రమున భాగవతారుగారు అన్నదానమహిమనుగూర్చి
రముగ ప్రవచించుచుండిరి. మనోరంజకముగ, ప్రమాణ
ర్వకముగ దృష్టాంతదార్ష్టాంతయుక్తముగ గావింపబడుచున్న
వ్యప్రబోధము జనుల హృదయఫలకములందు చక్కని
ద వేయుచుండెను. అన్నదానమునం దింత మహిమకలదా

యని శ్రోతలు విన్నుపోవుచుండిరి. పైన దెలిపిన యువకుడు కూడ ఆనాడు హరికథకు వచ్చియుండుటవలన అన్నదానమహాత్మ్యమును గూర్చి బాగుగ తెలిసికొనగల్గెను. ఇంతియే కాదు, నాటినుండి యాతడొక భీష్మప్రతిజ్ఞ తనలో గావించుకొనెను. ఒక అతిథికి గాని, ఒక అర్థునకు గాని గుప్పెడన్నము పెట్టినచో తరుగు లేని పుణ్యము లభించునని ఈనాడు తెలిసినది. నేను గొప్ప ధనికుడనుగాను, సిరిసంపదలు కలవాడనుగాను, అయినను భగవంతుడు నాకు ప్రసాదించిన అల్పసంపదలో ఇకనుండి కొంతభాగమైనను పరప్రాణికి వినియోగించి జన్మను ధన్యమొనర్చుకొందును కాబట్టి నేటినుండి మధ్యాహ్నము భోజనపువేళ యందు నాయింటికి ఎవరువచ్చినను అతనికి అన్నము పెట్టి పంపుదును. లేదు అను పదము నా నోటినుండ రాకూడదు. నేను గంజిత్రాగియైనను ప్రతిదినమును కప్రాణికి అన్నము పెట్టియే తీరుదును. నాయీ నిశ్చయమునకు తిరుగులేదు. అని ఆ యువకుడు అప్రతిహానిర్ణయమును తనలో గావించుకొనెను.

తదనుకీతి అతడు అదిమొదలుకొని ప్రతిదినము మధ్యాహ్నపువేళ ఇంటికేతెంచిన అతిథికి తృప్తిగా భోజనముపెట్టి పంపుచుండెను. ఈ అవకాశమును పురస్కరించుకొని ఒక సోమరి కేవలము తిండికొఱకే ప్రతి రోజూ అతని ఇంటికి మధ్యాహ్నము రాదొడగెను. కాని ధార్మికహృదయుడగు

ఆ యువకుడు తాను చేకొనిన ప్రతిజ్ఞప్రకారము ఆ వచ్చిన వానికి ప్రతిదినము లేదనకుండ భోజనముపెట్టి పంపుచునే యుండెను.

పరిస్థితిని గమనించి, ఒకరోజు ఆ యువకుని భార్య తన భర్తతో నిట్లనెను—ఏమండీ! అతిథిఅనగా ఎప్పుడో ఒకప్పుడు ఇంటికి వచ్చువాడు. ఒకరోజు వచ్చి మరల సమీప భవిష్యత్తులో రానివాడే అతిథి. అతిథిమర్యాద చేయుట మంచిదే కాని రోజూవచ్చి కడుపునిండా తినిపోయే సోమరిపోతు అతిథి యెట్లగును! పైగామనము పెద్ద సంపద కలవారము కాము. భగవంతుడు మనకిచ్చిన దానిలో తృణమో పణమో ఒకరికి సహాయము చేయుట ధర్మమే. కాని సోమరులను, తిండిపోతులను, అకర్మణ్యులను పోషించుట, తద్వారా వారికి ఇంకను బద్ధకము నేర్పుట శ్రేయస్కరముకాదు. ప్రస్తుతము మన యింటికి ఆసోమరి ప్రతిదినము మధ్యాహ్నము వచ్చుచున్నాడు. అతనికి పుష్టిగ మనము పెట్టి పంపుచున్నాము. ఈ ప్రకారము దారినపోయే కాడీలనందరిని మేపుచుండినచో ఇక మనసంసార యాత్ర, మన జీవితరంగము ఎంతకాలము నడువగలదు! పైగా ఈ ప్రకారముచేయుట అకర్మణ్యత్వమును, అలసత్వమును, ప్రమత్తతను జనులలో ప్రోత్సహించినట్లే యగునుగదా" కాబట్టి రేపటిదినము అతడు మనఇంటికి వచ్చినపుడు పొమ్మని చెప్పుట యుక్తముగా నుండును!

అర్ధాంగియొక్క హేతువాద పరిపూరితములైన ఆ వాక్యములను విని యువకుడిట్లనెను—అమ్మా ! నీవు చెప్పినది సత్యమే. కాని మధ్యాహ్నము భోజనము సమయమునకు ఎవరు వచ్చినను ఆదరించెదనను ప్రతిజ్ఞ చేపట్టితిని. కావున, వెళ్లుమని నా నోటిగుండా అతనికి నేనెట్లు చెప్పగలను ? అయినను రేపు మధ్యాహ్నము అతడు మనయింటికి వచ్చినపుడు 'నీవు వెళ్లు' అని నోటితో చెప్పకనే అతడు వెళ్లిపోయే పరిస్థితిని మనము సృష్టించెదము. ఇందునకై మనము రేపొక తంతు నడిపెదము. ఆ నడుపబోవు తంతునందు నీవున్ను నాకు లెస్సగా సహకరించవలెను. రేపుమధ్యాహ్నము మామూలుగా అతడు మనయింటికిరాగానే నీవు నన్ను తిట్టుము. నేను వెంటనే నిన్ను కొట్టెదను. నీవు ఏడ్చుచు నన్ను మరల తిట్టుము. నేను కోపముతో నిన్ను మరల కొట్టెదను. మన రొక్క ఆ కలహముచూచి ఆ వచ్చినవాడు చల్లగ వెడలి పోవును. అతనిని వదలించుకొనుటకు ఇది ఒకటియే చక్కని ఉపాయము !

భర్తయొక్క ఆ వాక్యములను అతని సతీమణి తత్క్షణము ఆనందముతో అంగీకరించెను. మఱునటిదినము మధ్యాహ్నము యథావిధిగ ఆ సోమరిభోజనమునకు వచ్చెను. అతడు ఇంటిలో అడుగుపెట్టగనే భార్యభర్తను తిట్టెను. అది భరించ లేక భర్తభార్యను కొట్టెను. ఈ ప్రకారము వారిరువురు

ఒకరినొకరు తిట్టుకొనుచు కొట్టుకొనుచుండిరి. అదిచూచి "ఈ కల్లోలపరిస్థితిలో వీరు మనకేమి భోజనముపెట్టెదురు" అని తలంచి నెమ్మదిము ఆ యిల్లువిడిచిపోయెను. సోమరి పోగానే భార్యాభర్తలిరువురు పరమానందపడిరి. తాము అభినయించిన నాటకము సఫలితము చేకూర్చెగదాయని వారెంతయో సంబరపడిరి. బరువుతీరెనుగదాయని లోలోన సంతసించిరి. అత్తరితి తాము జరిపిన నాటకమునుగూర్చి వారు చెప్పుకొనుచు భార్య భర్తతో—"ఏమండీ! నేను నిజంగా తిట్టినట్లే తిట్టాను' అని పలుకగా, భర్త భార్యతో "నేను నిజంగా కొట్టినట్లే కొట్టాను" అని చెప్పగా ఇంతలో ఆ పోయినవాడు తిరిగివచ్చి "నేను నిజంగా పోయినట్లే పోయాను" అని వ్రాకుచ్చెను. అతని యా వాక్యములను వినుటతోడనే దంపతులు హతాశులై పోయిరి.

ఆధ్యాత్మపథమున సాధకుడు తనలోనున్న దుర్గుణములను, దుర్వ్యసనములను, దురాచారములను, దుష్ట సంకల్పములను, దుర్వాసనలను తొలగించుటకై, జయించుటకై ఎంతయో ప్రయత్నము సలుపుచుండును. ఆ ప్రయత్నముయొక్క ధాటికి తట్టుకొనలేక ఆ దుష్టగుణములు తొలగినట్లే తొలగి పోవును. అపుడు సాధకుడు "ఆహా! నా దుర్గుణములు పోయినవి" అని అహంకరించి, ప్రయత్నమును వదలరాదు. వివేకమును పోగొట్టుకొనరాదు. "స్థిత్వాస్యామన్తకాలేఽపి

అని గీతాచార్యుడు సెలవిచ్చినట్లు సాధకుడు అంత్యకాలమ వఱకును దేహవియోగకాలమువఱకునుగూడ తన పరమా యత్నములను, అనుష్ఠానమును విడిచిపెట్టరాదు. తన దుర్గు ములు తొలగిపోయినవిగదాయను ధీమాతో సాధకుడ అజాగ్రత్తగనున్నచో, పరమార్థయత్నములను విరమించినచ మాయ తక్షణమే వచ్చి ఆవరించి కథలోని సోమరివలె తిరి వేధించును.

కావున ముముక్షువు ఏకాలమందును తన ప్రయత్నమ లను వదలరాదు. తాను ఇంద్రియములను విషయముల జయించితిని గదాయను ధీమాతో అజాగ్రత్తను వహిం రాదు. మనస్సు జిత్తులమారిది. దాని జిత్తులను తెలిసికొ సాధకుడు దానికి లొంగక, మోసపోక, వివేకదీపమున అహర్నిశము తన చేతనే ఉంచుకొని, మోహాంధకారమున దరికి చేరనీయక సదా జాగరూకుడై ఆత్మతేజో విరాజితుడై భాసిల్లవలెను.

**నీతి :** మనస్సు మాయదారిది. అది జనులన మోసగించును. కాబట్టి దాని టక్కులకు లోబడ ఇంద్రియజయ విషయమున జీవుడు అప్రమత్తుడై యుండవలెను.

# పేరాశ

పూర్వ మొకానొక పట్టణమున ఒక బీదవాడు నివసించు చుండెను. అతడు ఇంటింటికి వెళ్లి భిక్షాటనము చేయుచు జీవించుచుండెను. అతనికి ఒక సెంటు నేల తప్ప ఇతరములగు ఆస్తిపాస్తులెవ్వియు లేవు. ఆ కొంచెము నేలయే అతనికి ఆధారము. అయితే ఆ నేలలో వచ్చు వరుంబడి చాల నందున అతడు భిక్షాటనమును చేపట్టెను. ప్రతిదినము 'భవతీ భిక్షాం దేహి' అను వాక్యమును పలుకుచు ఇంటింటికి వెళ్లి వారిచ్చు తృణమో పణమో స్వీకరించుచు కాలము గడుపు కొనుచుండెను.

ఇట్లుండ ఒకనాడు భిక్షాటనమునకు బయలుదేరిన కొద్ది సేపటికే అదృష్టవశాత్తు ఒక ఇంటిలో అతనికి పుష్కలముగ భోజనము లభించెను. దానిని ఆ యింటిముందే కూర్చొని అతడు చక్కగ ఆరగించెను. కడుపు నిండుటచే అతడు పరమానందపడెను. "ఆహా! ఈ రోజు ఏమాత్రము ప్రయాస పడకనే, ఇంటింటికి తిరుగకనే భగవంతుడు నాకు చక్కని ప్రసాదము లభించునట్లుచేసెను" అని అనుకొనుచు ఆ బీదవాడు ఇంటికి దారిబట్టెను. మార్గమధ్యమున ఒక యింటివారు అతడు దరిద్రుడని గ్రహించి దగ్గరకుపిలిచి పేలపిండిగల ఒక పిడతను ఇచ్చి అందలి పిండిని భుజించమని చెప్పిరి. బీదవారు

సామాన్యముగ పేలపిండితో బెల్లము వేసుకొని కలిపి తిను
చుండు వాడుకగలదు. అయితే ఇంతకుమునుపే కడుపార
భుజించినందువలన, దరిద్రుడా పిడతను తీసికొని ఇంటికిచనుచు
మధ్యాహ్నసమయ మగుటచే ఎండవేడిమికి తట్టుకొనలేక ఒక
ఇంటి అరుగుపై కొంతసేపు విశ్రమించెను.

అరుగుపై పడుకొని పేలపిండిగల పిడతను కాలిదగ్గర
పెట్టుకొని ఆ దరిద్రుడు కొంతసేపు సుఖముగ నిద్రింపదలచెను.
కాని నిద్రపట్టనందున ఏవేవో ఆలోచనలు చేసికొనుచుండెను.
ఈ క్రింది విధముగ అతడు తనలో తాను భావించుకొనుచు
కాలక్షేపము చేయదొడగెను —

"ఇపుడు నాకు కడుపు నిండినది. ఇక భోజనముతో
పనిలేదు. కాని ఎవరో పేలపిండితో గూడిన పిడతను ఇప్పుడే
నాకిచ్చిరి. కావున ఈ పిడతను బజారునకు తీసికొనివెళ్లి
అందలి పిండితోసహా ఎవరికైన అమ్మివైచెదను. 20 పైసలు
రావచ్చును. ఆ 20 పైసలతో నువ్వులు కొందును. ఆ నువ్వు
లను నాకున్న కొద్దినేలలో చల్లివేయుదును. అపుడు కొన్నా
ళ్ళకు చక్కని నువ్వులపంట వచ్చును. దానిని పరిపక్వదశలో
కోసివైచి నువ్వులను ఒక గోదాములో పోయుదును. ఒక
బస్తా నువ్వులు రావచ్చును. వాటిని వెంటనే మార్కెట్టులో
అమ్మివేయుదును. నూరురూపాయలు రావచ్చును. వెంటనే

ఆ పైకమును వడ్డీకి ఇచ్చెదను. పది సంవత్సరములలో వడ్డీ, కాంపౌండు వడ్డీ పెరిగి పెరిగి ఒక వెయ్యి రూపాయలు మొత్తం కావచ్చును. అప్పటికి నాకు వివాహ వయస్సుకూడ దాపురించును. ఎపుడు అంత పైకము నా దగ్గర ఉన్నదని జనులు తెలిసికొందురో అపుడు పెండ్లి చేయుటకై నా పిల్ల నిచ్చెదను, నా పిల్లనిచ్చెదను అని జనులు ముందుకు వచ్చె దురు. వారందరిలో మంచిపిల్లను ఏరుకొని నాకు వచ్చినదానినే నేను వివాహము చేసికొందును.

వివాహమైన తరువాత భార్య కాపురమునకు వచ్చును. సుఖముగ సంసార జీవితము గడచుచుందును. ఎప్పుడైన నా భార్య నాతో పోట్లాడినచో, ఆమె నన్ను తిట్టినచో నేను మాత్రము ఊరుకొనను. కోపముతో దానిని కాలితో తన్ని వేయుదును — అని ఆ దరిద్రుడు తన కాలును జోరుగ విదిలిం చెను. వెంటనే కాలిక్రిందవున్న పేలపిండి పిడత పగిలిపోయి, అందలిపిండి గాలికి కొట్టుకొనిపోయెను.

చూచితిరా! ఆ దరిద్రుని పేరాశ! ఏ పేలపిండి పిడతను అమ్మి ఇంత నాటకము జరుపదలంచెనో అది కాస్తా నాశనమై పోయెను. అతని ఆశలన్నియు నిరాశలై పోయెను. అతడు కట్టిన గాలిమేడలన్నియు చితికిపోయినవి. అజ్ఞానదశలో మానవుడు ప్రతాంమే కోరికపై కోరికను పెంచుకొని తుదకు అసలుకే మోసము తెచ్చుకొనును. ముముక్షువైనవాడు ఆశలను

పెంచుకొనుచుపోరాదు. ఉన్నవాటినే క్రమక్రమముగా తగ్గించుకొనుచు రావలెను. 'ప్రజహాతి యదా కామాన్ సర్వాన్' అని గీతాచార్యు లానతిచ్చిన ప్రకారము ఏనాటికైనను కోరికలన్నిటిని పూర్తిగ విడనాడినప్పుడే మనుజునకు పూర్ణశాంతి కలుగగలదు. ఈ రహస్య మెఱింగి మానవుడు తృష్ణాపరవశుడు కాక, అవసరములనుమాత్రము తీర్చుకొనుచు వైభవమును తిరస్కరించుచు, జీవితమును గడుపవలెను. ఏదియైన దృశ్యసంబంధమైన కోరిక మనస్సునందు ఉద్భవించినచో దానిని వివేకముచే మొదలంటనే తుంచివేయవలెను అట్లు కానిచో అది వృద్ధినొంది, వృద్ధినొంది చిలవలు పలువలు వేసి, ఇంకను క్రొత్త క్రొత్త కోరికలను జనింపజేసి మానవుని అధోగతికి త్రోసివేయును. కావున ముముక్షువగువాడు ఆశకు లోనుగాక, తృష్ణకు తన జీవితములో ఏ మాత్రము అవకాశ మొసంగక కడుజాగరూకుడై మెలగవలెను. కథలోని దరిద్రునివలె ఆశలు పెంచుకొని శోకవిహ్వలుడు కారాదు. తృష్ణను ఛేదించివైచి జీవితమును ఆనందమయముగ నొనర్చుకొనవలెను.

**నీతి :-** మనుజుడు ఆశకు లోబడక, ఉన్న దానితో తృప్తినొంది శేషించిన సమయమును దైవ ధ్యానాదులందు వినియోగించవలెను.

# మనస్సును ఊరక నుంచరాదు

మనస్సు ఊరకున్నచో ఏవేవో వ్యర్థమైన సంకల్పములు చేయుచుండును. కావున దానికి నిరంతరము ఏదైన దైవసంబంధమైన కార్యముగాని, ఉపయోగకరమైన ప్రపంచకార్యముగాని ఇచ్చుచుండవలెను. ఊరకనున్నచో మనస్సు తమోగుణమును ఆశ్రయించుటయో, నిరర్థకములైన చింతలు గావించుటయో జరుగుచుండును. కావున అట్టి పరిస్థితికి మనస్సు దిగజారకుండ పుణ్యకార్యములందు, లోకోపకార కార్యములందు అద్దానిని సదా వినియోగించుచుండవలెను. ఊరకనుండి తానేదో విశుద్ధసత్వస్థితియందున్నాననియు, తురీయాతీత పదవిని పొందినాననియు సామాన్యుడు తలంచవచ్చును. కాని అది పొరపాటు. అకర్మణ్యత్వమును నైష్కర్మ్యస్థితిగా ఎవరును భావించరాదు. వాసనలు క్షీణించినవుడే మనస్సు నైష్కర్మ్యస్థాయిని అందుకొనగలదు. వాసనాసహితుడు ఊరకనున్నను కొండంతకర్మను ఆచరించుచున్నవాడే యగును. అది బంధమును తొలగించకపోగా పైపెచ్చు ఇంకను దృఢపఱచుచుండును. కావున మనస్సును ఊరకనుంచక ఏదైన దైవకార్యములందుగాని, పరోపకారయుతములగు, ధర్మపూర్వకములైన ప్రాపంచిక కార్యములందుగాని దానిని ప్రవేశపెట్టి ముందుగ దానిని పవిత్రముగ నొనర్చ

వలెను. అంతేయేకాని ఊరక నుంచరాదు. అట్లు ఊరక నుంచినచో కథలోని రాక్షసునివలె అపకారము చేయగలదు—ఎట్లనిన—

పూర్వ మొకానొక గ్రామమున ఒక రైతుకలడు. అతడు అగర్భశ్రీమంతుడు. అతని తండ్రి పెద్దరైతు. అతని తాతయు పెద్దరైతే. అతని వంశస్థులందరు గొప్ప భూస్వాములు. అతనికి కొన్ని వందల యకరముల భూస్థితి కలదు. మున్నది జతల ఎద్దులు కలవు. నూరుమంది సేద్యగాళ్లు నిరంతరము అతనిక్రింద పనిచేయుచుందురు. అంతటి భూస్వామి ఆ చుట్టుప్రక్కల ఎక్కడకూడ లేడని వదంతి.

ఇంత ఆర్భాటముతో కూడియున్నప్పటికిని, ఇన్ని సిరి సంపదలతో వెలయుచున్నప్పటికి అతనికి మనశ్శాంతి లేకుండెను. పనులతో రోజంతయు మునిగియుండుటవలన అతనికి కించిత్తైనను విరామము లేకుండుటవలన మనస్సు అశాంతియుతముగ వర్తించుచుండెను. కొన్ని వందల యకరముల సేద్యము జరుగవలసియుండుట వలనను, నమ్మకమైన మనుష్యులు అజమాయిషీ చేయువారు కొరతపడి యున్నందునను, తానే స్వయముగ అన్నిపనులు చూడవలసి వచ్చుటచేతను అతని మనస్సు మిక్కుటముగ ఆందోళన చెందుచుండెను. శాంతి లేదు. సుఖము లేదు. నిద్రలేదు. విశ్రాంతిలేదు. ఈ స్థితిలో

పడిపోయి దారి తెన్ను గానక తుట్టతుదకు భగవంతుడే తనకు సహాయము చేయగలడని యెంచి బ్రహ్మదేవునిగూర్చి ప్రార్థన చేయదొడగెను. వ్రతములు, జపములు చేయనారంభించెను.

కొంతకాలమునకు బ్రహ్మదేవు డాతనికి ప్రత్యక్షమై ఏదైన వరము కోరుకొనుమని ఆజ్ఞాపించెను వెంటనే క్రతు బ్రహ్మదేవునితో నిట్లు సవినయముగ బల్కెను. "మహాత్మా! నేనొక ప్రత్యేకమైన ఉద్దేశ్యముతో మిమ్ములను ధ్యానించితిని. నాకు లెక్కలేనన్ని పనులున్నవి. వానిని నిర్వర్తించలేకున్నాను. ఈ పనులతో నాకు విసుగు పుట్టుచున్నది. ఎవరైన వీనిని నిర్వర్తించిన గాని, లేక నిర్వర్తించుటలో నాకు సహాయపడిన గాని నేనెంతయో ఆనందించెదను. ఇది యొక్కటియే నా యభీష్టము" అని విన్నవించుకొనెను. వెంటనే బ్రహ్మదేవుడు "అట్లే యగుగాక! నీ పనులన్నిటిని తృటిలో నెరవేర్చగల సామర్థ్యమున్నట్టి వ్యక్తిని నీయొద్దకు పంపెదను. అతడొక రాక్షసుడు. అతనికి ఎల్లప్పుడును ఏదియో యొక పనిని నీవు ఇచ్చుచునే యుండవలెను. ఎన్ని పనులైనను అతడు చేసి వేయగలడు. కాని అతనిని ఖాళీగా నుంచరాదు అట్లు ఖాళీగా నుంచినచో అనగా నీవు ఏపనియు అతనికి ఇవ్వక ఊరక నుంచినచో అతడు నిన్ను మ్రింగివేయగలడు. ఈ షరతుపై ఆ రాక్షసుని నీకు ఒప్పచెప్పుచున్నాను" అనెను.

బ్రహ్మదేవుని ఆ వాక్యములను విని రైతు ఆనందపడి "దేవా! నే నతనిని ఖాళీగ పెట్టియుంచను! నాకు వేలకొలది పనులు సిద్ధముగ నున్నవి. ఒక్కొక్కటి అతనికి చెప్పుచుందును. నాజీవిత పర్యంతముకూడ అతనిని ఊరక నుంచను. కావున ఆ రాక్షసుని నాకు దయచేయుడు" అని అర్థించెను. "తథాస్తు" అని పలికి బ్రహ్మదేవు డంతర్థానము నొందెను.

తత్క్షణమే రాక్షసుడు ప్రత్యక్షమై రైతును పనియిమ్మని అడిగెను. రైతు "ఓయీ! రాక్షసుడా! నాకు ఉన్న మూడు వందల యకరముల పొలమును నాలుగుసార్లు చక్కగ దున్నుము!" అని అజ్ఞాపించెను. ఆ వాక్యములను వినుటయే తడవుగా రాక్షసుడు పరుగుత్తుకొనివెళ్ళి ఆ పొలమునంతను ఒక అరగంటలో దున్నివైచి తిరిగివచ్చి "పని" అని గద్దించెను. రైతు "ఓయీ! పది అంతస్తులుగల దివ్యమైన భవనము నొకదానిని నిర్మింపు"మని అజ్ఞాపించెను. వాడు ఒక గంట సేపటిలో ఉత్తుంగభవన మొకదానిని నిర్మాణము చేసివైచి రైతుతో "తరువాత పని ఏమి?" అని అడిగెను. పనుల లిస్టు చూచి రైతు మూడవదానిని చెప్పెను. కాని వాడు ఘడియలో దానిని పూర్తిచేసి తిరిగి వచ్చుచుండెను. ఈ ప్రకారముగ ఒక వారము దినములలో రైతుయొక్క పను లన్నిటినీ రాక్షసుడు సమాప్తము చేసివైచెను. ఇక పను లివ్వియు

లేవు. ఖాళీగా నుంచినచో రాక్షసుడు తనను మ్రింగివేయు నను భయముతో రైతు వూరు వెలుపలగల తన గురువు కొద్దకు రివ్వున పోయి సాష్టాంగ నమస్కార మాచరించి "గురుదేవా! పాహిమాం!" అని కరము వేడెను. జరిగిన విషయము అంతయు నివేదించి కరాళ వదనుడగు ఘోరరాక్షసునకు తన్ను బలికాకుండ కాపాడుమని యతడు తన గురుదేవుని ప్రార్థించెను. తోడనే గురువాతని చెవిలో ఏదియో రహస్యము చెప్పి ధైర్యము గలిగి వంపి వైచెను. రైతు ఇంటికి రాగానే రాక్షసుడు అడ్డుపడి "పని" అనియడిగెను. రైతు వానిని వూరి వెలుపలకు తీసుకొని వెళ్లి అక్కడ గల ఒక పెద్ద తాటిచెట్టును చూపించి దానిని ఎక్కు మనెను. రాక్షసుడు తృటిలో దానిని ఎక్కివైచి "పని" అని యడిగెను. చెట్టుపైనుండి దిగు—ఇదియేపని, అని రైతు చెప్పెను. రాక్షసుడు చెట్టుపైనుండి గంతువేసి దిగి "పని" అని యడిగెను. చెట్టు ఎక్కు అని రైతు పలికి "ఓ రాక్షసుడా! ఇకమీదట నన్ను పదేపదే పని అడుగవద్దు. చెట్టు ఎక్కిన పిదప దిగుతూ ఉండు, దిగిన పిదప ఎక్కుతూ ఉండు—ఇదియే నీ పని" అని శాసించెను. రాక్షసుడు అట్లే నూరుపర్యాయ ములు చెట్టుఎక్కి దిగి తుదకు విసుగుపుట్టి చెప్పకుండా పారి పోయెను. రైతు గుండెబరువు తీరిపోయెను.

కథలోని రాక్షసునకు ఏ పనీ లేనిచో ఎట్లు అపకారము చేయునో, అట్లే మనస్సును ఊరకనున్నచో లేనిపోని సంకల్పములను గావించుకొనుచు మనుజుని అధోగతికి ద్రోసివేయును. కాబట్టి ముముక్షువగువాడు మనస్సునకు నిరంతరము ఏదైన దైవకార్యముగాని, సద్గ్రంథ పఠనముగాని, ఆత్మవిచారణగాని, లోకసేవాది వ్యవహారముగాని, ఒసంగి పవిత్రముగా నొనర్చవలెను. వాసనా రహితముగ గావించవలెను. వ్యర్థముగ సోమరిగ దానిని, ఎన్నటికిని ఉంచరాదు. ఇదియే సాధకుడు గమనించదగిన ముఖ్య విషయము.

**నీతి — మనస్సును ఊరకనుంచరాదు. ఏదైన ఆధ్యాత్మిక కార్యక్రమమును దానికివ్వవలెను. ఊరకమున్నచో వ్యర్థమైన సంకల్పములు చేయుచుండును. కాబట్టి ధ్యాన, పఠన, సేవాదికార్యములందు దానిని వినియోగించవలెను**



# అంధపరంపర

పూర్వకాలమున ఒకానొక పట్టణమున ఒక మహారాజు నివసించుచుండెను. అతనికి సమస్త ఐశ్వర్యములు కలవు. గొప్ప గొప్ప రాజభవనములెన్నియో అతనికి కలవు. లెక్క లేనంత పరివారమున్ను కలదు. ప్రజలందఱును రాజాజ్ఞను మీఱక అతనిపై పరమ విశ్వాసముగల్గి మెలగుచుండిరి.

రాజభవనమునందలి అంతఃపురమునందు రాజమహిషి తన పరిచారికలతో కాపురముండుచుండెను. ఆ రాణీనివాస మందిరమునకు ప్రతిదినము ఒక చాకలిది రాణియొక్క చీరలను, ఇతర వస్త్రములను ఉతికి శుద్ధపఱచి తెచ్చుచుండెను. ఆమె తనయొక్క కార్యమందు ఎంతయో నైపుణ్యమును, శ్రద్ధను కనపఱచుచు క్రమక్రమముగ రాణియొక్క పూర్ణవిశ్వాసమును చూరగొనెను. ప్రతిదినము వస్త్రములను ఉతికి తెచ్చి యిచ్చునపుడు రాణితో కొద్దిసేపైనను ఇష్టాగోష్ఠి జరుపుచుండెడిది. ఈ ప్రకారముగ రాణికిని, ఆ చాకలికిని దోస్తి దినదినము పెరుగ దొడగెను. వారియొక్క మైత్రి రోజురోజుకు ప్రగాఢ మగుచుండెను. రానురాను ఒకరిని విడిచి మఱియొకరు ఉండ లేని పరిస్థితికి వచ్చిరి.

ఇట్లుండ ఒకనాడు చాకలి రాణియొక్క వస్త్రములను శుద్ధపఱచి తీసికొనివచ్చి రాణిముందుపెట్టి గొల్లున ఏడువ

సాగెను. ఆమె నేత్రములనుండి అశ్రువులు ధారధారగ ప్రవహింపసాగెను. కారణమేమియో తెలియకుండెను ఆ దృశ్యమునుజూచి రాణియొక్క హృదయము పరమ ఆవేశనతో నిండిపోయెను. ఈ చాకలికి ఏదియో బ్రహ్మాండమైన ఆపత్తువచ్చి నత్తినపడనిదే ఎందులకేడ్చును ? ఆమె సన్నిహిత బంధువు లెవరో మరణించి యుండవచ్చును. లేక వారికేదైన ధననష్టము సంభవించి యుండవచ్చును. లేక ఆమె ఆప్తులకు ప్రచండరుగ్మత ఏదియో సంభవించి యుండవచ్చును. అట్లు కాకున్న ఈ చాకలి ఇంతపెద్దగా ఎందుకేడ్చును ? ఇట్టి ఆర్తనాదము ఎందులకు చేయును ? కాని ఈ మహాదుఃఖమునకు మనమిపుడు కారణ మరయుట సహేతుకముగారుండదు. అది లోకనీతికి విరుద్ధము. కావున మనముకూడ మనఆప్తుని దుఃఖములో పాలుపంచుకొనుటయుక్తము. ఇదియే లోకాచార పద్ధతి. [Etiquette] అని నిశ్చయించుకొని రాణికూడ చాకలితోబాటు పెద్దగ ఏడ్వసాగెను.

రాణియొక్క ఆ ఏడ్పువిని రాజభవనములో ప్రక్కనే వేరొక గదిలోనున్న రాజు ఏదియో ప్రబల కారణము లేనిదే రాణి ఎందులకు ఏడ్చును ? కారణమరయుట ఈ సమయమున మర్యాదగానుండదు. ఆమె ఏడ్చునప్పుడు మనము వూరకుండుట భావ్యముకాదు! అని తలంచి కారణము తెలియకనే పెద్దపెట్టున రోదనము చేయసాగెను. రాజు ఏడ్చుటజూచి

మంత్రులున్ను, సామంతులున్ను ఏడ్వసాగిరి. వారినిజూచి భృత్యులు, పరిచారకులుకూడ మర్యాదకొఱకై ఏడువదొడంగిరి. ఈ ప్రకారముగ రాజభవనమంతయు ఆక్రందనములతో ఏడ్పులతో, పెడబొబ్బలతో నిండిపోయెను. ఆయాక్రంద న ధ్వని నలుదెసల వ్యాపించగా రాజభవనమునకు చుట్టుప్రక్కల నున్న ప్రజలు రాజు ఏడ్చుచుండ ఇక మనము వూరకనుండుట మర్యాదకాదు. "యథారాజా తథాప్రజా" అని పెద్దలు సెల విచ్చిరిగదా! కాబట్టి మనముకూడ వారి కష్టసుఖములలో పాలుపంచుకొనుట సముచితము' అని నిశ్చయించుకొని రాజ ప్రాసాద సమీపమునగల ప్రజలున్ను ఏడువసాగిరి. వారిని జూచి ప్రక్కన ఇండ్లవారుకూడ గొల్లున ఏడ్పు మొదలుపెట్టిరి. ఈ ప్రకారముగ వూరంతయు ఏడ్పులతో నిండిపోయెను. 'కారణము అడుగుదమా' మర్యాదకు లోటు' అని అందఱు భావింపదొడగిరి.

ఇట్టి విపత్కర పరిస్థితిలో ఆయూరికి ఒక సాధువుగారు వచ్చిరి. వూరిలో అడుగుపెట్టగనే అతనికి ఆ చివరిఇంటిలో రోదన ధ్వని వినిపించెను కారణము అరయుదలంచి సాధువు ఇంటిలోనికేగి 'అయ్యలారా! అమ్మలారా! ఎందులకేడ్చుచున్నారు?' అని యడుగగా 'మహాత్మా! మాకు కారణము తెలియదు. మాప్రక్కఇంటివారు ఏడ్చుచుండ, మర్యాద కొఱకై మేమున్ను ఎడ్చుచున్నాము" అని బదులు చెప్పిరి.

ఏమైనాకానీ, దీనికి కారణము తెలిసికొనియే తీరవలెను అని సాధువు కృతనిశ్చయుడై ప్రక్కయింటివారి నడుగ వారు తమ ప్రక్కయింటివారి నడుగమనిరి. ఈ ప్రకారముగ అడుగుకొనుచు పోయి తుట్టతుదకు సాధువు రాజభవనమునకు వచ్చెను. అచటికివచ్చి భృత్యునితో మీరెందుకేడ్చుచున్నారని ప్రశ్నింప, మంత్రిగారేడ్చుచున్నారు కనుక అని చెప్ప, సాధువు మంత్రిగారియొద్దకు వెళ్లి 'మహాత్మా! మీరేల ఏడ్చుచున్నా'రని ప్రశ్నింప, రాజగారేడ్చుచున్నారు గనుక అని జవాబుచెప్ప, సాధువు రాజగారిని సమీపించి 'దేవరా! మీరేల ఏడ్చుచున్నా'రని యడుగ "రాణి ఏడ్చుచున్నది కాబట్టి" అని ప్రత్యుత్తరమిచ్చెను. కాని సాధువు అంతటితో ఊరుకొనలేదు. ఈ ప్రహసనముయొక్క అంతు చూడవలెనని అతడు నిశ్చయించుకొనెను. కావున వెంటనే రాణియొద్దకుపోయి 'అమ్మా! మీరేల ఏడ్చుచున్నా'రని ప్రశ్నింప, ఆమె "మా చాకలిది ఏడ్చినది కాబట్టి" అని జవాబిచ్చెను. సాధువు చాకలిదాని యొద్దకుపోయి "నీవేల ఏడ్చుచున్నా"వని ప్రశ్నింప 'మా గాడిదపిల్ల చచ్చినది' అని చటుక్కున సమాధానమిచ్చివేసెను ఇదీ కథ. సాధువు ఫక్కున నవ్వెను. రామ! రామ! చాకలిదాని గాడిదపిల్ల చచ్చినందువలన ఊరంతయు ఏడ్చుటయా! ఎంత విపరీతము! ఎట్టి అంధపరంపర! ఎంత అవివేకము! ఈ

పట్టణముపై అజ్ఞానము నగ్ననృత్యము చేయుచున్నదే అని లోలోన ఆశ్చర్యపడుచు సాధువు తనదారిన తాను పోయెను.

కథలోని రాజువలె, పట్టణవాసులవలె ఈ ప్రపంచమున ఎక్కువమంది జనులు ఒక అంధపరంపరను అనుసరించు చున్నారు. తా మెచటనుంచి ఈ ప్రపంచమునకు వచ్చిరో ఎచటికి వెళ్లవలెనో తమ లక్ష్యమేదియో, ఆ లక్ష్యప్రాప్తికి మార్గమేదియో, ఆ మార్గము సూచించువారెవరో, దానిని సాధించుపద్ధతి ఏదియో కించిత్తైనను విచారించక, తమ గమ్య స్థానమగు పరమాత్మగూర్చి ఒకింతయు ఆలోచించక, తమ తండ్రులు, తాతలు, ముత్తాతలు, ప్రక్కయింటివారు, పొరుగూరివారు ఏయే విషయజాలములలో పడి కొట్టుకొను చున్నారో తాముకూడ అదే పద్ధతిని అనుసరించుచు దృశ్య వ్యామోహములోపడి తల్లడిల్లుచున్నారేకాని, తామువచ్చిన పనియేదో, తమ నిజస్వరూపమేదియో విచారించుటలేదు కాబట్టి విజ్ఞులగువారు ఇట్టి అంధపరంపరను విడనాడి చక్కని వివేకము నాశ్రయించి తమ జీవిత లక్ష్యమునుగూర్చి తెన్నగ చింతనచేసి, జీవితము అంతము కాకపూర్వమే ఆత్మసాక్షా త్కారరూపలక్ష్యమును బడసి ధన్యులయ్యెదరు గాక!

**నీతి — ఒకరిని గుడ్డిగ అనుకరించరాదు. పూర్వాపరములను చక్కగ విమర్శించి చేయదగిన సత్కార్యమునే చేయవలయును.**

# భగవంతుడు పరిమితుడు కాడు

పూర్వ మొకనాడు కౌరవసభలో ఎందరో పెద్దలు ఆసీనులై యుండగా వారి సమక్షమున దుశ్శాసనుడు ద్రౌపదీ దేవిని ఈడ్చుకొనివచ్చి అవమానముచేయ నుద్యుక్తుడయ్యెను. ఆ విపత్కర సమయమున ద్రౌపదికి ఏమియు దిక్కుతోచకుండెను. తక్షణమే దైవసహాయమును నపేక్షించెను. శ్రీకృష్ణ పరమాత్మను ఈ ప్రకారముగ ఆ లలనామణి ప్రార్థించెను.

గోవింద ద్వారకావాసిన్ కృష్ణ గోపీజనప్రియ
కౌరవైః పరిభూతాం మాం కిం న జానాసి కేశవ.

"ఓ గోవిందా! ద్వారకావాసీ! కృష్ణా! గోపీజనవల్లభా! కౌరవులచే అవమానింపబడుచున్న నన్నేల నీవు తెలిసికొనుట లేదు? నన్నేల కాపాడకున్నావు?" కాని శ్రీకృష్ణునినుండి ప్రత్యుత్తరము రాలేదు. క్షణములు గడచిపోవుచున్నవి. ప్రమాదము తీవ్రమగుచున్నది. ఇక ఏమిచేయవలెనో ద్రౌపదికి తోచకుండెను. అయినను ధైర్యము తెచ్చుకొని ఆ శ్రీకృష్ణపరమాత్మనే మరల ఈ క్రింది విధముగ ప్రార్థన చేయదొడగెను —

కృష్ణ కృష్ణ మహాయోగిన్ విశ్వాత్మన్ విశ్వభావన
ప్రపన్నాం పాహి గోవింద కురుమధ్యేऽవసీదతీమ్

కృష్ణా! కృష్ణా! మహాయోగివర్యా! సర్వజగద్వ్యాపకా! విశ్వస్వరూపా! కౌరవులమధ్య అవమానపడుచు నిన్ను శరణు బొందినట్టి నన్ను రక్షింపుము! రక్షింపుము!"

ఈ రెండవప్రార్థన చేసిన మఱుక్షణమే ద్రౌపదికి భగవత్సహాయము లభించెను. ఆమె ధరించిన వస్త్రము అక్షయరూపమును దాల్చెను. దుశ్శాసనుడు కింకర్తవ్యవిమూఢుడై తలవంచుకొని వెడలిపోయెను. పరిస్థితి అదుపులోనికి వచ్చినప్పటికిని, ఆపత్తు పూర్తిగ తొలగిపోయినప్పటికిని ద్రౌపదికి ఒక్కవిషయమందు మాత్రము సంకోచము వదలకుండెను. "శ్రీకృష్ణపరమాత్మ ఆర్తరక్షకుడుగదా! దీనజనబంధువుకదా! భక్తవత్సలుడుకదా! మఱి, ఆర్తియందుండి హృదయపూర్వకముగ మొఱపెట్టుకొనుచున్న ఒక అబల యొక్క దీనాలాపమును విని తత్క్షణమే అతడేల సహాయము చేయకుండెను? కొంచెమాలస్యమేల చేసెను?"—అను ఈ సందేహమామెకు మనమున బాధింపదొడగెను. అనుకూల సమయమందు ఆకృష్ణునే స్వయముగ ప్రశ్నించి తత్సందేహనివారణము కావించుకొన నిశ్చయించెను ద్రౌపది. ఇట్లుండ కొంతకాలమునకు ఒకనాడు శ్రీకృష్ణునిదర్శనము ఏకాంతమున తటస్థించినపుడు ద్రౌపదీదేవి అదను జూచి అమ్మహాత్ముని ఇట్లు ప్రశ్నించెను—దేవా! మీరు భక్తవత్సలురు గదా! దీనుల పాలిటి కల్పవృక్షస్వరూపులు కదా! నిండు ప్రమాదములో

ఉండి ఆర్తనాదముచేసి "కృష్ణా! ద్వారకావాసీ!" అని బిమ్ము లను మనసార ప్రార్థించినపుడు నాకు సహాయమును వెంటనే చేయక ఒకింత ఆలస్యము చేసితివేమి? ఇట్లు చేయుట తగునా?

ద్రౌపదియొక్క సముచిత హేతుపూర్వక వాక్యములను విని శ్రీకృష్ణపరమాత్మ యిట్లు ప్రత్యుత్తరమిచ్చెను — "అమ్మా! నీవు చెప్పినది నిజమే. ఆర్తులను, దీనులను, భక్తితో నన్నుస్మరణచేసిన వారిని తక్షణమే రక్షించి కాపాడుట నా యొక్క ధర్మము. కాని నీవు నన్ను మొదట 'ద్వారకావాసీ' అని సంబోధించితివి. నేను ద్వారకావాసినిగదా! ద్వారకలో నివసించువాడనుగదా! మరి నిన్ను రక్షించుటకు ద్వారకనుండి హస్తినాపురమునకు రావలెనుగదా! ద్వారక ఎచట! హస్తినాపుర మెచట! కొన్నివందలమైళ్ల దూరము మధ్యలో ఉన్నది కదా! అంతదూరము నడచిరావలెనన్న ఎంతవేగముగా వచ్చినప్పటికిని ఒకింత ఆలస్యము జరుగునుగదా!

కృష్ణపరమాత్మ యొక్క ఆ భావగర్భిత వచనములను విని ద్రౌపది నిరుత్తరయయ్యెను. "విశ్వవ్యాపకుడగు దేవదేవుని పరిమితాకారవంతునిగ వర్ణించి నేను ప్రార్థించితినే! బ్రహ్మాండమంతటను అణువణువునందును వ్యాపించి విరాడ్రూపుడై చెన్నొందు అనుపమేయుని ద్వారకలో పరిమితుడై యున్నట్లు భావించితినే! ఎంత పొరపాటు! కనుకనే నాయొక్క మొదటి ప్రార్థనకు జవాబు రాలేదు. రెండవ ప్రార్థనలో ఆ

అమవాసీయుని "విశ్వాత్మన్"—(విశ్వస్వరూపా) అని సంబోధింపగా తత్క్షణమే ప్రత్యుత్తరము వచ్చివేసినది. కాబట్టి భగవంతుడు అపరిమితుడు, సర్వవ్యాపి అని ద్రౌపది నిశ్చయించుకొని సంతృప్తిని బొందెను.

కావున, భక్తులు తమకు భక్తిభావము కుదురుటకును, చిత్తైకాగ్రత అలవడుటకును ప్రారంభమున సాకారోపాసన కావించినను, దేవుని పరిమితాకారముగ భజించినను, తుదకు ఏనాటికైనను నిరాకార, నిరంజన, నిర్గుణ, సర్వవ్యాపక భగవత్స్వరూపమును వారు అనుభూతి మొనర్చుకొనియే తీరవలెను. సాకారమునుండి నిరాకారమునకును, సగుణమునుండి నిర్గుణమునకును, పరిమితమునుండి అపరిమితమునకు, సాంతమునుండి అనంతమునకు తప్పక పయనమై పోవలెను. భగవంతుని యొక్క సర్వవ్యాపకత్వమును ఈ జీవితమందే అవగాహన మొనర్చుకొని జనులు ధన్యులు కావలెను.

**నీతి :- భగవంతుడు సర్వవ్యాపి. అణువణువునందును వారు వ్యాపించియున్నారు. కాబట్టి పాపకార్యమును చేయక, పుణ్యకార్యములద్వారా ఆత్మోన్నతిని సాధించవలయును.**

# దైవకృప–మానవయత్నము

ఒక గ్రామములో ఒకానొక రైతు కాపురముండు చుండెను. అతనికి ఒక యకరము పొలము, ఒక బండి, ఒక జత ఎద్దులు ఉండెను. ప్రతిదినము అతడు ఉదయము తన చేనియొద్దకు వెళ్ళి దాని మంచిచెడ్డలు గమనించుచు, దాని యొక్క ఫలసాయమునకు సంబంధించిన పనులను చూచుచు నుండెను. ఆ ఒక్క యకరము పొలమే తనకు జీవనభృతికి ఆధారమై యుండుటవలన దానివిషయమై యతడు కడుజాగరూకుడై యుండెను.

ఒకనాడా రైతు తన బండినిండ ఎరువువేసుకొని పొలమునకు తోలుకొనిపోవుచుండ మార్గమధ్యమున బ్రహ్మాండమైన వర్షము కురిసెను. త్రోవయంతయు బురదతో కూడి యుండెను. రైతు ఎట్లో కష్టముపై బండిని ముందునకు సాగించుచుండెను. ఇంతలో నొకచోట ఊబిలో చక్రములు కూరుకొనిపోవుటవలన బండి ఆగిపోయెను. అత్తరి ఆ రైతు బండిదిగి బాటప్రక్కనకూర్చుండి ఆంజనేయుని మంత్రము నుపాసింప ప్రారంభించెను. అతడు హనుమదుపాసకుడు. అతని ఇష్టదైవము హనుమంతుడు. ఆ కష్ట పరిస్థితిలో తన ఇష్టదైవమే దిక్కనియెంచి ఆ రైతు ఆ పనికి పూనుకొనెను. ఒక రోజంతయు ఆ ప్రకారమే అన్నాహారములను వర్జించి

హనుమంతుని ఉపాసింప ఆంజనేయుడు ప్రత్యక్షమయ్యెను. అపుడు వారిరువురకును ఈ ప్రకారముగ సంభాషణము నడచెను—

ఆంజనేయుడు—ఓయీ! భక్తా! నన్నేల ఆహ్వానించితివి? నీకేమైన వరము కావలెనా?

రైతు—మహాప్రభో! ఈ బండిని కొంచెం ముందుకు తొయ్యండి! చాలు.

ఆంజనేయుడు—నీవు సోమరిపోతువై ఏమాత్రము ప్రయత్నము చేయనిచో, మేముమాత్రము ఏమిసహాయము చేయగలము? పూర్వము త్రేతాయుగములో శ్రీరామ సాన్నిధ్యమున మే మెంత కృషి సల్పినది నీకు తెలియునా? మానవుడు కొంచెమేని యత్నము సల్పినచో దానికి భగవంతుడు చేయూత నియ్యగలడు అసలేమి యతడు చేయనిచో దేవుడుమాత్రమేమి సహాయము చేయగలడు. కాబట్టి లెమ్ము! చక్రము పట్టుకొని పైకి లేపుము. ఆ తరువాత అంతయు దేవుడే చూచుకొనగలడు. పురుష ప్రయత్నము, దైవకృప రెండుకలిసినపుడు పనులుచక్కగ జరుగును. పురుషప్రయత్నమునుబట్టియే దైవకృప వర్తించుచుండును. సోమరులకు భగవంతుడేమి సహాయము చేయగలడు? అని ఈ ప్రకారముగ ఆంజనేయుడు బోధించి

అదృశ్యుడుకాగా ఆ రైతు వెంటనే లేచి తన రెండు చేతులతో చక్రమును లేప యత్నింప, తక్షణము బండి కదిలిపోసాగెను. రైతు యత్నమునకు ఆంజనేయుని అను గ్రహముతోడయ్యెను. ఫలితముగ ఆ బండి చరగి గమ్యస్థానము చేరగలిగెను.

కాబట్టి జనులు భగవత్కృపను కాంక్షించుటతో పాటు తమ కర్తవ్యమును, తమ విధ్యుక్తధర్మమును, తమ యత్న మును ఏమాత్రము త్యజించరాదు. ప్రయత్నశీలునకు సమ స్తము లభించగలదు. అయితే భగవద్భక్తి నిరహంభావము ఆ ప్రయత్నమునకు తోడుగా నుండవలెను. అపుడే కార్య ములు చక్కగ రాణించగలవు. ఫలించగలవు.

**నీతి — దైవవిశ్వాసముతో బాటు మానవప్రయ త్నము కూడ అవసరము.**

## కోరికలు పెంచుకొన రాదు

పూర్వ మొకనొక గ్రామములో ఒక సామాన్యకుటుం బము కలదు. అందు భార్యాభర్త లిరువురు అన్యోన్య ప్రేమానురాగములు కలవారై నివసించుచుండిరి. కుటుంబ ములో ఏ యిబ్బందులున్న లేవు. కాని ఒక్క విషయమందు

మాత్రము వారికి విపరీతమైన మనస్తాపము కలుగుచుండెను. ఒడుదుడుకులులేక సవ్యముగా కాలము గడచిపోవుచున్నప్పటికిని మనస్సునందు ఒక్క విషయమై వారికి తీవ్రమగు ఆందోళన జనించుచుండెను వారిరువురి ఆకృతులలో, ముఖ్యముగ ముఖనిర్మాణమందు ఒకింత కురూపత్వము జనులకు దృగ్గోచరమగుచుండెను. ఇద్దరికిని ముక్కులు చట్టిగా నుండుట వలనను, ఆ చట్టితనముకూడ ఇద్దరికిని ఒకే కొలతలో ఏర్పడియుండుటవలనను, చూచినవారికెల్ల పట్టరాని నవ్వు వచ్చుచుండెను. వారింటికి బంధువులుగాని లేక తదితరులుగాని ఎవరు వచ్చినప్పటికిని ముందుగా వారిద్దరిని జూచి పకపక నవ్వుచుండిరి. ఈ స్థితి ఆ దంపతులకు చాల దుర్భరముగ నుండెను. ఈ అవమానమును భరించలేక వారు లోలోన కృంగి కృశించిపోవుచుండిరి. 'భగవంతుడా! ఏల మమ్ములనీ ప్రకారముగ సృష్టించితివి?' అని లోలోన వాపోవుచుండిరి.

ఇట్లుండ కొంతకాలమునకు వారొక అనుభవజ్ఞుడైన జ్యోతిష్కునియొద్దకు వెళ్ళి ఈ అవమానము ఎప్పుడు తొలగగలదనియు, అది తొలగిపోవు ఉపాయమేదియైన కలదాయనియు ప్రశ్నించిరి. అంతట ఆ జ్యోతిష్కుడు—దంపతులారా! ఇది మానవ మాత్రులచే సాధ్యమగుపనికాదు. మీ ముక్కులను ఇంత వికృతముగ ఎవరు సృష్టించిరో అట్టి జగన్నిర్మాతయైన బ్రహ్మదేవుడే మీయొక్క ఈ దురంత అవమానమును

దూరీకరింప సమర్థుడు. కాబట్టి ఈరోజుమొదలుకొని మీరా బ్రహ్మదేవుని సాక్షాత్కరించుకొనుటకై జపతప ప్రార్థనాదులను గావించుడు అని వాక్రుచ్చెను.

అది విని దంపతులు పరమానందభరితులై ఇంటికి తిరిగి వచ్చి వ్రతనిష్ఠకలవారై బ్రహ్మదేవునిగూర్చి తీవ్రమగు తపస్సును ప్రారంభించిరి. ఆహారమును వర్జించి, ఏకపాదంబున నిలబడి, చిత్తమును అన్యత్ర పోనీయక కఠోరదీక్షతో వారు బ్రహ్మదేవుని అహర్నిశము ధ్యానింపదొడగిరి. వారి యా తపస్సునకు మెచ్చి బ్రహ్మదేవుడు ప్రత్యక్షమై వరము కోరుకొనుమని వచింప, తత్క్షణమే ఆ దంపతులు "మహాప్రభో! మాకొక కోరికకలదు. ఈ చట్టిముక్కులవలన మాజీవితము చాల దుఃఖభూయిష్ఠముగ పరిణమించినది. ప్రతివాడును జూచి ఎగతాళిచేయుచున్నారు. మేము లోకమున కిపుడు పరిహాసపాత్రులమై పోయితిమి. ఈ అవమానమును మేమిక భరింపలేము. ఈ దుర్భర విపత్తునుండి మమ్ములను కాపాడి గట్టెక్కించు తండ్రీ! మీకు పదివేలు నమస్కారములు. మాకు మంచిముక్కుల నొసంగి దీవించు మహాప్రభో!" అని ప్రార్థించిరి ఆట్లేయగుగాక! అని పలికి బ్రహ్మదేవు డంతర్ధానము నొందెను.

బ్రహ్మదేవుని వరప్రభావముచే ఆ దంపతులకు మంచి ముక్కులు ఏర్పడెను. అయితే ఒక పెద్దచిక్కువచ్చి నత్తిన

పడినది. ఏమియనగా "మాకు మంచి ముక్కులు కావలెనని వారు ప్రార్థించి నందువలనను, "ముక్కులు" అని బహువచన ప్రయోగము చేసి నందువలనను ఎన్ని ముక్కులు కావలెనో స్పష్టముగ తెలుపనందు వలనను బ్రహ్మదేవుడు వారి ఒడలంత యును మంచి ముక్కులతో నింపివేసెను. చేతులపై, కాళ్లపై తలపై, మెడపై, ఎక్కడ చూచి నను ముక్కులే! రామ! రామ! ఇక వారి పరిస్థితి ఎట్లుండునో చెప్ప నవసరములేదు. వారిపని "మూలిగే నక్కమీద తాటికాయ" చందమయినది. వారి వికారవరాకారమును చూచుటకు జనులు తండోపతండముగ రాదొడంగిరి. వచ్చుటయేకాక కడుపు చెక్కలగునట్లు నవ్వు చుండిరి. ఒకవంక ఆశ్చర్యము, ఒకవంక పట్టరాని నవ్వు, వీనితోగూడి జనులు తీర్థప్రజగా అచటికి కేతెంచుచుండ ఆ దంపతులకు నూతన సమస్య యేర్పడెను. ఆపీడ పడలేక వారు తిరిగి బ్రహ్మదేవుని ప్రత్యక్షము చేసికొనదలంచి అందులకై ఏకాంతమున కతిగి తిరిగి ధ్యానాదులను సలుపదొడంగిరి.

కొంతకాలమునకు వారి తపస్సునకు మెచ్చి బ్రహ్మదేవుడు ప్రత్యక్షమై 'ఓ దంపతులారా! మీ యాభీష్ట మేమియో వచింపుడ'ని పలికెను. అంతట వారిరువురు "మహాత్మా మాకిపుడు ఒడలంతయు మంచి ముక్కులతో నిండిపోయి అసహ్యముగనున్నది. ఇన్ని ముక్కులను ఎవరు భరించ గలరు! కావున దేవా! ఈ ముక్కులు మాకువద్దు' అని

ప్రార్థించిరి. తోడనే బ్రహ్మదేవుడు "తథాఽస్తు" (అట్లే యగుగాక!) అని వచించి యంతర్ధానమొందెను. బ్రహ్మదేవుని యనుగ్రహముచే వారికపుడు ముక్కులన్నియు తొలగిపోయినవి కాని ఈసారి ఇంకొక పెద్దచిక్కు వచ్చిపడినది. ఏమనగా 'అన్ని ముక్కులు తొలగిపోవుగాక' అని బ్రహ్మదేవుడు వర మిచ్చినందువలన ఒక్క ముక్కుకూడ మిగలకుండ అన్నియు మాయమైపోయినవి. కనీసము ఊపిరి సల్పుటకైనను ఒక ముక్కు మిగలలేదు. అపుడు పరిస్థితి ఇంకను విషమించి పోయినది. ఆ దంపతులు ఊపిరిసలుపలేక నానావస్థలు పడుచుండిరి. ఇక గత్యంతరములేక వారు బ్రహ్మదేవుని మరల ధ్యానించి, ప్రత్యక్షము చేసికొని "దేవా! జగన్నాథా ఈ లేనిపోని గొడవెందుకు? మా పాతచట్టిముక్కు మాకిచ్చి వేయండి చాలు" అని ప్రార్థించిరి. బ్రహ్మదేవుడు 'తథాస్తు" అని పలికి అంతర్ధానమొందెను. దంపతులకు యథాప్రకారము పాత చట్టిముక్కులు ఏర్పడెను. అంతటితో వారు పరితృప్తి నొందిరి.

ఇంతకథ జరిగియు చివరకు వారు పొందినదేమి? ఇంత కాలము తపస్సుచేసియు వారు సాధించినదేమి? ఏ క్రొత్త వస్తువును వారు సంపాదింపగల్గిరి? ఏమియు లేదు. వారి మామూలు చట్టిముక్కులే చివరికి వారికి దక్కినవి. కోరికలపై కోరికలు పెంచుకొనినప్పటికిని, నానావస్థలు పడినప్పటికిన్

చివరికి ఏమియు మిగలలేదు. కావున ఉన్నదానితో సంతృప్తి నొందుటయే జీవితమునకు శోభ. వాంఛలు పెంచుకొనుటవలన మనుజునకు అశాంతి, అతృప్తి పెరిగిపోవుచుండునే కాని తరగవు—కథలోని దంపతులకువలె. కాబట్టి జనులు తమ కోఁకలను అదుపులో పెట్టుకొని, ఉన్నదానితో సంతృప్తిపడి విషయవాంఛారహితులై, శాశ్వత దైవప్రాప్తికై అహర్నిశము కృషిసల్పుదురుగాక!

పీఠి :— కోరికలను తగ్గించుకొని, మోక్షమును గూర్చియు, మోక్షసంపాదనకు వలసిన సాధనలను గూర్చియు లెస్సగ చింతనచేయుచు వానిని అమలు పఱచుచు జీవితమును సార్థకమొనర్చవలెను.

## చేసుకున్న వాడికి చేసుకున్నంత మహాదేవ!

పూర్వమున ఒకానొక మహారాజు అగణిత సిరిసంపద లతో తులతూగుచు, పెక్కు భోగభాగ్యంబులను అనుభవిం చుచు తన దేశపు ప్రజలను న్యాయపద్ధతిలో చక్కగ పరిపా లించుచునుండెను. అతనికి పలుగురు భార్యలు కలరు. రాజుకు ఆ రాణులపైనను, రాణులకు ఆ రాజుపైనను అవ్యాజమైన ప్రేమభావము కలిగియుండెను. రాణులందఱికిని రాజు వేత్యేకు

ములను నిర్మింపజేసి వారివారికి కావలసిన పదార్థములను ములను అవసరములను ప్రత్యేకముగ అందజేయుచుం ఆ నలుగురు ధర్మపత్నులయెడల రాజు సమానమైన భావము గలిగియుండుచు, పక్షపాతబుద్ధి లేక అందరి - మన్ననలను పొందుచుండెను.

ఈ ప్రకారముగ సుఖముగ కాలము గడచుచుండ, ి అత్యవసర కార్యార్థమై రాజు ఖండాంతరమున కేగుట చెను. కొన్ని వేల మైళ్ల దూరమునగల ఒకానొక నూతన మున కేగి అచట ముఖ్యపట్టణమును చేరుకొనెను. అది లక్షల జనాభా కలిగిన బ్రహ్మాండమైన సుందరనగరము ఆధునిక పద్ధతులతో, వస్తుసంపదలతో కూడి, పెక్కు- గారములతో, గగనచుంబిత ప్రాసాదములతో నిండి ృతమై నూతన వైభవములకు ఆటపట్టై, అత్యంత నీయముగ ఆ నగరము కన్పట్టుచుండెను. అట్టి రమణీయ మును చేరుకొని రాజు ఒక నెలరోజులు తన కార్యమును ర్తించుకొని తిరిగి స్వదేశమునకు పయనమగుటకు ఉద్యు తన ధర్మపత్నులు నలుగురికి ఈ క్రిందిభావములతో యుగ జాబులు వ్రాసిపంపెను —

"ఓ అంగనామణులారా! ఇపుడు నేనరుదెంచినది ఒక ద్భుతమైన మహాపట్టణము. దీనితో సమానమైన పురము

మన ప్రాంతములో వెదకినప్పటికి కన్పించదు. కండ్లు మిరి మిట్లు గొలుపు దృశ్యము లనేకము లిచట గలవు. చూచిన వారిని మోహానపరవశులచేయు వస్తుసామగ్రి లెక్కకుమించి ఇచటగలదు. కాబట్టి ఓ దేవేరులారా! నేనిపుడు కొద్దిరోజు లలో గృహోన్ముఖుడ నగుచున్నాను. కాబట్టి మీరు మీ మీ అభీష్టవస్తువులను తెలిపినచో, ఎవరికి ఏయే వస్తువులు వాంఛనీయములో ఎఱుకపఱచినచో నేను వచ్చునపుడు ఆయా వస్తువులను తెచ్చి మీకు ఒసంగెదను ఇట్టి అవకాశమును జారవిడుచుకొనకుడు ఇన్ని వేల మైళ్లదూరము మరల మరల వచ్చుట ఎవరికిని లభ్యపడదు. కాబట్టి, తక్షణమే మీమీ అభిలషిత పదార్థములను తెలుపుకొనుడు,—ఈ ప్రకారముగ నృపాలుడు తన నలుగురు భార్యలకును వేర్వేఱుగ ఉత్తరములు వ్రాసెను.

పది దినములు గడచినవి. నలుగురు భార్యల నుండియు ప్రత్యుత్తరములు వచ్చినవి. వారొక్కొక్కరు తమ తమ వాంఛితములను ఈ క్రిందిప్రకారము తమ హృదయేశ్వరునకు తెలిపిరి.

1. మొదటిభార్య — నాథా! ఆ మహాపట్టణమునకు మీ రేతెంచుట నాయొక్క మహద్భాగ్యమని తలంచుచున్నాను ముఖ్యముగ మనవిచేయుట ఏమనగా, నాకు పట్టుచీరలపై

మోజు ఎక్కువ. కావున ఆ మహాపురమంతయు వెదకి వెదకి చతుర్దశభువనములందు ఇంకెచటను ఎవరికిని లభింపనట్టి సుందరసుకుమార వస్త్రములను కొన్నింటిని మీ వెంట తీసుకొనిరండు! వానిని ధరించి ఇక నా జన్మ ధన్యమైనదని తలంచుకొనెదను.

౨. రెండవభార్య—నాథా! నేను ఎన్ని జన్మలలో చేసిన పుణ్యమో ఫలించుటచేతనే మీ రట్టి మహాపట్టణమునకు చేరుకొనుట సంభవించుట జరిగినది! ఇపుడు ముఖ్యముగ మనవి చేయుట యేమనగా నాకు ఆభరణములపై మోజు ఎక్కువ. క్రొత్త క్రొత్త ఫాషన్లుగల ఆభరణములన్నచో నేను చెవి కోసికొందును. కాబట్టి హృదయేశ్వరా! ఆ పురమంతయు వెదకి వెదకి నూతన ఫక్కీలో ఉన్న ఆభరణములు కొన్నింటిని మీ వెంట తీసికొని రండు!

౩. మూడవభార్య—నాథా! నాకు స్వాదిష్టములైన ఫలాహారములపై ఆసక్తి మెండు. జిహ్వను తృప్తిపరచుట నా యొక్క ప్రధాన కార్యక్రమములలో ఒకటి. కాబట్టి ఆ వభ్య నగరమంతయు గాలించి గాలించి జిహ్వకు ప్రీతికరములైన భోజ్యవస్తువులు కొన్నింటిని మీ వెంట తీసికొనిరండు. వానిని ఆరగించి నా జన్మ ధన్యతను గాంచగలదు.

4 నాల్గవభార్య — నాథా! మీరు మాకు వ్రాసిన జాబులో
మీకిష్టమైన పదార్థములను, ప్రీతికరములైన వస్తువులను
కోరుకొనుడు, తెచ్చెదను అని తెలిపితిరి. ప్రాణేశ్వరా! ఈ
జగత్తులో నాకు మీకంటె ప్రియతమ పదార్థము వేఱొకటి
ఏదికలదు? మీరు వెళ్లినది లగాయితు నాకు నిముషమొక
యుగముగా గడచుచున్నది. ప్రపంచమంతయు శూన్యముగా
తోచుచున్నది. ఈ జడమైన పదార్థములతో నాకేమిపని?
మీరొక్కరున్నచో అంతయు నాకు ఉన్నట్లే. కాబట్టి ప్రాణ
నాథా! మీరు తక్షణమే బయలుదేరిరండు! సురక్షితముగ
ఇల్లు చేరుకొనుడు! నాకదియే పదివేలు.'

ఈ ప్రకారముగ నలుగురు భార్యలు వ్రాసిన జాబులు
రాజునకు అందినవి. వెంటనే భూపాలుడు నగరమంతయు
చుట్టి తన భార్యలకు కావలసిన సామగ్రి నంతను సమకూర్చు
కొని స్వదేశమునకు పయనమైపోయెను. అనతికాలములో
తన పురమును చేరుకొని సేవకులద్వారా మొదటిభార్యకు
చీరెలు, రెండవభార్యకు ఆభరణములు, మూడవభార్యకు
ఫలహారములు పంపి, తానుమాత్రము స్వయముగ నాలుగవ
భార్యయొద్దకువెళ్లి ఆమె భవనములోనే కాపురముచేయ
దొడగెను. తక్కిన వారిండ్లలో అడుగైనను పెట్టలేదు. అది
చూచి తక్కిన ముగ్గురు రాణులు రోషారుణితనేత్రలై, క్రోధా
విష్టలై — అగ్నిసాక్షిగ నలుగురుని పెండ్లాడి, చివరకు ఒకరి

యొద్దనే కాపురము పెట్టుట న్యాయసమ్మతమా?' అని కొందఱు పెద్దలద్వారా రాజునకు కబురుచేయగా, రాజు వారలకీ ప్రకారముగ వెంటనే కబురుచేసెను —

'ఓ అర్ధాంగులారా! మీరు చెప్పినది పరమసత్యము. నేను అగ్నిసాక్షిగనే మిమ్ములను పరిణయమాడితిని. కాని, ఇపుడు మీరు కావలసిన వస్తువుల లిస్టులో నేను జమపడలేదు. మీకు ఏమి కావలయునని ప్రశ్నించినపుడు, ఒకరు వస్త్రములు కావలెనని, ఇంకొకరు ఆభరణములు కావలెనని, వేరొకరు భోజ్యపదార్థములు కావలెనని వ్రాసితిరేకాని నామాట ఎవరును అనుకొనలేదు. మీ కనిష్ఠసోదరి మాత్రము నన్ను కోరుకొనెను. అందువలననే అక్కడికి వెళ్లుట తటస్థించినది. ఇందులో మోసమేమి? కపటమేమి? అన్యాయమేమి? అక్రమమేమి? ఎవరు ఏమికోరుకొందురో, వారికి అది లభించుచుండునుగదా. చేసికున్నవారికి చేసుకున్నంత మహాదేవా!"

రాజుయొక్క ఆ వర్తమానము విని దేవేరులు నిరుత్తరులై తమ చర్యలకు తామే సిగ్గుపొందిరి. ఈప్రకారముగ రాజు వారలకు చక్కని గుణపాఠము బోధించి మరల యథాప్రకార ముగ అందఱితోను సుఖముగ కాపురము చేయసాగెను.

ప్రపంచములో ఇపుడు పెక్కురు జనులు మాయా మోహితులై, దృశ్యపదార్థములనే వాంఛించుచున్నారుకాని

శాశ్వత పరమాత్మనుకాదు. క్షణిక ప్రాపంచికభోగములను కాంక్షించుచున్నారేకాని, శాశ్వత బ్రహ్మానందమును కాదు. ఎవరెవరు దేనిదేనిని అభిలషించుచుందురో దానినే పొందు చుందురు. అజ్ఞానులు జడములైన దృశ్య వైభవములను కోరి వానికొఱకే ప్రయత్నించి వానినే పొంది తుదకు అతృప్తులై యుందురు — కథలోని మొదటి ముగ్గురు రాణుల వలె జ్ఞానులు చైతన్యవంతమై, శాశ్వతమై బ్రహ్మానందపరి పూర్ణమై, దుఃఖవర్జితమైనట్టి ఆత్మకొఱకే అభిలషించి, దాని కొఱకే యత్నించి, దానినే పొంది జననమరణ సంసారక్లేశ వర్జితులై మోక్షస్వరూపులై పరమసంతృప్తులై వసుగుచుం దురు — కథలోని నాల్గవరాణివలె. కావున వివేకవంతులగు వారు దూరదృష్టితో వ్యవహరించి ఆత్మప్రాప్తికొఱకే జీవిత మును వినియోగించి ధన్యులు కావలెనేకాని క్షణిక దృశ్య వస్తుప్రాప్తిచే జీవితమును క్లేశవంత మొనర్చుకొనరాదు.

నీతి :- ఎవడు ఎట్టి కార్యమును చేయునో దానికి అనుగుణమగు ఫలితమునే పొందును. కావున వ్యర్థకార్యములను విడనాడి శాశ్వత దైవప్రాప్తికి వలయు సాధనలనే జీవుడు కావింపవలయును.

-o-

# వాచావేదాంతము

ఒకానొక గ్రామముయొక్క సమీపమునగల ఒక చిన్న కొండకలదు. ఆ గ్రామములో కొన్నివేల జనాభా నివసించుచుండెను. రైతాంగమే వారి వృత్తి. వారిలో కొందఱు శ్రీమంతులై, భోగ భాగ్యములలో తులతూగుచు పెద్ద పెద్ద భవనములు నిర్మించుకొని హాయిగ కాలము గడుపు చుండిరి.

ఒకనాడు ఆ గ్రామమునకు ఒక మల్లుడు ( వస్తాదు, శాండో) ఏతెంచెను. అతడు ఆజానుబాహుడు. కండరములు బలిసి పుష్టిగల దేహము కలవాడై తన భయంకర ఆకృతి చేచూపఱ్ఱలకు ఆశ్చర్యము గొలుపుచుండెను. కలియుగ భీముడా యని అనిపించుచుండెను. అతడు గ్రామములో ప్రవేశించగనే జనమంతయు అతని చుట్టూ మూగిరి. అతని భీమాకృతిని ఏకదృష్టితో వారు చూడదొడంగిరి. 'ఇతడెవడు ! ఎందుల కీగ్రామమునకు విచ్చేసెను!' అని వారిలో వారు వితర్కించుకొనుచుండిరి. అతనిని సమీపించి అడుగుటకు వారు జంకుచుండిరి. అపుడా మల్లుడు (వస్తాదు) అచటనున్న ఒక గ్రామపెద్దను పిలిచి, ఊరివారికిని తాను కొన్ని ముఖ్యమైన సంగతులు చెప్పదలిచినాననియు, కాబట్టి అందఱిని ఒక చోట సమావేశ పఱచవలసిన పనియు చెప్పెను.

వెంటనే ఆ గ్రామపెద్ద ఊరంతయు తిరిగి ప్రతియింటి వారిని తలుపుకొట్టి, పిలిచి అందరిని సభకు ఆహ్వానించెను. ఏమివింత జరుగునో చూతుమనియు, మల్లుడేమి చెప్పునో విని తీరవలెననియు జనులు తండోపతండములుగ సభకురాదొడంగిరి. సభకు చోటు నిర్ణయింపబడెను. స్త్రీలు, పురుషులు, చిన్నలు, పెద్దలు, చదువొచ్చినవారు, చదువురానివారు, ధనవంతులు, బీదవారు,—ఒకరని చెప్పనేల, అందఱును సభకు హాజరైరి. నేల ఈనినదా యనిపించునంత బ్రహ్మాండమైన జనసందోహము చట కొద్దిసేపటికే చేరిపోయెను. ఆ మహాసభలో సభికులందరిని ఉద్దేశించి ఆ జగజెట్టి ఈ ప్రకారముగ ఉద్ఘోషించెను —

ఓ గ్రామస్తులారా! మహానుభావులారా! మీకందరికిని ఈరోజు కొన్ని అపూర్వమైన, ఆశ్చర్యకరమైన విషయములు చెప్పదలంచినాను. మీ గ్రామస్తులపై నాకుదయించిన అకుంఠిత స్నేహభావమే నన్నిచటికి రప్పించి ఇకార్యమునకు నన్ను పురికొల్పినది. మీకొక చక్కని వార్తను ఇపుడు బహిర్గతి మొనర్చుటకు నిశ్చయించితిని. మీలో ఇంకను ఇచటికి రానివారెవరైన నున్నచో తక్షణమే వారికొఱకై కబురంపుడు మీ జీవితములో కనివిని యెఱుగని అద్భుతవార్త ఇపుడు చెప్పబోవుచున్నాను — మల్లుని ఈ వాక్యములను వినగనే సభాసదులలో తీవ్రమైన సంచలనము, ఉత్సుకత జనించెను.

అతడేమి చెప్పునోయని వారు ఒడలంతయు చెవులు చేసికొని వినుటకు సిద్ధముగ నుండిరి. రానివారందఱినికూడ కబురంపి వెంటనే రప్పించిరి. ఇసుకవేసిన రాలనట్టి అపార జనసంఖ్యతో ఆ సభ కిటకిటలాడుచుండెను.

అపుడాఘల్లుడు సర్వాంగసుందరముగ అలంకరింపబడిన వేదికపై నెక్కి బల్లగుద్ది ఈప్రకారముగ చెప్పదొడంగెను— "ఓ గ్రామస్థులారా! అలనాడు త్రేతాయుగమున ఒకమహానుభావుడు అరచేతిలో కొండనుమోసి ప్రపంచమునంతను సంభ్రమాశ్చర్యములతో నింపివైచెను. లోకోత్తరబలవంతున్న డగు ఆ ఆంజనేయుని నేటికిని జనులు భక్తిభావముతో పూజించుచున్నారు. ఈ ప్రకారముగ ఆంజనేయుడు త్రేతా యుగముననే ఎనలేని కీర్తిని తెచ్చినవాడాయెను. ఆ తరువాత ద్వాపరయుగమున మఱియొక మహానుభావుడు చిటికెన వ్రేలుపై కొండనుమోసి జనులకు ఇంకను ఆశ్చర్యమును కలుగజేసెను. గోవర్ధనధారియగు ఆ కృష్ణమూర్తిని నేటికిని జనులు శ్రద్ధాభక్తులతో సంస్మరించుచున్నారు. ఈ ప్రకారముగ దాదాపు ప్రతియుగమందును ఒక్కొక్కమహానుభావుడు కొండను మోయుచుండగా, ఈ కలియుగమున ఇంతవఱకు ఒక్కడైనను అట్టి పనికి పూనుకొనకయుండుట కేవలము హాస్యాస్పదముగ నాకు తోచుచున్నది. కలియుగముననే అప్రతిష్ఠ యేర్పడినదా యనిపించుచున్నది.

ఈ విషయమును గత సంవత్సరకాలమునుండి నేను తీవ్రముగ యోచింపదొడగితిని. 'కలియుగములో కొండను మోయువారు కరువైపోయిరా ? ఒక్కరైనను ఆ పనికి పూనుకొనలేదే! ఒక్కరైనను యుగఖ్యాతిని ఆర్జించుకొనలేదే! ఏమి ఈ విపరీతము ? ఈ యుగమందు బలవంతులు లేరా ? దృఢకాయులు లేరా ? పట్టుదలతో సాధింపదలంచువారికి కొండమోయుట ఒక లెక్కలోనిదా ? ఏమి ఈ అన్యాయము' అని రాత్రింబగళ్లు నేను తీవ్రముగ ఆలోచించి తుట్టతుదకు ఒకానొక నిశ్చయమునకు వచ్చితిని. భగవంతుడు నాకు అమితమైన బలమునిచ్చియున్నాడు. ధైర్యమనునది ఉగ్గుపాలతోనే నాలో ఏర్పడియున్నది. కావున నే నెందులకు ఈ కొండను మోయుపనికై పూనుకొనకూడదు ? అని యోచించి అందులకై నేను బద్ధకంకణుడనైతిని.

ఓ గ్రామస్తులారా! మీ గ్రామమునకు చెంతనేయున్న కొండను మోయుటకు నేనిపుడు కృతనిశ్చయుడనైతిని. ఈనా నిశ్చయమునకు తిరుగులేదు. నేనీకొండను మోయుటవలన మీకే కాదు, మీ గ్రామమునకే మిక్కుటమగు ఖ్యాతి లభించగలదు. మీ గ్రామముయొక్క పేరు చరిత్రలో సువర్ణాక్షరములతో లిఖింపబడు సమయము ఆసన్నమగుచున్నది. అయితే నేనీ ఘనకార్యమును సాధించినందులకు మీరు నాకేమియు ద్రవ్యము ఈయనవసరములేదు. కానుకలీయ

వక్కారలేదు. నేను పురస్కారములు వాంఛించువాడనుకాను. అయితే కొండమోయుటకు ఇప్పుడు నాకున్న ఈ బలము చాలదు. దానిని ద్విగుణీకృతము చేసికొనవలయును. అందుచే నేను కోరునది యేమనగా— ఆఱుమాసములుం చక్కటి బలవర్ధకమైన ఆహారము, మీరు నాకిప్పించిన చాలును. తదుపరి ఆ కొండను అవలీలగ మోసివేయగలను. విటమిన్లతో గూడిన బలిష్టఆహారమును ఆఱునెలలు నాకిప్పించుడు. ఆరునెలలు మీ గ్రామములోనే ఉండి, మీరిచ్చు ఆ బలవర్థకమైన ఆహారమును స్వీకరించుచు, తదుపరి ఒక సుముహూర్తమున కొండనుఅమాంతముగ మోసివేయుదును. నా యీ మాటలను విశ్వసింపుడు. తద్ద్వారా మీ కీర్తిని చిరస్థాయిగ చేసికొనుడు."

మల్లుని యీ హేతుపూర్వకములైన వచనములను విని గ్రామస్థులందరు ఏకగ్రీవముగ అందుల కంగీకరించిరి. వెంటనే ఒక కమిటీ ఏర్పడెను. దానికి 'పర్వతోద్ధరణ మహాక్రతు సహాయకసంఘము' అని పేరు పెట్టబడెను తదుపరి ఆ సంఘము తరఫున చందాలు వసూలుచేయబడెను. ఆ ద్రవ్యముతో వారు మల్లునకు ఆఱునెలలు రాజభోజనము ఏర్పాటుచేసిరి. ఆఱునెలలు పూర్తి అయినతదువాత కొండ మోయుటకై ఒక సుముహూర్తము నిర్ణయింపబడెను. దేశ దేశములకు ఆ వర్తమానము పంపబడెను. కరపత్రములు

గ్రామగ్రామమునందును పంచిపెట్టబడెను. అది కలియుగము
నకే కీర్తిని తెచ్చిపెట్టు ఘనకార్యము కాబట్టి జనులు నిర్ణీత
సమయమునకు సుదూరప్రాంతమునుండియు తండోపతండము
లుగ ఆ సమీపమునకు వచ్చి చేరిరి. కొండనుమోయు ఆ
అపూర్వ దృశ్యమును ఎప్పుడు చూతుమా యని జనులు
ఉవ్విళ్లూరుచుండిరి.

సరిగా ముహూర్తసమయము ఏతెంచెను. మల్లుడు
ఒక పురోహితునిచే కొండకు పూజచేయించెను. పూజ
అంతయు పరిసమాప్తి అయినతరువాత పురోహితుడు 'అయం
ముహూర్త స్సుముహూర్తమస్తు' అని చెప్పి మల్లుడుగారితో
అయ్యా! ఇక మీరు కొండనుమోయుటకు సిద్ధపడవచ్చును.
ముహూర్త మింకను ఒక నిముషముమాత్రమే యున్నది
అనెను. అచట చేరియున్న లక్షలాది జనమంతయు ఏక్షణమున
ఏమి జరుగునోయని ప్రాణములను బిగపట్టుకొని గ్రుడ్లప్పగించి
చూచుచుండిరి. ఒక నిముషము దాటినది. ఐదు నిముష
ములు దాటినది. అరగంట దాటినది. కాని మల్లుడు కొండ
విషయమై ఏమియు పట్టించుకొనలేదు. అత్తతి గ్రామపెద్దలకు
మల్లునకు ఈ క్రింది విధముగ సంభాషణ జరిగెను.

గ్రామపెద్దలు — ఏమండీ మల్లుడుగారూ! ముహూర్త సమ
యముదాటి అరగంటైనది. ఇంకనూ కొండనుమోయ
లేదేమి? చెప్పినమాట తప్పవచ్చునా?

మల్లుడు—గ్రామస్తులారా! నేను అసత్యములు పలుకువాడను కాను. అన్నమాటను నెరవేర్చుకొనటలో నాతను వాతనే తక్కిన వారందఱును. నేను కొండను తప్పక మోసితీరుతాను.

గ్రా—మఱి మోయ లేదే ?

మ.—తప్పక మోస్తాను.

గ్రా—మఱి మోయండి.

మ:—ఎత్తిపెట్టండి నానెత్తిన. తప్పక మోస్తాను. నేను మొదటినుండీ మోస్తాననే చెప్తున్నానుగాని ఎత్తుతా ననికాదు. జ్ఞాపకమున్నదా ?

ఆ మాటలు వినగనే గ్రామస్తులందఱు హతాశులై పోయిరి. ఆఱునెలలు అతనిని ఎందుకు మేపితిమా యని వారు దిగులుపడజొచ్చిరి. వెంటనే అచట చేరినవారందరు ఒకరి మొగము ఒకరు చూచుకొని ఏమియుచేయునదిలేక వారివారి యిండ్లకు వెడలిపోయిరి.

దీనిపేరే వాచాజ్ఞానం. నోటితో చెప్పటేకాని క్రియ శూన్యం. ఆధ్యాత్మక్షేత్రమైన అనుష్ఠానమునకే ఎక్కువ ప్రాధాన్యం కలదు కాని వాచాజ్ఞానమునకు కాదు. వాచా వేదాంతము ఏ కాలమందును లక్ష్యమును పొందజాలదు.

ఒక్కొక్క సత్యమును నిత్యజీవితములో అనుష్ఠానమందుంచుకొని దానిని సాధించినప్పుడే ఫలితములు గోచరించగలవు కాని, కథలోని మల్లునివలె నోటితో మాత్రము ప్రగల్భములు పలుకుచు క్రియయందు మొండిచెయ్యి చూపుటచేగాదు. ముందుగా శాస్త్రములు చక్కగ అధ్యయనముచేసి, గురుముఖతః బాగుగ శ్రవణముచేసి ఆ పిదప, తానెఱిగిన యా సత్యమును క్రియానిత్వము చేయవలెను, అనుష్ఠించవలెను. కేవలము వాచావేదాంతము మనలను ముక్తిధామమున కెన్నటికిని చేర్చలేదు. అనుష్ఠానముకూడ తోడించినపుడే అది లెస్సగ రాణించును.

**నీతి :-** ద్వైతానుభూతి ఆచరణాత్మకమైనది. కావున వట్టి మాటలతో సంతృప్తిపొందక, సాధనకు గడంగి మనస్సును, ఇంద్రియములను జయించి ఆత్మ సాక్షాత్కారమును బడయవలయును.



# ఆహారశుద్ధి

భీష్మాచార్యులు అంపశయ్యపై పరుండి ధర్మరాజాదులకు చక్కని హితబోధలు గావించుచుండెను. ఉత్తరాయణ పుణ్యకాలమందు దేహవియోగము గావింపనెంచిన ఆ మహనీయుడు అంతకాలమువరకు ఊరకయుండుట యెందుకని భావించి ఆ ఒకింత సమయమును ధర్మబోధకే వినియోగింప నిశ్చయించెను. పంచపాండవులు, ద్రౌపది ఇంకను పెక్కురు భక్తవరేణ్యులు, జిజ్ఞాసువులు, ముముక్షువులు అచట చేరి ఏకాగ్రచిత్తులై, శ్రద్ధాభక్తియుతులై ఒడలంతయు చెవులు చేసికొని ఆ భవ్యోపదేశముల నాలకించుచుండిరి అప్పటి అచట వాతావరణమంతయు బహుప్రశాంతముగ, గంభీరముగ ఆధ్యాత్మిక గ్రంథమయముగ నుండెను. భీష్మాచార్యులు తదేకనిష్ఠతో అనేక ఆఖ్యానములను, ఉపమానములను చెప్పుచు, నిగూఢములైన పరమార్థతత్త్వములను సుబోధక మొనర్చుచుండెను.

ఇట్లుండ ద్రౌపదీదేవి ఏకారణముననో ఆ బోధ మధ్యమందు ఫక్కున నవ్వెను. కారణ మెవరికిని బోధపడలేదు. అందఱును ఆశ్చర్యచకితులైరి. భీష్ముడున్ను తనబోధను అకస్మాత్తుగ నిలిపివైచి ద్రౌపదీదేవిని తాను నవ్విన కారణ

మును తెలుపమని కోరెను. అపుడు ద్రౌపది యిట్లు పలికెను—మహాత్మా! సద్గురువరేణ్యా! తాము అఖండమైన బోధామృతమును మా కందఱికిని ప్రసాదించుచున్నారు. మా జన్మలు పావనమైనవి. కానీ ఆనాడు కౌరవసభలో దుశ్శాసనుడు నన్ను తీవ్రముగ అవమానపఱచుచుండ తాము అచటనే యుండియుకూడ ఒక్క ధర్మోపదేశమైనను చేయ లేదేమి? ఆ రాక్షసకృత్యమునుండి అతనిని నివారించలేదేమి? తాము ఇపుడు చక్కటి ధర్మోపదేశములు చేయుచుండుటయు, ప్రమాదభరితమగు ఆ సమయమున మాత్రము మౌనము దాల్చుటయు తలంపునకు రాగానే నాకు నవ్వు వచ్చినది. మహాత్మా! తా మప్పు డేల ధర్మోపదేశముచేసి ఆ దుష్ట కార్యమునుండి దుశ్శాసనుని నివారింపకపోతిరి? సెలవీయ ప్రార్థన

ద్రౌపదియొక్క యీ హేతుపూర్వకవచనములను విని భీష్ము డీ విధముగ ప్రత్యుత్తరమిచ్చెను—అమ్మా! నీవడిగిన ప్రశ్న చాల యుక్తియుక్తముగ నున్నది. దుర్యోధనుని పాపపు కూడు తినుటచే నా రక్తమపుడు మలినమై పోవుటవలన నకా లమునకు ధర్మము స్ఫురింపకుండెను. ఇప్పుడు అర్జునుని బాణ పరంపరచే నా యీ మలిన రక్తమంతయు చిమ్మివేయబడగా శుద్ధరక్తము మిగిలినందుననే ధర్మము చక్కగ గోచరించు

చున్నది. ఆ ధర్మములనే మీా కందఱికిని ఇపుడు బోధించు చున్నాను.

అర్థగాంభీర్యయుక్తములగు భీష్మాచార్యుని యా వాక్యములను విని అచట చేరినవా రందఱును పరమానందపడిరి. ఆధ్యాత్మిక అనుభవములందు ఆహారశుద్ధి ఎంతటి ప్రముఖస్థానమాక్రమించి యున్నదో తెలిసికొని వారందరును సంతృప్తిని బడసిరి.

ఆహార విషయమునందు మాముక్షువులు నాలుగువిధములైన జాగ్రత్తలను గైకొనవలయును. తాము గైకొనునది (1) సాత్త్వికాహారమై, (2) మితాహారమై (3) నైవార్పితాహారమై (4) న్యాయార్జితాహారమై యుండులాగున చూడవలెను. అన్యాయముగ ఆర్జించిన ధనముతోగాని, అధర్మమార్గమున సేకరించిన విత్తముతోగాని ఏర్పడిన ఆహారమును భుజించువానియొక్క మనస్సున్ను మలినత్వమును బొందును. కావున అట్టివానికి ధ్యానము చక్కగా జరుగకుండుటయేగాక, ధర్మము ఏమాత్రము స్ఫురింపకయే యుండును. కావున ముముక్షువులగువారు పైన తెలిపిన నాలుగు విధముల తమ ఆహారము శుద్ధముగా నుండునట్లు ప్రయత్నించవలెను.

తస్మాదన్నమయం మనః.

ఆ బోధ వారి హృదయములందు ప్రవేశించు నిమిత్తమా దేశికోత్తముడు ఎన్నియో ఉపమానములను, దృష్టాంతములను గైకొని చక్కగ బోధసల్పుచుండెను. దివ్యమైన యా బోధ నాలకించుచు అంతేవాసులు ఆనందడోలికలలో నూగుచుండిరి వారి సంతోషమునకు మేరలేదు. అనుభవజ్ఞుడగు ఆచార్యుడు లభించెనుగదాయనివారు తమ అదృష్టమును కొనియాడు చుండిరి.

ఇట్లుండ కొంతకాలమునకు గురుదేవుడు తాను తన శిష్యులకు గావించిన పరమార్థబోధ వారికి సరిగా జీర్ణమైనదో లేదో తెలిసికొనుటకై ఒకపరీక్ష గావింపనెంచెను. ఒకదినమున యతిడు తన పదిమంది శిష్యులను పిలిచి ఒక్కొక్కరికి ఒక్కొక్క అరటిపండునిచ్చి వారితో నిట్లనెను—ఓ అంతే వాసులారా! నెలదినములనుండి మీకొక గంభీరమగు పర మార్థసత్యమునుగూర్చి వివరించి చెప్పుచున్నాను. ఆ తత్త్వము మీకందరికిని అవగతమైనదో లేదో నేను తెలిసికొనదలంచి నాను. ఆధ్యాత్మవిద్యను అనుభవముతో మేళవించినపుడే శోభించును. వాచా వేదాంతమునకు విలువలేదు. ఏ సత్యమైనను అనుభూతమొనర్చుకొనినపుడే పూర్ణఫలితమొసంగ గల్గును. కావున నెలదినములనుండి మీకు బోధించుచున్న 'భగవంతుని సర్వవ్యాపకత్వ' సిద్ధాంతము మీకు హృదయస్థ మైనదో, లేదో పరీక్షింపదలంచినాను. ఇదిగో, ఇపుడు మీ

కందఱికిని ఒక్కొక్క అరటిపండు ఇవ్వబడినదికదా! దానిని మీరు తీసికొనిపోయి ఎవరును చూడకుండ తిని మఱల నా యొద్దకు రావలసినది.'

ఆచార్యుని యీ వాక్యములను విని శ్రద్ధాళువులైన ఆ శిష్యులందఱును గుర్వాజ్ఞను శిరసావహించుటకై ఒక్కొక్కరు ఒక్కొక్క దిక్కునకు చనిరి. మొదటివాడు ఒకానొక గృహములో ప్రవేశించి అందొక ఏకాంతప్రదేశముననున్న గదిలో దూరి తలుపు గడియవైచి, కిటికీలు బంధించి రెండవ ప్రాణి ఎవరును చూడకుండ గురుదేవుడిచ్చిన అరటిపండును తినివైచెను. ఇక రెండవవాడు సుదూరప్రాంతమునగల ఒక పాడుబడినసత్రములో జొరబడి అందొక గదిలో తలుపు వైచి నేలమీద చీమలుండుటజూచి, అవికూడ ప్రాణులేకాబట్టి అవి చూచినచో గుర్వాజ్ఞను మీరినట్లగునని భావించి తడి గుడ్డతో వాటినన్నింటిని అద్ది బయట పారవైచి లోన ఏ ప్రాణియు చూడకుండ అరటిపండును అమాంతముగ ఆరగించివైచెను.

ఇక మూడవవాడు భూమిపై ఎవరో ఒకరు చూచుచునే యుందురని నిశ్చయించి, నీళ్ళలోమునిగి, అందుగల చేపలను దూరముగ నెట్టివేసి అరటిపండును తినివైచెను. ఈ ప్రకారముగ ఒక్కొక్కరు ఒక్కొక్క చోటను ఎవరు

చూడకుండ ఆ అరటిపండును భక్షించివైచి గుర్వాజ్ఞను చక్కగ పాలించి సాయంసమయమునకు అందఱును గురువు చెంతకు వచ్చిచేరిరి. కాని విచిత్రమేమనగా, ఆ పదిమంది లోను తొమ్మిదిమంది గురువిచ్చిన అరటిపండును తినివేసి రాగా, పదియవవాడు మాత్రము దానినితినకుండ తిరిగి గురువు యొద్దకు దానిని తీసికొనివచ్చెను. వారందఱును చేరినపిదప గురువు ఒక్కొక్కరిని వారెక్కడెక్కడ ఏయే విధముగ పండును భక్షించినది వివరముగ తెలుపమని చెప్పగా అంతే వారు లొక్కొక్కరు తాము ఏ ప్రకారము రెండవప్రాణి చూడకుండ ఫలమును భుజించినది వివరించి చెప్పిరి. కాని చివరివాడు "మహాత్మా! గురుదేవా! తాము నెలదినముల నుండి భగవంతుడు సర్వవ్యాపి అనియు, చరాచరజగత్తునం దంతటను బాహ్యాభ్యంతరములందును అణువణువునందును ఆ పరాత్పరుడు వ్యాపించియున్నాడనియు, అతడు లేనిచోటే లేదనియు బోధించియున్నారుగదా! మఱి అట్టి భగవంతుడు నా ప్రక్కనేఉండి చూచుచుండ నేనెట్లు అరటిపండును తినగలను? అందుచే దానిని తినకుండ తిరిగి తీసికొనివచ్చితిని" అని వినయముతో బలికెను.

ఆ వాక్యముల నాలకించి గురుదేవుడు పరమానందపడి తక్కిన శిష్యులతో "ఓయీ! ఈతడొక్కడే నేను బోధించినదానిని చక్కగ జీర్ణమొనర్చుకొనినాడు. మీరంద

రును నాబోధను పైపైన తెలిసికొనిరేకాని అనుభవపూర్వకముగ తెలిసికొనలేదు. భగవంతుడు అణువణువునందును వ్యాపించియుండ, సర్వసాక్షియై జీవుల సమస్తవ్యవహారమును పరికించుచుండ, నా ప్రక్కన ఎవరునులేర'ని భావించి మీరెట్లు ఫలమును భుజించగలరు? కావున మీరందరిలోకి నేను చెప్పినబోధను చక్కగా గ్రహించినవాడు ఇతడొకడే. ఇక మీదటనైనను మీరందరు జాగ్రత్తవహించి నేను చెప్పు దానిని సరిగా, ఆచరణలో నుంచుకొని, అనుష్ఠించి ధన్యులు కండు'' అని బోధించెను. శిష్యులందరు అట్లే అని వచించి తమతమ జీవితములను గురుబోధచే సంస్కరించుకొని కృతార్థులైరి.

కావున భగవానుడు సర్వసాక్షియై బాహ్యమునకేగాక అంతరంగమున జీవుల సంకల్పములనుగూడ బహుజాగ్రత పరిశీలించుచుండునని నిశ్చయించి ఏపాపమును చేయక, భగవద్భక్తి, జీవకారుణ్యము, సర్వభూతదయ కలిగి పవిత్ర జీవితమును గడపి భగవత్కృపకు పాత్రులగుదురు గాక!

**నీతి .-** భగవానుడు ఆకాశముకంటెను మహా సూక్ష్మమైనవారు. వారు చిదాకాశ స్వరూపులు. వారు సర్వత్ర వెలయుచున్నారని తెలిసికొని పాప కార్యములను చేయక దైవసాక్షాత్కారము కొఱకై యత్నించవలయును.

# నిరంతర దైవచింతన

జైనశాస్త్రములో ఒక చక్కని గాథ కలదు. పూర్వము శ్రీరామచంద్రుడు రావణసంహారానంతరము పట్టాభిషేకము పూర్తి అయినపిదప ఆనందముగ రాజ్యమును పరిపాలించు చుండెను. యుద్ధమున శ్రీరామునకు సాయమొనర్చిన పలువురు ఆ సమయమున శ్రీరామచంద్రుని సమీపించి 'మహాత్మా! యుద్ధకాలమున మేము తమకు అనేకవిధముల తోడ్పడి తమసేవలో పాలుపంచుకొంటిమి. మహత్తర పుణ్యమును తద్ద్వారా మేము సముపార్జించుకొనగలిగితిమి. అయితే శాంతికాలమునకూడ తమ సేవాభాగ్యమును బడసి ధన్యులము కాగోరుచున్నాము. కావున అట్టి అవకాశమును మాకు దయచేయ ప్రార్థన. తమకున్న పనులలో కొన్నిటి నైన మాకు అప్పగించుడు. మేము వానిని చక్కగ నిర్వ హించి పుణ్యభాగ్యులము కాగలము.

ప్రజల ఆ వాక్యములను వినగనే రామచంద్రుడు కరుణాపూరిత హృదయాంతరంగుడై తక్షణమే మంత్రివర్యుని పిలిపించి 'అమాత్యశేఖరా! నాకున్న పనులన్నిటిని వరుసగా వ్రాసిపెట్టి ఈ వచ్చినవారికి ఒక్కొక్కరికి ఒక్కొక్కపని ఒసంగివేయుడు. వారు వానిని నిర్వహింప కుతూహలురై యున్నారు' అనెను. వెంటనే మంత్రి లోనికేగి, రామ

చంద్రునకు సంబంధించిన పనులన్నిటియొక్క లిస్టు తయారు చేసి బయల ఉత్సుకతతో నిరీక్షించుచున్న భక్తావళికి ఆయా పనులను అప్పగించివేసెను. రామచంద్రుని గృహమును శుభ్ర పఱచుపని ఒకరికి, వారికి ఆసనము వేయుపని ఒకరికి, వారికి విసరునట్టిపని ఒకరికి, భవనద్వారముయొద్ద ఘారాపని ఒకరికి ఈ ప్రకారముగ అందఱికి ఒక్కొక్కపని పంచివేసెను. వారు ఆయాపనులను స్వీకరించి, రామసేవాభాగ్యము లభించినదని లోలోన సంతసించుచు, తమ జన్మ ధన్యమైనదని భావించు చుండిరి.

అందఱికి పనులు పంచిపెట్టుట పూర్తికాగానే అచ్చో టికి పరుగెత్తుకొని ఒక వ్యక్తి ఏతెంచెను. అతడే ఆంజనే యుడు అతడు శ్రీరామచంద్రునకు వినమ్రతతో సాష్టాంగ వందనమాచరించి మహాత్మా! తమ సేవాకార్యములను మంత్రిగారు పంచిపెట్టుచున్నట్లు కర్ణాకర్ణిగ విని పరుగెత్తుకొని వచ్చితిని. దేవా! నాకుకూడ తమ సేవాభాగ్యము లభించు నట్లు చేయ ప్రార్థన. ఎంత చిన్నపనియైనను సరియే నా కొసంగుడు. దానినే మహద్భాగ్యముగ పరిగణించి ఆచరించు కొనుచు, తమసేవలో పాలుపంచుకొని కృతార్థుడను కాగలను. యుద్ధకాలమున తమ కెంతయో సేవచేసితిని. శాంతికాలమున కూడ అట్టి సౌభాగ్యము నాకు కలుగునట్లు అనుగ్రహింపుడు!

ఆంజనేయుని యీ ప్రార్థనపూర్వకవచనముల నాలకించి రామచంద్రుడు 'ఆంజనేయా! ఏమి ఇంత ఆలస్యముగ వచ్చితివి? అన్ని పనులు ఇపుడే వాడు వాడు పంచుకొని వెళ్లిరి. బహుశః అన్నియూ పూర్తి అయియుండును. అయినను మంత్రివర్యునితో సంప్రదించి చూచెదను" అని చెప్పి అమాత్యునకు తోడనే కబురంపెను. మంత్రివరు డేతెంచగనే శ్రీరాము డాతనితో — "మంత్రివర్యా! ఆంజనేయుడు రణరంగమున పెక్కువిధముల మనకు తోడ్పడినాడు. ఇప్పుడు శాంతికాలమునకూడ అట్టి తోడ్పాటు కావించుటకు సిద్ధపడుచున్నాడు. మత్సంబంధమైన పనులన్నిటిని ఇప్పుడే మీరు అందరికి పంచివేసియున్నారు. అయినను ఆంజనేయుడు అతి ముఖ్యుడు కాబట్టి ఏదైన ఒకపని వానికి తప్పచెప్పుట ధర్మము. కావున, ఏపనినైన మిగిలియున్నదేమో పరికింప గోరెదను. రామచంద్రుని ఆ వాక్యములను వినగనే అమాత్యుడు తన నామే పనులలిస్టును ఏకాగ్రచిత్తముతో పరిశీలించి రామునితో ఇట్లనియె — దేవా, పనులన్నియూ పూర్తి అయిపోయినవి కాని ఒక్క చిన్నపని మాత్రము మిగిలియున్నది. లోకములో ఎవరైన ఆవలించినచో ప్రక్కనున్నవారు చిటికె వేయుట ఆచారముగనున్నది. కాబట్టి రామచంద్రా! మీరెప్పుడైన ఆవలించినచో ఆంజనేయుడు చిటికె వేసినచో సరిపోవును. ఈ ఒక్కపనితప్ప ఇక ఏమియు మిగిలియుండలేదు." మహా

ప్రభూ!—మంత్రివాక్యములను విని రామచంద్రుడు ఆంజనే
యునితో—వాయుపుత్రా! మంత్రి చెప్పిన ఈ చిన్నపని
తీసికొనుటకు నీకు ఇష్టమేనా? అని అడుగగా ఆంజనేయుడు
మహాత్మా! పనులలో చిన్నదా పెద్దదా అను విచక్షణ నాకు
లేదు. నాకు కావలసినది రామసేవ. అది చిన్నదికాని,
పెద్దదికాని అదియే నాకు పదివేలు. తమ సేవ దొరికినది.
అదియే నాకు చాలు, ఈ చిన్నపని దొరికినందులకు నా
అదృష్టమును నేను కొనియాడుచున్నాను. మహాత్మా!
సెలవు! అని వచించి ఆంజనేయుడు ఆనందముతో చిందులు
త్రొక్కుచు అచ్చోటువీడి చనెను.

ఇక శ్రీరామచంద్రుడు, ఆంజనేయునిపై గల వాత్స
ల్యాతిశయముచే తన మనంబున ఈ ప్రకారము చింతన చేసి
కొనెను — "నేను ఆవలించినచో ఆంజనేయుడు చిటికె వేయును
గదా! ఆంజనేయుడు [illegible]భక్తుడు, కావున ఆంజనేయుడు
ఎప్పుడైన చిటికె వేసినచో నేనున్ను ఆవలించెదను." ఈ నిశ్చ
యము రామచంద్రునకు తప్ప మరెవ్వరికిని తెలియనే తెలి
యదు. ఇక ఆంజనేయుడు రామునివీడి దూరముగ చని
ఒకానొక విజనప్రదేశమున ఒక చెట్టుక్రింద కూర్చొని—
"రామచంద్రుడు ఆవలించినచో నేను చిటికె వేయవలెనను
కార్యము [duty] నా కొసంగబడినదికదా! ఆ కార్యమును
నేను పగలూ రాత్రియు పొరపాటు జరగకుండ ఆచరించవలసి

యున్నది. తన విధ్యుక్తధర్మమును తాను చక్కగ ఆచరించు వాడే లోకములో ధన్యుడుగ పరిగణింపబడును. రామసేవా కార్యములో ఏమాత్రము లోటు నావలన జరుగకూడదు. రామచంద్రుడు ఆవలించినపుడు నేను చిటికె వేయవలెను గదా! మఱి రామచంద్రుడు ఎపుడు ఆవలించునో నాకేమి తెలియును? భుజించునపుడుగాని, నిద్రపోవునపుడుగాని, బాహ్యాళికి వెళ్లునపుడుగాని ఎప్పుడైనను ఆవలించవచ్చునుగదా! మఱి ఆవిషయము నాకెట్లు తెలియగలదు? కాబట్టి నేనొక ఉపాయమును అవలంబించెదను. దానిచే నాకొసంగబడిన రామసేవా కార్యము నిర్దుష్టముగ జరిగిపోగలదు. అది యేదనగా— ఇది మొదలుకొని నిరంతరము రాత్రింబగళ్లు విరామము లేకుండ చిటికె వాయించుచునే ఉందును. ఈలోగా రామచంద్రుడు ఎపుడైనను ఆవలించునుగాక! నాకేమియు భయము లేదు'—అని నిశ్చయించి హనుమంతుడు సుదూర వృక్షచ్ఛాయయం దాసీనుడై నిరంతరము నిర్విరామముగా చిటికె వాయించుచు నుండెను.

అచట రాజభవనములో శ్రీరామచంద్రుడు తాను గావించుకొనిన నిశ్చయము ప్రకారము—అనగా ఆంజనేయుడు చిటికె వాయించినచో తాను ఆవలించెదనను నియమము ప్రకారము, నిరంతరము ఆవలించుచు నోరు తెరచుకొనియే యుండెను. ఆంజనేయుడు చిటికె ఆపినచో రాముని నోరు

మూతపడును. కాని ఆంజనేయుడు సందుపోకుండ చిటికె వాయించుచునేయుండెను. రామచంద్రుడు సదా నోరు తెరచుకొనియుండుటజూచి మంత్రులకు జనులకు ఏమియు తోచక అదియేదియో వ్యాధియని తలంచి గొప్పగొప్ప వైద్యులను రప్పించిరి. వారు పరీక్షించి రాముని ఆరోగ్యములో ఏకొరతలేదనియు కాని నోరు ఎందులకు తెరచుకొని నారో తెలియకున్నదనియు చెప్పిరి. ఇక కర్తవ్యము తోచక మంత్రులు, పౌరులు, అందఱును గురువగు వశిష్ఠమహర్షి యొద్దకుపోయి రామచంద్రుడు సదా నోరు తెరచుకొనియున్నాడని వచింప, సర్వజ్ఞుడగు ఆ మహనీయుడు దానికి కారణము ఆంజనేయుడు యనియు, ఆంజనేయుడు చిటికె వాయించుట ఆపినచో రాముడు తననోరుమూయుననియు చెప్పెను. తోడనే అందఱు కలిసిపోయి చెట్టుక్రింద ఊపిరి తిరుగకుండ చిటికె వాయించుచు కూర్చొనియున్న ఆంజనేయునితో—'మహాత్మా! చిటికెవేయుట ఆపుడు! దానివలన గొప్ప ప్రమాద మేర్పడినది' అని వచింప వెంటనే హనుమంతుడు—నేను ఆపను ఇది నాకొసంగబడిన సేవాకార్యము, ఇది రామసేవ. నాధర్మమును, నాకర్తవ్యమును, నేను నిర్దుష్టముగ చేయవలసియున్నాను' అని ప్రత్యుత్తరమిచ్చెను. అపుడందఱును ఆలోచించి ఆంజనేయునకు రామచంద్రుని మరియొక సేవా

కార్యమును అప్పగించి, చిటికె వేయుపనిని వేతాళునికి మార్పించిరి. తోడనే రామచంద్రుడు యథాస్థితికి వచ్చెను.

కథలో ఆంజనేయుడు ఏక్షణము రాముడు అవళించునో తెలియక నిరంతరము చిటికెవేయుటకు నిశ్చయించుకొనెనో అట్లే ఏక్షణమున మృత్యువాసన్నమగునో మానవునకు తెలియనందున అతడు నిరంతరము దైవచింతన, ధ్యానము, ఆత్మవిచారణ సలుపుచుండినచో, ఇక మృత్యువు ఎపుడు తటస్థించినను ఏమియు చిక్కులేదు. జీవితపరమార్థము నెరవేరినట్లేయగును. కావున ముముక్షువగువాడు నిరంతరము పరమాత్మను చింతనచేయుచు, మాయకు, అజ్ఞానమునకు ఏమాత్రము తావొసంగక యుండవలెను. అట్టివాడే ఏ ఆటంకములు వచ్చినప్పటికిని జీవితలక్ష్యమగు దైవానుభూతి పొందబడియేయుండుట వలన ఆతనికేమియు హానియుండదు.

**నీతి :— మృత్యువెపుడు సంభవించునో తెలియదు. కావున సమయమును వ్యర్థమునుచేయక నిరంతరము దైవచింతన, ఆత్మానుభూతియందు గడపుచుండవలెను. జీవితమును దైవమయమ్ముగ నొనర్చవలెను.**

# మనశ్శుద్ధిచే దైవప్రాప్తి

శ్రీ కృష్ణమూర్తి తన నిత్యజీవితవ్యవహారమందు అనేక వస్తువులను ఉపయోగించుకొనుచున్నను, ఒక వస్తువును మాత్రము నిరంతరము తనయొద్దనే ఉంచుకొనుచుండెను. అదియే మురళి; దానిని శ్రీకృష్ణుడు ఏకాలమందును వదలక అహర్నిశము తన చెంతనే పెట్టుకొనుచుండెను. కొద్దిసేపు ఆహ్లాదకరముగ, శ్రోతలు తన్మయులగునట్లు ఆ మురళిని వాయించి, తదుపరి ఆ పిల్లనగ్రోవిని తన చెవిపైననో, బొడ్డునందో అతడు దోపుకొనుచుండెను. అంతియేకాని ఆ మురళిని దూరముగ ఎన్నడును ఉంచుటలేదు.

ఈ పరిస్థితిని రుక్మిణీదేవి గమనించి ఒకప్పుడు తనలో నిట్లు వితర్కించుకొనెను — 'ఈ పిల్లనగ్రోవి నిరంతరము శ్రీకృష్ణునకు అతిసమీపముగ వర్తించుచున్నది. శ్రీకృష్ణుడు దానిని వదలుటలేదు. దానిపుణ్యమేమియో! సతతము శ్రీకృష్ణుని సాన్నిధ్యమును అనుభవించు సౌభాగ్యము లభించుట సామాన్యమా? ఎన్ని జన్మముల తపఃఫలితమో అది. నేను కూడ శ్రీకృష్ణునకు ఒకింత దూరముననే యున్నాను గాని అంత సమీపమున లేను, నాకంటె మురళి ఎంతయో సన్నిహితత్వమును అనుభవించుచున్నది. భగవంతుడు దానిని వదలుట లేదు. అహా! ఎంతటి మహా అదృష్టము! అట్టి సద్గతి

లభించుటకు ఏమిపుణ్యము చేయవలెనో? నిరంతర శ్రీకృష్ణ సాన్నిధ్యభాగ్యము కలుగుటకు ఎట్టి వ్రతముల నాచరింపవలయునో! ఏవిధమైన తపము సల్పవలయునో! మురళి ఈజన్మములో ఈ ప్రకారముగ శ్రీకృష్ణునకు అతి సన్నిహితముగ రాగల్గుటకు పూర్వజన్మపుణ్యనే కారణమై యుండును కాబట్టి ఆ పుణ్యమేదియో తెలిసికొనిన యెడల నేనుకూడ ఈజన్మలో అట్టి పుణ్యమాచరించి ఆ లోకైక ప్రభువునకు భావికాలమున ఇంతను సమీపముగ వర్తింపగల్గుదును.'

ఈ ప్రకారముగ చింతనచేసి రుక్మిణీదేవి ఆ మురళితో తద్విషయమునుగూర్చి చర్చించుటకై సమయముకొరకు వేచి యుండెను. శ్రీకృష్ణుడు ఆ మురళిని ఎప్పుడైన దూరముగ పెట్టియుంచినచో అపుడు దానితో ఏకాంతముగ మాట్లాడి అన్నియు తెలిసికొనవచ్చునని తలంచుచుండెను. రుక్మిణి యొక్క అంతర్యమును గ్రహించి శ్రీకృష్ణ డొకనాడు తాను నిదురపోవుచున్నట్లు నటించి ఆ మురళిని దూరముగ విసరి వైచెను. సమయముకొరకు నిరీక్షించుచున్న రుక్మిణి తక్షణమే దానిని తీసికొని ఒకానొక ఏకాంతస్థలమున కరిగి, దానికి ప్రాణప్రతిష్ఠచేసి మాట్లాడుశక్తిని ప్రసాదించి దానితో నిట్లు సంభాషించెను.

ఒక్కసారి చూడుము! నాలోపల ఏమియున్నదో బాగుగ
పరీక్షింపుము. తదుపరి నీకే తెలియగలదు" అని సమాధాన
మిచ్చెను. వెంటనే రుక్మిణి ఆ మురళిని పైకెత్తి లోన ఏమి
యున్నదో జాగ్రత్తగ పరీక్షించెను. కాని ఆ మురళి లోపల
ఏమియు లేదు. వట్టి ఆకాశము [Vaccum] మాత్రము గోచ
రించెను. అపుడు రుక్మిణీదేవి మురళితో—"అమ్మా! నీలోపల
చూచినాను. ఏమియు లేదు. కేవలము ఖాళీగనున్నదో"
అని పలుక అంతట మురళి "ఆ ప్రకారము నాలో ఖాళీగ
ఉండుటయే నాయొక్క విశేషము. నాలో ఏవిధమైన వస్తువును
నేను పెట్టుకొనలేదు. వస్తుజాలమునంతటిని పరిత్యజించి
నా యంతరంగమును దృశ్యరహితముగ నొనర్చుకొంటిని.
కనుకనే నేను శ్రీకృష్ణునకు సన్నిహితుడనైతిని. నావలెనే
ఎవరైనను సరియే తమ యంతఃకరణమునందలి వాసనాజాల
మును, దుస్సంస్కారములను, ప్రాపంచిక విషయసంకల్పము
లను తొలగించివైచి, మనస్సును నిర్విషయముగ గావించి
నిస్సంకల్పస్థితిని బడయునో అట్టివారు భగవంతునకు అతిసమీ
పముగ వర్తింపగల్గుదురు. మనశ్శుద్ధియే, అంతఃకరణము
యొక్క నిర్మలత్వమే దైవప్రాప్తికి హేతువు"—అని గంభీర
ముగ పలికెను.

మురళియొక్క ఆ హేతువాద సమన్వితవచనములను
విని రుక్మిణి పరమానందభరితయై తన యంతఃకరణమునుగూడ

అట్లు సునిర్మలమొనర్చుటకును, నిస్సంకల్పముగ, చిదాకాశ
మయముగ గావించుటకును కృతనిశ్చయ మయ్యెను.

భగవత్ప్రాప్తికి మనోనిర్మలత్వమే ప్రధానకారణమని
ఈ యితిహాసముద్వారా స్పష్టమగుచుండుటవలన ముముక్షు
వులు తమ చిత్తశుద్ధికై తీవ్రకృషిసల్పి ఈ జన్మమునందే
దైవసాన్నిధ్యమును అనుభవించుదురుగాక!

**నీతి :-** మనస్సును పాపరహితముగ, దుర్గుణ దుస్సంకల్పరహితముగ నొనర్చినచో, ఆత్మ
సాక్షాత్కారము తక్షణమే కలుగగలదు.

## దురలవాట్లు

ఒకానొక గ్రామములో సదాచారసంపన్నుడగు ఒక
కుటుంబము కలదు. ఆ కుటుంబయజమాని శాస్త్రోక్తమార్గ
మున నిత్యవ్యవహారము సల్పుకొనుచు ధర్మపరాయణుడై
నియమనిష్ఠుడై వర్తించుచుండెను. అతని కొక కుమారుడు
కలడు, అతడు పాఠశాలలో చిన్న చిన్న తరగతులందు
ఉత్తీర్ణుడై క్రమముగ హైస్కూలునందు పెద్ద తరగతులలో
ప్రవేశించెను. కాని దురదృష్టవశాత్తు అతనికి దుస్సాంగత్యము

పోదుకాగా, నీతి నియమములందు క్రమక్రమముగ దిగజార
జొచ్చెను. తండ్రి ఎంతయో నీతిమంతుడై యున్నప్పటికిని
నియమనిష్ఠలందు, ఆచారవిచారములందు అత్యంత జాగరూ
కుడై యున్నప్పటికిని, కుమారుడు సాంగత్యదోషమువలన
నైతికపతనమును పొందెను. పెడదారి విద్యార్థులతో చేరి,
అతడు త్రాగుడు అభ్యాసము చేయుచుండెను. తన వంశము
యొక్క పవిత్రతనుగూర్చికాని, తన కులముయొక్క గౌరవ
మునుగూర్చికాని, తన పితరులయొక్క సదాచార నిష్ఠాపరత్వ
మును గూర్చిగాని అతడు కించిత్తైన యోచింపకయే ఈ
ఘోరదురాచారమునందు ప్రవేశించెను. ప్రతిదినము పాఠ
శాల వదలగనే ఇద్దరుముగ్గురు దుశ్శీల విద్యార్థులతో కలసి అతడు మద్య
పానశాలకు పయనమై పోవుచుండెడివాడు.

ఈ పరిస్థితి తండ్రిగారికి అత్యంత హృదయవిదారకముగ
నుండెను. వంశమునకు అపకీర్తి తెచ్చుచున్న కుమారుని
యొక్క చెడునడతనుగూర్చి తలంచినప్పుడెల్ల అతని మనస్సు
ఎంతయో ఆందోళన చెందుచుండెను. త్రాగుడుతోను ఈ
దురభ్యాసమునుండి తన తనయుని తప్పించుటకై ఎన్ని ఉపా
యములవలంబించవలెనో అన్నియును అతడు అవలంబించెను.
ఎన్ని చెప్పవలెనో అన్నియు చెప్పిచూచెను. ఇతరుల ద్వారా
చెప్పించెనుకూడ. కాని ఫలితము శూన్యము. కుమారుడు
త్రాగుడు మానకపోగా, తన్నాటంకపరచుచున్న తండ్రిని

...నా దుర్భాషణము లాడజొచ్చెను. ఇట్టి సందర్భములో ఆతఁ డేమిచేయవలెనో జనకునకు తోచకుండెను. ఎందరో పెద్దలైన బంధుమిత్రాదులు వచ్చి ఏల మీ సుతుడిట్లు నీచ మార్గమున నడచుచున్నాడని ప్రశ్నించునపుడు ఆతని కించిత్ సిగ్గుపడుచుండెను.

ఈ ప్రకారముగ మానసికాందోళనచే తల్లడిల్లుచున్న ఆ తండ్రి ఒకనాడు తన కుమారుని దగ్గరకు పిలిచి ఈ ప్రకారముగ హితబోధ చేయదొడగెను—"నాయనా! మనది గొప్ప వంశము. ఇంతటి సదాచారసంపన్న వంశము ఈ చుట్టుపక్కల ఎచటను లేదు. మన తాతలు, ముత్తాతలు ఆచార విచారములందు, సత్సంప్రదాయములందు ఎంతయో గొప్పవారని పేరుపొందిరి. నీతి నియమ పరిపాలనమందు వన్నెకెక్కిన ఇట్టి మహోన్నత పవిత్రవంశమందు జన్మించిన నీవు చెడు సాంగత్యమునకు బాల్పడి త్రాగుడు అను ఘోర దురభ్యాసమునకు వశుడవైతివి. పొరపాటు గ్రహపాటుచే అలవాటుగా మారిపోయినది. నీయొక్క అజాగ్రత్తయే దీనికి కారణము. నీ యీ చెడునడత నాకు తలవంపులు తెచ్చుచున్నది. అడిగిన వారికి జవాబులు చెప్పలేక నాకు విసుగెత్తిపోవుచున్నది. ఇప్పటికైనను తెలివి తెచ్చుకొని నీ యీ దుర్వ్యసనమును మాని వైచి, వంశముయొక్క కీర్తిని నిలబెట్టుము. నా పరువును కాపాడుము!"

తండ్రియొక్క ఆ దీనాలాపమును వినగనే కుమారుని యొక్క కఠినహృదయము కరిగిపోయెను. వెంటనే అతడిట్లు ప్రత్యుత్తర మొసంగెను—తండ్రీ! మీ హేతువాదపూర్వక సద్వచనములు నా మనస్సునందు గొప్ప పరిణామమును తెచ్చినవి. నా తప్పిదమును నే నిపుడు గ్రహించినాను. దుస్సాంగత్య ప్రభావముచే, కులముయొక్క ఔన్నత్యమును మంటగలుపుకొంటినని ఎంతయో ఆవేదన పడుచున్నాను. ఇట్టి దౌర్భాగ్యదశ ఏల దాపురించినదని హృదయమందు మథన పడుచున్నాను. అయినదేమియో అయినది. ఇకమీదట ఈ దుర్వ్యసనమునకు తిలాంజలి యొసంగుటకై యోచించుచున్నాను. అయితే నాన్నగారూ! బహుకాలమునుండి అలవాటైన ఈ దురభ్యాసమును ఒక్కసారిగా నిలుపుదల చేయుట కష్టసాధ్యముకదా! ఒక నెలరోజులవరకు క్రమక్రమముగ తగ్గించుకొనుచువచ్చి, సరిగా నెల పూర్తియగుసరికి త్రాగుడుకు పరిపూర్తిగా స్వస్తిచెప్పదలంచినాను. అయితే ఈలోగా మీరొక షరతును పాలించుటకు సిద్ధపడవలెను. అది యేదనగా, ఈ నెలరోజులలో నాతో కూడ మీరున్ను ఒక లోటా కల్లు ప్రతిరోజు త్రాగుచుండవలెను. దీనికి మీ రంగీకరించినచో మాత్రమే నేను నా దురలవాటును పోగొట్టుకొందును. అట్లు కానిచో నేను నా పాతపద్ధతినే అంటిపెట్టుకొని యుందును.

కుమారుని ఆ కఠోరవాక్యములను వినగనే తండ్రి యొక్క గుండె చెదరిపోయెను. అతనికి ఏమిచేయుటకుగాని ఏమి చెప్పుటకుగాని తోచకుండెను. కుమారునకు త్రాగుడు మాన్పుటకై తండ్రి తానే త్రాగవలెనని వచ్చెనుగదా! అహా! ఏమి ఈ విధివైపరీత్యము! అని ఈ ప్రకారముగ తలంచి ఎట్టకేలకు కుమారుని క్షేమము అభిలషించినవాడై తండ్రి ఆ మరతమును అంగీకరించి కుమారునితో బాటు ఒక నెలరోజులు తానున్ను త్రాగ నుద్యమించెను. ఈ ప్రకారముగ ఒక మాసము గడువగా, అపుడు కుమారుడు దేవుని పటమువద్దకు వెళ్లి తన వాగ్దానప్రకారము తానికనుండి త్రాగుడు పూర్తిగ మానివేసితినని ఒట్టుపెట్టుకొనెను. దేవునిముందు ఆ ప్రకారముగ ప్రతిజ్ఞ చేసెను. అపుడా తండ్రి కుమారునితో — 'నాయనా! కల్లుత్రాగుట నీవు మానిన మానుదువుగాక! నేను మాత్రము మానను. ఒక నెలరోజులు త్రాగుటచే నాకీ యలవాటు దృఢపడిపోయినది. నే నిక మానలేను. అని చెప్పి అచ్చోటునుండి చనెను.

పాఠకులారా! చూచితిరా! నవ్వులాటకై ప్రారంభించిన అలవాట్లు క్రమముగ రూఢిపడి తండ్రికి వదలుటకు శక్యము కాకుండెను. కుమారుడు బాగుపడెను. కాని తండ్రి చెడిపోయెను. కుమారుడు ప్రయత్నపూర్వకముగ వ్యసనమును పోగొట్టుకొనెను. కాని తండ్రి తనకు తానే వ్యసన

౬౯]

# దేవునితో సంబంధము

ఒకానొక పట్టణమున ఒక ధనికుడుండెను. అతడు తన నివాసమునకై ఒక గొప్ప భవనమును నిర్మించుకొనెను. అది సర్వాంగసుందరముగ అలరారుచు చూపరులకు మిక్కుటమగు ఆశ్చర్యమును గొలుపుచుండెను. జనులందఱును అతని దివ్య భవనమును ప్రస్తుతించుచు అది కనివిని యెఱుఁగని గొప్ప కట్టడమని కొనియాడుచుండిరి. అయినను, ఆ ధనికుడు అంత టితో తృప్తినొందలేదు. తన స్నానగదిలో ఇదివరకు ఎవరును తమ తమ స్నానగదులలో ఏర్పాటుచేయని విధముగ నవరత్న ఖచితమైన ఒక బంగారు కొళాయి [ Pipe ] ఏర్పాటుచేయ దలంచెను. సామాన్యముగ అందఱును తమ తమ గృహము లందు స్నానపుగదులలో ఇత్తడికొళాయిలు, రాగికొళాయిలు అమర్చుకొని వానిక్రిందకూర్చొని స్నానమాచరించుచుందురు. కాని ఆ పద్ధతి ధనికున కిష్టములేకపోయెను "అందరుచేసినట్లే మనముకూడ చేసిన అందేమి విశేషము కలదు ? మనయింటికి ఒక ప్రత్యేకత ఉండవలెను. ప్రతివారును, మనయింటిని, యింటిలోని పరికరములను జూచి సంభ్రమాశ్చర్యములలో మునిగిపోవలెను. కాబట్టి మన స్నానగదిలో అందఱివలెకాక ఒక అమూల్యమైన, రత్నవైడూర్యసమ్మిళితమైన బంగారు కొళాయిని అమర్చెదను. దానిని చూచుటకే జనులు తండోప

తరములుగ రాగలను. అప్పుడు నా కీర్తి నభోమండలమును చేరుకొనగలదు.

ఈ ప్రకారము నిశ్చయించినవాడై ఆ శ్రీమంతుడు కొన్ని లక్షల రూప్యములను వెచ్చించి నవరత్న పరివేష్టితముగు ఒక చక్కని కొళాయిని చేయించి దానిని తన స్నానగదిలో అమర్చెను. దానిక్రింద కూర్చొని స్నానముచేసినచో ఎంతయో హాయిని అనుభవించవచ్చునని తలంచెను. ఆ కొళాయి నిర్మాణము పూర్తిఅయిన వెనుక దానికి ప్రారంభోత్సవచేయ సంకల్పించి అందులకు తగిన వ్యక్తి ఎవరా యని దీర్ఘముగ యోచించి తుట్టతుదకు ఒక మంత్రిగారిని ఎన్నుకొనెను. వారితో సంప్రదించి వారిని ఒప్పించి వారి కరకమలములచే ఆ బంగారుకొళాయియొక్క ప్రారంభోత్సవము గావింపనిశ్చయించెను. అందులకై జ్యోతిష్కులను విచారించి ఒక శుభముహూర్తమును నిర్ణయించెను. ఆహ్వానపత్రికలు అందరికిని పంపబడెను. ఆ పత్రికలపై శీర్షిక "బంగారు కొళాయి ప్రారంభోత్సవము" [Opening ceremony of a golden pipe] అని కొట్టొచ్చే అక్షరములతో కొట్టవచ్చినట్లు కానుపించుచుండెను. పెద్ద పెద్ద ఉద్యోగస్థులకు, అధికారులకు, బంధువర్గమువారికి, మిత్రులకు ఆహ్వానములు పంపబడెను.

లోకములో ఇంతవఱకు అనేక ప్రారంభోత్సవములు అన్నిచోట్ల జరుగుచుండెడివి. కొన్ని సంస్థల ప్రారంభోత్సవ

ములు, నూతనగృహముల ప్రారంభోత్సవములు, కర్మాగార
ముల ప్రారంభోత్సవములు—ఈ ప్రకారము గ అనేకముజరుగు
చుండెనుగాని బంగారుకోళాయి ప్రారంభోత్సవము ఇంతవరకు
ఎదటను జరిగియుండలేదు. కావున ఆ వేడుకను కన్నులార
గాంచుటకై జనులు తండోపతండములుగ ధనికుని గృహము
నకు రాజొచ్చిరి. నిర్ణీత సమయము దగ్గరకు వచ్చినది.
ధనికుని ప్రసాదము పురప్రముఖులచేతను, విద్వజ్జనులచేతను
కిటకిటలాడుచుండెను. ముహూర్తసమయము ఇంకను అర
గంట ఉన్నది. అపుడు పురోహితుడు వేదమంత్రముల
నుచ్చరించుచు ఆ బంగారుకోళాయికి పూజ నుపక్రమించెను.
ధనికుని భవనమంతయు విప్రగణముయొక్క వేదఘోషచే
ప్రతిధ్వనించుచుండెను. మహూర్తసమయము సమీపించగా
అపుడు పురోహితుడు ధనికునితో 'అయ్యా! ప్రారంభోత్స
వము ఎవరిచేత చేయించదలంచినారో, వారు కోళాయివద్దకు
రావలసినది' అని తెలుపగానే ధనికుడు అచట ఆసీనుడై
యున్న మంత్రిగారిని ఆహ్వానించి కోళాయివద్దకు తీసికొని
వచ్చెను. భజంత్రీలు జోరున మేళము వాయించుచుండిరి.
భూసురులు ఉన్నతస్వరములతో మంత్రములను ఉచ్చరించు
చుండిరి. ఆ వేదఘోషచే దిక్కులు పిక్కటిల్లుచుండెను.
సరిగా ముహూర్తము వేళకాగా పురోహితుడు 'అయం
ముహూర్త స్సుముహూర్తమస్తు' అని కోళాయిపై అక్షత

లను చల్లి మంత్రిగారితో "అయ్యా! ఇక మీరు కొళాయి త్రిప్పవచ్చును" అనిపలుకగా, మంత్రిగారు ఉల్లాసవదనముతో తన కరకమలముచే కొళాయిని త్రిప్పిరి. కాని ఒకచుక్క నీరు క్రిందపడలేదు. అందఱును ఆశ్చర్యచకితులైరి. కారణమేమి యని ప్రతివారును వితర్కింపదొడగిరి. ధనికుని గుండె త్రీవముగ కొట్టుకొనజొచ్చెను. అతని హృదయము నిర్విణ్ణమై పోయెను. కొళాయిలో నీరు రాకుండుటకు కారణమేమి యని అచట సమావేశమైన పెద్దలందఱు త్రీవముగ అన్వేషింప తుట్ట తుదకు కారణము విశదమయ్యెను. ధనికుడు బంగారుకొళాయికి అన్ని ఏర్పాట్లుచేసెనుగాని ఒక్కపొరపాటు చేసెను. నీళ్లటాంకు [Water Reservoir] తో దానికి సంబంధము (కనెక్షన్) కలుగజేయలేదు. పనుల తొందరలో ఆ విషయము మఱచిపోయెను. లక్షలకొలది రూప్యములను వెచ్చించి, రత్నములను వైడూర్యములను పొదిగించి, మేలిమి బంగారమును కరిగించి చక్కని కొళాయిని నిర్మింపజేసెనేకాని, అసలు విషయముపై శ్రద్ధ జూపలేదు. నీళ్లటాంకుతో సంబంధము పెట్టుకొనలేదు. కావున చేసినపని యంతియు వ్యర్థమైపోయెను. ఈ ప్రకారముగ ప్రారంభోత్సవము విఫలముకాగా, అచట సమావేశమైన వారందరును విచారవదనముతో వారి వారి నెలవులకు వెడలిపోయిరి.

అన్నా, లోకమునందు జనులు పెద్ద పెద్ద భవనములలో నివసించుచున్నారు. పెక్కు సంపదలతో తులతూగుచున్నారు లెక్కలేనన్ని విలాసములను అనుభవించుచున్నారు. కాని శాంతి మాత్రము వారికి కొఱవడుచున్నది. కారణమేమి? దైవముతో వారు సంబంధము పెట్టుకొనుటలేదు. శాంతికి ఆకరము దైవము. ఆనందమునకు నిలయము దైవము. ఆ దైవముతో సంబంధము కలిగియుండువాడే పరిపూర్ణ సుఖమును, శాంతిని అనుభవింపగల్గును. దైవముతో సంబంధము లేనివాడు ఎన్ని ప్రాపంచికమైన భవములున్నను శాంతి, సుఖములను నోచుకొనలేడు. సామాన్యమైన ఇత్తడి, రాగి కొళాయిలు పెట్టుకొనువారు నీళ్ల రిజర్వాయర్‌తో కనెక్షన్ ఏర్పాటుచేసికొనినప్పుడు వానినుండి గంగాప్రవాహమువలె జలజల నీళ్లు కారుచున్నవి నవరత్నఖచితసువర్ణయుక్తమైనప్పటికిని కొళాయినీళ్ల టాంకుతో సంబంధము కలిగియుండనిచో దానియందు ఒక్కచుక్కైనను నీళ్లు రానేరావు. ఇదియే పరమరహస్యము. శాంతియే నీరు. భగవంతుడే నీళ్ల రిజర్వాయర్. నవరత్నములే సంపదలు దైవవిముఖుడగు నాస్తికుడే ఇంటియజమాని.

కాబట్టి ఆనందధామమైన దైవముతో సంబంధముగలవాడు, దైవభక్తి కలిగి జపధ్యాన సంకీర్తన పారాయణాదులు సలుపువాడు, ప్రాపంచిక సంపదలు కలిగియుండకున్న

శాంతి సుఖములను సదా అనుభవింపగల్గును. అట్టి దైవభక్తి లేనివాడు, దైవముతో కించిత్తైనను సంబంధము కలిగియుండని వాడు గొప్ప రాజాధిరాజైనను, ఉన్నతాధికారియైనను, సకల ప్రాపంచిక సంపదలతో తులతూగువాడైనను, అంతరంగమున సుఖముసుగాని, శాంతినిగాని అనుభవింపలేడు. కావున సర్వులును శాశ్వతపరమాత్మతో, అక్షరదైవముతో సంబంధమును నెలకొల్పుకొని, ప్రతిదినము ఒకింతైనను జపధ్యాన విచారాదులు కావించుచు అట్టి దైవాశ్రియముచే జీవితపరమావధి యగు అనంతశాంతిని బడయుదురుగాక !

**నీతి :— దేవునితో సంబంధము కలుగజేసికొని నచో అపారమగు ఆనందమును జీవుడు అనుభవించ గలడు. లేకున్న దుఃఖమెన్నడైనను వానిని బాధించ గలదు.**



# విశ్వాసమును బట్టియే ఫలితము

పూర్వ మొకానొకపట్టణమున ఒక వైద్యుడు కలడు. అతడు తన వృత్తియందు గొప్పప్రావీణ్యముగలిగి యుండుట వలనను, తాను చేపట్టిన కేసులన్నిటిని జయప్రదముగ నెర వేర్చుచుండుటవలనను, జనులనేకులు చికిత్సార్థము అతని యొద్దకే వచ్చుచుండిరి. ప్రతిదినము అతని వైద్యాలయము రోగులచేతను, ఆరోగ్యవిషయమై సంప్రదింపులకు వచ్చువారి చేతను కిటకిటలాడుచుండును. పేరుమోగిన భిషగ్వర్యుడగుట వలన చుట్టుప్రక్కల పల్లెలనుండికూడ బండ్లుకట్టుకొని ఎందరో అతనికడకు వచ్చుచుండురు.

ఒకనాడు రాత్రి 8 గంటలకు అతడు తన కార్యక్రమ మంతయు పూర్తి చేసికొని, రోగులనందరిని పంపివేసి వైద్యా లయమునకు తాళమువేసి అరమైలు దూరముననున్న తనయింటికి ప్రయాణమైపోవ నుద్యుక్తుడై గడప దిగగనే ఒకరోగి పరుగు పరుగునవచ్చి 'మహాప్రభో ! కడుపునొప్పిగా ఉన్నది. మందు దయచేయుడు," అని ప్రార్థించెను. అప్పుడు డాక్టరుగారు "నాయనా ! ఇప్పుడే వైద్యాలయము మూసివేసినాను. మూసిన ఆసుపత్రిని మరల ఉదయము లోపల తెరచు అల వాటు నాకులేను. ఈ ప్రకారముగ గత ముప్పది సంవత్సరము లనుండియు జరుగుచున్నది. తలుపుమూసిన తరువాత ఎవరు

వచ్చినను వారిని నాయింటికి తీసికొనివెళ్లి అచట మందు ఇచ్చుచుందును. కాబట్టి మీరును నావెంట వచ్చినచో ఇంటి వద్ద తగినమందు ఇవ్వగలను. ఇపుడు మాత్రము మీరు నూఱు చెప్పినప్పటికి నేను తలుపు తెఱువనే తెఱువను. మందు ఇవ్వనే ఇవ్వను. దయచేసి ఇంటికిరండు. మీకు కావలసిన చికిత్స చేసెదను" అని పలికెను.

అపుడు వెంటనే రోగి మహాత్మా! నాబాధ గమనించి, ఇదియొక అత్యవసర పరిస్థితిగా భావించి తలుపు తీయుడు. ఇందు అనౌచిత్యమేమియు లేదు. ఎట్టి త్యాగమైనా చేసి లోక ములో మహనీయులు పరోపకారము చేయుచుందురు. కావున ఈ చిన్న సహాయము మీరు చేయుడు. తలుపు తెఱచి నన్ను విపరీతముగ బాధించుచున్న ఈ కడుపు నొప్పికి ఏదైన మందును శీఘ్రముగ దయచేయుడు' అని వచించెను.

అతని వాక్యములనువిని వైద్యనాథుడు రోగితో "అయ్యా! మీరుచెప్పినది బాగుగనేయున్నది కాని ముప్పది సంవత్సరములనుండి యిప్పటివఱకు పాలించుచున్న ఈ నియమమును ఇపుడు మీకొఱకై మార్చుటకు నాకు మనస్సు ఒప్పుట లేదు. కాబట్టి వేసిన తలుపులను ఉదయములోపల తెఱువను నావెంట వచ్చినచో మీబాధ తొలగుటకు ఇంటికడనుండి మందు తప్పక ఇవ్వగలను" అని పలికి రోగిని తన వెంట బెట్టుకొని ఇంటికి పయనమై పోవుచుండెను.

అది రాత్రిసమయము. పట్టణవీథులు విద్యుద్దీపకాంతు లచే శోభించుచుండెను. రోగి వెంటరాగా భిషగ్వర్యుడు ముందునడచుచుండెను. కాని వారియిరువురు పదిగజములు దాటిరో లేదో రోగి వైద్యునకు అడ్డుతగిలి 'డాక్టరుగారూ! నొప్పి తీవ్రముగానున్నది. ఇక తట్టుకొనలేను. త్వరలో ఏదైనా మందు ఇవ్వండి" అని ప్రార్థింపసాగెను. అపుడు వైద్యుడు రోగినిజూచి- ఇంటికి తట్టుకొనలేక తన కోటు జేబులో పదిలముగా మాత్రనొకదానితీసి రోగిచేతిలో పెట్టి నాయనా గోళిని సేవించుకొనుము దీనిని నోటిలో వేసికొని చప్పరించుము. నమలవద్దు' అని ఆదేశించెను. రోగి పరమానందముతో దానిని స్వీకరించి నోటిలో వేసికొని చప్పరించుచుడాక్టరుగారి వెంట నడుచుచుండెను. కొంతదూరమేగినపిదప డాక్టరు రోగితో నాయనా! కడుపునొప్పి ఎట్లున్నది? అని ప్రశ్నింప రోగి మహాత్మా! తమ దయవలన సగమునొప్పి తగ్గిపోయినది అని బదులు చెప్పెను. అంతట డాక్టరు రోగితో ఇక మీరు మీ యింటికి వెళ్ళవచ్చును. అని పంపివేసెను.

విద్యుత్ప్రభలచే పగలువలె తోచుచున్న ఆపట్టణ వీథుల గుండా చనుచు వైద్యునిచే ఒసంగబడిన మాత్రనువిడువకుండ చప్పరించుచురోగి తన బాధ శమించుచుండ పరమానందభరితుడై గృహాభిముఖుడగుచు పోవుచుండెను. కాని ఎంతసేపు చప్పరించినను మాత్రకరగకుండుటచే రోగి ఆశ్చర్యచకితుడై

తనలో ఇదియేమి విలక్షణమైన మాత్రో అరగంటసేపు చప్ప
రించినను కరగదే! ఉన్నది ఉన్నట్లే ఉన్నదే! కారణమేమి?
అని సంభ్రమచిత్తుడై ఒకానొక వీధిదీపముక్రింద ఆ మాత్రను
తన అరిచేతిలో ఉంచుకొనిచూచెను. రామ! రామ! అది
మాత్రకాదు. కోటుగుండీ! వైద్యుడు అతనిపోరు పడలేక తన
కోటుజేబులోఉన్న గుండీనితీసి అతనికిచ్చెను. అంతియే.

సామాన్యమైన ఒకకోటుగుండీ రోగియొక్క కడుపు
నొప్పిని నగము తగ్గించి వైచుట జరిగినది. యథార్థముగ
గుండీ అంతపని చేయగలదా? లేదు. రోగికి డాక్టరుపైగల
అకుంఠితవిశ్వాసము అంతపని చేసినది.

కావున విశ్వాసము ఎంతటిపని నయినను సాధించగలదు.
ఒక గ్రంథముపైగాని, ఒక గురువుపైగాని, ఒక వైద్యునిపై
గాని, ఒక మంత్రముపైగాని మనుజునకు ఎంతెంత విశ్వాస
ముండునో అంతంత అధికఫలమతనికి కలుగుచుండును. కావున
దైవవిశ్వాసము, గురువిశ్వాసము, మంత్రవిశ్వాసము, ఆత్మ
విశ్వాసము ముముక్షువునకు తప్పక ఉండవలెను. అపుడు
మాత్రమే అధ్యాత్మక్షేత్రమున గొప్ప గొప్ప ఫలముల నాతడు
సాధింపగల్గును. అట్టి విశ్వాసము లేనివాడు ఏక్షేత్రమునందును
పురోభివృద్ధిని బడయజాలడు. కాబట్టి సాధకుడు తాను
జపించు మంత్రముయెడల, తన కుపదేశించిన గురువుయెడల
తన్ను సృష్టించిన ఈశ్వరునియెడల, తాను పఠించు గ్రంథము

యొక్క రచయితయెడల, తనయెడల గొప్పవిశ్వాసముంచుకొని పరమార్థరంగమున ముందునకు సాగిపోవలెను.

**నీతి :— విశ్వాసము గొప్పఫలితములను కలుగ జేయును. కావున దైవవిశ్వాసము, గురువిశ్వాసము శాస్త్రవిశ్వాసము, ఆత్మవిశ్వాసము గలిగియుండి ఆధ్యాత్మిక అభ్యున్నతిని సాధించవలయును.**

# ఆ నం ద బా ష్ప ము లు

ఒకనొక గ్రామమున విద్వాంసుడును అయిన గృహస్థుడొకడు కలడు. అతనికి పూర్వజన్మ పుణ్యసంస్కారము వలన చక్కని దైవభక్తి ఏర్పడినది. లక్ష్మి, సరస్వతి—అతని యందు మేళవించి అద్భుతముగ ప్రకాశింపసాగెను. విద్వత్తు, విద్వత్తుతోబాటు సంపద, సంపదతోబాటు దైవభక్తి అతనియందు చక్కగ విరాజిల్లు చుండెను. ఇట్టి కలయిక లోకములో చాల అపురూపముకనుకనే ఆ గ్రామస్థులందరును ఆ గృహస్థునియెడల పూజ్యభావము గలిగి యుండిరి.

ప్రతిదినము ఆ గృహస్థునియింట సత్కాలక్షేపములు జరుగు చుండెను. ఆధ్యాత్మికప్రవచనములు, ప ర మా ర్థ

గోష్ఠులు అనుదినము అచ్చోట ఏర్పాటు చేయబడుచుండెను. విజ్ఞానులు, ముముక్షువులు, పరమార్థ దృష్టికలవారు, పెక్కురు ప్రతిరోజు అచ్చటికి వచ్చి ఆ సత్కాలక్షేపములందు పాల్గొని సత్సాంగత్యశ్రీని అనుభవించి జన్మపావనము కావించుకొను చుండిరి. యజమానుడగు ఆ గృహస్థునకు భాగవతముపై మిక్కుటమగు ప్రీతి కలదు. అందుచే అద్భుతవాక్పటిమ కలిగి యున్న ఒకానొక పండితునకు వేతనమిచ్చి తన గృహమందు ప్రతిదినము భాగవతకాలక్షేపము జరిపించుచుండెను. శ్రావ్యమగు కంఠము, వాక్చమత్కృతి, బోధనా నైపుణ్యము, పాండిత్యప్రకర్ష కలిగియున్న ఆ పండితునిచే గావింపబడుచున్న భాగవత ప్రవచనమును వినుటకై జనులు ఆ గృహస్థుని యింటికి తండోపతండములుగ రాజొచ్చిరి. పరిసరగ్రామముల నుండి బండ్లు కట్టుకొని అనేకులు కుటుంబసమేతముగ వచ్చి భాగవత శ్రవణము చేయుచు మహదానందము ననుభవించు చుండిరి.

ఇట్లుండ ఒకనాడు భాగవతమునందలి ప్రహ్లాదోపాఖ్యానము కాలక్షేపము జరుగుచుండ, గృహమున విశాలసదనమంతయూ భక్తవరేణ్యులచే క్రిక్కిరిసియుండ, భక్తిరసము ఉట్టిపడునట్లు పండితోత్తముడు ప్రబోధము సల్పుచుండ సభాసదులందఱు భక్తిపారవశ్యములో మునిగి, తదేకనిష్ఠులై ఆలకించుచుండిరి. వారిలో కొందఱి నేత్రములనుండి ఆనందబాష్ప

ములు రాలుచుండెను. ఆ దృశ్యమంతయుదూచి గృహస్థుడు సంతోషముతో ఉప్పొంగి పోవుచుండెను. 'ఆహా! నాగృహ మెంత పావనమైపోయినది. ఒక్క భక్తుడు దైవచింతనాతత్పరుడై నాయింటియందు క్షణకాలము వసించినచో పదితరముల వఱకు నావంశమంతయు తరించిపోగలదు. ఒక్క భక్తుడు దైవకథాప్రసంగమున ఆనందపరవశుడై, కంటివెంట ఆనంద బాష్పములు కార్చిలచో, అట్టి ఆనందాశ్రువుల సంస్పర్శచే నాగేహమంతయు పరమపవిత్రమై యలరారగలదు. ఆహా! నాజన్మము ధన్యమైనది. భగవంతుడు నాకెంతయో సిరిసంపదలను ఒసంగి యుండెను. వానిని సార్థకపఱచుటకై ఇవుడొక చక్కటి ఏర్పాటు కావించెదను, అని నిశ్చయించి యా గృహస్థుడు నాటి కాలక్షేపమంతయు పూర్తిఅయిన తరువాత అచ్చోట సమావేశమైన భక్తకోటిని ఉద్దేశించి యిట్లు విజ్ఞప్తి చేసెను—

"ఓ భాగవతశ్రవణాభిలాషులారా! ఓ పరమార్థ జిజ్ఞాసువులారా! రేపటినుండి ఎవరెవరు ఇచట కథాశ్రవణము చేయునపుడు ఆనందబాష్పములను రాల్చెదరో వారికి నా గృహమందే భోజనము ఏర్పాటుచేయుదును. భోజనార్థము వారు తమయింటికి వెళ్లవలసిన పనిలేదు." ఈ ప్రకారముగ తానుచేసిన ప్రకటనానుసారము ధనికుడు మఱుసటి దినము

నుండియు ఆనందబాష్పములు రాల్చినవారికందఱికిని తనయింటి యందే షడ్రసోపేతముగ భోజనముపెట్టి పంపుచుండెను. భక్తునకు భగవంతునకు భేదములేదని నిశ్చయించి అతడు ఆ భక్తశిఖామణులందఱిని పరిపరివిధముల మిక్కుటముగ గౌరవించుచుండెను.

ఆనందబాష్పములు రాల్చినవారి కందఱికిని ధనికుడు సంతృప్తిగ మిక్కుటముగ భోజనము పెట్టుచున్నాడనువార్త ఊరూరా వ్యాపింప ఒక సోమరిపోతు తిండికొఱకు కక్కుర్తిపడి ఆ ధనికుని గృహమునకు వచ్చి భాగవత కాలక్షేపమునందు పాల్గొనెను. తనచుట్టునున్నవారందఱు భక్తిరసార్ణవమున మునిగి ఆనందబాష్పములు కార్చుచుండుటనుచూచి ఆ సోమరి తనకున్ను అట్టిస్థితి కలిగిన బాగుండునని యోచించుచుండెను. కాని కఠినహృదయుడగుటచేతను, దైవభక్తి అవంతైనను లేనివాడగుటచేతను అతనికి ఆనందబాష్పములు కారలేదు. కళ్లు నలుపుకొని నలుపుకొని ఎంతయో ప్రయత్నించెను. కాని ఒక్క చుక్కైనను నీరు కారలేదు. రాతివంటి కఠినహృదయునకు, దయాదాక్షిణ్యములు కొఱవడినవానికి, ఒక రాగాన గుండె కరుగునా? ఆనందాశ్రువులు రాలునా? వెంటనే ఆసోమరి సభాస్థలమును వీడి దొడ్డిదారిగుండా ధనికుని వంటశాల యందు ప్రవేశించి అచటనున్న వంటమనిషిని ప్రాధేయపడి రెండుమిరియములనిప్పించుకొని వాటిని బాగుగనూరి ఆ పొడిని

కండ్లలో పెట్టుకొని సభలోవచ్చికూర్చుండ వెంటనే కళ్ళనుండి జలజల నీళ్లు కారజొచ్చెను. గంగాప్రవాహమువలె అశ్రువులు పారదొడగెను. అదిచూచి ధనికుడు తనలో 'ఆహా! ఈరోజు వచ్చిన నూతనభక్తుడు ఎట్టి ఆధ్యాత్మిక శిఖరములను అధిరోహించినవాడై యుండునో! ఏలయనగా ఇంతవరకు వచ్చిన వారు కథాసందర్భమున ఏ పది పదిహేను బొట్లో ఆనందబాష్పములను మాత్రమే రాల్చుచుండిరి. ఈతడో, చెంబుడునీళ్లు అమాంతముగ కార్చివేసినాడు. ఓహో! ఎంతటి భక్తిరసావేశము! ఎట్టి ఆధ్యాత్మికప్రగతి! ఇట్టివారి రాకచే నా గృహము పావనమైపోయినది. అని తలంచి అందరికంటె ఎక్కువగా ఆ నూతనవ్యక్తిని ఆదరించి గౌరవించెను. భుక్తికి ఉపాయమును కనిపెట్టిన ఆ సోమరి ఊరిలోనికిపోయి మరికొందరు సోమరులకు ఆ వార్త చెప్పగా వారుకూడ మరునాడు ప్రసంగమునకువచ్చి, ఆనందబాష్పములు రానందుచే, వంటవానియొద్ద కొన్ని మిరియములు తీసికొని నూరి కంటిలోపెట్టుకొని కూర్చుండిరి. ఈ ప్రకారముగ దినదినము కపటభక్తుల సంఖ్య పెరుగుచుండెను.

ఇట్లుండ నెల పూర్తికాకపూర్వమే వంటవాడు ధనికుని యొద్దకు వెళ్లి "అయ్యా! మిరియాలు అయిపోయినవి. ఇంకొక బస్తా వెంటనే తెప్పించండి, అనిచెప్పగా, ధనికుడు ఇంత త్వరగా మిరియములు అయిపోవుటకు కారణమేమని ప్రశ్నింప

పాచకుడు తడుముకొనకుండ ఇట్లు చెప్పివేసెను — "మహాప్రభో! మిరియాలు అరబస్తా కూరలలోను, పులుసులలోను చారులలోను, వాడివేసినాను. తక్కిన అరబస్తా ఆనందబాష్పములకు వాడినాను!' ఆ వాక్యములను వినుటతోడనే ధనికుడు ఆశ్చర్యచకితుడై, వంటవానిద్వారా అసలు విషయములు తెలుసుకొని, తనయింటిలో జరుగు కాలక్షేపములకు వచ్చు మోసగాండ్రనుకనిపెట్టి అప్పటినుండియు తగువిధముగ జాగ్రత్త వహింపసాగెను.

భగవంతుడు సర్వాంతర్యామి. ప్రతిప్రాణియొక్క హృదయాంతరాళమునందును సాక్షిగా వెలుగుచున్నాడు. రాత్రింబవళ్లు జనులుచేయు సమస్తకార్యకలాపములను వీక్షించుచున్నాడు. కాబట్టి కపటము పనికిరాదు. మోస కృత్యములకు తావీయరాదు. "భజతాం ప్రీతిపూర్వకమ్" అని గీతాచార్యుడు సెలవిచ్చినట్లు ఆ జగదేక ప్రభువును ప్రీతిపూర్వకముగ, హృదయపూర్వకముగ సేవించవలెనేకాని, కపటవేషములతోకాదు. నిర్మల హృదయముతో, అనన్య భక్తితో మాత్రమే ఆ పరాత్పరుని సేవించి జీవితమును కడతేర్చుకొనవలెను.

**నీతి :- భగవంతుడు సర్వాంతర్యామి. సర్వజీవుల హృదయాంతరాళమునందు అధివసించువారు. కాబట్టి మోసము, కపటము మున్నగువానిని వదలివైచి దైవసాక్షిగ పవిత్రకార్యములనే ఆచరించుచు జీవితమును దైవమయముగ నొనర్చుకొనవలెను.**

# నీవలె ఇతరులను చూచుకొనుము

పూర్వ మొకానొకపట్టణమున ఒక మధ్యతరగతి కుటుంబము నివసించుచుండెను. ఆ కుటుంబములో భర్త, భార్య, కుమారుడు ముగ్గురుమాత్రమే కలరు. భర్త ఆ పట్టణములోని ఒక కర్మాగారమున ఉద్యోగిగా నుండెను. కుమారుడు పాఠశాలలో విద్య నభ్యసించుచుండెను. కొంత కాలమునకు కుమారునకు యుక్తవయస్సురాగా తల్లితండ్రు లాతనికి వివాహము చేసిరి. కోడలు కాపురమునకు వచ్చెను. భార్య, భర్త, కొడుకు, కోడలు — అను నలుగురు వ్యక్తులతో గూడిన ఆ చిన్నసంసారము ఏ ఒడుదుడుకులు లేకుండ సవ్యముగా కొనసాగిపోవుచుండెను.

కాని కుటుంబములో పరిస్థితులు ఎల్లప్పుడు ఒకేతీరున ఉండవు. జీవయాత్రలో వ్యక్తులమధ్య అపుడపుడు సంఘర్షణలు ఏర్పడుచుండును. అభిప్రాయభేదములు, వైమనస్యములు పొడసూపుచుండును. అపుడు సంసారము సరిగా జరుగక అశాంతికి అలవాలమైపోవును. ఇపుడు విచారించుచున్న ఆ మధ్యతరగతి కుటుంబమందు కూడ అదే విధముగ జరిగెను. అత్తగారికి, కోడలుగారికి ఏమియు సరిపడలేదు. ప్రతిరోజు ఇరువురిమధ్య వాగ్వివాదములు, తీక్ష్ణతరసంభాషణలు పలుసార్లు జరుగుచుండెను. కోపము కల్లువంటిది. అది వచ్చి

నపుడు జనులకు ఒక విధమైన వైకైవు ఏర్పడును. ఆ వైకైవులో తా నెవరో, ఎదుటివా డెవరో, అసలు కలహమెందులకు వచ్చినదో అన్నియుమఱచిపోయి యుక్తాయుక్తవిచక్షణాజ్ఞానము ఇసుమంతయు లేక మహాదుడుకుగ దురుసుగ ప్రవర్తించుచుందురు. తత్ఫలితముగ ఊహింపరాని దారుణపరిణామములు ఇరుపక్షములందును సంభవించుచుండును.

ప్రస్తుత కుటుంబమునందు అత్తగారికిని, కోడలుగారికిని మధ్య ఏర్పడిన భేదాభిప్రాయము దినదినము ప్రబలిపోయి, చిలికి చిలికి గాలివానగా మారినట్లు, తీవ్రకలహములకు దారి తీసెను. వారిరువురిమధ్య రాజీ కుదుర్చుటకు ఇంటియజమానికి తలప్రాణము తోకకు వచ్చుచుండెను. ఆఖరునకు కోడలిదే పై చేయి అయ్యెను. యుద్ధములో అత్తగారు ఓడిపోయెను. అపుడు వెంటనే కోడలు అత్తగారితో 'అత్తగారూ! ఇక మీదట మీరు ఈ యింటిలో ఒక్క క్షణమైన గడపగూడదు. వేఱే ఎక్కడైనా ఏర్పాటుచేసికొనవలసినది' అని 'అల్టిమేటం' [తుది హెచ్చరిక] ఇచ్చివేసెను. ఆ వాక్యములను విని అత్తగారు 'అమ్మా! ఇవి నీ రోజులు. కాబట్టి నీ వాక్యములను శిరసావహించక నాకు తప్పదు. వేఱే గత్యంతరము లేదు. నీవు చెప్పినట్లు అక్షరశః పాలించెదను. త్వరలోనే ఇల్లు విడిచిపోయెదను. అయినను, అమ్మా! నా కొక చిన్న అభిలాష ఉన్నది. దానిని నెరవేర్చుకొని పోదలంచినాను.

నీకు మొన్నానే వివాహామైనది. నీకు ఒక బిడ్డ కలిగినతరువాత వాని ముఖారవిందమును సందర్శించుకొని, తప్పకుండా ఇల్లు విడచి పోయెదను. అంతవఱకు కొంచెము ఓపికపట్టు తల్లీ!" అని చెప్ప అందులకు కోడలు అంగీకరించెను.

కాలచక్రము రివ్వున తిరుగసాగెను. కొంతకాలమునకు కోడలుగారికి తనయుడు జన్మించెను. మనుమని ముఖసందర్శనముచే అత్తగారి ముఖము చాటంతయినది. పౌత్రసందర్శనానంద తన్మయ అయియున్న అత్తగారి చెంతకు కోడలు వెళ్ళి, 'అత్తగారూ! మనుమడు పుట్టినాడు. కావున ఇక తమరు ఇంటినుండి బయటకు దయచెయండి. మాట తప్పుట మంచిది కాదు." అని పలుక వెంటనే అత్తగారు "అమ్మా! నేను మాట తప్పను. తప్పక వెళ్లెదను. కాని ఒక్క సంకల్పము బహుకాలమునుండి పీడిస్తున్నది, దానినికూడ నెరవేర్చుకొని వెళ్లెదను. ఆ పిదప ఇక నీవు ఉండమని కోరినప్పటికిని నేను ఉండను. నీకు పుట్టిన ఆ బిడ్డడియొక్క వివాహకార్యమును కళ్లారచూచి ఆనందించి వెళ్ళిపోదలంచినాను. అంతవఱకు కొంచెము ఓపికపట్టవమ్మా! తల్లీ!' అని ప్రత్యుత్తరమీయగా కోడలు సంతోషించి ఎటుతిరిగి కొంతకాలమునకైనను ఆమె వదలిపోవునను సంతోషముతో సంతృప్తిని ప్రకటించెను.

రోజులు గడచిపోసాగెను. దినములు మాసములుగను మాసములు వత్సరములుగను వేగముగ పరిణామించుచుండెను.

క్రమముగ మనుమనికి యుక్తవయస్సు రాగా, ఒకానొక సుముహూర్తమున అతనికి వివాహము జరిగెను. అనంతరము కొంతకాలమునకు కోడలు అత్తగారియొద్దకువచ్చి 'అత్తగారూ! నా కుమారునియొక్క అనగా మీ మనుమనియొక్క వివాహమును కళ్లారచూచి ఆనందించారుగదా! ఇక మీ మాట ప్రకారము ఇంటినుండి బయటకు వెళ్లండి!" అని పలుకగా అత్తగారు రోషారుణితనేత్రయై "అమ్మా! కోడలుగారూ! కోడలు ఇంటికిరాగానే అత్తగారు ఇల్లు విడచిపోవుట సిద్ధాంతమైనచో, ఇప్పుడు నీకున్నూ కోడలువచ్చినది కాబట్టి అత్తవైన నీవున్నూ ఇపుడు ఇల్లు విడిచి పోవలసియున్నావు. కాబట్టి మనమిద్దరమున్నూ కలిసి బయటకు వెళ్లిపోవుదము రమ్మా!" అని గంభీరముగ చెప్పివైచెను. ఆ వాక్యములను వినగానే కోడలు పశ్చాత్తాపయుతఅయి సిగ్గుతెచ్చుకొని తన అపరాధమును గ్రహించి అత్తగారితో 'అత్తగారూ! ఇక మీరు వెళ్ళనక్కర లేదు. ఆచంద్రతారార్కము ఇంటియందే ఉండవచ్చును." అని తెలిపి ఊరకుండెను.

ఎదుటివాడు ఎంత బాధపడుచున్నది సామాన్యపరిస్థితులలో మనుజుడు తెలిసికొనజాలడు. ఆ బాధ తనకు వచ్చినపుడు మాత్రమే దానివలన కలుగు దుఃఖమును అతడు తెలిసికొనగలుగును. కాబట్టి సుఖమందుగాని, దుఃఖమందుగాని తనవలెనే ఇతరులను చూచుకొనుట విజ్ఞాని లక్షణము. ఇదియే

గీతాచార్యుడు తెలిపిన "ఆత్మౌపమ్యత్వము". ఇతరు లెవరికైన
ఆకలి కలిగినచో, తనకు ఆకలి కలిగినచో ఎంతబాధ కలుగునో
ఊహించుకొని, ఆ ఎదుటవాని ఆకలిబాధ తనబాధగా భావించు
కొని, తనకుకలిగిన దానిలో ఒకింత అన్నము వానికి పెట్టి వాని
బాధపోగొట్టవలెను. అట్లేఇతరులు చలికి బాధపడు చుండినచో
ఆ చలి తనకు వేసినచో ఎంతబాధ కలుగునో ఊహించుకొని
ఎదుటవాని చలిబాధతీర్చుటకు తనకున్నదానిలో ఏదైన వస్త్ర
మును దానము చేయవలెను. అంతియేకాని కథలోని కోడలి
వలె, ఎదుటువాని ఆర్తిని తెలిసికొనక స్వార్థముగ ప్రవర్తింప
రాదు. "ఆత్మౌపమ్యత్వము" అనగా తనవలె ఇతరులను
చూచుకొను అభ్యాసము పరమధర్మము. కావున జనులిద్దానిని
తమ దైనందిన వ్యవహారమందు కార్యాన్వితమొనర్చుకొని
జీవితమును పవిత్రవంతముగ నొనర్చుకొనవలయును.

నీతి:- సుఖమందుగాని, దుఃఖమందుగాని, తనవలె
ఇతరులను చూచుకొనవలెను. ఇదియే గీత యందు
చెప్పబడిన ఆత్మౌపమ్యమను ధర్మము. పర ప్రాణి
యొక్క సుఖమునే వాంఛింపవలెను. ఇతరులకు
ఉపకారమునే చేయవలెను.

# జరా దుఃఖము

('జరా' అనగా ముసలితనము. ముసలితనమందు మనుజుడు ఎదుర్కొను దుఃఖములు కొన్ని ఈ కథయందు తెలుపబడినవి)

పూర్వ మొకానొక పట్టణమందు ఒక ధనికుడు కలడు. అతడు కష్టపడి చెమటకార్చి వ్యాపారమందు లక్షలు గడించెను. అచిరకాలములోనే కోటికి పడగెత్తెను. తన నివాసమునకై మహోన్నతమైన గగనచుంబిత భవనము నొకదానిని నిర్మించుకొని హాయిగ నివసించుచుండెను. పరిచారకులు, సేవకులు లెక్కకుమించినవారు అతని గృహమున సేవచేయుటకై నియోగింపబడిరి. గొప్ప అట్టహాసముగ జీవితము గడుపుచుండెను.

కాని పరిస్థితులు ఎల్లకాలమందును ఒకేరీతిగ ఎవరికిని ఉండవు. అవి అపుడపుడు తారుమారగుచుండెను. ధనికునకు క్రమముగ వార్ధక్యము దాపురించెను. శరీరసౌష్ఠవము తగ్గిపోవదొడగెను. దేహదార్ఢ్యము సన్నగిలజొచ్చెను. ఎటువంటి భీమబలునకైనను వృద్ధాప్యమందు దేహము శుష్కించక తప్పదుగదా! ఇంద్రియములు అత్తిపట్టు తప్పిపోవును. శరీరము పలువిధ రుగ్మతలకు ఆలవాలముకాగా జీవితమే భారభూతముగ పరిణమించును. ఇది యట్లుండ మఱియొక పెద్ద ప్రతిబంధకము వార్ధక్యమున జనులకు దాపురించుచుండును.

ఇంటిలో పుత్రులుగాని బంధువర్గముగాని, పరివారముగాని వృద్ధుడు చెప్పినమాటను సరిగా ఆలకించరు. నిర్లక్ష్యముగ తృణీకారబుద్ధితో, తిరస్కారభావముతో ఉందురు. అతనిని పూర్తిగ ఉపేక్ష చేయుదురు. పైగా ఎగతాళిచేయుటకున్నూ పూనుకొందురు. ఇంద్రియ పటుత్వము తప్పి శక్తిహీనుడగుట చేత వయస్సు చెల్లిన ఆ వ్యక్తి పుత్రాదుల కేమియు జవాబు చెప్పలేక, దుఃఖమును, ఆక్రోశమును దిగమ్రింగుకొనుచు, గొప్ప మానసిక క్లేశమును అనుభవించుచు, జీవితరథమును బహు భారముతో ఈడ్చుకొని పోవుచుండెను.

కథలోని ధనికుని పరిస్థితియు అట్లే ఏర్పడెను. కుమారునకు యుక్తవయస్సురాగా తండ్రి అతనికి సంపన్నకుటుంబము లోని ఒక కన్యకనిచ్చి వివాహముచేసెను. కొంతకాలము కుటుంబములో ఏకలతలు, పొరపొచ్చెములు లేక సవ్యముగా సాగిపోయెను. కాని తండ్రి వృద్ధుడగుచుండిన కొలది, కుమారునకు ధనమదము పెరిగి పెరిగి కన్నుమిన్నుగానక ప్రవర్తించుచుండెను తండ్రిని లెక్క చేయకుండెను. ఒకే కుమారుడగుటంబట్టి కుమారుడు తనకు పెట్టుబాధలను తండ్రి ఎవరికిని చెప్పుకొనలేక ఓర్చుకొనుచు లోలోన పరమసంతాపము నొందుచుండెను. కష్టపడి చెమటకార్చి, రాత్రింబగళ్లు శ్రమ చేసి దేశదేశములు తిరిగి సంపాదించిన ద్రవ్యమునంతను

కుమారుడు నానావిధ దుర్వ్యసనములకు ధారబోయుచుండెను. భోగవిలాసములలో చిక్కుకొని, దుస్సాంగత్యమునకు లోనై, అశ్లీలకార్యములలో మునిగితేలుచు కుమారుడు తండ్రి సేకరించిన ధనమునంతను వ్యర్థముచేయ దొడగెను. దుర్బలుడగు తండ్రి ఏమియు చేయలేక ఖిన్నుడుండెను.

కుమారుడు తండ్రికి చేయుచుండిన అపచారములు పోనుపోను శ్రుతిమించి రాగాన పడుచుండెను. ఒకనాడు కుమారుడు తల్లితండ్రులనుపిలిచి 'నాన్నగారూ, అమ్మగారూ, ఇకమీదట మీరిరువురు ఇంటిలోపల భోజనము చేయుటకు వీలుపడదు. బయట వరండాలో కూర్చొని భోజనము చేయవలసినదే!" అని ఆజ్ఞాపించెను. పాపము, వృద్ధదంపతులేమి చేయగలరు! సుతుని ఆజ్ఞను జవదాటలేక అంజలిబద్ధులై అట్లే ఆచరింప దొడగిరి. మరికొంతకాలమునకు గోరుచుట్టుపై రోకటిపోటు అన్నట్లు తనయుడు తల్లిదండ్రులను పిలిచి మరి యొక తీక్ష్ణమైన శాసనమును ఈ ప్రకారముగ జారీచేసెను— "తల్లిదండ్రులారా! ఇకమీదట మీరిరువురును రెండు వేర్వేరు కంచములలో భోజనముచేయరాదు. ఒకే కంచములో ఇద్దరు తినవలసినదే!" అని యతడు ఆదేశించెను. కఠోరములగు ఆ వాక్యములను వినుటతోడనే మాతాపితరులు హతాశులై గత్యంతరములేక సుతునిఆజ్ఞను శిరసావహించి పాలింపదొడగిరి.

ఇట్లుండ, ధనికుని మనుమడు, పదునాలేండ్ల ప్రాయము గలవాడు తన తాతకు, అవ్వకు తనతండ్రి పెట్టుచుండిన రాక్షసబాధలను చూచి సహింపలేక, ఆ కిరాతక చర్యలను చూడలేక తండ్రికి గుణపాఠము బోధించుటకై అదనుకొఱకు వేచియుండెను. ఒకనాడతడు తన తండ్రి ముసలివారైన తాత అవ్వలకు పెట్టుచుండిన ఒకే ఒక కంచమును ఎవరికిని తెలియకుండ దాచిపెట్టెను. మధ్యాహ్నమగుసరికి అతనితండ్రి వృద్ధులైన మాతాపితరులకు అన్నము పెట్టుటకై కంచము కొఱకు వెతుకగా ఎక్కడను కనిపించలేదు. ఇల్లంతయు గాలించినను దాని జాడ తెలియలేదు. అపుడు తండ్రి కుమారునితో 'ఏమిరా, మీ తాతగారికి, అవ్వగారికి పెట్టే కంచం నీవేమైన దాచినావా ?" అని ప్రశ్నింప కుమారుడు అవును అని జవాబిచ్చెను. ఎందులకు దాచితివని ప్రశ్నింప అతడిట్లు తడుముకొనకుండ ప్రత్యుత్తరమిచ్చెను — నాన్నా ! నీవు ముసలివాడవైన తరువాత, నీకు, అమ్మకు అదే కంచము పెట్టాలని నేను దాచిపెట్టినాను. కుమారుని ఆ వాక్యములను వినగనే తండ్రికి కనువిప్పు కలిగెను. క్షణములో జ్ఞానోదయ మయ్యెను. తాను తన తల్లిదండ్రులకు పెట్టు హింసకు పది రెట్ల హింస తనకు వృద్ధావస్థలో తన కుమారుడు పెట్టనున్నా డని గ్రహించెను. తోడనే యతడు తన వృద్ధజననీ జనకు లను సగౌరవముగ ఇంటిలోనికి పిలిపించి, వారిని యథో

చితముగ ఆదరించి శ్రద్ధాపూర్వకముగ సపర్యలను చేయ సాగగను.

కావున జనులు మహాశక్తతరమైన వార్ధక్యావస్థలో తమకు సంభవింపనున్న శారీరక, మానసిక వ్యథలను ముందుగనే యూహించుకొని, అట్టి భీషణ వార్ధక్య దశరాకపూర్వమే తాను చేయవలసిన పరమార్థ కార్యములను, ఆధ్యాత్మిక సాధనలు త్వరలో పూర్తిచేసి జీవితమును కృతార్థమొనరు కొనవలయును.

నీతి :- ముసలితనమున జీవుడు నానాబాధల ననుభవించును. కావున వార్ధక్యము రాకమునుపే పరమార్థసాధనలను పూర్తిచేసి ధన్యుడు కావలయును.



# దుర్గుణములకు వీడ్కోలు

ఒకానొక పట్టణమందు ఒక మధ్యతరగతి కుటుంబము నివసించుచుండెను. ఇంటియజమాని గొప్ప శ్రీమంతుడు కాకున్నను తన కుటుంబమునకు చాలినంత ఆస్తిమాత్రము కలిగియుండెను. దానితో అతడు నిరాటంకముగ తన జీవన యాత్రను సాగించుచుండెను. అతనికొక కొమార్తెయుండెను. యుక్తవయస్సురాగానే తండ్రి ఆమెకు యథావిధిగ వివాహము చేసివైచెను.

వివాహమైన కొద్దిమాసములకు దీపావళిపండుగవచ్చెను. దీపావళికి అల్లుళ్ళ పండుగయని వాడుకకలదు. ఆ పండుగకు అల్లుని ఇంటికి పిలిపించిన బాగుండునని యజమానికి తోచెను. తన యభీష్టము నతడు జాబు మూలకముగ అల్లునకు వెంటనే తెలియజేసెను. జామాత సంతోషముతో ఆ యాహ్వానము అంగీకరించెను. తదనుసారమతడు దీపావళికి రెండు రోజులుముందుగనే మామగారియింటికి వచ్చిచేరెను. నూతన వరుడు కాబట్టి అత్తమామలు చాల ఖర్చుపెట్టి అతనికి మర్యాదలు చేయదొడంగిరి. క్రొత్తక్రొత్త వస్త్రములు, క్రొత్త క్రొత్త ఫలహారములు అతనికి అందజేయుచుండిరి.

దీపావళి వేడుకలు పూర్తిఅయినవి. పండుగ అయిన తరువాత ఒకటిరెండు రోజులకు అల్లుడు వెడలిపోగలడని అత్త

మాటలు తలంచిరి. కాని అదియేమి వైపరీత్యమో కాని, దీపావళిదాటిన వారందినములకుకూడ అల్లుడు ప్రయాణము కట్టలేదు. అల్లుడుగారు దీర్ఘకాలము 'క్యాంపు' చేయుటవలన ఇంటివారికి ఖర్చు నానాటికి పెరిగిపోవసాగెను. చేతిలో ఉన్న డబ్బుఅంతయు అయిపోవుటచే అప్పు సొప్పు తెచ్చి కాలము గడుపుచుండిరి. అల్లుని ఉనికి ఇంటివారికి ఒక పెద్ద సమస్య అయి కూర్చుండెను. వెళ్లుదని చెప్పుదుమా మర్యాదకు లోటు, ఉండని స్తుమా కొంతంతభారము. ఈ ప్రకారముగ యజమాని మానసికముగ సతమతమై పోవుచుండెను. ఆర్థికముగ నలిగిపోవుచుండెను. ఇట్టి పరిస్థితిలో కర్తవ్యమేమియో అతనికి తోచకుండెను.

ఒకనాడు ఇంటియజమాని తనభార్యను ఏకాంతముగ పిలిచి దైనికముగ ఏర్పడిన అత్యవసర పరిస్థితినిగూర్చి సమాలోచనలు ప్రారంభించెను. సమావేశమున అతడు కొన్ని సూచనలు చేసెను. అతని అర్థాంగి కూడకొన్ని సూచనలు చేసెను. ఈ ప్రకారముగ వారిరువురును దీర్ఘాలోచనచేసి అల్లునిబెడద తప్పించుకొనుటకు ఉపాయములను అన్వేషింపదొడగిరి. నాలుగైదు ఉపాయములను ఒక కాగితముపై రికార్డుచేసికొని, ఒక్కొక్కదానిని అమలులో పెట్టదలంచిరి. మొదటి ఉపాయముచే కార్యసిద్ధి కలుగనిచో రెండవదానిని,

రెండవదానికికూడ ఫలితములేనిచో మూడవదానిని ఆచరణలో పెట్టుటకు వారు కృతనిశ్చయులైరి.

మొదటిఉపాయము అల్లునకు స్వాదిష్టమగు రాజభోజనమును విరమించి సామాన్యభోజనమును పెట్టుట. దీనిని వెంటనే అమలులో పెట్టిరి. తత్ఫలితముగ అల్లునకు వేసిన విస్తరిలో పిండివంటలు కనిపించలేదు. రకరకముల కూరలు కనిపించలేదు. చింతకాయపచ్చడి, అన్నపుమెతుకులు మాత్రము ఉండెను. కాని అల్లుడు ఇటువంటి మార్పులకు జంకువాడు కాడు. ఈ మార్పుచే అతనికి చీమకుట్టినట్లుకూడ లేదు. ఆహారవిషయములో జరిగిన ఈ విపర్యయము అతడు లెక్కచేయలేదు. మామగారింటియందు తిష్ఠకొనసాగించుటకే అతడు దృఢనిశ్చయము కావించుకొనెను. ఈ ప్రకారముగ "అల్లుని ఉద్వాసనపథకము" నందలి ప్రథమసూత్రము విఫలమగుటవలన అత్తమామలు వెనువెంటనే ద్వితీయసూత్రమును అమలుపఱచుటకు నిశ్చయించిరి. ఒకనాడు మామగారు అల్లుని ఏకాంతముగ పిలచి, "అల్లుడుగారూ! మీరు ఇల్లువిడిచివచ్చి చాలరోజులు అయినట్లున్నదే. మీ యింటివారు మిమ్ములనుగూర్చి బెంగపెట్టుకొనరా?" అని అడిగెను. తక్షణమే అల్లుడు—'మామగారూ! మీరుచెప్పినది పరమసత్యము. మాతల్లిదండ్రులు, సోదరిసోదరులు, అందరు నన్నుగూర్చి బెంగపెట్టుకొని విపరీతముగ బాధపడుచుందురు

కనుకనే ఈరోజు వారికి "మీరందఱు ఇక్కడికివచ్చి నన్ను సందర్శించి మీమీ శెంకలు పోగొట్టుకొనుడు" అని జాబు వ్రాయదలంచినాను. ఆ వాక్యములను వినగనే మామగారి గుండె బ్రద్దలయ్యెను. "రామరామ! ఒక్కరిని వదిలించు కొనుటకే యమయాతన పడుచుండగా ఇక పదిమంది వచ్చి న త్తిన పడుచున్నారే!" అని తలంచుకొని హతాశుడై నోట మాటలేకుండెను.

ఈ ప్రతీకారముగ పథకమందలి రెండవ ఉపాయము కూడ వైఫల్యమును బొందగా, ఇక గత్యంతరములేక మామ గారు మూడవ సూత్రమును అమలుపెట్టుటకు నిశ్చయించు కొనిరి. ఇంతవఱకు చిన్నచిన్న అస్త్రములు, శస్త్రములు ప్రయోగించినందువలన ప్రయోజనము శూన్యమగుట గమనించి ఈసారి బ్రహ్మాస్త్రమును ప్రయోగింప నిశ్చయించు కొనెను. ప్రతిరోజు ఉదయము దొడ్డిలోని బావిదగ్గర అల్లుడు స్నానముచేయుచుండెను. బావిని అనుకొని ఒక పెద్దగోడ కలదు. అది సున్నము కొట్టబడియుండెను. మామగారు ఒకనాటిరాత్రి ఒక బొగ్గుతీసికొని ఆ గోడపై కాటికాయంత అక్షరములతో 'ఇంటికివచ్చిన అ తి థి మూడు రాత్రులకంటె ఎక్కువసేపు ఉండగూడదు' అని వ్రాసివెళ్లెను. మఱునాడు ఉదయమున అల్లుడు బావియొద్ద స్నానముచేయుటకు రాగా గోడపై వ్రాసిన వాక్యమతనికంటబడెను. అతడు చదువు

"ఓహో! మామగారు నన్ను సాగనంపుటకు ఎన్నియో
గములు చేయుచున్నారు" అని ఊహించుకొని, ఆ
ముక్రిందనే ఈ ప్రకారముగా బాగ్గుతో వ్రాసెను—
మగారూ! మూడురాత్రులకంటె ఎక్కువకాలము ఇచట
కూడదని మీరు వ్రాసినారు. మంచిదే. నేను మీ
టను గిప్పను. మీ అభిప్రాయము ప్రకారము నేనున్న
ముంటిముంతు మూడురాత్రులకంటె ఎక్కువ ఉండను.
రాత్రి, శివరాత్రి, నవరాత్రి— ఈ మూడురాత్రులు
మకొని వెళ్లెదను. అన్యథా భావించవలదు."

అల్లుడు స్నానముచేసి ప్లినమీదట మామగారు
దగ్గరకువచ్చి అల్లుడు వ్రాసిన పిడుగువంటి వాక్యముల
ఓంచి మూర్ఛపోయెను. కొంతసేపటికి తేరుకొని, కిం
వ్యవిమూఢుడై భారముతో కాలము గడుపసాగెను.

కథలోని అల్లునివలె జీవుని హృదయమున అనేక అనా
దురభ్యాసములు, దుర్వాసనలు—తిష్ట వేసుకొని కదలక
న్నవి. ప్రయత్నపూర్వకముగ వాటిని సాగనంప
తప్ప జీవునకు శాంతిగాని సుఖముగాని యుండదు. వి
చేతను, అభ్యాసముచేతను, భక్తిచేతను ఆయా ప్రావం
వాసనలను ఎంతశీఘ్రముగ వెడలుటకు పంపివేసిన జీవుడు
శ్రేయము లభింపగలడు. వాని ఉనికిచే అశాంతియే

కలుగుచుండును. కావున ఏదియో యొక ఉపాయముచే హృదయమందు బహుకాలమునుండి నిల్వదొక్కుకొనియున్న ఆ కామక్రోధాది ఆగంతుకులకు శీఘ్రముగ వీడ్కోలుచెప్ప వలయును. వాటి లేమియే జీవునకు పరమానందము. అదియే మోక్షము.

**నీతి :— అనేక జన్మార్జితములైన మలినవాసనలు ఒకరాగానపోవు. కాబట్టి సాధకుడు ప్రయత్నపూర్వకముగ వానిని పోగనంపవలెను. లేకున్న శాంతి కలుగదు.**

# తీవ్ర ముముక్షుత్వము

ఒకానొక గ్రామము బయట ఒక పర్ణకుటీరమును ఏర్పాటుచేసికొని ఒకసాధువు ధ్యాననిష్ఠ సలుపుకొనుచుండెను. పవిత్రహృదయుడు, అనుష్ఠానపరుడు, నిరంతర దైవచింతనాపరుడు అగుటంబట్టి గ్రామస్థులందరికిని అతనిపై భక్తివిశ్వాసములు ప్రబలెను. అపుడపుడు వారు సాధువుగారి దర్శనార్థమువచ్చి ఆతనిదివ్యబోధలను ఆలకించి తమ భక్తిప్రపత్తులను ఇనుమడింపజేసికొనుచుండిరి.

ఒకనాడొక గృహస్థుడు పరగ్రామమునుండి ఆ సాధువు
గారి కుటీరముచెంతకు వచ్చి గురుదేవునకు సాష్టాంగవందన
మాచరించి యిట్లు మనవిచేసికొనెను—"మహాత్మా! ఈ సంసార
కూపమునబడి నానాయాతన లనుభవించుచు దిక్కుతోచక
యున్నది. ఇసుమంతైనను మనశ్శాంతి లభించుటలేదు. దిన
దినము సంసారబాధ్యతలు పెరుగుచునే యున్నవిగాని తరుగుట
లేదు. ఒక దుఃఖము సమసిపోయిన వెంటనే మఱియొక
దుఃఖము వచ్చి తగుల్కొనుచున్నది. అవగింజంత సుఖము
కొఱకై కొండంత దుఃఖమును మోయుచున్నమా యని తోచు
చున్నది. జీవితమే అంధకారబంధురముగా గన్పట్టుచున్నది.
ఇట్టి పరిస్థితిలో తరుణోపాయమేదియో తెలియకున్నది. తమ
వంటి మహనీయులను ఆశ్రయించినచో దారి చూపగలరని
తలంచి తమ పాదసన్నిధికి చేరితిని. తండ్రీ! కలుషఘ్నుండవు!
ఏదైన చక్కని మంత్రమును ఉపదేశించినచో దానిని జపించు
కొనుచు తరించెదను. అఖండ తపస్సంపన్నులును, ఆధ్యాత్మ
కేళీవిరాజితులు నగు తమవంటి మహనీయుల ముఖతః వెలు
వడిన వాక్యములు సంసారతాపోపశమనరూపమహామంత్రప్రభా
వము తప్పక కలిగియుండును. కావున, మహాత్మా! ఏదైన స
న్మంత్రమును సెలవిండు, జపించుకొని కడతేరగలను.

పరదేశిగృహస్థుని ఆ వినయపూర్వకవచనములు సాంతమాలకించి
గురుదేవుడు అతని పరమార్థజిజ్ఞాసకు లోలోపల సంతసించుచు

వెంటనే మంత్రోపదేశముచేయక, అతడు యథార్థముగ దైవము కొఱకు, మోక్షముకొఱకు, బంధవిముక్తికొఱకు తీవ్రముగ పరితపించుచున్నాడా, లేక, తాత్కాలిక ఆవేశముతో శ్మశాన వైరాగ్యముతో ఇచటికి ఏతెంచినాడా పరీక్షించిన మంచిదని తలంచి 'మంచిరోజు చూచి తరువాత ఉపదేశించెదను, ఇప్పుడు తిథిసరిగా లేదు,' అని చెప్పి అతనిని పంపి వైచెను. ఆ వాక్యములు గృహస్థునకు అశనిపాతమువలె తోచెను. ఎప్పుడెప్పుడు మంత్రోపదేశము బడసి చక్కగ జపించుకొనుచు తరించెదమా అని ఉవ్విళూరుచున్న అతనికి గురుదేవుని సమాధానము హృదయవిదారకముగ తోచినను, గుర్వాజ్ఞను శిరసావహించదలంచి అచ్చోటు వీడిచనెను.

రోజులు గడచిపోయెను. నెలరోజులైన తరువాత మరల ఆ గృహస్థుడు ఆశ్రమమునకుపోయి "గురుదేవా! మంత్రోపదేశము లేనందున, రోజులు యుగములుగ గడచుచున్నవి. జీవితమే భారభూతముగ తోచుచున్నది. దయచేసి వెంటనేమంత్రమును ఉపదేశింప ప్రార్థన" అని పాదములపైబడి మొరపెట్టుకొనెను. అపుడు దేశికోత్తముడు నాయనా! కార్తీక పౌర్ణమి పవిత్రదినమున ఆశ్రమమునకు వచ్చినచో నీకు తప్పక మంత్రోపదేశమును చేయుదును అని చెప్పి పంపివైచెను. అది భాద్రపదమాసము. ఇంకను అందోళనపడుచు ఇంటికి వెడలిపోయెను.

చాతకపక్షి వర్షబిందువులకై ఎదురుచూచుచుండు విధమున గృహస్థుడు కార్తీకమాసము ఎప్పుడువచ్చునా యని తహతహపడు చుండెను. కాలచక్రము రివ్వున తిరిగిపోయెను. ఆశ్వయుజము గడచిపోయెను. కార్తీకము అడుగుపెట్టెను. క్రమముగా చతుర్దశి ఏతెంచెను. గృహస్థుని ఆనందమునకు మేరలేదు, మంత్రోపదేశసమయము సమీపించినదిగదా యని చిందులు త్రొక్కుచుండెను. చతుర్దశిరాత్రికే అతడు ఆశ్రమమును చేరి మంత్రోపదేశమునకై ఆతురతతో నుండెను. మరుసటి రోజు అనగా పౌర్ణమిదివసమున ఉషఃకాలమున, బ్రాహ్మముహూర్తమున గురుదేవుడు భక్తుని నిద్రలేపి నాయనా! సమీపమున ఏరు ప్రవహించుచున్నది. మనమిరువురము అచటకేగి స్నానముచేసి వచ్చెదము. అచట నదీతీరముననే నీకు మంత్రోపదేశము చేయబడగలదు అని పలికి వెంట తీసికొని వెళ్లెను. నదిఒడ్డునకు చేరిన పిదప ముందు గృహస్థుడు స్నానముచేయుటకై నదిలో దిగెను. అతడు తనతలను నీటిలో ముంచగానే గురుదేవుడు నీటిలో అతని తలను నొక్కిపట్టి యుంచెను. శిష్యుడు పైకి లేచుటకు వీలుపడలేదు. క్షణకాలమైన పిదప గురువు తనచేతిని వదలివేయగా శిష్యుడు నీటిలో నుండి అమాంతముగా పైకిలేచి గురుదేవా! మంత్రోపదేశము చేసెదనని పిలుచుకొని వచ్చి ఈ ప్రకారమేల చేసితిరి ? అని

ప్రశ్నింప గురుదేవుడు చక్కని సమాధానమొసంగెను. వారిరువురిమధ్య అపుడీక్రిందివిధముగ సంభాషణ నడిచెను.

గురువు—నాయనా! ఒకానొక ఉద్దేశ్యముతో నీతలను నీటిలో అణచిపెట్టితినేకాని నీ కపకారము చేయతలంపుతో కాదు. ఇపుడు నే నడుగుప్రశ్నలకు సమాధానము చెప్పుము. నీటిలో నీతలను ముంచియుంచిన సమయమున నీయిల్లు జ్ఞాపకమునకు వచ్చినదా?

గృహస్థుడు—లేదు.

గు—నీ భార్యజ్ఞాపకమునకు వచ్చినదా?

గృ—లేదు.

గు—నీబిడ్డలు జ్ఞాపకమునకు వచ్చినారా?

గృ—లేదు.

గు—నీసంపదలు, ధనధాన్యములు జ్ఞాపకమునకు వచ్చినవా?

గృ—లేదు.

గు—నీబంధుమిత్రాదు లెవరైన జ్ఞాపకమునకు వచ్చినారా?

గృ—రామ,రామ వారిమాటే జ్ఞప్తియందు లేదు.

గు—మరి, నీటిలోనున్నపుడు నీ కేమి జ్ఞాపకమునకు వచ్చినది?

గృ—గురుదేవా! ఎప్పుడు నీటిలోనుంచి బయటకువచ్చి గాలి

కల్పించుదునా అను ఒక్క అభిలాషతప్ప మఱేదియు నాకా సమయమున లేదు. ప్రపంచ పదార్థము లేవియు నాకపుడు స్ఫురణకు రాలేదు.

గు—నాయనా! ఏ ప్రకారముగ నీటిలో ఉన్నపుడు నీకు ఇల్లుగాని వాకిలిగాని, భార్యగాని, బిడ్డగాని, ధనముగాని, బంధువులుగాని, కీర్తిగాని, సౌందర్యముగాని, జ్ఞాపకము నకు రాక కేవలము ఒక్క ప్రాణవాయువు మాత్రము జ్ఞాపకమున్నదో, ఏప్రకార మపుడు ప్రపంచమునంతను విస్మరించి ఒక్కఊపిరినిమాత్రము జ్ఞాపకము పెట్టుకొని నావో, అట్లే తీవ్రముముక్షుత్వము కలవాడు, తరించవలె నని తీవ్రమైన అభిలాష కలవాడు ఒక దైవమును మాత్రము స్మృతిపథమున నుంచుకొని తక్కిన ప్రపంచము నంతను మఱచిపోవును. ప్రాపంచిక వస్తువులను సంస్మరిం చుచు దైవమును స్మరింప నెంచినచో ఏకాగ్రత కుదరదు. కాబట్టి నీకుపదేశింపబోవు మంత్రమును అనన్యభక్తితో జపించవలెను. దృశ్యపదార్థముల నేదిని స్మరింపక, మంత్ర జపముచేయుచు కేవలము మంత్రార్థమునే భావించుచుండ వలెను. అన్యవిషయములను మనస్సునకు రానీయకూడదు ఇట్టి ఏకాగ్రత, వైరాగ్యము, తీవ్రముముక్షుత్వము లేనందువలననే అనేకులకు మంత్రోపదేశము చేసినను నిక

పయోగమైపోవుచున్నది. కావున తరించవలెనను తీవ్ర అభిలాష, దైవముకొఱకై మిక్కుటమగు పరితపన, ప్రాపంచికపదార్థములయెడల విరాగము, మంత్రజపమునకు దైవభక్తి కీచాల అవసరములైయున్నవి. ఆకారణమునసే మంత్రోపదేశము చేయుటకు పూర్వము నీకీ తత్త్వమును బోధించడమైనది.

గురుదేవుడీప్రకారముగ బోధించి, స్నానానంతరమాగృహస్థుని ఆశ్రమమునకు తోడ్కొనివచ్చి మంత్రోపదేశమును గావించెను. గృహస్థుడు పరమానందభరితుడై దరిద్రునకు పెన్నిధి లభించిన చందమున హర్షోత్ఫుల్లమానసుడై గురుదేవునకు సాష్టాంగ నమస్కారమాచరించి అతని సెలవు తీసికొని గృహాభిముఖుడయ్యెను. నాటినుండి అతడు గురువాక్యానుసారము భక్తిశ్రద్ధలతో, ఏకాగ్రతతో, తీవ్రముముక్షుత్వముతో మంత్రమును జపించుచు, మంత్రార్థమును స్మరించుచు దైవానుగ్రహమునకు పాత్రుడై పరమశాంతిని బడసెను.

కావున ప్రతివారును ఈ అపారదుఃఖపారావారము నుండి ఎపుడు తప్పించుకొని భగవత్సాన్నిధ్యముచేరి శాంతిని బడయుదుమాయను తీవ్రతరఅపేక్ష ముముక్షుత్వముగలిగి

భగవచ్చరణారవిందములను ఆతిశీఘ్రముగ ఆశ్రయించి జీవితమును కడతేర్చుకొనవలయును.

నీతి :- తరించవలెనను తీవ్రమైన అపేక్ష మనకు ఉండవలెను. సంసారదుఃఖమునుండి బంధనము నుండి త్వరలో విముక్తి బడయవలెనను తీవ్రఆకాంక్ష ఉండవలెను.

# ముందుచూపు

ఒకానొక పట్టణము నందొక ఉద్యోగి కలడు. అతడు ఆంగ్లభాషయందు పట్టభద్రుడు. ఒకనాడతనికి దూరప్రాంత మందున్న తన బంధువులయొద్దనుండి ఒక శుభలేఖ వచ్చెను. బంధువులలో ఒకరి వివాహము నిశ్చయమైనందువలన తచ్ఛుభకార్యమునకు వెంటనే బయలుదేరిరావలసినదిగా అతనికి వర్తమానము అందెను. తోడనే యతడు ప్రయాణము నకు సంసిద్ధుడయ్యెను. కుటుంబసమేతముగా వచుననై పోవుటకు నిశ్చయించుకొని రైలుబండి ఎన్నిగంటలకు స్టేషనుకు వచ్చునో, ఎప్పుడుబయలుదేరునో ఆ వివరమునన్నిటిని

రైల్వేగైడు చూచి వ్రాసియుంచుకొనెను. రైలు సరిగా మధ్యాహ్నము 12 గం॥లకు స్టేషనుకు రాగలదు. కావున ఒక అరగంట ముందుగానే వెళ్లి స్టేషను ప్లాటుఫారంపై కుటుంబ సమేతముగ అతడు కూర్చొనియుండెను. అంతలో అతని హృదయఫలకమున ఒక చక్కని సంకల్పము మెఱసెను. "రైళ్లు సకాలమునకు వచ్చుచున్నవా? లేక ఆలస్యముగ వచ్చుచున్నవా చూతువలెను. ఈరోజు నేను ప్రయాణము చేయుచున్న రైలు సరిగా 12 గంటలకు రావలెనుగదా! ఇపుడెన్ని గంటలకు వచ్చునో పరిశీలించెదను" అని భావించిన వాడై తన చేతి గడియారముపైననే దృష్టిని కేంద్రీకరించి యుండెను.

11½ గం॥లు దాటినది. 113/4 అయినది. రైలు ఇంకను రాలేదు. 11 గం॥ల 59 నిముసములైనది. ఇంకను రాలేదు. సరిగా 12గం॥లు కాగానే రైలు ఖచ్చితముగ వచ్చి ప్లాటుఫారంపై నిలచినది, ఒక్క సెకండైనను తేడా లేదు. ఆఘటన చూడగనే ఉద్యోగియొక్క ఆనందమునకు మేరలేదు ఆహా! ఈ డ్రైవరు ఎంత చాకచక్యముతో, ఎంత క్రమశిక్షణతో రైలుబండిని నడుపుకొనుచు వచ్చెను! ఇట్టి అనుభవజ్ఞులగు డ్రైవర్లు ఉండినచో రైళ్లు ఎంత చక్కగ నడువగలవు! ప్రయాణికులకు ఎంత సౌకర్యము చేకూరగలదు! అని తలంచు కొనుచు, ఒక్కక్షణమైనను వ్యత్యాసము లేకుండ రైలు

నడుపుచున్న డ్రైవరును ప్రత్యేకముగ సత్కరించిన బాగుండు నని యోచించి, వెంటనే వరుగెత్తుకొనిపోయి ప్లాటుఫారంపై పుష్పమాల నమ్ముచుండిన ఆసామియొద్దకేగి ఒక పెద్ద పుష్ప మాలనుకొని ఆ డ్రైవరుచెంతకు వచ్చెను. డ్రైవరుగారికి అభివాదమునల్పి 'అయ్యా! డ్రైవరుగారూ!' ఇంజనులో నుండి తమరు క్రిందకు దిగండి. తమకు సన్మానముచేయ సంకల్పించినాను. తమవంటి సుశిక్షితుడైన సారథిని ఇంత వరకు జగత్తులో నేను చూడలేదు. ఒక్క సెకండుకూడ తేడా లేక తమరు ఈ రైలుబండిని నడుపుచున్నారు. ఇది ప్రయాణ చరిత్రలోనే చెప్పుకొనదగిన విషయము. మాకోటి వారు గర్వించదగిన విషయముకూడను. కాబట్టి మిమ్ములను సత్కరించుట మాయొక్క కర్తవ్యము, విధ్యుక్తధర్మము. దయచేసి ఇంజను దిగండి. ఈ పుష్పములచే మిమ్ములను సమలంకృతులుగ చేయవలసియున్నది.

ప్రయాణికుని ఆ హర్షోత్ఫుల్లితవచనములను ఆల కించిన డ్రైవరు ఆశ్చర్యపడి, అతనితో 'మహాప్రభో క్షమించండి. నేను మీ సత్కారమును స్వీకరించుటకు యోగ్యుడనుకాను. ఏలయనగా ఇది నిన్న మధ్యాహ్నం 12 గంటలకు రావలసిన బండి. 24 గంటలు లేటుగా వచ్చినది' అని చెప్పివైచెను. ప్రయాణికుడు స్తబ్ధుడైపోయెను. 'రామ,

రాము! ఇతడు నిర్ణీతసమయమునకు 24 గంటలు వెనుక ఉన్నాడే!' అని తలంచి హతాశుడై పోయెను.

జీవుడా! ముందుచూపు కలిగియుండుము. కథలోని డ్రైవరువలె అలసత్వము, వెనుకచూపు కలిగియుండకుము, ఇప్పటికే దీర్ఘప్రయాణము జరిగినది. దానియందింకను విలంబనము జరుగులాగున చేయకుము. ప్రయాణమును త్వరలో పూర్తిచేసికొనుము. జనన మరణరూప ఈ ఘోర సంసృతినుండి శీఘ్రముగ బయటపడుము. రేపు చేయవలసిన దైవకార్యమును ఈరోజే పూర్తిచేయుము. సాయంత్రము చేయవలసిన పరమార్థకార్యమును ఉదయముననే పూర్తి చేయుము. అలసత్వము, జడత్వము, దీర్ఘసూత్రత్వము, సోమరితనము—వీనికి ఏమాత్రము తావొసగరాదు. ఆధ్యాత్మికక్షేత్రమున సోమరులకు చోటులేదు. దూరదృష్టి కలిగియుండుము. ముందుచూపు ఏర్పరచుకొనుము. రేపు ఎట్లుండునో! కావున ఈనాడే తరించుటకు తగిన సాధనోపాయములను అన్వేషింపుము!

**నీతి :- భవిష్యత్తునుగూర్చి ఇవుడే ఆలోచించుకొని మృత్యువురాకపూర్వమే ఆత్మజ్ఞానమును బడసి జన్మము సార్థకమొనర్చుకొనవలెను.**

# విషయ విలాపములు
# ప్రమాదహేతువులు

ఒకానొక పట్టణమున ఇరువురు మిత్రులు కలరు. వారి మైత్రి దినదినము ప్రవర్థమానమగుచు ఒకరినొకరు విడువజాల నంత ఘనత్వమును బొందెను. కష్టసుఖములందు ఒకరినొకరు ఆదుకొనుచు దైనందిన వ్యవహారములందు ఒకరికొకరు సలహాల నిచ్చుకొనుచు వారు జీవయాత్రను కొనసాగించుచుండిరి. ఒకనాడా పట్టణములోని ఒకానొక దేవాలయమున ఆధ్యాత్మిక ప్రసంగము నడచుచుండగా వారిరువురును అచటికిపోయి శ్రద్ధగా ఆ ప్రసంగమును ఆలకించిరి. ప్రసంగమధ్యమున తీర్థయాత్రలయొక్క ఆవశ్యకతనుగూర్చి, వానివలన జనులకు కలుగు మేలునుగూర్చి వక్త గంభీరముగ ఉపన్యసించెను. ఆ వాక్యములు మిత్రులయొక్క హృదయఫలకమున చక్కగ నాటుకొనెను. ఏ విధముగనైనను తీర్థయాత్రలుసల్పి పుణ్యము సంపాదించి జీవితమును చరితార్థమొనర్చుకొనవలెనను తీవ్రమైన ఆకాంక్ష వారికి జనించెను.

తోడనే వారు తమ సంకల్పము నెరవేర్చుటకు ఏమేమి ప్రయత్నములు సలుపవలయునో పరస్పరము ఆలోచించుకొని ఒకానొక శుభముహూర్తమున యాత్రను ఉపక్రమించుటకు నిర్ణయించుకొని అందులకు వలసిన దారిబత్తెమును, ఇతర

సామగ్రిని సిద్ధము చేసికొనిరి. సరిగా ముహూర్తపువేళ వారు
తమయాత్రను ప్రారంభించిరి. పాదచారులై పోవుటకే నిశ్చ
యించుకొనిరి. త్రోవలో అనేక గ్రామములను దాటుకొని
పోవుచు, సుందరములైన ప్రకృతిదృశ్యములను వీక్షించుచు
పరమానందభరితులై లక్ష్యమును ఏవిధముగనైనను నెఱవేర్చు
కొనవలెనను స్థిరసంకల్పముతో చనుచుండిరి.

ఇట్లుండ త్రోవలో ఒకానొక రమణీయమైన నగరము
వారికి తటస్థపడెను. సుందరపట్టణముగుండా వారు వెళ్లవలసి
వచ్చెను. పెక్కు భోగభాగ్యములతో తులతూగుచు, విలాస
వంతులగు స్త్రీ పురుషులతోగూడి, గగనచుంబిత ఆకాశ
హర్మ్యములచే పరివేష్టింపబడి, విందులతో వినోదములతో
సందడిగనొప్పుచు, పెక్కు ఆధునిక సాంకేతిక వైచిత్ర్యము
లతో తులతూగుచు ఆ నగరము చూపరులకు ఆహ్లాదమును
గొలుపుచుండెను. మిత్రులిరువురు ఆ నగర దేవేంద్రపురిని
ప్రవేశించి అచట వైభవములన్నిటిని పరికించుచు పోవుచుండ,
రెండవమిత్రుని మనస్సు ఆ భోగవిలాసములవైపు ఉరుకుచు
వానిని అనుభవించుటకు ఉబలాటపడుచుండెను. అతడు తన
యభీష్టమును తోడిమిత్రున కెఱింగించి "మిత్రమా! కొన్ని
రోజులు ఈ భోగనగరమునందుండి విషయసుఖముల ననుభవించి
తదుపరి యాత్రను కొనసాగించెదము. ఇట్టి అపూర్వ అవ
కాశము జీవితమున మరలలభించుట దుస్తరము" అని పలికెను.

మొదటిమిత్రుడు ఇందులకు అంగీకరింపక—'సోదరా! మన లక్ష్యమగు దైవికతీర్థయాత్రను మఱువరాదు. ఏ లక్ష్యమును సాధించుటకై ఇల్లు, వాకిలి విడిచి మనం వచ్చితిమో దానిని విస్మరించి దారిలో మఱియొకదానివైపు దృష్టిని మరలించుట భావ్యముకాదు. మఱియు ఈ ప్రాపంచికవైభవములు, ఈ భోగవిలాసములు మానవుని పవిత్రతను వమ్ముచేసి, పాప పంకిలమున అతనిని పడద్రోసి, దైవమునకు దూరునిగ జేయును. అవి అత్యంత ప్రమాదహేతువులు. ముముక్షువులు వానిని ఎన్నడును దరికిజేర్చరాదు, ఈ ప్రాపంచిక తళుకు బెళుకులకు మోసపోరాదు. ఒక్కక్షణమైనను ఇచట నిలువక త్వరితముగ దాటిపోయి పుణ్యక్షేత్రములను సందర్శించి మోక్షభాగుల మగుదము"—అని బోధించెను.

కాని ఆ వాక్యములు అపరిపక్వచిత్తుడగు రెండవవానికి బధిరశంఖారవముగ తోచెను. అతనికవి యేమియు నచ్చ లేదు. జన్మాంతర దుర్వాసనలు ఘనీభవించియుండుటచే అతనియందు పురాకృతములగు దుస్సంస్కారములు సమయము జూచి బాగుగ చెలరేగెను. వానినతడు అదుపున ఉంచలేక వానిని జయించలేక వానికి లోబడిపోయెను. తత్ఫలితముగ అతడు తన మిత్రునితో—'సోదరా! నీవు నామాటవిని ఈ యూరియందు కొద్దిరోజులు ఉండనిష్టములేక, నీవు నీదారిన పొమ్ము. నీవొక్కడివే తీర్థయాత్రలు చేసికొనుము. నాకు

ఆరైనా ఆరు నూరైనా నేనుమాత్రము ఈ చోటువిడచి ఇప్పుడే బయలుదేరను." అని ఖండితముగ చెప్పివైచెను. మిత్రుని యీ కఠోరవాక్యములను విని మొదటివాడు విధిలేక అతని వచటనే విడచివైచి తనదారిన తానుపోయెను. కాని ఊరుదాటి సమీపగ్రామమున కేగుతరి అతనిమనస్సు మిత్రుని సాహచర్యమును గోల్పోవుటవలన ఏమాత్రము తృప్తిలేక ఉత్సాహరహితముగనుండెను. అందుచే నతడు ఆ సమీప గ్రామమునందే తన యీ మిత్రుని రాకకొఱకై కొద్దిరోజులు నిరీక్షించుచు ఉండదలంచెను.

ఇక పట్టణమందు నిలిచిపోయిన రెండవమిత్రుడు భోగ వాసనాతత్పరుడై తనయొద్దనున్న ద్రవ్యమునంతను విందులకు, విలాసములకు, దురభ్యాసములకు ధారవోయుచు, మద్యమును సేవించుచు భోగప్రియులగు దుష్టుల సహవాసము చేయుచు పురవాసుల అంతరంగిక కక్షలతో సంబంధము పెట్టుకొనుచు అపుడపుడు దౌర్జన్యక్రియలకు కూడ ఒడిగట్టుచు నుండెను. ఇట్లుండ ఒకానొక అభియోగమునందు అతడు చిక్కుపడుటచే రక్షకభటు లాతనిని నిర్బంధించి న్యాయస్థానమున విచారణకు తీసికొనిపోయిరి. న్యాయమూర్తి విచారణసల్పి అతడు దోషి యని నిర్ణయించి ఉరిశిక్ష విధించెను. తీర్పు వినగనే మిత్రుడు ఖిన్నుడై, పూర్వము తన సహచరుడు కావించిన హితవును పెడచెవిని పెట్టినందులకు కానట్టి ఆపదలో చిక్కుకొనవలసి

వచ్చునదో తలంచుకొని పశ్చాత్తాపపడుచు అట్టి దుస్థితి తనకు సంభవించినందులకు లోలోన ఖేదమొందుచు తన మొదటి మిత్రునే తలంచుకొని వెక్కి-వెక్కి ఏడ్చుచుండెను.

ఇట్లుండ రెండవమిత్రుని ఉరితీయువార్త సమీప గ్రామమున వేచియున్న మొదటిమిత్రునకు కర్ణాకర్ణిగ తెలియవచ్చెను. అతడు చింతాపరవశుడై తన సహచరుని ఏవిధముగనైనను కాపాడదలంచి, పట్టణమునకు తిరిగివచ్చి నేరుగా రాజుగారియొద్దకు వెళ్లి 'రాజా! రేపటిదినము ఉదయము 10 గంటలకు నామిత్రుని ఉరితీయుదురు. కాని, నా ప్రార్థన ఏమనగా అతనిని విడిచిపెట్టి అతనికిబదులు నన్ను ఉరితీయుడు. కారణమేమనగా రేపు ఉదయము 10 గంటలవేళ చక్కని ముహూర్తసమయము. ఆ పవిత్రసమయమున ఎవరు ఉరితీయబడుదురో, వారు రాబోవుజన్మయందు భూమండలమునకంతటికిని ఏకచ్ఛత్రాధిపతియై విరాజిల్లుదురు. కాబట్టి అట్టి మహదవకాశము నాకొసంగుడు. నన్ను ఉరితీయుడు అతనిని విడిచిపెట్టుడు. అని వినయపూర్వకముగ ప్రార్థనచేయగా భూపాలుడు అంతయు చక్కగ పరిశీలించి, ఒక్కనిమిషమాగి మొదటిమిత్రునితో "నాయనా! అద్భుతమైన విషయమును బయటపెట్టితివి. నేనిపుడు ఒక చిన్నపట్టణమునకు మాత్రమే రాజుగానున్నాను. భూమండలాధిపత్యము నొందవలెనను కాంక్ష నాకు బహుకాలమునుండి తీవ్రముగనున్నది. కాబట్టి

ఆ ముహూర్తసమయమున నేను ఉరితీసికొందును. ఈ చక్కటి అవకాశమును నేనన్నటికిని జారవిడువను. మీరిద్దరు వెడలి పొండు" అని రాజు మొదటిమిత్రుని బంధనమునుండి విడుదల చేయించివైచెను. ఈ ప్రకారముగ ఆపత్తునుండి రెండవ మిత్రుని తప్పించి మొదటిమిత్రుడు ఆతనిని వెంటబెట్టుకొని తీర్థయాత్రకై బయలుదేరి వెళ్లెను.

ఈ ప్రకారముగ విషయ విలాసములు ప్రమాదహేతువులని సాధకులు గుర్తెరిగి, వాని వైపు తమ చిత్తమును ఏమాత్రము మరల్చక అట్టి ప్రాపంచిక విషయ భోగముల యెడల విరక్తికలిగి పరమాత్మయందే మనస్సును లగ్నము చేసి జీవితమును సఫలమొనర్చుకొందురుగాక!

**నీతి :— విషయభోగములవెంట పరుగిడరాదు. అవి ప్రమాదహేతువులు. వానినుండి ఇంద్రియములను మరల్చి ఆత్మోన్ముఖుడు కావలెను.**

0—0

49]

# క్రోధమును జయించు పద్ధతి

పూర్వకాలమున ఒకానొక సాయంసమయమున కృష్ణుడు బలరాముడు, సాత్యకి ముగ్గురును కలిసి వాహ్యాళికై ఊరు బయటకు వెళ్ళిరి. సుందరమైన ఉద్యానవనములను దాటి వారొక భీకరారణ్యమున ప్రవేశించిరి. వారు దానిలో కొంత దూరము పయనమగుటతో తవవుగా సూర్యాస్తమయము కాసాగెను. ప్రకాశము పూర్తిగ అంతరించి పలుదెసల అంధకారము వ్యాపించెను. అపుడు వారు మువ్వురును గాఢారణ్యములో చిక్కుకొనిపోయిరి. ముందుకు పోవుటకుగాని, వెనుకకు వచ్చుటకుగాని అవకాశము లేకుండెను. అపుడు వారందఱును ఆ అరణ్యములోనే ఒకానొకచోట ఆ రాత్రియంతయు గడపివేయుటకు నిశ్చయించుకొనిరి.

దట్టమగు అరణ్యమగుటచేతను, భయంకరమృగములు వసించు తావగుటచేతను రాత్రికాలమున ముగ్గురును పరుండి నిదురపోవుట భావ్యముకాదని తలంచి వారిలోవారు ఒక కట్టుబాటుచేసికొనిరి. ఒకొక్కరు కొద్దిసేపు మేలుకొను పట్లును, తక్కిన ఇద్దరు నిదురపోవునట్లును నిర్ణయించుకొనిరి. మేలుకొనుటలో మొట్టమొదటివంతు సాత్యకికి వచ్చెను. అనగా సాత్యకి మేలుకొనుటయు, కృష్ణ బలరాములు నిద్రపోవుటయు సంభవించెను. కృష్ణ బలరాములకు నిద్రాభంగము

కలుగకుండు నిమిత్తమై సాత్యకి నలువైపుల తిరిగి పహా
కాయుచుండెను. క్రూరమృగములనుగాని, మఱి దేనినిగ
వారి దరిదాపునకే రాకుండ జంతులంతయును కట్టుచేసికొని బహు
జాగరూకతతో అతడు నలుదెసల పరికించుచుండెను. ఆ
సమయమున దూరమునుండి ఒక భయంకరాకృతి
రాక్షసుడు వారల సమీపమునకు వచ్చుచుండుటను గమనిం
సాత్యకి వాని నెదుర్కొనెను. అపుడు ఇరువురికిని భీష
సంగ్రామము ఆరంభించెను. రాక్షసునిపై సాత్యకికి ఎంతెం
క్రోధము జనించుచుండెనో రాక్షసుని శరీరము అంతంత వృ
ద్ధియగుచుండెను. కొంతసేపటికి ఆ నిశాచరుడు పర్వతాకారు
డాగా సాత్యకి వాని ధాటికి తట్టుకొనలేకపోయెను. పర్య
వసానముగా రాక్షసుని చెంత సాత్యకి ఒక పురుగంత ఆకారమ
కలిగియున్నట్లాయెను. రాక్షసుడు సాత్యకిని లాగి అవ
తారవైచి తనద్వారి తాను పోయెను. ఆ త్రుటి సాత్యకి శరీ
రమునకు చిన్న గాయము తగిలెను.

ఇట్లింత సాత్యకియొక్క పహారా సమయము పూ
ర్తికాగా అతడు వెళ్లి బలరామునిలేపి రక్షణబాధ్యత అతని
కప్పచెప్పి తాను పరుండెను. బలరాముని పర్యవేక్షణ సమయ
మునకూడ ఆ రాక్షసుడు తారసిల్లెను. వెంటనే బలరాముడు
వానితో పోరునకు తలపడి అతనిని పరాజితునిచేయు సమకట్టెను
కాని ఎపుడెపుడు బలరాముడు క్రోధభావమును వహింప

చేయుచుండెను, అప్పుడప్పుడా రాక్షసుడు ద్విగుణీకృతబలశాలియై వృద్ధినొందిన ఆకారము గలవాడై వర్తించుచుండెను. బలరాముడు క్రోధమును వహించినకొలది రాక్షసుని ఆకారము పరివర్తనము కాజొచ్చెను. అంతట భీకరాకారుడగు ఆ దైత్యుడు బలరాముని పక్కకు ఊచివైచి తనదారిని తాను పోయెను. ఈ సంఘటనలో బలరాముని శరీరమునకు ఒకింత గాయము తగిలెను.

రాక్షసుడు తొలగిపోయినపిదప బలరాముడు కృష్ణుని నిదురలేపి "కృష్ణా! ఇక నీవంతు వచ్చినది. లేచి పహారా కాయుము" అని పలికి తాను నిదురపోయి రక్షణబాధ్యత కృష్ణునకు ఒప్పగించెను. బలరామ సాత్యకులకు నిద్రాభంగము కలుగకుండుటకును, మరియు భీకర వనమృగముల బారినుండి వారిని సంరక్షించుటకును కృష్ణుడు దత్తచిత్తుడై బహుజాగరూకతతో పహారా కాయుచుండెను. మరల ఆ రాక్షసుడు యథాప్రకారము ఏతెంచి ఉగ్రశరీరుడై కృష్ణునితో యుద్ధమునకు తలపడగా కృష్ణుడు మందహాసవదనుడై అతని నెదుర్కొనెను. రాక్షసుడెంతెంత క్రోధమును వ్యక్తపరచుచుండెనో, కృష్ణుడు అంతంత శాంతమును వహించుచు హర్షాతిశయముతో కూడి పోరు సల్పుచుండెను. కృష్ణభావముచే కొలది సమయములోనే రాక్షసుని శరీరము కృశించిపోయెను. అది చిన్నదై ఆవగింజంత అయ్యెను. అణురూపమునకు మారిన ఆ రాక్షసుని

కృష్ణుడు తన వస్త్రపు చెంగున ముడివైచుకొని బలరామ సాత్యకిలు పరున్న తావునకు వెడలెను. అప్పటికి ఉషఃకాలము సమీపించుచుండెను. ప్రభాతసమయము కావొచ్చుటచే లేచిన ఇరువురును నిద్రలేచిరి.

అత్తరి కృష్ణ బలరామ, సాత్యకులు ఒకచోట కూర్చొని రాత్రి పహారాసమయమునాటి వారివారి అనుభవములనుగూర్చి సావకాశముగ మాట్లాడకొచ్చిరి.

సాత్యకి తాను మేలుకొనియున్న సమయమున భీమకాకారుడగు రాక్షసుడొకడు వచ్చెననియు, వానినిజూచి క్రుద్ధుడై అతనితో యుద్ధమొనర్చుట కుపక్రమింపగా క్రమక్రమముగ అతని శరీరము వృద్ధికావొచ్చెనని వచించెను. బలరాముడున్ను అట్లె వచించెను. అపుడు కృష్ణుడు తన వస్త్రపుచెంగున ముడివేసియున్న అణుమాత్రుడగు రాక్షసునిజూపి, ఓ అన్న గారూ! ఓ సాత్యకీ! మీరు యుద్ధముచేసిన రాక్షసు డితడే. ఇతడు మూర్తిభవించిన క్రోధము. అనగా క్రోధమను అసురగుణము ఒక ఆకారమును ధరించి మనయెదుట ప్రత్యక్షమైనది. దానితో యుద్ధముచేయునపుడు మనము క్రోధమును వహించినచో ఆ రాక్షసునకు ఆహారము నొసంగినట్లగును. అపుడు వాని ఆకారము పెరిగిపోవును. మనము క్రోధమును వహించనిచో అతడు ఆహారములేక బక్కచిక్కిపోయి కృశిం

చును. మీరు వానితో యుద్ధము చేయునపుడు మీరు క్రోధా విష్టులై యున్నకారణమున క్రోధమను ఆహారము మీనుండి వానికి లభించుటచే అతని శరీరము బలపడిపోయెను. నేను వానితో యుద్ధము చేయునపుడు నవ్వుచు, హాస్యముతో గూడి యుండుటవలన, క్రోధమును జూపకపోవుటవలన క్రోధమను ఆహారము నానుండి అతనికి లభింపమి, అతడు కృశించి కృశించి అతి సూక్ష్మశరీరుడై పోయెను. ఇదిగో చూడుడు! ఈతడే ఆ రాక్షసుడు. ఇతడు మూర్తీభవించిన క్రోధము దుర్గుణము. ఆ సంగతిని తెలిసికొంటిని కాబట్టియే నేను బహుజాగరూకుడనై క్రోధమును దరిదాపునకు రానీయక యుంటిని. తత్ఫలితముగ అతడు కృశించి కృశించి అల్ప శరీరుడై పోయెను. బలరామసాత్యకులు జరిగిన సంఘటనను జూచి ఆశ్చర్యచకితులైరి. తదుపరి వారు ముమ్వురును ఆ యరణ్యమును దాటి నిజపుంటున కరిగిరి.

ఈ సంఘటనద్వారా క్రోధమును జయించుటకు చక్కటి ఉపాయమును శ్రీకృష్ణుడు లోకమునకు చాటినవాడాయెను. ఎప్పుడెప్పుడు ఎదుటవాడు క్రోధమును ప్రకటించునో అపుడు తద్విరుద్ధమగు శాంతగుణమును మానవుడు కలిగియున్నచో, ఆనందమును ప్రకటించునో, అక్రోధమును గలిగియుండునో అపుడు ఎదుటవాడు సిగ్గుపడి తనకోపమును తగ్గించుకొనగలడు. లేక, పూర్తిగ పోగొట్టుకొనగలడు.

# సుక్షేత్రము

ఒక గ్రామములో ఒక రైతు కలడు. అతనికి ఒక ఎకరము ద్రాక్షతోట కలదు. అదియే వాని కుటుంబమునకు జీవనాధారము. ఆ తోటలో పండునట్టి ద్రాక్షను పట్టణమునకు ఎగుమతి చేసి దానివలన లభించు ద్రవ్యముతో అతడు తన కుటుంబపోషణము చేసికొనుచుండెను. ఇట్లుండగ ఒకనాడు ఆ గ్రామములోని వారికి కొన్ని కక్ష్యలేర్పడి, వారిలోవారు రెండు పార్టీలుగా చీలిపోయి, పరస్పరము కొట్లాడుకొనసాగిరి. వారి వైమనస్యములు క్రమక్రమముగా ముదిరిపోగా, మనస్పర్థలెక్కువై చివరకు ఇరువర్గములవారు ఒకరినొకరు తిట్టుకొనుచు, కొట్టుకొనుచు నుండిరి. మన రైతుకూడ ఆ దొమ్మీలో పాల్గొని అవలివర్గము వారిపై దౌర్జన్యమునకు గడంగెను. తత్ఫలితముగ పోలీసువారు అతనిని, మరికొందరిని అరెస్టుచేసి, మేజస్ట్రేటు కోర్టులో హాజరుపరచి ఛార్జిషీటు దాఖలుచేసిరి. మేజస్ట్రేటు వారందరిని విచారించి, ప్రతియొక్కరికి రెండేసి సంవత్సరముల కఠిన కారాగారవాస శిక్షను విధించెను.

తదనుసారముగ మన రైతు జైలులో నిర్బంధింపబడెగా అచట నానాబాధల ననుభవించుచుండెను. ఇంటివద్ద కుటుంబ పోషణము ఒక సమస్య అయి కూర్చుండెను. భార్య, బిడ్డలు

దుఃఖభారముతో కు్రంగి, కృశించి పోవుచుండిరి. ఇట్లుండ ఒకనాడు రైతుభార్య జైలు నందున్న తన భర్తకు ఈ ప్రకారముగ ఉత్తరము వ్రాసెను— ఏమండీ! ఈ ప్రకారముగ, మీరు జైలునందు కాలక్షేపము చేయుచుండినచో నా కెట్టి గతి యేమి కాగలదు? బిడ్డలను పోషించుట ఎట్లు? దినమొక యుగముగ గడచుచున్నది. బాగుగ అక్కరకు వచ్చిన ద్రాక్షతోట త్రవ్వటము లేనందువలన ఎండిపోవు చున్నది. ఈ సమయములో ఒకసారి తోట అంతయు లోతుగ త్రవ్వి నీళ్లుకట్టినచో ద్రాక్షపంట పుష్కలముగ లభించగలదు. తద్ద్వారా కుటుంబపోషణము చక్కగ జరుగగలదు. కాబట్టి ఇందులకేదైన ఉపాయమును ఆలోచించవలసినది వెంటనే ప్రత్యుత్తరము వ్రాయగోరుచున్నాను.

భార్యయొద్ద నుండి ఈ ప్రకారముగ వర్తమానము చేరగనే రైతు తత్క్షణమే జైలునుండి ఈ క్రింది విధముగ జవాబు వ్రాసి పంపెను. "అర్ధాంగీ! ద్రాక్షతోట త్రవ్వకము విషయమై నీవేమియు కలవరపడవద్దు. ఆ తోటలో ఒకానొక చోట బంగారపు పాత్రను నేలలో దాచియుంచినాను. దానిని త్రవ్వి వెలికితీసి అమ్ముకొని ఆ డబ్బుతో ద్రాక్షతోటను బాగుచేయుము. పని తీరిపోవును. ఆలస్యము చేయవలదు".

సామాన్యముగ జైలులో దొంగలువ్రాయు ఉత్తరముల న్నిటిని అధికారులు పర్యవేక్షించి (సెన్సారుచేసి) పంపుచుండెదరు. ప్రత్యేకమైన

వాటినే పోస్టులో వేయుదురు. రైతు ఇంటికి వ్రాసిన ఉత్తరమును జైలు అధికారులు చదువగనే, అతడెక్కడనో ఆ బంగారపు చెంబును అపహరించి యుండవచ్చునని భావించి, వారే స్వయముగ పదిమంది కూలీలను వెంటబెట్టుకొని పోయి రైతుయొక్క ద్రాక్షతోట నంతను అడుగులోతు బాగుగ త్రవ్వించిరి. కాని బంగారుపాత్ర దొరకనందున హతాశులై తిరిగి వెళ్ళిపోయిరి. ఏది యెట్లున్నను రైతుయొక్క ద్రాక్షతోట జైలు అధికారులు త్రవ్వకమువలన ఆ సంవత్సరము విరగకాసెను. పుష్కలముగు పంట లభించెను. తత్ఫలితముగ రైతు కుటుంబమునకు ఏకొరతయు లేక చక్కగ గడిచి పోయెను.

పొలమునుగాని, తోటనుగాని ఎంతెంత చక్కగ దున్నెదరో, అంతంత అధికఫలితమును రైతులు అనుభవింపగలరు. అట్లే హృదయక్షేత్రమును చక్కగ పరిశోధించి (దున్ని) దానియందుగల దుస్సంస్కారములు, దుర్వాసనలు, దురభ్యాసములు, దుర్వృత్తులు మొదలైన కలుపుమొక్కలను ఊడబెరికి, నిర్మూలించి, సుక్షేత్రముగ మార్చుకొనినపుడే జ్ఞానబీజము చక్కగ మొలకెత్తి మోక్షరూప ఫలమును కలుగజేయగలదు. కాబట్టి ముముక్షువులెల్లరు తమ అభ్యాసముచే హృదయములను సుక్షేత్రములుగ పరిణత మొనర్చుకొని జ్ఞాన

బీజములను తొన్నగ పోషించి ఆత్మసాక్షాత్కార మను పంటను అనుభవించుదురు గాక!

నీతి :— వేలను బాగుగ దున్నినచో పైరు పంటలు చక్కగ పండునట్లు, హృదయక్షేత్రమును పద్గుణ వంతముగ నొనర్చినచో మోక్షమను ఫలము చేకూర గలదు.

## పాపపు ప్రాబల్యము

పూర్వము మందారపర్వతముయొక్క ఒకానొక చరియ యందు భృగుమహర్షి ధ్యాననిష్ఠుడైయుండ, అతని కుమారు డగు శుక్రుడు తండ్రిని సేవించుచు నుండెను. భృగుతనయు డగు ఆ శుక్రుడు ఒకనాడు ఏకాంతస్థలమున విహరించుచుండ ఆకాశమార్గమున జనుచున్న ఒకానొక అప్సరసను అతడు వీక్షించుట సంభవించెను. రూపలావణ్యములతో ఒప్పారు ఆ యువతిని గాంచుటతోడనే శుక్రునకు మనస్సు చలించెను. అత్తరి యతడు నేత్రములు మూసికొని అచ్చోట కూర్చొని ఆ యప్సరసయొక్క రూపమును మనంబున చింతన చేయసాగెను. తండ్రి చిన్మయమగు పరమాత్మను ధ్యానించు

చుండ, కుమారుడు రక్తమాంసమయమగు లలనామణిని
తదేకనిష్ఠతో ధ్యానించుచుండెను. ఇట్లు కొంతకాలము
గడువగా శుక్రుని దేహము గాలికి, ఎండకు శిథిలమై భూమిపై
బడి మృతినొందెను.

తదుపరి కొంతసేపటికి భృగుమహర్షి సమాధినిష్ఠనుండి
లేచి తనచుట్టు పరికింపగా సమీపమున క్రిందబడి మృతినొంది
యున్న తనయుని శరీరమును గాంచెను. 'అకాలముననే నా
పుత్రుని యముడేల గొనిపోయెను?' అని తలంచి భృగువు
యముని శపించుటకు ఉద్యుక్తుడు కాగా అంతట యమధర్మ
రాజు ప్రత్యక్షమై 'ఓ మునీంద్రా! నీపుత్రుని అకాలమరణ
మునకు నేను కారకుడను కాను. అతని కర్మయే కారణము
కాని మఱియెవరును కాదు. ఎవడు తనయొక్క జన్మార్జిత
వాసనలతో గూడుకొని ఏయే కర్మ నాచరించునో అతడు
ఆయా ఫలమును ఆ ప్రకారముగనే పొందుచుండును. ఇచట
మఱియొకని కర్తృత్వమేమియును లేదు. మీ కుమారుడు
ఒకానొక అప్సరసనుజూచి ఆమె రూపలావణ్యములచే
సమ్మోహితుడై తదేకనిష్ఠతో ఆమెను ధ్యానించుచు నుండ
అతని స్థూలశరీరము ఆహారాదులులేక శిథిలమై క్రిందబడి
మరణించెను. అత్తఱి అతని జీవుడు వివిధ జన్మలెత్తి తుద
కిపుడు ఈ భూలోకముననే జన్మించి, తపస్వియై సమంగా
నదీతటమున తపంబు సలుపుచున్నాడు.' అని వచించెను.

ఆ వాక్యమునువిని భృగుమహర్షి జరిగిన వృ
గ్రహించి యమునితో సహా సమంగా నదీ
చేయుచున్న పుత్రుని కడకేగి అతనిని తోడ్కొ
వచురాగా, అంతట శుక్రుడు శిథిలమై పడిఉ
దేహమును జూచి ఈ విధారముగ వైరా
భావోద్రేకమును వెల్లడించెను—

'ఏ శరీరము పూర్వము ఎందరిచేతన
పాలింపబడినదో అదియే యిపుడు సర్పకళ్ళ
లచే ఛిద్రితమై మట్టిలో దొర్లాడుచున్నది. ఏ
హారములు పూర్వము వ్రేలాడుచుండెనో,
చీమలు ప్రాకుచున్నవి. కరగిన బంగారవ
మానమైనట్టి ఆనా శరీరము ఇపుడు క్రుళ్లి
పడియున్నది. శుక్రుడిట్లు వలుకుచుండ యా
నితో మహాశయా! నీవు నీయా పూర్వశ
ఇంకను కొంతకాలము తపంబొనరించి తదుపరి
అసురులయొక్క గురుత్వమును వహించవలె
కాబట్టి ఈ నూతన దేహమునువదలి పాతశరీ
చుము, అని పలుక, అత్తఱి భృగు వు మం
తీర్థమును ఆ శిథిలదేహముపై సంప్రోక్షింప
విలసితముగు దివ్యస్వరూపముగ రూపొంద,
నూతనదేహమును పరిత్యజించి దానియందు

అంతట యమధర్మరాజు అంతర్ధాన మొంద ఆ భృగుశుక్రు లిరువురును ఆ వనస్థలియందు దైవచింతనాపరులై ప్రశాంతముగ కాలము గడుపదొడంగిరి.

మహా తపస్సంపన్నుడై భృగుమహర్షి యొక్క తనయుడై నప్పటికిని జన్మార్జిత వాసనలు మొదట శుక్రుని పెడత్రోవ పట్టించినవి. తరువాత కొంతకాలమున కాతడు జాగరూకుడై చిత్తమును సుస్థిరమొనర్చుకొని సదాచారయుతుడయ్యెను. కావున అజాగ్రతగ నున్నచో మనస్సు, ఇంద్రియములు ప్రాకృతవాసనాబలముచే జీవుని అధఃపతనమునకు గొనిపోగలవు. కావున ముముక్షువగువాడు బహుజాగరూకుడై తన దేహేంద్రియ మనంబులను అదుపులో నుంచుకొని, తత్త్వవిచారణచే తనయందలి దుర్వాసనలను పారద్రోలి, హృదయమును నిష్కంటకముగ నొనర్చుకొనవలెను. అపుడు మాత్రమే ఈ సంసార దుఃఖరూప శృంఖలమును విచ్ఛిన్నమొనర్చి పరమశాంతిని, పరమానందమును జీవుడు అనుభవింపగల్గును.

**నీతి :— జన్మాంతర వాసనలు, దుస్సంస్కారములు జీవుని ఆధ్యాత్మికాభివృద్ధికి ప్రబలశత్రువులు. కావున ప్రయత్నపూర్వకముగ వానిని తొలగించివేయవలెను.**

# పరులను తనవలె వీక్షించవలెను

పూర్వకాలమున ధనవంతుడగు ఒకానొక వర్తకుడు కలడు. అతనికి చాల ఆస్తికలదు. ఇరువురు కొమారులున్ను కలరు. కొంతకాలమున కాతడు వృద్ధుడై మరణింప, అతనికి గల ఇరువురు కుమారులు తండ్రిఆస్తిని సరిసమానముగ పంచుకొనుటకు నిశ్చయించి. ఒకనాడు సామానులన్నియు విభజించుచుండిరి. రెండు ఇండ్లు ఉండగా చెరియొక ఇల్లు తీసికొనిరి. రెండుబీరువాలుండగా చెరియొకబీరువా తీసికొనిరి రెండు రోళ్ళుఉండగా చెరియొక రోలు పంచుకొనిరి. కాని రోకలిమాత్రము ఒక్కటే ఉండెనట. అక్కడే పేచీ వచ్చిపడినది. అది ఎవరికి పోవలెననునది తేలలేదు. ఎవరికివారు మాకుకావలెన్ను, మాకుకావలెను అనుచుండిరి. మధ్యవర్తులు వచ్చిరి. ఎంతయో నచ్చచెప్పిరి. కాని ఆ మహావస్తువును వదలుకొనుట కెవడును అంగీకరింపలేదు. తుదకు విధిలేక ఆ రోకలిని రెండుగాత్రుంచి చెరియొకసగము ఇచ్చుటకు మధ్యస్థులు తీర్మానించిరి. కాని అక్కడకూడ మరియొక ధర్మ సమస్య ఉదయించినది. రోకలి పైభాగ మెవరికిపోవలెను, క్రిందిభాగ మెవరికిపోవలెను అని. క్రిందిభాగవు రోకలికి పొన్ను ఉన్నది. కావున 'పొన్నుఉండే సగము నాకుకావలెను'—అని ఆ సోదరులిరువురు స్పర్థయొనర్చుకొన దొడగిరి.

పుడు సమీపమున ఒక గొప్ప న్యాయవాదియుండెను.

అతనికి 100/-రు ఫీజు ఇచ్చి పిలిపించుకొనిరి. అతడువచ్చి పరిస్థితిని సాకల్యముగ జీర్ణముచేసికొని ఈ క్రిందివిధముగ తీర్పునిచ్చెను. 'సోదరులారా! తొందరపడకుడు — ఇరువురకు న్యాయము కలుగగలదు. ఈ కోకలిని అడ్డముగా గాక, నిలువుగా రెండుబ్రద్దలుచేసి చీల్చివైచినచో పొన్నలో సగము ఒకరికి, సగము మరియొకరికి సరిసమానముగ రాగలవు. కావున ఆ ప్రకారముగ చేయవలసినది. పేచీఉండదు. మీ వైమనస్యము శమించుటకిదియొకటియే మార్గము! అని చెప్పి వెడలిపోయెను. వారట్లుచేసి సంతుష్టిపడిరి. కాని రెండుగా నిలువున చీల్చుటవలన ఆ కోకలి యెవరికిని ఉపయోగపడలేదు. సోదరత్వముయొక్క ఆధునిక వికటస్వరూపమెట్టిదో మచ్చుకిచట తెలుపబడినది. దైనందినజీవితమునందిట్టిఘటనలు లోకములో నెన్నియో జరుగుచున్నవి. సోదరులు పరస్పరమెంత ఆప్యాయముగనున్నను, ఒకరికి మరియొకరు వేఱుగ నున్నవారేకదా! అందుచేత "ద్వితీయాద్వై భయం భవతి"—అనునట్లు తనకంటె వేఱుగ నున్నవానిపై పరిపూర్ణముగు (100%) ప్రేమ యంకురించుట చాలఅరుదు. ఏదియో భయాదులు మధ్య అడ్డుపడి పీడించును. కావునసోదరత్వమును దాటి ఒకమెట్టు పైకిపోయి "ఆత్మవత్స్యేవ" — 'నీవలె ఇతరులను చూచుకొనుము' — అను మహోన్నత ధర్మమును ఆచరణయందుంచుకొనుట శ్రేయస్కరము.

నీతి :— సుఖదుఃఖాలందు మనుజుడు తనవలె ఇతరులను చూచుకొనుచు పరులకు చేతనైనంత సహాయము చేయుచుండవలెను.

# దుర్గుణ బహిష్కారవం

ఒకానొక గ్రామము వెలుపల ఒక చెరువు కలదు. కమల పుష్పములచే శోభాయమానముగ నున్నదై అది చూపరులకు కన్నులపండువుగా నుండెను. బాలభానుడు అప్పుడే ఉదయించుచుండెను. దినకరుని లేతకిరణములచే లోకమున తమస్సు విచ్ఛిన్నము కాగా ప్రకాశము సర్వత్ర వ్యాపింప దొడగెను. అట్టి ప్రభాతసమయమున సదాచార సంప్రదాయ యుక్తుడగు ఒక బ్రాహ్మణోత్తముడు ఆ చెరువులో స్నానమాచరించి సూర్యున కర్ఘ్య మొసంగి తదుపరి ఆ చెరువుకట్టపై దర్భాసనము వైచుకొని, జపమాలను చేత ధరించి నిమీలిత నేత్రుడై ఉత్తరాభిముఖుడై మంత్రజపము చేయుచుండెను.

అట్టి సమయమున చెరువులో ఒక మాల చాకలి వాడొకడు,విప్రునకు సమీపముగ బట్టలుఉతుకుకొనుచుండెను. ధ్యాననిష్ఠుడగు ఆ ద్విజుని కతడు చూడలేదు. పొరపాటున ఆ ఉతుకుచున్న వస్త్రములనుండి ఒక జలబిందువు ఎగిరి విప్రునిపై బడెను. వెంటనే యతడు జపధ్యానములను విరమించి రుద్రాకారుడై లేచి నిలబడి చెరువుక్రింద బట్టలు ఉతుకుచున్న చాకలివానిని గాంచెను. తోడనే క్రోధాగ్ని రగుల్కొనెను. కారుచిచ్చువలె అది హృదయసీమ యం

దంతటను వ్యాపింప దొడగెను. ఉద్రిక్తభావముచే యతడు ఒడలు మఱచినవాడై కైపులో తానెవరో, ఎదుటివాడెవడో తెలియని పరిస్థితికి దిగజారి పోయెను. ఆ స్థితి నతడు చెరువు కట్టపై నుండి క్రిందకు దిగి చాకలిని సమీపించి తన పై మురికినీరు చల్లినందులకు అతనిని కోపగించి, దుయ్యబట్టి నానా దుర్భాషణములాడి, పరుషవాక్యములు పలికి పలువిధముల దుమ్మెత్తిపోసెను. అంతటితో ఆగక పరమ క్రోధావిష్టుడై ఆ చాకలి వీపుపై రెండు దెబ్బలు కొట్టెను. చాకలి మారు పలుకలేదు. ప్రతీకారము సలుపలేదు. ప్రశాంతచిత్తుడై యుండెను. చాకలి వీపును ఛిదరపెట్టిన తరువాత ఆ విప్రుడు 'అయ్యో! చాకలివానిని తాకివైచితినే! నేనెవరు, అతడెవరు! నా కులమేమి, అతని కులమేమి! రామరామ! ఎంత పొరపాటు జరిగినది! అప్పుడు నా శరీరము, నా పవిత్రశరీరము నాశనమై పోయినదే! అపవిత్రమై పోయినదే!' అని పశ్చాత్తాపపడుచు మార్గాంతరము లేక, తాను మైల పడితినని భావించుచు, ఆ మైలను పోగొట్టుకొనుటకై దూరముగా పోయి ఆ చెరువులో ఒక మూల స్నానము చేయ దొడగెను. చాకలియు వేఱొక చోట స్నానమునకు ఉపక్రమించెను. చాకలి స్నానము చేయుట చూడగా ద్విజుని చిత్తమున సంభ్రమాశ్చర్యములు రేకెత్తినవి. అతడు తన మనంబున ఇట్లు తలపోసెను—"చాకలిని తాకినందువలన నేను స్నానము చేయుట న్యాయముగా

నున్నది. మఱి ఆ చాకలి ఎందులకు స్నానము చేయుచున్నాడు?
దీనికి కారణమేమియో అరయుట ఉత్తమము అని తలంచి
వెంటనే విప్రవర్యుడు రజకుని చెంతకు వెళ్ళి "ఓయీ! నిన్ను
తాకినందువలన నేను స్నానము చేయుట న్యాయము. మఱి నీ
వెందులకు స్నానము చేయుచున్నావు? అని తలబిరుసుగా
ప్రశ్నింప ఆ రజకుడు ప్రశాంతచిత్తుడై నవ్వుచు "అయ్యా!
నిన్ను తాకినందు వలన నేను స్నానము చేయుచున్నాను అని
ప్రత్యుత్తర మిచ్చెను. అది విని భూసురుడు ఇదెక్కడి న్యాయ
మురా? నేను బ్రాహ్మణుడను, నీవు అబ్రాహ్మణుడవు. నిన్ను
స్పృశించినందువలన నేను స్నానము చేయుట సహేతుకము.
మఱి నీ స్నానముయొక్క ఆంతర్యము మేమి? అని పలుకగా
రజకు డిట్లు చక్కని సమాధాన మొసంగెను —

ఓ విప్రవర్యా! మీ దేహము బ్రాహ్మణదేహము.
పవిత్రమైనది. నేను దానిని గౌరవించెదను. కాని మీ
శరీరములోపల కోపమను చండాలుడు ప్రవేశించినాడు. అత
నిని స్పృశించినందువలన నేను అపవిత్రుడనై పోయితిని.
అందుచేత స్నానము చేయవలసి వచ్చినది. రజకుని యీ
గంభీర వాక్యములు కర్ణపుటములందు బడగనే విప్రునకు
జ్ఞానోదయమయ్యెను. తన పొరపాటు నతడు గమనించి
పరితప్త హృదయుడయ్యెను. 'అయ్యో! అనవసరముగ
నోరు పారవేసికొంటినే. పాపమా రజకుడు కట్టపైనున్న

నన్ను చూడలేదు. పొరపాటున ఒక్కచుక్క నీరు పడినది. అంతమాత్రముచేతనే నేను నా శాంతమును వీడవచ్చునా? నా సద్గుణములకు భరతవాక్యము పలుకవచ్చునా? అన్యాయము! రజకుడు చెప్పినది పరమసత్యము. అతని వాక్యములచే నాకు కనువిప్పు కలిగినది. కోపము చావనిదే ఎన్ని శాస్త్రములను చదివిన నేమి ఫలము? ఎన్ని కోట్లు జపములు సల్పిన నేమి లాభము? లోని అసూయ తొలగనిదే, లోని ద్వేషము అంతరించనిదే ఈ పైపై చేష్టలవలన ఏమి ఉపయోగము? చిత్తశుద్ధిలేని శివపూజలవలన ప్రయోజనముండునా? నేను పుట్టను కొట్టుచున్నాను. పాములు చావలేదు. శరీరమును విభూతిరేఖలచే అలంకరించుకొనుచున్నాను. మడిబట్టలచే పవిత్రముగ గావించుకొనుచున్నాను. కాని అంతరంగమున కామక్రోధాది చండాలురు విజృంభించుచున్నారు. వారిని తొలగింపనిదే, వారికి ఉద్వాసన ఒనర్పనిదే, వారికి శీఘ్రముగ తిలాంజలి నొసగనిదే ఈ శరీరము ఎంత పవిత్రముగ నున్నప్పటికిని అపవిత్రమైనదే యగును. ఇకమీదట ఈ పొరపాటు జరుగనీయను. ఈ దుర్గుణరాశిని హృదయకోశమున రావణకాష్ఠమువలె రగుల్కొననీయను. దానిని ప్రయత్నపూర్వకముగ దూరీకృత మొనర్చి బాహ్యశుద్ధితోపాటు అంతశ్శుద్ధిని కూడ సంపాదించుకొందును అని నిర్ణయము గావించుకొని అచ్చోటు వీడి చనెను.

కావున ముముక్షువులగువారు తమ హృదయాంత
రాళములో నిగూఢముగ దాగియున్న క్రోధాది పరమశత్రువు
లను, దుర్మార్గులను, చండాలురను, వివేకముచే, విచారణచే
వెదికి వెదికి పట్టుకొని దేహగేహమునుండి వారిని బహిష్క-
రించవలెను. మోక్షమునకిదియే రాజబాట.

**నీతి :- క్రోధము మొదలగు దుర్గుణములు
అతినీచములైనవి. వానికి హృదయములో తా
వొసంగరాదు. వాని అస్తిత్వముచే జీవుడు అధోగతిని
బొందును. కాబట్టి హృదయమును లెస్సగ పరిశో
ధించి దుర్గుణములకు లవలేశమైనను తావొసంగకుండ
చూడవలెను.**



# రెట్టింపు యౌవనము

[ప్రపంచములో ప్రతి ప్రాణికిని ఒకే ఒక యౌవనముండును రెట్టింపు యౌవన మెవరికిని ఉండదు. ఒకే ఒక జన్మలో రెండు యౌవనముల ననుభవించు వాడెవడును ఉండడు. చతుర్ముఖుని సృష్టిలో ప్రతివానికిని "సింగిల్" యౌవనమేకాని "డబుల్" యౌవనము లేదు అయినను, యౌవనమును పునరావృత్తిచేసి ఒకే జన్మలో ఇంకొక యౌవనమును అనుభవించగలిగిన వ్యక్తి చరిత్రలో ఒకే ఒకడు కానంబడుచున్నాడు. అతడే యయాతి చక్రవర్తి. ఇపుడు విచారింపబోవునది అతని చరిత్రయే]

పూర్వకాలమున యయాతి అను చక్రవర్తి రాజ్యమును పరిపాలించుచుండెను. కొంతకాలమున కతనికి వార్ధక్యము దాపురించెను. ఇంద్రియములు దుర్బలములై, శక్తిహీనములై యుండుటవలన యయాతి ముదిమియందు భోగము లనుభవించలేకుండెను. లోన తృష్ణ విజృంభించుచుండెను. విషయవాంఛ తీవ్రముగా ప్రకోపించుచుండెను. భోగాభిలాష ఏమాత్రము పోవలేదు. కాని విషయ వినోదము లనుభవించుటకు ఇంద్రియములు శక్తివంతములుగ లేవు. ఈ పరిస్థితిని జూచి యయాతి దుఃఖాక్రాంతుడై దీర్ఘాలోచన చేసి శుక్రాచార్యునియొద్దకు పోయి ఇట్లు మొరపెట్టుకొనెను.

మహాత్మా! నాకు యౌవనము పూర్తిఅయిపోయినది. ముదిమి దాపురించినది. అంగములు నిర్వీర్యములై పోయినవి, కాని భోగాభిలాష చెక్కుచెదరకున్నది. విషయముల నను భవించవలెనను తీవ్రఆకాంక్ష చెలరేగుచున్నది. మీరు మహా తపసంపన్నులు. మీరు చేయలేని పని ప్రపంచమున ఏదియు నుండదు. కాబట్టి నాపై కృపాదృష్టి బరపి ఇంకొక్క యౌవనమును దయచేయుడు. అపుడు నా కిష్టమైన భోగములన్నిటిని తనివితీర అనుభవించివేయుదును. దయచేసి నా యీ వాంఛితము నెరవేర్చుడు. తమకు కోటి నమస్కారములు.

యయాతియొక్క మనోవేదనను గుర్తెరిగి శుక్రాచార్యు డిట్లు పలికెను—నాయనా! లోకములో ప్రతిప్రాణికిని ఒకే యౌవన ముండునుగాని రెండు ఉండవు అట్టిది అసాధ్యము. సృష్ట్యారంభముననే చతుర్ముఖుడు ప్రాణికోట్లకు ఒకే యౌవనమును గూర్చిన ఏర్పాటు గావించెను. అది అప్రతిహత నియమము. అనుల్లంఘనీయ సిద్ధాంతము. దాని నెవరును అన్యథా కావింపలేరు. ప్రతివారు తమ జీవితకాలములో ఒక్క యౌవ్వన మనుభవించగలరేకాని రెండు కాదు. బాల్యము. యౌవనము, వార్ధక్యము, మరణము, అను ఈ నాలుగున్నూ చక్రభ్రమణమువలె ఒకదానివెనుక ఒకటి క్రమబద్ధముగ వచ్చుచుండును. కావున ఇంకొక యౌవనము అసాధ్యము. అయినను నీ ఆవేదన గుర్తెరిగి నేనొక

ఏర్పాటు కావించెదను. ఎవరైనను తన యౌవనమును నీకిచ్చి నీ ముసలితనమును అతడు గైకొనుటకు సమ్మతించినచో ఆ మార్పునకు [ Mutual transfer కు ] నేను సంసిద్ధుడను. అట్టి పరస్పర వినిమయముకొరకై ఏర్పాటు చేసికొనుము.

శుక్రాచార్యుని కరుణాపూరిత వాక్యములను విని యయాతి పరమానందమునొంది ఆచార్యునకు ప్రణమిల్లి వెడలెను. తన యౌవనమును నాకెవరు ధారవోయగలరు అనియయాతి వితర్కించుకొనుచు కొందరు యువకులకొద్ద కేగి అయ్యా! మీలో ఎవరైన మీయౌవనమును నాకిచ్చి నా ముసలితనమును తీసికొందురా! అని ప్రశ్నింప ఒక్కడైనను ముందుకు రాలేదు. తన సంసిద్ధతను ఎవడును వెలిబుచ్చ లేదు. తదుపరి యయాతి లోకమంతయు తిరిగితిరిగి విసికి వేసారెను. కాని ఉద్దేశ్యము నెరవేరలేదు. ఏ యువకుడును యౌవనము ధారాదత్తము చేయుటకు ముందుకు రాలేదు. లోకములో దుఃఖము నెవరైన కొనితెచ్చుకొందురా? కాబట్టి యయాతి విఫలమనోరథుడై తుట్టతుదకు తన పెద్దకుమారుడగు యదువును సమీపించి నాయనా! నీ యౌవనమును నాకిచ్చి నా వార్థక్యమును గైకొందువా!' అని ప్రశ్నింప అది యే మాత్రము తనకు సమ్మతము కాదని కుండ బ్రద్దలుకొట్టినట్లు అతడు సమాధానము చెప్పివైచెను. అట్లే రెండవకుమారుడు మూడవ కుమారుడు, నాల్గవ కుమారుడుకూడ తండ్రి భావ

మును తిరస్కరించివైచిరి. ఐదవవాడగు పూరుడుమాత్రము అకుంఠిత పితృభక్తి కలవాడగుటవలన జనకుని మొర ఆలకించి అతని యభీష్టము నెరవేర్చుటకు తన సంసిద్ధతను వెల్లడించెను. తోడనే శుక్రాచార్యుని వరప్రభావమువలన పూరుని యౌవనము యయాతికి సంక్రమించెను. యయాతి వృద్ధాప్యము పూరునియందు ప్రవేశించెను.

ఇక యయాతి ఆనందమునకు మేరలేదు.అతని సంతోషమునకు పట్టపగ్గములు లేకుండెను. భోగములను ఎప్పుడు అనుభవింతునా యని కలవరించుచు ఎదురు చూచుచున్న అతడు తత్క్షణమే ఒకటి తరువాత నొకటిగా భోగపరంపరను అనుభవింపదొడగెను. కాని ఎంతకాల మనుభవింపగలడు ? ఈ ప్రపంచమే పరిణామశీలమైనది. ప్రతి వస్తువు నిముసనిముసమునకు మారుచుండును. బాల్యము ఎల్లకాలము బాల్యముగ నుండదు. యౌవనములోనికి మారుచుండును. అట్లే యవ్వన మెల్లకాలము యవ్వనముగ నుండదు. వార్ధక్యములోనికి మారుచుండును. కావున యయాతియొక్క యవ్వనము కాలక్రమమున క్షీణింపదొడగెను. వార్ధక్య చిహ్నము లాతనియందు గోచరింపసాగెను. రెండు యవ్వనములు పూర్తి కావచ్చుచున్నను అతనికి ఆశతగ్గలేదు. భోగాభిలాష అవగింజంతైనను శమించలేదు. తృష్ణ పకోశము నను తరగలేదు. పైపెచ్చు వృద్ధియగుచుండెను. అత్తటి

యతడు తన అనుభవమును లోకమున కీ ప్రకారముగ వెల్లడించెను.

న జాతు కామః కామానాముపభోగేన శామ్యతి
హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏవాభివర్ధతే

ఓ జనులారా! పరమసత్యమును చెప్పుచున్నాను వినుడు — 'కోరికలు అనుభవించినకొలది పెరుగుచేకాని తరగవు. నిప్పునందు నేయివేసినచో అగ్నిజ్వాల ద్విగుణీకృతముగ పెరుగునట్లు అనుభవించినకొలది కోరికలు పెరుగుచునే యుండును.

ఆహా! ఎంతటి గొప్పసిద్ధాంతమును యయాతి లోకమునకు చాటెను! విషయ భోగములను అనుభవించి వైచినచో తరిగిపోవునని కొందరు జనులు అపోహపడు చున్నారు. అది పట్టిభ్రమ. అట్లెన్నటికిని జరగదు. పైపెచ్చు అనుభవించినకొలది కోరికలు దినదినము పెరిగిపోవు చుండును. లోకములో రెండు యౌవనములను వరుసగా అనుభవించి, భోగజాలమందు మునిగితేలిన యయాతియొక్క వాక్యములు ముముక్షువులకు పరమప్రమాణము. కావున కోరికలను తగ్గించుకొని, భోగాభిలాషను పరిత్యజించి, తద్ద్వారా మిగిలిన సమయమును భగవద్ధ్యానమందు వినియోగించుచు జనులు తమజీవితమును పవిత్రవంతముగ నొనర్చుకొనవలయును.

నీతి :— విషయ భోగములను అనుభవించుచు పోయినచో అవి పెరుగునే కాని తరగవు. అవి పెరిగిన కొలది మనస్సు అశాంతినే పొందుచుండును. కావున వైరాగ్యముచే దృశ్య విషయముల గూర్చిన ఆశను అరికట్టి విషయవాంఛలను తొలగించుకొనవలెను. కాని, అనుభవించుట ద్వారా వానిని పెంచుకొనరాదు.

## దండధరుడు - దైవభక్తుడు

దండధరుడనగా యమధర్మరాజు. పూర్వము ఒకానొక భక్తుడు భగవద్ధ్యానమందు మిక్కుటమగు ఆసక్తి కలిగి ఏకాంతస్థలము నభిలషించినవాడై తన గ్రామమును వదిలి బహుదూరము పాదచారియై పోవుచుండ ఒకచోట చక్కని వనప్రదేశము, సమీపముననే నిర్మలజలముతో గూడి ప్రవహించుచున్న నది అతనికి దృగ్గోచరమైనవి. ధ్యానమునకు దైవచింతనకు అనువైన ప్రదేశము లభించెనుగదా యని అతడు పరమానందభరితుడై ఆ నదీతీరమున ఒక పర్ణశాలను నిర్మించుకొని, వనమందలి ఫలాదులను ఆహారముగ గైకొనుచు తపస్సు చేసికొనుచుండెను.

ఒకనాడాతని చిత్తఫలకమున అకస్మాత్తుగ ఒకఆలోచన పొడమెను. 'బొందితో వైకుంఠమునకు ఎవరును పోలేరా? ఈ శరీరముతోనే భగవంతుని ప్రత్యక్షముగ చూడలేరా? ఏమైనను సరియే ఆపనిని నేను సాధించితీరవలెను. అవునూ కానను ఆకార్యమును నేను వదలను. దానినెరవేర్చుటకు కంకణము కట్టుకొందును. ప్రయత్నశీలునకు, తీవ్ర అధ్యవసాయము కలవానికి లోబడనిదని ప్రపంచమున ఏదియు నుండదనెడు పెద్దలవాక్యము. కావున భగవంతుని ఈ శరీరముతోనే ప్రత్యక్షముగ గాంచుటకు యత్నించెదను' అని దృఢనిశ్చయము గావించుకొని, ఆకార్యమును సాధించుటకై అకుంఠిత దీక్షవహించి తపస్సున కుపక్రమించెను.

కొంతకాలము గడచినమీదట ఒకదినమున ఆ భక్తుడు తన నిత్యదైవకార్యక్రమమును పూర్తిచేసికొని ధ్యానమును విరమించి కన్నులను 'తెరచి' చూడగ కట్టెదుట ఒక బ్రహ్మాండాకారము కలిగిన వ్యక్తి చేత గదను ధరించి నిలబడి యుండుటను చూచెను. భక్తునకు ఆశ్చర్యము కలిగెను. 'ఈతడెవడు? ఇట్టి ఏకాంతస్థలమునకు ఏలవచ్చెను'? అని తనలో వితర్కించుకొని సంభ్రమచిత్తుడై కొంతసేపటికి తెప్పరించుకొని ధైర్యమును కూడకట్టుకొని "నీ వెవరవు?" అని భక్తుడు ఆగంతకుని ప్రశ్నించెను. వెంటనే ఆ పర్వతాకారుడగు వ్యక్తి ఓయీ "నేను యముడను. నీ ఆయుస్సు

తీరినది. కాబట్టి నీ ప్రాణములను అపహరించుకొని పోవుటకు వచ్చినాను. అని గంభీరముగ పలికెను. ఆ వాక్యములను విని భక్తుడు— 'మహాత్మా! అట్లేయగుగాక! కాని బహు కాలమునుండి నేనొక ఉద్దేశ్యముతో తపంబాచరించుచున్నాను. దానిని తాము నెరవేర్చగలరని నా నమ్మకము. శరీరముతో భగవంతుని సాక్షాత్తుగ దర్శింపవలెనని నాయభీష్టము. దయచేసి తామట్టివరమును నాకు ప్రసాదింప ప్రార్థన. మీవంటి మహనీయులకిది అలవికాని పనికాదు.' భక్తుని మొర యాలకించి దండధరుడు సంతసించినవాడై 'ఓయీ నీ తీవ్ర తపస్సునకు నేను మెచ్చినాను. నీ కోర్కెను నెరవేర్చెదను. నావెంట రమ్ము. ఇపుడే నీకు ఈ తనువుతో భగవద్దర్శనమును గావింపజేసెదను అని పలికెను.

వైవస్వతుని వాక్యములు భక్తుని కర్ణపుటములందు బడగనే అతడు అమందానందముచే ప్రఫుల్లహృదయుడై 'అట్లే తమవెంట వచ్చెదనని'చెప్పి యమధర్మరాజును అనుసరింప దొడగెను. యముడు గదను ధరించి ముందు చనుచుండ వెనుక భక్తుడు వినయవిధేయతలతో నడచుచుండెను. కొంత దూరమేగిన పిదప భక్తుడు యముని సంబోధించి 'మహాత్మా! తమచేతిలోని గదను చూచుచుండినకొలది నాగుండె బ్రద్దలగుచున్నది. భయకారణమున నా నడక తొట్రుపడుచున్నది

కాబట్టి దయచేసి ఆ గదను నాచేతికిచ్చినచో నేను నిర్భయ
ముగ తమవెంట వచ్చుటకు వీలుండును, అని పలికెను.
భక్తుని వింతధోరణిచూచి యముడు లోలోన నవ్వుకొని, ‘గద
అతనికిచ్చినచో వచ్చిన నష్టమేమి అని భావించుకొని గదను
భక్తునకొసంగి తాను ముందుపోవుచుండెను. భక్తుడు గదా
ధరుడై ఠీవిగ వెనుక వచ్చుచుండెను.

ఇంతలో వైకుంఠము సమీపించెను. యముడు
భక్తునితో ‘నాయనా! ఇది వైకుంఠము. నీవు పురములోప
లికి వెళ్ళి భగవంతుని సందర్శించుకొని త్వరితముగరమ్ము. నేను
బయట నీకొరకు కనిపెట్టుకొని ఉందును. జాగుచేయకుము,
అనిచెప్పి పంపెను. భక్తుడు అట్లే వైకుంఠపురములోనికి
ప్రవేశించి భగవంతుని దర్శించి అతని సన్నిధానముందే
కూర్చొనెను. దైవసాన్నిధ్య శ్రీని అనుభవించుచు
పరమానందమును బడయుచు అతడు బాహ్యజగత్తునే విస్మ
రించెను. ఈ ప్రకారముగ చాలసేపు గడచినది. భక్తుని
కొరకు వేచివేచి యమునకు విసుగెత్తి పోయినది. ఎంతసేపు
చూచినను భక్తుడు బయటకు రాడయ్యె. చివరకు యమధర్మ
రాజు తానే స్వయముగ లోనికేగి చూడ భక్తుడు దైవ
సన్నిధిలో నిశ్చలుడై కూర్చొని యుండెను. యముడాతనిని
సంజ్ఞ చేసి పిలిచెను. కాని భక్తుడు యముని వైపు ముఖమై
నను త్రిప్పక దైవసాన్నిధ్యజనిత అమందానంద సాగరమున

ప్రకాశించుచు నుండెను." ఇక లాభములేదనుకొని యముడు తెగించి లోనికేగి బయటకు రమ్మని సంబోధించెను. ఆ వాక్యమును విని భక్తుడు "మహాత్మా! ఇంతటి చక్కని వాతావరణమును విడిచి పెట్టి నేనెట్లు రాగలను? మందారమకరంద మాధుర్యమున్ గ్రోలు మధుపంబు దాని విడిచి పెట్టి సీంస స్థానములకు చనునా? అహా! ఈ వైకుంఠమున భగవత్సాన్నిధ్యమున ఎంతటి ఆనందము! నా జీవితము ధన్యమైనది. ఇట్టి స్థానమును విడిచిపెట్టుటకు నా మనస్సు ఒప్పుటలేదు. ఓ యమధర్మరాజుగారూ! క్షమించుడు! నేను శ్రీమన్నారాయణుని చరణసాన్నిధ్యమును విడిచి రాజాలను. తమరు దయచేయవచ్చును."

భక్తుని యావాక్యములను విని దండధరుడు ఆశ్చర్యచకితుడై భక్తుని తనవెంట పంపులాగున నేరులో భగవంతునితోనే మొరపెట్టుకొనెను. శ్రీమహావిష్ణువు యమునితో 'ఓ యమధర్మరాజా! నా లోకమునకు వచ్చి సాలోక్యమును బొందిన భక్తునకు ఇక మృత్యుభయముండదు! ఇతడిచటనే శాశ్వతానందము నొందుచుండును. కాబట్టి ఇక మీరు వెళ్ళవచ్చును.' అని పలుకగా యముడు గత్యంతరము లేక వెడలిపోయెను. కొంతదూరమేగిన పిదప గదమాట జ్ఞాపకమునకు వచ్చి వెనుకకు తిరిగి వెళ్లి యముడు భక్తునితో తన గద ఇచ్చివేయమని యడుగగా ఈ గద మీకిచ్చినచో అందవలసి

బాధించేవరు. కాబట్టి నేను ఇవ్వనిక ఇవ్వను అని శ్రీకృష్ణుడు పలికెను. అంతట విష్ణుభగవానుడు భక్తునకు హితవుచెప్పి ఆగదను దండధరునకు ఇప్పించి " ఓ యమధర్మరాజా ! ఇక మీదట ఎప్పుడును జనుల ప్రాణములు తీయుటకై మీరు వెడలు నపుడు వారికి కనిపించరాదు. అట్లు కనిపించినందు వలన గదా మీకిట్టి అవమానము తటస్థించినది ! అని యమునితో పలికెను. ఆ వాక్యములను విని యమధర్మరాజు వైకుంఠమును వీడి చనెను. అప్పటినుండియు దండధరుడు ఎవరికిని కనిపించకుండా వచ్చి ప్రాణములు పెకలించుకొని పోవుచుండెను.

**నీతి:– భగవంతుని ఆశ్రయించినవారికిమృత్యు భయముగాని, మఱి ఏలాటి ఇతర క్లేశములుగాని ఉండజాలవు.**

# కలిమియందియు దారిద్ర్యము

పూర్వకాలమున ఒకానొక గ్రామమున గొప్ప ధనికు డొకడు కలడు. అతనికి నూఱు యకరముల భూమియు, పెద్ద పెద్ద భవనములున్ను, పలువిధములైన ఆస్తిపాస్తులున్ను కలవు. ఆ పరిసరప్రాంతములోని శ్రీమంతులలో అతనిదే అగ్రతాంబూలము. ఏజన్మలోనో అతడు పెట్టిపుట్టినవాడు. అతని జీవితము ఏవిధమైన బాధలు, ఒడిదుడుకులు లేక సౌమ్యముగ గడచుచు వచ్చెను. కొంతకాలమున కతనికి వార్ధక్యము దాపురించెను. వృద్ధాప్యమువలన శరీరము శుష్కపర్ణమువలె సడలిపోయెను. అవయవము లన్నియు శిథిలములు కాజొచ్చెను. ముదిమియందు తా ననుభవించు యిడుములు చెప్పతరమా! అతనికి ఒకే ఒక కుమారుడు కలడు. అతడు పెద్దవాడై తండ్రికి సహాయభూతుడుగ నుండెను. కాని సహవాస దోషమువలన కొన్ని దురలవాట్లను కొనితెచ్చుకొనెను. త్రాగుడు మొదలైన దుర్వ్యసనములకు లోనై అతడు వంశప్రతిష్ఠను, కుటుంబ ప్రతిష్ఠను మట్టిపాలు చేయదొడగెను. చెమటకార్చి తండ్రి సంపాదించిన ద్రవ్యమునంతను క్రమక్రమముగ తనయుడు పాడుచేయుచుండెను. దుశ్శీలవంతునియొద్ద సంపద నిలచునా !

కొంతకాలమునకు తండ్రి ఈవిషయమును గమనించినవాడై కోపించిన తన యావదాస్తిని బంగారముగను ఆభరణ

ములుగను మార్పుదలచేసి దానినంతను ఒక బిందెయందుంచి ఒకనాటిరేయి ఇంటిలో అందరును గాఢనిద్రయందుండగా దొడ్డిలోనికి ప్రవేశించి ఒకచోట లోతైన గోయిత్రవ్వి ఆ బిందెను దానియందు పూడ్చిపెట్టెను.

ఈ సమాచారము ఇతరులెవ్వరికిని తెలియదు. కాలచక్రము రివ్వున తిరుగసాగెను. కొంతకాలమునకు వార్ధక్యదశయందున్న ఆ శ్రీమంతునకు రుగ్మత సంభవించెను. ఆరోగ్యము దిన దినము క్షీణింపదొడగెను. ఒకనాడు వ్యాధి తీవ్రస్వరూపము దాల్చగా ధనికుడు తనలో ఈ ప్రకారముగ వితర్కించు కొనెను-- 'నా శరీరము ఇక ఎక్కువకాలము జీవించదు. వ్యాధి తీవ్రమై కాయమును కూకటివ్రేళ్ళతో పడగొట్టుటకు సిద్ధముగానున్నది. నా ఆస్తియంతియు సువర్ణ రత్న వైఢూర్య రూపమున దొడ్డిలో దాచబడియున్నది. నాకు ఒకడే కుమారుడు. అతడే నా వారసుడు. నా ఆస్తియంతయు అతనికే దక్కును. దొడ్డిలోని బంగారపుబిందె విషయము అతనికి ముందుగనే తెలిపినచో దుశ్శీలత్వ కారణమున దానిని సర్వనాశనము చేసివేయగలడు. కనుకనే ఇంతదనుక దానిసమాచార మాతని చెవిలో పడకుండచేసితిని. ఇక నేనెక్కువ కాలము జీవించు అవకాశము లేదుకాబట్టియు, నా వారసుడు అతడొక్కడే కాబట్టియు నా ఆస్తివిషయమై అతనికి చెప్పక తప్పదు. రేపటి ఉదయము సూర్యోదయము కాగానే

కుమారుని నాయొద్దకు బిలిచి ఉన్నవిషయమంతయు సాకల్యముగ అతనికి తెలియజెప్పెదను. దొడ్డిలో దాచబడిన లక్షలాది రూప్యముల విలువగల సువర్ణకలశము యొక్క పోకిడి అతనికి ఎఱిఁగించెదను.'

ఈ ప్రకారముగ తనలో నిశ్చయముగావించుకొని ఆ వృద్ధుడు ఉషఃకాల మెప్పుడేతెంచునాయని నిరీక్షించుచు పరుండెను. కాని విధివైపరీత్యమేమో అర్ధరాత్రి దాటగనే ధనికునకు కఫవాతము తీవ్రప్రకోపముచే కంఠము నిరుద్ధమయ్యెను. నోటివెంట మాటరాకుండెను. తల గిఱ్ఱున తిరుగసాగెను. హృదయస్పందనము సన్నగిల్లెను. ప్రఖ్యాత వైద్యులెందఱో క్షణములో రప్పింపబడిరి. కాని వారి సపర్యలేవియు కలిసిరాలేదు. ఒక అఱగంటకాలములో శ్రీమంతుని ప్రాణపక్షి వెడలిపోయెను.

తండ్రి మరణించిన వెనుక అతని ఏకైకకుమారుడు తండ్రికి జరుపవలసిన ఔర్ధ్వదైహిక క్రియలను యథావిధి నిర్వహించెను. వారము దినములు గడచినమీదట ఇంటిలోని భోజనసామగ్రి యంతయు విలుప్తముకాగా ధనికుని కుమారుడు తినుటకు తిండిలేక కట్టుకొనుటకు బట్టలేక నానాయాతనలు పడుచుండెను. తండ్రి తనసంపద నంతను రొక్కముగా బంగారముగా మార్చి దొడ్డిలో దాచిపెట్టెను. కాని ఆ లక్షలు

ఎక్కడనున్నది తెలియనందున భిక్షాధికారిగా మారిపోయెను.
"అంగడిలో అన్నీ ఉన్నవి కాని ——' అను సామెత అతని
విషయములో చరితార్థమయ్యెను. మధ్యాహ్నము పన్నెండు
గంటల సమయమైనది. ధనికుని కుమారునకు కరకర ఆకలి
యగుచుండెను. తినుటకు ఒక్క రొట్టెముక్క కూడ లేదు. ఇక
ఏమి చేయుటకు తోచక అతడు ఒక పాత్రను పట్టుకొని ఇంటింటికి
వెళ్ళి "భవతీ భిక్షాం దేహి" అని యాచింపసాగెను. గ్రామ
స్థులందరు ఆశ్చర్యచకితులై 'ఏమయ్యా! లక్షాధికారీ! ఈ
దుర్గతి నీకేల పట్టినది' అని యాతనిని ప్రశ్నింప, అందుల
కతడు "మహానుభావులారా! నేనేమో లక్షాధికారినే. అందు
లకు తిరుగులేదు. కాని ఆ లక్షలు ఎక్కడున్నవో నాకు
తెలియదు. అదీ వచ్చిన తిప్పలు అందువల్ల ఈ దీనావస్థ
నాకు దాపురించినది' అని ప్రత్యుత్తరము చెప్పుచుండెను.

ఇట్లుండ ఒకనాడతడు తనమిత్రుని యింటికి ఏదియో
యొక కార్యార్థము వెడలగా, అతని దయనీయావస్థనుగాంచి
ఆమిత్రుడాతని కిట్లు సూచన చేసెను- 'నాయనా! మీ తండ్రి
జీవించియున్న కాలములో ఒకనాడు నాతో నా ఆస్తి నంతను
ద్రవ్యరూపమున ఒక బంగారుబిందె యందుంచి దొడ్డిలో
దాచిపెట్టదలచినాను' అని పలికియుండెను. కాబట్టి మీ
దొడ్డిలో త్రవ్వి చూచెదము. ఒకవేళ బిందె దొరికినచో నీవు
అదృష్టవంతుడవు' మిత్రునియొక్క ఆ స్నేహపూర్వక వాక్య

ములను విని అతని సూచనమేరకు ధనికుని కుమారుడు దొడ్డి యంతయు త్రివ్వించాడగా ఒకచోట ఆ బంగారుబిందె ప్రత్యక్ష మయ్యెను. అదిగాంచి ధనికుని పుత్రునియొక్క ఆనందము నకు మేరలేకుండెను. ఆ ద్రవ్యముతో అతడు తిరిగి సుఖజీవనము గడుపదొడంగెను. భిక్షాధికారి దైవకృపచే మరల లక్షాధి కారి అయ్యెను.

జీవుడు తనహృదయమున వెలుగుచున్న పరమాత్మ యగు సంపదకు, బ్రహ్మానందమను సువర్ణకలశమునకు వారసుడు. కాని ఆ రహస్యమెఱుంగక అతడు తన ఆత్మస్వరూప మును మైమఱచి తాను జడమైన దేహమని భ్రమసి నానా దుఃఖము లనుభవించుచుండ సద్గురు డను మిత్రుడువచ్చి జీవుని హృదయకమలమందు విరాజిల్లుచున్న ఆత్మను పొందు టకు మార్గముసుజూపి, అతని యథార్థస్వరూపమును బైట పెట్టి అతని హక్కుభుక్తమగు పరమానందమును తిరిగి అతని కైవసము చేయుచున్నాడు.

నీతి : కలిమి (ఆత్మ) యుండియు దారిద్ర్యము (దుఃఖము) అనుభవించుచున్నాడు అజ్ఞాని. ఆ కలిమియొక్క ఉనికిని సద్గురుముఖమున గుర్తెఱింగి నిరతిశయసుఖ మనుభవించుచున్నాడు జ్ఞాని.

# స్వప్రయత్నము

ఒకానొక పట్టణమున ఒక సంగీతవిద్వాంసుడు కలడు. సంగీత విద్యయందు అతని కతనే సాటి. అతడు సుదూరప్రాంతములకుకూడ పోయి పాటకచేరీలు జరిపి జనులలో సంగీతకళపై అభిరుచిని పెంపొందించెడివాడు. ఆ విద్వాంసుని గానమనిన జనులు చెవికోసుకొందురు. అతడు రాగమును ఆలాపించునపుడు శ్రోతలు తన్మయత్వము చెంది బాహ్యప్రపంచమునే విస్మరించుచుందురు. కనుకనే వాడవాడలనుండియు అతనికి పెక్కు ఆహ్వానములు వచ్చుచుండును. కొలదికాలముననే అతని కీర్తి పతాకస్థాయిని అందుకొనినది.

అతని సంగీతకళాప్రావీణ్యమును గుర్తించి ఆ పట్టణములోని కొందరు ప్రముఖులు తమ బిడ్డలకు సంగీతము నేర్పదలంచి అతనిని ఉపాధ్యాయుడుగ ఏర్పరచిరి. ప్రతిదినము ఉదయము 8 గంటలకు బయలుదేరి ఆ ప్రముఖగాయకుడు దాదాపు పది ఇండ్లలో పిల్లలకు సంగీతశిక్షణ నొసంగి తిరిగి మధ్యాహ్నము 12 గంటలకు ఇంటికి తిరిగి వచ్చెడివాడు. ఈ ప్రకారము బహుకాలము గడచెను. ఒకనాడు ఆ గాయకశిఖామణి ఉదయము వెళ్ళినవాడు మధ్యాహ్నము ఒంటిగంట వఱకుకూడ ఇంటికి తిరిగిరాలేదు. అతని ధర్మపత్ని వంటపని పూర్తిచేసికొని పతిరాకకై నిరీక్షించుచుండెను. మధ్యాహ్నము

రెండుగంటలైనది ఇంకను రాలేదు. చూచిచూచి ఆమెయు కండ్లు కాయలుకాచెను. ఇట్లుండ సరిగా రెండుగంటలకు ఆ సంగీతవిద్యాధురీణుడు తలుపు తట్టెను. అర్ధాంగి ఆతురతతో తలుపుతీసి ఆలస్యమునకు కారణమరసి త్వరగా స్నానముచేసి భోజనమునకు రమ్మని చల్లగ చెప్పెను.

సంగీత సమ్రాట్టు వడివడిగా దొడ్డిలోనికేగి బావిలో చేదవేసి నీళ్ళుతోడుకొనుచు స్నానమాచరించు చుండెను. కాని ఇంతలో ఏమి జరిగినదో ఏమోకాని, ఆ విద్వాంసుడు బావిచుట్టు పిట్టగోడపై కూర్చొని పైకి ఆకాశమును వీక్షించుచు ఈ క్రిందివిధముగ రాగసమన్వితముగ బిగ్గరగా ఆలాపింపదొడగెను.

భారము నీదేకదా
ప్రభో! భారము నీదేకదా!

ఈ ప్రకారముగ ఊర్ధ్వముఖుడై నిర్విరామముగ పాడుచునే యుండెను. ఆ ధ్వనికి ఆకాశము చిల్లులుపడు చుండెను. తన ప్రియుడు అకాలములో ఏల పాటపాడుచుం గానో భార్యకు అంతుపట్టలేదు. వెంటనే ఆమె దొడ్డిలోనికి పరుగెత్తుకొనివచ్చి 'ఏమండీ రాగాలాపనకు ఇదేనా సమయం! మధ్యాహ్నము మూడుగంటలు దాటుతున్నది కదా, భోజనానికి అకాలమైనది కదా, త్వరగా స్నానం చేయు

ల్చొనివచ్చి భోజనము చేయకుండా ఇదేంవనండీ ?' అని భర్తతో పలుకగా అతడు ఆ మాటలను విని విననట్లుగా నటించి "భారము నీదేకదా ప్రభో! భారము నీదేకదా!" అని పాతధోరణిలోనే ఎలుగెత్తి పాడుచుండెను.

భర్తగారి ఆశయమేమో భార్యకు అణుమాత్రమైనను తెలియలేదు. సమయము దాటిపోవుచుండెను. అవుడు భార్య తెగించి భర్తతో ఏమండీ! భారము నీదేకదా! అని అను చున్నారే! దాని అర్థమేమిటండీ!' అని ప్రశ్నించెను. వెంటనే ఆ సంగీత విద్వాంసుడు జరిగిన విషయమును ఈ ప్రకారముగ సవివరముగ తెలియజేసెను. "నేను పాడావుడిగ నీళ్ళు చేదు కొని స్నానంచేస్తుంటే బొక్కెనతాడు తెగిపోగాబొక్కెన బావిలో పడిపోయింది. అందుచేత "ఓ దేవుడా! ఇక నీదే భారం, నాదేమీ లేదు. ఆ బొక్కెట్టును కొంచెం బయటకు లాగండి దేవా అని వేడుకుంటున్నా" అంతే.

ప్రాణేశ్వరుని ఆ వాక్యములను విని అర్ధాంగి లోలోన నవ్వుకొని "ఏమండీ! దేవుణ్ణి ప్రార్థించటం మంచిదేకాని, మనం ముందుగా మన ప్రయత్నం చేస్తే అటుతరువాత దేవుడు సహాయంచేస్తాడు మనం సోమరులుగ ఉండి, చేయగలిగిన శక్తి ఉండికూడ ఏమీచేయక భారమంతా దేవుడి మీద పెడితే అతడేమి చేయగలడు ?" అని భర్తతో పలికి

తక్షణము ప్రక్క ఇంటికి పరుగెత్తుకొనివెళ్ళి పాతాళభేది తెచ్చి దానిని త్రాడుకు కట్టి బావిలో వదలి బొక్కెనను బయటకు లాగివేసెను.

కావున స్వప్రియత్నము అతి ముఖ్యము. భగవంతుడు సర్వులకును ఒకింత వివేకమును ప్రసాదించి యున్నాడు. కాబట్టి అద్దానిని ఉపయోగించి ప్రియత్నలోపము చేయక మానవుడు కార్యములను నెరవేర్చుకొనవలెను. దైవభక్తి కలిగియుండుట మంచిదేకాని దానితోబాటు "స్వప్రయత్నము" కూడ కోడించవలెను.

God helps those who help themselves.

తమ్ము తాము ఉద్ధరించుకొనువారికి భగవంతుడు కూడ సహాయపడును.

నీతి:- ప్రియత్నహీనునకు కార్యసాఫల్యము లభించదు. భగవత్సహాయమును అపేక్షించినను తన చేతనైన ప్రియత్నమునుకూడ చేయుచుండవలెను.

# మహోన్నత మానవజన్మ

ఒకనొక పట్టణమున ఒక బీద గృహస్థుడు కలడు. అతని కుటుంబము పెద్దది. రాబడి తక్కువ. కుటుంబ పోషణార్థము అతడు పడరాని పాట్లు పడుచుండెను. సంసారనిర్వాహణము అతనికి ఎంతయో భారభూతముగ తోచుచుండెను. ఇట్లుండ ఒకనాడాతని ఇంటిముందుగా ఒక సాధువు పోవుచుండెను. మహాత్ముల ఆశీర్వచన ప్రభావముచే కార్యసిద్ధి కలుగునని నిశ్చయించి ఆ గృహస్థుడు అమాంతముగ ఆ సాధువు కాళ్ళపై బడి "పాహిమాం పాహిమాం" అని విలపించెను. మఱియు "మహాత్మా! నేను కడుబీదవాడను. కుటుంబము చాలపెద్దది. పోషించుటకు నాకు శక్తి లేదు. తత్ఫలితముగ యమయాతనల ననుభవించుచున్నాను. తమరు నాపై దయదాల్చి నాకు సిరిసంపదల ననుగ్రహింప వేడుకొనుచున్నాను" అని దీనముగ యతినిని ప్రార్థించెను.

సాధువు అతని మొర ఆలకించి దయార్ద్రహృదయుడు కావున తనచేతియందున్న స్పర్శవేధిని అతని కొసంగి "నాయనా! దీనిని తీసికొని నీ దారిద్ర్యమును రూపుమాపుకొనుము. బహుకాలమునుండియు నీవు లేమిచే బాధల నొందుచుంటివి. ఇది స్పర్శవేధియను మహత్తర పదార్థము దీనిని ఇనుపవస్తువునకు తాకించినచో ఇనుము బంగారము

కాగలదు. ఆ బంగారము అమ్ముకొని నీవు సంపన్నుడవు కమ్ము. దీని ప్రభావముచే నీ దారిద్ర్యము పలాయనము చిత్తగించగలదు. అయితే ఒక్క సంవత్సరముకాలము వఱకే దీనిని నీయొద్ద ఉంచుటకు వీలుకలదు ఆ పిదప నేను మఱల వచ్చి ఈ స్పర్శవేధిని, తీసికొనిపోవుదును. కాబట్టి ఈ లోపు గానే నీవు దీనిని ఉపయోగించుకొనవలెను. ఆ పిదప ఇది నీకు దక్కదు"—అని వచించి వెడలిపోయెను.

సాధువు పలికిన వాక్యములను విని గృహస్థుడు పరమానందభరితుడయ్యెను. స్పర్శవేధిని బడయుటచే నతడు ఆనందమున చిందులు త్రొక్కుచుండెను. బహుకాలము తన్ను బాధించిన దారిద్ర్యము తొలగెనుగదా యని సంతసించుచుండెను. త్వరలో నతడు తన ఇంటికేగి మొట్టమొదట ఒక ఇనుపమేకునకు ఆ స్పర్శవేధిని తాకించదలంచెను. కాని వెను వెంటనే ఆతనికొక ఆలోచన తట్టెను—"ఈ చిన్నచిన్న వస్తువులకు తాకించినచో కొద్ది బంగారము మాత్రమే రాగలదు. వూరిలో ఇనుపవస్తువులు అమ్ము వర్తకునియొద్ద వేలకొలది ఇనుప వస్తువులు కలవు. వాని యన్నింటిని కొనివచ్చి తాకించినచో కోట్లకొలది రూప్యముల విలువగల బంగారము లభించగలదు" —

అని ఈ ప్రకారముగ ఆలోచించి ఆ గృహస్థుడు తన యింటిలో దేనికిని తాకించక, నేరుగా ఊరిలోనికి వెళ్ళి ఇనుప

వర్తకునితో "అయ్యా! మీ అంగడిలోని ఇనుపవస్తువు లన్నిటిని కొనదలచినాను. ఖరీదు ఎంత?" అని యడుగగా వర్తకుడు "మహాశయా! ఇపుడు ధరలు చాల విపరీతముగ నున్నవి. మీరు కొనలేరు. ఇంకొక ఆరునెలలైన పిదప తగ్గవచ్చును. అప్పుడువచ్చి విచారించవచ్చును" అని బదులు చెప్పెను. చక్కని సలహా చెప్పెనని తలంచి గృహస్థుడు ఆరునెలలైన పిదప తిరిగి విచారించగా వర్తకుడు "ఇంకను ధరలు తగ్గలేదు, ఇంకొక ఆరునెలలైన పిదప తగ్గుముఖము పట్టవచ్చును" అని ప్రత్యుత్తరమిచ్చెను. గృహస్థు దక్లే ఇంకొక ఆరునెలలు ఓపికపట్టి తిరిగి వర్తకునియొద్దకు పోవు చుండగా మార్గమధ్యములో సాధువు కనిపించి "అయ్యా! సంవత్సరకాలము గడువు పూర్తి అయినది. నా స్పర్శవేధిని ఇచ్చివేయుము" అని పలికి ఆ స్పర్శవేధిని గృహస్థునియొద్ద నుండి పెకలించుకొని పోయెను. పాపము గృహస్థుడు నిర్వీర్యుడై, స్తబ్ధుడై అట్లే నిలబడిపోయెను. తన అజాగ్రత్తకు తానే వాపోవదొడగెను. సంవత్సరకాలము స్పర్శవేధి తన యొద్ద ఉన్నప్పటికిని అతడు దానిని ఉపయోగించుకొనక వ్యర్థముగ కాలక్షేపము చేసెను. తత్ఫలితముగ అతని దారిద్ర్యము ఏమాత్రము తొలగక అట్లే ఉండెను. బాధలు ద్విగుణీకృతములయ్యెను. చక్కని అవకాశము పతడు జార విడిచివేసెను.

అమూల్యమగు ఈ మానవజన్మయే స్పర్శవేధి. జీవుని ఆయుర్దాయమే సంవత్సరవు గడువు. ఆయుర్దాయము పూర్తి కాకపూర్వమే జీవుడు ఈ మానవ దేహముద్వారా ఆత్మసాక్షాత్కారమును ప్రయత్నపూర్వకముగ బడసి జన్మ సార్థకమునొనర్చుకొనవలెను. అట్లుకాక కాలయాపన చేసినచో యమధర్మరాజు వచ్చి ఈ శరీరమును కబళించుకొని పోయినచో మరల ఇట్టి మహోత్కృష్టమైనదియు, బ్రహ్మవలోకన సమర్థమైనదియు నగు మానవజన్మ లభించుట దుస్తరము. కాబట్టి స్పర్శవేధివలె అఖండ శక్తి సామర్థ్యములు కల ఈ మానవ జన్మ సమాప్తము కాకపూర్వమే బ్రహ్మసాక్షాత్కారమను చరమ లక్ష్యమును జీవుడు సాధించివేయవలసి యున్నది. అందులకై తగు యత్నముల నతడు శీఘ్రముగ ఇప్పటి నుండియే ఆచరించుటకు కుద్యుక్తుడు కావలయును.

నీతి : మానవజన్మ చాల దుర్లభమైనది కావున ఆ జన్మ పూర్తికాకమునుపే తీవ్రతర ఆధ్యాత్మిక సాధనల నొనర్చి ఆత్మసాక్షాత్కారమును బడయవలెను.

# విస్మృత కంఠాభరణము

ఒకానొక పట్టణమందు ఒక చిన్న ఉద్యోగస్థుడు కలడు. అతనికి నెల నెల వచ్చు వేతనము కుటుంబపోషణమునకు సరి పోగా కొద్దిగా మిగులును. ఒకనాడాతని ధర్మపత్ని తనకొక బంగారుగొలుసు (మెడలో ధరించునది) చేయించిపెట్టుమని భర్తను వినయపూర్వకముగ వేడుకొనెను. చుట్టుప్రక్క ఉన్న తన స్నేహితురాండ్రు అందఱు ఏదియో ఒక రకము ఆభరణము ధరించి యున్నారనియు, ఒక్క అలంకారమైనను లేక వారిలో తిరుగుట తనకు చిన్నతనముగా నున్నదనియు భర్తతో ఆమె మొరపెట్టుకొని బంగారు గొలుసుకొఱకై అభ్యర్థించెను. భర్త పెద్ద ఉద్యోగికాడు. ధనికుడు కాడు. బంగారు గొలుసు తయారు చేయించవలెనన్న ఒక వెయ్యి రూపాయలైనను కావలసియుండును. అందుచే నతడు తన సహధర్మచారిణిపైగల అనురాగముచే ప్రతినెల తనకు వచ్చు జీతములో కొంత కొంత పొదుపు చేసికొని కనకాభరణమునకై ధనమును కూడబెట్ట దొడగెను.

కాలక్రమమున ఆభరణమునకు వలసిన ద్రవ్యము సమకూడగా వెంటనే అతడు ఒకానొక సువర్ణకారునితో సంప్రదించి తన ప్రియురాలికొఱకై చక్కని సువర్ణ కంఠాభరణము తయారు చేయించుటకు తగిన ఏర్పాటు చేసెను. స్వర్ణకారుడు

తన యావచ్ఛక్తిని వినియోగించి తన కళాకౌశల్యమునంతను ఉపయోగించి మూడు మాసములలో ఒక రమణీయమైన కనకాభరణమును తయారు చేసి ఉద్యోగి కొసంగెను. ఉద్యోగి బహుకాలము దానిపై నిరీక్షించుచున్న తన యర్ధాంగికి అందజేసెను. దానిని చూడగనే ఆమె ఆనందముతో చిందులు త్రొక్కుచు బహుజాగ్రతగా దానిని దాచిపెట్టెను. ప్రత్యేక సమయములలో, విశేషసమయములలో, పరవడిదినములలో మాత్రమే దానిని ధరించుచు తక్కినపుడు దానిని భద్రముగా దాచి యుంచుచు నుండెను.

ఇట్లుండగా కొన్నాళ్ళకు దీపావళి పండుగ శుభదినములలో అకస్మాత్తుగ వారికొక తంతి [ టెలిగ్రాం ] వచ్చెను. తమ సమీప బంధువులలో ఒకరి వివాహము నిశ్చితమైనదనియు త్వరితముగ అందఱు బయలుదేరి రావలసినదనియు దానియందుండెను. తోడనే ఉద్యోగి ఆ వర్తమానమును తన యర్ధాంగికి తెలిపి ఆదినం మధ్యాహ్నం 12 గంటలకు బయలుదేరు రైలుబండిలో అందఱు వివాహమునకు బయలుదేరవలసి యున్నదనియు, త్వరలో సామాను సర్దుకొనవలసినదనియు తెలియజేసెను.

భర్త యానతి ననుసరించి ఆ గృహిణి వివాహకార్యమునకు తీసికొనివెళ్లవలసిన సామగ్రి నంతను సిద్ధముచేసి తనకు

అతి ప్రీతికరమైన కంఠాభరణమును ఆ శుభసమయమున ధరించుకొని వెళ్ళుట ఉత్తమమని భావించి దానికొఱకై బీరువ తెరచెను. కాని అది యేమి విచిత్రమోకాని, ఆ యాభరణము దాచియుంచిన చోటునందు లేదు. ఆమె గుండె నీరైపోయెను. వంటియందు దడపుట్టెను. సంభ్రమచిత్తముతో, భయవిహ్వల మానసముతో ఆమె దానికొఱకై ఇంటి యందున్న పెట్టెలు, అలమారలు, బీరువాలు అన్నిటిని తెరచి బాగుగ వెతకెను. కాని కంఠాభరణము ఎక్కడను కానుపించలేదు. దాదాపు ఒక టిన్నర సంవత్సరము చెమటకార్చి సంపాదించిన తన జీతములో పొదుపు చేసికొని ప్రియురాలి మనోభీష్టము నెరవేర్చుటకై వెయ్యి రూపాయలు సమకూర్చి తయారు చేయించిన సువర్ణ కంఠాభరణము మటుమాయమై పోయిన వార్తను తన భర్త కెఱింగించినచో అతడెంత పరితాప మొందునో ఆమెకు తెలియని విషయముకాదు. కాని చెప్పక తప్పదు. ప్రయాణ సమయము సమీపించుచున్నది. ఎట్టకేలకు గుండె నిబ్బరము చేసికొని ఆమె తన భర్తకు కంఠాభరణము కనపించని విషయమును తెలియజేసెను.

పిడుగువంటి ఆ వార్త సరిగా ప్రయాణసమయములో విని భర్త ఎంతయో కలవరపడెను, ఊహింపరాని ఆవేదన అతని హృదయమును మథించివైచెను. ఏమి చేయుటకు తోచక మరల ఒక పర్యాయము తానే ఇల్లంతయు వెతకి

వస్తువు కానిపింపమి భార్యను తీవ్రముగ మందలింప దొడగెను. ఏల అంత అజాగ్రత్తగ నుంటివని ఆమెను దుముసుగ అడిగి పైచి కోపావేశమున ఆమె వీపుపై ఒక దెబ్బ కొట్టెను. తోడనే ఆమె ఏడుపు ప్రారంభించెను, అది విని చుట్టుపక్కలగల జనమంతయు అచట ప్రోగైరి. ఒక్కొక్కరు ఒక్కొక్కమాట చెప్పదొడంగిరి. ఆ వచ్చిన జనములో ఒక ముసలాయన 'అమ్మా! ఎందుల కేడ్చుచున్నావు' అని ప్రశ్నింపగా ఆమె జరిగిన విషయమంతయు చెప్పి ఎంతయో అపాయముగా తన భర్త తనకు చేయించి యిచ్చిన బంగారపు గొలుసు కనుపించుట లేదనియు దానిని పారవేసుకొని నందులకు తన భర్త కొట్టెననియు తెలుపగా ఆ వృద్ధుడు 'అమ్మా! నీ మెడలో ఏదియో వస్తువు మెరయుచున్నది, కొంచెము చూడుము' అని పలికెను. వెంటనే ఆ యిల్లాలు తన మెడలో చూచుకొనగా అది ఆ కంఠాభరణమనియే తేలెను. ఆభరణము ఎచటను పోలేదు. ఎవరును ఎత్తుకొనిపోయి యుంతలేదు. దీపావళి పండుగ కాబట్టి ఆమె దానిని ముందుగనే ధరించి ఆ సంగతి మఱచిపోయెను.

కంఠాభరణమును గాంచి ఉద్యోగి భార్య అపరిమిత ఆనందమును బొందెను. ఉద్యోగి ఆశ్చర్యమును ఆహ్లాదమును ప్రకటించెను. చుట్టుపక్క ఉన్న జనమంతయు సంతృప్తిని

బడసి ఎవరి యిండ్లకు వారు పోయిరి. మఱపు వలననే ఇంత కథ నడచినది మఱపు వలననే అందఱికిని బాధ కలిగినది. అట్లే జీవుడు తన నిజస్వరూపమగు ఆత్మను మఱచి తాను దేహమని భ్రమించి నానా దుఃఖములను అనుభవించుచున్నాడు అప్పుడు సద్గురువు వచ్చి "తత్త్వమసి" మహావాక్యము ద్వారా "నీవు కేవలము పరమాత్మ స్వరూపుడవు, ఆత్మ ఎచటను పోలేదు. నీలోనే ఉన్నది, తెలిసికొనుము' అని బోధించుచున్నాడు. తద్బోధానుసారము జీవుడు చక్కగసాధన యొనర్పగా ఆత్మదేవుడు తనయందే కలడనియు, తనకు దుఃఖ మేకాలమందును లేదనియు, తాను సచ్చిదానంద స్వరూపుడనియు తెలిసికొని జీవుడు బంధవిముక్తుడగుచున్నాడు.

> ఆత్మాతు సతతం ప్రాప్తోప్య ప్రాప్తవదవిద్యయా
> తన్నాశే ప్రాప్తవద్భాతి స్వకంఠాభరణం యథా.
>
> (ఆత్మబోధ)

ఆత్మ ఎల్లప్పుడు పొందబడియే యున్నది. పొందబడ లేదని అవిద్యవలన తలంచి జీవుడు దుఃఖ మొందుచున్నాడు. జ్ఞానముచే అవిద్య తొలగిపోగా, కథలోని కంఠాభరణమును వలె జీవుడు తన ఆత్మస్వరూపమును తిరిగి జ్ఞాపకమునకు తెచ్చుకొని సుఖించుచున్నాడు.

**నీతి:—** పరమానందరూపమగు ఆత్మ తన స్వరూపముగ నున్నప్పటికిని ఆ విషయము తెలియక అజ్ఞాని యగు జీవుడు నానాదుఃఖములను పొందుచున్నాడు. సద్గురు, సచ్ఛాస్త్రములద్వారా ఎపుడా సత్యమెఱుగునో అపుడు జీవుడు దుఃఖరహితుడై పరమానంద మను భవించుచున్నాడు.

# దేహాభిమానము ప్రమాదకరము

ఒకానొక పట్టణములో ఒక గొప్పశిల్పి యుండెడివాడు. అతని కళాకుశలత్వమునకు, శిల్పనైపుణ్యమునకు జను లచ్చెరు వొందుచుండిరి. శిల్పమునందు సహజత్వము గోచరింపజేయుట అతనియొక్క విశిష్టత. అనగా తాను నిర్మించు శిలావిగ్రహ మునకును అసలు వ్యక్తికిని ఏమాత్రము భేదము గోచరించ కుండ చేయుటలో అతనిది అందెవేసిన చేయి. ఇక్కారణ మున దూర దూర దేశములనుండియు అతనికి శిలావిగ్రహము లకై ఆర్డర్లు వచ్చుచుండెడివి. కొంతకాలమున కతడొక విఖ్యాత శిల్పియై విరాజిల్లి తన దేశమునకు, తానున్న ప్రాంత మునకు ఎనలేని ఖ్యాతిని ఆర్జించిపెట్టెను.

ఇట్లుండ కొంతికాలమున కాతనికి వార్ధక్యము దాపురించెను. కాలక్రమమున మృత్యువునకు దారితీయునని అతడు పూర్తిగ గ్రహించినవాడై మృత్యుదేవత తనచెంతకు వచ్చినపుడు అతనిని తికమక పెట్టుటకై ఒక చక్కని పన్నాగమును పన్నెను. కేవలము తనవలె చూపట్టు తొమ్మిది శిలావిగ్రహములను అతడు తన శిల్పచాతుర్యముచే నిర్మించెను. తనకున్ను, తాను తయారుచేసిన ఆ విగ్రహములకున్ను ఏమాత్రము భేదము లేకుండెను. ఒకే ఎత్తు, ఒకే లావు, ఒకే రంగు, ఒకే పోలిక చూచువారికి ఆ విగ్రహములు పరమాశ్చర్యమును గొలుపుచు జీవకళ ఉట్టిపడుచున్నట్లు గోచరించుచుండెను.

కాలచక్రము రివ్వున తిరుగసాగెను. శిల్పియొక్క జీవిత ఘడియలు ఇంక కొంతసేపటికి పరిసమాప్తమగు సమయము ఆసన్నమయ్యెను. ఈ విషయమును గ్రహించినవాడై ఆ శిల్పి తన గృహ ప్రాంగణమున తాను నిర్మించిన తొమ్మిది విగ్రహములను పరుండబెట్టి వానిపై వస్త్రములను కప్పి, ఆ తొమ్మిది విగ్రహములమధ్య తానున్ను పరుండి వస్త్రమును కప్పుకొనెను. ఆ వస్త్రములన్నియు ఒకేరంగు కలిగియుండెను. మరణసమయ మాసన్నమగుటవలన ఆనాడు రాత్రిపూట మృత్యుదేవత పాశమును గైకొని శిల్పి గృహమున ప్రవేశించెను. శిల్పి మెడలో పాశము బిగించి ఈడ్చుకొనిపోవ నుద్దేశ్యముతో ఆ మృత్యుదేవత శిల్పికొఱకై ఇల్లంతయు

గాలించగా, ఒకచోట పదిమంది దుప్పట్లు కప్పుకొని పరుండి యుండుటను అతడు కాంచెను.

సంభ్రమచేతస్కుడై ఆ దేవత అందొకని ముఖముపై నుండి వస్త్రమును ఒకింత తొలగించెను. అట్లే మఱియొకని ముఖముపై నుండియు తొలగించి చూచెను. ఈ ప్రకారముగ పదిమందిని చూడగా అందఱును ఒకే రూపము, ఒకే ఆకారము, ఒకే వర్చస్సు, ఒకే రంగు గలిగియుండుటగాంచి ఆ మృత్యుదేవత "ఈ పదిమందిలో అసలు వ్యక్తి ఎవరు? ఈ లోకమున అనుభవించదగిన కర్మ యావత్తు ముగిసి ఒకటి రెండు క్షణములలో మరణమును ఎదుర్కొనుచున్న ఆ శిల్పి ఈ పదిమందిలో ఎవరు?" అని తనలో తాను తీవ్రముగ విచారించుకొన దొడగెను. కాని ఎంత ఆలోచించినను పరిష్కారము గోచరించలేదు. "మఱియొక వ్యక్తి మెడలో పొరపాటున ఉచ్చు తగిలించినచో అది డిపార్టుమెంటుకే చెడ్డపేరు తెచ్చును. ఇంతవఱకు ఈ జనన మరణశాఖ మహా కట్టుదిట్టముతో నడచుచు, ధర్మమును అతిక్రమించకుండ జరుగుచున్నది. ఏ ఒక్క కళంకమున్ను ఈ శాఖకుగాని, శాఖాధిపతికిగాని శాఖలో పనిచేయువారికిగాని ఇంతవఱకు రాలేదు. ఇపుడు నేను పొరపాటు చేసినచో అసలు వ్యక్తి మెడలో పాశము వేయక వేఱొకవ్యక్తి మెడలో వేసినచో, ఘోరముగు అపచారము చేసినవాడనగుదును కాబట్టి పొరపాటున

చేకొని మెడలో ఉచ్చువేయుటకంటె అసలు ఎవరి మెడలోను వేయక వెడలిపోవుటయే ఉత్తమము" — అని యిట్లు నిశ్చయించి ఆ మృత్యుదేవత ఎవరి మెడలోను పాశము వేయక అచ్చోటు వీడిపోవుటకు నిశ్చయించినవారై కదలసాగెను. పాశహస్తుడు పోవుచు పోవుచు అందరును వినులాగున "వీడెవడో అన్నీ బాగానే చేసినాడు కాని ఒక్క పొరపాటు మాత్రము చేసినాడు" అని పెద్దగా పలికెను. ఆ వాక్యములను వినుటయే తడవుగా విగ్రహము మధ్య పడియుండిన శిల్పి అమాంతముగా లేచి "ఏమిటయ్యా! ఆ పొరపాటు, అని అతనిని ప్రశ్నించెను. "నీవు లేచుటయే పొరపాటు, 'నేను దేహమును' అని నీవు తలంచుటయే పొరపాటు నీ యొక్క దేహాభిమానమే ఆ పొరపాటు" అని పలుకుచు మృత్యుదేవత అతని మెడలో పాశమువైచి ఈడ్చుకొని పోయెను.

చూచితిరా! ఆ శిల్పి ఎంత పొరపాటుచేసెనో! ఇంత కొద్దిసేపు ఓర్చుకొనినచో అతడు మృత్యువును తప్పించుకొనెడివాడు కాని దేహభ్రాంతి అతనికి ఇంకను వీడలేదు. "నేను దేహమును, నేను ఉపాధిని" అను భావమే అతనికి మృత్యువును తెచ్చిపెట్టినది. కాబట్టి దేహాభిమానము మహాప్రమాదకరమైనది. తాను శాశ్వతమగు ఆత్మయనియే జీవుడు సదా తలంచవలెనుగాని, క్షణికమగు దేహమని కాదు.

నీతి :— జీవుడు దేహముకాదు ఆత్మ. జడ వస్తువుకాదు చైతన్యము. కావున దేహాభిమానమును పారద్రోలి తాను ఎల్లకాలములందును ఆత్మయే అయి యున్నానని తలంచుచు జీవుడు పరమానంద మను భవించవలయును.

## గయ్యాళి మనస్సు

ఒకానొక గ్రామములో సదాచారవంతుడగు ఒక గృహస్థుడు కలడు. ఉదయము లేచినది మొదలు స్నానము సంధ్య, జపము తపము మున్నగు వానిని నియమ పూర్వక ముగ చేయనిదే అతడు గంగ ముట్టడు. ఎన్ని ఆటంకములు వచ్చినను అతడు తన ఆచార విచారములను వదిలి పెట్టడు. అతని జీవితములో అంతయు సవ్యముగ జరుగుచుండెనుగాని ఒక్క విషయమును తలంచుకొనిన అతనికి పట్టరాని దుఃఖము కలుగుచుండెను. ఏ పూర్వజన్మ దుష్పరిణామమో కాని అతనికి దాంపత్యము సరిగ లేకుండెను. భార్య పరమ గయ్యాళి. అతని పవిత్ర మనస్తత్త్వమునకును ఆమె దురుసు తనమునకును ఏమాత్రము పొత్తు కుదరకుండెను. అందుచే ప్రతిదినము ఇంటిలో ఏదియో రచ్చ, రగడ సంభవించుచుం

డెను. అతడు ఎంత ఓర్చుకొని సరిదిద్దుకొని పోవుచుండినను ఆమె అంతంత ఎగిరెగిరి పడుచుండెను. ఈకారణమున సంసారము నడపుట అతనికి భారభూతముగ తోచుచుండెను. దినగండము — నూరేళ్లాయుస్సు అన్నట్లు అతని జీవితరథము పెక్కు ఆటంకములతో గూడి బాధాకరముగ సాగుచుండెను. అయినను, శివుడు కాలకూటమును మ్రింగినట్లు, ఆ కష్ట నిష్ఠురములన్నిటిని దిగమ్రింగి ఎట్లో జీవయాత్ర గడుపుచుండెను.

ఇట్లుండ కొంతకాలమున కాతని తండ్రియొక్క తద్దినము వచ్చెను. మామూలు రోజులలోనే ఇల్లాలుతో నెట్టుకు వచ్చుట కష్టముగానుండ ఇక తద్దినము జరిపించుట ఎట్లు ? అను సమస్య అతనికి తీవ్రముగా బాధింప జొచ్చెను. మఱుపటి దినము తద్దినము రానున్నది. కోలెడన్ని పనులు చేయవలసియున్నవి. ఇల్లు అలుకుట, ముగ్గులు పెట్టుట, భోక్తలను పిలుచుట, వంట పెద్ద అంతస్తులో చేయుట, పిండివంటలు తయారు చేయుట, పురోహితుని ఆహ్వానించుట. పూజాదికము నెరవేర్చుట, నీళ్లు తోడిపోయుట-ఇత్యాది కార్యములెన్నెన్నో చేయవలసియున్నవి. భార్యచేత ఒక్కపని చేయించుట అతనికి బ్రహ్మ ప్రళయముగా తోచుచుండెను. మామూలు రోజులలోనే పనులు చేయక హఠము వేసికొనుచుండు అగృహిణితో తద్దిన కార్యములెట్లు చేయించగలడు

అందుచే 'రేపటిదినం పితరుల కార్య మెట్లు సాధించగలను ?' అని ఆలోచించి ఆలోచించి తెమలక తుట్టతుదకు ఊరి బయట ఏకాంత ఆశ్రమములో ఉన్న తన గురువుగారి యొద్దకు ఆరాత్రికి రాత్రే పయనమై పోయెను.

ఆశ్రమము చేరి గురుదేవునకు దండప్రణామం బాచరించి 'మహాత్మా! పాహిమాం! పాహిమాం' అని కంట తడిపెట్టి కొని ప్రార్థించెను. గురువుగారు ఆశ్చర్యపడి ఆ నిశీథసమయములో అతడెందులకు అంత త్వరితముగా వచ్చెనో అర్థముకాక "నాయనా జపధ్యానాదులు చక్కగా సలుపుచున్నావా? మనస్సు ఏకాగ్రముగా నిలచుచున్నదా? ఏకారణముచేత ఇంతరాత్రి సమయమున వ్యాకులుడవై ఇచ్చటికి వచ్చితివి?" అని ప్రశ్నింప గృహస్థుడీ ప్రకారముగ ప్రత్యుత్తర మిచ్చెను.

"గురుదేవా! ఏమని చెప్పుదును? నా అవస్థ ఆ పరాత్పరునకే తెలియును. నాజీవితములో అన్నియు అనుకూలముగానే యున్నవి కాని ఒక్కటి మాత్రము ప్రతికూలముగా నున్నది. అమ్మగారి విషయము తమకు తెలియనిదికాదు. మా అర్థాంగి గారు అన్నిటికి అడ్డుచెప్పుచుందురు. అందుచేత ఒక్కపనీ సవ్యంగా చేయించలేకుండ ఉన్నాను. మామూలు రోజులలో నైతే ఎటులనో సరిదిద్దుకొని కాలక్షేపము చేయుచు నెట్టుకు వచ్చుచున్నాను కాని రేపు ఒక పవిత్రమైన కార్యక్రమము కలదు రేపు మా తండ్రిగారి తద్దినము. ప్రొద్దున మొదలు

కాని రాత్రివఱకు ఊపిరి తిరగని పనులు కలవు. మఱి ఆ లలనామణితో ఇవన్నియు సాధించుట ఎటులనో నాకు అర్థము కాకున్నది. వేద వేదాంతములలో జటిలతరములైన సిద్ధాంతముల నెన్నిటినో విడదీయగలిగిన నాకు ఈ గృహ కార్యములు ఒక పెద్ద సమస్యయై కూర్చున్నది. మహాత్మా! నాకు ఏమియు తోచుటలేదు. తమరే నాకు దిక్కు. రేపటి తద్దినము సవ్యముగా, ప్రశాంతముగా జరుగుటకైన ఉపాయమును తమరు నాకు సెలవీయ గోరుచున్నాను. ఇదే నా వినతి. అనుగ్రహింపుడు. ఆశీర్వదింపుడు, కష్టకాలములో దరికి చేర్చి దీవించుడు!

గృహస్థుని ఆదీన వచనముల నాలకించి గురు దేవుడాతని చెవిలో రహస్యముగా ఏవియో కొన్ని వాక్యములను నుడివి పంపివేసెను. వెంటనే అతడు తన గృహమునకు పోయి భార్యను పిలచెను. ఆమె రాగా అప్పుడు వారిరువురికిని ఈ క్రింది సంభాషణము నడచెను.—

భర్త—కాన్తామణీ! రేపటిదినం మానాయన తద్దినం విషయం నీకు తెలుసుగదా! ప్రతి సంవత్సరం ఆయనగారి తద్దినం పెడుతున్నాను. కాని ఈ సంవత్సరం మానేస్తామనుకుంటున్నాను.

భార్య—అట్లా మానెయ్యటానికి వీలులేదు. తద్దినం తప్పక పెట్టి తీరాల్సిందే.

భర్త—సరే, ఏదో నీమాట ప్రకారం తద్దినం పెట్టాను గాని భోక్తలను పిలవదలంచలేదు.

భార్య—పిలిచి తీరాల్సిందే.

భర్త—సరే, ఏదో నీ మాటప్రకారం పిలుస్తానుగాని వారికి పిండివంట లేవీ చేయ బోకు. మామూలు భోజనం మాత్రం పెడితే చాలు.

భార్య—భోజనంతో పాటు పిండివంటలుచేసి తీర్తాను. ఒక్క గారెలేకాదు బూరెలుకూడ చేస్తాను.

అమ్మగారు ధోరణికి గృహస్థుడు లోలోన పరమ సంతోషమును పొందుచుండెను. 'ఆహా! గురుదేవు డిట్టి యుక్తిని బోధించి కార్య సాఫల్యమునకు దోహద మొన ర్చెను!' అని తనలో తాను భావించుకొని అమందానందమును పొందెను. మఱుసటిదినమున తద్దిన కార్యము దివ్యముగా జరిగిపోయెను.

కథలోని ఆతపడుచు వలె మనస్సు ఒక గయ్యాళిది. ఏది చేయుమని మనము దానికి చెప్పుదుమో దానికి విరుద్ధముగ చేయదొడంగును. కాబట్టి దానిని బహుజాగ్రతగ వశమొనర్చు

కొనవలెను. శక్తితో బాటు యుక్తినికూడ జోడించి దానిని మెల్లగ దారికి తీసికొని రావలెను. అంతియేకాని పాశముగ దానిని లొంగదీయరాదు. హఠము ఉపయోగించినచో అది తిరగబడును. అపుడు సాధకుడు నానా బాధలను పొందవలసి వచ్చును. 'లాలయేత్ చిత్తబాలకమ్' అని పెద్దలు చెప్పినట్లు మనస్సును లాలించి, పాలించి బోధించి నయముగనే వశము చేసికొనవలయును.

నీతి :— మనస్సునకు తిరుగుబడు స్వభావము కలదు కావున దానికి నయముగ హితబోధ చేసి యుక్తితో జయించవలెను.

# వాసనా ప్రభావము

ఒకానొక నదు ప్రదేశమునకు నాలుగుమైళ్ల దూరములో ఒక పట్టణము కలదు. ఆ పట్టణములో కొందఱు జెస్తవారు ప్రతిదినము సముద్రమునకు వెళ్లి చేపలను పట్టుకొని తెచ్చి ఊరిలో అమ్ముకొని జీవించుచుండెడివారు. ఆ మత్స్యపరిగ్రహమే వారి జీవనాధారము. వారు ప్రొద్దుటనే లేచి, చేపల గంపలను, వలలను, ఇతర పరికరములను వెంట

పెట్టుకొని వెళ్లి సూర్యోదయ సమయమునకు చెలియలికట్టను చేరి, రోజంతయు పరిశ్రమచేసి సాయంత్రమగుసరికి తమ తమ బుట్టలనిండా చేపలను వేసికొని నెత్తిపై బెట్టుకొని మున్ను పవున పట్టణమునుచేరి విక్రయించి ఆ పైకముతో బియ్యము, ఉప్పు మొదలైన ఇంటి వెచ్చములుకొని తెచ్చుకొని, ఇండ్లు చేరి భుజించి హాయిగ నిదురించుచుండెడివారు.

ఇట్లుండగా, ఒకనాడు పదిమంది జాలరులు పగలంతయు సముద్రతీరమున పరిశ్రమచేసి తమ తమ గంపల నిండుగ చేపలను వేసికొని నెత్తిపై పెట్టుకొని ఆనందముతో చిందులు త్రొక్కుచు పట్టణాభిముఖులై బయలుదేరిరి. దినకరుడపుడే అస్తాద్రిగ్రుంకెను. చీకటిపడుచుండెను. పట్టణము చేరుటకు నాలుగుమైళ్లు దూరము వారు నడచి వెళ్లవలసియున్నది. ఎంత వడివడిగ పోయినను పట్టణమును వారు చేరలేకపోయిరి. ఒక్క మైలుదూరము పోవుసరికి అంధకారము నలువైపుల దట్టముగ వ్యాపించిపోయెను. అది యేమి గ్రహచారమో కాని అదే సమయమున ఆకాశము కారుమబ్బులతో నిండిపోయెను. తుఫానుగాలి జోరున వీవసాగెను. కుంభవర్షము కురియ దొడగెను. జాలరులు తడచిపోయిరి. వారి నెత్తిపై నున్న చేపలబుట్టలు ముద్దముద్దగ తడచిపోయెను. చీకటిలో వారికి దారి తెన్ను గోచరింపకుండెను. ఎటుపోవలెనో

అగమ్య గోచరముగ నుండెను. పట్టణమింకను మూడుమైళ్ళ దూరమున నున్నది.

ఇట్టి పరిస్థితిలో వారందరు ఆలోచించుకొని సమీపమున ఎచటనైనను ఒకయిల్లు కనుపించినచో ఆ రాత్రి అచట మకాం పెట్టి ఉదయము లేచి పట్టణము పోవుటకు నిశ్చయించుకొనిరి. వారి అదృష్టమా అన్నట్లు అనతిదూరములోనే మినుకు మినుకుమనుచు ఒక చిన్నదీపము దృగ్గోచరమయ్యెను. అందరును ఆ కాంతి ననుసరించి అచ్చోటికి దారితీసిరి. అది నిరుపేద పుష్పవర్తకుని కుటీరము. ఇంటిచుట్టూ చక్కని పుష్పోద్యానము కలదు. గులాబి పువ్వులు, చేమంతి పువ్వులు, మల్లెపువ్వులు, సంపెగ పువ్వులు — వీనితో ఆ పరిసరమంతయు గుబాళించుచుండెను. శిష్యులు ఆ యింటితలుపు తట్టిరి. లోపలనుండి ఇంటి యజమాని బయటకు వచ్చెను. అపుడు సమయము రాత్రి తొమ్మిది గంటలైనది. ఇట్టి అకాలములో ఎవరు వచ్చిరాయని పుష్పవర్తకుడు విచికిత్స చేయుచుండగా ఆ శిష్యులందరున్ను తమ దయనీయ వృత్తాంతమంతయు అతనికి తెలిపి ఆ రాత్రి తలదాచుకొనుటకు కొంత ఆశ్రయము [illegible] చేసుకొనిరి.

ఆ గృహస్థు [illegible] త్యాగియుడు. అతడు [illegible] గ్రహించి ఆ రాత్రి తనయింటి యందు పరుండుటకు

వారికి ఆశ్రయ మొసంగెను. చాపల బుట్టలను ఇంటిలోపల దాచిపెట్టి జాలరులు బయట వరండాలో పరుండిరి. వర్తకుడు తలుపు గడియపెట్టుకొని లోనికేగెను. అర్థరాత్రి గడచినది. కాని బెస్తవారిలో ఒకరికిని నిద్రలేదు. ఏమి కారణమో అనూహ్యముగా నుండెను. ప్రతిదినము పగలంతయు పనిచేసి చేసి రాత్రి నేలపై వాలుటయే తడవు గుఱ్ఱుపెట్టి నిద్రపోవు ఆ జాలరులకు నేడు పరుండి మూడుగంటలైనను నిద్రపట్టలేదు. ఈ పరిస్థితి గమనించి వారిలో ఒకడు లేచి కూర్చుండెను. ప్రక్కవానిని పిలిచి నీకు నిద్రపట్టినదా? అని అడిగెను. ఆ రెండవవాడును నాకు నిద్రపట్టలేదు అనిచెప్పి మొదటివానివలె లేచి కూర్చొనెను. ఈ ప్రకారముగ ఆ పదిమంది జాలరులు ఒకరి తరువాత మఱియొకరు తిన్నగ లేచి కూర్చుండిరి. "ఎందుకు నిద్రపట్టుటలేదు?" అని వారిలో వారు వితర్కించుకొనుచుండ అందులో ఒకడు అసలు కారణమును బయటపెట్టెను. అతడు తక్కినవారందఱిని సంబోధించి ఈ ప్రకారముగ చెప్పదొడగెను.

"అన్నలారా! ప్రతిరోజు గాఢనిద్రను పొందుచున్న మనకు ఈనాడు అసలు నిద్రయే పట్టుటలేదనగా ఇందుకు ఒక ప్రబలమైన కారణము కలదు. అది యేమనగా, ప్రతిదినము ఉదయము నిద్రలేచినది మొదలు మరల పరుండువఱకును

మనము చేపల వాసనకు అలవాటుపడియున్నాము. ఈనాడు మనకు ఒక నూతన గంధము ముక్కులకు తగులుచున్నది. గులాబివాసన, సంపెగవాసన, మల్లెవాసన, చేమంతివాసన ఇచట వ్యాపించియున్నవి. ఇది యేదో మనకు క్రొత్తగ నున్నది. ఈ వాసనలు మనకు గిట్టుటలేదు. కావున ఇపుడు మనకు హాయిగ నిద్రపట్టవలెనన్న మనకు ఇష్టమైన పాత వాసన అనగా చేపలవాసన కావలసియున్నది. మన చేపల బుట్టలు ఇంటిలోపల ఉన్నవికదా. వాటిని తెచ్చుకొని మన ముక్కులయొద్ద పెట్టుకొని పరుండినచో నిద్రాదేవి తాండవించగలదు."

బాలరుల పెద్ద వచించిన ఆ వాక్యములు సహేతుకములుగ నుండుటచే తక్కిన వారందరు అతని భావముతో ఏకీభవించి తలుపుతట్టి ఇంటి యజమానిని లేపి లోనగల తమ తమ చేపల బుట్టలను బయటకులాగి వారి వారి ముక్కుల సమీపమున పెట్టుకొని పరుండిరి. తత్క్షణమే వారు ఒడలు మఱచి నిద్రపోవుచుండిరి. ప్రభాత సమయమున భాస్కరుడుదయించిన కొద్దిసేపటివఱకు వారా ప్రకారము గాఢసుషుప్తి యందున్నవారై తదుపరి లేచి పట్టణమునకు పోయిరి.

పూర్వ సంస్కార బలమెట్టిదో ఈ కథ నిరూపించుచున్నది. అజ్ఞానులు బహుజన్మార్జిత దృశ్యవాసనలతో

ప్రాచీనవారై, విషయ భోగవిలాసములే గొప్పవిగ తలం చుచు, దుర్వాసనా ప్రభావముచే దైవోన్ముఖులు కాక యున్నారు. పరమార్థ విషయములు, ఆధ్యాత్మిక ప్రబోధ ములు వారికి రుచించకున్నవి. (బాలురకు సంపెంగవాసన రుచించనట్లే) క్షణికములై, దుఃఖమిశ్రితములైనట్టి శబ్ద స్పర్శాది విషయములే వారికి రుచించుచున్నవి. (బాలురకు చేపలవాసన రుచించినట్లు)

**నీతి :— వాసనలు బలీయములు కావున వివేక వంతులు చక్కగ విచారణసల్పి నశ్వరములగు ప్రాపంచిక విషయములయెడల విరక్తిగలిగి శాశ్వతమగు పరమాత్మ సుఖమునకై తీవ్రమగు అన్వేషణ సలుప వలయును.**

o—o

# సోఽహం-దాసోఽహం

ఒక ఊరిబయట ఏకాంత ప్రదేశములో ఒక చక్కని ఆశ్రమము కలదు. సాధకులైనవారు ధ్యాననిష్ఠ నలుపుకొనుటకు అచట ప్రత్యేకముగ కొన్ని కుటీరములు ఏర్పాటు చేయబడినవి. భక్తులనేకులు అచటి కేతెంచుచు ఆయా కుటీరములందు ఉండి ధ్యానాదులను శీలించుచు పోవుచుందురు. ఆ ఆశ్రమమునకు చక్కటి నీటివసతి కలదు. ఒక పెద్ద బావి అచట త్రవ్వబడి యుండెను. దానికి ఆఱు గిలకలు, ఆఱు తాళ్ళు, ఆఱు బొక్కెనలు అమర్చబడి యుండుటచే ఒకే పర్యాయము ఆఱుమంది స్నానము చేయుటకు అనుకూలముగానుండెను. దేవుని పూజకై వలసిన పుష్పములనిమిత్తము ఒక ఉద్యానవనమున్ను అచట కలదు. అందు తులసీ, బిల్వము, మొదలైన పవిత్రవృక్షములే కాక పలురకముల పుష్పజాతులున్ను కలవు. కావున భక్తులనేకులు వచ్చుచు ఆయా పుష్పములను, పత్రిని కోసికొనుచు ఆశ్రమ మధ్య భాగమునగల దేవమందిరమున పూజ సల్పుకొనుచుండిరి. జ్ఞాననిష్ఠులైన వారు అటగల ఏకాంత కుటీరములందు ధ్యానాదులను ఆచరించుకొనుచు నుండిరి.

ఇట్లుండగా ఒక దినమున ఆ ఆశ్రమములో విడిదిచేసిన ఒక జ్ఞాన విచారణాశీలుడు ఉదయము బ్రహ్మ ముహూర్త

ముననే లేచి బావియొద్దకు స్నానమునకై వచ్చెను. తత్సమ
యమున బావియొద్ద ఇతరు లెవరును లేరు. బావికి అనుకునే
యున్న ఒక ఇంటియొక్క గోడకు క్రిందటి రోజుననే సున్నము
కొట్టినందువలన తెల్లటి ఆ గోడ చూడగనే ఆ జ్ఞానసిద్ధుని
హృదయ ఫలకమున ఒక చక్కటి భావముదయించెను. 'నేను
జ్ఞానమార్గావలంబిని. నేను నిరంతరము 'సోఽహం' (ఆ పర
మాత్మయే నేను) అను దివ్యమంత్రమును జపించుచున్నాను.
అది అమోఘమైన మంత్రము. జీవులను కడతేర్చునది. అజపా
గాయత్రి). మఱి అట్టి శక్తివంతమైన మహామంత్రమును నేనొ
క్కడనే జపించి, నేనొక్కడనే తరించినచో, జనసమూహ[illegible]
నది యెట్లుపయోగించగలదు? నా తోబాటు తక్కినవా[illegible]
కూడ దానిని జపించి తరించవలెను. అట్లు జపించుటకు తగిన
అవకాశములను ఇతరులకు నేను కలుగజేయవలెను. 'స్వా[illegible]
నోమోక్షార్థం జగద్ధితాయచ' అన్నట్లు నేను తరించి [illegible]
తరించుటకు వలసిన సహాయమును నేను చేయవలెను. [illegible]
నేను ప్రతిదినము జపించుచున్న "సోఽహం" అను [illegible]
మును [illegible] ఈ తెల్లటి గోడపై వ్రా[illegible]
స్నానమునకు వచ్చినవారందఱును ఆ దివ్యమంత్రమును
చదివి, జపించి, ధ్యానించి, తరించి పోవుదురు. ఈ ప్ర[illegible]
రముగ వారి ఆత్మోన్నతికి నేనంతయో సహాయపడి[illegible]
వగుదును. తద్ద్వారా నాజన్మ సార్థకముకాగలదు" [illegible]

ముగ ఆ జ్ఞాననిష్ఠుడు తనలో తాను విచిక్సతి గ
ఒక బొగ్గుతో ఆ గోడపై "సోఽహం" అను మంత్ర
తాటికాయంత అక్షరములతో వ్రాసి సంతృప్తిపడి స్వా
చేసి ఆశ్రమములోని తన కుటీరమునకు వెడలిపోయెను.

అతడు పోవుటయే తడవుగా ఆ ఆశ్రమములో
చేసిన ఒక భక్తుడు అనగా భక్తిమార్గావలంబి
యొద్దకు స్నానార్థమేతెంచెను. బావిచెంతకు రాగా ఆ
సమీపస్థకుడ్యముపై పడెను. దానిపైనున్న "స
మంత్రమును చదువుకొని "రామ! రామ ఎవరో
జ్ఞానమార్గ సంబంధమైన మంత్రమును వ్రాసి చ
నారు. నా భక్తిమార్గ సంబంధమైన మంత్ర
ఉండినచో ఎంత బాగుండెడిది. అని తలంచి
తరము జపించుచున్న భక్తిమార్గ మంత్రమగు
(ఓ దేవా! నేను నీ దాసానుదాసుడను) అను
స్థానే వ్రాయదలంచెను. పాత మంత్రమును
క్రొత్తమంత్రమును వ్రాయునుద్దేశ్యముతో న
అట్లు చేసినచో మొదటి మంత్రమును వ్రాసిన
నకు కొలుదువ్వునేమోయను భీతిచే దానిని
మంత్రమునకు మొదట "దా" అను అక్షర
చేర్చెను. తోడనే ఆ మంత్రము "దాసో
పోయెను. "ఆహా! నా మంత్రము గోడ

యని ఆ భక్తిమార్గావలంబి చిందులు త్రొక్కసాగెను. తదు పరి యతడు స్నానాదులను నిర్వర్తించుకొని ఆశ్రమములోని తన కుటీరమునకు వెడలిపోయెను.

మఱుసటిదినము తెల్లవారుజామున మొదట వ్రాసిన జ్ఞానమార్గావలంబి బావికడకు స్నానమునకు రాగానే గోడపై చూచి ఆశ్చర్యచకితుడై తన జ్ఞానమంత్రమగు "సోఽహం"ను ఎవరో "దాసోఽహం"గా మార్చివేసిరని గమనించి తిరిగి తన జ్ఞానమంత్రమా గోడపై ప్రకటమగునట్లు చేయ నిశ్చయించి దానిని చెరిపివైచినచో వ్రాసినవాడు కలహమునకు వచ్చు నేమోయని భావించి ఆ "దాసోఽహం" మంత్రమును చెఱుప కనే దాని మొదట "స" అను అక్షరమును వ్రాసెను. అప్పుడది 'సదాసోఽహం' (ఎల్లప్పుడు సోఽహం) గా మారిపోయెను. తన జ్ఞాన మంత్రము గోడపై పదిలముగానే యున్నదని సరి పుచ్చుకొని ఆ జ్ఞాననిష్ఠుడు స్నానముచేసి వెడలిపోయెను. అతడు పోగానే పూర్వపు భక్తుడువచ్చి "రామ! రామ! మరల గోడపై జ్ఞానమంత్రము సాక్షాత్కరించినదే' యని తలంచి ఆ మంత్రమునకు మొదట మరల "దా" అనివ్రాసెను. అప్పుడది "దాసదాసోఽహం"గా మారిపోయెను. దానిని చూసి భక్తుడు సంతుష్టాంతరంగుడై తన భక్తి మంత్రము తిరిగి గోడపై వెలసెనని నిశ్చయించి పరితృప్తినిబడసి స్నానమాచ రించి వెడలిపోయెను.

ఈ ప్రకారముగ జ్ఞానమార్గి "స" అను అక్షరమును భక్తిమార్గి "దా" అను అక్షరమును మరల మరల జోడించుచు ఆశ్రమమున కాలక్షేపము చేయదొడంగిరి. ఒక వారము దినములైన పిదప ఒకనాడు ఆ ఆశ్రమ మేనేజరుగారు బావియొద్దకు వచ్చుట తటస్థింప గోడపై బొగ్గుతో వ్రాయబడిన ఆ వ్రాతలను చూచి వెనువెంటనే వ్రాసినవారిని అచటికి పిలిపించి "ఓయీ! మీరిరువురు మీమీ మార్గములు గొప్పవని తలంచి మధ్యలో మా ఆశ్రమ గోడంతయు వికృతముచేసి పెట్టిరి. మీరు మీలో ఆ మార్గములనుగూర్చి పోలకించవద్దు. గీతలో శ్రీకృష్ణ పరమాత్మ భక్తిజ్ఞానముల రెంటింటిని చక్కగ సమన్వయము చేసి రెండును అవసరములని చెప్పియుండలేదా ? అని వారికి హితవు చెప్పి పంపివేసెను.

నీతి :— జనులువారివారి సంస్కారములననుసరించి భక్తిని, జ్ఞానమును చక్కగ అభివృద్ధి పరచుకొనుచు ఒకటి ఎక్కువ ఒకటి తక్కువ అను భావమును ఏమాత్రము చోటీయక అయా మార్గములనుగూర్చి కలహించక, రెండిటి సహాయముచే హృదయమును పరిశుద్ధ మొనర్చుకొనుచు రెండిటియొక్క లక్ష్యము భగవత్సాక్షాత్కారమేయని నిశ్చయించి తల్లక్ష్యసాధనకై ఇతోధికముగ ప్రయత్నించవలయును.

# గురువు లేని విద్య

ఒకానొక పట్టణమందు ఒక గొప్ప కంటి [illegible]
[Eye Specialist] కలడు. అతడు పశ్చిమదేశము[illegible]
వెళ్లి నేత్రచికిత్సకు సంబంధించిన పెద్ద పెద్ద పరీక్ష[illegible]
స్వదేశమునకు తిరిగివచ్చిన దిట్ట. నేత్ర వైద్య[illegible]
విశేష అనుభవమును సంపాదించి ఆ విద్యయం[illegible]
తానే సాటి అనిపించుకున్న మహామేధావి. అత[illegible]
దేశములందు చదువు పూర్తిచేసికొని స్వదేశ[illegible]
వచ్చి ఒక మహా పట్టణమందు వైద్యశాలను [illegible]
భించెను. నేత్ర విజ్ఞానమందు అతనికి [illegible]
అతనియొక్క సునిశిత అనుభవము, [illegible]
నిదానమును కనిపెట్టగల శేముషి. అ[illegible]
వలన అచిరకాలములో విశేష జనాదర[illegible]
గలిగెను. కంటిరోగులు ప్రతిదినము తం[illegible]
అతని నివాసమునకు రాదొడంగిరి.

కంటివలననే జగత్తుయొక్క ఉనికి సమస్తల[illegible]
చున్నది. కన్నులేనిచో జగత్తు [illegible]
ప్రపంచము శూన్యప్రాయముగానే [illegible]
యములన్నిటియందు కన్ను ప్రధానమ[illegible]

కంటినుండి నీరు అతనికి ధారగా ప్రవహించుచుండెను. ఊహించరాని బాధతో అతడు కుమిలిపోవుచుండెను. ఇంటికి రాగానే డాక్టరుగారున్నారా! అని దీనవదనముతో అతడు ప్రశ్నించెను. తోడనే అచటనున్న డాక్టరుగారి కుమారుడు 'లేరు' అయినప్పటికి మీరేమియు దిగులుపడవద్దు. మీ బాధను నేను తొలగించెదను. అని పలికి రోగిని కుర్చీలో కూర్చుండబెట్టి టేబిల్ పై నున్న ఒక పెద్ద పుస్తకములోని పేజీలను త్రిప్పుచుండెను. డాక్టరుగారి కుమారుడు బి. ఏ. ప్యాసైనవాడు. వైద్య వృత్తిలో కించిత్తైనను అనుభవము లేనివాడు. వైద్య గ్రంథములో చూచి ఆ ప్రకారము చేయదలంచినవాడై అందలి పుటలను త్రిప్పుచుండెను. అతని అదృష్టమేమియో కాని ఒక పేజీలో అతడు అభిలషించిన రోగమునకు చికిత్స లభ్యమయ్యెను "కంటివెంట నీరు కారుచుండినచో వీపుపై వాత పెట్టవలెను" అని ఆ గ్రంథమందు తెలుపబడియుండెను. అపరిమిత ఆనందముతో చిందులు త్రొక్కుచు అతడు వెనువెంటనే వంటశాల లోనికి పోయి ఒక ఇనుపకాడను నిప్పులో ఎఱ్ఱగా కాల్చి, దానిని తెచ్చి కంటిరోగియొక్క వీపుపై పెట్టెను. అసలే కంటి వ్యాధితో బాధపడుచు దినమొక యుగముగా గడుపుచున్న ఆ రోగి వీపుమీది వాత వలన గలిగిన నొప్పిచే మరింత బాధ పడుచు ఏడ్చుచు పారిపోయెను. పోవుచున్న ఆ రోగిని

ఉద్దేశించి భిషగ్వర్యుని తనయుడు 'మీకేమియు భయము లేదు. కొద్ది సేపటిలో కంటివెంట నీళ్లుకారుట నిలచిపో గలదు. గ్రంథములో చెప్పినట్లే చేసినాను. దీనిలో ఏపొర పాటున్ను లేదు. ధైర్యముగా పొమ్ము, అని పలికెను.

రోగి వెడలిపోయిన క్రొద్ది సేపటికి డాక్టరుగారు పట్టణమునుండి తిరిగి వచ్చిరి. రాగానే కుమారుడు జరిగిన వృత్తాంతమంతయు పూసగ్రుచ్చినట్లు తండ్రికి మనవిచేసెను. తండ్రి ఆశ్చర్య చకితుడై, క్రోధావిష్టుడై "ఇటువంటి అపసవ్యపు పనులు చేయవచ్చునా?' అని కుమారుని మందలించగా అతడు "నాన్నగారూ! నేను తప్పేమియు చేయలేదు. ఈ పుస్తకములో ఉన్నది ఉన్నట్లుగా చేసినాను" అని ప్రత్యుత్తర మొసంగ, తండ్రిగారు ఆ పుస్తకమును తీసిలోపల చూచిరి. తీరాచూడగా, చికిత్స సరిగానే ఉన్నదికాని, అసలా పుస్తకము మనుష్యులకు సంబంధించినది కాదు, పశువులకు సంబంధించినది (A book on cat జరిగిన విషయమునకు వగచినవాడై డాక్టరుగారు కుమారునితో ఇకమీద ఎపుడును ఇట్టి పనులు చేయరాదనియు, అనుభవము కలవారియొద్ద కొంత కాలము శిక్షణ పొందనిదే, అనుభూతిని బడయనిదే ఇట్టి పనుల కుపక్రమింపరాదనియు హెచ్చరించెను.

ఏ విద్య అయినను దానియందు నిష్ణాతుడైన అనుభవశాలియొద్ద కొంతకాలము పక్కగ నేర్చుకొని ఆచరణ సంబం

ధముళైన కీలకములను తెలిసికొనినపుడే ఆ విద్య లెస్సగ రాణించును.

**నీతి** — అధ్యాత్మ విద్య అతి సూక్ష్మమైనది యగుటచే బహుకాలము సాధనచేసి తత్త్వమునుగ్రహించిన మహనీయులగు గురువులద్వారా అది చక్కగ బోధపడగలదు. గ్రంథముల ద్వారా ఒకింతయు,అనుభవజ్ఞులద్వారా పరిపూర్ణిగను విద్య లభించగలదు.

## విషయ వాసన

ఒకానొక పట్టణములో ఒక పెద్ద వర్తకుడు కలడు. అతని అంగడిలో అన్నిరకముల వస్తువులును దొరకును. వస్తువులను చాల పరిశుభ్రముగ నుంచుటలో అతనికి అతనే సాటి. అందుచేత ఆ పట్టణవాసులలో పలువురు వారివారికి ఏదైన వస్తుపదార్థములు కావలసివచ్చినప్పుడు అతని అంగడికే వచ్చుచుందురు. గొప్ప నిజాయితీ కలవాడని, మంచి వస్తువులనే విక్రయించువాడని ఆ పట్టణములో అతనికి ఖ్యాతి లభించినది. ఏక్షణములో చూచినను అతని కొట్టు జనులచే కిటకిటలాడుచుండును. మధ్యాహ్నము భోజనసమయమున మాత్రము ఒక గంటసేపు మూసివేయబడి యుండును.

ఇట్లుండ ఒకనాడు సరిగా మిట్టమధ్యాహ్నకాలమున వర్తకుడు అంగడి మూసి భోజనముచేయుటకు లోనికేగగా కిటికీలోనుండి ఒక కోతి అంగడిలోపలికి ప్రవేశించెను. అది నలుదెసలు పరికించి అచట ఎవరును లేరని గ్రహించినది. అత్తరి ఆశాఖామృగము నిర్భయముగ తన పని కొనసాగించినది. తట్టలు, బుట్టలు అన్నీ వెతికినది. అన్నిటిలోను చేతులు దూర్చినది. దాని కిష్టమైనది ఏదీ దొరకలేదు. ప్రక్కనే ఒక చోట ఒక పెద్ద ఇనుపకూజా కనబడినది. దాని మూతి పకద్రోచి దానిలో చేతిని ప్రవేశపెట్టినది. ఇక దాని సంతోషమేమని చెప్ప వచ్చును! అందులో జీడిపప్పు తాజాసరుకు ఉండెను. వానరము గుప్పెట నిండుగా దానిని పరిగ్రహించి చేతిని బయటకు లాగెను. కాని చేయి రాలేదు. గుప్పెట పెద్దదిగా నుండుటవలనను, కూజా మెడ సన్నగా నుండుట వలనను చేయి బయటకు రాకుండెను. ఎంతయో తంటాలు పడినది. భగీరథప్రయత్నము చేసినది కాని చేయి బయటకు రాలేదు. చేతిలో జీడిపప్పు ఉన్నంతవరకు గుప్పెట పెద్దదిగా నుండుటచేత కూజాయొక్క ఆ సన్నమూతిలో చేయి పట్టదు. పప్పు వదలి వేసినచో చేయి ధారాళముగా బయటకు వచ్చి వేయును. కాని ఆ కోతికి పప్పుమీద ఆశ చావనందున, పప్పును కూర్చిన వాసన బలముగా నున్నందున దానిని వదలుటకు ఇష్టపడలేదు. పప్పు వదలనిచో చేయి బయటకు రానేరాదు.

ఇట్టి విపత్కర విపరీత పరిస్థితిలో ఆ వానరమునకు ఏమి చేయుటకును తోచక ఆ చేతిని ఈడ్చుకొనుచు మెల్లగ నడువ సాగెను. యి కూజాలో బిగుసుకొనిపోయినందున కోతి కదలగనే కూజా క్రిందపడి కోతితో బాటు కదలరాదొడగెను. కూజా క్రిందపడిన శబ్దమును విని వర్తకుడు తడాలున అంగడి లోనికి ప్రవేశించెను. కోతి యొక్క రాద్ధాంతమంతయు చూచి అతడు వెంటనే లోనికేగి ఒక దుడ్డుకఱ్ఱ తెచ్చి దాని వీపుపై ఒకటిరెండు దెబ్బలు వేసెను. కానికోతి పప్పును వదల లేదు, మఱి రెండు దెబ్బలు పడినవి. అప్పటికీ వదలలేదు. దెబ్బలవర్షము పడుచుండెను. కాని పప్పుమీది ఆసక్తిచే కూజాలోని చేతిని అది విడువజాలకుండెను. పిడికిలిని అట్లే యుంచుటవలన చేయి కూజానుండి బయటకు రాకుండెను. అపుడు వర్తకుడు మఱికొందఱి సహాయముచే కోతియొక్క చేతిని కూజానుండి బలాత్కారముగ బయటకులాగి కోతిని దూరముగ వెడలగొట్టెను.

కోతి శరీరము గాయములచే నిండిపోయెను. ఆ బాధను అది కొని తెచ్చుకొనెను బాధకు కారణము విషయాశయే. విషయవాసనయే. పాపము! పప్పుమీది ఆసక్తి ప్రాణమునకు ముప్పు తెచ్చినది. మొదటనే ఆ పప్పును వదలివైచినచో చేయి కూజానుండి సుఖముగ బయటకు వచ్చివేసి బాధ తొలగియుండెడిది. కాని పాపమా జంతువు తన సంసార

మునకు లోబడిపోయి, ఆశను చంపుకొనలేక, విషయవాసనా
ప్రాబల్యముచే ప్రాణమునకే ముప్పు తెచ్చుకొనినది.

అట్లే జీవుడు ప్రాపంచిక దృశ్య వస్తుసముదాయము
పైనను, బంధుజాలముపైనను మమత్వమును పెంచుకొని,
ఆశలను ద్విగుణీకృతమొనర్చి అట్టి ఆశాపాశములచే బంధింప
బడి, మృత్యుదేవత ఆసన్నమైనను, యమధర్మరాజు ప్రసార
ములు సలుపుచున్నను వారిపై మమత్వమును వదలలేకు
న్నాడు. తత్ఫలితముగ ఘోర దుఃఖమును అనుభవించుచు
విషయవాసనా ఫలితముగ మరల పుట్టుచు, మరల చచ్చుచు
జనన మరణ ప్రవాహమున తగుల్కొని నానాయాతనలను
అనుభవించుచున్నాడు. దృశ్యపదార్థములు నశ్వరములనియు,
పరిపూర్ణ ఆనందమును అవి ఒసంగలేవనియు తెలిసికొని
వానిపై విరక్తి కలిగి శాశ్వత పరమాత్మను ఆశ్రయించినచో
జీవుడు యమబాధనుండి ఎప్పుడో తప్పించుకొని యుండెడివాడు.
అనంతానందమును అనుభవించెడివాడు. కాని బహుజన్మార్జిత
విషయ సంస్కారము, విషయవాసన ఆతనికి అడ్డుపడుచున్నది.
జీవుని దుఃఖమునకు కారణమదియే. కావున ప్రయత్నపూర్వ
కముగ అజ్ఞానిని తొలగించికొని జీవుడు పరమానంద మనుభ
వించవలెను.

నీతి :— కథలోని కోతివలె మానవుడు ఆశలను పెంచు
కొనక విషయాసక్తిని అలవరచక, తత్త్వవిచారణచే

దృశ్యవస్తువులయొక్క క్షణికత్వమును, దుఃఖమిశ్రిత త్వమును బాగుగ తెలిసికొని, వానియెడల విరాగము గల్గి, శాశ్వత పరమాత్మపై భక్తిని పెంచుకొనవలెను.

## దుఃఖమునకు మూలహేతువు

ఒకానొక గ్రామమున ఒక పురోహితుడు కలడు. ఆ గ్రామములోని దేవాలయమున అతడు పూజాకైంకర్యములు జరుపుచుండును. ప్రతిదినము ప్రభాత సమయముననే లేచి స్నానసంధ్యాదులను నిర్వర్తించుకొని దేవాలయమునకు వెళ్ళి తన విధులను సక్రమముగ నెరవేర్చుకొని ఇంటికి వచ్చుచుండును. అతనిది ఒక చిన్న పెంకుటిల్లు. ఆయిల్లు అతడు కట్టించినదికాదు. అతని తండ్రిగాని, తాతగాని కట్టించినదికాదు. అతని వంశములో ఎవరో పూర్వీకులు కట్టించినది. దానిని తరతరములనుండియు అతని పూర్వజులు అనుభవించుచుండిరి. కొంత కాలము క్రిందట పురోహితుని తండ్రి దానిని అనుభవించుచుండగా, అతడు పరమపదించిన పిదప ఆ యిల్లు పురోహితుని వశమయ్యెను.

పురోహితుడు స్వయంకృషిచే ఉన్నత విద్యను చక్కగ అభ్యసించి, విరామ సమయములందు విద్యార్థులకు

"ట్యూషన్లు" చెప్పుకొనుచు అచిరకాలములో కొంత సంపదను గడించెను. తనకు పిత్రార్జితముగా సంక్రమించిన ధనముతో అద్దానినిచేర్చి ఆ గ్రామమునందు నూతనముగ ఒక సుందర సువిశాల ఆధునిక రమణీయ భవనమును కట్టించి, ఒకానొక సుముహూర్తమున అందు గృహప్రవేశమును గావించెను. వంశపరంపరగా వచ్చిన తన పాత ఇంటిలోని సామానునంతటిని అప్పుడు నూతన గృహమునకు వెనువెంటనే అతడు తరలించివేయ దొడగెను పాత్రలు, పెట్టెలు, మంచములు, ఒకటననేల" సామాను మొత్తము బండ్లపై నూతన భవంతికి తరలిపోదొడగెను. ఈ ప్రకారముగ పాతయింటిలోని వస్తువులన్నియు బయటకు వెళ్ళినవి కాని ఒక్కవస్తువు మాత్రము అచటనుండి కదలి రాలేదు. అది ఒక నిలువుటద్దము. చాల పెద్దది. ఏ పూర్వీకులు దానిని తయారు చేయించిరోకాని అది ఒక అద్భుతమైన పనితనముతో గూడిన వస్తువిశేషము ఆ నిలువుటద్దము గదినుండి బయటకు రాలేదు. ఏలయనగా, ద్వారములో అది పట్టలేదు. ద్వారము చిన్నది. అద్దము పెద్దది. కావున ఒక చిక్కుసమస్య ఏర్పడినది. ఆ గ్రామములోను, పరిసర గ్రామములలోనుగల హేమా హేమీలందరు వచ్చి వారివారి శక్తియుక్తులన్నిటిని ప్రయోగించి చూచిరి. కాని విఫలురైరి. అద్దము బయటకు రాలేదు.

పురోహితునకు ఏమిచేయుటకు తోచలేదు. ఆ యూరిలో విశేషముగ పలుకుబడిగల వ్యక్తి యగుటవలన అతడు దీర్ఘముగ యోచించి ఊరి పెద్దలందరిని ఒకచోట సమావేశపఱచి అద్దము ఇంటి నుండి బయటకువచ్చు మార్గములను అన్వేషింప దొడగెను. ఆ పురజన మహాసభయందు ఒక్కొక్కరు వారివారికి తోచిన సలహాలను ఇచ్చుచుండిరి. సభామధ్యమునుండి ఒక పురప్రముఖుడు లేచి 'సభాసదులారా! నా వాక్యం ఆలకించండి. ఇది చాలా చిక్కుసమస్య ఈ సమస్యను మనం దీర్ఘంగా, దూరంగా, తీక్షణంగా యోచించి తగుపరిష్కారం చేయవలసి యున్నది. మన గ్రామములో ఇందరు పెద్దలు, ఇందరు విజ్ఞానసంపన్నులు, ఇందరు లోకయుక్తి ధురంధరులు ఉండగా ఈ సమస్యను విడదీయలేకపోవుట సముచితంగా తోచలేదు. ఇపుడు అద్దము బయటకు రావలసి యున్నది. ద్వారమో చాల చిన్నదిగా ఉన్నది. కాబట్టి పాత ద్వారము కొట్టివైచి కొంత పెద్దదిగా చేసినచో అద్దము అమాంతముగా బయటకి రాగలదు'-అని చెప్పి కూర్చుండెను. వెనువెంటనే మరియొక పురప్రముఖుడు లేచి దానికి ప్రతికారముగ ఆక్షేపణ చెప్పదొడంగెను.

'మహాశయా! మీరు చెప్పిన ఉపాయము బాగానే ఉన్నదికాని, తరతరములనుండి అవిచ్ఛిన్నముగ వచ్చుచున్న ఇంటిని పగులగొట్టుట న్యాయసమ్మతము కాదు. ఇల్లు యథా

ఉపాయం ఆలోచించండి! అపుడు మఱియొక సభ్యుడులేచి 'అయ్యా! నామాట ఆలకించండి. అద్దం పెద్దది. ద్వారం చిన్నది. కాబట్టి అద్దాన్ని రెండుగా చీలిస్తే సునాయాసంగా బయటకు పోతుంది'- అని విజ్ఞానపూర్వకముగు సలహా నొసంగగా తక్షణమే ప్రక్కనున్నవాడు లేచి 'మహానుభావా! అంతపని చేయకండి. అద్దాన్ని చీల్చడానికి దానిమీద కత్తి పెడితే అది రెండుముక్కలు కావచ్చు, పదిముక్కలు కావచ్చు. అది వారి వారి అదృష్టంపై ఆధారపడి ఉంటుంది' అని కుండ బ్రద్దలుకొట్టినట్లు చెప్పి ఊరకుండెను.

ఈ ప్రకారముగ ఆ సభలో వాదోపవాదములు చెల రేగెను. సమస్యకు తగు నిర్ణయము కుదరలేదు. పూర్వపక్ష ప్రతిపక్షములు లెక్కలేనన్ని వచ్చిపడెను. వారి వాదవివాదములతో భావసంఘర్షణలతో సభాస్థలమంతయు ప్రతిధ్వనింపదొడగెను. కాని సమస్య ఏమాత్రం పరిష్కారము కాలేదు. అట్టి వివత్కర విపరీత పరిస్థితియందు ఒక వృద్ధుడు సభామధ్యము నుండి చిఱునవ్వు లేచి 'అయ్యా! సభాసదులారా! మీ లో మీరు తగువులాడుకోవద్దు. ఇది ఒకరిపై ఒకరు కారాలు మిరియాలు నూరిపోసుకొనే సందర్భం కాదు. ఒక జటిలమైన, విజ్ఞానవంతమైన సమస్యకు పరిష్కారం ఆలోచించవలసిన సమయమిది. అద్దం బయటికి రావటానికి అందరూ వారి వారి సలహాలు ఇస్తున్నారు. మంచిదే. ద్వారం చిన్నది. లోనగల

అద్దం పెద్దది - అని అందఱూ ఉద్ఘాటిస్తున్నారు. కాని అసలా అద్దం లోపలికి ఎట్లారాగలిగిందో ఊహించండి. పెద్ద అద్దం చిన్నద్వారం గుండా లోపలికి ఎట్లా వచ్చింది? దీని నెవరైనా ఆలోచించారా ? ఇపుడాలోచించవలసిన ముఖ్యవిషయం అద్దం బయటికి ఎలా పోతుందని కాదు అసలా అద్దం లోపలికి ఎలారాగలిగింది అని.'-వృద్ధుని సమయోచితమగు వాక్యమును విని సభ్యులెల్లరు భేష్ భేష్ అని సంతోషముతో చప్పట్లు కొట్టి ఆలోచనానిమగ్నులైరి.

నీ తి : లోకములో జనులు 'దుఃఖ మెట్లు తొలగ గలదు ? దుఃఖము తొలగుటకు మార్గమేమి ?' అని ఆలో చించుచున్నారు. కానీ మహర్షులగువారు 'అసలు దుఃఖ మేల వచ్చినది ?' అని యోచించి అజ్ఞానమువలననే దేహము, దేహము వలన దుఃఖము వచ్చినదని గుర్తెఱింగి ఆ అజ్ఞాన మును ముందు తొలగించివైచినచో దుఃఖము దానంతట అదియే తొలగిపోగలదని నిశ్చయించి అజ్ఞాని నివారణకై జ్ఞానమును, ఆత్మవిచారణను లోకమున చక్కగ ప్రబోధ మొనర్చిరి.

# అనుభవములేని విద్య

ఒకానొక పట్టణమందు ఒక చిన్న ఉద్యోగి కలడు. అతనికి నూతనముగ వివాహమయ్యెను. భార్యగారు కాపురమునకు రాగానే ఒక చిన్న చిక్కు సమస్య ఏర్పడెను. అర్ధాంగికి వంటచేయుట రాదు. భర్తకు అసలేరాదు. అట్టి విపత్కర పరిస్థితియందు ఏమిచేయవలెనో తోచక భర్త ప్రతిదినము పట్టణములోని ఒక హోటల్ నుండి భోజనము తెప్పించు నదుపాయమును గావించెను. వారిరువురికిని సరిపడ భోజనమును ఒక క్యారియర్‌నింత పెట్టుకొని ఒక పిల్లవాడు హోటల్ నుండి తెచ్చి ప్రతిదినము వారికి అందచేయుచుండెను. ఈప్రకారముగ కొద్దిరోజులు గడువగా భోజనపు రేటు విపరీతముగ పెరిగిపోవుటవలన ఆ పద్ధతి-అనగా హోటల్ నుండి భోజనము తెప్పించుట-వారికి చాల దుర్భరముగా తోచెను. ఉద్యోగమూ చిన్నది. ఆదాయమూ స్వల్పము. భోజనాదికములా అధికము కాజొచ్చెను.

ఇట్టి పరిస్థితియందు భార్యాభర్త లిరువురను ఒకరోజు సమావేశమై ఆ చిక్కును అధిగమించుటకు పర్యాలోచనలు చేయదొడంగిరి. ఒక్కొక్కరు కొన్ని కొన్ని సూచనలను గావించిరి. భోజన సదుపాయము చక్కగ సాగిపోవుటకు, వ్యయము తగ్గిపోవుటకు ఏయే సాధన విధానములు కలవో వాటినన్నిటిని గూర్చి ఆ దంపతు లిరువురును కూలంకషముగ

చర్చించిరి. తుట్టతుదకు వారిరువురును ఏకగ్రీవముగ ఒక తీర్మానమును గావించుకొనిరి. ఆ తీర్మానప్రకారము ఇక మీదట ఒక నెల రోజులవరకు మాత్రమే హోటల్‌నుండి భోజనము తెప్పించుటకును, ఆనెల రోజులలోపల వారిద్దరును పాకశాస్త్రమును క్షుణ్ణముగ నభ్యసించి వంట నేర్చుకొనుటకును, ఆ తదుపరి వారే భోజనసామాగ్రిని పట్టణమునుండి తెప్పించుకొని స్వయముగ వంటచేసి కొనుటకును సిద్ధపడిరి. ఆ ప్రకారముగ చేసినచో ఆహారవ్యయము చాల తగ్గిపోగలదని వారు అభిప్రాయపడిరి.

మఱునాడు ఆ దంపతు లిరువురును ఊరిలోని పుస్తకశాలకు వెళ్లి ఒక పాకశాస్త్ర గ్రంథమును కొని తీసికొనివచ్చిరి. రాత్రింబగళ్లు ఇద్దరును దానిని క్షుణ్ణముగ చదివివైచిరి. పుస్తకమంతయు పూర్తి అయిన పిదప ఒక సుముహూర్తమందు వంటపని ప్రారంభించిరి. ఆదినమున ఉదయము ముందుగనే నిద్రలేచిభార్యా భర్త లిరువురును స్నానాదికములను నెరవేర్చుకొని పాకశాస్త్రగ్రంథమును ముందుపెట్టుకొని దానిలో చెప్పబడినప్రకారము తు. చ. తప్పకుండ చేయుటకు సంసిద్ధులైరి.

పుస్తకములో "పొయ్యి అంటవలెను' అని ఉండుటచే వారిద్దరును ఒక తట్టనిండా పేడతెచ్చి పొయ్యిని బాగుగ అలికిరి. తదుపరి గ్రంథమును చూడగా "పొయ్యిమీద

పాత్రనుంచవలెను" అని దాని యందుండుటను ఒకపాత్రను శుభ్రముగా తోమి పొయ్యిపై నుంచిరి. పిమ్మట "ఒకటిన్నర శేర్లు కొలిది నీరు పోయవలెను, అని గ్రంథము నందుటవలన, వారు తమ వీధియందున్న ఒక వర్తకుని యింటిలోగల కొలత పాత్రి తెచ్చి ఒకబొట్టు తక్కువగాని, ఎక్కువగాని లేక సరి సమానముగా ఒకటిన్నర శేర్లు నీరు ఆ పాత్రలో పోసిరి. తరువాత "ముప్పావుశేరు బియ్యం దానిలో పోయవలెను." అని పుస్తకమునందు వ్రాయబడి యుండుటవలన వారిద్దరును అదే కొలతలో బియ్యమును తెచ్చి బాగుగ కడిగి ఆ పాత్రిలో పోసియుంచిరి. అరగంట దాటినది బియ్యము ఉడకలేదు. గంట దాటినది. ఒక్కగింజైనను ఉడకలేదు, ఆ దంపతులిరువురును ఆశ్చర్యచకితులగుచుండిరి.

ఏకారణముచేత బియ్యము ఉడకలేదు ? పుస్తకములో చెప్పిన ప్రకారము పొల్లు పోకుండ చేసినామే ! అని వారిద్దరును తమలో తాము భావించుకొనుచుండ ఇంతలో ప్రక్కయింటి స్నేహితుడొకడు అచటికివచ్చి, వారు చేయుచున్న దాని నంతను వీక్షించి 'ఏమండీ ! పొయ్యిలో కట్టెలుపెట్టి మంటచేయలేదేమి ? అని ప్రశ్నింపగా 'ఆ విషయము పుస్తకమందు తెలుపబడి యుండలేదు' అని వారు ఖచ్చితముగ సమాధానము చెప్పినైచిరి. వారి వాక్యములను విని స్నేహితుడు పకపక నవ్వి 'పుస్తకమునందు తెలుపబడినదానిని

అనుభవజ్ఞుడైన వ్యక్తియొద్ద నేర్చుకొనుట ఉత్తమము. అపుడు మాత్రమే దానికి సంబంధించిన వివరములు, పద్ధతులు ఆచరణాత్మక ప్రయోగములు చక్కగ తెలియగలవు' అని చెప్పి వెడలిపోయెను. అతడు వెడలిన పిమ్మట భార్యాభర్తలు పొయ్యిలో మంటపెట్టి అన్నమును తయారు చేసికొని భుజించి సంతుష్టులైరి.

నీతి:— సామాన్య విద్యలకే గురువు అవసరమైనపుడు, ఇక అతి సూక్ష్మమైన అధ్యాత్మవిద్యకు అవసరమని వేఱుగ తెలుపనక్కరలేదు. గ్రంథములను చక్కగ చదివి, వానిలోని విషయములను సద్గురువు ద్వారా బాగుగ నభ్యసించి, అనుష్ఠాన పద్ధతులను వారి వలన లెస్సగ తెలిసికొని మానవుడు తడతేరవలెను. అధాత్మవిద్య ఆచరణాత్మకమైన విద్యయేకాని వాచావిద్య కాదని ముముక్షువులు జ్ఞప్తియందుంచుకొనవలెను.

—o—

# సాధనయందు అప్రమత్తత

బ్రాహ్మీస్థితిని, దైవస్థితిని అంత్యకాలము వఱకును సాధకుడు కాపాడుకొనుచునే యుండవలెను. ఏలయనిన మాయ బలిష్ఠమైనది. అది ఓడిపోయినట్లు నటించి అమాంతముగ నొక సమయమున విరుచుకుపడును. అది నివురుగప్పిన నిప్పువలెనుండును. సాధకులు బహుజాగ్రత్తగ నుండవలెను.

"The mind has the knack of making the unwary aspirant confidently think himself its master while in fact it makes a hopeless fool of him"

మనస్సు తాను జయింపబడినట్లు సాధకునకు తోపింపజేసి ఎపుడో ఒకపుడు (సాధకుడు అజాగ్రత్తగ నున్నపుడు) అతనిని చల్లగా క్రిందకు బడద్రోయును. ఇదియే దాని తెలివి.

"స్థిత్వాఽస్యామన్తకాలేఽపి బ్రహ్మనిర్వాణమృచ్ఛతి"

(2-72)

(బ్రాహ్మీస్థితిని, (ఆత్మజ్ఞానమును, ఇంద్రియనిగ్రహమును) అంత్యకాలమందుగూడ ఎవరు కలిగియుందురో అట్టివారు నిర్వాణరూపమగు మోక్షమును బొందుదురు. జీవితమంతయు చక్కని సాధన చేయగలుగువాడే అంత్యకాలమందు అట్టి ఆత్మస్థితిని కాపాడుకొనగలడని ఎవరును మఱువరాదు. కావున అంత్యకాలమువఱకును మాయను నమ్మరాదు. సాధనలో అప్రమత్తుడై యుండవలెను.

పూర్వము మహమ్మదీయులలో "అహమ్మద్" అను మత గురువుండెడివాడు. అతనికి అనేకమంది శిష్యులుకలరు. జీవితకాలములో పెక్కుసాధనలు చేసిన మహాత్ముడతడు. ఇట్లుండ నొకవుడాతనికి అంత్యకాలము సమీపించినది. పడకపై పరుండియుండెను. కన్నులు మూతపడబోవుచుండెను. పడక చుట్టును శిష్యకోటిచేరి పరిచర్య చేయుచుండిరి. ఆ సమయమున గురువుగారి నోటినుండి ఏదియో యొక శబ్దము వచ్చుచున్నట్లు వినిపించినది. జాగ్రత్తగ ఆలకింప 'అభీ నహీ' అను పదములు వినిపించెను. అనగా "ఇప్పుడేకాదు" అని దాని యర్థము. అచటచేరిన భక్తకోటికి అంతకును దానిభావము తెలిసికొనవలెనని కుతూహలము కలిగి గురుమహారాజుగారిని అడిగిరి. అతడిట్లుచెప్పెను. "భక్తులారా! నాకు అంత్యకాలము సమీపించినదని తెలిసికొని "సైతాను" (మాయ) నాదగ్గరకు వచ్చి "అయ్యా! ఇంతవఱకు అనేకమందిని వారిజీవితములో ఏదియో యొక సమయమున నేను బుట్టలో వేసికొనుచుంటిని. నీవుఒక్కడవే బహుజాగ్రత్తగ నున్నవాడవై నా వలలో పడకుండ తప్పించుకొంటివి! ఓహో ఎంత గట్టివాడవయ్యా!" అనిపలుకగా నేను "అభీ నహీ" ఇప్పుడేకాదు అని దానికి జవాబిచ్చితిని. అనగా 'నేనింకను నిన్ను జయించినట్లు చెప్పుకొనలేను, ఏలయనిన, ఇంకను ఒకటి రెండు శ్వాసలు బాకీ యున్నవి. ఈ లోపల నేను అజాగ్రత్తగనున్నచో తప్పకనే

నీవు నన్ను మోసగించగలవు. చివరిశ్వాసవఱకుకూడ నిన్ను నమ్మరాదు' అని దానితో చెప్పితిని" అనిపలికి గురువు నిర్యాణమును బొందెను. శిష్యులదివిని తాముకూడ తమ సాధనల విషయములో బహుజాగరూకులై మెలగిరి. ఆనకట్టలో ఒక చిన్న రంధ్రముపడిన చాలును, దానిగుండ నీరు ప్రవహించిం అనదే క్రమక్రమముగ పెద్దదై తుదకు కట్టనే ఛేదించి వేయును. అట్లే మనస్సును నిగ్రహించునపుడు అది ఒకింత నియమోల్లంఘనమునకు అనుజ్ఞనడుగును. అపుడు జాగ్రత్తగ నుండవలెను. దానికి ఏమాత్రము సందు ఇవ్వరాదు.

నీతి — మనస్సును జాగ్రతగ పరిశీలించుచు దానియందు ఏదోషములు ప్రవేశింపకుండులాగున చూడవలెను. నిరంతర దైవభావన గలిగియుండవలెను.

# ఏకాగ్రత

పూర్వము అవధూత చక్రవర్తియగు దత్తాత్రేయుల వారు దేశాటనము చేయుచు ఒకానొక మార్గముపై పయనించు చుండిరి. ఆ మార్గము ఒకచోట రెండుగా చీలిపోయెను. ఎటు పోయినచో తాను వెళ్లవలసిన గ్రామమువచ్చునో దత్తాత్రేయునకు తెలియలేదు, అందుచే నతడు ఆ రెండు మార్గములకూడలియొద్ద నిలబడి దిక్కులు పరికించుచు దారి తెలిసినవ్యక్తి యెవరైన అటువైపువచ్చునేమోయని బహు కాలము వేచియుండెను. కాని ఒకడును అవైపురాలేదు. అది నిర్జనప్రదేశముగ గన్పట్టెను. సమీపముననే ఒక నది ప్రవహించుచుండెను. ఆ నది ఒడ్డున ఒక బెస్తవాడు నీటిలో గాలమువైచి చేపలు పట్టుకొను చుండెను. దత్తాత్రేయులు ఆచేపలవానిని జూచి అతడు తనకు మార్గము తెలుపగలడేమో యని భావించి అతనిని బిగ్గరగా కేక వేసెను. కాని అతడు పలుకలేదు. 'ఓయీ! ఏమార్గముద్వారా వెడలినచో నేను వెళ్ళవలసిన గ్రామము వచ్చునో చెప్పుమా!' అని అతనిని గూర్చి దత్తాత్రేయులు మరల పెద్దగా అరచెను. కాని ఫలితము లేక పోయెను. మరల మూడవసారి కేకవేసెను. ఫలితము శూన్యము.

ఇక గత్యంతరము లేక దత్తాత్రేయులు తానే ఆ బెస్త వాని యొద్దకుపోయి అతని వీపుతట్టి 'నాయనా! మూడు పర్యా

యములు బిగ్గరగా కేకవేసి నిన్ను పిలిచితినే, పలుకలేదేమి? నీకు వినికిడిశక్తి ఏమైన లోపించినదా? ఇంత సమీపమునుండి పెద్దగా అరచినను నీకు ఆశబ్దము వినిపించకుండుట ఆశ్చర్యము గానున్నది. ఏకారణముచేత నీవు పలుకలేదు?—అని యడుగగా బెస్తవాడీప్రకారముగ ప్రత్యుత్తరమిచ్చెను—

"మహాప్రభో! తామెవరో నాకు తెలియదు. నాకు వినికిడిశక్తి చాల చక్కగా ఉన్నది. చెవుడు ఏమాత్రము లేదు అయితే తాము బిగ్గరగా కేకవేసినను నాకు వినిపించకపోవుటకు కారణము కలదు. నేను నీటిలో గాలముదృష్టితో దానివైపు చూచుచున్నాను. చేప పడునేమోయని ఆతురతతో వీక్షించుచున్నాను. "బెండు ఇంకను మునగదేమి?"- అను విచికిత్స ఒకటి తప్ప ఇతరభావము లెవ్వియు నాయంతఃకరణమున మెదలలేదు, నేను దాదాపు జగత్తునే మరచిపోయితినని చెప్పవచ్చును. ఒక్క చేప భావనయే నా యంతరంగమున తిరుగాడుచున్నది. ఈ కారణమున తమరువచించినది నాకు శ్రవణగోచరము కాకయుండెను. మహాశయా! క్షమించుడు. నావలన గొప్ప అపచారము కలిగినది. తమవంటి మహాత్ములకు శ్రమకలుగచేసినవాడనైతిని."

బెస్తవాని హేతుపూర్వక వాక్యములను విని దత్తాత్రేయులు పర్యను బొంది అహా! ఒడిశర్చ్మునమా చేపకొఱకు ఇత డెట్టి ఏకాగ్రతను అవలంబించెను! ప్రపంచమునే మఱచి

పోవునంతటి తీవ్రప్రేకాగ్రతను ఆతడు సాధించెను. ఇట్టి చక్కటి ఏకాగ్రత ధ్యానవిష్టులకు ఉండినచో ఇక మోక్షము పొందబడి నట్లేకదా! ఏ ఏకాగ్రత, ఏదృశ్యప్రపంచ విస్మరణ ఈ బెస్త వాడు ఒక చిన్న చేపకొఱకై అవలంబించెనో, అట్టి ఏకాగ్రత లో ఒకానొకభాగమైనను భగవంతునియొక్క పాదపద్మములు ధ్యానమునందు వినియోగింపబడినచో మనుజుడు మహోన్నత ఆధ్యాత్మికశిఖరమును చేరుకొనగలడు! ఈ ప్రకారముగ బెస్త వాడు నాకు చక్కని పాఠమును నేర్పిన వాడాయెను.— అని దత్తాత్రేయులు తనలో పర్యాలోచించుకొని ఆచేపలవానిని తన గురువుగా భావించుకొనెను. ప్రపంచములో ఎచటెచట ఏయే పదార్థమునుండిగాని, ఏయే వ్యక్తి నుండిగాని గుణపాఠము లభించుచుండెనో, ఆ యా పదార్థమును, ఆయా వ్యక్తిని తన గురువుగా దత్తాత్రేయులు పరిగణించుకొనుచుండెను. ఈ ప్రకారముగ ఇరువది నలుగురు గురువులు దత్తాత్రేయులకు వారి జీవితకాలమునందు ఏర్పడిరి.

**నీతి:— ఏ ఏకాగ్రత, ఏ కార్యదక్షత, ఏ వియ మనిష్ఠ ప్రాపంచిక జనులు తమ తమ అభిలషితకార్య ములను సాధించుటయందు వినియోగించుచున్నారో అద్దానిని దైవధ్యానమందు, మోక్షసంపాదనమందు వినియోగించినచో అచిరకాలములోనే మనుజుడు ముక్తిధామమును నిశ్చయముగ చేరుకొనగలడు.**

# దైవ దర్శనము

ఒకానొక పట్టణ పరిసర ప్రాంతమున ఏకాంత ప్రదేశము నందు ఒక పర్ణకుటీరమును నిర్మించుకొని సాధుపుంగవు డొకడు ధ్యానాదులను సల్పుకొనుచుండెను. పట్టణములో జిజ్ఞాసువులైన భక్తులు కొందఱు అపుడపుడు ఆ మహాత్ముని యొద్దకు వెళ్ళి ఆధ్యాత్మక్షేత్రమున తమకుగల సందేహములను అతనికి తెలియజేసి వానిని నివారించుకొనుచుండిరి. అనుభ వజ్ఞుడైన ఆ తపస్వి తన దర్శనమునకు వచ్చుచుండిన ఆ ముముక్షువులందఱికిని చక్కని ప్రబోధము గావించుచు పరమా ర్థపథమున వారి కెంతయో సహాయకారిగ నుండెను.

ప్రతిదినము మధ్యాహ్న సమయమున ఆ సాధువు పట్టణమునకు పోయి భిక్షాటనము చేసికొని ప్రసాదమును ఆశ్రమమునకు తీసికొనివచ్చి భుజించుచుండెడివాడు. ఈ ప్రకారము భిక్షాటనమునకు ప్రతినిత్యము ఊరిలోనికి పోవు చుండుటవలనను, తన ఆశ్రమమునకు వచ్చిపోయేవారితో సంభాషణము సలుపుచుండుటవలనను జనులయొక్క మనస్త త్వము అతనికి చక్కగ అవగాహనమయ్యెను. ప్రతివారును దైవదర్శనము చేసికొని జన్మసాఫల్యమును బడయవలయునని కుతూహలము కలిగియున్నప్పటికిని, ఆ దైవదర్శనమునకు వలసిన సాధనసంపత్తిని కలిగియుండక, అజాగ్రత వహించి యుండుటను అతడు గమనించెను. మఱియు పాపభూయిష్ట

మైన మనస్సు గలిగియుండి, అద్దానిని పునీత మొనర్చకయు, ఒనర్చుటకు యత్నమైనను చేయకయు దేవుని అమాంతముగ సందర్శింపవలెనని వారు ఉబలాటపడుచున్నట్లు అతడు గుర్తెఱిగి, చిత్తము నిష్కల్మషమై, పాపరహితమై యున్నపుడు మాత్రమే భగవంతుడు గోచరించునను పరమసత్యమును వారికి తెలియులాగున చేయుటకై అతడు ఉపాయమును అన్వేషింప దొడగెను.

ఒకనాడు ఆ సాధువుగారు పట్టణమునకు పోయి ఒక శ్రీమంతునకు తన అభిమతమును తెలియజేసి అద్దానిని కార్యాన్వితి మొనర్చుటకై అతని సహాకారమును అభ్యర్థించెను. శ్రీమంతుడు అవ్విషయమున తన చేతనైన సహాయమంతయు చేసెదనని సాధుపుంగవునితో నుడివెను. శ్రీమంతునకు ఆ నగరమున ఒక దివ్యమైన విశాల భవనము కలదు. ప్రత్తిబేళ్ళు మొదలైన వ్యాపార వస్తువులను నిలువచేయుటకై అతడు దానిని ఉపయోగించుచుండెను. అది ఖాళీగా ఉండియుండుటను గమనించి సాధువుగారు ఒక నెల రోజులు పూజాజప హోమాదులు అద్దానియందు జరుపుటకై దానిని తనకు ఒప్పచెప్పులాగున కోరగా శ్రీమంతు డందుల కంగీకరించెను.

వెను వెంటనే ఒక సుముహూర్తమున సాధువుగారు ఆ భవంతియందు పూజా జప హోమాదులను ప్రారంభించెను. తలుపులన్నియు మూసివైచి, పెద్దగా మంత్రములను ఉచ్చరించి

చుచు, అప్పుడప్పుడు 'స్వాహా' అని పలుకుచు అగ్నిహోత్రమున ఆహుతులు వేయుచు, దాదాపు ఒక నెలరోజులు కర్మకాండ సంబంధమైన ఏవేవో క్రతువులను ఆ నూతన భవనమున నిర్వహించెను. మాసాంతమున శ్రీమంతుని ద్రవ్యసహాయముచే అతడు ఒక కరపత్రమును అచ్చువేయించి వేలకొలది ప్రతులను ఆ పట్టణమందును, పరిసర గ్రామములందును జనులకు విరివిగ పంచిపెట్టించెను. ఆ కరపత్రమున ఏమి తెలుపబడెననగా — 'ఈనెల 31వ తేదీ రాత్రి 8 గం.లకు ఈపట్టణమందు నెలరోజుల నుండి నిర్విరామముగ జప తప పూజా హోమాదులుజరుపబడిన భవనమునందు దేవుడు ప్రత్యక్షము కాగలడు. కాబట్టి దేవుని చూడదలచిన వారందరును వేళకుసరిగా వచ్చి దైవదర్శన మొనర్చుకొని కృతార్థులు కండు!'

ఆ వాక్యములను చదువుకొనిన వారందరును భగవద్దర్శనభాగ్యము తమకు తప్పక లభించగలదని సంతోషాంతరంగులై ఆనందడోలికలలో ఊగులాడిరి. ఎప్పుడెప్పుడు ఆ సుదినము వచ్చునాయని జనులందరును వేచియుండిరి. సాధువుగారు ఆ భవనమున పూజాహోమాదులు రోజుల తరబడి చేసినందువలన కరపత్రములోని దైవదర్శన సంబంధమైన వాక్యములపై ప్రజలకు గట్టి నమ్మకము ఏర్పడెను.

చివరికి ఆరోజు రానేవచ్చెను. సాయంత్రమగునరికే నలుమూల ప్రాంతములనుండి జనులు తండోపతండములుగ

ఆ పట్టణమునకు చేరదొడంగిరి. వారివారికి అనుకూలపడిన వాహనములపై వేనకు వేలుజనులు భవన సమీపమునకు వచ్చుచుండిరి. భవన మంతయు ముముక్షువులచే, జిజ్ఞాసువులచే, దైవదర్శనాభిలాషులచే క్రిక్కిరిసిపోయెను. సరిగా రాత్రి 8 గంటలయ్యెను. సాధువుగారు ప్రకటించినదానికిబట్టి సరిగా ఆ సమయమునకు అందరికీ దేవుడు కనిపించవలయును. కాని అట్లు కనపించలేదు. అరగంట దాటినది. గంటదాటినది. కాని దైవదర్శన మెవరికిని కాలేదు. అపుడు ప్రజలందఱును హతోత్సాహులై వేదికపై నున్న సాధువుగారితో, 'అయ్యా! దేవుడు ఇంకను కనుపించలేడేమి!' అని ప్రశ్నింప అమ్మహానీయుడున్నత స్వరముతో అచట ఆసీనులైయున్న జనానీకము నుద్దేశించి యిట్లు పలికెను—

'ఓ మహాజనులారా! దేవుడు తప్పక కనిపించును. నేను ప్రకటించినదానిలో ఏమాత్రము అసత్యములేదు. అయితే పాపములేని వారికి మాత్రమే దేవుడు కనిపించును. కాబట్టి మీమీ హృదయములను ఒకింత పరిశోధించి చూచికొనుడు. ఏ ఒకింత పాపపంకిలము మీయందున్నను అది దైవదర్శనమునకు అడ్డుగానుండును.' ఆ వాక్యములను వినగనే ప్రతివారును తమతమ చిత్తములను సంశోధించి చూచుకొనగా పాపరహితమైన స్థితి ఏ ఒకరికిగూడ కానరాదయ్యెను. తమ తమదోషములను తామే లోలోన తలచుచు అచట చేరినవారందఱు

ఒక్కొక్కరే తిరోగమనముసల్ప నారంభించిరి. మనస్సు పాపభూయిష్టముగ నున్నంతవఱకు, సచ్చరిత్ర, సన్మార్గావలంబనము లేనంతవఱకు దైవదర్శనము దుర్లభమను సత్యమును ప్రజలు గుర్తెఱింగి ఆనాటినుండియు సాధుమహాత్ముని వాక్యములపై అచంచల విశ్వాసముకలవారై, పాపకార్యములను త్యజించి పవిత్రాచరణ కలవారైరి.

నీతి :- అపవిత్రహృదయముతో ఎవరును దైవమును గాంచజాలరు, దైవదర్శనమునకై నిష్కళంక చిత్తము అత్యావశ్యకమై యున్నది. కావున జనులు పవిత్రాచరణ కలవారై తమ చిత్తము లందలి దోషములను, పాపములను పుణ్యసంపాదనముచే దూరీకృతమొనర్చి, తత్ఫలితముగ దైవసాక్షాత్కారమొంది జీవితమును చరితార్థ మొనర్చుకొనవలయును.

## తస్మాత్ జాగ్రత!

ఒకానొక గ్రామమునందు దాదాపు వెయ్యి ఇండ్లు కలవు. గ్రామస్థులలో పెక్కుమంది వ్యవసాయమే జీవనముగా ప్రతి దినము ఉదయము చద్ది తినగనే ఆ గ్రామస్థులు వారి వారి పొలములకుబయలుదేరివెళ్లి దుక్కి దున్నుట, ఎరువులు వేయుట, కలుపులుతీయుట, నేల చదరపెట్టుట మొదలగు సేద్యపు పనులలో నిమగ్నులై యుందురు. వారిలో చదువు

వచ్చినవారు ప్రతిదినము వార్తాపత్రికలు సమయము దొరికి నపుడు చదువుచుందురు. ఒకనాడా గ్రామస్థులలో నొకడు వార్తాపత్రికయందు ప్రభుత్వమువారు కావించిన ఒక చిన్న ప్రకటనను చూచి దానినిగూర్చి తక్కిన గ్రామస్థులందరికిని ఎఱింగించెను. ఆ ప్రకటనయం దీ ప్రకారముగ గలదు—

'జనాభా పెరుగుదలదృష్ట్యా ఆహారోత్పత్తి కుంటు పడకుండ నుండుటకై ప్రభుత్వమువారిపుడు అధికాహారోత్పత్తి ప్రణాళికను (Grow more food campaign) చేబట్టినారు. తదను సారము ఏగ్రామస్థులైనను తమ గ్రామమునందు ఎక్కువ పంట పండించినచో ఐదువేల రూపాయల పారితోషికమును వారు బడయగలరు.'

ఈ ప్రకటననుగూర్చి తెలిసికొనగనే ఆ గ్రామస్థు లందఱును ఉత్సాహాభరితులై ఆ పురస్కారమును తామే బడయవలెనని కృతనిశ్చయులై తద్విషయమై చర్చించుటకును, గ్రామస్థులలో ఆ విషయమై తెలియనివారికి తెలియజెప్పుట కును, కార్యాచరణలో ఎదురగు అవరోధములను దాటుటకు వలసిన ఉపాయములను అన్వేషించుటకును అధికాహారోత్పత్తికి అవలంబించవలసిన సాధన లేవేవి కలవో వాని నన్నింటిని కూలంకషముగ నాలోచించుటకును, ఒక ప్రత్యేక సమావేశ మునకు గ్రామ సిద్ధలే కాక గ్రామములోని అందఱును

చేరిరి. గ్రామస్థుల ఆ సభయందు ముఖ్యచర్చనీయాంశము అధికాహారోత్పత్తి.

సభలో ఒక్కొక్కరు తమ తమ అభిప్రాయములను వెలిబుచ్చ దొడంగిరి. కొందరు గ్రామస్థులు ఆవేశముతో కూడినవారై ఏ విధముగానైనను ప్రభుత్వ పారితోషికము తమ గ్రామమునకే వచ్చునటుల తీవ్రముగ కృషిచేయవలె నని హెచ్చరించుచు బల్లగుద్ది ఉపన్యాసము చేయసాగిరి. కొందరు తమ అనర్గళ వాగ్ధోరణిని ప్రదర్శించుచు తమ వాక్చమత్కృతిచే సభ్యులను ఉఱ్ఱూతలూగించుచు ఆహారమును గూర్చిన అధికోత్పత్తియొక్క ఆవశ్యకతను ప్రజలకు హృద్గత మొనర్పజేసిరి. ఈ ప్రకారముగ ఆనాటి సభ బహు మనోరంజకముగ, బహు ఉత్సాహముగ, జనుల హృదయాంతరాళములలో ఆవేశమును రేకెత్తించునదిగ నుండెను. ఎట్టకేలకు ఈ క్రింది తీర్మానమును సభవారు ఏకగ్రీవముగ అంగీకరించిరి—'ఈ గ్రామస్థులందరును వారి వారి శాయశక్తులా కృషిచేసి, ఎక్కువ విస్తీర్ణములో పంటలు పండించి, ఒక్క అంగుళము నేలనైనను వ్యర్థము చేయక, ఆహారధాన్యమును అధికముగ పండించి ప్రభుత్వమువారు ప్రకటించిన ఐదువేల రూపాయల పారితోషికము ఈ గ్రామమునకే లభించులాగున తీవ్రతర ప్రయత్నము చేయవలయును''

ఇక మరుసటి దినమునుండి ఆ తీర్మానము నెట్లు అమలు జరుప వలయునో గ్రామస్తులు యోచింప మొదలిడిరి. కొందరు తమయిండ్ల ప్రక్కనగల ఖాళీ స్థలములందుకూడ పైరు పెట్టిరి. మరికొందరు తమ దొడ్లలో ఒక్క అంగుళము స్థలమునైనను ఊరక నుంచక విత్తనములను చల్లిరి. ఇట్లుండ ఆ గ్రామములో తీవ్రవాదియైన ఒకానొకని చిత్తఫలమున ఈ క్రింది విచిత్ర ఊహ జనించెను—"మన ఊరిబయట ఒక యకరము నేల శ్మశానము నిమిత్తము ఉపయోగింపబడు చున్నదిగదా! దానిని మాత్రము మనము ఎందులకు విడిచి పెట్టవలయును! దానిని కూడ చక్కగ దున్ని పైరు పెట్టినచో ఒక యకరము నేల కలిసివచ్చునుగదా! ప్రభుత్వ బహుమానము సంపాదించుటకు ఇది ఎంతయో దోహద మొనర్చును గదా! ఈ విషయమును గ్రామపెద్దల చెవిలోవేసి వారిని ఒప్పించి ఏదియో విధమున ఈ సంవత్సరము ప్రభుత్వ పారితోషికమును మన గ్రామము కైవస మొనర్చుకొనుట మంచిది."

ఈ ప్రకార మాలోచించి వెనువెంటనే యతడు గ్రామస్థులందరిని ఆ విషయమై ఒప్పించి శ్మశానములో పైరు వేయించెను. నాలుగు నెలలు దాటినది. పైరు ఏపుగా పెరుగ జొచ్చెను. ఇంతలో అకస్మాత్తుగా ఆ గ్రామములో ఒకడు అకస్మాత్తుగ చనిపోయెను. అతని శవమును ఎక్కడ పాతి

పెట్టవలయునో తెలియక గ్రామస్థులు తికమక పడుచుండిరి. శ్మశానమూ నిగనిగ లాడుచున్న పైరుచే శోభాయమానముగ నుండెను. దానిలో కొంతభాగమును పెరికివైచి శవమును పూడ్చిపెట్టుటకు గ్రామస్థు లెవరికిని మతిస్ఫురింపలేదు. ఇక ఆ శవమును ఎక్కడ ఖననము చేయవలెనో తేలలేదు. ఒక ధర్మసమస్య అందరికిని ఎదురయ్యెను. ఆ రాత్రి విషయనిర్ణయము కొఱకు గ్రామస్థుల అత్యవసర సమావేశము కావింపబడెను ఎవరి ఇంటిలో ఆ చావు సంభవించెనో వారి దొడ్డిలో ఒక మూల ఆ శవమును పాతిపెట్టులాగున సభలో తీర్మానము ఆమోదింపబడెను. దేహము క్షీణించును విషయముగాని, శరీరము మృత్యుగ్రస్తమగు విషయముగాని ఆ గ్రామస్థులకు మొదట స్ఫురింపలేదు. కనుకనే ఒకానొకనికి మృత్యు వాసన్నమైనపుడు అయోమయ స్థితిలో పడిపోయిరి.

నీతి : పాంచభౌతికమగు దేహము ఏనాటికైనను విలీనమై పోవునను సత్యమును చక్కగా గుర్తెఱిగి, స్వల్పమగు తన జీవితకాలమును శాశ్వత దైవప్రాప్తికై వినియోగించుచు మానవుడు ఆత్మసాక్షాత్కారమను జీవిత లక్ష్యమును శీఘ్రముగ సాధించి వేయుటకై అనవరతము యత్నశీలుడు కావలయును. దేహము శాశ్వతమని ఏనాడును విశ్వసింపరాదు. మోక్షసాధన విషయమై అతి జాగరూకుడై యుండవలయును.

# అలసత్వము ప్రమాదహేతు

ఒకానొక పట్టణము నందు మధ్యతరగతి
కుటుంబము కలదు. అందు ఇంటి యజమా
ఉద్యోగము భార్య సదాచారవతి. ఆ యిల్లా
ఉషఃకాలముననే నిద్రలేచి స్నానాదులను గా
దైవధ్యానము చేసికొనుచుండును. ఒక జపము
భక్తితో రామనామమును నూటెనిమిదిసార్లు జపి
తదుపరి ఒక అధ్యాయమును గీతాపారాయణ
పూర్వజన్మార్జిత సుకృతవశమున ఆమెకు ప్రత్యేక
దైవసంస్కారము ఏర్పడెను. ప్రార్థన చేయక
గంగవుచ్చుకొనదు. అసారమగు ఈ సంసారమ
కుడొక్కడే సారమను పూర్ణవిశ్వాసము ఆమెం
వలన గృహకృత్యములను యథావిధి జరుపుకొ
మనస్సు మాత్రము భగవంతుని పాదపద్మము
మైయుండును.

ఇక ఆమెభర్తగారి సంస్కారము వేరుగ
వంతుని అస్తిత్వమును అతడు కాదనడుకాని
తొందర, నిదానముగా తరువాత ఎప్పుడైన
కొనవచ్చును' అను ధోరణిని అతడు ప్రదర్శి
ఈ పద్ధతి భార్యకు నచ్చలేదు. ఒకనాడామె భ
సమయముచూచి అతనితో నిట్లనను—"ఏమం

పైనను రామనామము ఉచ్చరించక, భగవంతుని సేవింపక జీవితమును గడుపుచున్నారే! ఇది ఎంత ప్రమాదము! ఏ సమయమున ఏమి ఆపద సంభవించునో ఎవరికెరుక! ఈజీవితములు ఏమి శాశ్వతము! ఏక్షణము ఈప్రాణవాయువు దేహమును విడచిపోవునో ఎవరును చెప్పలేరు, బ్రతికిన నాలుగు రోజులు కృష్ణా, రామా యని భగవన్నామము ఉచ్చరించుచు పుణ్యము కట్టుకొనిన మాత్రమే ఈ జీవితము సార్థకమగును గాని, వ్యర్థముగ ప్రాపంచిక కార్యములందే గడిపివైచినచో మహాప్రమాదము సంభవింపగలదు, కాబట్టి ప్రతిరోజు కనీసము ఒక్కసారైనా భగవంతునిగూర్చి చింతింపుడు. రామ నామమును ఉచ్చరింపుడు. కొంతపుణ్యమైనా ప్రతిదినము సంపాదింపుడు ఇదిగో జపమాల తీసికొని భక్తితో జపము ప్రారంభించుడు!

సహధర్మచారిణియొక్క భావగర్భితములగు ఆ వాక్యములను విని భర్త యిట్లనెను- "అమ్మా! నీవు చెప్పినదంతయు సత్యమే. దేవునిగూర్చి తలంచుట మనధర్మమని నేను ఒప్పుకొనుచున్నాను. అదిచేయవలసిన కార్యమే, కాని ఇప్పుడేమి తొందర! ఇప్పుడు నేను ఉద్యోగము చేయుచున్నాను. అది పూర్తి అయిన పిదప, 'రిటైర్ మెంటు' వచ్చిన తరువాత, పిల్లల పెండిండ్లు అయినతరువాత, అప్పులన్నీ తీరిన తరువాత, పరిస్థితులన్నీ చక్కబడిన తరువాత, దేవునిగూర్చి తలంచుకొన

వచ్చును. అప్పుడిక ఏ గొడవలు ఉండవుకాబట్టి శాంతముగా, నిశ్చలముగా ధ్యానము చేసికొనవచ్చును '

భర్తయొక్క ఆవాక్యములను వినగనే గృహిణి కి గొప్ప హృదయావేదన కలిగి భర్తకు తన మనోనిశ్చయమును గూర్చి నచ్చ చెప్పుటకై ఎంతయో ప్రయత్నించెను కాని ఫలితములేక పోయెను. భర్త ఈషన్మాత్రమైనను తనహృదయమును మార్చుకొనలేదు. పాత పద్ధతి లోనే తన కార్యక్రమమును నిర్వహించుకొనుచు పోవుచుండెను. భర్త యొక్క మనస్సును దైవమార్గమున ఎట్లు మరలించవలెనో ఆమెకు తోచకుండెను.

ఇట్లుండ కొంతకాలమునకు విధివశాత్తు భర్తయొక్క ఆరోగ్యము లోపించెను. అతడు తీవ్రమగు జ్వరముతో బాధ పడుచుండెను. డాక్టరుగారువచ్చి రోగిని పరీక్షించి ఒక సీసాలో మందు పోసియిచ్చి ప్రతిరోజు ఉదయం, మధ్యాహ్నం, రాత్రి ఒక్కొక్క ఔన్సుచొప్పున ఇచ్చుచుండుమని భార్యకు చెప్పి, ఆవిషయమును భర్తకుకూడ తెలియజేసి వెడలి పోయెను. వైద్యుడు గృహమును వీడినతదుపరి భార్య ఆ మందును దాచివైచి ఊరకుండెను, భర్తకు ఇవ్వలేదు. ఒక పూట గడచిపోయెను. రెండుపూటలు గడచిపోయెను. కాని భర్తకు ఏమాత్రము మందు ఒసంగలేదు. ఈవిషయము

తెలిసికొని భర్త వెంటనే భార్యను పిలిపించి "డాక్టరుగారు మందు యిచ్చినది త్రాగుటకా, దాచిపెట్టుకొనుటకా?" అని ప్రశ్నింప వెంటనే ఆ గృహిణి సమయోచితముగ నిట్లు పలికెను—

'మందువిషయమై ఇపుడు ఏమితొందర? నిదానముగా ఇంకొక వారం దినములైనపిదప త్రాగవచ్చును.' ఆ వాక్యములనువిని భర్త 'నీకు మతిపోయినట్లుగా ఉన్నదే! రోగము వచ్చినపుడుకదా మందు త్రాగవలె' అని పలుక అంతట ఆ యిల్లాలు భర్తకు ఈప్రకారముగ చక్కటి బోధసలిపెను—

"మహాశయా! ఇపుడు మీరు దారికివచ్చినారు. రోగమువచ్చినపుడుకదా మందుత్రాగవలె అను మీవాక్యము చాల హేతుకమైనది. అయితే పుట్టిన ప్రతిప్రాణి భవరోగముచే బాధపడుచుండగా ఆరోగమును బాపుకొనుటకు భగవన్నామామృతమను ఔషధమును వెంటనే ఏల త్రాగరాదు? ఆలస్యమేల చేయవలెను? శరీరము క్షణికముకదా! రేపునకు రూపులేదుకదా! అట్టిచో వార్ధక్యమువరకు ఆభగవచ్చింతనయను పవిత్రకార్యమును వాయిదావేయుట పాడియా! కాబట్టి సంసార రోగము, పుట్టుక చావు అనురోగము తగుల్కొనిన ఈక్షణమందే ఆ రోగమును తొలగించుటకు రామనామమును, కృష్ణనామమును, భగవన్నామమును స్మరించవలెను. దైవ

చింతన, భగవద్ధ్యానము చేయవలెను. వార్ధక్యము, మృత్యువు కాచుకొనియున్నవి, రోగములు జీవుని ఆక్రమించుటకు సిద్ధముగానున్నవి. ఇట్టిపరిస్థితియందు దినదినములు లెక్కపెట్టుచు భవరోగ చికిత్సయగు దైవధ్యానామృతమును గ్రోలక ఆలసించుట పాడికాదు. ఆలసత్వము ప్రమాదహేతువు. కాబట్టి ఇప్పుడే రామనామమును ఉచ్చరింపుము, జపించుము!"

పత్నియొక్క ఈ చక్కటి బోధను ఆలకించి భర్త వెంటనే రామనామమును భక్తితో జపించసాగెను. తను వెంటనే భార్య భర్తకు ఔషధమును ఒసంగ అతనిరోగము ఉపశమించెను. ఈప్రకారముగ శారీరక, మానసికములను రెండురోగములున్ను తొలగిపోవ అతను పరమశాంతి బడసెను.

నీతి : సంసారరోగము తగుల్కొని పుట్టుచు, చచ్చుచు నానాబాధలను పొందుచున్న జీవుడు అరోగము తొ గుటకు అవసరమైన ఆత్మజ్ఞానమును ఔషధము సేవించి శాంతిని బడయవలెను. అలక్ష్యము చేయరా

# హృదయపూర్వక ప్రార్థన

శిశానాళ గ్రామమునందు ఊరిబయట ఒక పెద్ద దేవాలయము కలదు. అందు కాళికాదేవియొక్క సుందరవిగ్రహము ప్రతిష్ఠింపబడినది. ఆ విగ్రహము చాల ఎత్తుగను, చూచుటకు బహురమణీయముగను నుండెను, ఆ విగ్రహమునందు శిల్పకళ ఉట్టిపడుచుండెను. అద్భుతమగు ఆ కాళికావిగ్రహమును చూచుటకొఱకును భక్తితో ఆరాధించుటకొఱకును సుదూర ప్రాంతములనుండి జనులు తండోపతండములుగ వచ్చుచుందురు. కొందఱు మ్రొక్కుబడులు చెల్లించుకొనుచుందురు. ఈవిధముగ ప్రతిరోజు ఆదేవాలయము భక్తజనసందోహముచే కిటకిటలాడుచుండును. 'నిత్యకల్యాణం పచ్చతోరణం' అనునట్లు ఆదేవునిమందిరము ఎల్లప్పుడు యాత్రికులతోను భగవద్భజన తత్పరులతోను, శోభాయమానముగ నుండును.

గ్రామస్థులందఱును నడుము కట్టుకొని ఆదేవాలయము సర్వాంగసుందరముగ నుండునట్లు పెక్కు ప్రయత్నములుచేసి ఆ ప్రయత్నములందు సఫలత్వమును బొందిరి. దేవాలయము చుట్టును పెద్ద ఉద్యానవనమును ఏర్పాటుచేసి అన్నిరకముల పుష్పజాతుల మొక్కలను అందు నాటించి పూజాదులకుగాని, తదితర కార్యములకుగాని పుష్పములు విరివిగ లభించునట్లు చేసిరి. భక్తులు దేవిని సేవించి, పూజాపురస్కారములు జరిపించి బయటకువచ్చి ఆ సుందర ఉద్యానవనమున చెట్లనీడ

యందు ఒకింతసేపు విశ్రమించి పోవుచుందురు. ఆ దేవాలయ పరిసరమంతయు ఉద్యానవనమందలి సుగంధపుష్పములనుండి సముద్భూతమగు సువాసనలచే నిండినిబిడీకృతమై యుండును. ఈ విధముగ భౌతిక, ఆధ్యాత్మిక సద్వాతావరణములు రెండును సమ్మిళితములైయున్న ఆ ప్రదేశమునకు భక్తకోటి విశేషముగ ఆకర్షింపబడుచుండెను.

ఇట్లుండ ఒకనాడు ఆ దేవాలయపూజారి ఉదయము 6 గంటలకు దేవాలయముయొక్క ముఖద్వారమును తెరచి లోనికేగి మూలవిగ్రహమునకు పూజాకైంకర్యాదులు సలుపుచుండ కొందరు భక్తులు గుంపుగావచ్చి ద్వారముకడ నిలబడి ముకుళితహస్తులై ఈ క్రింది విధముగ ప్రార్థన చేయసాగిరి.

అమ్మా! దేవీ! తల్లీ! జగజ్జననీ! భువనైకమాతా! లోకేశ్వరీ! విశ్వకుటుంబినీ! సంసార మహాసాగరమున మునిగిపోవుచున్న మాకు దిక్కుచూపుము. నీ దయాదృష్టి మాపై ప్రసరింపుము. సంసార ఘోరారణ్యమున దరిగానక నానా బాధల నొందుచుండు మాకు విముక్తి మార్గమునుజూపి కరుణింపుము. జగదంబికే! కోట్లకొలది జన్మలనుండియు పుట్టుచు చచ్చుచు గర్భనరక మనుభవించుచు, కాలచక్రమున పరిభ్రమించుచు కర్మబంధమున తగుల్కొని లెక్కలేనన్ని యిడుముల పాలుపడుచున్న మమ్ము దుఃఖవిముక్తులుగజేసి పునరా

త్రిరహిత శాశ్వత కైవల్యము మాకు కలుగునట్లు ఆశీర్వ
దింపుము. సచ్చిదానంద స్వరూపిణీ! వెయ్యేల మమ్ములను
నీ ఐక్యమొనర్చుకొనుము! బ్రహ్మానందమయమగు నీ
స్వరూపమునందు లీనమొనర్చుకొనుము! నది సముద్రమున
పరమశాంతిని బడయువిధమున భువనైక మాతవగు నీ
స్వస్వరూపమున లీనమై నేము అఖండానందమును బడయు
దుముగాక! ఇదే మా వినతి! అనుగ్రహింపుము! ఆదరిం
పుము! పాహిమాం! పాహిమాం! పాహిమాం! పాహి!!

ఈ ప్రకారముగ దేవిని బహుభంగుల ప్రార్థించి ఆ
జన జనులందఱును వెడలిపోయిరి. వారే మఱునాడు
డ ఉదయముననే వచ్చి అదేవిధమున ప్రార్థించి వెడలిరి.
ప్రకారముగ పది రోజులు వరుసగ ప్రతిదినము ప్రాతః
కాలమున తలుపు తెరవగనే ఆభక్త జన సమూహము కాళికా
లయమునకు వచ్చి అదే ప్రార్థనను వల్లెవేసి పోవు
చుండిరి. దీనిని గమనించిన ఆ దేవాలయపు పూజారి "ఈ
రంతా లందరు ప్రతిరోజూ ఒకే రకముగా దేవిని ప్రార్థించుచు
న్నారు. 'అమ్మా! నీ సచ్చిదానంద స్వరూపములో
మమ్ములను ఐక్యముచేసికొనుము'- అని రోజూ మనవి చేసి
కొనుచున్నారు. వీరి ఈ ప్రార్థన హృదయమునుండి వచ్చు
చున్నదా? లేక నోటినుండి వచ్చుచున్నదా? హృదయపూర్వ
కముగ వీరు ప్రార్థించుచున్నారా? లేక పైపైన లాంఛనముగ

నోటితో పలికి వెడలిపోవుచున్నారో! పరీక్షించ వలయును" అని తలంచి మఱునటిరోజు ఉదయముననే ఆ పూజారి దేవాలయపు తలుపులు తెరచి కాళికాదేవియొక్క బ్రహ్మాండమైన విగ్రహపు వెనుక దాగియుండెను. ఇంతలో ప్రతిదినము ఏతెంచు భక్తులు వచ్చి మామూలుగా వారుచేయు ప్రార్థనను చేయసాగిరి. "అమ్మా! దేవీ! తల్లీ! నీ దివ్యస్వరూపమున మమ్ములను విలీనము చేసికొనుము నీలో ఐక్యమొనర్చుకొనుము" అని వారు మొరపెట్టుకొనగనే విగ్రహము వెనుక దాగియున్న పూజారి "ఓ భక్తులారా! మీలో ఎవరెవరు నా యందు ఐక్యము కాదలంచినారో ఈ విగ్రహముదగ్గరకు వచ్చినచో ఇపుడే ఐక్యము చేసికొందును". అని సన్నగా కేకవేసి సాక్షాత్ విగ్రహము పలుకుచున్నదా యనునట్లు తోచింజేసెను.

ఆ వాక్యములను వినగనే ఆ వచ్చిన భక్తులందు ఒకరి ముఖము ఒకరు చూచుకొని "ఇంటిదగ్గర ఎన్నొ పనులు పెట్టుకొని ఇప్పుడే దేవిలో లీనమైనచో ఏమి కాదును! " అని కూతబలుకుకొని ఎక్కుసేపు అచట ఉండిన దేవి తనలో కలుపుకొనునేమో అని భీతిల్లి తటవడిగా అచో నుండి పారిపోయిరి. వారు వెడలినపిదప పూజారి విగ్రహమునుండి ఈవలికివచ్చి "రామ రామ! మీరి ప్రార్థనలు విచిత్రముగానున్నవి! ప్రతిరోజు "మమ్ములను నీలో క

కావమ్మా" అని ప్రార్థించుచూ, "అట్లే కలుగుఁగొందును. దగ్గరకురండి!' అని అమ్మ పలుకగనే ఎవరిదారిన వారు చక్కాపోయిరి. వీరి ప్రార్థనలు హృదయపూర్వకముగ చేసినవి కావు అవి మామూలు ప్రార్థనలే యగునుగాని హార్దికమైనవి కావు. అనగా నోటితో పలికిన పలుకులే కాని హృదయస్ఫూర్తిగ వచించినవి కావు. ఇట్టి ప్రార్థనలకు పరిపూర్ణఫలము ఎన్నటికిని లభింపనేరదు. శ్రద్ధతో, భక్తితో, విశ్వాసముతో, హృదయపూర్వకముగ చేయు ప్రార్థనలచే భగవంతుడు మిక్కుటముగ సంతోషించును. అట్టి ప్రార్థనలకే విలువ యుండును. అని తలంచుకొని తన నిత్యపూజాదికార్యములందు నిమగ్నతయ్యెను.

నీతి. భగవంతుని ప్రార్థించునపుడు హృదయమును శోధించవలెను. హృదయపూర్వక ప్రార్థనలకే విలువ యుండును. అశ్రద్ధతో చేసిన కార్యమునకు ఫలితము చేకూరదు.

—o—

# భౌతిక దృష్టి

పూర్వము మిథిలా పట్టణమున జనకమహారాజు చక్కగ రాజ్యపరిపాలనము గావించుచు, ప్రజలయొక్క క్షేమమే తన క్షేమముగా భావించుకొనుచు, వారికి శ్రేయమును ఒనగూర్చుచు ప్రశాంతముగా కాలము గడుపుచుండెను. పూర్వజన్మపుణ్యసంస్కారముచే ఆ నృపాలునకు పరమార్థ జిజ్ఞాస మిక్కుటముగ కలుగుటవలన అపుడపుడు బ్రహ్మనిష్ఠుల సమావేశములు, పండిత పరిషత్తులు మున్నగునవి జరుపుచు బ్రహ్మజ్ఞానులను, పండితులను యథాశక్తి సత్కరించుచు నుండెను.

ఒకనాడు జనకభూపాలుడు తనయాస్థానమున ఒక పెద్ద సభ గావించెను. ఆ సభకు సుదూర ప్రాంతముల నుండియు పెక్కురు పండితులు, విద్వాంసులు అరుదెంచిరి. సభ దిగ్విజయముగా జరుగుచుండెను. పాండిత్యమునకు సంబంధించిన పెక్కు అంశములనుగూర్చి అచట వాదోపవాదములు జరుగుచుండెను. ఆసభకు మైథిలేశుడు తనగురుదేవుడైన అష్టావక్ర మునీంద్రునికూడ ఆహ్వానించెను. అష్టావక్ర మునీంద్రుడు ఒకింత ఆలస్యముగా సభకరుదెంచెను. సభాభవనములోనికి అతడేతెంచునరికే పండితులందఱున్ను ముందుగనే అచట హాజరైయుండిరి. జనకుని సభాభవనమంతయు ఆ పండిత ప్రకాండులచేకిటకిటలాడుచుండెను. అష్టావక్రుడు ఆ పండితుల

మధ్యగుండా మెల్లగా నడచి వచ్చుచుండ జనకుడాతనికి సాష్టాంగమొసగి, సత్కరించి ఉన్నతాసనముపై కూర్చుండ బెట్టెను.

అత్తఱి అష్టావక్రుని ముఖమును చూచి అచటనున్న పండితులందఱును పక్కున నవ్విరి. వారు నవ్వుటను గాంచి అష్టావక్రుడు కూడ పకపక నవ్వెను. ఈ చిత్రమంతయు జనక మహారాజు ఆశ్చర్యముగ పరికించుచుండెను. పండితసభ యథావిధిగా పరిసమాప్తము కాగా, పండితులందఱు జనకుని వలన యథోచిత సత్కారమును బడసి తమ తమ నెలవులకు వెడలిపోయిరి. సభ విరమింపబడిన తరువాత జనక మహారాజు తన గురుదేవుడగు అష్టావక్రమునీంద్రుని ఏకాంతమున వినయముతో నిట్లు ప్రశ్నించెను—

"దేశికేంద్రా! తమరు పండితసభలోనికి అరుగెంచునపుడు పండితులు మిమ్ములను జూచి నవ్విరి. మీ ముఖవికారములను గాంచి బహుశః వారు నవ్వియుండవచ్చును. అయితే తమరెందులకు నవ్విరో నాకు బోధపడకున్నది. కారణము తెలుప ప్రార్థన!" జనకభూపాలుని ఆప్రశ్నకు అష్టావక్రమహర్షి ఈప్రకారముగ సమాధానమొసంగెను-"నరేంద్రా! పండితసభ జరుగనున్నది. తప్పక రావలయును" అని మీరు నాకు కబురు చేసితిరి. తీరా సభలోనికి అడుగుపెట్టగానే "ఇది చర్మకారుల

సమావేశము" అని తెలిసికొని నవ్వు ఆపలేకపోయితిని!" ఆ వాక్యములను వినగనే జనకుడు- "మహాత్మా! సభలోనివారందఱును శాస్త్రజ్ఞానములో గొప్ప దిగ్దంతులు, ప్రకాండపండితులు, విద్యావైదుష్యము కలవారు, బహుభాషాప్రవీణులు, నిరంతర వేదాధ్యయనశీలురు, వేదవేదాంతశాస్త్రకుశలురు అయియున్నారు. వారు చర్మకారులని కామేల భావించినారు!

జనకుని ఆప్రశ్నకు పురస్కరించుకొని గురుదేవుడగు అష్టావక్రమునీంద్రు డిట్లు సమాధాన మొసగెను-- "భూపాలా ఎంత పాండిత్యమున్నను అనుభవములేనిచో అది మానవుని కడతేర్చలేదు. మీరు ఏర్పాటుచేసిన పండిత పరిషత్తులో పాల్గొనిన విద్వాంసులు నాభౌతిక దేహమును జూచి నవ్విరి. జడమైన దేహమును చూడ గల్గిరేకాని దేహములోపల వెలుగుచున్న ఆత్మను చూడజాలరైరి. వారిది భౌతికదృష్టియేకాని అధ్యాత్మికదృష్టికాదు. స్థూలదృష్టికాదు. శవసదృశమగు దేహమును వారు చూచుచున్నారేకాని శివస్వరూపమగు ఆత్మనుకాదు. వారిది బాహ్యదృ యేకాని అంతర్దృష్టి కాదు. చెప్పులను కుట్టువారుకాన, చర్మకారులు కాని ఒక వ్యక్తిని చూచినపుడు వారి చెప్పులనే చూచుదురు. చర్మమునే వీక్షించుదురు కాబట్టి ఓరాజా! మీరు ఏర్పాటుచేసిన పండితసభలోని పండితులు గొప్పవిద్యావైదుష్యము కలవారై

ఎప్పటికి వారిదృష్టి చర్మముపైననే పసరించుటచే చర్మకారులని నేను చెప్పితిని. ఏనాడు వారు సూక్ష్మదృష్టిని, ఆత్మదృష్టి పెంపొందించుకొందురో ఆనాడే వారు వాస్తవముగ పండితులని చెప్పబడుటకు యోగ్యులగుదురుగాని అంతకుముందుకాదు ఆత్మజ్ఞానమే నిజమైన పాండిత్యము. కాబట్టి ఓరాజా! పండితులగువారు కేవలము శాస్త్రపాండిత్యమునేకాక, ఆత్మానుభూతిని, దైవదృష్టిని లెస్సగ అలవఱచుకొనవలెను. అప్పుడే మానవజన్మ సార్థకముకాగలదు.

అష్టావక్రమునియొక్క భావగర్భితమగు ఆవాక్యములను విని జనక మహారాజు సంతుష్టాంతరంగుడయ్యెను.

**నీతి :—** మనుజులు స్థూలదృష్టిని విడనాడి సూక్ష్మదృష్టిని పెంపొందించుకొనవలెను. భౌతికదృష్టిని ఆత్మదృష్టిని అలవాటు చేసికొనవలెను. దేహభావననువీడి బ్రహ్మభావనను అభివృద్ధి పఱచుకొనవలెను.

—o—

# భ్రాంతి

ఒకానొక గ్రామములో ఊరిబయట ఒక మంచినీళ్ళ బావి కలదు. ఆ ఊరిలో అదొకటియే మంచినీటిబావి. తక్కిన బావులందలి నీరు చప్పగ నుండుటచే గ్రామస్థులందరును త్రాగుటకొరకు ఆ మంచినీటి బావినే ఉపయోగించుకొను చుండిరి. ఇక్కారణమున ప్రతిదినము ఉదయము 5 గంటలు మొదలుకొని చీకటిపడువరకును ఆ బావియొద్దకు జనులు ఎడతెరిపిలేకుండ వచ్చుచు పోవుచు నుందురు. గ్రామపంచాయతీ వారు ఆ బావికి పిట్టగోడ కట్టించి బావిచుట్టును క్రిందిభాగమున సిమెంటుతో కాంక్రీటు వేయించిరి. నాలుగు గిలకలను బావికి అమర్చిరి. ఈ ఏర్పాట్లవలన ప్రజలకు చక్కని సౌకర్యములు ఏర్పడెను.

ఒకనాటి సాయంసమయమున ఒక యువతి బిందె, బొక్కెన, త్రాడు తీసుకొని మంచినీటికొరకై ఆ బావిని సమీపించుచుండెను. సూర్యు డస్తాద్రి గ్రుంకుటచే ఆ రాత్రి నలుదెసల అంధకారము వ్యాపింపసాగెను. ఆ చీకటిలో బావి సమీపమున ఒక పెద్ద నాగుపాము చుట్టచుట్టుకొని పడగ పైకెత్తి యుండుటను ఆ యువతి దూరమునుండియే గమనించి భయభీతయై వెనుకకు మరలి కేకలిడుచు ఊరిలో ప్రవేశించి కనుపించిన వారికందరికిని ఆ పాము వృత్తాంతమును చెప్ప

సాగెను. 'ఓ జనులారా! ఆ బావియొద్దకు ఎవరును పోవలదు. అచట ఒక బ్రహ్మాండమైన నాగుపాము చుట్టచుట్టుకొని పడగెత్తి ఆడుచున్నది. దానిని సమీపించినచో ఘోర విపత్తు సంభవించగలదు.' పక్షిరాజుయొక్క ఆ వాక్యములను వినగనే గ్రామస్థులెల్లరు భీతావహము జెందినవారై, కఱ్ఱలు, కత్తులు, బరిసెలు, తుపాకులు, ధనుస్సులు మొదలైనవానిని గైకొని ఇటు నటు వెదకసాగిరి. కొందఱు మాంత్రికుల కొఱకై పరుగిడ జొచ్చిరి. అది గ్రామస్థులందఱికిని ఉపయోగపడు బావి కాబట్టి చీకటిలో ఎవ్వరైన రాత్రిపూట నీరు తోడుకొనుటకు అచటికి వెళ్ళినచో ప్రాణాపాయము కలుగగలదు కాబట్టి ఆ సర్పమును ఎట్లైనను తుదముట్టించవలెనని ఊరివారందఱును కృతనిశ్చయులైరి. ఒక్కొక్క ఆయుధమును చేపట్టి బావి దిశగా పయనమై పోదొడంగిరి. భుజంగవార్త ఆ గ్రామములో ఒక గొప్ప సంచలనమును కలుగ జేసినదాయెను. కాని విచిత్రమేమనగా వందలమంది వందలకొలది కఱ్ఱలు, కటారులు తీసుకొని బయలుదేరినను బావి సమీపమునకు పోగలిగిన నాథుడు ఒకడును లేకపోయెను. అందరును బావికి పది గజముల దూరమున వలయాకారముగ నిలబడి చిత్రమును వీక్షించుచుండిరే కాని ఎవరును చెంతకు పోవుటకు సాహసించరైరి. 'బ్రతికుంటే బలుసాకు' అను సామెతను మననముచేసి కాని ప్రాణముపై తీపిచే వారెవరును దగ్గరకు పోకయే నిలబడియుండిరి. అందఱి యొక్క గుండెలు దడదడ లాడుచుండెను.

అర్ధరాత్రి ఆ నిశీథసమయమున ఒక ముసలమ్మ చేతి దీపము గైకొని ఆ గుంపు నంతను నెట్టుకొనుచు బావియొద్దకు పోవుచుండెను. అందరు ఆశ్చర్యచకితులైరి. కొందరు ముసలమ్మను వెనుకకు లాగి "అవ్వా! అక్కడకు పోయినావా! చావు కొని తెచ్చుకుంటావు. అక్కడ పెద్దనాగుపాము ఉంది. మేమంతా పోలేకనా ఇక్కడ నిలబడినది? ఇంకా కొన్నాళ్లు ఈలోకంలో ఉండేటట్లు చూడు!" అని హితవు చెప్పదొడగిరి. కాని ముసలమ్మ వారెవరి మాటలకు లొంగలేదు. అందరిని నెట్టుకొని, విదిలించుకొని "మీ కేమైనా బుద్ధి ఉన్నదా? నా కోడలు మంచినీళ్లు తోడుకొని బావిదగ్గర తాడు వదిలేసి వచ్చింది. ఆ తాడుకోసం నేను వచ్చినాను" అని వారితో చెప్పుచు బావిని సమీపించి ఆ దీపపు కాంతిలో అందరికిని, ఆ త్రాటిని చూపించెను.

అందరును ఆశ్చర్యచకితులైరి. చీకటిలో త్రాటిని చూచి పామనుకొని వారందరును నానాబాధలను పొందిరి. కాని ఇపుడు దీపకాంతిలో యథార్థమును తెలిసికొనుటచే వారి గుండెబరువు తగ్గిపోయెను. వారి దుఃఖములన్నియు సమసిపోయెను. మొదటినుండియు అచట నున్నది త్రాడేకాని పాము కాదు. పాము ఏకాలమందును లేదు. కాని భ్రాంతిచే త్రాటిని పాముని భావించి గ్రామస్థులు నానా వికారములను

దుఃఖములను, వేదనలను పొందినవారైరి దీప ప్రకాశమునందు సత్యము సత్యముగ గోచరముకాగా దానిచే అందరికిని గొప్ప ఉపశాంతి లభించెను.

నీతి. ఈ ప్రపంచమున కేవలబ్రహ్మము సత్ చిత్ ఆనందము తప్ప మఱియొకటియు లేదు. అజ్ఞానముచే మానవుడు నామరూపములను పరమాత్మపై ఆరోపించి భ్రాంతిచే ఈజగత్తును వీక్షించుచు అధిష్ఠానమగు సచ్చిదానందాత్మను విస్మరించి నానాదుఃఖములను, జన్మపరంపరలను బొందుచున్నాడు. సద్గురూపదేశమను దీపకాంతిచే యథార్థవస్తువు గోచరింప, అజ్ఞానరూప అంధకారము మటుమాయమైపోగా జీవుడు స్వస్వరూపాత్మను సందర్శించి అత్యంతిక దుఃఖరాహిత్యమును పరమానందప్రాప్తిని బడయుచున్నాడు.

# పరులకిచ్చినదే తనకు లభించును

ఉత్తరప్రాంతమున ఒక పెద్దపట్టణమునందు లక్షాధికారి ఒకడు కలడు. అతడు పెక్కు పారిశ్రామిక సంస్థలను నిర్వహించుచుండెను. అతని ఆధిపత్యముక్రింద ఎన్నియో మిల్లులు ఫాక్టరీలు నడుచుచుండెను. ఉత్తరదేశప్రజలు గోధుమరొట్టె విశేషముగా వాడు చుందురు కావున గోధుమపిండి జనులకు చాల అవసరమని భావించి ఆ "సేటు" గారు ఒక పెద్ద పిండి మరను ఏర్పాటుచేసిరి. ప్రతిదినము జనులు తండోపతండము లుగా ఆ మిల్లువద్దకు వచ్చి గోధుమలను పిండిచేయించుకొని వెడలుచుందురు ఆ పిండిమరవలన సేటుగారికి ప్రతిసంవత్సరము కొన్నివేల రూపాయలవరుంబడి వచ్చుచుండెను.

ఇట్లుండ ఒకనాడు ఆ పట్టణమునందలి ఒకానొక దేవాలయము నందు ఒక హరిదాసు హరికథ చెప్పుచుండ జనులు, సేటుగారు శ్రవణాభిలాషులై అచటికి పయనమైరి. ఆదినము ప్రహ్లాదోపాఖ్యానము హరికథ జరుగుచుండెను. జనులు భక్తి భావముతో తన్మయులై ఏకచిత్తులై వినుచుండిరి. భాగవతారుగారు తమ యావచ్ఛక్తిని వినియోగించి, పెక్కుహావ భావములను మనోరంజకముగ వెల్లడించుచు కలకంఠముతో శ్రావ్యముగ గీతములను ఆలాపించుచు బహు ఆకర్షణీయముగ హరికథ చెప్పుచుండిరి. సందర్భవశమున ఆ హరికథయందు

అన్నదాన ప్రశస్తి వచ్చెను. అన్నదానము మహా పుణ్యప్రద మైన కార్యమనియు, ఒక్క ప్రాణికి అన్నము పెట్టినచో ఎంతయో పుణ్యమును జీవుడు ఆర్జించగలడనియు, కావున అన్నదానము ద్వారా దరిద్రనారాయణులకు సేవచేయుట పరమధర్మమనియు ప్రబోధించెను. ఆవాక్యమును శ్రద్ధతో నాలకించిన లక్షాధికారి తానుకూడ అట్లు దీనజనులకు అన్న దానముచేసి పుణ్యభాగ్యము నొందవచ్చునని తలంచిమరునాడు అన్నదానము చేయ నిశ్చయించుకొనెను.

ఉత్తర దేశమునందు అందరును భోజనమునందు రొట్టెలనే ఉపయోగించుదురు. కాబట్టి ఆసేటుగారు రొట్టెల కొరకై తన పిండిమరలో నిలవయున్న గోధుమపిండిని తెప్పించి రొట్టెలను చేయించుటకై తన అనుచరులకు ఆజ్ఞయొసంగెను. బహుకాలము అమ్ముడు బోక నిలవయుండుటచే ఆపిండి పురుగు పట్టి దుర్గంధమును వెలిగక్కుచుండెను సేటుగారికి ఆవిష యము తెలిసియుండినను ఏదియో విధముగ అది వినియోగ పడుటయే ప్రధానముగ భావించినవాడై దానినే రొట్టెలు చేయించి బీదవారికి పంచిపెట్టించెను. ఈకార్యము ద్వారా తనకు రెండు మేలులు చేకూరగలవని అతడు నిశ్చయించు కొనెను. 1) బహుకాలము నుండియు ఖర్చు కాక యున్న గోధుమపిండి ఏదియోరీతిగ కార్యమునకు వినియోగపడుటయు 2) బీదలకు పెట్టుటవలన పుణ్యము లభించుటయు.

గోధుమపిండి పుచ్చిపోయియుండుటవలనను, భూయిష్టముగ నుండుటవలనను దానితో చేయబడి భుజించుటకు యోగ్యములుకావు.

గోధుమపిండి పుచ్చిపోయియుండుటవలనను భూయిష్టముగ నుండుటవలనను దానితో చేయబడి భుజించుటకు యోగ్యములుగా నుండనప్పటికిని బీద వాటిని ఎట్లో తినివైచి శాంతిచేసికొనుచు అతృప్తి చెంది పోయిరి. ఈ చిత్రమంతయు గాంచి సేఠుగారి పరమచింతాక్రాంతురాలై తన భర్తయొద్దకు పరుగి అన్నదానమువలన పుణ్యము లభించునను విషయ కాని పాచిపోయిన అన్నము, ముక్కిపోయిన రొట్టె పోయిన వస్తువులు తినుటకు ఒకరికి పెట్టవచ్చునా మంచి రొట్టెలు తినుచు నారాయణస్వరూపులగు ఆ దరిద్రనారాయణులకు వాసన కొట్టుచున్న అవ పెట్టవచ్చునా? భగవంతుడు మనకేమియును లో కదా! కావలసినంత మంచి గోధుమపిండి మన ఉన్నది కదా! దాని నెందుకు ఉపయోగించరాదు? అపవిత్రమైనట్టి వస్తువును దానము చేసినందువల లభించునా?'— అని అడుగగా షావుకారు ప త్తరమీయక వెడలిపోయెను.

అప్పుడు సేటుగారిభార్య భర్తకు తగిన పాఠము బోధించి అతని హృదయమునందు పరివర్తనము తెచ్చుట ఎటులాయని ఆలోచించి పేదలకు వడ్డించిన ఆ పుచ్చిపోయిన రొట్టెలు నాలుగు తీసి దాచిపెట్టెను. మధ్యాహ్నము 12 గంటలు అగు సరికి భర్తగారు భోజనమునకై ఇంటికిరాగా, భార్య తాను దాచిపెట్టిన ఆ చెడిపోయిన రొట్టెలనే భర్తకు వడ్డించెను. అపుడు సేటుగారు ఏల ఇట్లు చేసితివని భార్యను మందలించగా ఆమె యిట్లు బదులు చెప్పెను—'ఏమండీ! ఈ లోకములో ఒకరు ఏవస్తువును ఇతరులకు దానము చేసెదరో ఏ పదార్థమును ఇతరులకు పెట్టెదరో ఆవస్తువునే పరలోకములో కర్మదేవతలు వారికి ఒసంగెదరని పెద్దలు చెప్పుచుందురు. ఇపుడు మీరు పుచ్చిపోయిన పాసిన రొట్టెలను ఇతరులకు పెట్టినారు కాబట్టి ఆ పాసిన రొట్టెలే మీకు పరలోకములో తినుటకు లభింపగలవు. కాబట్టి వాటిని తినుటకు ఇప్పటినుండియే అభ్యాసము చేసినచో అప్పటికి బాగుగా అలవాటుపడగలరు. అకస్మాత్తుగ మీరు వాటిని భక్షించలేరు. అంతేకాని చెడుభావనతో కాదు!

భార్యయొక్క ఆ హితవాక్యములను వినగనే భర్తకు కనువిప్పు కలిగి తాను చేసినది గొప్ప పొరపాటని గ్రహించినవాడై వెంటనే తన యనుచరులను పిలిపించి మంచి గోధుమ పిండితో రొట్టెలను చేయించి పేదవారికి తిరిగి వడ్డించెను. ఆ

బీదలందఱును అపుడు పరమానందపడి సంతుష్టాంతరంగులై వెడలిపోయిరి.

**నీతి,— ఒకరికి తానేది యొసంగునో అదియే తనకు లభించును కావున అపవిత్రమైన దానిని పరుల కీయరాదు. అపవిత్ర భోజనమును ఇతరులకు పెట్టరాదు. మంచివస్తువునే ఈయవలెను. మంచి భోజనమువే పెట్టవలెను. ఎదుటివాడు నారాయణస్వరూపుడని భావించియే దానధర్మములు చేయవలెను.**

## అజ్ఞాన పరాకాష్ఠ

ఒకానొక సమయమున పదిమంది యాత్రికులు తీర్థయాత్రకై బయలుదేరిరి. పవిత్రములైన యాత్రాస్థలములను దర్శించి, సాధు సత్పురుషుల సాంగత్యమును బడసి, వారి ముఖత నాలుగు మాటలు శ్రవణమొనర్చి సంసారతాపమును అంతమొనర్చుకొన వలెనను అభిలాషతోను పుణ్యమును ఒకింతైనను సముపార్జించవలెనను ఉబలాటతోను వారందఱును నాలుగు మాసముల యాత్రా కార్యక్రమమును సుదీర్ఘ విచారణచే రూపొందించుకొని ఆదాని అమలుకై కృతనిశ్చయులై

బయలుదేరిరి. పాదచారులై అన్ని తీర్థములను సేవింపదలంచి వారు దారిలో కలుగు వ్యయప్రయాసలకు లెక్కసేయక పల్లెలను, పట్టణములను దాటిపోవుచుండిరి.

ఇట్లుండ ఒకనాడు వారికి మార్గమధ్యమున ఒక నది ఎగురయ్యెను. ఆ నదిని దాటి ఆవలియొడ్డున ఒక్క పడవగాని, పడవనడుపు సరంగువాడుగాని లేరు. నదిపై ఎచటను వారధి కూడ లేదు. వారిలో ఎవరికిని ఈతకూడ రాదు. నదిమాత్రమూ ఉత్తుంగతరంగ సమూహములతోగూడి అతివేగముగ ప్రవహించుచుండెను. తీర్థయాత్రను మధ్యలో విరమించుటకున్న లేదు. అట్టి వికటపరిస్థితులమధ్య ఆ పదిమంది యాత్రికులు ఏమి చేయుటకును తోచక నదియొడ్డున కూర్చొని అంతులేని ఆలోచనలను చేయుచుండిరి. కాని గంటసేపు ఆలోచించినను సమస్య తెగలేదు. కర్తవ్యము తేలలేదు.

ఇంతలో ఆ సమీపమున ఎవడో కర్షకుడు పనిమీద పోవుచుండ వానిని ఆపి ఆ పదిమంది యాత్రికులు "నాయనా! ఈ నది లోతు ఎంత ?" అని ప్రశ్నింప అతడు "మనిషిలోతు మాత్రమే" అని చెప్పి వెడలిపోయెను. ఆ వాక్యమును వినగనే ఆ పదిమందికి ప్రాణముల కేమాత్రము ముప్పు కలుగబోదు, దిగి చేతులు ఆడించుకొనుచు, నీళ్ళను వెనుక వైపునకు నెట్టుకొనుచు ఏదియో విధముగ ఆవలియొడ్డుకు చేరెదము.

గ్గన ఏడ్వదొడగెను. అతని ఏడ్పుచూచి తక్కినవారందరు గడ కన్నీరు కాల్వలై పారునట్లు ఏడ్వజొచ్చిరి. కొందరు నపడి దొర్లుచు నదిలో చనిపోయిన తమ సన్నిహితుని కొఱకై విధములుగ ఆక్రోశింపదొడగిరి. ఆ దృశ్యము నిజముగా ంత హృదయవిదారకముగ గన్పట్టెను.

ఇట్లుండ అదారిన ఎవరో పాంథుడు పోవుచు యాత్రికుల రోదనమును విని, వారి దీనభావముల పరికించి సమీపమున వచ్చి "నాయనలారా! మీరేల ఏడ్చుచున్నారు?" అని ప్రశ్నింప అందులో నొకడు "అయ్యా! ఏమని చెప్పుదుము! మా దుఃఖమునకు హద్దుపద్దులు లేకున్నవి. ఈరోజు ప్రొద్దుననే ముఖము చూచితిమో కాని మాలో ఒకడు అకస్మాత్తుగ నదిలో మునిగిపోయెను. మేము పదిమంది యాత్రార్థము బయలుదేరి రాగా నది దాటగనే తొమ్మిదిమందే మిగిలితిమి. ప్రభూ! ఆ మునిగిపోయినవానిని రక్షించి తెచ్చితిరా మీకు వేవేల నమస్కారములను సమర్పించెదము" — అని విన్నవించెను.

బాటసారి సమస్తము శ్రద్ధగ వింటూ సందర్భమునంతను వారి చర్యను అవగాహన మొనర్చుకొని అచటనున్న అందరిని మనస్సులో లెక్కపెట్టగా పదిసంఖ్య వచ్చెను. పది మంది అగుట నిశ్చయముగా ఉండియుండుటచే ఎవనిను

చావలేదని తెల్సుకొని ఆతడు యాత్రికులతో "నాయనలారా! పదవవాడు చావలేదు. బ్రతికియే ఉన్నాడు" అని చెప్పగా అందుకు వారివారి దుఃఖమును మఱచి ఆనంద డోలికలలో ఊగుచు "ఆ పదవవాడు ఎక్కడున్నాడు మహాప్రభూ!" అని ప్రశ్నించిరి. తోడనే పాంథుడు "మీలో ఎవరు లెక్కపెట్టి నారో వాడే పదవవాడు. అతడు లెక్కపెట్టుకొనలేదు. అందు వలన ఒకసంఖ్య తక్కువ వచ్చుటచే నదిలో ఒకడు మునిగి పోయినాడని భ్రాంతిచే నిశ్చయించుకొని ఏడ్చుచున్నారు ఇచట జరిగిన ఆపత్తు ఏమియు లేదు. కాబట్టి మీరందఱును ధైర్యము వహించి, లేచి మీమీ యాత్రిలను యథావిధి కొనసాగించుకొనుడు'—అని చెప్పి వెడలిపోయెను.

బాటసారి పోగానే యాత్రికులు తమ్ముతాము తిరిగి లెక్కించుకొని పదిసంఖ్య వచ్చుటచే పరమానందయుక్తులై, దుఃఖమును పోగొట్టుకొని తమకన్నులు తెరపించినందులకు పాంథునకు మనంబున జోహారులర్పించి, తీర్థయాత్రను ద్విగుణీకృతోత్సాహముతో కొనసాగింపదలంచి అచ్చోటు వీడి చనిరి.

నీతి :— అజ్ఞానులగు జీవులే యాత్రికులు. ఈ సంసార యాత్రలో వారు నానాబాధలు పడుచు శాశ్వత ఆనందము దొరక లేదని ఏడ్చుచుండగా సద్గురువను పాంథుడు ఎదురై "నాయనలారా! దుఃఖపడకుడు. శాశ్వత ఆనందము (దైవము, ఆత్మ) కలదు. ఆ ఆనందము మీ స్వరూపమే. మీరే సచ్చిదానందస్వరూపులు (తత్త్వమసి) ఈ రహస్యమును తెలిసికొని ధైర్యవంతులై మీ జీవితయాత్రను కొనసాగింపుడు! అని బోధచేయగా, వారు గురుబోధ యెడల విశ్వాసము గలవారై తమ్ము తాము తెలిసికొని తమ నిజస్వరూపమగు సచ్చిదానందపరమాత్మ నెఱిగి జీవితమును ఆనందముగ గడుపుచుందురు. అట్టి బోధలేనివారు కథలోని దశమునివలె అజ్ఞానపరాకాష్ఠనందుకొని తానే పదవవాడై యుండినప్పటికి పదవవాడు లేడని భావించి నానాయాతనలను అనుభవించుచుందురు.

## అశ్రద్ధ

ఒకానొక పట్టణములో ఒక శ్రీమంతుడు కలడు. అతడు ఒక సామాన్యకుటుంబమునందు జన్మించినను తన అనవరత పరిశ్రమచేతను, వ్యాపారకళయందలి నేర్పరితనము చేతను అపారధనమును సంపాదించి ఆ ప్రాంతములోనే గొప్ప

శ్రీమంతుడయ్యెను. ఆ పట్టణమునందలి దేవాలయములో
ఒకనాడు రాత్రి ఒక భాగవతారుగారు ప్రహ్లాదోపాఖ్యాన
మును హరికథారూపమున చెప్పుచుండిరి. శ్రోతలు వేలకు
వేలుగావచ్చి వళ్ళంతయు చెవులుచేసికొని ఏకాగ్రచిత్తులై
వినుచుండిరి. హరిదాసుగారు తమ గానకళానైపుణ్యమును
ప్రదర్శించి శ్రోతలను ఉఱ్ఱూతలూగించుచుండిరి. ప్రజలు
భక్తిపరవశులై తమ ఇళ్లు, వాకిళ్లు మఱచి తదేక దృష్టితో
కథను ఆలకించుచుండిరి. హరిదాసుగారి ఖ్యాతినిగూర్చి ఇది
వఱకే వినియున్నట్టి ఆ శ్రీమంతుడు అవకాశమును జారవిడు
వక, సమయము చిక్కకున్నను ఎటులనో వీలు కలుగజేసి
కొని హరికథకు వినుటకై ఆనాడు దేవాలయమునకు వెళ్లెను.
ప్రహ్లాదోపాఖ్యానమును గూర్చిన రసవత్తరమైన ఘట్టములను
హరిదాసు భక్తిపారవశ్యమున ప్రబోధించుచుండ, వానిని
చక్కగ ఆకళింపుచేసికొనిన ధనికునియొక్క హృదయములో
ఒక గొప్ప పరిణామ ముదయించెను.

ఇదివఱకు భగవంతునియెడల భక్తి ఏ కొద్దిగనో గల
వాడు ఇపుడు దానిని పెంచుకొని విశేష భక్తి కలవాడయ్యెను.
ఇదివఱకు ప్రాపంచిక పదార్థములయెడల ఆసక్తి కలవాడు,
ఇపుడు వాని యొక్క నశ్వరత్వమును గుర్తించి వానిపై

్వేమును, అభిలాషను తగ్గించుకొనెను. ఇదివఱకు భోగములే జీవునకు శరణ్యమని భావించినవాడు, తన సిద్ధాంతమును మార్చుచేసికొని భగవంతుడొకడే కులేని యు, ఆతడే సర్వావస్థలయందును సమస్తప్రాణు అనుసరింపదగినవాడనియు నిశ్చయించుకొనెను. తత్ప గ ఆతడు తన గృహమున పూజాపునస్కారములను జరుపుచుండెను.

ఒకనాడా శ్రీమంతుడు పురోహితుని రప్పించి సత్య ణ పూజజరిపించుచుండెను. పురోహితుడు షోడశోప ంతో సాంగోపాంగముగ పూజ నిర్వహించుటకు కృత ండై సత్యనారాయణుని పటమును పుష్పమాలలతో ందుదగ అలంకరించి, పటమునకు ఎదురుగా తుని కూర్చొనబెట్టి పూజను ఉపక్రమించెను. పూజ • కొనసాగుచుండెను. ఇంతలో ధూపప్రకరణమురాగా తుడు "అయ్యా! దేవునకు ధూపము సమర్పించవలసి • అగరొత్తులు తెచ్చినారా?" అని ప్రశ్నించెను. ు భక్తియున్నదే కాని శ్రద్ధలేదు. ఇంటిలోపల అగ ఉన్నప్పటికిని తెచ్చుటకు బద్ధకముచేత అతడు ాలేదుకదా! అగరొత్తులు లేకుండగనే పూజను కొన డు" అని చెప్పెను. వెంటనే పురోహితుడు ఇక

చేయుటకు లేక "ధూపార్థం అక్షతాన్ సమర్పయామి" [ధూపము బదులు అక్షతలు వేయుచున్నాను] అని చెప్పి పటముపై చల్లెను.

తదుపరి కొంతసేపటికి నైవేద్యఘట్టము తటస్థించెను. పురోహితుడు అయ్యా! దేవునకు నైవేద్యమేమైన చేసినారా? అని అడుగగా నైవేద్యము వంటశాలలో సిద్ధముగా నున్నప్పటికిని తెచ్చుటకు బ్రాలుమాలి "అయ్యా! పురోహితుడుగారు! నైవేద్యము లేకుండా పూజను కొనసాగించుడు" అని ధనికుడు చెప్పెను. ఇక గత్యంతరములేక పురోహితుడు నైవేద్యార్థం అక్షతాన్ సమర్పయామి [నైవేద్యముబదులు అక్షతలు వేయుచున్నాను] అని చెప్పి కొన్ని అక్షతలను పటముపై చల్లెను. ఈప్రకారముగ పూజ కొనసాగగా ఆ దృశ్యము చూచి ధనికుని భార్య మనంబున గొప్ప ఆవేదనను బొంది భర్తతో ఏమండీ! భగవంతుడు మనకు అన్ని సౌకర్యములను కలుగజేసి ధనధాన్యములను సమృద్ధిగ ప్రసాదించి, ఏలోటు లేకుండ అనుగ్రహించినాడు. వస్తువులన్నీ ఉండికూడ ధూప దీప నైవేద్యాదులను ఆదేవదేవునకు సమర్పించకుండ పూజచేయుట సమంజసమేనా? అది ఉపచారమా? అపచారమా? దానివలన ఏమైన ఫలితము కలుగునా? అని ప్రశ్నించగా ఆ పెవాక్యములను అతడేమియు సరకుగొనలేదు.

అపుడు ధనికుని అర్ధాంగి అతనికి సరియైన బోధ సు చేయదలంచి అవకాశము కొఱకు ఎదురు చూచుచుండగా, ఇంతలో మధ్యాహ్నపు వేళ అతడు వంటశాలలోనికి భోజనము కొఱకు రాగా, భార్య అతనికి విస్తరివేసి అన్నముపడ్డించకుండ 'అన్నార్థం అక్షతాన్ సమర్పయామి' (అన్నము బదులు అక్షతలు వడ్డించుచున్నాను) అని చెప్పి విస్తరిమధ్యలో కొద్దిగా అక్షతలు పెట్టి, ఆ తరువాత "శాకార్థం అక్షతాన్ సమర్పయామి (కూర బదులు అక్షతలు వడ్డించుచున్నాను) అనిచెప్పి ఆ అన్నము ప్రక్కనే కొద్దిగా అక్షతలు పెట్టెను ప్రకారముగా విస్తరిచుట్టూ అక్కడక్కడ అక్షతలు పెట్టుచుండగా భర్తకు కళ్లుమండి ఏమే! అన్నము, కూరలు వడ్డించకుండ అక్షతలు వేయుచున్నావేమి? అని గద్దించి అడుగగా భార్య అందులకు సమాధానముగా "ఏమండీ! దేవుని పూజకు ఏ ఉపచారమున్న చేయక పట్టి అక్షతలతోనే పూర్తి చేసితిరిగదా! ఇపుడు మీ భోజనమునకు మాత్రము అన్ని ఉపచారములు చక్కగా ఉండవలెనా? అని ప్రశ్నింప ధనికుడు సిగ్గు తెచ్చుకొని, తన తప్పిదమును గుర్తెరింగి "ఇక మీదట పూజ మొదలైనవి సక్రమముగా చేసెదనని" భార్యా నొసంగెను. అంతట భార్య ధనికుని విస్తరిలోని అక్షతలు తీసివేసి అన్నము, కూర మొదలైనవి వడ్డించగా అతడు సుష్టుగా భుజించి లేచిపోయెను.

నీతి.— ఏ కార్యమైనను శ్రద్ధతో, విశ్వాసముతో చేసినపుడే అది సత్ఫలితమును, పూర్ణఫలితమును ఒసంగ గలదు. అశ్రద్ధతో చేసినది దాదాపు చేయనిదానితో సమానమే కాగలదు. కాబట్టి ఏ కార్యమునకైనను శ్రద్ధను జోడించవలెను. ముముక్షువగువాడు అశ్రద్ధను పారద్రోలి, వినయ విధేయతలతో, భక్తిశ్రద్ధలతో తన అధ్యాత్మిక కార్యక్రమములను నిర్వర్తించవలెను.

## ఏకాగ్రత

మహమ్మదీయ పరిపాలకులలో అక్బర్ చక్రవర్తి గొప్ప పేరు ప్రఖ్యాతులను బడసినవాడు, అతడు పరమత విద్వేషము లేనివాడు. సౌజన్యమూర్తి పక్షపాతరహితముగ రాజ్యపరి పాలనము చేసి సర్వమతస్థుల మన్ననలకును పాత్రుడైన ధీశాలి యతడు. పవిత్రత ఎచట నున్నప్పటికిని జాతి మత కుల విచక్షణను పాటింపక అద్దానిని గౌరవించువాడు. దైవభక్తి విశేషముగ కలవాడగుటవలన అతడు ఎన్ని రాజ్యకార్యము లున్నప్పటికిని నియమము తప్పక " నమాజు " ( ప్రార్థన ) చేయుచుండువాడు.

ఆ కాలమందు సిక్కుమతస్థుల గురువగు నానక్ చాల
ప్రసిద్ధి కెక్కియుండెను అతడు జనులకు చక్కటి ధర్మబోధ
చేయుచు ప్రజలను సత్యమార్గమున, నీతిమార్గమున నడిపించు
చుండుటవలన జను లాతనిపై పరిపూర్ణవిశ్వాసము కలిగియుం
డిరి. గురునానక్ యొక్క పేరు ప్రఖ్యాతులను గూర్చి విని
అక్బరు చక్రవర్తి అతని నొకసారి తన ప్రార్థనా సమావేశము
నకు ఆహ్వానించెను. ఆ సమావేశమున నొక ఉన్నతాసనము
పై నానక్‌ను ఆసీనునిగ జేసి అక్బర్ తన ప్రార్థనను ఉపక్ర
మించెను. చక్రవర్తితో బాటు ఇంకను అనేకులు ఆ ప్రార్థనా
కార్యక్రమమునందు పాల్గొనిరి.

అక్బర్ నిమీలితనేత్రుడై భక్తిభావపురస్సరముగ
ప్రార్థనాగీతమును ఆలాపించుచుండెను. అనుచరులందఱును
అట్లే అతనిని అనుకరించుచు చక్కగ ప్రార్థన చేయుచుండిరి.
ప్రార్థన మహదానందముగ జరిగిపోవుచుండెను. ఆ దృశ్యము
నంతను అచట ఆసీనుడై యున్న నానక్ వీక్షించుచుండెను.
అక్బర్ చక్రవర్తియు, అతని అనుచరులును ప్రార్థన చేయు
చుండగా నానక్ ఎందులకో నవ్వెను. ప్రక్కనున్నవారంద
ఱును ఉగ్రులై అతడేల నవ్వెనో వెంటనే కారణమరయదలం
చిరి కాని అక్బరు వారలను వారించి ప్రార్థనను కొనసాగించు
నట్లు చేసెను.

ప్రార్థన యంతయు పూర్తి అయిన పిదప •
వారు పోగా, అక్బరు చక్రవర్తి వినయముతో గురు
సమీపించి "మహాత్మా! ప్రార్థనామధ్యమున తామ
కారణము తెలియజేయుడ"ని ప్రశ్నింపగా నానక్ గ
నిట్లు పలికెను— " ఓ అక్బర్ చక్రవర్తి ! భగవ
రమ్మని మీరు నాకు ఆహ్వానమును పంపితిరి. నేన
సంతోషించి మీ ఆహ్వానమును అంగీకరించి ఇట
ఏకాగ్రచిత్తముతో దైవధ్యానించుట కేమాయ
ఆనందపడితిని. కాని అట్లు జరుగక మాటిమాటికి
జరిగినందులకు నాకు నవ్వు వచ్చినది. ఓ చక్రవర్తి
చేయునపుడు మీ మనస్సు దైవమునందు సం
యున్నదా? లేక మార్కెట్టులో అరేబియా గ
బేరము చేయుచున్నదా? నిజముగ చెప్పుడు ?ఈ ప్ర
నిలదీసి ప్రశ్నింప అక్బర్ నిరుత్తరుడై తన మనస్సా
పడు కానే మిక్కుటముగ పరితాపపడెను,

నానక్ చెప్పినది నిజమే, ఎదుటివాని మన
లను చక్కగ తెలుసుకొనగల్గు మహాప్రజ్ఞాశాలియ
ప్రార్థనా సమయమున అక్బర్ యొక్క మనస్సు
తిరుగుచున్నదో బాగుగ పరీక్షించి యున్న వి

బయట పెట్టెను. నానక్ చెప్పిన వాక్యములు యథార్థములే యని అక్బర్ అంగీకరించి ఇకమీదట అట్లు జరుగకుండుటకై యత్నము చేయుటకు కృతనిశ్చయుడయ్యెను.

ప్రార్థనాకాలమందు మనస్సు పరి పరి విధముల బహిర్ముఖముగ పరివర్తించుట పూర్వసంస్కార బలముచే సంభవించినను, సాధకుడగువాడు అట్లు దానిని విచ్చలవిడిగ వదలివేయక పగ్గము పట్టిలాగి గుఱ్ఱమును అదుపులోనికి తెచ్చునట్లు, భక్తియనుతాటిచే, వైరాగ్యమను దృఢసూత్రముచే ఆ పరుగిడు మనస్సును లోనికిలాగి, అంతర్ముఖమొనర్చి భగవంతుని పాదపద్మములందు స్థిరముగ నుంచవలెను.

**నీతి:—** ప్రార్థనా జపధ్యానాదులందు చిత్తమే ఏకాగ్రముగ నుండుట చాల అవసరము. ఏకాగ్ర చిత్తమే సత్ఫలితములను సాధించగలదుగాని, చంచల మనస్సు కాదు. అభ్యాసము చేతను, వైరాగ్యము చేతను, తత్త్వవిచారణ చేతను మనస్సు ఏకాగ్రతను బొంది స్థిరముగ నుండగలదు. సాధకుల కిట్టి చిత్తైకాగ్రత అత్యంతావశ్యకమై యున్నది.

# హృదయ పరివర్తనము

పాండవ కౌరవ యుద్ధము పూర్తి అయినది. ధర్మరాజు చక్కగ రాజ్యపరిపాలనము చేయుచుండెను. ఎల్లరు సౌఖ్యముగ కాలము గడుపుచుండిరి. ఆ సమయమున ఒక నాడు ధర్మరాజునకు తీర్థయాత్రలు సేవించిరావలెనను అభిలాష మనంబున ఉదయించెను. తోడనే తన యభీష్టమును బంధుమిత్రాదుల కెఱింగింప వారందఱును పరమానంద పడిరి. కొందఱు ధర్మరాజునితో బాటు తీర్థయాత్రకు వెడలుటకు తమ సంసిద్ధతను వెల్లడిచేసిరి. రంగమంతయు సిద్ధపడెను. యాత్రార్థము పోదలంచినవారందఱును యుధిష్ఠిరుని భవనమందు సమావేశమైరి. ఇక కొద్ది సమయములో యాత్ర ప్రారంభము కానుండగా ధర్మరాజు శ్రీకృష్ణునియొద్ద కేగి దండప్రణామంబాచరించి, "దేవా! తీర్థయాత్రకు పోదలంచియున్నను. తమరుకూడ మా వెంట వచ్చినచో మాకెంతయో ఆహ్లాదముగ నుండగలదు. మాయాత్ర సఫలము కాగలదు. పై పెచ్చు రసవత్తరముగా కొనసాగగలదు" —అని వేడుకొనెను.

కాని అందులకు శ్రీకృష్ణుడు అంగీకరించలేదు. తనకు ఇతర కార్యములెన్నియో కలవనియు, వచ్చుటకు సావకాశము లేదనియు కోరి వచించెను. అయినను ధర్మనందనుడు తన పట్టు వదలలేదు. యాత్రయందు అమ్మహనీయుని సాన్నిధ్యము, సాహచర్యము పరమానందముగ నుండగలదని భావించి రావలసి

డిగా మరల మరల ప్రార్థించెను. యుధిష్ఠిరుని వినయాన్విత వచనములను విని శ్రీకృష్ణపరమాత్మ యిట్లు ప్రత్యుత్తర మిచ్చెను.

"ధర్మరాజా! తీర్థయాత్రయను గొప్ప కార్యమును బట్టితివి. సంతోషము. విజయవంతముగ నెరవేర్చుకొని రమ్ము. నాకు మాత్రము వచ్చుటకు అనుకూలము లేకున్నది యినను నా ప్రతినిధిని మీ వెంట పంపెదను!" అని పలికిన సమీపమున నేయున్న ఒక సొరకాయను చూపించి నందనా! ఇదే నా ప్రతినిధి దీనిని మీ వెంట తీసికొని నేను వచ్చినట్లుగనే భావించి, అన్ని తీర్థముల లోను ని ముంచి, అందఱి దేవుళ్ళను దర్శనము చేయించి, తిరిగి టికి తీసికొనిరమ్ము' అని నుడివెను.

భగవంతుని ఆ వాక్యములపై ఎంతయో శ్రద్ధాభక్తులు వాడై ధర్మరాజు అట్లే ఆ కాయను తీసుకొని శిరంబున కొని సాక్షాత్ శ్రీకృష్ణుడే తన వెంట నున్నాడని మనంబున వించుకొని తీర్థయాత్ర కుపక్రమించెను. తాను వెళ్ళిన ల్ల ఆ కాయనుగూడ తీసుకొనివెళ్ళెను. తాను స్నానము సిన తీర్థములందెల్ల దానినికూడ స్నానము చేయించెను. ను దర్శించిన దేవుళ్ళకందఱికి దానినికూడ చూపెను. ఈ కారముగ శ్రీకృష్ణుని యానతి ప్రకారము తు. చ తప్ప

కుండా ఆ కాయచేతగూడ తీర్థయాత్ర చేయించెను. కొంత
కాలమునకు యాత్ర పరిసమాప్తికాగా, అందఱును తమ తమ
గృహములకు తిరిగి వచ్చిరి. ధర్మరాజుకూడ పరివారసమేత
ముగ తన పట్టణమునకు తిరిగివచ్చెను.

సామాన్యముగ తీర్థయాత్రలను సేవించి యింటికి తిరిగి
వచ్చువారు యాత్రాపరిసమాప్తిసూచకముగ అన్నసమా
రాధన చేయుచుందురు. ఆ సాంప్రదాయప్రకారము అన్న
సమారాధనకు ఏర్పాట్లు కావించెను. తరువాత యాత్రకై తన
వెంట తీసికొని వెళ్ళిన సొరకాయను శిరంబున నిడుకొని ధర్మ
నందనుడు శ్రీకృష్ణునికొద్దకు వెళ్లి నమస్కరించి ఆ కాయను
వారిముందుంచి "మహాత్మా! తాము ఆనతిచ్చినప్రకారము
అన్ని తీర్థములందును దీనిని ముంచితిని. అందలి దేవుళ్ళను
చూపితిని, ఇపుడు సన్నిధికి దీనిని గొనివచ్చితిని, స్వీకరింపుడు"
అని పలికి ఆ కాయను శ్రీకృష్ణునిముందు ఉంచగా కృష్ణపర
మాత్మ ఆనందపడి ధర్మజునితో ఇట్లు పలికెను—ధర్మరాజా!
నీవు దీనిని తీసికొనివెళ్ళి కూరచేయించి నీ విపుడు కావించు
చున్న సమారాధనలో అందఱికి వడ్డించులాగున చేయుము.
నందనందనుని ఆజ్ఞను శిరసావహించి ధర్మరాజు దానిని తీసికొని
వెళ్ళి ఆ ప్రకారమే చేయించెను కాని అదేమి చిత్రమోకాని,
ఆ కూర తినగనే ప్రతివారును వాంతి చేసికొనుచుండిరి. సొర

కాయకూర చేదుగనుండుటయే దానికి కారణము. అపుడు అందరును ధర్మరాజుతో నానావిధములుగ పలుకదొడంగిరి. ఓరాజా! శుభమా అనుచు తీర్థయాత్ర పూర్తిచేసి కావించినట్టి ఈ సమారాధనలో చేదు సొరకాయ ఎందుకు వాడితిరి? అని జనులు తమ ఆవేదనను తెలుపుకొనజొచ్చిరి.

వెంటనే ధర్మరాజు ఆ కాయను శ్రీకృష్ణునియొద్దకు తీసికొని వెళ్ళి "కృష్ణా! చేదు సొరకాయను మీరేల ఇచ్చినారు? మంచికాయను ఇచ్చియుండిన బాగుండెడిదికదా!" అని వచించ తత్క్షణమే శ్రీకృష్ణమూర్తి ధర్మజునితో "రాజా! అది చేదుకాయ అని నాకు ఇదివరకే తెలుసును. కాని తీర్థయాత్రలన్నీ సేవించినది కాబట్టి చేదు తనము పోయినదేమో అని తలచితిని. ఇంకను పోలేదా?" అని ప్రశ్నించెను. ధర్మరాజు నిరుత్తరుడయ్యెను. మహానుభావుడు జనులకు చక్కని పాఠమును బోధించెనుగదా యని పరితృప్తుడయ్యెను.

అనేకులు తీర్థయాత్రలు సేవించుచున్నారు. జపము సలుపుచున్నారు. కాని హృదయపరివర్తన కలుగుటలేదు. తమయందు నిగూఢములై యున్న అసురగుణములను,పాపసంస్కారములను వారు పోగొట్టుకొనుటలేదు ఎక్కడ ఉన్న గొంగళి అక్కడే ఉండుచున్నది. క్రియలు లాంఛనముగ జరిగిపోవుచున్నవి. కాని మనస్సు మార్పు కలుగజేసికొనుటయే మానవ

జన్మముయొక్క ముఖ్యోద్దేశ్యము. పాపి పుణ్యాత్ముడుగ మారిపోవలెను. దుష్టుడు సద్గుణవంతుడుగ పరిణామమొంద వలెను. అసురసంస్కారములు పోయి దైవసంస్కారములు అలవాటు కావలెను. ఎన్నిదైవకార్యము లాచరించినను మనస్సునందలి చేదు చేదుగ నుండినచో ఏమి ప్రయోజనము చిత్తమందలి మాలిన్యము ఈషన్మాత్రమైనను తొలగకుండినచో ఏమి ప్రయోజనము? కాబట్టి పరమార్థకార్యము లాచరించు వారు తమయందు హృదయపరివర్తనము కలిగినదా లేదా యని పరీక్షించుకొనుచు కలుగజేసికొనవలెను.

నీతి.— తీర్థయాత్రలు, జపములు, తపములు పూజలు మున్నగువానివి చేయువారు అపుడపుడు తమ హృదయమును పరీక్షించుకొనుచు దుర్గుణములు కోపతాపములు తగ్గినవా, తొలగినవాయని పరిశీలిం చుచు, హృదయపారిశుద్ధ్యతను గలిగియుండవలెను.

—o—

# దైవశక్తి - మానవశక్తి

ఒకనొక గ్రామమునందు బంగారు ఆభరణములు తయారుచేయు స్వర్ణకారుడు ఒకడు కలడు. తన వృత్తియం దతడు మహాకౌశలము కలవాడు. కనుకనే చుట్టుప్రక్కలగల గ్రామవాసులందరును వారికి ఏ ఆభరణము కావలసినను అతని యొద్దకే వచ్చి చేయించుకొని పోవుచుండురు. ఆభరణ నిర్మాణకౌశలత్వము వలన అతనికి ఆ పరిసరములో గొప్ప ఖ్యాతి లభించినది. ఒకతూరి యతడు తన బుద్ధికౌశలతనంతను ఉపయోగించి ఒక అపురూపమైన ముక్కుపుడకను బంగారుతో నిర్మించెను. కొన్ని నాలు తదేక దృష్టితో నతడు దానియొక్క రూపురేఖలను గూర్చి పదేపదే చింతనజేసి అంతవఱకును ఎక్కడలేని రూపలావణ్యమును ఆయాభరణమునకు తెచ్చిపెట్టెను. స్వర్ణకారుని తీక్ష్ణబుద్ధియంతయు ఆ నవ్యభూషణము నందు చక్కగ ప్రతిబింబించి దానికొక విలక్షణత్వమును చేకూర్చినది.

తత్ఫలితముగ జనులు తండోపతండముగ దానిని వీక్షించుటకై ఆకుదెంచసాగిరి. ముఖ్యముగ స్త్రీలు సుదూర ప్రాంతములనుండియు బండ్లు కట్టుకొని వచ్చి ఆ ముక్కుపుడక యొక్క సౌందర్యమును కనులపండువగ వీక్షించి పరమానంద భరితులగుచుండిరి. "ఆహా! ఎట్టి అపూర్వసౌందర్యము! ఎట్టి

అద్భుత నిర్మాణపటిమ! ఇంతవఱకు మన జీవితములం దిట్టి ఆభరణ నిర్మాణ దక్షతను ఎచటను గాంచి యుండలేదే! ఆ స్వర్ణకారు డెంతటి అనుభవశాలియో! అతని పుణ్యమా అనుచు ఈ దినము నేత్రోత్సవముగ ఒక అపురూప ఆభరణ మును దర్శించు అదృష్టము మాకు లభించినది! ఔ స్మ ధన్య మైనది! — అని ఈ ప్రకారముగ జనులు తమ అదృష్టమును కొనియాడుచుండిరి. సువర్ణకారుడు నిర్మించిన ఆ యాభరణ కారణముగా ఆ గ్రామమునకే గొప్ప ఖ్యాతి లభించినది. ఇక్కారణముగ ఆగ్రామస్థులందఱును ఒకనాడు సమావేశమై ఏవ్యక్తివలన తమ గ్రామమున కింత ప్రతిష్ఠ కలిగినదో అటు వంటి ఆ మహనీయమూర్తిని సన్మానించుటకు, సత్కరించుటకు ఏకగ్రీవముగ తీర్మానించుకొనిరి. ఆ తీర్మానము ననుసరించి వారందరును నడుము కట్టుకొని చందాలు వసూలుచేసి ఒకా నొక శుభదినమున బ్రహ్మాండమైన రథము ను పుష్పములతో తోరణములతో, రంగు కాగితములతో బాగుగ అలంకరించి మేళతాళములతో భజన పార్టీలతో స్వర్ణకారుని గృహము చెంతకు విచ్చేసిరి. రథమును బయట నిలిపి సన్మాన సంఘ కార్యదర్శిగారు, సన్మానసంఘ సభ్యులతో లోనికేగి స్వర్ణ కారునితో నిట్లనెను.

"మహాశయా! తమరు గొప్ప కళాకుశలురు. ఆభరణ నిర్మాణమందు తమకు తమరే సాటి. తమరొక్క భూషణ నిర్మాణ కౌశల మహిమచే మన గ్రామమునకు మహత్తర కీర్తి లభించినది. దూర ప్రాంతములందలి జనులందరును మన గ్రామముపేరే స్మరించుచున్నారు. ఇంతటి కీర్తి ప్రతిష్టలను మన గ్రామమునకు నిత్యస్మరణీయముగ నొనర్చుటకు కారణ భూతులైన తమకు ఈ గ్రామము తరపున మేము ఘనముగ సత్కరింప దలంచి ఒక మహారథమును అలంకరించి తెచ్చి నాము. తమరు దయచేసి దానియందు కూర్చొనినచో మేము తమ్ములను భక్తిపురస్సరముగ ఊరేగించి మా కర్తవ్యమును విద్యుక్తధర్మమును నెరవేర్చుకొందుము. కాబట్టి దయయుంచి త్వరితముగ వచ్చి రథముపై ఆసీనులు కండు."

కార్యదర్శిగారి ఆవాక్యములను వినుటతోడనే స్వర్ణ కారుడు పకపక నవ్వసాగెను. ఎందులకతను నవ్వెనో ఎవరికిని అర్థము కాలేదు. కొన్ని క్షణములు గడచిన పిదప సన్మానసంఘ కార్యదర్శిగారు "మహాశయా! తమరీసమయ మున నవ్వుటకు కారణమేమి!" అని అడుగగా స్వర్ణకారుడు సపరిహాసముగ పలికెను--"ఓయి పెద్దలారా! ముక్కుపుడకను తయారుచేసిన నన్ను ఊరేగించుట కంటె ముక్కును తయారు చేసిన దేవుని ఊరేగించిన ఎంతబాగుండును! ముక్కుపుడకకు

ఆధారము ముక్కలేనిచో, ముక్కవు
సామాన్యమైన ఒక చిన్న ముక్కవుసం
నన్నే ఇంత గౌరవించ దలంచుచున్న ప
మానవులకు ఎంతో ముఖ్యమై ప్రాణాధార
ఆలవాలమైనట్టి ముక్కను తయారుచేసిన
మాత్మను ఎంత గౌరవించవలెను! ఇంత
మీకు కలుగలేదే అని తలంచి నాకు నవ్వు
ఓ గ్రామ పెద్దలారా! దేవుని పాదమును
భక్తితో ఊరేగించుడు"—అని హితవు చె
ఆమహాత్తరబోధను విని కార్యకర్తలందరు
పరితృప్తిని బడసిరి.

నీతి.— పరమాత్మయొక్క శక్తి
అద్దానిముందు మానవుని శక్తి యెంత
వుడు ఎంత ఘనకార్యము సాధించినను
యని తలంచక, దానిచే అహంకారము
యంతయు భగవత్కృపా కటాక్ష
భావించి నిగర్వముతో మెలగుచు, భ
భక్తిశ్రద్ధలను ఇతోధికముగ అభివృ
చుండవలెను.

# ఆత్మయే మహాప్రియతమమైనది

ఒకానొక గ్రామమునకు కొంతదూరమున ఒక నది ప్రవహించుచుండెను. మహోత్తుంగతరంగసమన్వితమై, వర్షాకాల సలిలధారలతో గూడి ఆ నది బహువేగముగ పొంగి పొరలుచుండెను. ఒక యాత్రికుడు కుటుంబసమేతముగ పాదచారియై యాత్రసలుపుకొనుచు సరిగా ఆ నది సమీపమున నేతెంచెను. అతనియొద్ద యాత్రకు వినియోగపడునిమిత్తము తెచ్చుకొనిన తబ్బుమూట యొకటి కలదు. అతనివెంట అతని సహధర్మచారిణియు,కుమారుడున్ను కలరు.కుమారుని వయస్సు పది సంవత్సరములు మాత్రమే.

వారందరును నదియొద్దవరకు వచ్చి ఆగిపోయిరి. తీరమున ఒక్క పడవైనను కానరాకుండెను. వారిలో ఒక్కనికిని ఈత రాదు. వారందఱును అవలియొడ్డునకు త్వరితముగ చేరి యాత్రా కార్యక్రమమును కొనసాగింపవలసియున్నది.నదియా భీషణముగ ప్రవహించుచుండెను. ఇట్టి పరిక్కర విపరీత పరిస్థితిలో బాటసారికి ఏమి చేయుటకును తోచలేదు. తీర్థయాత్ర నుండి వెనుకకు మఱలుటకును ఇష్టపడలేదు. యాత్రలో ఎన్ని కష్టములు సంభవించినను, ఎన్ని ప్రతిబంధములు ఎదురైనను వాని నన్నింటిని అధిగమించి దృఢతరదీక్షతో యాత్రను కొనసాగించుటకే అతడు కృతనిశ్చయుడై

యుండెను. అందువలన తెగించి ఏదియోవిధముగ నదిని దాటుటకై సిద్ధపడి కుటుంబసమేతముగ నీటిలో అడుగుపెట్టెను.

డబ్బుమూట నెత్తిన పెట్టుకొని పిల్లవానిని భుజముపై కూర్చుండబెట్టుకొని భార్యచేతిని పట్టుకొని అతడు మెల్లగా నదిలోనికి దిగెను. వరదలమూలకముగా పెరుగుచు వేగమున్న అధికము కాజొచ్చెను. నదిమధ్యభాగమున చిక్కుకొనిన ఆ యాత్రికునకు ముందుకు పోవుటకుగాని, వెనుకకు మరలుటకు గాని వీలులేకుండెను. ఆ సంకట పరిస్థితియందు యాత్రికుడు తనలో నిట్లు వితర్కించుకొనెను. "ఇపుడు జీవితమున అత్యంత ప్రమాదభరితమైన స్థితి యేర్పడినది. ప్రవాహవేగమున నేను, నా కుటుంబమువారు అందరును కొట్టుకొని పోయి మృత్యువుపాలగు భీషణ సమయమేతెంచినది. బ్రతుకునుగూర్చిన అవకాశము సన్నగిలినవి. ఏదియో విధముగ ఆవలియొడ్డుకు చేరవచ్చునను ధైర్యముతో నదిలో ప్రవేశించితినిగాని కొంతదూరమేగునప్పటికి దురదృష్టవశమున నీటివేగము, నీటిమట్టము పెరిగిపోయినవి. ఇపుడు కంఠమువరకు నేను నీటిలో మునిగియున్నాను. భుజములపై పిల్లవాడు కూర్చొని యుండుటవలనను, నెత్తిపై డబ్బుమూట యుండుటవలనను బరువు హెచ్చుగానున్నది. ఈ పరిస్థితిలో ఇటునటుకూడ కదలలేకున్నాను. కొంత బరువునాపై తగ్గించినచో ఇటునటు

కదలి ఏదియోవిధముగ ప్రాణరక్షణ చేసికొనుటకు వీలుండును పిల్లవాడు పోయినను, మరల ఇంకొక సంతానమును కన వచ్చును" అని యిట్లు తలంచి ఆ యాత్రికుడు స్వీయరక్షణార్థము తన కుమారుని నీటిలో వదలివైచెను. తక్షణము ప్రవాహవేగమున తనయుడు కొట్టుకొనిపోయెను.

కాని అంతకంతకు నీటివేగము ద్విగుణీకృతమగుచుండెను. అపుడు యాత్రికుడు మరల తనలో నిట్లు వితర్కించుకొనెను. "భార్యను చేతితో పట్టుకొనియుండుటవలన నన్ను నేను రక్షించుకొనజాలకున్నాను. భార్యపోయినను డబ్బుయుండిన చో ఇంకొక ఇల్లాలిని కట్టుకొని సంసారము నడుపవచ్చును." అని యోచించుకొని అతడు తన గృహిణిని నీటిలో వదలివైచెను. ప్రవాహవేగమున ఆమె కొట్టుకొని పోయెను. అప్పటికిని అతని పరిస్థితి కుదుటపడలేదు. నీటినుండి తప్పించుకొనుటకు నెత్తిపై నున్న డబ్బుమూట ఒక మహా ప్రతిబంధకముగ నుండెను. నెత్తిపైని భారముచే అతడు ఇటునిటు కదల లేకుండెను. అట్టి స్థితియందాతడు తన ప్రాణమును కాపాడుకొనుటకై డబ్బు మూటనుకూడ నీటియందు వదలివైచెను. అత్తరి ఇక భారమేమిలేనందుచే అతడు ఏదియో యొక ఉపాయముచే చేతులు కాళ్లు ఆడించుకొనుచు ఎట్టకేలకు ఒడ్డును చేరుకొని బ్రతుకు జీవుడాయనుచు వెడలిపోయెను.

ప్రపంచములోగల సమస్త పదార్థములకంటెను ఆత్మయే జనులకు అధిక ప్రీతికరమైనది. తనకొఱకే మానవుడు ఇతరులను ప్రేమించుచుండును. ఇతరులపై అతని కేమైన ప్రీతి యున్నచో అది తన నిమిత్తమే యని బృహదారణ్యకోపనిషత్తు చక్కగ వర్ణించి చెప్పినది.

**నీతి : ఆత్మయే అన్నిటికంటె మహాప్రియతమమైన వస్తువనియు, అద్దాని నిమిత్తమే ప్రపంచములోని తక్కిన వస్తువులు ప్రీతికరములుగ కనబడుచున్నవనియు గ్రహించి అట్టి ఆత్మనే సర్వులును అనుభూతమొనర్చుకొనవలెను**

# సుఖము బయటలేదు

ఒకానొక సాధువు తీర్థయాత్రవరాయణుడై నానాక్షేత్రములను దర్శించుచు, పుణ్యతీర్థములందు స్నానమొనర్చుచు పాదచారియై పోవుచుండెను. గ్రామములగుండ, నగరములగుండా చనుచు, తీర్థప్రదేశములందు మాత్రమొకటి రెండు రోజులు నిలచి స్నాన, దేవదర్శన,పూజాదికార్యములను నెరవేర్చుకొనుచు మరల తన ప్రయాణమును కొనసాగించు

నుండెను. ఒక మహాపట్టణముగుండా పోవుచుండెను. అచ్చట ఒక గొప్ప వ్యాపారి నివసించుచుండెను. అతడు శ్రీమంతుడు బ్రహ్మాండమైన సుందర భవనము అతనికి కలదు. సిరిసంపదల తోపాటు చక్కని శీలము, భగవద్భక్తి అతనియందు విరాజిల్లుచుండెను. అతడు సాధు సత్పురుషులయెడల ఎంతయో వినయ విధేయతలు గలిగి వారిని ఆదరించుచు, వారికి భిక్షాదికములను సమకూర్చుచునుండెను.

ఇట్లుండ ఒకనాడా ధనికునకు పైనదెల్పిన యాత్రికుడైన సాధువు పట్టణమున కనుపించెను. సాధువుయొక్క ముఖ వర్చస్సు, బ్రహ్మతేజము అ త ని నెంతయో ఆకర్షించెను వెంటనే ధనికుడు ఆసాధుమహాత్మునకు సాష్టాంగదండప్రణామ మాచరించి తన ఇంటికి భిక్షకై ఆహ్వానించి తీసికొనివెళ్లెను. మహాతపస్సంపన్నుడగు సాధువుండు తనగృహమున కేతెంచుటచే శ్రీమంతుని ఆనందమునకు మేరయే లేకుండెను. ఆ మహనీయుని సాక్షాత్ నారాయణమూర్తిగనే భావించి, వారి పాదరజముచే తన గృహము పావనమైనదని అతడు తలంచెను అట్టి పరమపవిత్రుని రాక మహా అదృష్టకరమైనదని యెంచి ధనికుడు ఆరోజు గొప్పవిందు చేసెను. రుచికరములగు ఫల హారములను వండించెను. మధురసభరితములగు పానీయములను ఏర్పాటుచేసెను. మహాస్వాదిష్టమగు పాయసమును వండించెను.

'అమృత సమానముగా నుండును' అని వ్రాయించి చేవ్రాలు పెట్టించెను. పిదపరి ఇరువురును వారి వారి విస్తరిముందు పెట్టబడిన గ్లాసులలోని పాయసమును త్రాగివైచిరి. అపుడు సాధువుగారు వడ్డించులాగుగ చేసి ఆ పాయసమునుకూడ త్రాగుడని యజమానిని బలవంతము చేసెను. సాధువుగారి ఆజ్ఞను పురస్కరించుకొని అతిథేయుడగు ఆ శ్రీమంతుడు పాయసమును త్రావ మొదలిడెను. కాని మొదటిలోటా త్రాగినంత వేగముగ త్రాగకుండెను. అది చూచి సాధువు గారు "ఏమండీ! నెమ్మదిగా త్రాగుచున్నారేమి! పాయస మెట్లున్నది?" అనిప్రశ్నింప, ఇంటి యజమాని పాయసవు రుచి కొంచెము తగ్గినది అని ప్రత్యుత్తరమిచ్చెను. తోడనే సాధువుగారు ఆ వాక్యమును కాగితముపై వ్రాయించి చేవ్రాలు పెట్టించెను. ఆ పిదప సాధువుగారు వంటవానితో చెప్పి అతానిగ్లాసునిండా మూడవసారి పాయసమును పోయించి దానినికూడ త్రాగులాగున యజమానిని ప్రోత్సహించెను ధనికుడు మూడవసారి ఆ పాయసమును త్రాగబోగా అది నోటిలోనికి ఎక్కకుండెను. అపుడు సాధువుగారు ఏమండీ! పాయసమెట్లున్నది! అని ప్రశ్నింప—విషమువలె తోచుచున్నది అని సమాధానము చెప్పెను. ఆ వాక్యమును సాధువు గారు కాగితముపై వ్రాయించి చేవ్రాలు పెట్టించెను.

భోజనానంతరము సాధువుగారు ఇంటియజమానితో
ఇష్టాగోష్ఠిగ ప్రసంగించుచు యజమానిగారూ! పాయసము
అమృతముతో సమానమని భోజనమునకు ముందు
గదా, మాకులోటాలు పాయసము త్రాగగనే పాయ
విషమని చెప్పితిరేమి? నిజముగా పాయసము అమృత
మైనచో ఎల్లకాలములందును అట్లే యుండవలెనుగదా!
ఉంతలేదు! కాబట్టి సుఖము బాహ్యవస్తువులలో
మానవుని భావనయే వస్తువులలో సుఖమును కల్పించు
చున్నది. వాస్తవసుఖము ఆత్మయందే కలదు. అది
మందును తరగదు. మారదు అది పరిపూర్ణమైనది
అట్టి అభ్యంతర ఆత్మసుఖము కొఱకే మానవుడు ప్రయ
చవలెనుగాని చంచల బాహ్యవిషయ సుఖముల కొఱకుగా
అని చక్కగ బోధించెను,

నీతి.—సుఖము బయట వస్తువులలో లేదు. ఆత్మ
యందే కలదు. జీవుడు బాహ్యవస్తువుల యెడల వైరా
గ్యముగలిగి ఆత్మసాక్షాత్కారమునకై యత్నించి ఆత్మ
యందే స్థితిగలిగి జీవితమును పరమానందమయముగా
కొనర్చుకొనవలెను.

# అంతశ్శుద్ధి

పూర్వము కబీర్దాసు అను మహాభక్తుడుండెడివాడు. అతడు మహమ్మదీయుడు. పూర్వజన్మపుణ్యసంస్కారము వలన అతనికి భగవంతునిపై మిక్కుటమగు భక్తియేర్పడెను. గురుముఖతః పొందినవిద్యయే చక్కగ ఫలించునని అతడు పెద్దలవలన విని గురువుకొఱకై అన్వేషణ ప్రారంభించెను. కాని యెచట వెతికినను తగిన గురువు లభించలేదు. సామాన్యగురువులు లభించవచ్చునుగాని సద్గురువులులభించుట దుర్లభముకదా! ఎట్టకేలకు ఒకానొక ఆశ్రమమునకు పోయి కొంతకాల మచట ఏకాంతముగ ధ్యానవిచారణాదులు గావింప నిశ్చయించి ఆశ్రమాధికారులకు తన నిశ్చయమును తెలుపగా వారు అతని జాతి వర్ణాదులనుగూర్చి ప్రశ్నించి తెలిసికొని ఆశ్రమములో నుండుటకు అవకాశము కలుగజేయలేదు. ఈ ప్రకారముగా రెండు మూడు ఆశ్రమములలో విచారించి తన జాతి నెపమును ఊతగా తీసికొని వారెవరును కబీర్దాసును తమ ఆశ్రమములలో చేర్చలేదు. తుదకు హతాశుడై లోకస్థితికి వగచుచు తరించుటకు మార్గమును ఎవరు చూపుదురా యని పరిపరివిధముల ఆలోచన చేయుచుండ రామానందులవారి ఆశ్రమమును గూర్చి ఎవరో తెలియజేసిరి. అచటికి వెళ్ళినచో జీవితాశయము నెరవేరగలదని వారు సలహా నిచ్చిరి.

మిత్రులు తెలిపిన సూచన ననుసరించి కబీర్దాస రామానందుల వారి యాశ్రమమునకు పయనమయ్యెను రామానందుల గొప్ప అనుష్టానపరులు, సదాచారసంపన్నులు విశాలహృదయులు కూడాను. "చరాచర ప్రాణికోట్లన్నిటి యందును మూలలయందు దారమువలె భగవానుడు వేయు చున్నాడు. ఒకరు గొప్ప ఒకరు తక్కువ అను భావము కేవలము అజ్ఞానజన్యమే యగునని ను భావము వారి మనం బున గాఢముగ రూఢిపడి యుండుటచే సర్వసమత్వము వారి యందు తొణికిసలాడుచుండెను. అయితే వారియొద్ద చేరిన శిష్యబృందము మాత్రము ఇంకను ప్రారంభదశయందే యుండెను వారి శిష్యులలో సంకుచితత్వము ఘనీభవించి యుండెను. జాతి మత కుల వర్ణాదులకే వారు ప్రాధాన్యత నొసంగుచుండు కాని హృదయపవిత్రతకు కాదు.

ఇట్లుండ కొంతకాలమునకు మిత్రుల సలహా ననుసరించి కబీర్దాసు రామానందులవారి యాశ్రమములో చేరు నిమిత్తము వారి యాశ్రమమునకు వెళ్ళి గురుదేవునకు సాష్టాంగదండ ప్రణామం బాచరించి తన గురుదేవునకు తన యభీష్టమును విన్నవించెను. "గురుదేవా! ఈ సంసార ఘోరారణ్యమున బడి దరిగానక తల్లడిల్లుచున్నాను. కరుణించి నాకు మార్గ మును జూపుడు. ఇప్పటికి ఎన్ని జన్మములో వ్యర్థముగా

గతించిపోయినది. మహోన్నతమై, సుకృతలభ్యమైనట్టి ఈ
పవిత్ర మానవజీవితమును గూడ అజ్ఞానమందే గడిపివేయుట
కు నాకు ఏ మాత్రము మనస్కరించుటలేదు. కాబట్టి గురు
దేవా! తరించుటకు మార్గమును జూపుడు. నన్ను మీ ఆశ్ర
మమునందు చేర్చుకొని ఆశ్రమసేవా భాగ్యమును, గురుసేవా
భాగ్యమును నాకు కలుగజేయుడు. మీ కృపాదృష్టిని నాపై
ప్రసరింపజేయుడు. నన్ను కడతేర్చుడు! పాహిమాం, పాహి
మాం, పాహి!' అని ఈ ప్రకారముగ నిండు భక్తితో గురు
దేవుని వేడుకొనెను.

గురుదేవుడు కరుణార్ద్రహృదయుడు. అతని మనంబున
కుంచితత్వమునకు స్థానము లేదు. అర్హుడైన శిష్యుడు
లభించినపుడు గురువునకు కలుగు ఆనందమునకు మేర
లేదు కదా! కబీర్దాసుయొక్క తీవ్ర జిజ్ఞాస, జ్ఞానోత్కంఠ,
తీవ్రముముక్షుత్వము గురుదేవునకు పరమానందమును గలి
గించినది. అట్టి ఉత్తమ భక్తునకు తన ఆశ్రమములో స్థాన
మును కల్పించుట తన విధ్యుక్తధర్మమని భావించి రామా
నందులు "నాయనా! అట్లే ఈ ఆశ్రమమునందు చేరి
ధ్యానాది అనుష్ఠానములను గావించుకొనుము" అని అనుమతిని
ఒసంగెను. గురుదేవుని ఆజ్ఞానుసారము కబీర్దాసు ఆశ్రమములో

చేరి గుర్వాజ్ఞను తు. చ. తప్పకుండ వినమ్రభావముతో పరిపాలించుచుండెను.

కొంతకాలమునకు రామానందుల శిష్యవర్గము కబీర్దాసు యొక్క జాత్యాదులను గూర్చి తెలిసికొని, అతడు మహాత్మ్మదీయుడని యెఱింగి వెంటనే గురుదేవునియొద్దకు పరుగెత్తుకొని "ప్రభూ! కొంప మునిగిపోయినది. ఈకొత్తగా వచ్చినవాని జాతి మత కులము లను మీరు విచారించలేదు. ఆలోచించకుండ ఆకస్మాత్తుగ చేర్చివైచిరి. ఈతడు మహమ్మదీయుడు. సరియే అయినదేమో అయినది. అతనికి పూజామందిరములో దైవకైంకర్యము, దైవసేవమాత్రము ఒప్ప జెప్పవద్దు. ఇతర పనులు—వంటపాత్రిలు తోము పని, ఆశ్రిమమును ఊడ్చు పని మొదలైనవి ఇవ్వవచ్చును." అని తెలిపిరి. గురుదేవుడు వారి అంతరంగమును చక్కగా గ్రిహించినవారై అసూయ యను ఘోరపిశాచముచే వారు గ్రస్తులై యుండుటను గమనించి శిష్యులు సూచించిన పనిని కొద్దిరోజులు అతనికి ఏర్పాటుచేసి చూచెదమని నిశ్చయించి కబీర్దాసునకు ఆశ్రమ వంటపాత్రిలు శుభ్రిపఱచు పనిని ఒప్పగించిరి. కబీర్దాసు "అహోభాగ్య" మని తలంచి ఆసేవాకార్యమును స్వీకరించి త్రికరణశుద్ధిగ దానిని నెరవేర్చుచుండెను. ఏదైన నవము దొరకినచో దానిని ఆధారముగా దీసికొని కబీర్దాసు ఆశ్రమము

నుండి తరిమివేయించుటకై శిష్యులు తగిన అవకాశము కొఱకు ఎదురు చూచుచుండిరి.

శిష్యుల కపట హృదయము కబీర్దాసునకు కొద్దిరోజుల లోనే బాగుగ అవగతమయ్యెను. వారందఱికి చక్కని గుణ పాఠమును బోధింప దలంచినవాడై ఒకనాడతడు వంటపాత్రల బయటిభాగమునుమాత్రము బాగుగ తోమి, లోని పాచిని అట్లే యుంచెను. అది గమనించి శిష్యులు చరచరపోయి గురుదేవున కావృత్తాంతమును తెలియజేయగా, గురుదేవుడు కబీర్దాసును పిలిచి "నాయనా! పాత్రలు లోపల ఎందులకు తోమలేదు?" అని ప్రశ్నింప అందులకు కబీర్దాసు మహాత్మా! తమ శిష్యుల స్వరూప మీవిధముగా నున్నదని తమకు చూపుటకొఱకై ఈ ఒక్కరోజు మాత్రము ఆ ప్రకారముగ చేసితిని". వారు స్నానాదులచే శరీరమును మాత్రము శుద్ధ పఱచుచున్నారేకాని, లోన అసూయ, ద్వేషము మొదలైన దుర్గుణములు తాండవించుచున్నవి. శరీర మను పాత్రయొక్క బయట తోమిరేకాని లోపల మనస్సులోని పాచి అట్లే యుండి పోయినది. ఈ సత్యమును తమ దృష్టికి తెచ్చుటకొఱకే నే నీ ప్రకారముగ చేసితిని." — అని వచించెను. ఆ వాక్యములను విని గురువు ఆనందించెను. శిష్యులు సిగ్గుతో తలవంచ కొనిరి.

**నీతి:** బాహ్యశౌచము, అభ్యంతరశౌచము — రెండును మనుజుడు కలిగియుండవలెను. స్నానాదులచే శరీరమును శుద్ధము చేయులాగున ధ్యానవిచారణాదులచే మనస్సునందున్న మురికిని—దుర్గుణములను, దుస్సంకల్పములను తొలగించివేయవలెను, అపుడే జీవుడు పరమశుద్ధుడై మోక్షభాగుడు కాగలడు.

## మతిలేని శిష్యుడు

ఒకానొక గ్రామమునకు అనతిదూరములో ఒక చక్కని ఆశ్రమము కలదు. అందు ఒక గురువు, పదిమంది శిష్యులు నివసించుచుండిరి. ఆశ్రమముచుట్టు సుందరమైన ఉద్యానవనము కలదు. అందు తులసిమొక్కలు, మారేడుమొక్కలు అచటచట నాటబడినవి. తులసిపత్రి, మారేడుపత్రి ప్రతిదినము పూజకు ఉపయోగించబడుచుండును. గురువుగారు వేదాంతవిచారణయందు అందె వేసిన చేయి. ఒక సిద్ధాంతమును ప్రతిపాదించుటయందుగాని, ఆ సిద్ధాంతమును వాదము ద్వారా తర్కవితర్కముద్వారా సమర్థించుటయందుగాని అతని కతడే

సాటి. ఆప్రకారణమున వేదాంతతత్త్వమును తెలిసికొన పభిలషించువారు ఆ గురువుగారికి తమ గ్రామమునకు ఆహ్వానించి ఒక వారము దినములుగాని, పది దినములుగాని వారి ముఖతః ఆధ్యాత్మిక తత్త్వమును శ్రవణము చేయుచుందురు.

బ్రహ్మవిద్యానిష్ఠాతు డగుటవలనను, అనుపమ వాగ్ధాటి కలవాడు కావునను ఆ గురువర్యునకు సమీప గ్రామముల నుండియు దూరస్థలములనుండియు ఆహ్వానములు అనేకము వచ్చుచుండెను. ఒకనాడు ఒకానొక గ్రామమునకు చెందిన జిజ్ఞాసువులు గురుబోధ నాలకింపదలదినవారై ఆ దేశికోత్తముని తమ గ్రామము నకు ఆహ్వానించిరి. గురుదేవు డందులకు అంగీకరించెను. రాత్రి భోజనాంతరము ఒక ఎద్దులబండిపై తన సామగ్రియంతయు నుంచుకొని ఒక శిష్యుని వెంటనిడు కొని గురువు గ్రామాంతరమునకు ప్రయాణమును సాగించెను కొంతదూరమేగుసరికి గురువునకు నిద్రరాగా శిష్యునితో నాయనా! నిద్రవచ్చుచున్నది. కొద్దిసేపు విశ్రమించెదను. నీవు మేలుకొనియుండి బండిలోని వస్తువులను జాగ్రతగ చూచుచుండుము. బండిఅదురుడుకు ఏవైనా వస్తువులు జారి పడునేమో గమనించుచుండుము అని పలికి బండిలోనే పరుం డెను. బండినెమ్మదిగా పోవుచుండెను గుర్వాజ్ఞను పురస్క రించుకొని శిష్యుడు గురువు చెంతనే బండిలో మేలకొనియే

చూస్తుండి వేయికండ్లతో నలువైపుల పరికించుచు సామగ్రిని బహుజాగ్రతగ గమనించుచుండెను.

ఇంతలో బండి అదురుకు గురువుగారి కమండలువు జారి క్రింద పడిపోయినది. శిష్యుడు దానిని చూచుచునే యుండెను. కాని ఎత్తలేదు. బండి తన గమనమును సాగించుచుండెను. గురువుగారు గాఢనిద్రలో నుండిరి. ఈవిధముగ దాదాపు అరగంటసేపు గడచిపోయెను. అత్తరి అకస్మాత్తుగ గురువుగారికి మెలకువ వచ్చెను. మేలుకొనగానే గురువు శిష్యునితో నిట్లు సంభాషించెను.

గురువు .. నాయనా! ఏదైనా వస్తువులు బండిలోనుండి జారి క్రింద పడినవా?

శిష్యుడు .. తమరి కమండలువు పడినది.

గురువు . దానిని తీసి బండిలో వేసినావా ?

శిష్యుడు .. వేయలేదు.

గురువు '.. ఎందులకు వేయలేదు ?

శిష్యుడు .. తమరు అప్రకారము ఆదేశించలేదు. "ఏదైనా వస్తువులు పడునేమో జాగ్రతగ చూస్తూఉండు" అనిమాత్రమే సెలవిచ్చినారు. తమ ఆజ్ఞానుసారము ఆ ప్రకారమే చూస్తూ ఉన్నాను.

గురువు :- ఓరి మందమతీ! వస్తువు క్రిందపడితే ఊరికే చూడటంకాదు. తీసి బండిలో వేయవలెను.

శిష్యుడు :- మహాప్రభో! ఇకమీదట అట్లే చేసెదను.

ఈ ప్రకారముగ శిష్యుని మందలించి గురువు మరల పరుండెను. బండి తన గమనమును కొనసాగించుచుండెను. శిష్యుడు గురుసావిరావ్యమున బండిలో కూరుచుండి గురువుగారి ఆదేశమును పదేపదే మననము చేయుచుండెను. ఏదైనా వస్తువు బండిలోనుండి క్రింద పడినచో దానినెత్తి బండిలో వేయవలయును అనునదియే గుర్వాదేశము. ఇట్లుండగా బండి లాగుచున్న ఎద్దులలో ఒక యెద్దు పేడ వేసెను. తోడనే శిష్యుడు బండిపైనుండి క్రిందకు దూకి ఆ పేడను బండిలో వేయదొడగెను. ఆ చప్పుడు విని గురువు నిద్రనుండి లేచి తనప్రక్కనే పేడయుండుటను గాంచి అట్లేల చేసితివని ప్రశ్నింప అంతేవాసి యిట్లు ప్రత్యుత్తర మొసంగెను.మహాత్మా నేను గుర్వాజ్ఞను ఇంతవరకెన్నడును ధిక్కరించియుండలేదు. ఇకమీదట ధిక్కరింపను. తమ వాక్యమే నాకు వేదవాక్యము తమరెట్లు శాసించుదురో అప్రకారమే ఆచరించువాడను నేను. బండిపైనుండి ఏది పడునో దానిని తీసి బండిలో వేయుమని తాము ఆదేశించి యుండిరి. ఆ ప్రకారమే చేసితిని. ఆ వాక్య

మును విని గురువు చికాకునొందినవాడై, శిష్యుని మందమతికి లోలోన చింతించుచు అతనితో "ఇకమీదట ఏదైనసామగ్రి పడినచో మాత్రమే తీయవలెనే కాని పేడ మొదలైనవి తీయ రాదు" అని చెప్పగా అందులకు శిష్యుడు ఏయే వస్తువులు పడినచో తీయవలెనో, ఏవేవి తీయకూడదో నిష్కర్షగా తెలుపుమని ప్రార్థింప గురువు ఆప్రకారముగ ఒకలిస్టు తయారు చేసి వానికిచ్చి పరుండెను శిష్యుడు ఆ లిస్టును కంఠస్థము చేయుచుండెను

ఇంతలో ఒక కాలువ అడ్డముగా వచ్చెను. కాలువలో నీరు బహువేగముగ ప్రవహించుచుండెను బండి కాలువను దాటుచుండగా మిట్టపల్లములవలన కలిగిన అదురుకు బండిలో పరుండియున్న గురువుగారు క్రిందికి జారి నీటిలో పడిపోయిరి. గురువుగారు నీటిలో కొట్టుకొని పోవుచుండగా శిష్యుడు లిస్టు చూడసాగెను. పడిపోయిన గురువుగారిని తీయవలెనా, లేదా! లిస్టులో ఏమి వ్రాసియున్నది? గురువుగారి ఆజ్ఞ యెట్లున్నది? లిస్టులో గురువుగారి విషయమై ఏమియు తెలుపబడియుండలేదు కాబట్టి శిష్యుడు తటస్థముగా నుండిపోయెను. కొట్టుకొని పోవుచున్న గురువు ఎట్టకేలకు ఒడ్డునుచేరి శిష్యుని అవివేకమునకు లోలోన నగుచు బండియొద్దకు వచ్చి శిష్యుని తీవ్రముగ

మందలించి,ఏకార్యమంతైనను గుడ్డిగా ప్రవర్తింపవలదనియు ఒకింత వివేకమును కూడ జోడించి కార్యములను సాధింప వలెననియు బోధించెను.

నీతి : గురుబోధను శిష్యుడు వివేకముతో గూడి చక్కగ చింతన జేయవలెను. గురువుయొక్క హృదయమును శిష్యుడు బాగుగ గ్రహింపవలయును. బోధయొక్క అంతరార్థమును యోచింగినవాడై శిష్యుడు వివేకముతో దానినిగూర్చి లెస్సగ యోచించిన తదుపరి కార్యమున కుపక్రమింపవలయును.

# అమనస్కము

ఒక పట్టణములో ఒకానొక పండితుడు నివసించు చుండెను. అతడనేక గ్రంథములను రచించి సాహిత్య క్షేత్ర మున గొప్ప విఖ్యాతిని బడసెను. అతని కవిత్వధోరణి, గ్రంథరచనా నైపుణ్యము, వాక్చమత్కృతి, మొదలైనవానిని జూచి జనులు ముగ్ధులగుచుండిరి. సరస్వతీకటాక్షము అతనికి సంపూర్ణముగ కలదనియు, పూర్వజన్మలో సాహిత్యసేవ మిక్కుటముగ చేసియుండినవాడు కావుననే ఈజన్మలో ఇంత

చక్కని పాండిత్యమును బడయగల్గెననియు ప్రజలు చెప్పుకొనుచుండువారు. ప్రతిదినము ఆ పండితుని గృహమునకు ఎందఱో సాహితీపరులు, ఎందఱో కవిపుంగవులు, ఎందఱో కళాకారులు వచ్చుచు పోవుచు, అతని అమూల్య సలహాలను గైకొనుచు నుందురు.

ఒకనాడాతని గృహమునకు అతని ఆప్తమిత్రుడొకడు సందర్శనమునకై విచ్చేసెను. బహుకాలమునకు వచ్చిన ఆ స్నేహితుని చూచి పండితుడు పరమానందభరితుడై, అల్పాహారమును సేవింపజేసి సముచితాసనముపై కూర్చుండబెట్టెను. ఇరువురును ఒక టేబిల్‌కు ఇరువైపుల ఆసీనులై ఇష్టాగోష్ఠి సలుపుచుండిరి. సాహిత్యరంగమునకు చెందిన పెక్కు అంశములపై వారి సంభాషణము నడచుచుండెను. ఇంతలో ఆ స్నేహితుని దృష్టి టేబుల్‌పైనున్న ఒకానొక గ్రంథముపై ప్రసరింప అతడు వెంటనే దానిని దగ్గఱకు తీసికొని అందలి పుటములను ఇటునటు త్రిప్పుచు ఒకటిరెండు వాక్యములను అచటచట పఠించెను. వెంటనే ఆశ్చర్యచకితుడై దానిని గూర్చి పండితునితో నిట్లు సంభాషించెను—

మిత్రుడు—ఏమండీ పండితులవారూ! ఎంతటి అమోఘమైన పుస్తకమును వ్రాసినారండీ! ఇందలి విషయములు అత్యంత మనోరంజకముగను, ఆహ్లాదకరముగను నున్నవి

చదువువారల హృదయములను ఆనందడోలికలలో నూగు
నట్లు మీరు రచించినారు. ఈ పుస్తకమును ఎప్పుడు వ్రాసి
నారు? వ్రాసినట్లుగాని, ప్రకటించినట్లుగాని నాకు ఇంత
వఱకు తెలియనే తెలియదే. ఆహా! అద్దాని రచనచే
మీరు మానవాళికి మహోపకృతి నొనర్చినవారైనారు.
శీలమునుగూర్చి ఎంత చక్కని విషయములను దానిలో
పొందుపఱచినారు! ఆహా! ఇట్టి గ్రంథరాజములు
లోకములో ఏ కొద్దియున్నప్పటికిని ప్రజలలో గొప్ప
నైతిక పరిణామము కలుగగలదు. పండితులవారూ!
అమూల్యమగు ఈ గ్రంథమును మీరెప్పుడు వ్రాసినారండీ!

పండితుడు— ఆఁ, నా గొప్పతన మేమున్నది దీనిలో! ఈ
గ్రంథమును వ్రాయుటలో నా భార్య నాకు చాల
సహాయము చేసినది

మిత్రుడు — ఓహో! మీ ధర్మపత్నిగారు కూడ విద్వాంసు
రాలా! కవయిత్రా! ఈ సంగతి నాకింతవఱకు తెలియదే!
భేష్! చక్కని దాంపత్య మేర్పడినది. భార్యాభర్త
లిరువురును సరస్వతీ కటాక్షమును బడసినవారై
యుండుట చాల గొప్ప విషయము! మీరు చాల
అదృష్టవంతులు!

ఈ ప్రకారముగా పండితుని స్తుతించి మిత్రుడు వెడలి పోయెను. వారిరువురి సంభాషణము నంతయు తలుపుచాటు నుండి వినుచున్న పండితుని భార్య, మిత్రుడు వెడలిపోయిన వెంటనే లోపలినుండి వచ్చి భర్తతో నిట్లు పలికెను—

భార్య—ఏమండీ! ఎంత పచ్చి అబద్ధము మీరు మాట్లాడినారు! ఆ వచ్చిన పెద్దమనిషితో "ఈపుస్తకమును వ్రాయుటలో నాభార్య చాల సహాయము చేసినది అని మీరు చెప్పినారే! అసలీ పుస్తకమును వ్రాయుటలో నేనేమైనా, కొంచమైనా సహాయము చేసినానా? రామ రామ! అసలు నిజంచెప్పాలంటే మీరీ పుస్తకమును వ్రాయునప్పుడు నేనీ యూరిలోలేను. పుట్టింటికి వెళ్ళినాను. మఱి నేనుచేసిన సహాయ మేమున్నది?

పండితుడు—నీవు పుట్టింటికి వెళ్ళుటయే నీవు నాకు చేసిన సహాయము. నీవు గనుక ఇక్కడే ఉన్నట్లయితే నేను పుస్తకం వ్రాయునపుడు మధ్యమధ్యవచ్చి నాతో మాట్లాడుచు నాకు అవరోధము కల్పించుచు నుండెడిదానవు. కాబట్టి ఆ సమయమున నీవు లేకపోవుటయే నీవు నాకు చేసిన మహోపకారము!

భర్తయొక్క హేతుపూర్వక వచనములను విని భార్య సిగ్గుపడి ఊరకుండెను. కథయందు గ్రంథరచనా సమయమున భార్య దగ్గఱ లేకుండుట పండితునకు ఎట్లు సహాయముగ నుండెనో అట్లే ధ్యానకాలమున మనస్సునందు ఏ సంకల్పములు లేకయుండినచో సాధకునకు పరమశాంతి కలుగుచుండును సంకల్పమే అశాంతికి హేతువు. నిస్సంకల్ప స్థితియే శాంతికి మూలము. మనస్సుయొక్క ఉనికియే దుఃఖమునకు కారణము మనస్సుయొక్క లేమియే పరమానందమునకు హేతువు. అట్టి మనోరాహిత్యమే, అట్టి అమనస్క స్థితియే జీవుని ఏకైక లక్ష్యము. ఎపుడు మనస్సు తొలగిపోవునో, అపుడు ఆత్మ మాత్రము శేషించును. అదియే మోక్షస్థితి.

**నీతి : మనస్సుయొక్క ఉనికియే జీవుని దుఃఖమునకు కారణము. మనస్సుయొక్క లేమియే పరమానందమునకు హేతువు. సంకల్పమే మనస్సుయొక్క స్వరూపము కాబట్టి సాధకుడు ప్రప్రథమమున శుద్ధ సంకల్పముల నాశ్రయించి ఆ పిమ్మట నిస్సంకల్పస్థితికై, అమనస్కమునకై యత్నించవలయును.**

—0—

# లోకస్వభావము

ఆదికోట మహాపట్టణము. భోగభాగ్యములకు నిలయము. ఎక్కడ చూచినను లలితకళామందిరములు, నృత్యశాలలు, గొప్ప గొప్ప ప్రదర్శనలిచ్చు తావులు, విరివిగ కన్పట్టుచుండును. సాయంసమయమున విరామము చూచుకొని ఆ పట్టణ ప్రజలు తండోపతండములుగ ఆ యా ప్రదర్శనలకు పోవుచుందురు. ఒకనాడు ఉదయము నిద్రలేచి ఆ పట్టణవాసులు వీధిలోనికి రాగానే పెద్దపెద్ద కాగితములు ఇండ్లగోడలపై అతికించియుండుటను గమనించిరి ఆ కాగితములపై ఈ క్రింది విధముగ ప్రకటింపబడి యుండెను. — "అపూర్వమైన పందికూత. ఈ రోజు సాయంత్రము గం. 6 లకు టౌనుహాలు ఆవరణలో గొప్పప్రదర్శనము గావింపబడును. పంది ఏ విధముగ అరచునో సరిగా ఆదేవిధముగా మనుష్యుడు అరచి చూపగలడు. ఇట్టి వింత ఇంతవఱకు చరిత్రలోనే జరిగియుండలేదు. ఆశ్చర్యకరమైన ఈ సంఘటనను తిలకించుటకు పట్టణవాసులందఱును రాగోరెదము. ఈ అపూర్వ అవకాశమును జారవిడుచుకొనరాదు. కాబట్టి ప్రతి వ్యక్తియు టిక్కెట్టుకొని టౌనుహాలులో నేడు జరుగబోవు ఆశ్చర్యకర ప్రదర్శనమును కనులపండువగ వీక్షించి, పందికూతను వీనుల విందుగ విని ఆనందపరవశులు కండు!."

ఈ ప్రకటనను చదువుకొనగనే పురవాసులు పరమానందభరితులై ఎప్పుడెప్పుడు సాయంత్రమగునా, ఎప్పుడు ఆ వింతను గాంచెదమా అని ఉవ్విళ్లూరుచుండిరి. సాయంత్రము కాగానే ఎక్కడెక్కడి జనమంతయు నాటకశాలయొద్దకు చేరిరి. శాల పురజనులచే క్రిక్కిరిసిపోయెను. సూదిమోపునంత స్థలమైనను ఖాళీగాలేదు ప్రజల ఉత్సాహమునకు అంతులేకుండెను. సరిగా 6 గంటలగుసరికి బాగుగ అలంకరించుకొనిన ఒక దీర్ఘకాయుడు రంగస్థలముపైకి వచ్చి కేవలము పందివలె అరచెను. ఆ కూతను వినగనే శ్రోతలు దిగ్భ్రాంతి చెందిరి ఏల యనగా అతడు సాక్షాత్తు పంది వలెనే శబ్దము చేసెను. నిజముగా పందివచ్చి అరచినట్లుగానే యుండెను. ఏమాత్రము భేదము లేకుండెను. ఆ ప్రదర్శనము నవలోకించి పురజనులు సంతుష్టాంతరంగులై వారి వారి గృహములకు వెడలిపోయిరి.

మఱునటిరోజు ఉదయము గోడలపై వేరొక ప్రకటనను జనులు వీక్షించిరి. ఆ ప్రకటన ఈ ప్రకారముగ నుండెను. "ఓ జనులారా! ఈ దినము సాయంత్రము 6 గంటలకు నాటకశాలలో మహా అద్భుతమగు ప్రదర్శనము గావింపబడగలదు. నిన్నటి దినము మీరు చూచిన దృశ్యముకంటె ఎన్నిరెట్లో అధిక ఆశ్చర్యమును సంభ్రమమునుగొల్పు దృశ్యమును ఈ దినము మీరవలోకించగలరు. టిక్కెట్టు పొందనక్కరలేదు. రుసుము లేదు; ఉచితముగ మీరందరు తప్పక వచ్చి చూచి విని, ఆనందించ గలరు."

ఈ ప్రకటనను చదువుకొని పురప్రజలు ఏమి వింత జరుగునోయని ఉత్సుకత కలవారై తప్పక చూడవలెనని నిశ్చయించుకొనిరి.

సాయంత్రము 6 గంటలు కాగానే మరల సానుపాలు ప్రజలచే కిటకిటలాడిపోయెను. పట్టణములోని ఆ బాలగోపాలము అదటికివచ్చి చేరెను. కిందటి దినము చూచినదానికంటె ఇంకను గొప్ప అద్భుతము ప్రదర్శింపబడగలదని ప్రకటింపబడుట వలన జనులు ఉత్సాహమునకు పట్టపగ్గములు లేకుండెను సరిగా 6 గంటలకు ఆజానుబాహుడగు ఒక వ్యక్తి చక్కగా అలంకరించుకొని వేదికపైకి వచ్చెను. అతని చేతులలో ఒక పందిపిల్ల ఉండెను. అతడు దాని పీక నొక్కగా అది బిగ్గరగా అరచెను. వెంటనే యతడు శ్రోతల నుద్దేశించి యిట్లు పలికెను—"ఓ ప్రజలారా! నిన్నటి దినము మీరు పందికూతను పోలినట్టి శబ్దమును వినియున్నారు. ఈ దినము సాక్షాత్ పందికూతనే విన్నారు. నిన్నటిది నకిలీశబ్దము. ఈ దినముది అసలు శబ్దము. ఏది గొప్పదో, ఏది ప్రధానమైనదో, ఏది విలువైనదో మీరే ఆలోచించుకొనుడు" ఆ వాక్యములను వినియూ జరిగినదంతయు అలకించియు జనులు అసంతుష్టులై తమతమ ఇండ్లకు వెడలిపోయిరి. "అబ్బే! ఇది మామూలు పందికూత! దీనిలో ఏమి ఆశ్చర్యమున్నది!" అని గొణుగుకొనుచు అసంతృప్తులై వారు తమ నెలవులకు చేరిరి.

నీతి :- ప్రపంచముయొక్క స్వభావమే యిది. లోకులు అసలు దానికి విలువ ఇవ్వరు. కల్పితమైనదానికే విలువ నిచ్చెదరు. బింబమునకు విలువ ఇవ్వరు. ప్రతిబింబమునకే విలువ నిచ్చెదరు. ఆత్మకు ప్రాధాన్యత ఇవ్వరు. అనాత్మరూపమగు దృశ్యమునే గొప్పగా చూచెదరు. అట్లు చేయుట సరికాదు. విజ్ఞులగువారు బింబమునకే ప్రాధాన్యత నొసంగెదరు గాని, ప్రతిబింబమునకు కాదు. ఆత్మకే విలువ నిచ్చెదరుగాని, అనాత్మకు కాదు. కాబట్టి శాశ్వతమగు ఆత్మనే ఆశ్రయించవలెనుగాని క్షణభంగురమగు దృశ్యపదార్థమును గాదు.

# జితేంద్రియ వంశము

ఒకానొక పట్టణమునకు బహుదూరమునగల వనప్రదేశమందు ఒక తపస్వి ఒక చక్కటికుటీరమును నిర్మించుకొని ధ్యానాది కార్యములను ఒనర్చుకొనుచుండెను. ఆ కుటీరము చుట్టును తులసి మొక్కలు,మారేడుచెట్లు,ఇతర ఫలవృక్షములు విరివిగ నుండుటచే ఆప్రదేశమంతయు పవిత్రముగను శోభా

యమానముగను ఒప్పారుచుండెను. ఏకాంతస్థలమగుట వలనను విక్షేపజనకములైన పరిస్థితులెవ్వియు లేకుండుటచేతను ఆ తపస్వి తన ధ్యానానుష్ఠానమును నిరాటంకముగ కొనసాగించుకొనుచు, పరమార్థ వాతావరణమునందు ఆనందముగ జీవితమును కొనసాగించుచుండెను.

ఇట్లుండ ఒకనాడు మిట్టమధ్యాహ్నము ఒక రాజకుమారుడు ఆయరణ్యములో సంచారము సల్పుచు దప్పికగొని నీరుత్రాపుటకై ఆతపస్వియొక్క కుటీరమునకు వచ్చెను. దాహముతో అలమటించుచున్న ఆరాజకుమారునకు తపస్వి శీతలోదకము నొసంగి ఉపశాంతిని కలుగజేసెను. అనంతరము రాజకుమారునితో ఆతపస్వి "మీరెవరు? ఎచటినుండి వచ్చుచున్నారు?" అని ప్రశ్నింప అతడిట్లు ప్రత్యుత్తర మొసంగెను. "మహాత్మా! నేనొక రాజకుమారుడను. మా తండ్రి ఈ సమీపప్రాంతమున కంతటికిని మహారాజు. మాది జితేంద్రియ వంశము. నా పేరు జితేంద్రియకుమార్. మా తండ్రి పేరు జితేంద్రియ మహారాజ్. మాతల్లి పేరు జితేంద్రియరాణి. నా ధర్మపత్ని పేరు జితేంద్రియ దేవి!

రాజకుమారుని ఆ వాక్యములను వినగనే తపస్వికి ఆశ్చర్యము గలిగి, వారి వంశీయులు వాస్తవముగ జితేంద్రియులా లేక నేటికాలపువలె పేరుమాత్రము గొప్ప గా

అట్లు చెప్పకొనుచున్నారా పరీక్షింపవలెనని ఉద్దేశముతో రాజ
కుమారుని తన కుటీరమందే కొంత తడవు ఉండులాగునచెప్పి
తాను హుటాహుటిగ రాజప్రాసాదమునకు పయనమైపోయెను.
తదుపరి రాజును సమీపించి అతనితో నిట్లనెను — "ఓ భూసు
రోత్తమా! నీకు ఒక్కడే కొమారుడు. అతడు ఘోరారణ్య
ములో సంచరించుచున్నాడు. ఒకవేళ హింస జంతువులచే
అతనికేదైన ప్రమాదము వాటిల్లి అకస్మాత్తుగ దేహావియోగ
మైనచో మీరేమి చేయుదురు?" అవాక్యములను విని నృపాలుడు
ఏమాత్రము వేదన పడక తన్వనితో గంభీరముగ నిట్లు పలి
కెను— 'ఓ తాపసోత్తమా! విధివిలాసమును ఎవరు తప్పించ
గలరు? పుట్టిన వస్తువునకు చావు తప్పదు. జన్మించినవానిగ
మృత్యువు జీవుని వెంబడించుచునేయుండును. ఈనాడో, రేపో
లేక కొన్నివత్సరములకో ఏనాడైనను పుట్టిన ప్రాణి చావక
మానదు.

మృత్యుర్జన్మవతాం వీర దేహేన సహజాయతే
అద్యవాబ్దశతాన్తేషు మృత్యుర్వై ప్రాణినాం ధ్రువమ్

జన్మించువారికి మృత్యువు తానువెంటనేయుండును ఎప్పటికైన
ను జీవునకు మరణము ఖాయము. ఇందు దిగులుపొందవలసిన
దేమియును లేదు. బ్రతికిన నాలుగురోజులు భగవంతుని
స్మరించుచు పుణ్యము నార్జించుటయే జీవుని కర్తవ్యము!

భూపాలుని యీ విజ్ఞాపనాపూర్వక వచనములను విని తాపసుడు లోలోన సంతసించి, రాణియొద్దకు వెళ్లి "అమ్మా! నీ భర్త దుష్ప్రమాదవశాత్తు ఎప్పుడైన మరణించినచో ఏమి చేయుదువు?", అని ప్రశ్నింప ఆమె జంకుగొంకులేకుండ ఈ ప్రకారము పలికెను—

జాతస్య హి ధ్రువో మృత్యుర్ధ్రువం జన్మమృతస్య చ
తస్మాదపరిహార్యేఽర్థే నత్వం శోచితుమర్హసి.

మహాత్మా! పుట్టినవాని చావక మానదు. చచ్చినవాని కర్మశేషమున్నంతవరకు పుట్టక మానదు. ఇక శోకించుట దేనికి? బ్రతికియున్న నాలుగురోజులు రామా, కృష్ణాయని భగవన్నామస్మరణ చేయుచు పుణ్యమును సంపాదించుకొనుటయే మానవుని కర్తవ్యము!

రాణియొక్క మహత్త్వపూర్ణములగు యాథార్థ్యక వచనములనువిని తపస్వి ఆనందభరితుడై రాజకుమారుని సతీమణి యొద్దకువెళ్లి "అమ్మా! నీపతి అరణ్యప్రాంతములందు ఏకాకిగ సంచరించు చున్నాడు. ప్రమాదవశాత్తు అతనికి దేహావియోగమైనచో ఏమి చేతువు?" అని ప్రశ్నింప, ఆమె గంభీరముగ నిట్లు ప్రత్యుత్తరమిచ్చెను. — మహాశయా! తమకు తెలియనిదేమున్నది? ఈ ప్రపంచమున కీటకాది బ్రహ్మ

పర్యటితముగల సమస్తము ఒకానొక మహత్తరశక్తి లో బడియే పని చేయుచున్నది. విధిని ఎవరు తప్పించగలదురు? బంధువులు, మిత్రులు కుటుంబీకులు ధర్మసత్రమునందు యాత్రికులు కలిసికొని మరల విడిపోవునట్లు కొలదికాలము ఒకచోట కలిసికొని మరల ఎవరిదారినవారు పోవుచుందురు.

ఏకవృక్ష సమారూఢా నానా జాతివిహంగమాః
ప్రభాతే విదిశోయాన్తి కా తత్రపరిదేవనా.

సాయంకాలమున ఒక చెట్టుపై రకరకముల పక్షులన్నియు గుమి గూడి మరల తెల్లవారగనే ఎచటికో ఎగిరిపోవు చందమున ఋణాను బంధముచే జీవులున్న ఒక కుటుంబమున కలసికొని మరల ఎవరికివారు వేరైపోవుచుందురు. ఇది ప్రకృతి ధర్మము. జగన్నియమము. ఇటశోకింపనేల?"

రాజకుమారుని సహధర్మచారిణియొక్క యావిజ్ఞతా పూర్వక వాక్యములను విని తపస్వి లోలోన పరమానంద పడుచు తిరిగి తన కుటీరముయొద్దకు వెళ్లి తనకొఱకై అచట వేచియున్న రాజకుమారునితో "నాయనా! మీరాజ్యముపై శత్రువు లెవ్వడైనదండెత్తివచ్చి రాజవంశమునంతను చిత్తుగ నాశనమొనర్చివైచినచో నీవేమిచేయుదువు?" అని ప్రశ్నింప, అరిదేమాత్రము కినుకవహింపక ధైర్యపూర్వకముగ నిట్లు పలి కెను—"తాపసోత్తమా! ఈ ప్రపంచమున ఏది శాశ్వతము?

ఇంతవఱ కెందఱు రాజులు రాలేదు! పోలేదు! వారందరును ఏమైరి! ఎవరైన స్థిరముగ నుండగలిగిరా! కాలప్రవాహమున బడి ఎందఱో ప్రాణులు అహర్నిశము కొట్టుకొని పోవు చున్నారు. నదీప్రవాహమున కొన్ని కట్టెపుల్లలు ఒకచోట కలిసికొని మరల తరంగములతాకిడికి చేతైపోవునట్లు ఒక కుటుంబమునగాని, ఒక వంశమునగాని కొందఱు జీవులు కలిసికొని కొంతకాలము వ్యవహారము సలిపిమరల మృత్యుముఖమునపడి ఎవరిదారినవారు పోవుచున్నారు.

ఇదంకాష్ఠ మిదంకాష్ఠం నద్యాం వహతి సంగతః
సంయోగాచ్ఛ వియోగాచ్ఛ కా తత్ర పరిదేవనా.

కాబట్టి వియోగమందు దుఃఖపడనేల! బ్రతికిన కొద్దిరోజులు జగత్ప్రభువగు పరమాత్మను సేవించి, ధ్యానించి, పవిత్ర జీవితమును గడపుటయే జీవులకు శరణ్యము.'

రాజకుమారుని యీ గంభీరార్థబోధకములగు వాక్యములను విని తపస్వి ఆనందడోలికలలో నూగులాడుచు జితేంద్రియ వంశమును పేరునకు తగినట్లుగనే కుటుంబసభ్యులందరును గొప్ప ఆధ్యాత్మికాను భూతి కలిగియున్నారని సంతసించి రాజకుమారుని ఆశీర్వదించి వంపివై చెను.

నీతి. — మానవుడు జితేంద్రియుడై, మనస్సును తనస్వాధీనములో నుంచుకొని, కష్టసుఖములందు సమభావము కలవాడై, పరమాత్మ యందు అచంచలమైన విశ్వాసము కలిగి క్షణికములగు దృశ్యవస్తువులకై పాకులాడక, దేహాదు లందు బంధ్వాదులందు అభిమానమును వదలి, ధైర్యముతో జీవితలక్ష్యమగు ఆత్మసాక్షాత్కారమునకై తీవ్రతరయత్నము సలుపుచు ఈ జీవితమందే అద్దానినిగాంచి కృతకృత్యుడు కావలయును.

# దృశ్యపదార్థములు అశాశ్వతములు

పూర్వమొకప్పుడు ఒకానొక మహారాజునకు ప్రపంచములో నంతవరకు కనివిని ఎరుగనట్టి అద్భుతమగు భవనమొకదానిని నిర్మింపజేయు సంకల్పముదయించెను. లోకాధీశుడు గనుక డబ్బునకేమి కొదవ? కావలసిన ధనమును వెచ్చించి గొప్ప గొప్ప శిల్పులను రప్పించి కొన్ని సంవత్సరములు తదేక దీక్షతో పనిచేయించి తుట్టతుదకు అతి సుందరమైన రాజభవనమును తయారుచేయించెను. చూచినవారికి కండ్లు మిరిమిట్లు గొల్పుచుండెను. విశాలమైనగదులు, ధగధగ మెరయుచున్న రత్నకాంతులు, గోపురములు అందమును చిందుచున్న దీప ప్రభలు, వెయ్యేల దేవేంద్రుని వైభవమును గూడ తిరస్క-

రించుచున్నదా యనునట్లుండెను, ఆ భవ్యప్రాసాదము నిర్మాణము పూర్తిఅయినపిదప సాంప్రదాయప్రకారము ఒక సుదినమున గృహప్రవేశ మేర్పాటుకాబడెను. ఆ సుముహూర్తమునకు వేలకొలది బ్రాహ్మణోత్తములు, రాజప్రముఖులు, వణిక్ఛ్రేష్టులు, ఇంజనీర్లు, శిల్పులు, ఆహ్వానింపబడిరి. గృహప్రవేశముహూర్త మేతెంచెను. భవనమందలి మధ్యభాగమంతయు ఆహూతులచే కిటకిటలాడుచుండెను. విఘ్నేశ్వర పూజ, నవగ్రహారాధన, హోమము, అర్చన పూర్తిఅయినది అపుడా సభామధ్యమున మహారాజు లేచి నిలబడి సభ్యులందరిని సంభోధించి యిట్లు పల్కెను."ఓ పుణ్యాత్ములారా! ఈ గొప్ప భవనమును ఎంతయో ధనము వెచ్చించి, శ్రమచేసి నిర్మించినాను. మీలో గొప్ప గొప్ప శిల్పులు, వాస్తుశాస్త్రవేత్తలు భవననిర్మాణ కుశలురు కలరని నాకు తెలియును. కాబట్టి అట్టి వారందరున్ను బాగుగ యోచించి ఈ భవనమునం దేవైన లోపములుగానిదోషములుగాని యున్నచో ఇప్పుడే తెల్పుడు తెలిపిన సవరించివేసెదను. ఏలనవగా ఈ ప్రాసాదమును సర్వాంగసుందరముగ నొనర్పవలెనని నా సంకల్పము. కావున దోషములున్నచో ఎవరైన లేచి ఈసుముహూర్తముననే వానిని తెలుప ప్రార్థన" రాజుయొక్క ఆ వాక్యములను విని సభ్యులు ఆశ్చర్యచకితులైరి. అందములు చిందుచున్న ఆ కట్టడ

మొచట దోషమొచట! అయినను ఆభూపాలునిమాట తీసివేయ లేక ప్రముఖ శిల్పులు, ఇంజనీర్లు మరియొక పర్యాయము భవనమంతయు తిరిగి జూచి సభాస్థానమునకు విచ్చేసి ఏకకంఠముతో "రాజా! ఈ కట్టడమునందు దోష మేమాత్రమున్న లేదు. ముమ్మాటికిని లేదు" అని వచించిరి. రాజు చాల సంతసించెను సభయంతయు స్తబ్ధముగ నిశ్చలముగనుండెను. ఇంతలో ఒకమూలనుండి ఒక సాధువుగారు లేచి నిలబడి అయ్యా! మహారాజుగారూ! ఈ భవనమునందు రెండు దోషములు గలవు. అని గంభీరముగ నుడివెను వెంటనే రాజుగారు 'మహాత్మా! దయచేసి వానిని తెలుపవేడదను" అని కోరగా సాధువుంగవుడు ఓ మహారాజా! ఈ భవనము కట్టించినవాడు ఎప్పటికైనను చనిపోవును. ఇది మొదటిదోషము. ఈ భవనము కాలగర్భమున ఎప్పటికైనను శిథిలమైపోవును. ఇది రెండవదోషము, అని తెగవేసిచెప్పెను. ఆ వాక్యములను వినగనే రాజునకు కనువిప్పు కలిగెను. వైరాగ్యముదయించెను. అయ్యో! మృత్యువును మఱచి ప్రాపంచికమైభవములనే సత్యమని నమ్మి పంచభూతాత్మకములేయగు ఈ జడపదార్థములను ఈభవనములను, బంధుజాలమును, భృత్యులను గొప్పగ దలంచుచు ఎంత అజ్ఞానమున నుంటిని, అని తలపోయుచు గృహాపరివేళ కరితువు న ట్లోనరవేర్చి ఏకాంత ప్రదేశ

మాశ్రయించి శేషించిన జీవితమును భగవద్ధ్యానమునందు గడిపి వేసెను.

నీతి:- "ప్రపంచమున ఏ పదార్థమున్ను శాశ్వతముకాదు, దైవమొకటియే శాశ్వతము" అని నమ్మి దృశ్యవస్తువులం దాసక్తిని వదలి దైవ ధ్యాన పరాయణుడై యుండవలెను.

# వివేకోదయము

పూర్వ మొకానొక పట్టణమున ఒక మహారాజు నివసించుచుండెను. అతనికి అహంకారము మెండు. తన్ను మించినవారెవరు లేరను దర్ప మతనిని పట్టి పీడించుచుండెను. తనవలననే లోకమున అందరికిని గొల్లవారుచున్నదను భావము అతడు గలిగియుండెను. తాను భూమండలమునని, అందరికంటె గొప్పవాడనని, పలువురితో బింకపు లు పలుకుచుండును. తన సంపదలు, తన భోగభాగ్యములు, తన రాజప్రాసాదములు, తన ఉద్యానవనములు,తన విలాసము లు చూచుకొని ఆ రాజు గర్వోన్నతిని బొందుచుండెను.

ఇట్లుండ ఒకనాడాతని దేశమునకు ఒక సాధుపుంగవు
డరుదెంచెను. అతడు అనుష్ఠానపరుడు, సత్యనిష్ఠుడు, దైవ
భక్తిపరాయణుడు అయియుండెను. అతడు ఇహపరవిద్యల
రెండిటియందును గొప్ప నిష్ణాతుడు. మంచి వాగ్ధాటికలవాడు
తాను నేర్చిన బ్రహ్మవిద్యను ఇతరులకు చక్కగా చెప్పగల
స్తోమతగలవాడు. ఏ విద్యయందతడు పరిపూర్ణ అనుభూతిని
బడసెనో అట్టి అధ్యాత్మవిద్యను లోకములో బాగుగ ప్రచార
మొనర్చి అంధకారబంధురమైన అజ్ఞానవాతావరణ మందు
నివసించుచున్న జనావళికిజ్ఞానప్రకాశ మొసంగి కడతేర్చవలె
నను సదుద్దేశ్యముతో అతడు ఊరూర సంచరించుచు ఉపన్యా
సముల నిచ్చుచు, ధర్మబోధను వర్షించుచుండెను.అతని పవిత్ర
జీవితమును, నిరాడంబర వ్యక్తిత్వమును, అనర్గళ వాగ్ధోరణిని,
అనుష్ఠాన పద్ధతులను చూచి జనులు అతని దివ్యవాణిని శ్రవ
ణము చేయుటకై తండోప తండములుగ ఏతెంచుచుండిరి.
అతడు ఏ గ్రామమునకు వెళ్ళినను, ఏ పట్టణమున అడుగిడి
నను వేల సంఖ్యలో జనులు చేరుచుండిరి. ఎంతయో దూరము
నుండి శ్రవణాభిలాషులై జనులు అరుదెంచుచుండిరి.

ఈ ప్రకారముగ ఒక్క సంవత్సర కాలము గడచెను.
సాధువుగారి అఖండ ఆధ్యాత్మిక ప్రచారముయొక్క దివ్య
ప్రభావముచే ఎందరో జనులు పునీతులగుచుండిరి. పాపులు

పుణ్యాత్ములుగ మారిపోవుచుండిరి. దుశ్శీలురు సచ్ఛీలురగు చుండిరి. దొంగలు తమ దొంగవృత్తిని మాని తమ భూత కాలిక పాపజీవితమును గూర్చి పశ్చాత్తాపపడు చుండిరి. భోగులు యోగులగుచుండిరి. వెయ్యేల దేశమంతయు రామ రాజ్యముగ పరిణతి జెందుచున్నదా యనిపించుచుండెను. సాధువుగారి ఖ్యాతి దిగంతముల వ్యాపించెను.

ఆ త్తఱి ఆ దేశపు మంత్రివరేణ్యుడు సాధుమహాత్ముని కీర్తి ప్రతిష్ఠలకు అచ్చెరువొంది, అతని గుణగణములను మిక్కిలి శ్లాఘించి, అతని నిష్కళంక జీవితమును గూర్చి ఆనందపడి నగరమునకు అతనిని ఆహ్వానించి రాజుచే సన్మానము చేయిం చిన బాగుండునని తలంచి ఆ విషయమును రాజున కెఱింగింప అత డందుల కంగీకరించెను. ఒక పుణ్యదినమున ఆ అమాత్య శేఖరుడు రాజుగారి తరఫున ఆహ్వానపత్రికను గైకొని సాధువుగారి ఆశ్రమమునకు వెళ్లి అతనికి దానిని భక్తిపురస్స రముగ సమర్పించి, రాజనగరమునకు వేంచేయవలాగున భూపాలుని తరపున అభ్యర్థించెను. అందులకు సాధువుంగ వుడు తన సమ్మతిని తెలుపగా వెంటనే మంత్రివర్యుడు ఒక రథముపై వారిని ఆసీనులుగ జేసి మేళతాళములతో రాజ ప్రాసాదమునకు గొనిపోయెను. రాజభవనమున ప్రవేశించిన

సాధుమహాత్ముని నృపాలుడు గౌరవపురస్సరముగ లోనికి తీసికొనిపోయి సముచితమగు ఉన్నతాసనముపై గూర్చుండబెట్టి వివిధరీతుల సన్మానించెను. సత్కరించెను.

ఇదియంతయు మంత్రియొక్క ప్రోద్బలముచే జరిగినదే కాని రాజునకు స్వతఃఆవనవాసీయుని గౌరవింపవలెనను ఉద్దేశ్యము లేదు. తన్ను మించినవారు జగత్తులో లేనే లేరను అహంభావముకలవాడు ఒకరిని గౌరవించుటకుఉద్యుక్తుడగునా! అయినను మంత్రిపైగల సదభిప్రాయమువలన రాజు అతని మాట త్రోసివేయలేక సాధుమహాత్ముని సత్కరించెను.

ఇంత గౌరవము తనకు జరుగుచున్నను సాధువు ఆ సన్నివేశమును గొప్పగ తలంచలేదు. దైవమందే మనస్సు నెలకొల్పుకొని బాహ్యదృష్టిలేనివాడై యుండెను. తన్ను సత్కరించుచున్న రాజుపైగాని,తాను ఆసీనుడైయున్న నానాలంకార శోభితమణిమయ దివ్యాసనముపైగాని, నవరత్నములతో తులతూగుచున్న రాజభవనముపైగాని అతడు తన దృష్టిని పఱుచక కేవలము భగవత్పాదారవిందము లందే దానిని సంలగ్నము చేసెను. కాని అహంభావ ప్రపూరితుడగు ఆ భూపాలుడు పరిస్థితిని అపార్థము చేసికొని, సాధువు తన్ను కించపఱచెనని భావించి పట్టరాని ఆగ్రహావేశముతో కూడినవాడై తక్షణమే సైనికాధికారిని పిలిపించి "ఓయీ! దేశమునకు ప్రభువైన

నన్ను ఈ సాధువు ఉపేక్షచేసి అవమానపఱచెను. కావున ఈతనిని దేశమునుండి బహిష్కరించివేయుమ"ని ఆజ్ఞాపించెను.

రాజుయొక్క ఆ శిక్షాశాసనమును వినగనే సాధువు పకపక నవ్వెను. ప్రక్కనున్నవారందఱు ఆశ్చర్యచకితులైరి. రాజునకుగూడ పరమాశ్చర్యముగలిగి "సాధువుగారూ! శిక్ష విధించగనే మీరేల నవ్వినారు?" అని ప్రశ్నించె. అందుకు సాధువిట్లు విజ్ఞతాపూర్వకముగ సమాధాన మొసంగెను— "ఓ రాజా! చిన్న దేశమునకు ప్రభువైన నిన్ను ఒక్క నిమిష కాలము ఉపేక్షించినపుడే నాకు దేశబహిష్కరణయను గొప్ప శిక్షాదండన లభించగా, ప్రభువులకుప్రభువై, రాజులకు రాజై నట్టి పరమాత్మను జీవితమంతయు ఉపేక్షచేసిన నీకు ఎట్టి ఘోరమగు దండనము లభించునోయని తలంచుకొని నాకు నవ్వువచ్చినది."

ఆ వాక్యమును వినగనే రాజునకు కనువిప్పు కలిగెను. తాను ఒక చిన్న దేశమునకు రాజైనను రేపో మాపో నశించి పోవు నాలుగుమూరల అస్థిపంజరము కలిగియున్నను ఎంతో జూచుకొని మురిసిపోయి, అహంకరించి, బ్రహ్మాండములకు ప్రభువైన శాశ్వతుడైనట్టి పరమాత్మను విస్మరించుట గొప్ప పొరపాటని గ్రహించి, తన తప్పిదమును గుర్తించి సాధువుగారి పాదపద్మములపై తన శిరస్సునుంచి క్షమాపణ వేడుకొనెను.

తనకు చక్కని బోధను ప్రసాదించినందులకు, తన నేత్రములను తెరపించినందులకు తనకు వివేకోదయము కలిగించి అంధకారమయమగు తన జీవితమును ప్రకాశమందజేసినందులకు అతనిని వేనోళ్ల పొగడి, తగురీతి సత్కరించి పంపెను.

నీతి:— ఎవరును తమతమ సంపదలను జూచుకొని గర్వించరాదు, క్షణికజీవితము గొప్పని తలంచి రాజ ప్రభువు ప్రభువైన భగవంతుని విస్మరించరాదు. శాశ్వతుడైన పరమాత్మకు వినిర్మలభక్తిభావముతో జోహారులర్పించి,వినమ్రులై నిరంతర దైవచింతనతో గూడుకొని, జీవితమును పవిత్రముగ నొనర్చుకొనవలెను.

# రామరాజ్యము

అలెగ్జాండరు చక్రవర్తి భారతదేశమున పంజాబ్ ప్రాంతములో ఒకానొక గ్రామముగుండా పయనించుచుండెను సేనాసమేతుడై, అమాత్యశేఖరులతో గూడి ఆ గ్రామము నందు పోవుచుండ అనతి దూరమున గ్రామస్థులందరు ఒకచోట గుమిగూడితీవ్ర వాదోపవాదములు గావించుకొనుచు సంఘర్షణకు దిగుచున్న దృశ్యమును చూచెను. ఇక ప్రయాణమును నిలిపివైచి, మంత్రివర్యుని పిలచి, ఆ వృత్తాంతమేమిటో

తెలిసికొనిరమ్మని పంపెను.మంత్రిగారట్లే వెడలి ఆ గుంపులో చేరబడి అచట జరుగుచున్న విషయమంతయు సాంగోపాంగ ముగ తెలిసికొని తిరిగి రాజుయొద్దకువచ్చి ఈ ప్రకారముగ విన్నవించెను —

మహాప్రభూ! ఆ గ్రామమున ఒక రైతు కలడు. అతనికి ఒక ఎకరము పొలము కలదు. దానిని అతడు సమీప గ్రామమందలి మరియొక రైతునకు అమ్మివేసెను. పొలము కొన్న ఆసామి దానిని దున్నుకొనుచుండగా నేలలో ఒక బంగారుపాత్ర కనిపించెను దానిని తీసికొని అతడు నేల అమ్మిన రైతుయొద్దకుపోయి, అయ్యా! మీరు నాకమ్మిన నేలను దున్నుకొనుచుండగా అందులో ఈ సువర్ణపాత్ర లభించినది. మీరు నేల అమ్మినారేకాని అందులోని పాత్రను అమ్మలేదు కావున ఇది మీ సొత్తేకాని నాదికాదు. అందుచేత దీనిని మీరు పరిగ్రహించి నాకు మనస్సంతోషమును కలుగజేయుడు అని విన్నవించుకొనెను. ఆ వాక్యములను విని నేల అమ్మిన రైతు ఇట్లు సమాధానమొసంగెను— "అయ్యా! నేను ఏ క్షణమందు మీకు నా నేలను అమ్మినానో, అందులోని సమస్త పదార్థములున్ను మీవశమే అయిపోయినట్లు లెక్క. ఇక వాటితో నాకు ఏలాటి సంబధము లేదు. కాబట్టి దయచేసి ఈ బంగారుపాత్రను మీరే ఉంచుకొని అనుభవించుడు!

కాని నేల కొన్న పెద్దమనిషి అందులకు అంగీకరించ లేదు. బలవంతముగ దానిని ఇచ్చివేయ దలంచెను. ఈ ప్రకారముగ ఇరువురి మధ్యవాదోపవాదములు చెలరేగెను. ఇరువురి పక్షములకు సమర్థించుటకు వారి వారి అనుయాయులు కూడ చాలమంది అచటికి వచ్చి చేరిరి. కొద్దిగుంపు చేరిపోయెను. ఆ వింత చూచుటకై ఎక్కడెక్కడి జనులో వసుగున వచ్చి చేరిరి. అరుపులు, కేకలు-ఈలచే ఆ ప్రదేశమంతయు ప్రతి ధ్వనించెను.

ఇంతలో కొందరు పెద్దమనుష్యులు అచటికి వచ్చి ఇరువురికిని రాజీ కుదర్చదలంచినవారై పొలము అమ్మినవానిని "అయ్యా! మీకు సంతానము కలదా?" అని ప్రశ్నింప నా కొక కుమారుడు కలడు. వివాహమునకు సిద్ధముగా నున్నాడు అని అతడు ప్రత్యుత్తరమిచ్చెను. అట్లే ఆ మధ్యస్థులు పొలము కొన్నవానిని మీకు సంతానము కలదా? అని ప్రశ్నింప నా కొక కొమార్తె కలదు. వివాహమునకు సిద్ధముగా నున్నది, అని యాతడు పలికెను. అపుడు మధ్యస్థులు ఇరువురి వాక్యము లను ఆలకించినవారై ఈ ప్రకారముగ ఇరువురికిని రాజీ చేసిరి — పొలము కొన్నవాడు తనకుమార్తెను పొలము అమ్మిన వాని కొమారున కిచ్చివివాహముచేసి ఆ బంగారుపాత్రను కట్నముగా నొసంగవలెను. మధ్యస్థుల ఆ సమయోచితమైన

తీర్పుచే ఆ బంగారుపాత్ర ఇరుపక్షములకు చెందిపోయెను. మధ్యస్థుల ఆ తీర్పును ఇరువురును సంతోషముగ అంగీకరించి అవరిశారముగ కార్యాన్వితము నొనర్చిరి.

ఇదియే రామరాజ్యము. ప్రజల ఇట్టి మన [illegible] రామరాజ్య చిహ్నము. పరస్పరప్రేమ, అనురాగము, [illegible] దయ, పరోపకారము, స్వార్థత్యాగము-ఇట్టి ఉదాత్తగుణ[illegible] లచట తాండవించు చుండునో, అదియే రామరాజ్యము. ప్రజలిట్టి మహోన్నత సద్గుణరాశిని అవలంబించియుండు [illegible] వారే రామరాజ్య ప్రజలు. అట్టివారు ఏ క్షోభయులేక [illegible] శాంతిముగ తమతమజీవితములను కొనసాగించు[illegible] కావున శాంతిసౌభాగ్యములను వాంఛించు ప్రతిమానవు[illegible] తన హృదయమును పవిత్రముగను, నిర్మలముగను, [illegible] వంతము గను గావించుకొనవలయును.

**నీతి:—** పవిత్రమగు శీలము, నిర్మలహృదయము[illegible] సదాచరణ పరోపకారభావన, త్యాగశీలత్వము [illegible] కలిగి యుండినచో, అదియే రామరాజ్యము కాగల[illegible] అట్టి రామరాజ్యస్థాపనకే జనులు యత్నించ వలయు[illegible]



# దేవుడెచటనున్నాడు?

పూర్వ మొక మహాపట్టణమున ఒక రాజకుటుంబము కలదు. ఆ కుటుంబమునందొక రాజకుమారుడు పాఠశాలలో చదువుకొనుచుండెను. పాఠశాల వార్షికోత్సవసమయమున విద్యార్థులందఱు కలసి కొన్ని వినోదకార్యక్రమములను ఏర్పాటు చేసికొనిరి. ఒకటి రెండు నాటకములను కూడ నిర్వహించిరి. విద్యార్థులలో చక్కని నటనాకౌశలము కలిగినవారు వారివారికి తగిన వేషములను వేసికొని నాటకమాడిరి. రాజకుమారుడు అందు స్త్రీ వేషమును ధరించెను. నాటకము బహుమనోరంజకముగ నడచెను. ప్రదర్శనమునకు వచ్చినవారు అప్పుడప్పుడు చప్పట్లు చఱచుచు తమ ఆనందమును వ్యక్తపఱచిరి. వేషములు ధరించినవారిలో స్త్రీ వేషధారియైన రాజకుమారుడు తన నటన-సామర్థ్యముచే ప్రేక్షకుల మన్ననలను లెస్సగ చూరగొనెను. పురుషుడైనను అచ్చట స్త్రీ వలెనే అతడు నటించెను. నటనలో సహజత్వము ఉట్టిపడుచుండుటచేతను, బహుశ్రావ్యముగ పాటలు పాడుటచేతను, నాటకమునకు వచ్చినవారందరును రాజకుమారుని వేనోళ్ల ప్రశంసించిరి. రాజకుమారుని స్నేహితుడొకడు స్త్రీ వేషముతో నున్న రాజకుమారుడు రంగస్థలిపై నటించు వేళ అతనిని ఫోటో తీసి తనయింటివద్ద భద్రపఱచుకొనెను.

బహుకాలము గడచిపోయెను, కాలచక్రము
తిరుగసాగెను. బాలుడుగ నుండి పాఠశాలలో విద్యా
చేయుచున్న రాకొమరుడు క్రమముగ యౌవన
దీర్ఘకాలము గడచిపోవుటంబట్టి అతడు తన చి
గావించిన పనులను మఱచిపోయెను; తోడిపిల్లల
నాటకమాడిన వృత్తాంతము అతని స్మృతిపథమునుం
జారిపోయెను. ఆ సంగతిని పూర్తిగ మఱచిపోయిన
అతని తండ్రియైన మహారాజు తన తనయునకు
సంప్రాప్తించినట్లెఱిగి వివాహము చేయుటకు నిశ్చ

మంత్రివర్యులు, సామంతులు, ఆస్థానపండ
వధువు కొఱకై పలుచోట్ల విచారించిరి. పెక్కు ం
ములవారిని పరామర్శించిరి కట్టకడకు తమకు నచ్చి
రాజకుమార్తెల విషయము రాజున కెఱిగించిరి. ఆ
రూపలావణ్యము లందేకాక సిరిసంపదలందేకాక వి
లందుగూడ ఎంతయో అధిక్యతను బడసినవారైరి. ఒక
నాడు రాజు తన కుమారుడైన వరుని వెంటబెట్టుక
సేవకులు వెంటరాగా ఆ నాలుగురు రాజకుమార్తె
వారి పట్టణములందు చూచి, కుమారునకున్నా
రూప సౌందర్యాదులందు వారందరు ఒకరిని మి
మఱియొకరై యుండిరి. వారిని చూడగనే రాజునకు
మున పరమతృప్తి జనించినది. వారిలో ఒకరిని వరి

కుమారునకు వివాహము చేసివేయుటకు రాజు దృఢనిశ్చయము గావించుకొనెను.

కాని రాజకుమారునకు వారెవరును నచ్చలేదు. వారం దఱిని చూచి పెదవిని విఱచుకొనెను. 'లోకోభిన్నరుచిః' అను నట్లు ఎవరి దృష్టి వారిది. ఆ రాజకొమార్తెలు నలుగురు రూపయౌవన సంపదాదులు ఎన్ని గలిగియున్నప్పటికిని వరుడైన రాజకుమారునకు వారు ఏమాత్రము నచ్చలేదు. ఆ విషయము తెలిసికొని రాజు విహ్వల చేతస్కుడాయెను. ఒకనాడు తన కుమారుని బిలచి "నాయనా! ఆ నలుగురిలో ఎవరును నీకిష్ట పడనిచో నీకునచ్చిన పెండ్లికొమార్తెను నీవే అన్యత్ర విచారించుకొనుము. నీదృష్టికి ఎవరు ఉత్తమురాలుగ తోచునో ఆమెనే వివాహము చేసికొనుము"-అని చెప్పగా రాజకుమారు డట్లేకావించెదనని సమాధాన మొసంగెను.

ఇట్లుండ ఒకనాడు రాజకుమారుడు తన మిత్రుని గృహమునకు వెళ్లుట తటస్థించెను. అతని యింటిలోనికి ప్రవేశించగనే చిన్ననాడు తాను పాఠశాల వార్షికోత్సవ సమయమున నాటకమున వేసిన స్త్రీ వేషముయొక్క ఫోటో కనుపించెను. బహుకాలము గడచిన కారణముచే అది తన స్వరూపమే యని అతను మఱచిపోయెను. ఆ స్త్రీయొక్క సుందర సుకుమార రూపమును గాంచి రాజకుమారుడు

మోహావరవశుడై ఆ ఫోటోను తీసికొనివెళ్ళి తన తండ్రి
చూపించి ఫోటోయందలి పిల్లను తాను వివాహము చేసికొ
దననియు, ఆమె యెవరో, యెచటనున్నారో విచారించి రా
భవనమునకు రప్పించవలసినదనియు చెప్పెను.

కుమారుని యభీష్టప్రకారము రాజా అమాత్యశేఖరుల
సైనికాధికారులను, ఆస్థాన పురోహితులను కబురుచేసి
ఫోటో వారికి అప్పగించి దేశమంతయు గాలించి ఆ యువతి
ఎక్కడున్నను తన భవనము నకు గొనిరావలసినదిగ ఆజ్ఞయిచ్చె
వారల్లే పయనమైపోయి, ఊరూరు, పల్లె పల్లె, పురపురము
గాలించి గాలించి, అట్టి రూపవతి యెచటను సందర్భపడ
పోవుటచే నిరాశానిస్పృహాలచే పరివేష్టితులై తుట్టతుదకు రా
భవనమునకు తిరిగివచ్చి రాజునకు ఆ వృత్తాంతమంతయు
తెలియజేసిరి. రాజు,రాజకుమారుడు, రాజవంశీయులుఅందరు
ఆవార్త వినుటతోడనే విషణ్ణవదనులైరి. అత్తరి రాజకుమా
రుని బాల్యవృత్తాంతమంతయు నెఱిగియున్న ఒకఆస్థానవిద్వా
సుడు ఫోటోయందలి స్త్రీ రాజకుమారుడేయని తెలుపు
అందరును ఆశ్చర్యచకితులైపోయిరి ఏ స్త్రీ కొఱకై రా
కుమారుడు నలుదిక్కులు వెదకింపజేసెనో, ఆశ్చర్యచకితు
పోయిరి.ఏ స్త్రీ కొఱకై రాజకుమారుడు నలుదిక్కులు వెదకిం
జేసెనో, దేశదేశములు గాలింపజేసెనో ఆ స్త్రీ యెక్కడ

లేదు. తానే అయియున్నాడు. అది తనరూపమే అయియున్నది. తాను చిన్నప్పుడు చేసిన వేషమే అది. ఆ విషయము తెలియక ఇంత శ్రమ పడవలసివచ్చినది. ఎక్కడెక్కడో గాలింపవలసి వచ్చినది.

అట్లే దేవునికొఱకై జనులు ఎచటెచటనో వెతకుచున్నారు. కాని ప్రతివాని హృదయమందే యతడు విరాజిల్లుచున్నాడు. వెతుకు వారికి తప్పక గోచరించును వైరాగ్య విచారణాదులద్వారా సర్వాంతర్యామియగు ఆ పరమాత్మ జనులకు వారివారి హృదయములందే చక్కగ అనుభూతుడగుచున్నాడు.

**నీతి**— భగవానుడు సమస్తప్రాణికోట్ల యొక్క హృదయము లందు అతి సమీపమున విరాజిల్లుచున్నారు. కావున ధ్యానవిచారణాదుల ద్వారా వానిని సాక్షాత్కరించుకొని తరించవలెను.

* * * *

# అల్లుడుగారు

ఒకానొక గ్రామములో ఒక రైతుకలడు. అతనికొక కొమార్తె కలదు. ఆమెకు యుక్తవయస్సు రాగానే సుదూర ప్రాంతమున గల ఒకానొక పట్టణమునందలి యువకునకిచ్చి పెండ్లిచేసెను. పెండ్లి అయిన కొన్నిమాసములకు సంక్రాంతి పండుగ రాగా ఆ రైతు తన అల్లునకు జాబువ్రాసి ఇంటికి పిలిపించుకొనెను. పండుగ చూచుకొని అల్లుడుగారు తిరిగి స్వస్థానమునకు వెడలిపోవునని మామగారు అభిప్రాయపడిరి. కాని ఆదేమి గ్రహచారమోగాని, సంక్రాంతిపండుగ గడచి ఐదుదినములైనను అల్లుడుగారు ఇంటినుండి కదలలేదు; అతనిని భరించుట అత్తమామలకు ప్రయాసగా నుండెను. చెప్పి పంపి వేయుదుమా, అది మర్యాదకు లోటు,పోనీ, ఉంచుకొందుమా, భరించుట ప్రయాస. అని ఈప్రకారముగ తనలోతాను విచికిత్స గావించుకొనుచు ఆ రైతు దినమొక యుగముగ గడుపుచుండెను. ఎన్నిదినములు చూచినను అల్లుడు గడప దాటకుండుటచూసి అల్లునితో నిట్లనెను —

"అల్లుడుగారూ! ఈ ప్రాంతమంతట కరువు కాటకములు వ్యాపించియున్నవి. రోజులు గడచుట కష్టముగా నున్నది"— మామగారి ఆవాక్యములను విని అల్లు డిట్లనెను — మామ గారూ! మీరు చెప్పిన మాట నిజమే ఈ ప్రాంతమంతట

దుర్భిక్ష మావరించియున్నది. కాని దానికి కారణమేమియో తెలియునా? పాపము పండుటవలననే అట్టిస్థితి యేర్పడినది. కాబట్టిపాపపరిహారార్థము ఈ దినము మొదలుకొని నెలరోజుల వఱకు రోజుకుకొకవేల చొప్పున మంత్రజపముచేయ సంకల్పించి నాను. దానితో ఆ పాపమంతయు తుడిచిపెట్టుకు పోగలదు.

అల్లుని ఆ వాక్యములను విని రైతు లోలోన యిట్లు చింతించెను — అల్లుడుగారు ఇప్పట్లో ఇల్లు వదిలేటట్లులేరు. ఇంకను నెల రోజులు తిష్ఠవేయుటకు ఆలోచించుచున్నాడు — అని విచారించి, కొద్ది రోజులైనపిదప అర్థముకాని వేదాంత వాక్యములు చెప్పినచో వినలేక వెళ్ళిపోవునేమోయని భావించి ఒకనాడా రైతు అల్లుని కూర్చొనబెట్టి ఈమాట, ఆమాట చెప్పుచు మధ్యలో ఈ క్రింది విధముగ వేదాంతబోధ నుపక్రమించెను-

అసారే ఖలు సంసారే సుఖభ్రాన్తిః శరీరిణాం
లాలాపాన మివాంగుష్ఠే బాలానాం క్షీరవిభ్రమః

"అల్లుడుగారూ! ఈ సంసారము అసారమైనది. ఈ దృశ్యపదార్థములందు సుఖమున్నదని భ్రాంతిచే మనుష్యుడు తలంచుచున్నాడే కాని వాస్తవముగ పరిపూర్ణమైన సుఖ మిచట లేదు. చంటిపిల్లవాడు తల్లి వేలు చీకుచు, తన ఎంగిలి మింగుచు పాలు

త్రాగుచున్నానని ఏ ప్రకారము భ్రమించుచున్నాడో, తన వేలిలోనుండి పాలువచ్చుచున్నవని ఏ ప్రకారము భ్రాంతిచే తలంచుచున్నాడో ఆప్రకారమే దృశ్యపదార్థములనుండి సుఖము కలుగుచున్నదని అజ్ఞాని జీవుడు భ్రాంతిచే తలంచుచున్నాడు. కాబట్టి ఈ సుఖము భ్రాంతిజన్యమే కాని అన్యము కాదు"— మామగారు ఈ ప్రకారముగ అవిచ్ఛిన్నముగ బోధ సల్పుచుండ అల్లుడుగారు మధ్యలో అవి "మామగారూ! నేను చెప్పునదికూడ వినుడు" అని ఈ ప్రకారముగ ముక్తకంఠముతో చెప్పదొడఁగెను-

**అసారే ఖలు సంసారే సారం శ్వశురమందిరమ్**

అసారమైన ఈ ప్రపంచమున సారమైనది మామగారిల్లు. అల్లుని ఆవాక్యములు వినిమామగారు విస్తుపోయి ఇక ఈతనిని సాగనంపుట కష్టసాధ్యమని భావించి వేరొక ఉపాయము నాలోచింప దొడఁగెనట.

అట్లే జీవుని హృదయకోశమందు అనేక జన్మార్జిత దుష్టసంస్కారములు ప్రవేశించి ఎంత ప్రయత్నించినను బయటకు సాగకున్నవి. వివేకవంతుడగు మనుజుడు పెద్దల సాంగత్యమును బడసి, శాస్త్రపరిచయముగలిగి, తనయొక్క తీవ్రతర అనుష్ఠానము చేతను, యుక్తిచేతను, ఆత్మవిచారణచేతను. అపూర్వ జన్మార్జిత వాసనాజాలమును నెమ్మదిగ బయటకు సాగనంపవలెను.

వదలిపోవుటకు అతడు మొదటసమ్మతింపకున్నను, నీవుచూపనర్చు సాధనలచేత కొంతకాలమునకు వివశుడై కాలికి బుద్ధిచెప్పగలడు. దీనికి వివేకము, వైరాగ్యము ఎంతో అవసరములై యున్నవి. పట్టుదలతో దృఢతర యత్నముతో ఈ కార్యమును సాధింపవలసియున్నది. వీరికి తనను, దుర్బలత్వము, సోమరితనము, అలసత్వము మున్నగువానికి ఏమాత్రం అవకాశ మొసంగక, అచంచల దీక్షతో, అకుంఠిత దక్షతతో బహుజన్మార్జిత దుస్సంస్కారములను, దుర్గుణములను, వాసనలను సాధకుడు జయించివేయవలెను. శాంతికి మార్గ మిదియే

నీతి:- దుర్గుణములు, దుస్సంస్కారములు అనేక జన్మలనుండియు మనస్సునందు తిష్టవేసికొని యుండును. వానిని ప్రయత్న పూర్వకముగ జయటకు సాగనంపవలయును.

## దురభ్యాసమునకు స్వస్తి

ఒకానొక పట్టణమందు ఒక మహారాజు కలడు, అతడు సంపన్నుడే కాక మహావిద్వాంసుడు కూడను. సకల సౌభాగ్యములచే తుల తూగుచున్నను శాస్త్రప్రసంగము, పండితగోష్టులు విద్వజ్జన సమావేశములు జరుపుచుండెడివాడు. అతని యాస్థా

మున లక్ష్మీసరస్వతులిద్దఱును ఒకేచోట కలిసి యున్నట్లు చూపరులకు తోపట్టుచుండును. ఎందరో కవీశ్వరులను పోషిం చుచు, పండితులకు సాంవత్సరిక భృతులనొసంగుచు విద్వాం సుల నాదరించుచు నుండుటవలన జనులా మహారాజును గొప్ప గా సంస్తుతించుచునుండిరి. అతనియందు సద్గుణరాశి మూర్తీ భవించి యుండినను దుర్గుణములన్నియు పలాయనము చిత్త గించినను, ఒక్కవ్యసనము మాత్రము అతనిని అంటిపెట్టుకొని యుండెను. అదియే జూదము. ఎంతప్రయత్నించినను ఆ దుర్గు ణము నతడు వదలజాలకుండెను. అతని నిష్కళంక జీవితమున అదియొక మచ్చగా వ్యక్తమగుచుండెను.

ప్రతిదినము ఆ రాజు సాయంత్రము 4 గంటలకు రాజ శకటము నందు గూర్చొని జూదశాలకు పోవుచుండును. ఒకవు డొక సాధువుగారు ఆ పట్టణమునకు వచ్చి రాజుగారి చరిత్ర యంతయు తెలిసికొని జూదమను ఆ ఒక్కదుర్గుణమును వదలి వేసినచో బంగారునకు సుగంధము అబ్బినట్లు రాజు ఆదర్శ వంతుడై లోకమున వెలయగలడని భావించి నేరులో రాజు యొద్దకువచ్చి పలువిధములుగ నాతనికి బోధింపదొడగెను. చెడ్డ అలవాట్లు ఏ ప్రకారముగ జనుల హృదయకుహరమున చోటు చేసికొనునో, వానిని జాగరూకతతో ఏ ప్రకారము కనిపెట్టి తరిమివేయవలెనో సాధువుగారు అనేక విధముల రాజునకు

శోధించి జూదమను ఆ కళంకమును శీఘ్రముగ తొలగించి వేయులాగున ప్రశోధించెను. కాని పొరపాటు గ్రహపాటుగా మారి, గ్రహపాటు అలవాటుగా పరిణతమై అలవాటువ్యసనముగా రూపొంది ఆదురభ్యాసము బలపడిపోయి యుండుటవలన రాజు దానిని ఆ వదలజాలకుండెను. సాధువుగారు ఎంత చెప్పినప్పటికిని వాసనాప్రాబల్యముచే రాజు ఆ దురభ్యాసమును వదలలేకుండుట గమనించి సాధువుగారొక చక్కని ఉపాయమును అవలంబించిరి.

ప్రతిదినము సాయంత్రము 4 గంటలకు నృపాలుడు జూదశాలకు పోవును గావున ఆ సమయమును కనిపెట్టి ఒకనాడు సాధువు రాజ శకటముపోవు దారి ప్రక్కన గల ఒకానొక మాంసపుకొట్టువద్ద జటాజూటమును ధరించి మెడలో రుద్రాక్షమాలలు వేసికొని పూర్వపువేషమును మార్చుకొని చేతిలో కమండులువు,దర్భాసనము కలవాడై ఆ మాంసమును కొనుచున్నట్లు నటించెను. సరిగా అదియే సమయమున జూదశాలకు పయనమైపోవుచున్న రాజు ఆదృశ్యమును వీక్షించి ఆశ్చర్యచకితుడై వెంటనే శకటమును ఆపి క్రిందకు దిగి మాంసమును కొనుచున్న ఆ సాధువును మందలించెను.అపుడు వారిరువురకును ఈ క్రింది సంభాషణము జరిగెను.

భిక్షో మాంసనిషేవణం కిముచితం కిం తేన మద్యం వినా
మద్యం చాపి తవప్రియం ప్రియమహో వారాంగనాభిస్సహ

వారస్త్రీరతయే కుతస్తవధనం చౌర్యేణ ద్యూతేన వా
చౌర్యద్యూతపరిగ్రహోఽస్తి భవతః భ్రష్టస్య కావాగతిః.

రాజు :- ఓ సాధువుగారూ! మాంసమును కొనుట మీవంటి పుణ్యాత్ములకు తగునా?

సాధువు :- కల్లుత్రాగునపుడు నంజుకొనుటకై కొంత మాంసము అవసరమై యుండుట వలన కొనవలసివచ్చినది.

రా :- కల్లు కూడ మీరు త్రాగుదురా?

సా :- వేశ్యలతో కూడియుండినపుడు మాత్రము త్రాగుదును

రా :- వేశ్యలుకూడనా! మఱి వానిని పోషించుటకు మీకు ధనమెక్కడిది?

సా :- దొంగతనముద్వారాగాని, జూదమాడుట ద్వారాగాని సంపాదించుకొందును.

ఆ వాక్యములను వినగనే రాజునకు కనువిప్పు కలిగినది. తాను స్వయముగ జూదమాడవద్దని ఇతరులకు ఎట్లు చెప్ప గలడు! కావున రాజు వెంటనే జూదప్రయత్నమును విరమించి తన శకటమును రాజప్రాసాదమునకు మరలించెను. సాధువు వాస్తవముగ మాంసము కొనుటలేదు, మద్యపానాదులను సేవించుటలేదు. రాజునకు గుణపాఠమును బోధించుట కొఱకే ఈ నాటక మాడెను.

అప్పటినుండియు రాజు జూదమును గూర్చిన అలవాటును వదలివైచి జీవితమును సంస్కరించుకొని ఇతరులకు ఆదర్శవంతుడయ్యెను.

నీతి— ప్రతివారును తమ హృదయములను లెస్సగ పరిశోధించుకొనుచు ఏదేని దుర్గుణము, దుస్సంస్కారము, దుర్వ్యసనము, దురాచారము లోన ప్రవేశించినచో వెంటనే దానిని వివేకము యొక్క సహాయముచే బయటకు గెంటివేయవలెను. హృదయశుద్ధియే మోక్షమునకు సోపానము

## అన్యులపై ప్రీతి తన ప్రీతి కొఱకె

ఒకానొక గ్రామమునకు అనతి దూరములో ఏకాంత ప్రదేశమున ఒక చక్కని ఆశ్రమము కలదు. అచట ఒక సాధుపుంగవుడు తన ధ్యానానుష్ఠానాది కార్యములను నియమపూర్వకముగ నిర్వహించుకొనుచు,విరామ సమయములందు ఏదైన గ్రంథపఠనము గావించుకొనుచుండెను. సాయంకాలమున కొంతసేపు భక్తులకు ప్రబోధము సలుపుచుండును. గ్రామము సమీపముననే ఉండుటచే గ్రామస్థులలో కొందఱు ప్రతిరోజు సాయంకాల ప్రవచనమునకు వచ్చుచు, బోధ

ద్వారా శ్రవణానందమును బొందుచుండిరి. ఆ గ్రామస్థులలో ఒక రైతు ప్రతిదినము బోధకు హాజరగుచు మధ్యలోనే లేచి పోవుచుండెను. ఏల అట్లు చేయుచున్నాడో సాధువుగారికి అంతుపట్టలేదు. ఒకనాడు ఆ గృహస్థుని ఏకాంతముగ బిలచి సాధువుగారు అతనితో మీరు మధ్యలో లేచిపోవుటకు కారణ మేమి యని ప్రశ్నింపగా ఆ గృహస్థుడిట్లు సమాధాన మొసంగెను.

"మహాత్మా! సాయంత్రమగుసరికి నాకు ఇంటిమీద దృష్టిమరలును ఏలయనగా మావాళ్లకు నాపై అమితమైన ప్రీతి నారాకకై కుటుంబమువారంతా ఎదురు చూచుచుందురు, కనుకనే నేను బోధ విడిచి ఇంటికి త్వరితముగ వెడలిపోవుటకు కారణము" రైతు యొక్క ఆ వాక్యమును విని సాధువుగారు ఆ పలుకులయొక్క సత్యాసత్యములను తెలిసికొన దలంచినవాడై రైతుతో నిట్లనెను నాయనా! నీవిపుడు ఇంటికేగి నేలపై పండుకొని, కండ్లు మూసికొని ఏ మాత్రము కదలక మూర్ఛపోయినట్లు నటింపుము. ఇంటివారు ఎంత ప్రయత్నించినను, కదలక మెదలక యుండుము. కండ్లు తెరవవద్దు. తదుపరి నేనువచ్చి ఇంటివారిని కొన్ని విషయముల నడిగి తెలిసికొందును. నేను లెమ్మని చెప్పువరకు నీవు లేవవద్దు

గృహస్థరైతు ఆ ప్రకారమే ఆచరించెను. ఇంటికివెళ్ళి అకస్మాత్తుగ క్రిందపడిపోయి శవసదృశముగ నిశ్చేష్టుడై యుండెను. తోడనే ఇంటివారందఱును పరుగు పరుగునవచ్చి అతని పరిస్థితి గాంచి నివ్వెరపోయిరి. ఎంత పిలిచినను పలుకడు కదిలించినను కదలడు, లేపినను లేవడు. కండ్లుమూసికొని స్తబ్ధుడై పడియుండెను. భార్య, తల్లి, తండ్రి ఏడ్వదొడంగిరి. ఆ రైతుయొక్క ఆ శోచనీయ పరిస్థితినిగాంచి కుటుంబసభ్యులెల్లరు దుఃఖపరవశులై హాహాకారములు చేయజొచ్చిరి.

సరిగా ఆదేసమయములో సాధువుగారు ఇంటికి వచ్చిరి. సాధువుగారి దర్శనముచే అందఱికిని ఒకింత ధైర్యముకలిగెను. కుటుంబస్థులెల్లరు ఐక్యకంఠముతో సాధుమహాత్ముని యిట్లు ప్రార్థించిరి. "స్వామీ! పేదవానికి పెన్నిధి లభించిన చందమున ఆపత్కాలమున తామిచటికి దయచేయుటవలన మా హృదయములలో గంపెడాశ ఉద్భవించినది. మామనంబున ధైర్యసంచారము కలుగుచున్నది. ఏగ్రహదోషమో కాని, మాయింటియజమానికి అకస్మాత్తుగ ఈదుర్గతి జనించినది. పిలిచిన పలుకడు, లేపిన లేవడు, ఈ మూర్ఛనుండి తమరు అతనిని రక్షించి కాపాడుడు! ఆర్తులను, దీనులను, సంసార దుఃఖపరిమగ్నులను ఉద్ధరించి కాపాడుట మహాత్ముల నైజ స్వభావముగదా! మా అదృష్టము పండినందువలననే ఈ

ఆపత్సమయమున తమరిచటికి విచ్చేయుట సంభవించినది మహాశయా! తమరు కరుణించి ఈతనిని వ్యాధినుండి కాపాడుడు. ఆరోగ్యవంతునిగా జేయుడు.

ఇంటివారి యీ దీనాలాపములను విని సాధువుగారిట్లు వచించిరి "అమ్మలారా! అయ్యలారా! మీయింటి యజమాని గారు మా ఆశ్రమమునకు అపుడపుడు వచ్చిపోవుచుండుట అతని దయనీయ పరిస్థితిని గూర్చి విని ఇచటికి వచ్చితిని. అతని క్రిందబడి నిశ్చేష్టుడై యున్నాడు. ఒకపాత్రలో జలము తీసి కొనిరండు. ఆ భూతమును ఈ పాత్రయందలి జలములోనికి ఆవాహనించెదను, ఆ జలమును మరియొకరు త్రాగిన అప్పుడాతనికి భూతోచ్చాటన సంభవించి ఆరోగ్యవంతుడై చెన్నొందును. అయితే త్రాగినవారిని మాత్రము ఆ దయ్యము పట్టి పీడించును. ఇందులకు సంసిద్ధులైనవారు మాత్రమే త్రాగవలెను.

సాధుమహాత్ముని ఆవచనములు వినినవెంటనే కుటుంబసభ్యులెల్లరు ఒకరు మొహము ఒకరు చూచుకొనసాగిరి ఇంటియజమానికి దయ్యపుబాధ తొలగించివేయుటకు అందరు సంసిద్ధులై యున్నను తమకుతాము లేనిపోని దయ్యపు బాధ కొనితెచ్చుకొనుటకు సిద్ధముగ లేరు. మనకెందుకీ అని ప్రతివారును వెనకాడుచుండిరి. అపుడు సాధువుగా

కుటుంబీకులందఱిని వరుసపెట్టి ఒక్కొక్కరిని ఏమండీ! యజమాని గారి దయ్యపుబాధ తొలగించుటకు మీరిష్టపడెదరా? అని ప్రశ్నింపదొడగగా, తత్ఫలితముగ తమకు ఆ బాధ సంక్రమించునను భీతిచే ప్రతివారు సాధువుగారూ! ఎవరి కర్మ వారు అనుభవించక తప్పదు! ఇంటి యజమాని జాతకములో అప్రకారము భూత ప్రేత గండము ఉండబట్టియే వారాబాధ అనుభవించు చున్నారు. ఏమి చేయుదము? ఒకరికర్మను మఱియొకరు ఎట్లు తప్పించగలరు? అయితే ఈసమయమున మాకొక చక్కని ఉపాయము స్ఫురించుచున్నది. అదియేదనగా, సాధువుగారూ! మీకు భార్యా బిడ్డలు ఎవరును లేరు. కాబట్టి మీరు పోయినను మిమ్ములగూర్చి బెంగపెట్టుకొను బంధుజాలమెవరును లేరు కాబట్టి ఆ భూతోచ్చాటన జలమును మీరే త్రాగివైచినచో చాల బాగుండునని తోచుచున్నది. కావున ఆప్రకార మాచరించి మాయజమానిగారిని బాధావిముక్తులనుగా చేయవలసినదిగా త్రికరణశుద్ధిగ మేమందరము మిమ్ములను ప్రార్థించు చున్నాము

ఇంటివారి యీపలుకులను విని సాధువుగారు పక్కున నవ్వి పరుండియున్న గృహయజమానిని చేయిపట్టి లేపి "చూచితివయ్యా! మహానుభావా! మీయింటివారు నీపై యెంతో ప్రేమ ఒలకబోయు చున్నారని చెప్పితివి కదా! చూడుము!

ఆ ప్రేమ యెట్టిదో! నిన్ను వారు ప్రేమించుచున్నారనగా తమకొఱకే నిన్ను ప్రేమించుచున్నారు గాని తమ క్షేమకే దైన విఘాతము కలిగినచో నీయెడల ఆప్రేమనుకూడ పరిత్యజించుచున్నారు. కాబట్టి నిన్ను వారు ప్రేమించుచుండుట స్వకీయనిమిత్తమని నీవుభావించినావు. ఆ విషయము ను ఋజువుచేయుట కొఱకే నేనీపన్నాగము పన్నితిని. ఇప్పుడైన అసలు విషయము తెలిసికొని—

"నవా అరే పత్యుః కామాయ పతిః ప్రియో భవతి
ఆత్మనస్తు కామాయ పతిః ప్రియో భవతి"

"భర్తపై ప్రీతిచే భర్త ప్రియుడుగ లేడు, ఆత్మయెడల ప్రీతి చేతనే భర్త ప్రియుడుగ నున్నాడు."

ఇత్యాది ఉపనిషద్వచనములను స్మృతిపథమునకు తెచ్చుకొని ప్రతివానికి తమ ఆత్మయే ప్రియతమ వస్తువనియు, దానికొఱకు మాత్రమే సర్వులపై ప్రీతి సంభవించుచున్నదనియు తెలిసికొని, ఆత్మాన్వేషణమునకు గడంగి అట్టి ప్రియతమ, ఆనందమయ ఆత్మను సాక్షాత్కరించుకొని తరింపుదురుగాక!

**నీతి- ఆత్మ అన్నిటికంటెను ప్రియతమమైనది. అట్టిదానిని సాక్షాత్కరించుకొనుటయే జీవితలక్ష్యము.**

69)

# దైవవిస్మృతి ప్రమాదకరము

అదియొక పుణ్యక్షేత్రము. సుదూర ప్రాంతములనుండి అచటికి వేలకొలది భక్తులు నిరంతరము వచ్చుచు పోవుచు నుందురు. ఎప్పుడెప్పుడు దైవదర్శనము దొరకునా, పరమాత్మ యొక్క దివ్యమంగళ స్వరూపము నెప్పుడు కనులార వీక్షించి పుణ్యము కట్టుకొందుమా యను తీవ్రతర ఆకాంక్ష పురికొల్ప జనులు తండోపతండములుగ అచ్చోటికి వచ్చుచుందురు. దర్శించిన పిదప ఆహా! జన్మము ధన్యమయ్యెనుగదా యని పరితృప్తిని పొందు, హృదయమున భక్తిభావమును పెంపొందింప చేసికొని, ఆలయమందు లబ్ధమైన దేవప్రసాదమును పెట్టెలందు పదిలపఱచుకొని ఆనందముతో తమతమ నెలవులకు పోవుచుందురు.

ఆ యూరికొక రైలుస్టేషను కలదు. పుణ్యక్షేత్రము కాబట్టి వచ్చిపోయే యాత్రికుల రద్దీ అచట విశేషముగ నుండును. ఆస్టేషనులో ఎప్పుడును ఏదియో యొక రైలుబండి వచ్చుచు పోవుచు నుండును. ప్లాట్‌ఫారం ఎల్లవుడు యాత్రికుల సామానులతోను, యాత్రికులతోను నిబిడీకృతమై యుండును. ప్రయాణీకుల కోలాహలముచే ఆస్థలమంతయు నిరంతరము ప్రతిధ్వనించుచుండును.

ఇట్లుండ ఒకనాడు అచట ఒక రైలుబండి ప్లాట్‌ఫారంపై కదలుటకు సిద్ధముగనుండెను. ఇంకొక పదినిముషములలో అది

కదిలిపోవును.ప్రయాణీకులు హడావుడిగా లోనికెక్కి కూర్చొను చుండిరి. ఇంకను కొందఱుపరుగు పరుగునవచ్చి ఎక్కుచుండిరి దాదాపు అన్ని పెట్టెలు యాత్రికులచే కిటకిటలాడి పోయినవి. ఆసమయమున ఒక కాకీడ్రెస్సు ధరించిన యువకుడు రైలులో ఎక్కదలంచి వేగముగ నడుచుచు అన్ని పెట్టెలను ఒక్కసారి పరికించెను. కాని కూర్చొనుటకు ఎక్కడను చోటుదొరకలేదు అప్పుడొక ఉపాయ మాతనికి స్ఫురించెను. వెంటనే యతడు చివరి పెట్టెయొద్దకు పోయి అందరి ప్రయాణీకు లందఱితో ఈ పెట్టె స్టేషనులోనే నిలిచిపోవును. ఇది వెళ్ళదు. దీనిని ఇప్పుడే ఊడదీసివేయుదురు. కాబట్టి త్వరగా దిగి ఇతర పెట్టెలలో సర్దుకొని కూర్చొనుడు. మీక్షేమము కొఱకు చెప్పుచున్నాను వినుడు అని ఏకధాటిగా పలికెను.

అతడు కాకీడ్రెస్సు వేసికొనియున్నాడు కాబట్టి ఆతని వాలకము జూచి అతడెవరో పెద్దరైల్వే ఉద్యోగియని భావించి ప్రయాణీకు లందఱును అతని మాటలను నమ్మి గలగజ దిగి తక్కిన పెట్టెలలో సర్దుకొని కూర్చుండిరి. అప్పుడా యువకుడు ఆనందపడి తాను వేసిన పాచిక పారినదని భావించి ఆ ఖాళీ పెట్టెలో ప్రవేశించి కాలిమీద కాలు వేసికొని హాయిగా పరుండి నిద్రించెను.

ఇట్లుండ ఆ ప్లాట్‌ఫారంపై అచటనే నిలబడియున్న ఒక పోర్టరు ఆ కాకీడ్రెసువాడెవడో పెద్దరైల్వే ఉద్యోగి యని

భావించి అతడు చెప్పినట్లు ఆ పెట్టెను ఊడదీయకపోయినచో తన డ్యూటీకి భంగము కలుగునని తలంచి తక్షణమే ఆపెట్టెను ఊడదీసి బండినుండి వేరుచేసెను. బండి కదలిపోయెను. కాని ద్రిస్తున్న యువకుడు నిద్రలేచి చూడగా ఆపెట్టె స్టేషనులోనే పడియుండెను. బండిమాత్రము వెడలి పోయెను. అత్తఱి యతడు ఆశ్చర్యచకితుడై తాను చేసిన తప్పునకు తగిన ప్రాయశ్చిత్తము జరిగెనని భావించి "చెరపకురా చెడేవు" అను సామెతను జ్ఞప్తికి తెచ్చుకొని సిగ్గుపడి ఆ చోటు విడిపోయెను.

ఇచట రైలుబండి యనగా భగవంతుడు. చివరి పెట్టె జీవుడు జీవుడు భగవంతునితో కలసియున్నపుడు మాత్రమే గమ్యస్థానమగు మోక్షమును చేరగలడు. అనగా నిరంతర దైవస్మృతి, దైవధ్యానము, దైవచింతన గలిగియుండిన మహనీయులు దైవముతో అంటగలవారై అచిరకాలములో దైవ సాన్నిధ్యమును బడయగలరు. అట్లుగాక, దైవవిస్మృతి గలిగి భగవంతుని ఏకాలమందును చింతన చేయక, దేవునితో సంబంధమును విడగొట్టుకొనువారు రైలుబండి నుండి వేరు చేయబడిన పెట్టెవలె ఉన్నచోటనే అనగా సంసారమందే ఉండిపోవుదురు. ఏ మాత్రము కదలరు. ఈ దృశ్యరూపమువనే పడి జననమరణ ప్రవాహమందు కొట్టుకొనిపోవుచు ప్రపంచ

క్షేత్రమందే ఉండిపోవుదురు. శాంతిని, నిర్విషయ ఆనందమును పొందజాలక యుందురు.

నీతి:- దేహధారియగు ప్రతిమానవుడును తనలో వెలుగుచున్న దివ్యమగు ఆత్మతో దైవముతో లంకె వేసికొని, దైవవిస్మృతిని దూరీకరించి ధ్యానమును తీవ్రగ నభ్యసించుచు తీవ్రతరసాధనచే ఈ జీవితమందే దైవసాక్షాత్కారమును బడసి కృతార్థుడు కావలయును. నిరంతరము దైవస్మృతి కలిగియుండుటను అభ్యసించి ధన్యుడు కావలెను. దైవస్మృతి మహాప్రమాదకరమని జ్ఞప్తియందుంచుకొనవలెను.

# మనస్సు యొక్క ప్రతిఘటన

ఓకానొక పట్టణమునకు అనతిదూరములో ఒక ఆశ్రమము కలదు. అందొక మహనీయుడు బహుకాలమునుండి తపస్సు చేసికొనుచుండెను. అది ఏకాంత ప్రదేశము. ధ్యాన నిష్ఠులకు చాల అనుకూలమైన వాతావరణము అచట కలదు. ఆశ్రమము చుట్టును పూలమొక్కలు, తులసి, మారేడు వనములు కలవు. సుదూర ప్రాంతములనుండి అనేకమంది భక్తులు, ముముక్షువులు, జిజ్ఞాసువులు ఆ ఆశ్రమమునకు అప్పుటప్పుడు వచ్చుచు పోవుచు, అనుభవజ్ఞుడగు ఆ గురువరేణ్యుని యొద్ద

సద్బోధలను బడయుచునుండిరి. గురుదేవుడు వారి సంశయముల నన్నిట్టి త్రుటిలో దూరీకరించివైచుచు సంతృప్తిపఱచుచునుండెను. గురుదేవుని అనుభవపూర్వక వాక్యములను, ప్రామాణిక బోధలను శ్రవణము చేయుచు భక్తులు మహానందమును బడయుచునుండిరి.

ఇట్లుండ ఒకనాడొక గృహస్థుడు అత్యంత జిజ్ఞాసతో ఆ యాశ్రమమునకు వచ్చి సద్గురు మహాత్మునకు దండప్రణామం బాచరించి యిట్లు మనవిచేసికొనెను-స్వామీ! మహాత్మా! ఈ సంసారము అతి దుర్భరముగా నున్నది. మహాభారములో ఆదిపర్వమే యన్నట్లు మోయుటకు చాల ప్రయాసగా నున్నది. దిన మొక యుగముగా గడచుచున్నది. శాంతి అను నది మచ్చుకైనను కానరాకున్నది. ఒక్క నిమిషమైనను నిశ్చలముగ కూర్చొని భగవంతుని ధ్యానించెదమా యనిన అవకాశము దొరకకున్నది. నావలె యెందఱు ఈ సంసార కూపములో పడి నానాదుర్భరయాతనల నొందుచున్నారో యని అప్పుడప్పుడు తలంచుకొనుచుందును. దేవా! ఈ సంసార బాధ తొలగుటకు ఆత్యంతిక శాంతిని బడయుటకు ఏదైన ఉపాయము సెలవిండు. తమ ముఖతః ఏదేని దివ్యమంత్రమును బడసి అద్దానిని సమయము దొరికినపుడెల్ల భక్తిపూర్వకముగ జపించుకొందును, కావున దయచేసి మంత్రోపదేశము చేయ ప్రార్థన.

శిష్యుని తీవ్ర జిజ్ఞాసను గమనించి అతనికి మంత్రోపదేశము చేయుటకై గురుదేవుడు నిశ్చయించుకొని అతనిని ఎదురుగ కూర్చుండుమని చెప్పి దృష్టిని భ్రూమధ్యమందు స్థాపించుమని ఆదేశమొసంగి —

ఓమ్ నమో నారాయణాయ

అను అష్టాక్షరీ మంత్రమును చెప్పి శిష్యునిచే మూడుపర్యాయములు పలికించెను. గురువు బోధించిన పవిత్ర మంత్రరాజమును శిష్యుడు భక్తిపూర్వకముగ మననము చేసి ప్రతిదినము కనీసము 108 సార్లైనను అద్దానిని జపించుటకు కృతనిశ్చయుడయ్యెను. తదుపరి యతడు గురువుగారికి సాష్టాంగదండప్రణామం బాచరించి వారినుండి సెలవు గైకొని వెడలుచు కొద్దిదూరమేగగా, తోడనే గురువుగారతనిని మరల వెనుకకు పిలిపించి ఈ ప్రకారముగ చెప్పిరి "నాయనా! నీవు జపము చేయునపుడు నీ మనస్సునందు కోతిని రానీయవద్దు. దృష్టిని కేవలము, శ్రీమన్నారాయణుని చరణకమలముల పైననే ఉంచుము. అట్లు కావించెదనని పలికి యాతడు సెలవుతీసికొని యింటికి పోయెను.

మరునాడు ప్రాతఃకాలమున యథావిధిగ ఉదయము బ్రహ్మముహూర్తమునందే నిద్రలేచి స్నానాదికములను నిర్వ

త్రిందుకొని తన పూజాగృహమున కూర్చొని ఆ గృహస్థ శిష్యుడు జపమాలగయికొని గురుప్రోక్తమంత్రమును శ్రద్ధతో జపించ నారంభించెను.దృష్టిని భ్రూమధ్యమందు నిలిపి మనస్సును నారాయణమూర్తియొక్క పదపంకేరుహములందు స్థాపించి జపమును ప్రారంభించగ వెంటనే మనస్సునందు ఒక కోతి స్ఫురించెను.గురువు చెప్పిన ప్రకారము జపకాలమున చిత్తమందు కోతి రాగూడదని అతనికి కోతి కనుపించెను.దానినితొలగించగనే వెంటనేచిత్రఫలకమున వేలాది కోతికనిపించెను.ఈప్రకారముగ కోతిగొడవచేత అతని జపకార్యము అరగింతైనను ముందుకు సాగలేదు. దానిచే మనస్సునకు చీకాకు కలిగి తత్క్షణమే లేచి గురుదేవుని ఆశ్రమమునకు వడివడిగా పోయి దేశికేంద్రునకు సాష్టాంగనమస్కారముచేసి మహాత్మా! తాము మంత్రమును ఉపదేశించిన తరువాత నేను ఆనందముతో వెడలిపోవుచుండగా మరల వెనుకకు పిలిచి ఆ కోతిమాట ఎందుకు చెప్పినారు స్వామీ! దానితో నా కార్యక్రమమంతయు తల్లక్రిందులై పోయినది. ధ్యానము, జపము సాగుటలేదు. కోతిని రానీయ వద్దని చెప్పినందువలన కోతియే వచ్చుచున్నది. దీని కేదైన నివారణోపాయము తామే సెలవీయవలెను-అని వేడుకొనగా గురుదేవుడు ఈ ప్రకారముగ ఆనతిచ్చెను—

నాయనా! నీవేమియు కంగారుపడవద్దు.మనస్సుయొక్క స్వభావమే అది.దానికి మన మేది చెప్పుదుమో సరిగా దానికి

తల్లక్రిందులుగ ఆచరించును. దీనికి ప్రతిక్రియ ( Reaction ) అందురు. మనస్సుయొక్క ఆ గుణమును కనిపెట్టి సాధకుడు కేవలజాగరూకతతో మెలంగి యుక్తితో దానిని స్వాధీనపరచుకొనుచు రావలెను. మనస్సునందు కోరికవచ్చినచో ఏ మాత్రం అదరక, బెదరక దానిని తొలగించుటకు ప్రయత్నించక, ఆ కోరికలో కూడ నారాయణమూర్తినే చూడుము. అప్పుడా కోరిక దానంతట నదియే అంతర్ధానమై పోవును. నిన్ను పరీక్షించుటకొరకే కోరికగూర్చి ఇంత ప్రస్తావన చేసితిని. ఏమియు భయపడవద్దు ఏ వస్తువు మనస్సులో స్ఫురించినను నీ దృష్టిని దానిపై నుంచక దానిని లక్ష్యపెట్టక నీలక్ష్యమగు దైవము పైననే మనస్సు నుంచుటకు ప్రయత్నింపుము. అప్పుడు ధ్యానము, జపము నిర్విఘ్నముగ, నిరాటంకముగ జరిగిపోవును.

గురుదేవుని అమూల్య సలహాను గ్రహించి శిష్యుడా ప్రకారమే ఆచరించి జప ధ్యానాదులను నిరంతరాయముగ కొనసాగించి పరమశాంతిని పొందెను.

**నీతి- మనస్సునకు తిరుగబడు స్వభావము కలదు, కావున యుక్తితో దానిని దారికి తీసికొని రావలెను.**

# పరహిత చింతన

పూర్వము మహాదేవ గోవిందరానడే అను పేరుగల ఒక గొప్ప తత్త్వవేత్త ఉండెడివాడు. అతని బోధలు సర్వజన సమ్మతములై, అత్యంత ప్రయోజనకరములై యుండుటవలన ప్రజ లాతనిని గురుతుల్యునిగ భావించి అతని బోధలను కార్యాన్వితి మొనర్చుటకై ప్రయత్నించుచుండిరి. ఏ సిద్ధాంతమైనను ముందుగ తాననుష్టించి తదుపరి ఇతరులకు బోధించుట వలన అతని వాక్యములకు ఎంతయో విలువ ఉండెడిది. ఆచరించి చెప్పుట అతని ప్రత్యేకత. పవిత్రహృదయము, దయార్ద్ర చిత్తము, నిరంతర పరహిత చింతన గలిగియుండుటవలన ఎందరో అతనికి భక్తులుగ, శిష్యులుగ చేరిరి తానున్న ప్రదేశమందును,పరిసర గ్రామములందును,సుదూర ప్రాంతము లందును, అతనికి శిష్యకోటి ఏర్పడెను. అతనిశిష్యులలో ధన వంతులు కలరు,బీదవారు కలరు,విద్యావంతులు కలరు,విద్యలేని వారున్ను కలరు.

సుదూర ప్రాంతమునవున్న ఒక ధనిక శిష్యునకు ఒక పెద్ద మామిడితోట కలదు, అందు రసరసములైన మామిడి తోట కలదు. అందు రకరకములైన మామిడిచెట్లు కలవు. పండ్లు బాగుగాపండిన సమయమున గురుదేవునకు కొన్ని మధుర ఫలములను పంపినచో ఎంత బాగుండును! గురువు

సాక్షాత్ పర బ్రహ్మస్వరూపము. మన తోటలోని ఫలము ఒక్కటైనను అతని హృదయమున పడినచో అది ఎంతటి మహత్తర పుణ్యవిశేషము! అని తలంచినవాడై ఆ ధనిక శిష్యుడు అత్యంత మధురములైన కొన్ని మామిడిపండ్లను కోయించి ఒక గంపలో పెట్టి చక్కగ "ప్యాకింగ్" చేసి రైల్వే పార్శిల్ ద్వారా గురుదేవుడైన రానడేగారికి పంపెను.

గంప యింటికి చేరగనే రానడే దాని కట్లు విప్పించుండెను. సామాన్యముగ పండ్లగంప ఇంటికి రాగానే ఇంటివారందఱును దాని చుట్టు చేరుచుందురు. అట్లే రానడే కుటుంబ సభ్యులెల్లరును ఆమధుర ఫలములను చూచుటకు, ఆరగించుటకు సమీపమునకు వచ్చి చేరిరి. బుట్ట మూతదీసిన పిదప రానడే అందొక పండును తీసి చాకుతో ఒక ముక్కనుకోసి నోటిలో వేసికొని తక్కిన పండంతను చప్పున బుట్టలో పడవేసెను. ఆ దృశ్యమును చూచుచున్న కుటుంబసభ్యు లెల్లరు ఆశ్చర్య చకితులైరి. అతడెందులకు ఆవిధముగ చేసెనో ఎవరికిని అంతు పట్టలేదు. సందేహ నివారణము కొఱకై ప్రక్కనున్న ఒకడు తెగించి వారి నిట్లు అడిగివైచిరి — ఏమండీ! మామిడిపండు పుల్లగానున్నదా ఏమి? అందుల కతడు లేదు, తీపిగానున్నది. మామూలు తీపికాదు. మహాతీపి. ఈ మధ్య అంత తీపిపండు నేనెప్పుడును తినలేదు, అని సమాధాన మొసంగెను. వెంటనే

ప్రక్కనున్న యతడు "అంతతీపిగా నున్నచో ఒక ముక్క మాత్రమే తిని మిగతా పండునంతను బుట్టలో పడవైచితివేమి!" అని తక్షణమే ప్రశ్నించెను. దానికి సమాధానముగ రానడే యిట్లు పలికెను. "అతిమధురముగా నున్నది. కాబట్టి దానిని నేను తినకుండ ఇతరులకు వదలివేసితిని. ఇతరులు ఆ మాధుర్యమును చవిచూచి ఆనందపడినచో, అదియే నాకు పదివేలు. వారి ఆనందమే నా ఆనందము. ఇతరుల సుఖమే నా సుఖము, ఒకడు ఆనందపడినచో అదియే నాకు పరమతృప్తి. నేను తినిన ఫలము శాశ్వతపుణ్యఫలమును కలుగచేయును"

రానడే యొక్క ఆ అద్భుతబోధను విని ప్రక్కనున్న వారందరు అతని స్వార్థత్యాగమునకు, పరోపకారనిరతికి, పరహితకాంక్షకు ఎంతయో ఆనందపడి ఉదాత్తస్వభావమును తామున్ను తమ జీవితములందు అనుసరించినచో ఎంతయో మేలని భావించిరి.

**నీతి:– పరహితమునకై పాటుపడవలెను, ఒరుల సుఖమును తన సుఖముగా నెంచి చేతనైనంతవరకు పరులకు ఉపకారము కలుగ జేయుటకై యత్నింపవలెను. తన సుఖమును కొంత తగ్గించుకొని యైనను ప్రాణికోట్లకు సుఖమును కలుగజేయుట మహాత్ముల స్వభావము.**

# మోక్షమునకు అర్హత

ఒకానొక పట్టణము పెక్కు రహదారులతోను, సుందర భవనములతోను, ఆకాశము నంటుచున్న ఉత్తుంగహర్మ్యములతోను, పుష్పవాటికలతోను విరాజిల్లుచుండెను. ఆ పట్టణము యొక్క రమణీయత్వమును దర్శించుటకును, అచటి విశేషములను ప్రత్యక్షముగా గాంచుటకును పరదేశీయు లెందఱో వచ్చుచు పోవుచు నుందురు. ఆ పట్టణమెల్లపుడు పల్లెలనుండి వచ్చు జనములతోను, ఇతర ప్రాంతములనుండి వచ్చు యాత్రికులచేతను కిటకిటలాడుచుండును. ఆ పట్టణమునకు ఒక పెద్ద రైల్వేస్టేషను కలదు. అనేక రైలుమార్గముల కది కూడలి యగుట వలన ప్రతి ఐదు నిమిషములకు ఏదియో యొక రైలు బండి వచ్చుచునే యుండును అది పెద్ద స్టేషను అయియుండుట వలన విశాలమైన ప్లాట్‌ఫారం గలిగియుండి వచ్చి పోవు ప్రయాణికులచే సందడిగా నుండును.

ఒకనాడు ఆ యూరిలోని ఒక మహాపండితుడు, విద్వాంసుడు, పండిత శాలువా కప్పుకొని, చేతిలో ఒక సంచి పట్టుకొని హడావుడిగా స్టేషను వైపునకు వచ్చుచుండెను. అతని వాలకము చూడగా ఏదియో ఒక తొందర పనిమీద రైలు బండిని అందుకొనుటకై వచ్చుచున్నట్లు తోచుచుండెను. అతడు మిక్కిలి ఆతురతతో వడివడిగా నడచుచు స్టేషనులో ప్రవేశించి

ప్లాట్ ఫారం మీదకు వచ్చుచుండెను. కాని గేటువద్దగల టికెట్ కలెక్టరు ఆతనిని ఆపి "అయ్యా! టిక్కెట్టు ఉన్నదా?" అని అడిగెను. అవుడు వారియవురి మధ్య ఈ క్రింది సంభాషణము నడచెను.

పండితుడు :- మహాశయా! నావద్ద టిక్కెట్టులేదు. అయితే నేనెవరో తెలుసునా? నేను మహాపండితుడను. ఈ యూరిలోనే కాదు. చుట్టుప్రక్కలగల యెవరునువిద్వత్తులో నాకు సాటిరారు. ఇటీవలనే కవిసమ్మేళనములో నాకు గొప్ప సన్మానము జరిగినది. నేను అశు కవిత్వము చెప్పగలను, శాస్త్ర విచారణయందును, వాదవివాదము లందును.నన్ను మించినవారు ఎవరును లేరు. ఈ మధ్యనే అన్నిసంఘములవారు కలసి పండితశిరోమణీ అను బిరుదును నాకు యిచ్చియున్నారు.

టికెట్ కలెక్టరు :- అయ్యా! మీ గొప్పతనమును పరకువు పెట్టుటకిది సమయముకాదు.మీ రెంతపండితులైనా ఇచట మాత్రము టిక్కెట్టు ఉండితీరవలసినదే. లేనిచో లోన ప్రవేశించుటకు వీలుపడదు.

పండితుడు :- నా గండపెండేరములను చూడండి. నాకు ప్రజలిచ్చిన సన్మానపత్రముల కట్ట చూడండి. బిరుదుల

లిస్టు చూడండి. కొంచెము ఓపికపట్టినచో నా సర్టి
ఫికెట్లన్నీ మీకు చూపించెదను. నాయౌన్నత్యమును
మీరు సరిగా తెలిసినట్లు లేదు.

టికెట్ కలెక్టరు :- మహానుభావా! మీ ఉపన్యాసము చాలిం
చండి. మీగొప్పతనము మీ ఊరిలో ఉండుగాక!
కాని ఇచట మాత్రము మీరు టిక్కెట్టు కొనవలసి
నదే. లేనిచో బయటకు దయచేయవలసియుండును
వేఱుగత్యంతరము లేదు.

టి. సి. యొక్క ఆ పలుకులు విని పండితుడు విధిలేక తిరుగుదారి పట్టెను. ఇంతలో ఒక మహాబలిష్టుడు, అజాను బాహుడు, కండలు బలిసినవాడు, వస్తాదు, ప్లాటుఫారంలోనికి దిగ వచ్చుచుండెను. కాని గేటువద్ద టికెటు కలెక్టరు అతని, అయ్యా! టిక్కెట్టు ఉన్నదా? అని ప్రశ్నింప లేదు అని అతను బదులు చెప్పి తన వృత్తాంతమీ ప్రకారముగ తెలియజేయ దొడగెను.

"అయ్యా! టి. సి.గారు! నేనెవరో తమకు సరిగా తెలిసినట్లులేదు. నేను మల్లయుద్ధ ప్రవీణుడను. నాతో కుస్తీ పట్టి జయించువాడు ఈ నాలుగు జిల్లాలలోను లేడు. నా ఆకారమును చూచి జనులు హడలిపోవుచుందురు. "జగజెట్టి"

అను "మల్లయుద్ధ విశారద" అని బిరుదము లెన్నియో నాకు కలవు.

టికెట్ కలెక్టరు :- మహానుభావా! మీ ఉపన్యాసమును ఇక కట్టిపెట్టండి మీరు గొప్పవస్తాదు అయియుండవచ్చు ప్రతిపక్షులను అవలీలగ ఓడించివేయు అనుపమ సామర్థ్యము కలిగి యుండవచ్చు. కాని ఇచట మాత్రము లోనికి పోదలంచినచో టికెట్ ఉండితీర వలసినదే.

టి. సి. గారి ఆ జంకులేని వాక్యములను విని గత్యంతరము లేక వస్తాదుగారు తిరుగుదారి బట్టిరి. ఒక వృద్ధుడు స్టేషను లోపలికి పోవుటకై మెల్ల మెల్లగా నడచి వచ్చుచుండెను. గేటు సమీపించగనే టికెట్ కలెక్టరు అయ్యా! టిక్కెట్టు ఉన్నదా అడుగగా అతడు తన జేబులో నుండి టిక్కెట్టు తీసిచూపెను. టి. సి. గారు అతనిని సగౌరవముగ లోనికి పోనిచ్చెను.

స్టేషను ప్లాట్ ఫారం మీదకు పోవుటకు, రైలు ఎక్కుటకు అర్హత ఉండవలెను. టికెట్టు కలిగియుండుటయే ఆ అర్హత అది కలిగినవాడు ఎటువంటి వాడైనను, లోనికిపోవచ్చును. అతడు బీదవాడైనను. విద్యా విహీనుడైనను, దుర్బలుడైనను ఎవరైనను సరియే లోనికేగుటకు ఆక్షేపణ యుండదు, ఆ గేటు వద్ద జాతి, మత, కుల, లింగ, వయోవిచక్షణగాని, ఇతరకార

ణము లేనిదిగాని అడ్డురావు. టిక్కెట్టు ఉన్నచో చాలు అతడు సగౌరవముగ లోనికేగవచ్చును. అదిలేనివాడు మహాపండితుడైనను, ధనవంతుడైనను, బలవంతుడైనను అనర్హుడే యగును అతడు లోనికి పోలేడు.

నీతి :— మోక్షధామములో ప్రవేశించుటకు, మోక్ష సౌధ మధిరోహించుటకు పవిత్రహృదయమే అర్హత. నిర్మల మనస్సే అర్హత. భక్తిజ్ఞానవైరాగ్యములే అర్హత. సచ్ఛీలము, సద్గుణములే అర్హత. అట్టి అర్హత కలవాడు ఏజాతివాడైనను, ఏ కులమువాడైనను, విద్యావంతుడైనను, విద్యాహీనుడైనను, స్త్రీ అయినను, పురుషుడైనను ఎవరైనను సరియే భగవత్సాయుజ్య మొందుటకు, మోక్షధామ మలంకరించుటకు యోగ్యుడై యుండును. కావున అట్టి అర్హతను బడయుటకై సర్వులును యత్నశీలురు కావలయును.

# వాసనా దుష్ప్రభావము

ఒకానొక పట్టణమందు ఒక రైతు నివసించుచుండెను. అతడు అతి సంపన్నుడు కాడు. కడు బీదవాడు కాడు. మధ్యతరగతికి చెందినవాడు. ఒకనాడతడు తన ఆరోగ్యము సరిగ లేనందున మందు కొరకై వైద్యుని యొద్దకు వెళ్ళెను. వైద్యుడొసంగిన ఔషధము బహుకాలము సేవించినప్పటికిని అతని వ్యాధి

నయముగాకుండెను. ఎందఱో వైద్యులను, ఎన్నియో ఔషధములను సేవించెను. కాని ఆరోగ్యము కలుగకుండెను. తుట్టతుదకొక భిషగ్వర్యుడు అతని రోగమును గూర్చి బాగుగ పరిశోధనను సలిపి అది ఏదియో పైత్యసంబంధమైన వ్యాధియని నిర్ణయించి తన్నివారణోపాయమును గూర్చి రైతునకు ఈ ప్రకారముగ సూచించెను — ఓ రైతుగారూ! మీరేమి ఔషధము లేవియు సేవింప వలసిన పనిలేదు. ఒక చిన్న ప్రక్రియ ద్వారా మీ రోగము సమూలముగా తొలగిపోగలదు. ప్రతి రోజు ఒక ఉప్పుకల్లు బుగ్గన పెట్టుకొని చప్పరించుచుండుడు. ఈ ప్రకారముగ చేసినచో బహుకాలము మిమ్ములను పీడించిన ఈ రోగము పూర్తిగ నయమై పోగలదు.

వైద్యుని ఆదేశప్రకారము రైతు ఆ ప్రకారమే బుగ్గన ఒక ఘనమైన ఉప్పుకల్లు పెట్టుకుని చప్పరించుచు ఆ రసమును మ్రింగుచు నుండెను. ఇట్లుండ ఒకనాడాతని యింటిలో ఒక విందు జరిగెను. ఆవిందు కొఱకై కొన్ని మిఠాయిలు కావలసి వచ్చి రైతు పట్టణము లోని ముఖ్యమైన మిఠాయి అంగళ్ళకు వెళ్ళి భక్ష్యము లన్నింటిని కొద్ది కొద్దిగ రుచిచూడ దొడగెను. కాని ఒక్కటికూడ తీపిగా లేదు, ఉప్పగా నుండెను. అందుచే ఆ అంగళ్ళను విడిచిపెట్టి వేఱొక మిఠాయి అంగడికి వెళ్ళెను. అచట కూడ అదియే పరిస్థితి ఎదురయ్యెను. అనగా అన్ని తీపి

వస్తువులు ఉప్పగా నుండెను. అపుడా రైతునకు కోపము వచ్చి అంగడి వానితో నిట్లు దురుసుగ మాట్లాడెను — ఏమయ్యా! మీ అంగడిలో ఒక్క తీపిపదార్థము కూడ లేదే! అన్నియు ఉప్పగా నున్నవే! ఇట్లున్నచో మీ అంగడిలోని ఈ మిఠాయి దినుసులను ఎవరు కొందురు?

అంగడి యజమాని చాల తెలివిగలవాడు. తన దూరదృష్టిచే అసలు కారణము తెలిసికొని ఆ రైతుతో నిట్లు పలికెను- "మహానుభావా ! మా అంగడిలోని మిఠాయిలన్ని చక్కరతో చేయబడినవే. ఉప్పుతోగాని, కారముతో గాని చేయబడినది ఒకటికూడ లేదు ఇదిగో, ఈ చెంబులోని మంచి నీళ్ళతో మీ నోరు కడుగుకొనుడు!" అంగడివాని అభీష్ట ప్రకారము రైతు మంచినీళ్ళతో తననోరు కడుగుకొని తదుపరి మిఠాయి రుచి చూడగా అత్యంత మధురముగ, మహా స్వాదిష్టముగ నుండెను. తోడనే ఆమిఠాయి లన్నిటిని కొనుగోలు చేసి ఇంటికి వెళ్ళి విందు ఐయప్రియముగ జరిపివేసెను.

రైతునకు మిఠాయి మొదట ఉప్పగ ఎందులకు తోచెను? వాస్తవముగ మిఠాయి ఉప్పుయి ఉప్పగ లేదు. అతని నోటిలో గల ఉప్పుకల్లు వలన అట్లు తోచెను. ఆ ఉప్పుకల్లు నోటిలో ఉన్నంతవరకు అన్ని తీపి పదార్థములు ఉప్పగ తోచెను. ఉప్పదనము బాహ్యపదార్థమందు లేదు. తన నోటియందున్న

ఆవృత్తులే ఆ ఆవృత్తిదనమునకు కారణము. అట్లే అనేక జన్మార్జితములైన ప్రాపంచిక వాసనలు మనుజునియందుండుట వలన దైవకార్యము, దైవధ్యానము, దైవచింతనము అతనికి రుచించుట లేదు. మఱియు ప్రపంచము దుఃఖమయముగ అతనికి తోచుచున్నది. తన యందున్న అజ్ఞానమే దానికి కారణము. వాస్తవముగ ప్రపంచమునందంతట సచ్చిదానందపరమాత్మయే కలదు. ఆనందమయమగు ఈ జగత్తు అజ్ఞాన కారణమున జనులకు దుఃఖపూరితముగ కానవచ్చుచున్నది.

**నీతి :-** ప్రతివారును తమ యందలి కామ క్రోధాది జన్మాంతర దుష్టవాసనలను, అజ్ఞానమును వివేకముచే పారద్రోలి దృష్టిని జ్ఞానమయముగ మార్చుకొని ద్వారా జగత్తును బ్రహ్మమయముగ గాంచి పరమానందము ననుభవించ వలయును.

-:OO:-

# మహాత్ముల దినచర్య

ఒక పట్టణములో ఒక భజనమందిరము కలదు. ప్రతి దినము ఉదయము,రాత్రి అచట భజన సంకీర్తన, నామస్మరణ జరుగుచుండును. ఆ ఊరిలోని భక్తులందరు కలసి చందాలు వేసికొని ఆ భజనమందిరమును కట్టించిరి. కేవలము లౌకిక వ్యవహారమందే కాలము గడుపుచు, అమూల్యమైన సమయమును నశ్వరపదార్థ సముపార్జన మందు నిరంతరము వెచ్చించుట ప్రమాదకరమని భావించి, కొంత సమయమైనను దైవచింతన యందు, భగవత్కాలక్షేపమందు, పుణ్యసంపాదనమందు గడుపుట శ్రేయస్కరమని తలంచి ఆ ఊరియందు ఆధ్యాత్మిక పిపాసగల పెద్దలు కొందరు ఆ మందిరమును ఏర్పాటు చేసిరి. ఆ పురమందలి జిజ్ఞాసువులకు,ధ్యానపరులకు,ఆధ్యాత్మగంధము కలవారికి, తరించవలెనను ఉద్దేశము కలవారికి ఆ మందిర మెంతయో ఉపకరించుచుండెను.

ప్రతిదినము ఉదయము ఇరువదిమంది,రాత్రి ఏబదిమంది అచ్చోట సమావేశమై నియమపూర్వకముగ జపధ్యాన పారాయణ సంకీర్తనాదులను గావించుచుండిరి. ప్రతి ఆదివారము సాయంత్రము 6 గంటలకు ఆధ్యాత్మికోపన్యాసము ఒక గంటసేపు అచట జరుగుచుండును. అనుభవజ్ఞులైన వక్తలను, ప్రబోధకులను ఆహ్వానించి వారిచే రసవత్తరములైన

ఆధ్యాత్మికోపన్యాసములను చెప్పించుచుందురు. ఆదివారము నాడు ఆఫీసులకు, అంగళ్లకు, పాఠశాలలకు సెలవుదినము కాబట్టి ఆనాడు ఉపన్యాసము వినుటకై తండోపతండములుగ జనులు విచ్చేయుచుందురు. భజనమందిరమంతయు ఆనాడు జనులచే కిక్కిరిసి యుండును.

ఒక ఆదివారమునా కచట మహనీయుడు ఉపన్యాసము చెప్పుచుండెను. భజనమందిరమంతయు ఇసుకవేసిన రాలకుండు నట్లు జనులచే నిండియుండెను. శ్రోతలందరు చెవులు ఒప్ప గించి ఏకాగ్రముగ వినుచుండిరి. ఆనాటి ఉపన్యాసవిషయము మహాత్ముల దినచర్య మహనీయులు ఏ ప్రకారము తమ కాలము గడుపుచుందురో వక్త శ్రోతలకు విశదీకరించుచుండెను

ఓ భక్తులారా!

## ప్రాతర్ద్యూత ప్రసంగేన మధ్యాహ్నే స్త్రీ ప్రసంగతః
## రాత్రౌ చోరప్రసంగేన కాలోగచ్ఛతి ధీమతామ్

"మహాత్ములు ప్రొద్దున జూదసంబంధమైన దానియందు, మధ్యాహ్నము స్త్రీ సంబంధమైనదానియందు, రాత్రి చోరసంబంధ మైనదానియందు కాలము గడుపుచుందురు. అది చెప్పగనే ఆ సభలోఉన్న భోగపరాయణులు కొందరు పరమానందపడిరి. కాని వెనువెంటనే ఆ ఉపన్యాసకుడు తనవాక్యములకు ప్రకార

ముగ భాష్యము చెప్పదొడంగెను—ఓ జనులారా! నేను
చెప్పిన వాక్యములకు సరియైన అర్థమును తెలిసికొనుడు!
జూదప్రసంగము మహాభారతమందు వచ్చును. కావున మహా
నీయులు ఉదయమందు మహాభారతము చదువుచుందురని
భావము. అట్లే స్త్రీ ప్రసంగము రామాయణములోని సుందర
కాండ యందు వచ్చును. అనగా మహాత్ములు మధ్యాహ్న
సమయమున రామాయణము చదువుచుందురని అర్థము.
చోరప్రసంగమనగా నవనీత చోరుడగు బాలకృష్ణుని
ఉదంతము. అయ్యది భాగవతమున చక్కగ విశదీకరింపబడినది.
కావున మహాత్ములు రాత్రివేళయందు భాగవతము చదువు
చుందురని అర్థము. ఈ ప్రకారముగ మహానీయులు ఉదయము
భారతము, మధ్యాహ్నము రామాయణము, రాత్రి భాగవతము
పఠించుచుందురని నా వాక్యములయొక్క అర్థము-ఉపన్యాస
కుడు తన వాక్యములందలి నిగూఢార్థమును వివరించి చెప్ప
గనే సభ్యులెల్లరు పరమానందమును పొందిరి.

మహాత్ములు ఒక్క నిమిషమైనను వ్యర్థముగా
గడుపరు. నిరంతర దైవచింతనయందె వారికాలము గడుచు
చుండును. సతతం కీర్తయన్తో మాం,— అని గీతాచార్యుడు
వర్ణించిన చందమున ఏదియో యొక దైవకాలక్షేప
మందే వారికాలము గడుచుచుండును.

**నీతి :** ముముక్షువులగు వారు మహాత్ముల యడుగుజాడలలో నడచుచు, వారి ఆచరణను అను కరించుచు తమ జీవితమందు కాలమును వృథాచేయక సద్వినియోగపఱచుచు భగవత్కృపకు పాత్రులుకావల యును. అమూల్యమగు మానవజీవితమును దైవకైం కర్యమునకు వినియోగించి కృతకృత్యులు కావలెను.

# సారాసారవివేచనము

అది యొక మహాపట్టణము. విద్యాసంస్థలకు మూల కేంద్రము. ఎన్నియో కళాశాలలు, పాఠశాలలు, ఉన్నత విద్యాభ్యాసమునకై శిక్షణకేంద్రములు అచట విరాజిల్లు చుండెను. పరిసరగ్రామాదులందు గాని దూరప్రాంతములందు గాని అట్టి విద్యాసంస్థలు, కళాశాలలు లేని కారణముచే సుదూరప్రాంతములనుండికూడ పలువురు విద్యార్థులు ఆ పట్టణ మునకు వచ్చి విద్యాధ్యయనము చేయుచుండిరి. అట్టి గ్రామాం తర విద్యార్థులనిమిత్తము కొన్ని వసతిగృహములు (Hostels) కూడ కళాశాలల సమీపమున నిర్మింపబడియుండెను.

ఒకానొకదినమున ఒకకాలేజి వసతిగృహమున నివసిం చుచున్న విద్యార్థులలో కొందరిమధ్య వాదోపవాదములు

చెలరేగెను. వారిలో అహమహమికలు పొడసూపగా "నేను గొప్ప" "నేనుగొప్ప" అని వాదించుకొనుచుండిరి. ఇరువురి విద్యార్థులమధ్య ఈ స్పర్ధ మఱింత తీవ్రరూపమును దాల్చెను. వారికలహము తారస్థాయి నందుకొనెను. అపుడు వారిరువురును తమలో ఎవరు గొప్పవారో, ఎవరు శక్తిమంతులో నిర్ణయించుకొనుటకై ఒక పోటీని ఏర్పాటుచేసికొనిరి. ఆపోటీయేమనగా-"ఇరువురిలో ఎవడు ఆరు అరటిపండ్లు తొక్కతో సహా ముందుగా తినివేయునో అతడు ఘనుడు అతడు పోటీని జయించినట్లు లెక్క." ఇరువురును పోటీకి సమ్మతించి తమ యొక్క బలాబలములను పరీక్షించుకొనదలంచిరి. అందులకై సెలవదినమగు ఒక ఆదివారమును నిర్ణయించుకొని ఆ రోజు సాయంత్రము 6 గంటలకు వసతిగృహముయొక్క మధ్య హాలులో అందఱును సమావేశమైరి. పోటీదారులగు విద్యార్థులిరువురును ఎదురెదురుగ కూర్చుండిరి. వారిని సమర్థించు విద్యార్థులు వారివారి అభ్యర్థికి ప్రక్కగా కూర్చొనియుండిరి. ఇరుపక్షములవారు రోష, ఆవేశములతో నిండియుండిరి. "మావాడు తప్పక గెల్చును, మావాడు తప్పక గెల్చును" అని ఇరుపక్షముల వారును గొప్పగా చెప్పుకొనదొడంగిరి. నలుగురు పెద్దలు అచట న్యాయనిర్ణేతలుగా వ్యవహరించిరి. వారి తీర్పును శిరసావహించుటకు ఇరుపక్షములవారును సమ్మతించిరి.

పందెమును ప్రారంభించుడు-అని జడ్జీలు చెప్పుటయే తడవుగా పోటీదారు లిరువురును ఆ అరటిపండ్లు ఆరింటిని తినుటకు శీఘ్రముగా ఉపక్రమించిరి. అందు మొదటివాడు ఈ ప్రకారముగ తనలో విమర్శించుకొనెను — ఆరు అరటిపండ్లను తోలుతో సహా తినవలసియున్నదికాదా! తోళ్లు రుచిగా నుండవు. కావున తరువాత తినవచ్చును. రుచికరమగు గుజ్జులను ముందు తినివేసిన మంచిది. అని నిశ్చయించి ఆరు అరటిపండ్లయొక్క తొక్కలను ప్రక్కనబెట్టి గుజ్జులు తినివైచెను. ఆ గుజ్జులతోనే అతనికడుపు నిండుటచే ఇక తొక్కలకు ఏమాత్రము అవకాశము లేకుండెను. అందుచే అతడు ఏమియు తోచక నిశ్చేష్టుడై కూర్చొనియుండెను. ఇక రెండవ పోటీదారైన విద్యార్థి తనలో కాసెట్లు భావించుకొనెను-తొక్క తినుట కష్టము. గుజ్జు తినుట తేలిక. కాబట్టి కష్టమైనపనిని ముందుగా పూర్తిచేసినచో ఉత్తమము-అని తలంచి మొదట ఆరు అరటిపండ్లయొక్క తొక్కలను కష్టముతో తినివైచి గుజ్జులను ప్రక్కన పెట్టియుంచెను. కాని ఆ తొక్కలతోనే అతని కడుపు నిండగా గుజ్జులకు ఏమాత్రము లేకుండెను, అందుచే అతడున్ను ఏమిచేయుటకు తోచక స్తబ్ధుడై కూర్చొనియుండెను.

"ఆరు అరటిపండ్లను తోలుతో సహా తినవలెను" అను పందెపుమాటను ఇరువురిలో ఒకడుకూడ పాలింపలేకపోయి

నందువలనను, ఇరువురును ఇక మేము తినలేము అని తమ అశక్తతను వెల్లడించి నందువలనను, ఇరువురును పందెములో ఓడిపోయిరి. కాని ఎవడు అదృష్టవంతుడు? సారమగు గుజ్జు తినినవాడు. అతడు సారమైన వస్తువుతో కడుపు నింపుకొని నందువలన ఆరోగ్యముగా నుండెను. కాని రెండవవాడు అసారమైన తొక్కలను తినినకారణముచే అజీర్ణమునుకొని తెచ్చుకొని కడుపులో త్రిప్పుటచే పరమ ఆవేదనను పొందెను.

నీతి:- ఈ ప్రపంచమున రెండువస్తువులు కలవు. సారమగు పరమాత్మ, అసారమగు నామరూపములు. తెలివికలవాడు పరమాత్మ నాశ్రయించి ధన్యుడగును. నిరతిశయానందము ననుభవించును. తెలివి తక్కువవాడు నామరూప ప్రపంచము వైపు, విషయభోగములవైపు పరుగిడి దుఃఖమును కొని తెచ్చుకొనును. కావున విజ్ఞుడగువాడు సారాసార వివేచనముగలిగి సారమగు శాశ్వతపరమాత్మ నాశ్రయించి కృతార్థుడు కావలయును.

-:OO:-

# అత్యాశ

ఒకానొక గ్రామములో ఒక రైతు కలడు. అతనికి పది ఎకరముల చెఱకుతోట కలదు. అది ఒకటియే అతని జీవనాధారము. రైతాంగములో అతడు గొప్ప అనుభవము కలవాడు. పైరు పండించుట యందు అతనికి అతడే సాటి. ఏ విధముగా ఎప్పుడెప్పుడు పొలము దున్నించవలెనో, ఏయే ఎరువులు వేసినచో పైరు ఏపుగా పెరుగునో ఎక్కువఫలసాయము వచ్చుటకు పైరుకు ఏయే రక్షణలు కల్పించవలెనో, అతడు క్షుణ్ణముగ తెలిసికొన్నవాడు. చుట్టుప్రక్క ప్రాంతములో అతడు పేరుమ్రోగిన రైతు. ఎక్కువ ఆదాయము వచ్చు పంట యగుటచే అతడు చెఱకు పైరునే ప్రతి సంవత్సరము తన పొలములో పండించుచుండెను.

ఒక సంవత్సరము ఆ చెఱకుపైరు ఏపుగా పెరిగి చూచుటకు బహురమ్యముగ నుండెను. ఎరువులు విస్తారముగా వేయుటవలన గడలు లావుగా పెరిగి చూపరులకు ఆశ్చర్యము గొలుపు చుండెను. ఇట్లుండ ఒకనాడు ఆ రైతు ఉషఃకాలమున, బ్రాహ్మీముహూర్తమున నిద్రలేచి తన చెఱకుతోట వైపునకు పోవుచుండగా ఒక తెల్లటి ఏనుగు ఆ తోటలోని చెఱకు గడలను కొన్నిటిని బాగుగా మేసి ఆకసమున కెగసి క్రమక్రమముగ అంతర్ధానమై పోవుటను గమనించెను. మఱు

నటి రోజు కూడ అట్లే జరిగెను. రైతు ఆశ్చర్యచకితుడై 'ఈ ఏనుగు ఎచటనుండి వచ్చుచున్నది! ఎచటి కేగుచున్నది!' అని తెలిసికొన దలంచినవాడై ఒకనాటి రాత్రి యంతయు ఆ చెఱుకు తోటలోనే నిగా వేసియుండెను. అర్ధరాత్రివేళ ఆకసము నుండి ఆ తెల్లటి ఏనుగు క్రిందకు దిగుటయు, తెల్లవారువఱకు చెఱుకు గడలను భక్షించి తదుపరి ఆకసమున కెగసి పోవుటయు గమనించెను. దాని నివాసస్థాన మేదియో కనిపెట్ట దలంచిన వాడై ఒకనాడా రైతు అది పారిపోవు సమయమున దాని తోక పట్టుకొనెను. అది పోయి పోయి స్వర్గలోకమున కాతనిని చేర్చెను. అపుడు స్వర్గలోకమున గల ఐరావతమే అది యని అతడు గమనించి చాల సంతోషపడి ఆ లోకమున అచటచట చెల్లాచెదురుగా పడియున్న బంగారమును మూట గట్టుకొని మరల అర్ధరాత్రి సమయమున ఆ ఏనుగు భూలోకమునకు దిగునపుడు దాని తోక పట్టుకొని భూతలమునకు వచ్చెను.

ఈ ప్రకారముగ అతడు భూలోకమునకు తిరిగి వచ్చి ఆ బంగారమును దాచి పెట్టుకొని మహా శ్రీమంతుడై యుల రార కొచ్చెను. ఆ గ్రామస్థులలో అతని సన్నిహిత మిత్రులు కొందఱు అతని సౌభాగ్యమునకు కారణమడుగగా రైతు జరిగిన దానినంతను పూస గ్రుచ్చినట్లు చెప్పివైచెను. అదివిని ఆ స్నేహితులుం తాము కూడ స్వర్గమునకు పోయి బంగారము

తెచ్చుకొని సంపదలతో తులతూగ దలంచినవారై, మరునటి దినము తెల్లవారుజామున తమ మిత్రునితో బాటుచెఱకు తోటకు పోయిరి. సరిగా తెల్లవారుజామున ఆ యేనుగు ఆక సమున తెగయుచుండగా ముందుగా తోటయజమాని దాని తోక పట్టుకొనెను. అతడు పైకి పోవుచుండగా అతని కాళ్ళు మఱియొకడు పట్టుకొనెను. అతడు పైకి పోవుచుండగా అతని కాళ్ళు వేఱొకడు పట్టుకొనెను. ఈ ప్రకారముగ దాదాపు యాభైమంది ఒకరి కాళ్లు మఱియొకరు పట్టుకొని ఒక గొలుసు మాదిరి యేర్పడి పైకి పోవుచుండిరి. దాదాపు కొన్ని మైళ్లు పైకి పోగా అందొకడు ఏనుగు తోక పట్టుకొనిన తన రైతు సోదరునితో "అన్నయ్యా! ఇప్పుడు మనం ఎక్కడికి పోతున్నాం? అని ప్రశ్నింపగా "స్వర్గానికి" అని అతడు బదులు చెప్పెను. స్వర్గంలో ఎంత బంగారం ఉంది? అని ఆశాపీడితుడై యతడు తిరిగి ప్రశ్నింప ఇంత ఉన్నది అని ఆ రైతు తన రెండు చేతులను వెడలపరచి చూపించెను. ఆ వెడలపఱచుటలో ఏనుగు తోకను వదలివేయుట వలన అమాంతముగ అతడు క్రింద పడిపోవ నారంభించెను. అతనితో బాటు అతని కాళ్ళు పట్టుకొనిన వారందరు కూడ క్రింద పడిపోయి పతలు చితికి సర్వనాశనమై పోయిరి. దురాశ చేటు తెచ్చునను నానుడిసార్థక మయ్యెను. కొద్దిసేపు మౌనము వహించి యుండినచో, ఆశకు వశముకాక యుండినచో వారందరును స్వర్గముచేరి కావలసినంత బంగా

రమును మూటగట్టుకొని భూలోకమునకు సురక్షితముగ వచ్చియుండెడివారు. కాని ఆశకు దాసులై వారు అధఃపతనము నొందిపోయిరి.

నీతి : మానవుడు ఆశా పిశాచమునకు లొంగక, అద్దానిని తన దరికి చేర్చక, భగవంతుడిచ్చినదానితో సంతృప్తిపడి వచ్చిన పని(దైవ సాక్షాత్కారము) పూర్తి చేసికొనుట మంచిది.

## పాపఫలము

ఒకానొక పట్టణమందు ఒక గజదొంగ యుండెను. అతడు తన జీవితకాలములో ఎన్నియో దొంగతనములుచేసి పట్టుబడి, జైళ్ళలో శిక్ష అనుభవించుచు, శిక్షాకాలము పూర్తి కాగానే విడుదలయై, మరల దొంగతనము చేయుచునుండెను. ఎన్నియో శిక్షలు పడినను అతనిలో రవ్వంతైనను పశ్చాత్తాపము జనించలేదు. పైపెచ్చు దొంగబుద్ధి తీవ్రతరముగుచుండెను.

ఇట్లుండ ఒకనాడాతడున్న పట్టణమునకు ఒక గొప్ప భాగవతారు వచ్చి హరికథా కాలక్షేపము చేయుచుండ,

ఊరిలోని ప్రజలు వేలసంఖ్యలోవచ్చి శ్రవణము చేయుచుండిరి భాగవతారుగారి పేరు ప్రఖ్యాతులు వినిన గజదొంగ ఆనాటి హరికథా కాలక్షేపమునకు తానుకూడ విచ్చేసి శ్రవణానంద ముగ వినుచుండెను. కథా సందర్భమున అస్తేయము [దొంగ తనము చేయకుండుట) అను పరమధర్మము యొక్క ప్రస్తావన రాగా దొంగతనము చేయువారు, పరులసొత్తు అపహరించు వారు రౌరవాది నరకములను బొంది నానావిధములగు బాధ లను అనుభవింతురు. కాబట్టి ఎవరును అట్టి దుర్గుణమును ఆశ్రయించ రాదు — అని కథకుడు ఎలుగెత్తి వక్కాణించెను. ఆ వాక్యములు గజదొంగ చెవిని బడగనే అతడు హృదయ ములో ఒక కల్లోలము రేకెత్తెను. ఇంటికివచ్చి అతడు తనలో ఇట్లు చింతనచేయ దొడగెను.

"ఘోర నరక బాధలకు కారకములైన ఈ పాడు దొంగతనములను చేసి చేసి అమూల్యమైన ఈ మానవ జీవిత మునంతను నాశనము చేసికొంటిని. ఇక శేషించిన స్వల్ప జీవితమును పవిత్రముగ గడుపుచు అపాడు వికారమునకు మనస్సులో తావొసంగక యుండుట ఉత్తమము. పాపము చేయుట ఏల! నరకబాధలను అనుభవించుట ఏల! — ఇట్లు వితర్కించుకొని దొంగతనమును పూర్తిగా విసర్జించుటకు అతడు నిశ్చయించుకొనగా, బహుజన్మార్జితములైన తక్కరత్వ

సంబంధవాసనలు హృదయములో దాగియున్నవి. ఒక్కుమ్మడి పైకుబికి అతని సదాలోచనలకు అంతరాయమును కలిగించెను

జన్మ జన్మాంతరములనుండి అలవాటుగా వచ్చుచున్న ఈ సంప్రదాయమును మార్చుకొనుట వెఱ్ఱికాక మఱేమి! అని ఆ పాతవాసనలు అతనిని ఉద్బోధించినవి. ఆ రెండు సంస్కారముల మధ్య నలిగిపోయిన ఆ గజదొంగ ఆలోచనలో పడిపడి చిట్టచివరకు ఈ విధమగు నిర్ణయమునకు వచ్చెను.

“దొంగతనము పాపహేతువు అనునది న్యాయము. ఆ పాడుగుణమును ఎంత శీఘ్రముగ హృదయసీమనుండి బహిష్కరించిన అంత శ్రేయస్కరము. అయితే దొంగతనమునకు అలవాటుపడిన మనస్సు కాబట్టి ఒక్కుమ్మడి తెగతెంపులు చేసుకొనుట యుక్తము గాదు. కావున కడసారి ఒక్క పర్యాయము దొంగతనమును చేసి ఇక దానికి భరతవాక్యము పలికెదను! అని నిర్ణయించి చివరి దొంగతనము కాబట్టి చిన్న చిన్నవారి ఇండ్లలో చేసిన ప్రయోజనము లేదని భావించి రాజాగారింట్లో కన్నము వేయుటకు నిశ్చయించెను. తదీయాభీష్టము నిరాటంకముగ, నిర్విఘ్నముగ విజయవంతము కొనసాగు నిమిత్తము అందులకై చక్కని ముహూర్తము ఏర్పరచుకొనుటకుగాను ఒకానొక జ్యోతిష్యుని యొద్దకు పో

తన యభిప్రాయమును తెలియజేయగా అతడు భయపడి రాజుగారింట్లో దొంగతనము చేయుటకు ముహూర్తము పెట్టనే పెట్టననియు, అది ఇరువురకును మహా ప్రమాదకరమనియు జ్యోతిష్కుడు దొంగతో చెప్పెను. వెనువెంటనే దొంగ జ్యోతిష్కుని చెవిలో రహస్యముగా చెవిసగం స్వాహా అని పలుకగా అనగా రాజుగారింటిలో దొరికిన సొత్తులో సగభాగము నీకు దక్కును-అని సూచించగా జ్యోతిష్యుడు ఆనందపరవశుడై తోడనే ఒకానొక నిశీథలగ్నమును ఏర్పాటుచేసి అతనికి తెలియజేసెను.

ఆ లగ్నప్రకారము దొంగ అర్ధరాత్రివేళ రాజభవనమున అందరు నిదురించుచుండగా ప్రవేశించి తనకు దొరికిన వస్తువులనెల్ల కాజేయుచు, సంచులు సంచులు నింపుకొనుచు-ఇదియే ఆఖరు దొంగతనము కావున ఎక్కువ సంపదను స్వీకరించి వెళ్లుట భావ్యమని తలంచి వేళ ఎంతైనదియూ లెక్కసేయక, తెల్లవారేవరకు దొంగతనము చేయదొడగెను. ఉషఃకాలమున రాజభటులు నిద్రలేచి దొంగను పట్టుకొని రాజుయొద్దకు గొనిపోవ రాజు విచారణచేసి, అతడు దోషియని నిర్ధారణచేసి, వీపుపై నూరు దెబ్బలు కొట్టులాగున శిక్ష విధించెను. భటులా ప్రకారమే కొట్టుచుండ, యేబది దెబ్బలు కొట్టిన పిదప దొంగ భటులతో అయ్యా! ఇక అవుడు. నా

వంతు పూర్తి అయినది ఇక తక్కిన యాభై దెబ్బలు వేరొక నికి చెందినవి. అని చెప్పగా భటులు ఆశ్చర్యచకితులై వాడె వడని ప్రశ్నింప దొంగజరిగిన వృత్తాంతమంతయు చెప్పి జ్యోతి ష్కుని చిరునామా తెలియజేసెను. భటులు సత్వరమే పోయి దొంగతనమునకు లగ్నము పెట్టిన జ్యోతిష్కునిపట్టి తెచ్చి, "సంసర్గం స్వాహా"—అను సిద్ధాంతము ననుసరించి రాజభవ నములో లభించిన నూరు దెబ్బలను పొత్తులో సగము వంతు జ్యోతిష్కునకు చెందవలెను కాబట్టి-తక్కిన యాభై దెబ్బలు వాని వీపుపై బాది పంపించివేసిరి.

పాప ఫలితము చాల దారుణమైనది. జీవుడు ఏనాటికైనను పాపఫలమగు దుఃఖమును అనుభవించియే తీరవలెను ఇహలోకమున రాజదండనను, పరలోకమున యమదండనను అను భవించుచు పాపి నానా యాతనలను పొందుచుండును.

కర్తా కారయితాచైవ
ప్రేరకశ్చానుమోదకః

అనునట్లు పాపకార్యము చేసినవాడు, చేయించినవాడు, ప్రేరణ కావించినవాడు, అమోదించినవాడు-అందరును పాప ఫలమగు శిక్షను బొందుదురు.

నీతి :- సుఖమును శ్రేయస్సును వాంఛించు ప్రతివారును పాపమునకు తిలాంజలి యొసంగి, పాప కార్యములను దరికి చేర్చక, పుణ్యకార్యములనే, దైవ కార్యములనే ఒనర్చుచు, భగవదనుగ్రహమునకు పాత్రులై పరమానంద మనుభవించ వలయును.

# చంచల వైరాగ్యము

ఒకానొక గ్రామమునందు ఒక రైతు కుటుంబము కలదు. భార్య, భర్త, ముగ్గురు కొమారులు, ఒక కొమార్తె గల ఆ కుటుంబము ప్రశాంతముగా జరిగిపోవుచుండెను. వారిలో ఏ విధమైన వైమనస్యములుగాని, మనఃస్పర్థలుగాని, అభిప్రాయ భేదములుగాని లేకుండెను. కాని ఒకనాడు విధివశాత్తు ఏదియోయొక సమస్యపై భార్యాభర్త లిరువురకును తగవు సంభవించెను. ఇరువురును తీవ్రముగ వాదోపవాదములు చేసికొనిరి. అరచుకొనిరి. అతృప్తభావముగ కుటుంబ కార్యములు కుంటుపడసాగెను. గృహకృత్యములు సరిగా జరుగకుండెను, ఇంటిలో నలువైపుల అశాంతి చెలరేగెను. ఆ కారణమున రైతునకు మనశ్శాంతి కొరవడెను. హృదయమున ఏమాత్రము

స్థిమితము లేక అతడు బాధపడుచుండెను. గృహము కారా గృహముగ అతనికి తోచెను.

ఇట్టి అశాంత వాతావరణమును భరించలేక ఒకనాటి అర్ధరాత్రి సమయమున ఆ గృహస్థుడు లేచి ఇంటిలో ఎవరికిని చెప్పకుండ, ఎవరికిని తెలియకుండ పరారియైపోయెను. పోయి, పోయి, కొన్నిరోజులపాటు ఏకధాటిగ ప్రయాణముచేసి తుట్ట తుదకు ఒకానొక గ్రామ పరిసరమున ఏకాంత ప్రదేశమునగల ఆశ్రమమును చేరుకొనెను. ఆశ్రమాధిపతియగు సాధువుగారికి రైతు వినయపూర్వకముగ సాష్టాంగ నమస్కార మాచరించి తన వృత్తాంతమును ఈ ప్రకారముగ తెలియజేసెను. "మహా ప్రభో! ఈ దీనుని రక్షించుడు! కాపాడుడు! దరికిజేర్చి దీవించుడు! సంసారకూపమునబడి పెక్కు ఇడుములపాలై నానా యాతనల ననుభవించి, ఆ దుర్భర వేదనలను సహింపలేక, అశాంతికిలోనై తమ సన్నిధానమునకు వచ్చినాను. శాంతిని అనుగ్రహించుడు! తమ పాదపద్మములచెంతనే యుండునట్లు ఆశీర్వదించుడు. తమ దివ్య బోధామృతధారలచే మదీయ సంతప్తహృదయమును చల్లార్చుడు! దేవా! నా మనస్సు శాంతిని నోచుకొనలేక, గృహచ్ఛిద్రములందు సతమతమై జీవితముపై రోత గలిగియున్నది. శాంతిని ప్రసాదించు సద్గురువు యొక్క అన్వేషణకై నేను బయలుదేరి బహుదూరము ప్రయా

ణముచేసి తమపావనసన్నిధిని చేరితిని. తమదర్శన భాగ్యముచే నా జన్మ పావనమైనది. ప్రభో! నాకు మనశ్శాంతి కలుగులాగున ప్రబోధము సలుపుడు! పాహిమాం, పాహిమాం, పాహి!!

ఇవ్విధముగ ప్రార్థనచేసి ఆ గృహస్థుడు మౌనము వహించియుండ, సాధువుగారు తీవ్ర వైరాగ్యోపేతుడైన ఉత్తమశ్రేణికి చెందిన శిష్యుడే లభించెనని లోలోన సంతసించి "నాయనా! అసలు నీకీ వైరాగ్యభావన ఏకారణముచేత కలిగినది? లేక ధననష్టమేమైన వాటిల్లినదా? లేక ఎవరైన నిన్ను అవమానించిరా? ఉన్నది ఉన్నట్లుగ తెలియజేయుము. ఇవ్విషయమున దాపరికము పనికిరాదు. రోగి వైద్యునివద్ద తన హృదయమును తెరచి చెప్పులాగున నీ హృద్గతభావము లన్నిటిని దాచుకొనక వెల్లడిచేయుము" అని ప్రశ్నింపగా అంతట ఆ గృహస్థుడు తన యనుభవములన్నిటిని పూసగ్రుచ్చినట్లు ఈ ప్రకారముగ చెప్పివైచెను —

"గురుదేవా! నాకును నాఅర్ధాంగికిని కొన్ని విషయాలపై అభిప్రాయభేదములు కలుగగా ఇరువురిమధ్యను తీవ్రవాదోపవాదములు చెలరేగగా, మనస్సు విసిగి ఆ వాతావరణమే నాకు సరిపడకపోవుటచే ఒకనాటిరేయి ఎవరికీ చెప్పకుండా ఇల్లువిడచి వచ్చివేసితిని—ఆ వాక్యములను విని గురువు

అయితే ఇప్పుడు నీ యభిప్రాయ మేమి? ఆశ్రమములో ఎప్పటికి
నీవు ఉండదలచితివా? లేక కొద్దిరోజులు మాత్రమే ఉండి మరల
ఇంటికి వెళ్ళదలంచితివా! అని ప్రశ్నింప అందుల కాతడు
జలనిధులింకుగాక, కులశైలము లేడును గ్రుంకుగాక, నేను ఇంటి
గడప త్రొక్కనే త్రొక్కను మహాత్మా! అని విన్నవించుకొని
తురీయాశ్రమమగు సన్న్యాసమును అనుగ్రహించవలసినదిగా
వేడుకొనెను.

గృహస్థుని ఆ వాక్యములను వినగానే ఆశ్రమాధిపతి
యైన ఆ సాధువుగారు అతని అతి వైరాగ్యమునకు అచ్చెరువు
నొంది ఈవిధముగ వచించెను —

నాయనా! సన్న్యాసగ్రహణమను నీ సంకల్పము, చాల
పవిత్రమైనదే అయినను తొందర పడరాదు. ఇంటివద్దనే
కొంతకాలముండి చక్కగ జపధ్యానాదులను గావించుకొనుచు
వైరాగ్యభావన మనస్సునందు బాగుగ స్థిరపడిన మీదట
సన్న్యాస విషయమై ఆలోచించుకొనవచ్చును. కాబట్టి ఇపుడు
ఇంటికి వెళ్ళి మనస్సును కుదుట పరచుకొని శాంతముగ నీ
ఆధ్యాత్మిక కార్యక్రమమును కొనసాగించుకొనుము.

గురుదేవుని ఆ వాక్యములు వినగనే గృహస్థునకు గొప్ప
ఆవేదన కలిగి తోడనే యిట్లు విన్నవించుకొనెను - మహాశయా!
నాకు యింటికి వెళ్ళుటకు ఏమాత్రము మనస్కరించుట లేదు.

దయచేసి నాకు సన్న్యాసమును అనుగ్రహించి తమ ఆశ్రమముననే స్థానమును కల్పించుడు అది విని సాధువుగారు అతని వైరాగ్యమును పరీక్షించదలచి నాయనా! ఒకవేళ నీకు సన్న్యాసమిచ్చితి ననుకొనుము కొన్నాళ్ళకు నీధర్మపత్ని నీవిచట ఉన్నట్లు తెలిసికొని ఇచ్చటకువచ్చి ఇంటికిరమ్మని నిన్ను ప్రార్థించుచుపడినచో అపుడేమి చేయుదువు? అని ప్రశ్నింప అప్పటిసంగతి అప్పుడు ఆలోచించుకొనవచ్చునులెండి అని జవాబిచ్చెను. ఆ వాక్యములకు గురువుగారు ఆశ్చర్యపడి అతని చంచల వైరాగ్యమును గూర్చిన చక్కటి పరిచయమును బొందినవారై అతనికి భోజనముపెట్టి పంపించివైచెను.

నీతి :- వైరాగ్యము బాగుగ దృఢపడినపుడు మాత్రమే సన్న్యాస విషయము యోచించవచ్చునుగాని అంతకు ముందు కాదు. త్వరపడి సన్న్యసించినచో ఉభయభ్రష్టత్వము కలుగుటకు అవకాశము ఉండును. శ్మశాన వైరాగ్యమును పురాణ వైరాగ్యమును ఆశ్రయించక సాధకుడు దృఢవైరాగ్యమును జేబట్టవలెను. చక్కటి విచారణద్వారా దృశ్యవస్తువుల యొక్క నశ్వరత్వమును గుర్తెఱిగి నిశ్చలవైరాగ్యము, అచంచల దైవభక్తి కలిగి మోక్షమునకై తీవ్రయత్నము నాచరించవలయును.

-:OO:-

# దర్పమునకు తగిన శాస్తి

ఒకానొక దేశమును ఒక మహారాజు పరిపాలించు చుండెను. తాను ఒక గొప్పరాజననియు, దేశప్రజలందరికిని ఏకచ్ఛత్రాధిపతి యనియు, తన్ను మించినవారు ఎవరును లేరనియు,తన ఆజ్ఞ సుగ్రీవాజ్ఞవలె చెల్లుబడి అగుచున్నదనియు ప్రజలందరును తన బానిసలనియు, అందరును తన చెప్పుచేత లలో మెలగుచున్నారనియు భావించుచు కన్నుమిన్ను కానక ప్రవర్తించుచుండెను. మూర్తీభవించిన దర్పమాయనునట్లు లోకులకతడు తోచుచుండెను. తన చండశాసనములను అమలు పఱచుచు, శాసనమును అతిక్రమించినవారిని దండించుచు, నిర్దాక్షిణ్యముగ హింసించుచు హిరణ్యాక్షుడువలె వ్యవహరించుచుండెను. అతని పరిపాలనయెడల ప్రజలు తీవ్ర అసంతృప్తి కలిగియుండిరి.

ఇట్లుండ ఒకనాడతడు తన దేశములోనున్న పండితు లందరిని పిలపించి ఓ పండితోత్తములారా! మీరందరు కలసి నాపై ఒక మహాభారతమును వ్రాయవలెను.ఆరు మాసముల గడువు ఇచ్చుచున్నాను. ఈ ఆరుమాసములు మీ పోషణకు మీకుటుంబ పోషణకు నేనే చక్కని ఏర్పాట్లను చేసెదను.మీ రేమియు బాధపడ నక్కఱలేదు. ఒక వేళ ఈ ఆరునెలలైన పిదప నేను చెప్పిన ఈ కార్యమును అనగా నాపై భారతమును

వ్రాయుటను, మీరు పూర్తి కావింపనిచో నా దేశమునుండి మీ రందరిని కుటుంబ సమేతముగా బహిష్కరించివేసెదను. ఈ వాక్యము ను బాగుగ జ్ఞాపక ముంచుకొని నేను చెప్పినపని చేయుడు — అని గద్దించి పలికెను.

ఆ వాక్యములను విని పండితవర్యులందరును భీతిచే విహ్వలురై కిక్కురుమనకుండ వెడలిపోయిరి. రాజయొక్క దర మునకు వారందరును ఆశ్చర్యచకితులైరి. ఏమి చేయుటకును వారికి తోచలేదు. ఒక వ్యక్తిపై భారతము వ్రాయుట ఎట్లు! అది సాధ్యపడని విషయము కాని రాజాజ్ఞ కావున వ్రాసి తీర వలెను. వ్రాయకున్నచో ఇక గంప నెత్తిన బట్టుకొని ఊరు వదలిపోవలసినదే. ఇట్టి విపరీత విపత్కర పరిస్థితిని ఎదుర్కొన వలసివచ్చిన ఆ పండితులందరును ఒకచోట సమావేశమై తమలో తాము ఈ విషయమై వితర్కించుకొనసాగిరి. చిట్ట చివరకు ఒక వ్యక్తిపై మహాభారతము వ్రాయుట సాధ్యమగు పని కాదని ఏకగ్రీవముగ తీర్మానించుకొని వారివారి ఇండ్లకు వెడలిపోయిరి.

కాలము గడవజొచ్చెను. దినములు వారములుగను వారములు నెలలుగను మారుచుండెను. రాజుగారు పండితు లందరికిని భోజనభాజనములను వలసిన పదార్థములను బండ్లతో పంపుచుండెను. పండితులకు రాజభోజనములు జరుగుచున్నను

మనస్సు మాత్రము దిగులుతో దుఃఖముతో నిండియుండెను. గడువు సమీపించినకొలది వారి చిత్తములు నానావిధములుగ పరిభ్రమణ మొందుచుండెను. కింకర్తవ్యవిమూఢులై వారు దినగండముగ రోజులను గడుపుచుండిరి.

ఈ విధముగ ఐదుమాసములు గడచిన పిదప ఒకనాడు రాజు ఆ పండితులందరిని తన ఆస్థానమునకు పిలిపించుకొని ఓ పండితులారా! నేను చెప్పిన పని ఎంతవరకు వచ్చినది! నాపై మీరు వ్రాయుచున్న భారతములో ఇప్పటికి ఎన్ని పర్వములు పూర్తి అయినవి! వ్రాత నిరాటంకముగ కొనసాగిపోవుచున్నదా! మీకు భోజన వసతులు బాగుగ లభించుచున్నవా! వానిలో ఏదైన లోటుబాట్లున్నచో తెలిపిన యెడల ఇంకను చక్కని ఏర్పాట్లు చేయగలను. గడువు ఇంకను పదిరోజులుమాత్రమే యున్నది. కాబట్టి పని చురుకుగా జరుగునట్లు చూడవలసినది అని పలికెను.

ఆ వాక్యములను వినగనే పండితులలో వయోవృద్ధుడు జ్ఞాన వృద్ధుడు అయిన ఒకాయన రాజుతో నిట్లు విన్నవించు కొనెను—భూపాల! మీ ఆజ్ఞను శిరసావహించుటకై మేము సర్వసన్నద్ధులమైయుండి ఒక శుభముహూర్తమున అందరమును కలము కాగితమును తీసికొని శ్రీకారము చుట్టితిమి. కాని వెంటనే మాకొక ధర్మసందేహము ఎదురైనది. భారతములో

పంచపాండవులు రాజ్యమును వదలి పండ్రెండుసంవత్సరములు అడవులలో ఉండవలసి వచ్చెను. మరి దేవరవారు రాజ్యమును వదలుటకు సిద్ధముగా ఉన్నారో లేదో యనియు, ఒకవేళ సిద్ధముగా నున్నచో ఎన్నిసంవత్సరములు అరణ్యములో ఉండదలంచిరో అనియు సంశయములు హృదయింపగా మనస్సు అశమక చెంది వారిని నిలిపివైచి మీతో ఆ విషయములు సంప్రదింప దలంచుచుండగా కాకతాళీయముగా మీరే మమ్ములను కబురుచేసిరి. భూసురోత్తమా! మా సంశయములను తీర్చుడు. రాజ్యమును ఎప్పుడు వదిలెదరో ఏఅరణ్యమునకు పోదలంచిరో అచట ఎన్నాళ్ళు ఉండదలంచితిరో వెంటనే తెలుపుడు'.

పండితోత్తముని ఆ వాక్యములకు వినగనే రాజు స్తంభించిపోయెను. ఏమి ప్రత్యుత్తర మీయవలెనో తోచక అట్లాయినచో ఓ పండితులారా! నాపై భారతము వ్రాయ నక్కఱలేదు. వెడలిపొండు. అని చెప్పివేసెను. పండితులందఱును వారివారి యిండ్లకుపోయి గండము గడచుటచే ఆనందముతో చిందులు త్రొక్కసాగిరి. అంతయు భగవత్కృపయని దలంచి సంతుష్టాంతరంగులైరి.

దర్పము పనికిరాదు. అది మహాదుర్గుణము. తన్ను మించినవారు లేరనుకొని అహంకరించి ప్రవర్తించుట మంచిది

కాదు. దుంభదర్పాదులు కలిగి కన్నుమిన్ను తెలియక ప్రవర్తించిన వారెందరో పతనమైపోయినట్లు చరిత్ర సాక్ష్యమిచ్చు చున్నది.

**నీతి : దర్పమను దుర్గుణముల నెవరును దరికి చేర్చరాదు. అసురసంపదను పారద్రోలి పవిత్ర జీవితమును గడపవలెను. శాంతిసుఖములకు మార్గమిదియే.**

# భక్తిపుష్పము - జ్ఞానఫలము

భక్తి వికసించి జ్ఞానముగ నెట్లు పరిణమించునో యోగవాసిష్ఠమున ప్రహ్లాదోపాఖ్యానమున చక్కగ నిరూపింపబడినది ప్రహ్లాదుడు తన పూజాగృహమున అనన్య భక్తితో శ్రీమన్నారాయణుని పూజించుచు, ధ్యానించుచు నుండెను. చాల కాల మట్లు అనవరతము నారాయణుని సేవించుచునుండ ఒక నాడు అకస్మాత్తుగ అతని ధ్యేయమూర్తియగు శ్రీమన్నారాయణుడు శంఖ చక్ర గదాధారుడై ప్రహ్లాదుని పూజామందిరమున ప్రత్యక్షమయ్యెను. బహుకాల వాంఛితము నెరవేర ప్రహ్లాదుడు మహదానందభరితుడై విష్ణు భగవానుని స్తోత్రము

చేసెను. నారాయణునకు సంతుష్టుడై ఏదియైన వరమును కోరు
కొనుమని ప్రహ్లాదుని యాదేశించెను. ప్రహ్లాదుని కేమి యా
లోచన లేదు. 'ఏవరమును కోరుకొందును? ముల్లోకములందును
అతి శ్రేష్టమగు వస్తువేద్దియో దానిని కోరవలెను. జీవునకు
శాశ్వత సుఖప్రాప్తికి సహాయపడునది యేదియో దానినే
అడుగవలయును. అట్టి వస్తువెయ్యది? ధనధాన్య వస్తుసంప
దలా? స్వర్గభోగములా? కావు అవి నశ్వర సుఖమునే కలుగ
జేయును. మరి అనంత సుఖ సంపాదకమగు పదార్థ మేదియై
యుండును? సర్వజ్ఞుడగు పరమాత్మకే ఆ విషయము లెస్సగ
తెలిసియుండును. కావున అతనినే అడిగెదను.' అని నిశ్చయించి
శ్రీమన్నారాయణునికి నమస్కరించి మహాప్రభో ! అన్ని
వరములలోను ఉత్తమమైన వర మేదియో తామే యోచించి
నాకు ప్రసాదింపుడు అని ప్రార్థించెను. అత్తరి విష్ణుభగవానుడు
బాగుగ ఆలోచించి ప్రహ్లాదా! ఆత్మ సాక్షాత్కారము కలుగు
వరకు నీయందు చక్కని జ్ఞానవిచారణ కలుగుగాక అని చెప్పి
విష్ణు వంతర్ధానమయ్యెను. భగవానుడు ప్రహ్లాదునకు నేరుగా
మోక్షమును ప్రసాదించక, మోక్షప్రాప్తికి వలసిన బుద్ధి
యోగము నొసంగెనన్నమాట "దదామి బుద్ధి యోగం" అను
గీతావాక్యము ప్రహ్లాదుని విషయములో చరితార్థమయ్యెను.
ఒక్క ప్రహ్లాదుని విషయమేమి, ఏ యే భక్తులు ప్రీతిపూర్వక
ముగ నిరంతరము సర్వేశ్వరుని స్మరించుచుందురో అట్టివారిం

దరిని పరమాత్మ ఇట్టి జ్ఞాన విచారణాశక్తిని ప్రసాదించగలడు. తద్ద్వారా వారు మోక్షము నొందగలరు. విష్ణుభగవానుడు అంతర్ధానమైనవెంటనే ప్రహ్లాదుడు నే నెవరు? ఈ జగత్తు ఎట్లు ఆవిర్భవించినది? జీవుని వాస్తవస్వరూప మెద్ది? పంచ కోశములనుండి ఆత్మను వేరుపరుచుట ఎట్లు? ఈ ప్రకారముగ తత్త్వ వివేచనముచేసి, దృశ్యరూప ఆవరణచే కప్పబడియున్న దృక్స్వరూపమగు ఆత్మను బాగుగ తెలిసికొని ఆవరణ భంగ మొనర్చుటద్వారా అట్టి ఆత్మను లెస్సగ సాక్షాత్కరించుకొని జీవన్ముక్తుడై నిరతిశయానందము నొందెను. ఈ ప్రకారముగ ప్రహ్లాదుని కైవల్యప్రాప్తికి అతని అనన్య భక్తియే మూల కారణమై యున్నట్లు విజ్ఞులు తెలిసికొనగలరు. కాబట్టి సాధ కులగువారు భక్తిని ఆధారముగ తీసికొని తద్ద్వారా భగవదను గ్రహముచే జ్ఞానము (బుద్ధియోగము)ను బడసి అట్టి జ్ఞాన ముచే స్వస్వరూప సాక్షాత్కారమునొంది తరించుట శ్రేయ స్కరము. ఇదియే ముముక్షువునకు చక్కని రాజమార్గము.

**60. భక్తిచే జ్ఞానము లభించును కావున మోక్షప్రాప్తికై జీవుడు భక్తిని చక్కగ అభివృద్ధిపఱచు కొనవలయును.**

-:OO:-

# ఆషాఢభూతి

ఒకానొక ఊరుబయట ఒక ఆశ్రమము కలదు. అందొక సాధువు నివసించుచు తన తపోధ్యానానుష్ఠానములను గావించు కొనుచుండెను. అతనికి కొందఱు శిష్యులుకూడ నుండిరి. వారందరున్ను గురువుయెడల అపరిమిత విశ్వాసము కలవారై శ్రద్ధాభక్తులతో అతనికి సేవ సలుపుచుండిరి. ప్రతిదినము గురువుగారు ఉషఃకాలముననే నిద్రలేచుచు, తక్కినవారినికూడ లేపుచు, ప్రాతఃకాల సామూహిక ప్రార్థనా పారాయణాదులను గావించుచు, తాను సత్ప్రవర్తన కలిగి తక్కినవారినికూడ సదాచారపరులుగ తయారు చేయుటలో నిక్కటముగ తోడ్పడుచుండెను.

ఇట్లుండ కొంతకాలమునకొక నూతన శిష్యుడు గురుదేవునకు సేవచేసి తరింపదలచి అవకాశము కోరుచు అభ్యర్థించు టకుగాను ఆశ్రమమునకువచ్చి గురువునకు ప్రణామం మొనర్చి యిట్లు ప్రాధేయపడెను— మహాత్మా! దుర్భరమైన ఈసంసార దావాగ్నియందు కుమిలిపోవుచు దిక్కుతోచక పరిభ్రమించు చున్న నాపై తమ కరుణా కటాక్ష వీక్షణములను ప్రసరింప జేసి ధన్యునిగ జేయుడు. ఈ భీకర సంసార సంకటములనుండి నన్ను రక్షించి దరికిచేర్చి దీవింపుడు. దేవా! బహుకాలము నుండి గురువుకొఱకై అన్వేషించుచు శిష్యవిత్తాపహారులగు

సద్గురువు యెచట లభించునా యని వెదకుచు అదృష్టవశాత్తు
మిమ్ములను కనుగొని, నా యభీష్టము నెరవేరినదని లోలోన
సంతసించుచు తమ పవిత్ర సాన్నిధ్యమున నా శేషజీవితమున
గడుప దలంచి యిచటికి వచ్చినాను. దేవా! ఆర్తత్రాణ
పరాయణులును, శిష్యసంతాపహారులును అగు తమరు నాపై
కృపా దృష్టిని వర్షించి, తమ ఆశ్రమములో నాకు స్థానము
నొసంగి తమ సేవాభాగ్యమును కలుగచేయవలసినదిగా వినమ్ర
తనై ప్రార్థించు చున్నాను. నా ప్రార్థనను తాము అంగీకరించి
తమ భవ్యసదుప దేశములచే నన్ను కడతేర్చగలరని ఆశించు
చున్నాను, అని అంజలి ఘటించి విధేయుడై ప్రార్థింప, అతని
వినయమునకు భక్తిశ్రద్ధలకు అచ్చెరువొంది గురుదేవుడతని
తన ఆశ్రమములో అంతేవాసిగ చేర్చుకొనెను.

అప్పటినుండియు అతడు గురువునకు సచ్ఛిష్యుడుగ
నటించుచు కాలము గడుపుచుండెను. ఒకనాడు గురువుగారు
శిష్యబృందముతో కూడ ఒక గృహస్థుని యింటికి భిక్షకై
వెడలిరి. భిక్ష పూర్తి అయిన పిదప శిష్యసమేతముగ గురువు
యింటినుండి బయటకువచ్చి ఆశ్రమమునకు పయనమగుచు
కొంతదూరము నడచిన పిమ్మట మార్గమధ్యమున నూతన
శిష్యుడు గురువును ఆపి యిట్లు పలికెను — మహాత్మా! నావలన
గొప్పఅపచారము జరిగినది. మనము భిక్ష చేసిన యింటినుండి

బయటకు వచ్చుచుండగా ఇంటిచూరున వ్రేలాడుచున్న బూజు నా తలకు అంటుకొనినది. దానిని నేను గమనించలేదు. ఇప్పుడు చూచుకొనగా నా తలపై ఆ బూజు అంటియున్నది. ఇదిగో చూడుడు! ఇది మనకు చెందినదికాదు. ఆ యింటి యజమానిది. ఒకరి వస్తువు మఱియొకరు గ్రహించుట మంచిది కాదు. అది స్తేయము [దొంగతనము] అను దోషముక్రింద వచ్చును. మనవంటి వారికి ఇట్టి ధర్మములు తెలియనివి కాదు. ఇంటి యజమానికి చెందిన ఈబూజును నేను అన్యాయముగ పరిగ్రహించుట పాడికాదు. ఈ పని నా కేమియు మనస్కరించుటలేదు. కాబట్టి గురుదేవా నేనిప్పుడు వెనుకకు బోయి అతని సొత్తును (బూజును) అతనికి స్వాధీనముచేసి వచ్చెదను. అని చెప్పి ఆ నూతన శిష్యుడు రివ్వున పరుగెత్తిపోయెను.

ఈ సంఘటనచే గురుదేవున కాతనిపై సరిపూర్ణ విశ్వాసము ఏర్పడెను. పరులసొత్తు ఏమియు అతడు కాజేయడను నమ్మకము కుదిరెను. కొంతకాలము గడచిన పిమ్మట ఒక నాడు గురువు తన వద్దనున్న వెండి పొన్నుగల కమండలువును (బహుమూల్యము కలదానిని) విశ్వాసముచే నూతన శిష్యున కొప్పగించి ఏదియో కార్యార్థము బయటకు వెళ్ళెను. తిరిగి వచ్చి చూచుసరికి శిష్యుడు లేడు. వెండి కమండలువు లేదు. శిష్యుడు కమండలువుతో సహా పలాయనము చిత్తగించెను.

అతడు సచ్ఛిష్యుడుగ నటించిన వచ్చి మోసగాడని గురువపుడు గ్రహించి ఆశ్చర్యచకితుడయ్యెను. ఆ నూతన శిష్యుని పేరు ఆషాఢభూతి. అప్పటి నుండియు ఆషాఢభూతియను పదము మోసగానికి పర్యాయపదముగ లోకమున వాడబడుచుండెను

**నీతి :** మోసము, కపటము, అన్యాయము అధర్మము మున్నగువానిని ఎవరును దరికి జేర్చరాదు చిత్తశుద్ధి పవిత్రత, దైవభక్తి మొదలైనవి గలవానికే మోక్షసామ్రాజ్యమున సముచిత స్థానము లభించగలదు.

# నిరభిమానము

ధర్మోద్ధరణకొఱకై మహనీయులు అచటచట జన్మించు చుందురు. వారు తమ అనుష్ఠాన ప్రాబల్యముచేతను, తమ తపశ్శక్తిచేతను, తమ దివ్య ప్రబోధములచేతను మానవాళి నీతిమార్గమున, ధర్మమార్గమున నడిపించుదురు. అనుష్ఠా పూర్వకములగు వారి మహత్తర బోధలచే ప్రభావితులై దుర్మార్గమును విడనాడి ధర్మపథమున పయనింప నుద్యుక్తులగు దురు శ్రీ గురునానక్ అట్టి ధర్మోద్ధరణశీలురిలో నొకరు. వీరు సిక్కులకు మత గురువు.

గురునానక్ గొప్ప దైవభక్తుడు. ఒక పర్యాయము కొలత పాత్రతో ధాన్యమును కొలుచు సందర్భమున ఏక్, దో తీన్, (ఒకటి, రెండు, మూడు-) అని చెప్పుచు పదుమూడువ సారి కొలుచునపుడు తేరా (పదమూడు) అని పలికి, మరల ఎన్ని కొలిచినను అదే పదమును అనగా తేరా, తేరా, అనియే ఉచ్చరించుచుండెను. చుట్టు నున్నవారు సంభ్రమచిత్తులై తిలకించుచుండిరి. "తేరా" అనగా నీవాడను అని అర్థము "ఓ దేవా! నేను నీవాడను, నీభక్తుడను అను భావము అత్తతి నానక్ హృదయములో ఉదయింప భక్తి పారవశ్యముతో అదే పదమును మరల మరల చెప్పదొడగెను.

అట్టి పరమ భక్తుడును,ధర్మోద్ధరణ శీలుడునైన నానక్ తన జీవితమంతయును పరోపకార కార్యములందే వినియోగించి కృతకృత్యుడయ్యెను.

ఒకనాడు నానక్ తన కుమారుని వెంటబెట్టుకొని తన మఠమంతయు తిరిగి చూచుచు గోశాలవద్దకురాగా ఆస్థలమంతయు చాల అపరిశుభ్రముగానుండుటంజూచి తనకుమారునితో దానిని శుభ్రము చేయవలసినదిగా ఆదేశించెను. కాని తండ్రి మాట నతడు పట్టించుకొనలేదు. దేహాభిమానము అడ్డువచ్చెను. తన గౌరవ ప్రతిష్ఠల కదిభంగకరమని తలంచెనో, ఏమో, ఆ పనికి అతడు పూనుకొనలేదు. నానక్ వాక్యములను ప్రక్కనే

యున్న నానక్ శిష్యుడొకడు విని వెనువెంటనే వడ
కొని చీపురుకట్ట చేతఁగైకొని గోశాల యంతయు
ఊడ్చి, కడిగివైచెను. శిష్యుని నిరహంకారమును, క
మును, గురుభక్తిని జూచి నానక్ లోలోన చాల సం

ఇట్లుండ కొంతకాలమునకు మఠసంబంధ బా
విడుదల పొందుటకై గురునానక్ యోచించుచు
మును ఎవరికైన ఒప్పచెప్పదలంచి అందులకు త
ఎవరాయని ఆలోచించుచుండెను. నానక్ తనయుడు
పదవి వచ్చునని ఊహించుచుండెను. కాని నిరాడం
ధర్మనిరతుడై, కార్యదక్షుడై, గురుసేవాపరాయ
తన శిష్యునకు- ఇదివరలో గోశాలను శుభ్రముచేసి
నానక్ మఠాధిపత్యము నొసంగి తన ఉత్తరాధికారి

ఈ వార్త చెవినిబడగనే నానక్ కోమారు
తన తండ్రి యొద్దకు వచ్చి నాన్నా! మఠాధికారము
ఇవ్వలేదు. అని ప్రశ్నింప, గోశాలను బాగుచేయ
లేకను నట్లు బాగుచేయగలవు! అని మందలించెను
మును వినగనే కుమారుడు నిరుత్తరుడైపోయెను.
పాటు గ్రహించి సిగ్గుపడెను.

**౨౮. గర్వాహంకారములకు తిలాంజలి యొసంగి సేవా భావమును పెంపొందించుకొని, వినయవంతులై యుండువారు లౌకిక, ఆధ్యాత్మక్షేత్రముల రెండింటి యందును శోభించుదురు. అట్టివారు తాము తరించి యితరులనుగూడ తరింపజేయుదురు.**

ఒకానొక గ్రామములో ఒక తిండిపోతు కలడు. అతనికి కడుపే కైలాసము. ఎక్కడ విందులు జరుగునా, పెండ్లిభోజనములు ఎక్కడ లభించునా యని అహర్నిశములు ఆలోచించువాడతడు. జిహ్వపై సంయమము లేక భోజ్యపదార్థమేదేది కనిపించినా, వేళాపాళాలేక దానిని ఆరగించువాడు. ఈ ప్రకారముగ అధిక భోజనమును సేవించుచు శరీరముయొక్క స్థౌల్యమును పెంచుకొని, పని పాటలు లేక, ఇంటివద్ద కూర్చొని గోళ్లుగిల్లుకొనుచు, తిండినిగూర్చి రాత్రింబవలు చింతించుచు కాలమును వెళ్ళబుచ్చుచుండెను.

ఇట్లుండ ఒకనాడు అతడు అకస్మాత్తుగ ఇంటినుండి బయలుదేరి ఊరిబయట దూరముగ గల ఒక చెట్టు క్రింద

కూర్చొని జపములు, వ్రతములు చేయుచు బ్రహ్మదేవుని గూర్చి తపస్సు చేయ మొదలు పెట్టెను.అదిచూచి ఊరవారం దఱు ఆశ్చర్యచకితులై ఈ తిండిపోతున కింత భక్తి వైరాగ్య మేల కలిగెనని సంశయావిష్టులై యుండిరి. ఈ తపస్సునకు కారణమేమి? యని అతని నడుగుటకు వారు సాహసింపలేక యుండిరి.

ఈ ప్రకారముగ కొంతకాలము గడచిన పిమ్మట ఒకా నొక దినమున బ్రహ్మదేవు డతనికి ప్రత్యక్షమై ఓయీ! నీ తపస్సునకు మెచ్చితిని. ఏదైన వరము కోరుకొనుము అని పలు కగా తిండిపోతు మహాప్రభో! నాకు వరమేమియు అవసరము లేదు. వరము కొఱకై నేను తపస్సు చేయలేదు. ఒకానొక ధర్మసందేహము నాకు కలుగగా, దానిని తీర్చువారు తమరే యని ప్రగాఢముగ విశ్వసించి ఈ ప్రకారముగ తమ్ముగూర్చి తపస్సు చేసితిని. మహాత్మా! నాసందేహమును తీర్చి నాకు చిత్తశాంతిని కలుగజేయవలసినదిగా ప్రార్థించుచున్నాను — అని విన్నవించుకొనెను. తదుపరి వారిరువురి మధ్య ఈ క్రింది విధముగ సంభాషణము నడచెను.—

బ్రహ్మదేవుడు :- నాయనా! ఏ విధమగు అభ్యంతరము లేక నీవడుగ దలంచినది అడుగుము. నీ సంశయమును దీర్చెదను.

తిండపోతు :- దేవా! ఈ సృష్టియంతయు గావించినది ఎవరు

బ్ర :- నేనే

తిం :- అయితే మనుష్యుని సృష్టి చేసినది ఎవరు?

బ్ర :- నేనే

తిం :- మనుష్యుని తల ఎవరు సృష్టి చేసినది?

బ్ర :- నేనే కదా !

తిం :- మహాప్రభో! ఆ తలలో రెండు కండ్లు పెట్టినారు, చాల బాగున్నది. రెండు చెవులు పెట్టినారు, చాల బాగున్నది రెండు ముక్కురంధ్రములు పెట్టినారు, ఇంకను చాల బాగున్నది. కాని ఒక్కనోరా! రామ, రామ! అన్నీ రెండు రెండు పెట్టి నోరు మాత్రము ఒక్కటే మాత్రమే పెట్టుట నా దృష్టికి సమంజసముగ తోచుట లేదు. ఒకేచోట నెలకొల్పబడిన వస్తువులు సరిసమానముగ ఉండుట భావ్యము కదా! అయినదేమిటో అయినది, కనీసము రాబోవు సృష్టియందైనను ఈ విషయమును తమరు జ్ఞప్తియందుంచుకొని తలలో రెండు నోళ్ళుపెట్టి ఈ చిన్న మార్పును తలయందు చేసిన బాగుండునని తోచుచున్నది. ఆప్రకారముగ రెండు నోరులుండినచో నా వంటి అధిక భోజనపరులకు చాల

అనుకూలముగా నుండునని నా మనవి. మహాత్మా! ఈ
విషయము నా దృష్టిలో అత్యధిక ప్రాధాన్యత గలదిగా
నుండుటంబట్టి దానిని తమ దివ్యచిత్తమునకు తేవలెనని
బహుకాలము నుండియు తలంచుచున్నాను నేటి కా
శుభఘడియ తటస్థించినది కాబట్టి మహాశయా! నేను
సూచించిన ఈ విషయమును తమరు దీర్ఘముగ
యోచించి ఆ ప్రకారముగ చేయ ప్రార్థన.

బ్రి.- ఓయీ! ఈ సంగతి నాకు తెలియక పోలేదు. బాగుగ
యోచించియే ఒక్క నోరు పెట్టితిని. ఒక్క నోరున్న
ప్పుడే యూపిరి తిరగకుండ జనులు తినుచుండగా ఇక రెండు
నోరులున్నచో చెప్పవలెనా? ఒక్కనోరున్నప్పుడే
చెడవాగుడు వాగుచుండగా ఇక రెండునోరు లున్నచో
వేఱుగ చెప్పవలెనా? కాబట్టి మితాహారము సేవించ
వలెనని, మితభాషణము గావింపవలెనని ప్రజలకు
ఉద్బోధము చేయుట కొఱకే ఒక్కనోరు ఏర్పాటు
చేసితిని, ఇప్పటికైనా తెలిసికొని బాగుపడుము. అధిక
భోజనము ఎవరికినీ మంచిది కాదు. దానివలన ఆరోగ్యము
చెడుటయే కాక, పరప్రాణులయొక్క ఆహారమును
తస్కరించినట్లు కాగలదు.

తిం :- మహాత్మా! చక్కగ సెలవిచ్చితిరి. ఇక మీదట తమరు సెలవిచ్చిన ప్రకారము మితభోజనమే అలవాటు చేసి కొనెదను.

ఆ వాక్యములను విని బ్రహ్మదేవుడు సంతోషించి అంతర్ధాన మయ్యెను. తిండిపోతు ఇంటికి వెళ్ళి మితాహారమును అభ్యసించి బాగుపడెను.

**నీతి:- ఆహారమును అధికముగ భుజించరాదు. మితాహారమును సేవించుచు, ఆరోగ్యమును జాగ్రతగ కాపాడుకొనుచు దైవచింతన చేయుచు జీవితమును ఆనందమయముగ చేసి కొనవలెను.**

# మనో నైర్మల్యము

ఒకానొక పట్టణమున ఒక మహారాజు కలడు. అతనికి లెక్కలేని సంపదలు కలవు. ఆకాశమునంటుచున్న రాజప్రాసాదములు పెక్కుగలవు. రాజభోగములన్నిటిని బాగుగ అనుభవించుచు అతడు హాయిగా కాలక్షేపము చేయుచుండెను. ఇట్లుండగ ఒకనా డతని కొక విచిత్ర సంకల్పము కలిగినది. తన చిత్రమును చిత్రకారులచేత గీయింపజేసి అద్దానిని చూచుకొని ఆనందించవలెనను కుతూహలమాతనికి జనించెను.

వెనువెంటనే అతడు తన మంత్రిపుంగవుని పిలిపించి తన దేశమందలి చిత్రకారులందఱినిరప్పించి వారితో-"ఓ చిత్రకారులారా! ఇప్పటికి మీ జీవితకాలమున ఎన్నియో చిత్రములను మీరు గీసి అత్యంతఖ్యాతిని బడసినవారైరి. ఇపుడు మీరు నా యొక్క చిత్రమును గీయవలసినది. నాస్వరూప మెట్లున్నదో బాగుగ గమనించి అదే విధముగ గీయవలసినది. ఏమాత్రము మార్పుండరాదు. ఉత్తమచిత్రమునకు సముచిత పారితోషికము ఒసంగబడగలదు".

ఆవాక్యములు వినగనే చిత్రకారులందఱు ఓరాజా! మా ముందు కొద్దిసేపు ఆసీనులై యుండుడు. మీయొక్క రూపురేఖలన్నియు మేము జాగ్రత్తగ గుర్తుపెట్టుకొందుము. ఆ తదుపరి ఇండ్లకువెళ్ళి సావకాశముగ చిత్రమునుగీసి తీసికొని వచ్చెదము" అని పలుకగా రాజు అందులకు సమ్మతించి సింహాసనముపై కొద్దిసేపు నిశ్చలముగ కూర్చుండెను. చిత్రకారులందరు తదేకదృష్టితో అతనివంక చూచుచు ముఖ్యమైన గుర్తులను కాగితముపై వ్రాసికొని వారివారి ఇండ్లకు వెడలిపోయిరి.

కొంతకాలమైన పిదప చిత్రకారులు ఒక్కొక్కరు తాము వ్రాసిన చిత్రమును తీసికొనివచ్చి రాజుకు చూపింప దొడగిరి. కాని ఒక్కొక్క చిత్రము చూసినపుడు రాజు తన ముఖమందలి అంగములను ఒకింత కదల్చుచు, వికృతరూపము

కదల్చుచుండ రాజుయొక్క ముఖమునకును, చిత్రికారులు చిత్రించిన ముఖమునకు సంబంధము లేకుండెను. "నా ముఖమును ఉన్నది ఉన్నట్లుగ మీరు వేయలేదు. నేను ఉన్నది ఉన్నట్లుగ మీరు వేయలేదు. నేను ఉన్నది ఒక రకముగను మీరు వేసినది మరియొక రకముగను ఉండుటవలన మీ చిత్రములు నాకు ఏమాత్రము సంతృప్తికరములుగ లేవు. కావున పోయి మరల జాగ్రతగ వేసికొనిరండు" అని వారందరిని మందలించి పంపివేసెను. కొంతకాలము గడచిన వెనుక చిత్రకారులు తాము ఎంతయో శ్రద్ధతో, ఓపికతో వేసిన చిత్రములను మరల తెచ్చి రాజుకు చూపించగా అపుడు రాజు పూర్వమువలెనే తన అంగములను ఒకింత మార్పుచేయుచు, కదల్చుచుండ రాజు స్వరూపమునకును, చిత్రమునకును పోలికయే లేకుండెను. కావున రాజు వారందరిని మందలించి పంపివేసెను. వారు వ్రాసి తెచ్చిన ఒక్కచిత్రముకూడ పోలిక లేనందున అది అతనికి రుచించకుండెను. ఈ విషయము తెలిసిన ఒక మహా వివేకవంతుడగు చిత్రకారుడు రాజుకు తగిన పాఠము బోధించవలెనని నిశ్చయించి ఒక అద్దము తీసికొని రాజుయొద్దకువెళ్ళి రాజా! మీచిత్రమును బహురమ్యముగ గీసితిని. మీరెట్లున్నారో ఆవిధముగ చాకచక్యముతో గీసి తెచ్చితిని. చూడుడు. అని అద్దమును చూపెట్టెను. రాజు మామూలు పద్ధతిలో తన అంగములను మార్పుచేయుగా, ఆ

మార్పు అద్దములో ఆవిధముగ గోచరించెను. రాజుయొక్క వస్త్రాలు ఆ అద్దమువద్ద ఉనికలేదు. ఈ ప్రకారముగ ఆ చిత్రకారుడు ఉత్కృష్ట అని రాజుచే అనిపించగల్గెను.ఆ చిత్రకారుని తెలివితేటలకు రాజు చాల సంతోషించి తగినరీతి ఆతనిని సన్మానించి పంపివేసెను.

నీతి- అద్దము అతినిర్మలముగా నుండుటంబట్టి ఎదుట నున్న వస్తువును ఉన్నది ఉన్నట్లుగ చూపును.అట్లే మనస్సను అద్దమును రజోగుణ తమోగుణ రహితముగను, దుష్టసంస్కార దుర్వృత్తి వర్జితముగను నొనర్చినచో అట్టి అద్దమువంటి శుద్ధ మనస్సునందు అధిష్టానమగు పరమాత్మ చక్కగ ప్రతిబింబించును. ప్రత్యక్షముగ గోచరించును. అదియే ఆత్మసాక్షాత్కారము. అదియే బ్రహ్మానుభూతి. కాబట్టి బ్రహ్మ సాక్షాత్కార రూపమోక్షమునకు నిర్మల మనస్సు అత్యావశ్యకమై యున్నది.

## యక్షప్రశ్న

అది మహాభారతకాలము. పాండవులు అరణ్యవాసము చేయుచుండిరి. ఒకనాడు ధర్మరాజునకు దాహము కలుగగా భీముని పిలిచి నాయనా! సమీపములో ఒక చక్కటి సరోవరము కలదు. దానిలో నిర్మలమైన జలమున్నది. నాకు దాహము కలుగుచున్నది. ఇదిగో ఈ పాత్రి తీసికొనివెళ్ళి

ఆ నిర్మల జలము తీసికొనిరా! అని చెప్పి పంపించెను. అగ్రజుని వాక్యమును శిరసావహించి భీముడు ఆ పాత్రను తీసికొని సరస్సువద్దకు వెళ్ళగా అచట నొక యక్షుడు (గంధర్వుడు) కానుపించెను. భీముడు సరస్సునుండి జలమును గైకొనబోవు చుంతగా ఆ యక్షుడతనిని వారించి ఈ ప్రకారముగ హెచ్చరించెను—ఓయీ! ఇది నాకు చెందిన సరోవరము. నా యనుమతి లేక ఇందెవరును నీరు ముట్టరాదు. నేను కొన్ని ప్రశ్నలను అడుగుదును. వానికి సమాధానము చెప్పినచో మర్యాదగా నీరు తీసికొనిపోవచ్చును. అట్లు కానిచో నీవు క్రిందబడి మూర్ఛపోవుదువు.

కాని యక్షుని వాక్యములను భీముడు పెడచెవిని బెట్టి జలమును గ్రహింపబోగా యక్షుని ప్రతాపముచే అతడు క్రిందబడి మూర్ఛపోయెను. యుధిష్ఠిరుడు భీముని రాకకై చాలసేపు వేచియుండి, ఎంతసేపటికి రాకుండుటచే ఆశ్చర్య చకితుడై రెండవ సోదరుడైన అర్జునుని బిలచి భీముని యోగ క్షేమములను తెలిసికొని త్రాగుటకు నీరు తెమ్మని చెప్పి పంపెను. అర్జునుడు సరస్సుయొద్ద కేగగా మునుపటివలెనే అచటనున్న యక్షుడు అతనిని అడ్డుపెట్టి తానడుగు ప్రశ్నలకు జవాబు చెప్పినగాని నీరు తాకనివ్వననియు, చెప్పినచో మర్యాదగా వెళ్ళవచ్చుననియు, లేకున్న అతని సోదరునివలె మూర్ఛ

పోవలసివచ్చుననియూ గద్దించి పలికెను. కాని అర్జును డాతని వాక్యములను లక్ష్యపెట్టక పాత్రతో నీరు గ్రహింపబోవుచుండ యక్షుని ప్రభావముచే మూర్ఛపోయెను.

ధర్మరాజు చూచి చూచి ఎంతసేపటికి సోదరులు రానందువలన, ఏమి జరిగినదో తెలిసికొనివచ్చుటకును పాత్రతో నీరు తెచ్చుటకును, తక్కిన ఇద్దరు సోదరులను గూడ పంపెను. వారికిని అదియే గతి సంభవించెను. ఈ ప్రకారముగ సోదరులందరును సరోవరము చెంత మూర్ఛపోయియుండిరి. ధర్మరాజునకు పరిస్థితి అంతుపట్టలేదు. సంభ్రమచేతస్కుడై తానే సరస్సునొద్దకు ప్రయాణము కట్టెను, జలాశయమును సమీపించగనే అచట ఒక యక్షుడుండుటయు, నలుగురు సోదరులు క్రిందపడి మూర్ఛపోయియుండుటయు గమనించెను.

పూర్వమువలెనే యక్షుడు ధర్మరాజును వారించి తానడుగు ప్రశ్నలకు సమాధానము చెప్పనిచో తమ్ములకు జరిగిన శాస్తి జరుగగలదని హెచ్చరించెను. కాని ధర్మరాజు మూర్తీభవించిన ధర్మమే యగుటచేతను, క్షమ అను సుగుణమును దుగ్ధపాలతో రంగరించి చిన్ననాటినుండియు సేవించియుండుట చేతను, యక్షుడు వాక్యములచే అదరక, బెదరక, ఆక్షేపమునకు లోనుగాక, స్థితప్రజ్ఞుడై ఓయీ! నీ వడుగ దలం

చిన ప్రశ్నలను అడుగుము. నాకు తెలిసిన సమాధానములను చెప్పెదను అని ప్రశాంతవదనుడై గంభీరముగ పలికెను.

తోడనే యక్షుడు ఆధ్యాత్మ విద్యకు సంబంధించిన అనేక ప్రశ్నలను అడిగెను. అన్నిటికిని ధర్మరాజు చక్కటి సమాధానములను చెప్పెను. యక్షుడడిగిన ప్రశ్నలలో ఇది యొకటి - ప్రపంచములో ఆశ్చర్యకరములైన విషయము లెన్నియో కలవు. కాని అన్నిటికంటెను మహాఆశ్చర్యకరమైన విషయమేది? అందులకు పాండవాగ్రజుడు ఈ ప్రకారముగ సమాధాన మొసంగెను.

అహన్యహని భూతాని
గచ్ఛన్తీహ యమాలయం
శేషాః స్థావర మిచ్ఛన్తి
కిమాశ్చర్య మతః పరమ్.

"ప్రతిరోజు అనేకమంది యమసదనమునకు పోవుచున్నారు (చనిపోవుచున్నారు). కాని తక్కినవారు మేము మాత్రము ఇచటనే స్థిరముగ నుందుము. - అని భావించుచు ఉందురు. ఇది అన్నిటికంటెను పరమాశ్చర్యకరమైనది."

ఈ ప్రకారముగ ధర్మరాజు చెప్పిన వివిధ ప్రత్యుత్తరములను సావధానముగ ఆకర్షించి యక్షుడు పరమానంద భరితుడై ధర్మరాజునకు వైకొనుటకు అనుజ్ఞ యిచ్చుటేకాక తక్కిన నలుగురు మూర్ఛనుండి లేపి అతనివెంట పంపెను

**నీతి:— ధర్మరాజు యొక్క అనుపమబోధను అలకించి జనులు విజ్ఞత గలవారై శరీరము క్షణికమని నమ్మి, అది యేనాటికైనను విలయమై పోవునని విశ్వయించి శాశ్వత పరమాత్మ యొక్క సాక్షాత్కారము కొఱకై అహర్నిశములు గొప్ప ప్రయత్నములను ఆచరించి తరించ వలయును.**

# గురు భక్తుడు

ఒకానొక ఏకాంతప్రదేశమున ఒక చక్కని ఆశ్రమము కలదు. అది పట్టణప్రాంతమునకు సుదూరమున నుండుటచే జనసమూహములు ఎక్కువగా చేరుటగాని, కేకలు వేయుట గాని, వాహనముల శబ్దము వినిపించుటగాని ఏమియు అచట లేదు. వాతావరణము కలుషితముకాక నిర్మలముగా నుండెను. ఒకవైపు గగన చుంబితములగు ఎత్తైన పర్వతములు, ఒకవైపు

స్వచ్ఛమైన జలముతో గూడిన గొప్పసరోవరము ఆ ఆశ్రమము నకు శోభను కల్పించుచుండెను. ఫలపుష్పాదులతో గూడిన మహావృక్షములు కనులకు ఇంపుగా నుండెను. భక్తులు ధ్యానాదులను శీలించుటకును, ఆధ్యాత్మిక సాధనలు కావించు టకును అచటచట వృక్షచ్ఛాయలందు చక్కని అరుగులు కట్ట బడియుండెను. సాధకులు వానిపై కూర్చుండి దృశ్యమువైపు నకు దృష్టిని మరలింపక మనస్సును అంతర్ముఖమొనర్చి పర మాత్మయందు కేంద్రీకరించుచుందురు. ఆకలి అయినపుడు కందమూలములు, ఫలములు భక్షించుచు అచట సాధకులు ప్రాపంచిక వ్యామోహములపై వైరాగ్యము మనస్సును పరు గిడనీయక అహర్నిశములు ఆత్మచింతన, ధ్యానాద్యనుష్ఠానము లను శీలించు కాలమును సద్వినియోగ పఱచుచుందురు.

ధ్యానాదులు విరమించిన పిదప ఇక స్వాధ్యాయనమందు ప్రవేశించి ఉపనిషత్తులు, భగవద్గీత మొదలైన సద్గ్రంథములను పరిశీలించుచుందురు. ఆ తదుపరి ఆశ్రమవాసులందఱు ఒకచోట సమావేశమై ఆధ్యాత్మిక విషయములనుగూర్చి పరస్పరము చర్చించుకొనుచు నుందురు. ఏవైన తెలియని అంశములను అడిగి తెలిసికొందురు. ఇట్టి సత్కాలక్షేపముల వలన వారి మనస్సు అన్యత్రపోవుటకు అవకాశమే లేనందున శాశ్వత పరమాత్మయందే లగ్నమగుచుండెను.

ఇట్లుండ ఒకనాడు సాయంత్రసమయమున శిష్యులం
దఱిని సమావేశపఱచి గురుదేవుడు, సాధనయందు సామాన్య
ముగ జనులకు ఏయే ప్రతిబంధకములు ఎదురగుచుండునో,
వానిని అధిగమించుటకు అవలంబించవలసిన పద్ధతులేవియో
చక్కగ విశదపఱచెను. కొందఱు భక్తులు గురువు చెప్పిన
కీలక విషయములను పుస్తకములలోనికి ఎక్కించుకొనిరి. గోష్ఠి
అంతయు పూర్తికాగానే శాంతిమంత్రముల ఉచ్చారణతో
ఆనాటి సమావేశము విసర్జింపబడెను.

అపుడు గురుదేవుడు అంతేవాసులతో "నాయనలారా!
ప్రకృతి సౌందర్యమును వీక్షించుటకును, భగవంతుని చిద్వి
లాసనమును చూచి ఆనందించుటకును ఉద్యానవనమునకు
పోదము రండు" అని చెప్పి ఆ శిష్యులందఱిని ఆశ్రమసమీప
మునగల ఉద్యానవనమునకు తీసికొనిపోయెను. అచట రకరక
ములైన పుష్పములు చక్కగ వికసించ సుగంధమును వెదజల్లు
చుండెను. తులసివనమునుండి పవిత్రమైన పరిమళం నలువైపుల
ప్రసరించుచుండెను. అత్తఱి గురుదేవుడు వికసించిన ఒక గులాబి
పువ్వును చూచి, దాని రచనావైచిత్ర్యమును గాంచి ముగ్ధుడై,
సృష్టికర్తయొక్క అపారశక్తిసామర్థ్యమును తలంచుకొని విస్మి
తుడై, ఆపుష్పమును మెల్లగ కోసెను. ఆకోయుటలో పొర
పాటున దానికి ఉన్నముల్లు గుచ్చుకొనుటనే వ్రేలినుండి

రక్తము కారదొడగెను. అదిచూచి శిష్యులలో కొందఱు గుడ్డ పీలికతో ఆ వ్రేలికి కట్టుకట్టదలంచి పాతగుడ్డకొఱకై ఆశ్రమమునకు పరుగెత్తిరి. కాని సమీపముననేయున్న ఒక శిష్యుడు తనపై కప్పుకొనిన అంగవస్త్రమును చించి ఆ పీలికతో తక్షణము దేశికేంద్రుని వ్రేలికి కట్టుకట్టెను. రక్తస్రావము ఆగిపోయెను. కొలది సమయములో గురుదేవునకు నొప్పి తగ్గిపోయి స్వస్థతచేకూరెను. అప్పుడు గురువు తన మనంబున "ఈతడుగదా నిజమైనగురు భక్తుడు! తక్కినవారు గుడ్డకొఱకై ఇటునటు పరుగెత్తిరి. కాని ఇతడు ఒరుల బాధను గుర్తెఱిగి ఆచార్యునిపైగల అపారభక్తిని క్రియారూపమున ప్రకటించియున్నాడు"-అని ఈ ప్రకారముగ తలంచుకొనుచు ఆశ్రమము వైపునకు మెల్లగ నడువజొచ్చెను.

**నీతి:- భక్తిగాని, జ్ఞానముగాని నోటివఱకే పరిమితముకాక హృదయమందు కూడ ప్రవేశించవలెను. వాచాజ్ఞానముతో పరితృప్తినొందక అనుష్ఠానమందు కూడ దానిని ప్రవేశపెట్టవలెను. గురుదేవుని ఉద్బోధను కార్యాన్వితమొనర్చువాడే నిజమైన గురుభక్తుడు.**

# విషయతృష్ణ మహాప్రమాదకరమైనది

పూర్వము సౌభరియను తాపసియుండెను. అతడు చాల కాలము నీటిలో మునిగి తపస్సుచేయుచుండ ఒకనాడు కండ్లు తెఱచి చూచుసరికి ఒక మొగచేప, ఒక ఆడచేప, వానిపిల్లలు నీటిలో ఆనందముగ ఇటునటు సంచరించుచుండుటను గమనించెను. విలాసముగ విహరించుచున్న ఆ మత్స్యయుగళమును ఆనందముతో చిందులు త్రొక్కుచున్న ఆ మత్స్యసంతతిని అవలోకింప ఆ తాపసికి గృహస్థజీవితముపై మక్కువజనించెను. అష్టసిద్ధులు చేతియందున్న తపస్సంపన్నుల కేమికొదువ? వెంటనే యతడు నీటినుండి బయటికివచ్చి, మాంధాత చక్రవర్తికడకేగి అతని కుమార్తెలనందఱిని తనికిచ్చి వివాహము చేయవలసినదిగా కోరెను. చక్రవర్తి ఇరుకున పడిపోయెను. వివాహము చేయుదుమా, అతని వికృతరూపము జూచి కొమార్తెలందులకు అంగీకరింతురో, లేదో! చేయకుందుమా ప్రచండతపస్వియగుటచే శపించునేమో! ఇట్లు ఉభయపక్షములు ఆలోచించుచు, తుట్టతుదకామునీశ్వరునితో "మహాత్మా పిల్లలు సమ్మతించినచో అట్లే వివాహము చేసికొనుడు" అని పలికెను. తత్క్షణమే ఆ మునిపుంగవుడు కోటిమన్మథాకారసదృశ లావణ్యముతో గూడిన సొంపగు రూపమును ధరించి మాంధాతృ దుహితృలకడకేగ, వారందఱును అతని సుందరరూపరేఖలం జూచి హర్షాన్వితచిత్తలై శీఘ్రముగ పరిణయము చేసికొనిరి.

వివాహానంతరము సౌభరి వారందఱికిని తన తపశ్శక్తిచే వేర్వేఱు భవనములను నిర్మింపజేసి ఒక్కొక్కదానిలో ఒక్కొక్కతెను ఉంచి వారికి వలసిన సమస్తవిలాసములను సమకూర్చెను. ఇట్లు చాలకాలము వారందఱితో గూడి పెక్కుభోగములను, కేళీవినోదములను అనుభవించెను. వారివలన నతనికి సంతానమున్ను కలిగెను. కాని ఎన్ని యనుభవించినను నాతనికి తృప్తి కలుగలేదు. ఒకటితరువాత మఱియొకటిగా కోరికలు పెన్నంటుచునే యుండెను. ఒకదానిని అనుభవించిన వెనువెంటనే మఱియొకటి సిద్ధముగ నుండుచుండెను.

"దృష్టా స్సుతా స్తత్తనయప్రసూతిం
ద్రష్టుం పునర్వాంఛతి మేఽన్తరాత్మా."

"పుత్రులు కావలయునని కోరితిని. పుత్రులు కలిగిరి. అంతటితో ఆగలేదు. వారి సంతానమును(పౌత్రులను) గూడ చూడ వలయునను తలంపు నా మనస్సునకు కలుగుచున్నది. ఓహో! మాయ ఎంత బలీయమైనది" అని యాతడు తలపోసికొని, భోగములయొక్కయు, ప్రాపంచిక సంపదలయొక్కయు క్షణికత్వమును, ఆశయొక్క దుష్పూరత్వమును మరల మరల విచారించి తుట్టతుదకు విరక్తినిబొందెను. అడుసుత్రొక్కనేల కాలు కడుగనేల. కావున ముముక్షువగువాడు విషయభోగము

లందలి యాశను మొట్ట మొదట నేత్రించివైచి, వానియందలి ఆసక్తిని విడనాడి, ఏ ప్రేమను, అభినివేశమును ప్రాపంచిక విషయములందు, దృశ్యవిలాసములందు, గలిగియున్నాడో, దానిని సర్వేశ్వరునివైపు మళ్ళించి, దైవోన్ముఖుడై, ఆత్మారాముడై విలసిల్లవలెను.

**నీతి:- విషయవాంఛలను విడనాడవలెను. జీవితమును దైవమయముగ మార్చుకొనవలయును**

# దూరదృష్టి

భారతము శాంతిపర్వమున భీష్మాచార్యులవారు జనులు తరించుటకై చక్కని హితబోధలను గావించెను. వారు చెప్పిన బోధలలో ఒకానొక కథ ఇచట పేర్కొనబడినది :-

ఒక ఊరి బయట ఒక చెరువు కలదు. ఆ చెరువులో వర్షాకాలమున జలము పుష్కలముగా నుండును. కాని గ్రీష్మ ఋతువు రాగానే జలము కొంచెము కొంచెము తగ్గుచు క్రమముగ అంతరించి పోవుచుండును. మండు వేసవిలో ఒక్క చుక్కయైనను అందు నీరు ఉండదు. ఆ చెరువులో మూడు చేపలు కాపుర ముండుచుండెను. వాని పేర్లు :- 1) దీర్ఘదర్శి

2) ప్రాప్తకాలజ్ఞుడు 3) దీర్ఘసూత్రి. వర్షాకాలము జలము దండిగా నుండుటవలన ఆ మహాజలాశయమున అవి హాయిగా కాపురము చేయుచుండెను. జలసమృద్ధివలన వాని ఆనందమునకు మేరయే లేకుండెను. ఇష్టము వచ్చినట్లు తిరుగుచు, ఈదులాడుచు కాలక్షేపము చేయుచుండెను.

కాని కాలమొకేరీతి ఎల్లప్పుడును ఉండదు. ఋతువులు మారుచుండును. ఆయా ఋతువులందు ఆయా ఋతుధర్మములు పరివర్తించు చుండును. వర్షాకాలము దాటి గ్రీష్మర్తువు రాగానే దినకరుడు తన ప్రచండ తాపమును చూపదొడగెను. ఆ త్తరి చెరువులు ఎండజొచ్చెను. నదులందు జలముయొక్క ప్రవాహోద్ధృతి శమించు చుండెను. గ్రామము చెంతగల ఆ చెరువులోని నీరుకూడ గ్రీష్మఋతువుయొక్క ప్రభావమునకు లోనై, భాస్కరుని ప్రచండ తాపఫలితముగ దినదినము తగ్గి పోవు చుండెను.

ఇట్లుండ ఒకనాడు ఆ చెరువులో నివసించుచున్న దీర్ఘదర్శియను పేరుగల చేప తక్కిన రెండుచేపలను పిలిచి ఈ ప్రకారముగ చక్కని ప్రబోధము చేయదొడగెను. సోదరులారా! శ్రేయస్సు కోరువాడు వర్తమానకాలపు ఆలోచలనే ఎల్లప్పుడు చేయుచుండరాదు. భవిష్యత్తును గూర్చి కూడ ఒకింత యోచన చేయుచుండవలెను. ఇపుడు వేసవియొక్క

ప్రతాపము చాల తీవ్రముగ నున్నది. భానుని కిరణములు ప్రచండముగ, విజృంభించుచు జలరాశినంతను క్రమక్రమముగ కబళించి వేయుచున్నది. కనుకనే ఈ చెరువులోని నీళ్ళు దిన దినము తగ్గిపోవుచున్నవి. ఇక కొద్ది రోజులలో అసలు నీరే లేకుండపోవు ప్రమాదము దాపురించవచ్చును. అప్పుడు మనమిక జీవించుట ఎట్లు? కావున దీర్ఘముగ యోచనచేసి సమీపముననే యున్న పెద్ద చెరువులోకి మనము వెళ్ళిపోయినచో ఇక ఎంత ఎండ కాచినను మన ప్రాణముల కేవిధమైన హానియు కలుగ కుండును. ఏలయనగా, ఆ నీరు వేసవియందుకూడ తగ్గక సమృద్ధిగ నుండును విజ్ఞుడగువాడు భావికాలమున గలుగు ప్రమాదములనుగూర్చి ముందుగనే యోచించి వాటి నివారణకై పట్టుదలతో ప్రయత్నించవలెను. లేనియెడల ప్రమాదకరములైన కొన్ని విపరీత పరిణామములు కలుగ వచ్చును.

దీర్ఘదర్శియొక్క సహేతుకములైన ఆ మాటలను విని ప్రాప్తకాలజుడను రెండవచేప ఇట్లు చెప్పెను - అన్నగారూ! మీరు చెప్పినది వాస్తవమే. రాబోవు ప్రమాదములను ముందు గనే గుర్తించి వాటి నివారణకై యత్నించుట మంచిదికాదని ఎవరు చెప్పుదురు? కాని అట్టి ప్రమాదము ఇపుడు చెరువులో నీళ్ళు ధారాళముగ నున్నవి. కావున ఇంకకొంత కాలము

మన మిచట నిశ్చింతగా ఉండవచ్చును. ఇప్పుడే వలస పోవుటను గూర్చి యోచింప నక్కఱలేదు. మొత్తము నీళ్ళన్నియు అయి పోవు సమయమున వేఱొక చెరువునకు మారునట్టి ప్రయత్నము చేయవచ్చును. ఇప్పటి నుండియే అగోచరవసత్తి నపెట్టుకొని బాధపడుట భావ్యముగా కనబించలేదు.

ఆ రెండు చేపలు ఈ ప్రకారముగా తమ తమ భావములను వ్యక్తీకరింపగా, మూడవ చేపయగు దీర్ఘసూత్రి ఫక్కున నవ్వి వారి వాక్యములను అపహాస్యము చేయుచు నిట్లుపలికెను. సోదరులారా! మీ యిరువురి మాటలు వినుచుండుటచే నాకు నవ్వురాని నవ్వువచ్చుచున్నది. చెరువులో నీళ్ళు అయిపోవుట అనునది ఎవ్వడైనా సంభవించునా! ఒకవేళ అయిపోయినను జరిగినదేమి! ఆరోజే పెద్ద చెరువునకు ప్రయాణము కట్టెదము ఇప్పుడే దానినిగూర్చి యోచించవలసిన పనిలేదు. అప్పటి సంగతి అప్పుడు చూచుకొనవచ్చును.

పెద్ద చేపకు తక్కిన రెండు చేపల మాటలు ఏమాత్రము రుచించలేదు. అది చెప్పవలసిన వాక్యములన్నిటిని మరల ఇంకొకసారి చెప్పిచూచి, ఎంత చెప్పినను వారు లక్ష్య పెట్టనందువలన, మరునటి రోజు ఉదయమునకే ఆచెరువును విడచిపెట్టి పెద్దచెరువులోనికి ప్రయాణము కట్టెను. అచటకు చేరి ఆ మహాజలార్ణవమున హాయిగ నివసింపదొడగెను.

ములనుండి నీరు కారజొచ్చెను. ఆ వ్యాధి వలన మిక్కుటముగ
బాధనొంది రాజు ఎందరో నిపుణులగు వైద్యులను పిలువనం
పించి వారిచే కండ్లను పరీక్షచేయించుకొని, వారినుండి
ఔషధములను సేవించుచు బహుకాలము చికిత్స గావించు
కొనెను. కాని దురదృష్టవశముచే వ్యాధి ఏమాత్రము శమించ
లేదు. పైగా కంటిబాధ వినుమడింప జొచ్చెను. రాజునకు ఏమి
చేయవలెనో తోచలేదు. శరీరమాద్యం ఖలు ధర్మసాధనమ్
అని పెద్దలు చెప్పినట్లు దేహము ఆరోగ్యముగ నుండిననే గదా
ఏవైన ధర్మకార్యములు సాధించుటకు వీలుపడును! నేత్రజని
తసంతాపముచే విసుగెత్తి జీవితము పైననే విరక్తిని బొందిన
ఆ రాజు ఆరోగ్యముకొఱకై మార్గాంతరములను యోచించు
చుండెను.

"సర్వేంద్రియాణాం నయనం ప్రధానమ్" అనునట్లు
ఇంద్రియములన్నిటిలో నేత్రము ప్రధానమైయుండుటవలన,
నేత్రబాధవలన అన్నిరాచకార్యములందును రాజు నిరుత్సాహ
మును చూపుచుండెను. మంత్రులతోను సామంతులతోను
అతడు సరిగా మాట్లాడుటలేదు. ప్రజాప్రతినిధులను తన
భవనములోనికి రానిచ్చుటలేదు. ఈ ప్రకారముగ రాజుగారి
నేత్రవ్యాధి రాచకార్యములన్నింటికిని పెద్ద అవరోధముగా
పరిణమించెను.

ఇట్లు కొంతకాలము గడచిన పిమ్మట ఒకానొక దినమున ఒక భిషగ్వర్యుడు నృపాలుని సమీపించి, మహారాజా! నీ నేత్ర బాధను నేను ఉపశమింపజేసెదను. నేనుచెప్పినట్లు మీరు తప్పక ఆచరించవలెను. అని చెప్పగా బాధోపశమనమునకై పరితపించుచున్న భూపతి అందులకు సమ్మతించెను. అపుడు వైద్యశేఖరు డిట్లు సెలవిచ్చెను.— మహాత్మా! ఆకుపచ్చరంగు కంటికి చాల ఇంపుగానుండును. అది కంటికి చలువను కలుగ జేయును. కావున ఓరాజా! మీరు ఉదయము నిద్రలేచినది మొదలు మరల పరుండువఱకును ఆకుపచ్చ వస్తువులనుతప్ప అన్యమగు దేనిని చూడవద్దు. అట్లుచూచితిరా, మరల వ్యాధి ముదిరిపోవును. అని సలహానొసంగగా రాజు మిగులసంతసించి వ్యాధినివారణమునకు చక్కటి సదుపాయము లభించినదికదా యని సంతుష్టాంతరంగుడై తక్షణము అమాత్యశేఖరునిపిలపించి అతనితో నిట్లు పలికెను—మంత్రిగారూ! నా నొక్కి తగ్గుటకు, నేత్రవ్యాధి ఉపశమించుటకు వైద్యుడు ఆకుపచ్చవస్తువులనే చూచులాగున చెప్పి యుండెను. కావున ఉదయము నిద్రలేచి నది మొదలు రాత్రి పరుండు వరకును నాదృష్టిపథమునపడు సమస్తపదార్థములకును భవనములకును వాహనములకును ఆకు పచ్చరంగు వేయించుడు, ఈకార్యసాధనమున ఎంత ద్రవ్య మును ద్రవ్యమును వినియోగించుటకైనను నేను సంసిద్ధముగా నున్నాను. మీరు ఏమాత్రము వెనుకంజ వేయకుడు, అన్యథా భావింపకుడు. నేను చెప్పినట్లు చేయుడు.

ఇది ఉత్తమమైనదని యెఱుగుము" అని పలుక రాక్షసుడు-ఏ
ప్రకారముగ నా తత్త్వము నిర్ణయించెనో తెలుపమని వేడ, మంత్రి
యిట్లు వివరించి చెప్పెను-ఎవడు ఒక చెవిలో ప్రవేశించిన
బోధను మఱియొక చెవిగుండా వదలివేయునో అతడు
అధముడు.(అనగా వినినదానిని మఱచువాడని భావము).ఎవడు
ఒక చెవిలో ప్రవేశించిన దానిని నోటితో మాత్రము చెప్ప
గల్గునో అతడు మధ్యముడు. ఎవడు వినినదానిని హృదయము
నందు చేర్చి అనుభూతి నొనర్చుకొనునో అతడు ఉత్తముడు.
ఆ వాక్యములను విని రాక్షసుడు సంతుష్టుడై వెడలిపోయెను.
ఆ ప్రకారముగనే జనులలో మూడుతరగతుల వారుందురు.
ఎవరెవరు ఏస్థితియందున్నది గమనించుకొని ఉత్తమతరగతి
లోనికి ప్రవేశించుటకు యత్నించవలెను. అనగా తాము శ్రవ
ణముచేయు సత్య, ధర్మ, అహింసాదులను అనుభవములోనికి
తీసికొనివచ్చి ధర్మమూర్తులు, సత్యమూర్తులు, అహింసామూ
ర్తులు కావలెనని అర్థము.

చిత్రామృతం వామృతమేవ విద్ధి
చిత్రావలం వావలమేవ విద్ధి
చిత్రాగ్నివా మావమునగ్గినేతి
వాచావివేక స్త్వవివేక ఏవ.

'కాగితముపై చిత్రింపబడిన అమృతము అమృతము కాజాలదు. కాగితముపై గీయబడిన అగ్నిగాని, వాస్తవముగ అగ్ని కాదు, స్త్రీ కాదు. అట్లే వాచా . అవివేకమే యగును' అని వసిష్ఠులు శ్రీరామచంద్రునకు బోధించిన విధముగ వినినదానిని ఆచరణలో నుంచనివారి దీక్ష వ్యర్థమే యగును. కాబట్టి ముముక్షువులు కాము ముఖతఃగాని, శాస్త్రముఖతఃగాని యెఱుంగు ధర్మములన్ని ఆచరణయందుంచుకొని హృదయ పరివర్తనమునొంది ధన్యులు కావలయును. అట్టి ఆచరణశీలురే సర్వోత్తమమానవులని చెప్పదగును.

నీతి. బోధలను ఆచరణయందుంచువారే సర్వశ్రేష్ఠులు.

# జ్ఞానదృష్టి

ఒకానొక దేశమున ఒకరాజు కలడు. అతడు తన దేశప్రజల యెడల ఎంతయో దాక్షిణ్యము కలవాడై, దయార్ద్ర హృదయముతో వారలను చక్కగ పరిపాలించుచుండెను. ఇట్లుండ కొంతకాలమునకు ఆ రాజునకు తీవ్రమైన నేత్రవ్యాధి సంభవించెను. ఎండలోనికి వచ్చుటయే తడవుగా అతని నేత్ర

కొంతకాలమునకు మొదటి చెరువులోని నీళ్ళు చాల వరకు తగ్గిపోగా, రెండవచేప ఎట్లో తెప్పరించుకొని ఆచోటు వదలి నెమ్మదిగ పెద్దచెరువును చేరుకొని ప్రాణములను కాపాడుకొనెను. ఇక మానవ చేపయగు దీర్ఘసూత్రి ధీమాగా ఆ పాత చెరువునందే కాలము గడుపుచుండ ఒక జాలరివాడువచ్చి వలవేసి దానిని పట్టుకొని తన బుట్టలో వేసికొనగా అది గిల గిల తన్నుకొని మరణించెను.

ఈ ప్రపంచమే ఆ చెరువు. జీవుల ఆయుస్సే అందలి జలము. మృత్యువు రాకపూర్వమే, ఆయుస్సు క్షీణించక మునుపే, భగవద్ధ్యానము చక్కగా చేసికొనుచు నిరతిశయానంద రూపమగు పరబ్రహ్మమను సుఖసాగరమును ముందుగనే చేరి జీవితమును సఫలమొనర్చుకొనువాడే మొదటి చేపయగు దీర్ఘదర్శి. లక్ష్యప్రాప్తికై ఆలస్యముగ ప్రయత్నించువాడు రెండవచేపయగు ప్రాప్తకాలజ్ఞుడు. ఏ ప్రయత్నమున్ను సలుపక ప్రాపంచిక విషయభోగములందే కాలము గడుపువాడు మూడవదగు దీర్ఘసూత్రియను చేప.

నీతి : విజ్ఞుడగువాడు దూరదృష్టి కలిగి దైవ సాన్నిధ్యమునకై సత్వరముగ యత్నించి జీవితమును కడతేర్చుకొనవలెను. హ్రస్వదృష్టి కలిగి ప్రమాదమును తెచ్చుకొనరాదు.

# ఆచరణశీలుడే సర్వోత్తముడు

పూర్వము విక్రమార్కుడను మహారాజు ఉండెను. ఆతడొకనాడు తన మంత్రులతోను, సామంతులతోను, పురప్రముఖులతోను కొలువుతీర్చియుండ, ఆ సభామధ్యమున నొక రాక్షసుడు ప్రవేశించెను. అతనిచేతిలో మూడు పుత్తెలుండెను. ఆ భయంకర దృశ్యమును జూచి సభ్యులందఱును ఆశ్చర్యచకితులైరి. ఇంతలో నా రాక్షసుడు రాజును సంబోధించి ఓ రాజా! ఈ మూడుపుత్తెలలో నెయ్యది శ్రేష్ఠమైనదో మీలో నెవ్వరైనను నాకు తెలుపవలెను. అట్లు తెలుపనిచో మిమ్ముల నందఱిని ఈ క్షణములోనే భక్షించివైచెదను అని పలికెను. ఆ వాక్యమును విని సభ్యులు భయభ్రాంతులై ఆలోచనానిమగ్నులై ఆ పుత్తెలవంకనే చూచుచుండిరి. కాని ఒక్కరును జవాబు చెప్పజాలరైరి. ఇంతలో మంత్రి లేచి ఒక సన్నని ఇనుపతీగను తెప్పించి ఒక పుత్తెయొక్క చెవిలో దూర్చెను. అతీగ మఱియొక చెవినుండి బయటకు వచ్చివేసెను. "ఓ రాక్షసా! ఈ పుత్తె అధమమైనది, నికృష్టమైనది అని తెలిసికొనుము"-ఇట్లు పలికి మంత్రి ఆ తీగను రెండవ పుత్తె చెవిలో దూర్చగా అది నోటిగుండా బయటకు వచ్చెను. అంతట మంత్రి "ఓ రాక్షసా! ఇది మధ్యతరగతి పుత్తె" అని చెప్పి ఆ తీగను మూడవ పుత్తె చెవిలో దూర్చగా అది తత్క్షణమే హృదయములోనికి జొరబడెను. అపుడు మంత్రి "రాక్షసా!

రాజు యుక్క ఆ వాక్యములను విని, అతని ఆదేశమును శిరసావహించి మంత్రులు కొన్ని లక్షల రూప్యములను ఖర్చు చేసి కొన్ని బండ్ల నిండుగా ఆకుపచ్చ రంగు తెప్పించి పట్టణములోని ఇండ్లకు, రాజప్రాసాదములకు దానిని పూయించుచుండిరి. ఈపని నిమిత్తము సుదూరప్రాంతములనుండి కొన్ని వేలమంది కార్మికులు రప్పించబడిరి. వారు అహోరాత్రులు కృషిచేయుచు రంగు పూయుటలో నిమగ్నులైయుండిరి. సరిగా అదే సమయమున ఒక సాధువుగారు ఆ పట్టణమునకు వచ్చుట తటసించెను. రంగుపూయుచున్న ఆ దృశ్యమంతయు చూచి అతడు ఆశ్చర్యచకితుడై, దీనికి కారణమేమి? ప్రజల సొమ్మైను ఈ ప్రకారముగ రాజు దుర్వినియోగ పరచుట న్యాయమేనా? అని యోచించి నేరులో రాజు వద్దకువెళ్ళి రాజా! ప్రజల ద్రవ్యమును ఈప్రకారముగ వ్యర్థము చేయుట మీవంటి పెద్దలకు తగునా? అని ప్రశ్నింప అందులకు రాజు తననేత్రవ్యాధిని గూర్చియు, వైద్యుల సలహాను గూర్చియు చెప్పగా సాధువుగారు ముక్కుమీద వ్రేలు వేసికొని రామ, రామ, ఎంత అవివేకముతో కూడిన పనిని మీరు చేసితిరి! ఆకుపచ్చ వస్తువులకు రంగు వేయవలెను! ఆకుపచ్చ అద్దములు గల కండ్లజోడును ధరించినచో ప్రపంచమంతయు ఆకుపచ్చగా కనబడునుగదా! ఎంతసొమ్ము వృథాచేసితిరి! అని హితవు చెప్పి వెడలి పోయెను. రాజు సాధువరేణ్యుని సమయస్ఫూర్తిని

పుచ్చుకొని అకుపచ్చని కండ్లజోడును ధరించి తన నేత్రవ్యాధిని తొలగించుకొనుటయేకాక రంగు కొట్టుటను ఆవుటవలన మిగిలిన ధనమును సద్వినియోగపరచి ప్రజలయొక్క మన్ననలకు పాత్రుడయ్యెను.

నీతి. మనుజుడు తన దృష్టిని జ్ఞానమయముగ నొనర్చుకొని ప్రపంచమును బ్రహ్మమయముగ గాంచుచు పరమశాంతిని అనుభవించవలయును.

దృష్టిం జ్ఞానమయీం కృత్వా
పశ్యేత్ బ్రహ్మమయం జగత్

ప్రపంచము ఎట్లున్నను తనదృష్టిని పవిత్రమొనర్చుకొనినచో చాలును, విశ్వమంతయు ఆనందమయముగ గోచరించును.

## అజ్ఞాన వినాశనము

ఒకానొక గ్రామము వెలుపల ఒక మంచినీటి బావి కలదు. ఆ బావిలోని నీరు చాల తీపిగా ఉండుటవలన గ్రామస్థులు ఆ బావివద్దకే వచ్చును. ఆ ఊరిలో ఇంక ను చాల బావులు కలవు కాని అందలి నీరు చప్పగా ఉండును. కనుక గ్రామస్థులకు ఊరిబైటగల ఆ బావియే శరణ్యముగా

నుండెను. అయితే గ్రామస్థుల అశ్రద్ధవలన ఆ బావికిపిట్టగోడ
గాని, గిలకలుగాని ఏర్పాటు చేయబడలేదు. కనుక ప్రతివారును
అందలి నీటిని వంగి తోడుకొనుచుండిరి. ఆ బావికిచుట్టు గోడలే
నందువలనను, అది నేలమట్టమునకు సమానముగ ఉన్నందు
వలనను చాల ప్రమాదముగ నుండెను.

ఒకనాటి అర్థరాత్రి ఒకకుక్క ఆ ప్రాంతమున సంచరిం
చుచు అచట బావి ఉన్నదని తెలియక అమాంతముగ దానిలో
పడిపోయెను. రాత్రి అంతయూ ఆ నీటిలో గిలగిల కొట్టుకొనుచు
పాపమా శునకము తుదకు నీటిలో మునిగిపోయి ప్రాణమును
పోగొట్టుకొనెను. ఈ ప్రకారముగ బావిలో కుక్క చచ్చి పడి
యుండుట విషయము గ్రామస్థు లెవ్వరికిని తెలియదు. ఏల
యనగా ఈ సంఘటన అర్థరాత్రి జరిగియుండెను. మరునటిరోజు
తెల్లవారగనే గ్రామస్థులు మంచినీటికొఱకై కావళ్ళు, చేదలు
బిందెలు వగైరా తీసికొనివచ్చి మామూలుప్రకారము నీళ్ళు
చేదుకొని బిందెల నింపుకొనుచుండగా ఏదియో దుర్వాసన
నీటినుండి వెలువడుచుండుటను వారు గమనించిరి. దీనికి కారణ
మేమియని వారందరును యోచన చేయుదొడగిరి. దుర్వాసనా
కంపుకొట్టుచుండు ఆ జలమును త్రాగినచో, మరియు దానితో
వంట వండుకొని తినినచో ఆరోగ్యము భంగమగునని వారం
దరును తీర్మానించుకొని, ఇంటికొకరు చొప్పున వచ్చి వంతుల
ప్రకారము ఆ నీటిని తోడి పారపోయ దొడగిరి.

ఈ ప్రకారముగ బావివద్ద జనసమూహముచేరి కార్యోన్ముఖమై ఆ నీటినంతను చేదివేయ నారంభించెను. కాని ఎన్నివందల బిందెలు చేదివేసినను నీటియొక్క దుర్వాసన ఏమాత్రము తగ్గలేదు. నీటి అడుగున చచ్చిపడియున్న కుక్క యున్నంతవరకు దుర్వాసన యెట్లు పోగలదు? అయితే ఆ కుక్క విషయము ఎవరికిని తెలియనందున వారు తమ తోడుటను ఆపక అవిరామముగ కొనసాగించుచునే యుండిరి ఈ ప్రకారముగ ఉదయము మొదలుకొని మధ్యాహ్నమువరకు తోడిపోసినను దుర్వాసన తగ్గనందున విసుకెత్తిపోయి వారందఱును ప్రక్కనేగల ఒక చెట్టుక్రింద కూర్చొని కర్తవ్యమును గూర్చి ప్రశాంతముగా యోచన చేయదొడగిరి. అందొకడు బావిలోపల ఏదైనా మురికివస్తువు పడియున్నదేమో చూచిన బాగుండునని సూచింప, గ్రామస్థులందఱును ఆ సూచనను ఆమోదించి నీటిలో దమ్ముపట్టగల ఒకగజ ఈతగానిని దింపిరి. అతడు బావిలో మునిగి అడుగున అంతయు కలబెట్టి ఆ చచ్చిన కుక్క శరీరమును బయటకు తీసెను. కుళ్ళిపోయి కంపుకొట్టుచున్న ఆ శునక దేహమును గ్రామస్థులు దూరముగ పారవైచి దానిని మట్టితో కప్పివైచి వెంటనే బావివద్దకువచ్చి మరల ఆ నీటిని తోడివేయదొడగిరి.

కొంతసేపటికి నీరు స్వచ్ఛముగా నున్నదై ఏవిధమగు దుర్వాసనలేక పానయోగ్యముగా నయ్యెను. ఆమరుసటి దినమే

జనులందరును కలిసి ఆ బావికి పిట్టగోడ కట్టించి గిలకలు ఏర్పాటు చేసిరి. అప్పటినుండియు ఇట్టి అవాంఛనీయ సంఘటన ఏదియు మరల జరుగలేదు. ఆ బావి సర్వులకును మహోపకారిగ నుండుచు గ్రామస్థులకు వరప్రసాదముగ వెలయజొచ్చెను.

నీతి- బావిలో కుక్కకొక్క మృతదేహ మున్నంతవరకు నీరు ఎంతతోడినను వాసనపోనట్లు, అనాది అజ్ఞానము, జన్మాంతర వాసనలు హృదయమున ఉన్నంతవరకును, మనుజుడు పైపైన ఎన్నిప్రయత్నములు చేసినను శాంతి సుఖములను నోచుకొనలేదు. మూల అజ్ఞానమును ఆత్మవిచారణచే ఖండింప చేసి, అట్టి అజ్ఞానమను మృతశునక దేహమును హృదయ సరోవరమునుండి తొలగించిననేతప్ప జీవునకు పూర్ణసుఖము కలుగనేరదు.

# భగీరథ ప్రయత్నము

పూర్వము భగీరథుడను మహారాజు రాజ్యమును పరిపాలించుచుండెను. అతని గురువు పేరు త్రితలుడు. పూర్వజన్మ పుణ్యసంస్కారముచే భగీరథుడు గురుబోధను చక్కగ అనుభూతి మొనర్చుకొని ఆత్మజ్ఞానమును బడసి జనక మహారాజు వలె నిర్లేపముగ రాజ్యవ్యవహారములను గావించుచుండెను.

ఇట్లుండ ఒకనాడు కొందరు పౌరులు నృపాలుని యొద్దకు వచ్చి ఈ ప్రకారముగ మనవిచేసికొనిరి. "మహారాజా! మీరు ఆనందముగ రాజ్యపరిపాలనము చేయుచున్నారు. కాని మీ పితరులగు సగర పుత్రులు కపిలమహర్షి యొక్క శాపవశాత్తు ఇతరలోకములందు నానా దుర్గతులను పొందుచున్నారు. ఎన్నియో యిడుములకులోనగుచున్నారు. వారి వంశమున బుట్టిన మీరు వారి బాగోగులను ఒకింత విచారించవలసి యున్నారుగదా! వారి క్షేమమునకు వలసిన విధానములను ఆచరించవలసియున్నారు. కదా! స్వర్గమున ప్రవహించుచున్న మందాకినీ [గంగా] నదిని భూలోకమునకు తెచ్చినచో, ఆ మహాస్రవంతియొక్క పవిత్రస్పర్శచే మీపితరులందరును తరించి పోగలరు. కాబట్టి భూపాలా! ఆ గంగా నదిని భూలోకమునకు తీసికొనివచ్చు ప్రయత్నమాచరింపుడు! వారి వాక్యములను వినినపిమ్మట భగీరథుడు తన పితరులగు సగర పుత్రులయొక్క క్షేమమును వాంఛించినవాడై ఏకాంతమునకు బోయి తీవ్రతపంబును ఆచరింపదొడగెను.

గంగాదేవిని, పరమశివుని, జహ్నుమహర్షిని స్తోత్రముల చేయుచు ఆ ముగ్గురిని భక్తితో ఆరాధింపదొడగెను. కొంత కాలమునకు గంగాదేవి ఆకసమున ప్రత్యక్షమై ఏకారణముచే తన్నాహ్వానించుచున్నారని ప్రశ్నింప రాజు "తల్లీ! మాపితరులు

లోకాంతరము లందు నానాబాధల నొందుచున్నారు. నీవు భూలోకమున అడుగు పెట్టినచో నీయొక్క పవిత్రస్పర్శచే వారందఱును తరించి సద్గతి నొందగలరు. కాబట్టి భూలోకము నకు దయచేయుము" అనిపలికెను. ఆ వాక్యములను విని గంగాదేవి యిట్లు నుడివెను. భూపాలా! నేను గనుక భూలోకము నకు వచ్చినచో ఎందఱో పాపాత్ములు, దురాచారపరులు, నాలో స్నానముచేసి వారి పాపకాలమును,నాలో విడుచుదురు ఆ పాపభారమును నే నెట్లు మోయగలను? కాబట్టి రాజాలను.

గంగాదేవియొక్క ఆ వచనములను విని భగీరథుడు సహేతుకముగ నిట్లుప్రత్యుత్తర మిచ్చెను-"దేవి! కేవలము పాపులేనా నీలో స్నానము చేయునది? పుణ్యాత్ములు చేయరా?

సాధవో న్యాసినః శాన్తా ధర్మిష్ఠా లోక పావనాః
హరన్త్యఘంతేఽఙ్గసంగాత్తేష్వాస్తే ఽఘభిద్ధరిః

సాధుపుంగవులు, త్యాగశీలురు, శాంతస్వభావులు, ధర్మ పరాయణులు, లోకపావనతత్పరులు, ఎందఱో నీలో స్నానము చేయుదురు. మూర్తీభవించిన పుణ్యరాసులే వారు. వారి ప్రతి అంగము పుణ్యముచే తొణికిసలాడుచుండును.వారు సాక్షాత్ పుణ్యమూర్తులు.పాపమును పోగొట్టు శ్రీహరి వారి హృదయ సీమలందు విరాజమానుడై యుండును. అట్టి పుణ్యాత్ములు నీలో స్నానము చేయునపుడు వారి పుణ్యమును నీలో వదులు

దుగు. ఆ పుణ్యము పాపమును రహితమొనర్చి వేయును. కావున తల్లీ! గంగాదేవీ! నీకు అహితమేదియు కలుగనేరదు. భూలోకమునకు అవతరింపుము!"

భగీరథుని న్యాయసమ్మతములైన ఆ వాక్యములను విని గంగాదేవి సంతృప్తినొంది వెంటనే భూలోకమున అవతరించెను. ఆ తీర్థరాజముయొక్క స్పర్శచే భగీరథుని పూర్వులైన సగర పుత్రులందఱును పాపవిముక్తులై సద్గతిని బడసిరి. భగీరథుని తీవ్ర ప్రయత్నముచే భూలోకమునకు వరప్రసాదమువలె లభించిన దగుటచే ఆ పావనగంగానదికి భాగీరథి యను నామకరణమేర్పడెను. ఆ గంగామతల్లి వలననే భారత దేశమునకు సుఖశాంతులు లభించినవి.

భగీరథుడు ఎంతయో గొప్ప ప్రయత్నము గావించి, పట్టుదల వహించి, గంగావతరణమను మహోన్నత కార్యమును సాధించెను కనుకనే "భగీరథప్రయత్నము" అను పదము లోకమున వాడుకలోనికి వచ్చెను. ఏదిగాని సత్కార్యమును ప్రారంభించినపుడు మధ్యలో ఎన్ని ఆటంకములు సంభవించినను వానిని లెక్క చేయక ముందునకు సాగిన అనుకొనును [illegible] మరల్చక భగీరథయత్నము చేయుచు కార్యమును సాధించు వాడు ఉత్తమోత్తముడు.

పీఠి: మోక్షమార్గమున చనువట్టి సాధకుడు తీవ్రతరఅధ్యవసాయము కలవాడై ఆ ప్రకారము భగీరథప్రయత్నమాచరించి, త్రోవలోవచ్చు అవాంతరములను పరకుగొనక ఈ జీవితమందే మోక్షరూప మహోన్నత లక్ష్యమును సాధించి వేయవలెను.

# పట్టుదల

కళింగ పక్షియను చిన్నపక్షి యొకటి కలదు. (దానినే సంస్కృతములో టిట్టిభమని పేర్కొందురు.) అది యొకనాడు సముద్రతీరమున గ్రుడ్లుపెట్టి ఎచటికో పోయెను. తిరిగివచ్చి చూచు సరికి అవిలేవు. సముద్ర తరంగములు వానిని లోనికి ఈడ్చుకొని పోయినవి. ఆ పక్షియొక్క శోకము నెవరు వర్ణింపగలరు! దుఃఖము పొంగి పొరలెను. మనుష్యజాతి యైనను, పక్షిజాతియైనను మాతృహృదయము ఒకటేయేకదా ఎట్లకేలకు గుండె నిబ్బరము చేసికొని ఆ కర్తవ్యమునకు గడంగెను. ఈ పాడు సముద్రము నా గ్రుడ్లను తన పొట్టం బెట్టుకొనినది. ఇపుడీ సముద్రపు నీరంతయు నాముక్కుతో తోడివైచి నా గుడ్లను నేను తిసికొందును. బ్రహ్మదేవుడు

అడ్డు వచ్చినను సరే, ఈ పని జరిగి తీరవలసినదే. అని ఘోర ప్రతిజ్ఞను బూని తన ముక్కుతో ఒక్కొక్క బొట్టు సముద్రపు నీటిని తీర్చి బయట పుక్కిలించి వేయుచుండెను. ఆ సమయమున త్రిలోకసంచారి యగు నారదుడు ఆ దారిన పోవుచు ఆ పక్షి యొక్క విచిత్రచర్యను గమనించి సంభ్రమచేతస్కుడై అచటనే నిలిచి ఒకింతసేపు చూచుచుండెను. కాని పక్షి అతని వైపు ముఖము త్రిప్పలేదు. తన పనిలో తాను నిమగ్నమై యుండెను. కొంతసేపటికి నారదుడు దానిని పలుకరించి ఏల ఇట్లు నీటిని పుక్కిలించి వేయుచున్నావని ప్రశ్నింప, జరిగిన సమాచారమంతయును పక్షి చెప్పెను. నారదు డాశ్చర్యపడి "పిచ్చిదానా! ఇది ఎప్పటికైనను సంభవించునా? నీ వెచట సముద్ర మెచట? ఎన్ని యుగములకైనను నీవా సముద్రపు నీరంతయు తోడివేయగలవా? అసాధ్యమైన కార్యమును తలపెట్టకు, అని హితము చెప్ప, అంతట ఆ పక్షి మహాత్మా! కోటి యుగము లగుగాక! భూమి తల్లక్రిందు లగుగాక! భూమి తల్లక్రిందులుగాక! సూర్యచంద్రాదు లుదయించకుండుగాక! ఈ పనిని మాత్రము నేను విడువను. ఈ దుష్ట సముద్రమును హతమార్చువరకు, నా గ్రుడ్లను నేను తిరిగి తీసికొనువరకు అన్నాహారములు లేక, కంటిపై కునుకు లేక నీటిని సాధించివైచెదను అని బదులు చెప్పెను. పక్షి యొక్క ఆ వాక్యములను విని

నారదుని ఒపలు గగుర్పాటునొందెను. ఆహా! ఎంతటిసాహసము ఎట్టి ధీరత్వము! ఎటువంటి పట్టుదల! మనుష్యజాతిలోనే ఇట్టి దృఢవ్యవసాయశీలురు లేరే. ఇక పక్షిజాతిలో నట్లీర్పుడనో! ఓహో! ముముక్షువులకు చక్కని ఆదర్శమును జూపినది! ఈ పట్టుదలలో నూరవభాగమైనను కలిగియుండినచో మానవు లందఱును ఎపుడో ముక్తినొంది యుండెడివారు. అని మనం బున తలపోసికొని నారదుడు తన తపశ్శక్తిచే క్షణకాలము సముద్రము నెండింపచేయ, వెంటనే పక్షి తనగ్రుడ్లను తీసికొని వెడలిపోయెను. కనుకనే శాస్త్రములందు ఆ "టిట్టిభ" పక్షి యొక్క పేరు చిరస్థాయిగా నిలచిపోయెను.

ఉత్సేక ఉదధేర్యద్వత్ కుశాగ్రేణైకబిందునా
మనసో నిగ్రహస్తద్వద్భవేదపరిఖేదతః

"కులింగపక్షి తన ముక్కుతో ఒక్కొక్క నీటిబొట్టును వుక్కిలించి వేయుచు సముద్రజలమునంతను రిక్తమొనర్చు ధీరసంకల్పము నెట్లు గావించెనో, అట్లే సాధకుడు అఖిన్నుడై తన మనోనిగ్రహమును గూర్చిన నిశ్చయమును గావింప వలయును.—అని శాస్త్రములు పేర్కొనినవి. ఆధ్యాత్మిక్షేత్ర మున విజయము గాంచవలెనని మనుజుడు 'పవిత్రత, సహ

నము, పట్టుదల" అను శీలత్రియము చెక్కబడియున్న పతాక
మును ధరించి ముందునకు సాగిపోవలెను.

పీఠి— లక్ష్యసాధనకై గొప్ప పట్టుదల అవసరము.

## నౌకపై కాకి

ఉత్తుంగ తరంగ తాడితమగు మహాసముద్రముయొక్క
తీరమున ఒకానొక ఓడరేవు (Harbour) కలదు. అచట పెక్క
నావలు ఒడ్డున లంగరు వేసికొని నిశ్చలముగ నుండెను. కొన్ని
సముద్రములోనికి పోవుచుండెను. మఱికొన్ని సముద్రము
లోని సుదూర ప్రాంతములనుండి వచ్చుచుండెను. అది గొప్ప
వ్యాపారస్థలమగుటచే నిరంతరము ఏవియో కొన్ని ఓడలు
వచ్చుచుపోవుచునే యుండును, కొన్ని ఒడ్డున స్థిరముగ
నుండును. ఈ ప్రకారముగ ఒడ్డుననున్న ఒకానొక పడవ
మధ్యమున జండా కట్టుటకై ఒక పొడవైన గడకఱ్ఱ ఉండి
యుండెను. అది చాల ఎత్తుగ నుండెను. పడవ సముద్రపు
ఒడ్డున నిశ్చలముగ ఉండుట వలన ఒక కాకి ఎగురుచు వచ్చి
ఆ కఱ్ఱపైన వ్రాలెను.

కాకి కఱ్ఱపై కూర్చొని ఏదియో చింతన చేయుచుండెను
ఇంతలో పడవలోనికి నావికులందఱును ప్రవేశించి, దానిలో
నున్న మోటరు యంత్రమును నడిపించిరి. తోడనే పడవ

సముద్రములోనికి పోజొచ్చెను. క్రమక్రమముగ అది వేగమును పుంజుకొని సముద్రము లోనికి కొన్ని మైళ్ళు చొచ్చుకొని పోయెను. కాకి మాత్రము ఆ కఱ్ఱపైననే కూర్చొని యుండెను పడవ సముద్రములోనికి కొన్ని మైళ్ళు పోయిన తరువాత కఱ్ఱపై కూర్చొనియున్న ఆ కాకి ఎగిరి పోవలెనను సంకల్పము జనింపగా అది లేచి రివ్వున ఒకానొక దిసయందు ఎగిరి పోయెను. కాని ఎంతదూరము ఎగిరిపోయినప్పటికిని వ్రాలుటకు చెట్టు ఎచట? పుట్ట ఎచట? ఇల్లు ఎచట? అంతయు ఒకే జలార్ణవము! ఏవైపు చూచినను అగాధమైన మహాసముద్రము.

కాకి ఎగిరి పోయి, పోయి వ్రాలుటకు కెచటను ఆస్కారము లేనందు వలన తిరిగి ఆ కఱ్ఱపై కేవచ్చి వ్రాలుచుండెను. కొంతసేపు ఆ కఱ్ఱపైన కూర్చొని మరల ఎగిరి ఎగిరి, వ్రాలుట కెచటను తావులేనందున విసికి వేసారి చిట్టచివరకు ఆకఱ్ఱపైననే వ్రాలుచుండెను. దీనినే నౌకాగ్రకాకన్యాయ మని శాస్త్రములందు పేర్కొనిరి.

సాధకుని మనస్సు వైరాగ్యపరిపూరితమై సముద్రమధ్యమున గల నౌకపై కూర్చొనిన కాకి చందమున ఉండవలెను. మనస్సను కాకి దృశ్యవిషయములపైకి ఎగిరినను అవి నశ్వరములని, క్షణికములని, సారరహితములని, దుఃఖప్రదములని దానికి బాగుగ బోధించినచో అది వానిపై వాలక

ఆత్మయను కఱ్ఱపైకియే వచ్చి వ్రాలుచుండును. అట్లు కాక ప్రాపంచిక పదార్థములు శాశ్వతములనియు, సౌఖ్యదాయకము లనియు తలంచి వాని వెంట పరుగెత్తినచో, మనస్సు దృశ్య జాలమున తగుల్కొని కర్మబంధమును పెంచుకొని సంసార కూపమున పడి పుట్టుట చచ్చుట అను రొంపిలో దిగబడి పోవును. కాబట్టి సముద్రమున ఉన్న కాకివలె మనస్సును దృశ్యవిషయములపై వ్రాలనీయక ఈ ప్రకారముగ వైరాగ్యమును చక్కగ బోధించవలెను. "ఓ మనస్సా! ఎన్ని జన్మలు ఈ విషయ సుఖముల ననుభవించితివి! నీకేమైన తృప్తిగాని ఆత్మ శాంతి గాని కలిగినదా? ఈ అమూల్యమైన మానవ జన్మను భగవదాయత్తము చేయక ఏల వ్యర్థము చేసెదవు? క్షణికానందము కొఱకై అఱ్ఱులు చాచక కాలమును వ్యర్థపుచ్చక శాశ్వతమగు దైవసాన్నిధ్యము కొఱకై యత్నింపుము. దృశ్యముపై గాక ఆత్మపైననే దృష్టిని కేంద్రీకరింపుము".

ఇవ్విధముగ మనస్సునకు హితబోధ సల్పి సముద్ర మధ్యమునగల నౌకపై నున్న కాకి వలె దానిని ఎచటికిని ఎగరనీయక ఆత్మయను కఱ్ఱపై ననే స్థాపించ వలయును. ఒక వేళ ఎగిరినను వైరాగ్యమును బోధించి సముద్ర మధ్యమున గల కాకి వలె దృశ్యవిషయములపై వ్రాలకుండ చేయవలెను అత్తఱి వ్రాలుటకు చోటను అవకాశము లేనందున తిరిగి ఆత్మ యొద్దకే అది వచ్చి చేరును.

నీతి: మనస్సు దృశ్యవిషయముల నుండి విరతి చెంది నౌకాగ్ర కాకి వలె ఆత్మయను తట్టుపై ఎపుడు వచ్చి చేరునో అపుడు జీవునకు కలుగు అనుభూతియే జీవిత పరమావధి. అదియే జీవిత లక్ష్యము. అదియే మోక్షస్థితి.

## జ్ఞానముయొక్క విశిష్టత

ఒకానొక పట్టణములో ఒక పెద్ద గుడ్డలమిల్లు కలదు. వస్త్రములు తయారుకాబడు పెద్ద ఫాక్టరీ అది దానిలో కొన్ని వేలమంది కార్మికులు ప్రతి దినము పనిచేయుచుందురు. ఆ ఫాక్టరీ యజమాని ఒక కోటీశ్వరుడగు సేట్‌గారు. ఆ గుడ్డల మిల్లుద్వారా అతడు విస్తారమగు ధనమును సంపాదించుచుండును.

ఒకనాడు కార్మికులందరు చక్కగ పనిచేయుచుండ, అకస్మాత్తుగ ఆ ఫాక్టరీ ఆగిపోయెను. ఎందుకు ఆగెనో ఎవరికిని అర్థము కాలేదు. తత్క్షణమే అచటి కార్మికులు, ఆఫీసర్లు ఫాక్టరీ అంతయు తిరిగి ప్రతి వస్తువును జాగ్రతగ పరీక్షించిచూచిరి. కాని లోపము ఎచట ఉన్నదో ఒకరికిని స్ఫురించలేదు. ఒక్క గంటసేపు ఫాక్టరీ ఆగి పోయినచో యజమానికి కొన్ని వేల

రూపాయలు నష్టము వాటిల్లును. కాబట్టి ఆ సేట్ గారు వెంటనే ఊరిలోనున్న ప్రముఖ ఇంజనీరు వద్దకు వెళ్ళి మహా ప్రభో! మా ఫ్యాక్టరీ అకస్మాత్తుగ ఆగిపోయినది. తమరు దయ చేసి అచటికి వచ్చి లోపమెచటనున్నదో కనిపెట్టి, దానిని సవరించివేసి ఫ్యాక్టరీని తిరిగి నడుపుడు. తమకు సముచితమగు పారితోషికమును సమర్పించి కృతజ్ఞతను తెలియజేసెదను. ఆ మాటలను విని ఇంజనీరు గారు వేలకొలది కార్మికులు పనిలేక యుండుట గమనించియు, యజమానికి సంభవించుచున్న అపార నష్టమునుగూర్చి ఆలోచించియు తక్షణమే బయలుదేరి వచ్చి ఫ్యాక్టరీ అంతయు తిరిగి చూచి ఒకచోట పైకి లేచియున్న ఒక "నట్టు"ను సుత్తితో కొట్టెను. తోడనే ఫ్యాక్టరీ అంతయు చక్కగ నడువ జొచ్చెను. అపుడు యజమాని చాల సంతోషించి ఒక వెయ్యి రూపాయలను పళ్ళెములో నుంచుకొని కార్మికులందఱి సమక్షమున ఇంజనీరుగారికి సమర్పించెను. ఇంజనీరుగారు పరితృప్తుడై వెడలిపోయెను.

అతడు వెడలిన పిదప కార్మికులందఱును ఏదియో పరస్పరము ఆలోచించుకొని వారివారి విధ్యుక్తక్రియలను నెరవేర్పక పనులను వదలిపెట్టి ఫ్యాక్టరీ బయటగల మైదానమునందు గుమిగూడిరి. అనగా "స్ట్రైకు" చేసిరి. సేట్ గారికి విషయమేమియు అర్థముకాక కార్మికనాయకులతో సంభాషించగా వారందఱు

ఒక్కమ్మడిగా యజమానితో నిట్లు పలికిరి- సేటుగారూ! ఒక్క
సుత్తిదెబ్బ కొట్టినందుకు ఇంజనీరు గారికి వెయ్యి రూపాయ
లను సమర్పించితిరిగదా! అటువంటి సుత్తిదెబ్బలను మేము
రోజునకు ఎన్ని కొట్టుచున్నాము? ఆ దామాషా ప్రకారము
మాకు కూడ ఇంజనీరుగారికి ఇచ్చిన ప్రకారము ఇవ్వవలెను
గదా! అని చెప్పగా యజమాని వారికి చక్కటి సమాధా
నము చెప్పి శాంత పఱచెను. అతడిట్లు పలికెను.

“ఓ కార్మికులారా! ఒక్క సుత్తిదెబ్బ కొట్టగనే ఇం
జనీరు గారికి వెయ్యి రూపాయలిచ్చిన విషయము నిజమే, కా
ఆ వెయ్యి రూపాయలు సుత్తితో కొట్టినందుకు కాదు ఇవ్వ
నది. ఎక్కడ కొట్టవలెనో సూచించినందులకు ఇవ్వబడిన
సుత్తితో కొట్టుట గొప్పకాదు. ఎక్కడ కొట్టవలెనో
తెలివి గొప్పది. మీరందరు ఫాక్టరీ అంతయు తిరిగి చూచిరి
ఎందుకు ఎక్కడను కొట్టలేదు? ఫాక్టరీని మీరెందుకు నడపలే
పోయితిరి? కావున కొట్టుట గొప్పకాదు. ఎక్కడ కొట్టవలెనో
ఆ తెలివి గొప్పది. కర్మ మంచిదే కాని జ్ఞానముతో కూడినచో
అది ఇంకను గొప్పగ రాణించును.

యజమాని యొక్క సహేతుకములైన ఆ వాక్యము
లను విని కార్మికులందరును సంతోషించి, పరితృప్తులై వా
వారి పనులలో ప్రవేశించిరి.

నీతి:- యోగస్థః కురు కర్మాణి అని గీతాచార్యుడు తెలిపిన విధముగ జ్ఞానముతో గూడి కర్మలను చేయుట శ్రేయస్కరము. జ్ఞానముతో కూడినప్పుడే కర్మ శోభించును.

## జీవితముయొక్క క్షణభంగురత్వము

ఒక పట్టణమునకు అనతిదూరములో ఒక చిన్న గ్రామముకలదు. ఆ గ్రామమునకు అన్ని వసతులు సమకూర్చబడెను. ఒక దేవాలయము, ఒక పాఠశాల, ఒక పఠనమందిరము, ఒక చక్కని సరోవరము,ఒక ఉద్యానవనము ఆగ్రామమున కలవు. ఆ గ్రామస్థులకు వ్యవసాయమే ప్రధానమైన వృత్తి. వారిలో అక్షరాస్యులు చాలమంది కలరు.

ఒకనాటి ఉదయమున ఒక గ్రామస్థుడు వార్తాపత్రిక గొని దానిని చదువుచుండెను. అందొక ప్రకటన పెద్ద అక్షరములతో కళ్ళకు కొట్టినట్లు అగపడెను. అది ప్రభుత్వమువారి ప్రకటన. దానిలో ఈ క్రింది విధముగ తెలుపబడియుండెను.- అధిక ఆహారోత్పత్తి ప్రణాళిక ననుసరించి ఎక్కువ ధాన్యము పండించిన గ్రామమువారికి ఐదువేల రూపాయలు పారితోషికము ఇవ్వబడగలదు. ఆ ప్రకటనను ఆ గ్రామస్థుడు చదువు

కొని ఆనందపరవశులై తక్కిన ఉత్సాహవంతులగు గ్రామ
స్థులకు దానిని చూపి వారందరిని రెచ్చగొట్టి ఆ బహుమాన
మును తమ గ్రామమువారే పడయుటకు శతవిధముల ప్రయ
త్నించి తీరవలెనని వక్కాణించెను. అతని ఆవేశపూరితము
లైన సహేతుకములైన వాక్యములను విని తక్కిన గ్రామస్థు
లందరును శబాష్ అని దానిని ఆమోదించి, ఆ వత్సరము
ప్రభుత్వము వారి బహుమానమును తామే సంపాదించవలెనని
కృతనిశ్చయులైరి. అపుడు వారందరును ఒకచోట సమా
వేశమై, ఆహార ధాన్యమును అధికముగ పండించుటకు వలసిన
సాధన గూర్చి కూలంకషముగ చర్చించుకొని తుదకు ఈ
విధముగ తీర్మానించుకొనిరి.

"మన గ్రామములో ఖాళీగా ఉన్న ప్రతిచోట పైరు
వేయవలసినదే! ఏ ఒక్క అంగుళము స్థలమును కూడ వృథా
చేయరాదు." ఆ ప్రకారమే వారు కార్యాచరణకు దిగిరి.
అందుకు నడుము కట్టుకొని ఎద్దులు, నాగేళ్ళు, మడకలు.
మాచులు మొదలైనవి వెంటబెట్టుకొని రాత్రింబవళ్ళు ఎడ
తెరపి లేకుండ శ్రమించి పైరువేసిరి. గ్రామములో ఒక్క చివర
స్థలము కూడ విడచి పెట్టకుండ పైరు వేసిరి. అపుడా గ్రామ
స్థులలో ఒకనికి ఒక విచిత్రమైన ఊహ జనించగా దానిని
తక్కిన గ్రామస్థులందరికిని తెలియచేసెను. అది యేమనగా

"శ్మశానమును ఏల ఖాళీగా ఉంచవలెను! ఆ ఎకరము స్థలము నకూడ దున్ని పైరు వేసినచో చక్కగ పండి బహుమానము నిక్కముగ చేతికి వచ్చుటకు ఆస్కార మేర్పడగలదు." అతని అభిప్రాయమును గ్రామస్థులందఱును భళి, భళీ యని ప్రశంసించి ఆ ప్రకారమే ఆ స్థలమునకూడ దున్ని పైరు పెట్టిరి. ఈ ప్రకారముగ ఆ గ్రామ మంతయును పైరు పచ్చలతో గూడి నిగనిగ లాడుచు కనుల పండువగ నుండెను. బహుమానము తమకు తప్ప మఱెవరికిని రాదను ధీమాతో వారుండిరి పైరు పెన్ను వేయుచుండెను.

సరిగా ఆ సమయమున ఆ గ్రామములో ఒకరింటియందు ఎవరో చనిపోయిరి. అతని ఎక్కడ పాతి పెట్టవలెనో ఇంటి వారికి తోచలేదు. గ్రామస్థులందరు కీకమక పడుచుండిరి శ్మశానములోనా రవ్వంతచోటు కూడ ఖాళీగాలేదు. అచటనే ఒకచోట కొంచెము పైరు పీకి అక్కడ ఖననము చేసిన బాగుండునని ఒకరు సూచించగా, పెక్కుమంది గ్రామస్థులు అట్లు చేయుటకు వీలులేదనియు, దానివలన ధాన్యము తగ్గి బహుమానము చేయిజారి పోవుననియు చెప్పి ఆ సూచనను నిరాకరించిరి. తుట్టతుదకు ఆ యింటివారికి మార్గాంతరము లేక తమ గృహ ఆవరణములోనే ఒక మూలగ ఖననము ను జరిపి తృప్తిపడిరి.

పైరు పండి చేతికి వచ్చు వరకు ఆ ఆరునెలలు గ్రామములో అందరును క్షేమముగ ఉందురని తలంచిరి. కాని శరీరము శాశ్వతమా? అది బుడగ వంటిది. మంచు వంటిది. ఏ క్షణమునందు అది రాలి పోవునో ఎవరికిని తెలియదు. అది క్షణభంగురమైనది.

నీతి : శరీరము యొక్క నశ్వరత్వమును,క్షణభంగురత్వమును బాగుగ గుర్తెరింగి, దానితో చేయవలసిన ఆధ్యాత్మిక సాధనలను త్వరితముగ పూర్తిచేసి, అది రాలిపోవు లోపలనే లక్ష్యమగు భగవత్సాక్షాత్కారమును,ఆత్మానుభూతిని శీఘ్రము సంపాదించ వలెను.దినానుదినములను లెక్కపెట్టుచు కాలమును వ్యర్థపరచ రాదు.శరీరమను పడవ చిల్లి పడకమునుపే సంసార సాగరమును దానితో దాటివేసి ఆవలి ఒడ్డగు పరమాత్మను చేరవలెను.

—○—

# సత్ప్రయత్నము

ఒకానొక పట్టణమున ఒక మహారాజు కలడు. అతని రాజ్యము నలువైపుల చాల దూరము విస్తరించి యుండెను. అతడు ప్రజలను ధర్మబుద్ధితో, న్యాయమార్గమున చక్కగ పరిపాలించుచుండెను. ఆ రాజునకు ముగ్గురు కుమారు లుండిరి. వారు పెరిగి పెద్దవారై రాజ్య కార్యనిర్వహణమును గూర్చి తండ్రిగారివలన తెలిసికొనుచుండిరి.

కొంతకాలమునకు రాజునకు వృద్ధాప్యము వచ్చెను. శరీరము పంచభూతాత్మకము గనుక అది సహజముగనే షడ్భావ వికారములకు లోనగుచుండును. బాల్యము యౌవనముగను, యౌవనము వార్ధక్యముగను పరిణతి జెందుచుండును. ఆత్మ వలె అది నిర్వికారమైన వస్తువు కాదు గదా! రాజున కెప్పుడు తన శరీరముపై వార్ధక్యసూచనలు కనిపించెనో అప్పుడాతడు నిట్లు వితర్కించుకొనెను —

"ఈ శరీర మెందుకొరకు వచ్చినది? తరించుటకు, మరి నేను తరించుటకై ఏమైన ప్రయత్నము చేసినానా? లేదు. మానవ శరీరము మరల మరల వచ్చునది కాదు. బహుజన్మ సుకృతమువలననే ఇది సంభవించుచుండును. మరిఇట్టి అను వైన శరీరము లభ్యమైనపుడు మోక్షప్రాప్తికై ఒకింతైనను ప్రయత్నము సలుపకుండుట వెఱ్ఱికదా! మనస చక్కగా ఉన్న

పుడే నదిని దాటివేయుట ఉత్తమముకదా! ఈ శరీరమును నాశ
చెందకముందే, అనారోగ్యము దాపురించక మునుపే,
వార్ధక్యము రాకపూర్వమే, దానిద్వారా మోక్షసంపాదనము
గావింపవలెనని పెద్దలు చెప్పుచున్నారు. శాస్త్రములన్నియు
ఆ విధముగనే ఉద్ఘోషించుచున్నవి. నేనంతయో అజాగ్రత
పడితిని. భగవత్స్మరణ చేయక, మోక్షప్రాప్తికి అవసరమైన
ఒక్క సాధననైనను అనుష్ఠించక జీవితమును నిరుపయోగము
చేసికొంటిని. ఈ సంపదలే సత్యమనుకొని, ఈ రాజ్యభోగ
ములే స్థిరములని భావించి, ఈ బంధు బాంధవులే శరణ్యులని
తలంచి ఈ క్షణిక సంసార సౌఖ్యములను పట్టుకొని వ్రేలాడి
అమూల్యమైన ఈ మానవజీవితమును వ్యర్థము చేసితిని. ఇక
నైనను ఈ జంజాటము నుండి విడుదల పొంది, ఈ సంసార
మను సుడిగుండము నుండి బయటపడి ఎచటనైన ఏకాంత
స్థలమున పరమాత్మను గూర్చి చింతనచేసి తరించుట
ఉత్తమము"

ఈ ప్రకారముగ ఆలోచించుకొని అతడు తన రాజ్య
భారమును తన ముగ్గురు కుమారులలో ఎవరికైన అప్పజెప్ప
వలెనని తలంచి ముగ్గురిలో అట్టి కార్యమునకు ఎవరు సమర్థులో
యోచింపదొడగెను. రాజ్యకార్య నిర్వహణములో వారి వారి
సామర్థ్యమును పరిశీలింపదలంచి ఆరాజు చక్కని ఉపాయమును
అవలంభించెను. ఒకదినమున తన కుమారులందరిని పిలిచి

ఒక్కొక్కరికి ఒక వెయ్యిరూపాయలనిచ్చి "నాయనలారా ఈ పైకమును తీసికొని వెళ్ళి దూరదేశములకేగి దానితో వ్యాపారముచేసి ద్రవ్యమును సంపాదించి ఒక్క సంవత్సర కాలమైన వెనుక మరల ఇనటికి రావలసినది" అని ఆజ్ఞాపించెను.

తండ్రి ఆజ్ఞను పురస్కరించుకొని ముగ్గురు రాజకుమారులును ఆ వెయ్యిరూపాయలను వెంటబెట్టుకొని సుదూర ప్రాంతములకేగి ఒక్కొక్కరు వేర్వేరు ప్రదేశములలో స్థిరపడి వ్యాపారమును కొనసాగించిరి. అందులో ఒకడు భోగలాలసుడు. తండ్రి ఇచ్చిన ద్రవ్యమును క్రీడావినోదములకు, భోగవిలాసములకు ఖర్చుపెట్టి కొద్ది పైకమును మిగుల్చుకొని దానితో వ్యాపారము ప్రారంభించగా పెద్దనష్టము సంభవించెను. ఇక రెండవవాడు వ్యాపారమును ప్రారంభించి ఎక్కువ తెలివితేటలు లేనివాడగుటచే లాభమును బడయలేకపోయెను. అయితే కొంత విజ్ఞతవలన నష్టము రాకుండ చేసికొనగల్గెను. ఇక మూడవవాడు చిన్నప్పటినుండియూ ఎక్కువ ప్రజ్ఞావైభవము, కలవాడగుటవలనను, గొప్ప పట్టుదల, కార్యదక్షత, కార్యకుశలత్వము కలవాడగుటచేతను వ్యాపారమున అమిత లాభమును సంపాదించగలిగెను.

ఈ ప్రకారముగ ముగ్గురు రాజసోదరులును భిన్నభిన్న ప్రాంతములందు తండ్రి ఆజ్ఞను పురస్కరించుకొని వ్యాపారము

చేసి సంవత్సర కాలము పూర్తికాగానే ఇంటికి తిరిగివచ్చిరి. అప్పుడు మహారాజు వారి ముగ్గురిని పిలిచి వారివారి కార్యక్రమములను గూర్చి ప్రశ్నింపగా మొదటివాడు వ్యాపారములో నష్టము వచ్చినదని చెప్పెను. రెండవవాడు తనకు లాభము రాలేదు, నష్టము రాలేదు అని చెప్పెను. మూడవవాడు వ్యాపారములో తాను గడించిన లాభమును తీసికొని వచ్చి తండ్రికి సమర్పించి తన విజయగాథను వివరించి చెప్పెను. అప్పుడు తండ్రియగు మహారాజు మొదటి ఇరువురు ధీశాలురు కానందు వలన రాజ్యపాలనకు అనర్హులని నిర్ణయించి మూడవవానికి రాజ్యాధికార మప్పగించి, పట్టాభిషేకము చేసి తాను ఏకాంతవనమున కేగి తపస్సు చేసి, దైవధ్యాన మాచరించి భగవత్కృపకు పాత్రుడై జన్మ సార్థకత నొందెను.

పై చరిత్రలోని రాజకుమారులవలె జనులలో మూడు తరగతుల వారు కలరు. కొందరు పుణ్యము సంపాదించక పాపకార్యములనే ఆచరించుచు అధోగతికి పోవుచుందురు. మరికొందరు పుణ్యము నేమియు సంపాదించక పాపములో ప్రవేశించక ఉందురు. కొందరు పాపమును ఏమాత్రము దరికి చేరనీయక పుణ్యమునే సంపాదించుచుందురు. మూడవ తరగతివారు ధన్యులు, కృతార్థులు, కృతకృత్యులు. వారు జన్మమును సార్థకము చేసికొనువారు. ఈ జీవితమందే వారు తమ

ప్రయత్నాతిశయముచే ఆత్మజ్ఞానమును బడసి కైవల్య ప్రాప్తి నొందగలరు.

**నీతి:** సత్ప్రయత్నముచే జనులు మూడవ రాజకుమారునివలె పుణ్యధనమును, జ్ఞానధనమును చక్కగ ఆర్జించి, పాపమును నష్టమును దూరీకరించి, తండ్రియగు పరమాత్మ యొక్క మెప్పును బడసి వారి అనుగ్రహమునకు పాత్రులై తరించవలెను.

## దేవునకు సన్నిహితుడు

పూర్వమొకప్పుడు కాశీవిశ్వనాథుని దేవాలయ ప్రాంగణమున ఆకసమునుండి ఒక బంగారు పళ్లెరము అకస్మాత్తుగ పడెనట! ఆ పళ్లెరముపై నా భక్తునకు అను అక్షరములు వ్రాయబడియుండెను. తళతళ మెరయుచున్న ఆ పసిడిపళ్లెరమును గాంచుటతోడనే అచట పూజచేయుచున్న పూజారి వెంటనే పరుగెత్తుకొనవచ్చి పేరాశచే దానిని పట్టుకొని పారిపోవనెంచెను. కాని ఏమి దురదృష్టమో, దానిని తాకగనే అది మట్టిపళ్లెరముగ మారిపోయెను, ఆ మట్టిమూకుడు జూచి ఏవగించుకొని పురోహితుడు దానిని జారవిడువగ తక్షణమే యది మరల హిరణ్యయరూపమున చెన్నొందెను. ఈ ప్రకారము

ఎంతయో వచ్చి దానిని తాకిరి. తత్క్షణమే అది మృణ్మయముగ మారిపోవుచుండెను. వారు కదలిన వెంటనే మరల బంగారు వస్త్రముగ వెలుగొందుచుండెను. రాజులు వచ్చిరి. మహారాజులు వచ్చిరి. చక్రవర్తు లేతెంచిరి. కవిపుంగవులు వచ్చిరి. బలవంతులు వచ్చిరి. సింహపరాక్రమశీలురగు మల్లు లరుదెంచిరి, వాదసేయులు వచ్చిరి, ఉపన్యాసకర్తలు వచ్చిరి. కాని వారు తాకినను, మరుక్షణమే మట్టిగా మారుచుండెను. ఈ వింతను జూచుటకు దూర దూర ప్రాంతములనుండి జను లేతెంచిరి. మందిరమంతయు జనసమ్మర్దముతో కూడి యుండెను. వచ్చిన వారిదగ్గఱ యాచించుటకు బిచ్చగాళ్లు, వికలాంగులు కూడ వచ్చి బారులు తీర్చి కూర్చొనియుండిరి. ఈ సంరంభమంతయు జూచి ఆశ్చర్యపడి ఒకానొకడు అసలు విషయమేమియో తెలిసికొనవలెనని మెల్లగా మందిరములోనికి పోవుచుండెను, దారిలో కూర్చొనియున్న కుంటి గుడ్డివారల జూచి అతని హృదయము ద్రవించిపోయెను. కంటివెంట బాష్పములు రాలుచుండెను. కాని వారికి సహాయము చేయుటకు అతనియొద్ద కాసెచటి కడు బీదవాడు, ఎట్లో గుండె నిబ్బరముచేసికొని లోనికేగి ఆ బంగారు వస్త్రమును తాకెను. కాని ఏమి యాశ్చర్యమోకాని అట్లు తాకినను అది తన సహజలావణ్య సువర్ణచ్ఛాయలను వీడలేదు. చుట్టురున్న వారందఱును

జయజయధ్వానములు చేసిరి. భగవంతుడెన్నుకొనిన వీరుడితే? యని సర్వులును ఆనందపడిరి

ఆతనికి విద్యలేదు, ధనములేదు, ప్రాపంచిక కీర్తులులేవు కాని హృదయకోమలత్వము మాత్రము కలదు. దయ, ప్రేమ, కరుణ అతనియందు తొణికిసలాడుచుండెను ఆదియే అతని ధనము. అదియే అతని సర్వస్వము. ఇన్నికోట్లమంది జీవరాసులలో ఆ ఒక్కడే భగవంతునకు ప్రీతిపాత్రు డెట్లుకాగల్గెనో ఒకింత యోచింపుడు. జీవితములో ఎద్దానియందు దృష్టిని ఎక్కువగా కేంద్రీకరించవలెనో ఆలోచించుడు. ధనముండుగాక, విద్యయుండుగాక, భవనములుండుగాక, కాని వానితోపాటు కోమల హృదయము కూడ నుండవలెను. దైవీసంపత్తు కూడ నుండవలెను. సర్వేశ్వరుని యెడల అచంచలమైన భక్తి సర్వభూతకోట్లయెడల దయ-ఇవి ప్రధానముగ నుండవలెను. తక్కినవి యెట్లున్నను మనుజుడు తన నైతిక, ఆధ్యాత్మిక (Moral and Spirtual) దృష్టిని పూర్ణముగ వికసింపజేసికొనవలెను. కేవలము భౌతిక బలముపై నాధారపడువాడు ఎప్పటికైనను పతనమొందియే తీరును, నిరాశానిస్పృహలను ఎదుర్కొనును. తుట్టతుదకు అపజయమునే వరించును.

ప్రీతి, హృదయశుద్ధి, పవిత్రత, కరుణ—మున్నగు సద్గుణములు కలవాడే లోకమున భగవంతునకు మిగుల సన్నిహితుడు కాగల్గునుకాని తదితరులుకారు.

## దైవసామీప్యము

ఒకానొక గ్రామములో ఒక ధనికుడు కలడు. అతడు గొప్పలక్షాధికారి. జీవితమంతయు చెమటకార్చి సంపాదించి లక్షలుగడించెను. కాని కొంతకాలమునకు వార్ధక్యము ప్రాప్తించెను. ఎటువంటి వానికైనను శరీరము తన ధర్మమును నెరవేర్చునుగదా! బాల్యము, యౌవనము, వార్ధక్యము-అను మూడును దేహధారులందఱికిని వరుసగ వచ్చుచునేయుండును. అతడు వృద్ధుడై దేహదార్ఢ్యము తగ్గిపోగా, ఇంటినుండి బయటకు కదలలేని పరిస్థితి ఏర్పడెను. అతని కొక్కడే కుమారుడు కలడు. అతడు పెరిగి పెద్దవాడై తండ్రియొక్క వ్యాపార కార్యక్రమములను నెరవేర్చుచుండెను.

కొంతకాలమునకు అతనికి వివాహము జరిగెను. సాంసారిక జీవితమును గడుపుకొనుచు వ్యాపారకార్యక్రమములను పర్యవేక్షించుచు నుండెను. కాని అతడు భోగలాలసుడై విషయవ్యామోహములందు పడి ధనమును దుర్వ్యయ

వఱచుచుండెను. వ్యసనములందు తగుల్కొని ఇంద్రియములకు దాసానుదాసుడై తండ్రి కష్టపడి సంపాదించిన ద్రవ్యమును బూడిదపాలు చేయుచుండెను. ఇదియంతయును గమనించి, కుమారుని దుశ్చేష్టలకు వగచి, తనసొత్తంతయు క్రమక్రమముగ తరగిపోవుచుండుటను గాంచి, తండ్రి మిగుల ఖిన్నుడై కుమారునకు తెలియకుండ తన యావదాస్తిని బంగారముగను ఆభరణములుగను, రత్న వైడూర్యములుగను మార్చివేచి దానినంతను ఒక బంగారపు బిందెలో పెట్టి ఒకనాటి రేయి అందఱును నిద్రించుచుండగా తన దొడ్డిలో ఒకచోట భూమిలో లోతుగ పాతిపెట్టెను.

కాలచక్రము గిఱ్ఱున తిరిగిపోవు చుండెను. రోజులు నెలలు సంవత్సరములుగను పరిణమించుచుండెను. ఇట్లుండ ఒకనాడు ఆ వృద్ధ శ్రీమంతునకు తీవ్రమగు వ్యాధి తగుల్కొనెను. ఎన్నియో మందులు వాడిరి ఎందఱో వైద్యులు వచ్చి వారి వారికి తోచిన ఉపచారములు చేసిరి. కాని రోగము తగ్గలేదు. పైపెచ్చు పెరుగుచుండెను. అసలే వార్ధక్యము. అందులో తీవ్రమగు రుగ్మత. కావున ఇక ఎక్కువకాలము జీవించలేనని అతడు నిర్ణయించుకొని, తాను సంపాదించిన ధనమంతయు బంగారురూపముగ దొడ్డిలో నున్నట్లు తన కుమారునకు తెలియజేయ దలంచెను. తనకు వారసుడు అతడే కాబట్టి

ఏనాటికైనను ఆస్తివిషయము అతనికి తప్పక తెలుపవలసి యుంటుందని నిశ్చయించుకొని, మఱునటి దినము ఉదయముననే బంగారు బిందెయొక్క జాడను అతనికి ఎఱుకపఱచదలంచెను.

కాని విధివైపరీత్యము వలన ఆరోజు రాత్రి వ్యాధి తీవ్రముగ ప్రకోపించగా కంఠము నిరుద్ధముకాగా ఏమియు పలుకలేకుండెను. అశక్తతవలన సైగకూడ చేయలేక పోయెను. అట్టి పరిస్థితులలో కొంతసేపటికి అతని ప్రాణవాయువు అకస్మాత్తుగ అంతరించెను. నాడిఆగిపోయెను. తండ్రి చనిపోగా అపుడు కుమారుడు తండ్రికి చేయవలసిన ఔర్ధ్వదైహిక కర్మలను యథారీతి ఆచరించి మధ్యాహ్నము భోజన సమయము కాగా వంటశాలలోనికి వెళ్ళి చూడ అచట అన్నములేకుండను పోనీ, డబ్బుతీసికొని వెళ్ళి ఊరిలో భుజించెదమా యనిన ఇనుపపెట్టె తెఱచి చూడగా అచట ఒక్క కాసైనను లేదు. ఆకలి మండిపోవు చుండెను. దొడ్డిలోదాచిపెట్టబడిన బంగారపు బిందె విషయము అతనికి తెలియనే తెలియదు.

ఇట్టి వికట్కర పరిస్థితియందతడు ఏమియు తోచక ఒక పాత్రను చేతబట్టుకొని గ్రామములో భిక్షాటనకై బయలు దేరెను. ఇంటింటికివెళ్ళి "భవతీ భిక్షాందేహి" అని అడుగుకొనుచు ఒక్కొక్క కబళమును పాత్రిలో వేయించుకొను చుండెను. ఎంత దైన్యము! లక్షాధికారి కాలవైపరీత్యముచే

భిక్షాధికారిగ మారిపోయెను. ఒకనాడీ ప్రకారము అతడు భిక్షా
టనము సలుపుచుండ ఒక పెద్దమనిషి అతనినిచూచి "ఏమయ్యా!
లక్షాధికారి కుమారుడవు కదా! భిక్షాటనము చేయు గ్రహ
చార మేల పట్టినది?" అని ప్రశ్నించగా, అతడు నిజమే, లక్షా
ధికారి కుమారుడనే. కాని ఆ లక్షలు మానాయన ఎచట
ఉంచినాడో, ఎచట దాచిపెట్టినాడో తెలియదు. కావున ఈ
దౌర్భాగ్యము కలిగినది అని చెప్పగా వెంటనే ఆ పెద్దమనిషి
మీనాయన నాకు ప్రాణస్నేహితుడు. అతడు జీవించియున్న
కాలములో తన యావదాస్తిని బంగారు రూపమున మార్చి
దొడ్డిలో దాచిపెట్టదలంచినట్లు నాకు చెప్పినాడు. కాబట్టి ఆ
ప్రకార మతడు దొడ్డిలో దాచెనో లేదో చూతము రమ్ము!
అని చెప్పెను.

అతని వాక్యానుసారము శ్రీమంతుని తనయుడు దొడ్డి
యంతయు త్రవ్వించగా ఒక చోట బిందె కనిపించెను అందరు
ఆశ్చర్యచకితులైరి. ఆ సంపదను స్వీకరించి అతడు వైభవ
ముగ జీవితమును గడుపసాగెను

నీతి : దుఃఖరహితముగు ఆత్మ తన స్వరూపమే అయి
యున్నను జీవుడు అజ్ఞానవశమున దానినెఱుగక దుఃఖపరిత
ప్తుడై నానాయాతనలను పొందుచున్నాడు. సద్గురువు వచ్చి
నాయనా! నీవు దుఃఖస్వరూపుడవు కావు, అనంతానందము నీ

సాక్షి. ఆనందమే నీస్వరూపము. సచ్చిదానందాత్మవే, నీవ
అని బోధింప సంసారతాపపరితప్తుడగు జీవుడు ఆ వాక్యము
లను విశ్వసించి గురూపదిష్ట మార్గమున పయనించి, పెక్కు
సాధనలను గావించి, ఆత్మ సాక్షాత్కారమును బడసి పరమా
నందమును బడయుచున్నాడు. దైవసాన్నిధ్యముచే, దైవ
స్వరూపప్రాప్తిచే ఆనందసాగరమున ఓలలాడుచున్నారు!

# ప్రపంచముయొక్క నశ్వరత్వము

పూర్వ మొకానొక రాజు తన దేశమును చక్కగా
పాలించుచుండెను. అతడు పెక్కు సంపదలతో ఐశ్వర్యములతో
ధనధాన్య సమృద్ధితో తులతూగుచుండెను. అన్ని హంగులతో
కూడిన పెద్ద పెద్ద రాజభవనములు, ఉద్యానవనములు, అపా
మగు భూసంపద అతనికి కలదు. ఎందఱో అమాత్యశేఖరులు
రాజ్యకార్యనిర్వహణ దక్షులు, నౌకరులు, పరిచారకులు,
జనము అతనికి కలరు. వారందఱును వారివారికి నిర్దేశింపబడి
కార్యకలాపములను చక్కగా చేయుచునుండిరి. ఆ రాజు
సించునట్టి రాజప్రాసాదము పలువైపుల విస్తరించి చూచుట
ఒక పెద్ద ఊరువలె కన్పించుచుండెను. తన రాజవైభవ
లన్నిటిని చూచుకొని ఆ రాజు మురిసిపోవుచు తనంతటి రా

గాక, తన రాజ్యమంతటి రాజ్యముగాని మఱెచటను లేదను అహంభావము కలిగియుండెను.

ఇట్లుండ ఒకనాడా నృపాలుడు మృగయావినోదమునకై తన పట్టణమునకు సుదూరముననున్న ఒకానొక అరణ్యమున సంచరించుచుండ ఒక ఏకాంతప్రదేశమున ఒక వృక్షము క్రింద ఒక మునిపుంగవుడు కూర్చొనియుండుటను చూచెను. అంతటి నిర్జనప్రదేశమున కాత డెందులకు వచ్చెను? అతడెవరు? ఎందుల కావిధముగ ఏకాంతమున కాలమును గడుపుచుండెను? ఈ మొదలగు విషయములను తెలిసికొనదలంచినవాడై ఆ రాజు మునివర్యుని సమీపించి పరికింప అతని శరీరాకృతి యందు ఒక విషయము రాజునకు కండ్లకు గొట్టినట్లు అగపడెను. ఆ ఋషియొక్క శరీరమంతయు రోమమయముగ నుండి నప్పటికిని మోచేతిమీద చింతగింజంత స్థలమున మాత్రము వెంట్రుకలు లేవు. ఆ ఋషిస్వస్వరూపమగు పరబ్రహ్మమునందు నిలుకడ కలవాడై, మహోల్లాసముగ కన్పట్టుచుండెను.

రాజు! మహర్షి చెంతకు పోయి మహాత్మా! ఈ ఏకాంత ప్రదేశమున శీతోష్ణాదులను సహించుకొనుచు, ఆహారము కొఱకై యిబ్బందులు పడుచు, ఇంత కష్టపడనేల? మా పట్టణమునకు రండు. సకలైశ్వర్యములు మీరు అనుభవించవచ్చును

ఆహార విషయమున గాని, వస్త్ర విషయమునగాని, మరే విషయమునగాని మీకు లోటుండదు ఎందరో భృత్యులను వినియోగించెదను. పరుండుటకు చక్కని పాన్పులు కలవు. ఈ నిర్జనారణ్యమున ఈ ప్రకారముగ బాధపడక తక్షణమే నా రథముపై కూర్చుండుడు. మిమ్ములను నగరమునకు చేర్చి ఆనందింపజేసెదను.

ఈ ప్రకారముగ భూపాలుడు తపస్వితో చెప్పగా, ఆ తాపసి పకపక నవ్వి రాజా! నా కిచట ఆనందమునకు కొదవ యుండినగదా నీరాజ్యమునకు వచ్చుటకు! దుఃఖము లవలేశము కూడ లేనట్టి ఆత్మ యందు నేను సదా స్థితిగల్గి ఇంద్రాదులు అనుభవించు ఆనందముక కంటె అధికమైన ఆనందమును అనుభవించుచున్నాను. ఇక నీ రాజసుఖముతో నాకేమి పని? అమృతమును త్రాగువాడు అంబలిని ఆశించునా?-ఋషీశ్వరుని ఆ వాక్యములను విని రాజు నివ్వెర పోయెను. ఏ రాజ్యవైభవ ములను తా నింతవఱకు ఎంతయో గొప్పగ తలంచుకొను చుండెనో, ఏ రాజ్య సుఖమును సుఖములన్నిటి కంటె మిన్న యని భావించుచుండెనో అయ్యది బ్రహ్మానందసాగరమున ఒక బిందువువంటిదే యని గ్రహించి ఆశ్చర్యపడెను అయినను అటనుండి తిరిగి వెళ్ళు సమయమున ఆ రాజు మునీశ్వరుని మహాత్మా! మీ మోచేతి పైన కొంత మేర రోమములు లేవేమి, అనిప్రశ్నింప మునిపుంగవు డిట్లు ప్రత్యుత్తర మిచ్చెను.

రాజా! ఒక్కొక్క కల్పము పూర్తి అయినపుడు నా శరీరముపై ఒక్కొక్క రోమము రాలి పోయెను. ఈ చింత గింజంత స్థలములో ఎన్ని రోమములు ఇప్పటికి రాలిపోయినవో అన్ని కల్పములు నాకిపుడు గతించిపోయినవన్నమాట. స్వల్ప కాలము ఉండిపోవు నాకు నీరాజ్య భోగము లెందుకు, ఈ సంపద లెందుకు? కావున రాజా! నేనిచటనే ఉండి ఆత్మానంద సాగరమున మునిగి తేలుచు నుందును. నీవును నీ నిజస్వరూపమగు ఆత్మను గూర్చి సద్గురువుల వలన చక్కగ తెలిసికొని, ధ్యానాదుల ద్వారా అద్దానిని సాక్షాత్కరించుకొని జీవితమును ధన్య మొనర్చుకొనుము. మూన్నాళ్ళముచ్చట యగు ఈ జీవితమున నశ్వరములను ఈ ప్రాపంచిక విషయభోగములను చూచి మురిసి పోకుము. రేపో, మాపో ఈ శరీరము పతనమైనపుడు సమస్త ప్రపంచముతోను, సమస్త భోగభాగ్యములతోను వియోగము సంభవించును. అని ఆ మునీశ్వరుడు భూపాలునకు బోధించి ధ్యాననిమగ్నుడయ్యెను. రాజు ఋషీశ్వరుని దివ్య బోధలను మననము చేసికొనుచు గృహాభిముఖుడై చనెను, కొంతకాలమున కతడు ఆ బోధలచే ప్రభావితుడై, రాజ్యమును కుమారుల కొప్పగించి వైరాగ్యయుతుడై, ఏకాంతమున కోయి భగవద్ధ్యానాదులందు కాలమును గడుపసాగెను.

**నీతి: ప్రాపంచిక వైభవములు క్షణికములు వాని యెడల విరాగము కలిగి శాశ్వతమగు దైవము కొఱకే జీవుడు ప్రయత్నించవలయును.**

# గొప్ప ఏకాగ్రత

ఆది మహాభారత కాలము. పాండవులు, కౌరవు
బాల్యకాలమున ఒకే గురువుయొద్ద ధనుర్విద్యయందు శిక్షణ
పొందుచుండిరి. ఆ గురువే ద్రోణాచార్యుడు ధనుర్విద్యయం
ఆరితేరిన మహనీయుడతను. అనుభవజ్ఞుడైన శిష్యుడు ఎంతయొ
ఉపకృతిని బడయుచుండును. ఇచట గురువైన ద్రోణాచార్యు
ధనుర్విద్యా ప్రవీణుడై వెలయుచుండుటయు, శిష్యుల
పాండవులు, కౌరవులు శ్రద్ధాభక్తులతో కూడి విద్యను పొం
వలెనను తీవ్రమైన ఉత్సుకత కలిగియుండుటయు సంభవించు
నందున శిష్యులగు ఆ పాండవులకు, కౌరవులకు ధనుర్విద
యందు చక్కటి కుశలత ఏర్పడెను.

అయినను ఒకపుడు వారి ధనుర్విద్యా ప్రావీణ్యమును
ద్రోణాచార్యుడు పరీక్షింపదలచెను. ఊరిబయట ఒక పె
చెట్టు కలదు. దాని యొక్క ఒక ఎత్తైన కొమ్మకు ఒక ప్రా
వైన పసరకట్టును కట్టించి, ద్రోణుడు ఆ కట్టచివర గాజుకన్నుతో
కూడిన ఒక కొయ్యపక్షిని వ్రేలాడదీయించెను. పరీక్షాసమ
యముగ ఒకానొక దినమును నిర్ణయించి, ఆ దినమందు ఐద
గురు పాండవులను, నూరుమంది కౌరవులను ద్రోణాచార్యుడు
ఆచెట్టు సమీపమునకు పిలుచుకొనివచ్చి వారితో నిట్లు చెప్పెను

శిష్యులారా! కొన్ని వత్సరములనుండియు మీరు నా యొద్ద విద్యను అభ్యసించుచున్నారు. మీరందరు శ్రద్ధతో, భక్తితో, విశ్వాసముతో విద్య నేర్చుకొనుచున్నారు. అయితే ఆ విద్యయందు మీరెంత ప్రావీణ్యమును బడసిరో ఈ రోజు నేను పరీక్షింపదలంచి మిమ్ముల నిచటికి తీసికొనివచ్చినాను. ఇదిగో చూడుడు. ఇచట ఒక పెద్ద వృక్షము కలదు. దాని కొమ్మచివర ఒక పొడవైన గడకఱ్ఱ కట్టబడి యున్నది. దాని చివర ఒక కొయ్యపక్షి వ్రేలాడగట్టబడి యున్నది. దానికి ఒక గాజుకన్ను అమర్చబడియున్నది. మీరు చేయవలసిన పని ఏదనగా, బాణముతో ఆ గాజుకన్నును ఛేదించి వేయవలెను. కాబట్టి మీరు మీ మీ ధనుస్సులను బాగుగ ఎక్కుపెట్టి సిద్ధముగనుండుడు. నేను ఎవరెవరిని పిలుచుదునో వారు వచ్చి ఎప్పుడు కొట్టుమని చెప్పుదునో, అప్పుడు సరిగా ఆ గాజుకన్నును బాణముతో కొట్టవలెను. ఇదియే మీకు పరీక్ష. కాబట్టి ధనుస్సులను లెస్సగ సంధించి సిద్ధముగ నుండుడు.

గురుదేవుడీ ప్రకారముగ ఆజ్ఞనొసంగ అపుడు తక్షణమే పాండవులు, ధార్తరాష్ట్రులు తమ తమ ధనుస్సులను చక్కగ సంధించి నిలబడిరి. అంతట ద్రోణాచార్యుడు వారిలో నొక్కొక్కరిని పిలిచి బాణమును ప్రయోగింపుమని చెప్పి, సరిగా వారు బాణమును వదల బోవు సమయమున వారిని అడి

మొదలైన ఇతర వస్తువులు కనిపించినది కావున అది ఏకాగ్ర దృష్టి కానేరదు. అర్జునునివలె మీరును ఏకాగ్రదృష్టిని అల వరచుకొనుడు. లక్ష్యముతప్ప అన్యమేదియు మనస్సునందు స్ఫురింపకుండులాగున నేర్చుకొనుడు. గురుదేవుని బోధలను ఆలకించి తక్కినవారందరును గుణపాఠమును గ్రహించినవారై ఏకాగ్రత అనగా ఏమిటో బాగుగ తెలిసికొనగల్గిరి.

నీతి:- ధ్యానము సలుపునపుడు,భగవచ్చింతన గావించు నపుడు, సాధకుడు ఏకాగ్రత కలవాడై లక్ష్యమగు భగవంతుడు తప్ప ఇతరవిషయము లేవియూ మనస్సునందు జొరబడకుండు లాగున చూడవలయును. ఇదియే అనన్యభక్తి, అనన్యచింత నము, అనన్యధ్యానము. ఇట్టి అనన్య దైవచింతనమువలననే ఇట్టి ఏకాగ్రతవలననే మనుజునకు పూర్ణశాంతి,పరమానందము లభించును.

## అనన్య భక్తి

ఒక పర్యాయము నారదుడు గోపికలకు భక్తినిగూర్చి ప్రబోధించుటకొఱకై వారియొద్దకు వెళ్లి గోపికలందరిని ఆహ్వా నించెను. వారందఱును భక్తిపురస్సరముగ విచ్చేసి మహాత్మా తమరాకకు కారణమేమి యని అడిగిరి. మీకు భక్తినిగూర్చి కొన్ని విషయములు బోధింపవలెనని ఇచటికి వచ్చినాను. అని

నారదుడు సమాధానము చెప్పెను. ఆ వాక్యములను విని గోపికలు మహాశయా! మా చిత్తములు నిరంతరము శ్రీకృష్ణపరమాత్మయొక్క పాదారవిందములపై లగ్నమైయున్నవి. తమ ప్రబోధము వినుటకు మాకు తీరిక యెచట? అని పలుకగా నారదుడు ముక్కుమీద వ్రేలు వేసికొని అహా! వీరిభక్తి ఎంత అమోఘమైనది! భక్తిని గూర్చి వీరికి నేను బోధింపదలంచగా వీరే భక్తి యెట్టిదో నాకు చక్కగ బోధించి వదిలిపెట్టిరి. అనన్యభక్తినిగూర్చి యెవరైన తెలిసికొనదలంచునో గోపికల యొద్దనే తెలిసికొనవలెను, అని భావించుచు అచ్చోటు వీడి తన స్వస్థానమునకు వెడలి తాను వ్రాయుచున్న భక్తిసూత్రములు అను గ్రంథమునందు యథావ్రజ గోపికానాం అను సూత్రమును చేర్చెను. దాని అర్థము. ఓ జనులారా! ఎవరైన భక్తినిగూర్చి తెలిసికొన దలంచునో గోపికలయొద్ద తెలిసికొనవలెను. వారెట్లు అనన్యభక్తి కలిగి ప్రవర్తించుచున్నారో అట్లు ప్రవర్తించవలెను. కాబట్టి భక్తిని చక్కగ ఆచరణయందుంచినవారిలో అగ్రగణ్యులు గోపికలు. వారి చరిత్ర భక్తిమార్గావలంబులకు ఎంతయో ఆదర్శవంతమైనది.

**నీతి: గోపికల భక్తి అనన్యమైనది. ఆదర్శమైనది. అట్టి అనన్యభక్తిని జనులు అభ్యసించవలెను.**

# ద,ద,ద

పూర్వము దేవతలలో ఒకడు, మానవులలో ఒకడు, దానవులలో ఒకడు తరించవలెనను ఉద్దేశ్యముతో బోధకొఱకై ప్రజాపతి (బ్రహ్మ) వద్దకు వెళ్లి నమస్కరించి మహాప్రభో! జీవుడు సంసారదుఃఖమునుదాటి పరమశాంతిని బడయుటకై ఉపాయమును సెలవీయుడని ప్రార్థించిరి. అంతట బ్రహ్మదేవుడు "ద" అని పలికి అంతర్ధాన మొందెను. ఆ అక్షరమును విని దేవత స్వర్గలోకమునకు పోయెను. మనుష్యుడు భూలోకమునకు తిరిగి వెళ్ళెను. అట్లే దానవుడు పాతాళలోకమునకు కావలిపోయెను. వారి వారిలోకముల కేగి ఆ మువ్వురును "ద" అను అక్షరమును గూర్చి తదేకనిష్ఠతో చింతనచేసి దాని అర్థమేమైయుండునని ఆలోచించిరి. తుదకు వారు దాని అర్థమును ఈ ప్రకారముగ వేఱువేఱుగ నిశ్చయించుకొనిరి-దేవత "ద" అను అక్షరముయొక్క అర్థము "దమము" ఇంద్రియ నిగ్రహము అనియు, మానవుడు "దానము" అనియు, దానవుడు "దయ" అనియు నిర్ణయించుకొనిరి. ఆప్రకారముగ నిశ్చయించుకొని దేవతలు దమమును చక్కగ అలవాటు చేసికొనదొడగిరి. మానవులు దానధర్మములను అభ్యసించ దొడగిరి. దానవులు దయను అలవాటు చేసికొన దొడగిరి. ఇవ్విధముగ ప్రజాపతియొక్క ఆ సూక్ష్మ బోధచే దేవతలు, మానవులు, దానవులు మువ్వురును కూడ తమ చిత్తములను శుద్ధమొనర్చుకొని భవసాగరమును దాటివైచిరి.

నీతి. దమము (ఇంద్రియనిగ్రహము) దానము దయ అను మహత్తరసద్గుణములను అభ్యసించవలయును.

## చోరగుణము

ఒకానొకరాజు సామంతులను మంత్రులను, పెద్ద పెద్ద ఉద్యోగస్థులను ఆహ్వానించి ఒకనాటి రాత్రి ఒక పెద్ద విందు జరిపెను. ఆ విందులో ఒక పెద్దగుండ్రని బల్లచుట్టు అందఱును కుర్చీలలో కూర్చొని ఆ బల్లపై ప్లేట్లలో పెట్టబడిన భోజ్య పదార్థములను ఆరగించుచుండిరి. ఆ గుండ్రని బల్లమధ్య ఒక ఆభరణము ధగ ధగ మెఱయుచుండెను. విందుకు శోభనొసంగ గలదను ఉద్దేశ్యముతో ఆ విలువైన వస్తువు లచట ఉంచబడెను. దీపపు కాంతులలో అది తన తేజమును విరజిమ్ముచుండెను. ఇంతలో అకస్మాత్తుగ కఱెంటు ఆగిపోవుటచే ఆ భవనమంతయు అంధకారబంధురమయ్యెను. మరల ఒక్క నిముసకాలములో కఱెంటు రాగా దీపములు యథాప్రకారము వెలుగ జొచ్చెను. దీపములు వెలుగగనే రాజు దృష్టి ఆ బంగారపు పళ్లెముపై పడగా, చీకటిలో ఎవరో ఆయాభరణమును దొంగిలించినట్లు తెలిసికొనెను. అందరును పెద్దమనుష్యులగుటచే వారిని సంబోధించి రాజిట్లు పలికెను. మహాశయులారా!

చీకటిలో ఈ విలువైన ఆభరణమును ఎవరో దొంగిలించిరి. ఇప్పుడు తిరిగి లైట్లు ఆర్పించెదను. దానిని తీసికొనినవారు చీకటిలో దానిని యథాస్థానమందుంచ గోరుచున్నాను. ఈ ప్రకారముగ చెప్పి లైట్లు ఆర్పించగా ఆ చీకటిలో ఆ బంగారు పళ్లెమును గూడ ఎవరో తస్కరించి వేసిరి. తిరిగి లైట్లు వేయగా ఆ పళ్లెము కూడ అచట లేకుండెను. అనుదారాజు ధర్మము ఇంత దిగజారిపోయినదికదా యనియు లోలోన చాల చింతించెను. జనులందఱును ధర్మావలంబనము ఎప్పుడు కలిగియుందురాయనియు, రామరాజ్య మెప్పుడు వచ్చునా యనియు అతడు లోలోన తలపోసెను.

నీతి: చోరత్వము మహాపాపము. పరుల వస్తువులను అపహరింపరాదు.

## భయంకర విషసర్పము

అదొక వీధిబడి. పంతులుగారు చిన్న చిన్న పిల్లలకు వ్రాత నేర్పుతున్నారు. పిల్లలందరు పలక, బలపం తీసికొని మాస్టరుగారు చెప్పినది శ్రద్ధగా వ్రాస్తున్నారు.

పంతులుగారు-ఒరేయ్ పిల్లల్లారా! పుణ్యము అని వ్రాయండి.

పిల్లలు-సార్! వ్రాసినాము.

పం- పాపము అని వ్రాయండి.

పి-సార్! వ్రాసినాము.

పం-సర్లే, ఇక చాలు, మీ మీ పలకలు తెండి చూడాలి.

పిల్లలందరు వారి వారి పలకలను మాష్టరుగారికి చూపించారు. అందఱూ చక్కగా వ్రాసినారు. మాష్టరుగారు పరమానందభరితులయ్యారు. నాపిల్లలు బాగా నేర్చుకున్నారు. అని తలంచి తాని చిట్టచివరి పిల్లవాని పలక చూడగా ఒక చిన్న తప్పు కనిపించింది వాడు పాపము అనుమాటకు బదులు పాము అని వ్రాసినాడు. అపుడు పంతులుగారు వాడిని మందలించి ఈ విధంగా అడిగారు-

పంతులుగారు- ఏమిరా! పాపము అని వ్రాయమంటే పాము అనివ్రాసినావు!

పిల్లవాడు- సార్, సార్ రెండూ ఒకటేనండి-పాపము ఈజ్ ఈక్వల్ టు పాము.

పం-అరే! పాపము పాము ఎట్లా అవుతుందిరా!

పి-సార్! రెండూ మనుష్యుణ్ణి బాధిస్తవి. నిజం చెప్పాలంటే పామే కొంత మేలు అది ఒక్క-శరీరాన్నే చంపుతుంది పాపము జన్మజన్మాంతరాల్లోకూడ జీవుణ్ణి బాధిస్తూ అనేక శరీరాల్ని చంపుతూ ఉంటుంది.

వం-భేష్! ఎంత చక్కగా చెప్పేవురా! నరేగాని ఆకమీాదట చెప్పింది చెప్పినట్లు వ్రాస్తూఉండు.

(జనులారా! పాపము భయంకర విషసర్పముకంటెను అధిక బాధను జీవునకు కలుగజేస్తుంది. దానిని తొలగించుకొని పుణ్యమునే ఆర్జించుట శ్రేయస్కరమని తెలుసుకుడు!)

నీతి: పాపము పాముకంటెను భయంకరమైనది కావున దానిని అవలంభించరాదు.

# అన్తశ్శత్రువులు

ఒకడు తన పెట్టె పరుపు తీసికొని యాత్రకు బయలు దేరెను. కొంతకాలమునకతడు కాశీచేరెను. పగలంతా దేవాలయాలు మఠాలు చుట్టివచ్చి రాత్రి భుజించి పరుండెను అతని పరుపులో నల్లులు ఉండటం వలన రాత్రింతా అవి తెగకుట్టి వేసినవి. యాత్రికుడు చాలా బాధపడ్డాడు. మరునాడు మధుర (బృందావనం) బయలుదేరినాడు. అక్కడకూడా తన పరుపు లోని నల్లుల వలన బాధజాస్తిగాఉండెను. ఆ ఊరు వదిలేసి తిరిగి అతడు రామేశ్వరం దారిపట్టాడు. అక్కడకూడ రాత్రింతా నల్లులవలన బాధపడ్డాడా యాత్రికుడు. చిట్టచివరకు అను కున్నాడు - ఎన్ని యాత్రలుచేసినా, ఎన్ని క్షేత్రాలు తిరిగినా

నల్లులబాధ తప్పలేదే, అని నల్లుల్ని ఎక్కడో ఒకచోట దులిపి పారెయ్యాలి. అపుడు మాత్రమే వాటి బెడద తప్పుతుంది. అంతేకాని వాటిని దులపకుండా వెంట వేసుకొని తిరుగుతూ ఎన్ని పవిత్రస్థలాలు చూచినా బాధనివారింపదు.

అట్లే మానవుని అంతఃకరణంలోగల అన్తశ్శత్రువులగు కామక్రోధాదులను విచారణచే తొలగించుకోవాలి. దుర్గుణాలను అట్లే ఉంచి పైపైన ఎన్నితీర్థాలు సేవించినా ఏదో కొంత పుణ్యం లభిస్తుందేకాని, అజ్ఞానంమాత్రం తొలగదు. చిత్తం శుద్ధం కాదు. కాబట్టి ప్రతివారూ ప్రయత్న పూర్వకంగా తమలో ఉన్న వాసనలు, దురభ్యాసాలు తొలగించుకోవాలి. తీర్థసేవనము మంచిదేకాని దానితో బాటు లోనిమాలిన్యం పోవటానికి కూడా తీవ్రంగా కృషిచేయాలి.

నీతి : దుర్గుణములు తొలగనిదే మానవునకు ఎన్నటికిని శాంతి లభించదు. కావున మనస్సును బాగుగ పరిశోధించి వానిని లెస్సగ పారద్రోలవలెను.

—0—

## టంకశాల (Mint)

టంకశాలలో కొందరు బంగారు నాణెములు చేయుచుందురు. మరికొందరు వెండి నాణెములు, ఇంక కొందరు రాగి, ఇత్తడి నాణెములు చేయుచుందురు. కాని ఎవరును వాటిని బయటకు తీసికొని వెళ్లుటకు వీలులేదు. సాయంత్రము కాగానే ఆయా నాణెములను యంత్రాగారములోనే వదలిపెట్టి వెళ్ళిపోవలెను. ఒక్క రాగిపైసా కూడా వెంట తీసికొని ఇంటికి వెళ్లుటకు వీలుపడదు.

ఈ ప్రపంచమొక టంకశాల. ఇందు ధనవంతులు, లక్షాధికారులు బంగారు వస్తువులతో తులతూగుచుందురు. మధ్య తరగతి వారు వెండివస్తువులు కలిగియుందురు. పేదవారు రాగి, ఇత్తడి వస్తువులతో దైనిక వ్యవహారములను జరుపుచుందురు. కాని మరణానంతరము ఒక్క వస్తువునైన వెనువెంట తీసికొని వెళ్లుటకు వీలులేదు. తాము సంపాదించిన బంగారమును, ఇతర సంపదలను ఇక్కడే వదిలివేసి దేహమునుకూడ పారవేసి ఏకాకులై వెడలిపోవుదురు.

నీతి: ప్రాపంచిక సంపదలను జూచి మురిసిపోరాదు. ఈ ప్రపంచము టంకశాలయని గుర్తుకు తెచ్చుకొనవలెను. చివరకు చిల్లిగవ్వకూడ వెంటరాదని నిశ్చయించుకొని దృశ్య

పదార్థములపై మమత్వమును వీడి నీడవలె ఎల్లప్పుడు వెంట నుండు పరమాత్మనే ఆశ్రయించి ధన్యులు కావలెను.

## చోరద్వయము

ఈ ప్రపంచములో ఇద్దరు గజదొంగలున్నారు. వారు మానవుని ఆయుస్సును హరించివేయుచున్నారు. ఆహారము, నిద్ర-అను ఈ ఇరువురే ఆ గజదొంగలు మానవుని అమూల్యమైన ఆయుస్సు నంతను వారు వ్యర్థమొనర్చి వేయుచున్నారు. వారిరువురుని జయించిననే తప్ప జీవుడు గడతేరుటకు అవకాశము లేదు. మితాహారము, మితనిద్ర అను ఈ రెండు సూత్రములను ఆశ్రయించి, వాటిని చక్కగ అమలు జరిపినపుడు మాత్రమే జీవుడు శాంతిని సుఖమును దోచుకొనగలడు

ఉదయము నిద్రలేచినది మొదలు ఆహార విషయములో ఎంతయో సమయము వృథాగా గడచిపోవుచున్నది. అట్లే నిద్రలో కాబట్టి ఆ రెండిటియెడల ఒకింత సంయమము అలవరచకొనుట చాల అవసరము. అపుడు భగవద్ధ్యానము నకు ఎంతయో సమయము దొరకును. శరీరమునకు "అవసరమైన ఆహారము అవసరమైన నిద్ర గైకొనుచుండినచో ఆరోగ్యము చక్కబడును, దైవచింతనకు సమయము బాగుగ లభించును. కాబట్టి జన్మ సార్థకమొనరించదలంచు సాధకులు, ముముక్షువుల

ఆహారము, నిద్ర అను ఈ యిరువురు దొంగల విషయములో కడుజాగరూకులై యుండి, వారు తమ జీవితమును హానిం చేయకుండులాగున బహుజాగ్రతతో కనిపెట్టుచు, అప్రమత్తులై వ్యవహరించవలయును.

**నీతి: ఆహారము, నిద్ర-అను రెండిటియందును మితత్వమును శీలించుచు, సమయమును పరమార్థ సాధనలందు వినియోగించవలెను.**

## బ్రేకులేని సైకిల్

ఒకానొక పట్టణమందు మిగుల జనసమర్దముగల ఒక రాజవీధిలో రాత్రిపూట ఒకడు సైకిల్‌పై కడువేగముగ పయనించుచుండెను. ఆ సైకిల్‌కు లైటులేదు రాత్రిపూట లైటులేకుండ ఏ వాహనముకూడ ప్రయాణము చేయఁగూడదు అది సర్కారువారి నిబంధనము. ఆ వీధిలో ఒక చోట ఒక పోలీసు కంటా్రేతు రోడ్డు మధ్యన నిలబడి వాహనముల గమనమును కట్టుదిట్టము చేయుచుండెను. లైటులేకుండ సైకిల్‌పై బహువేగముగ వచ్చుచున్న ఆ వ్యక్తిని దూరమునుండియే చూచి అతనితో ఏమండీ! మీ సైకిలుకు లైటులేదు. కాబట్టి దిగండి అని పలుకగా, ఆ వ్యక్తి అయ్యా! బ్రేకుకూడ లేదు. దయచేసి తప్పుకోండి మీదవచ్చి పడగలదు అని చెప్పెనట.

ఆ సైకిల్ మరేమీ కాదు. అజ్ఞానియొక్క మనస్సే. దానికి లైటు లేదు. అనగా జ్ఞానప్రకాశము లేదు బ్రేకులేదు అనగా సంయమము లేదు. విచ్చలవిడిగా విషయభోగములపై పరువిడుచున్నది లైటుగాని బ్రేకుగాని లేనపుడు ఆ వాహనమును సర్కారువారు స్వాధీనము చేసికొని యజమానికి అపరాధమును విధించుదురు. అట్లే తన నిజస్వరూపమగు ఆత్మను గూర్చిన పరిజ్ఞానము లేనట్టియు, నిరంతరము విషయములపై కదుముచు నట్టియు మనస్సు గలవారికి యమధర్మరాజు తగు శిక్ష విధించును. తత్ఫలితముగ వారు పెక్కు ఇడుముల పాల్పడుదురు, వారికి శాంతి సుఖములు కలుగనేరవు. కాబట్టి మనస్సను సైకిలునకు లైటు, బ్రేకు రెండిటిని చక్కగా అమర్చి అనగా ఆత్మజ్ఞానమును, సంయమమును బాగుగ అలవాటుచేసి మోక్ష మార్గమున అప్రతిహతముగ పయనమైపోవుటకు అవకాశమును కలుగజేయవలయును.

నీతి : మనస్సు నిర్మలముగను, నిశ్చలముగను ఉండునట్లు ప్రయత్నించవలెను. ప్రతిదినము ధ్యానము చక్కగ అభ్యసించవలయును.

—o—

# బ్రహ్మ భూదేవి సంవాదము

బ్రహ్మదేవుడు- అమ్మా! భూదేవీ! మట్టితో కొన్ని బొమ్మలు తయారుచేయాలని అభిలాష కలిగినది. కొంత బంక మట్టిని సహాయముచేస్తావా!

భూ-ఎన్నిరకాల బొమ్మలు చేయాలని మీ అభిప్రాయం?

బ్ర- 84 లక్షల రకాలు.

భూ- రామరామ! ఎంత ఓపిక మీకు. నాకేమీ అభ్యంతరము లేదు. కాని ఒక చిన్న షరతును మీరు పాలించవలసి యుంటుంది.

బ్ర- అది యేమి?

భూ- నేనిచ్చిన మట్టిని కొంత కాలమైనతరువాత తిరిగి నేను వాపసు తీసికొంటాను. ఎల్లకాలం మట్టిబొమ్మ మట్టిబొమ్మగా ఉండటానికి వీలులేదు.

బ్రి- మహారాజుగా తీసికొనవచ్చును. ఎట్టి ఆక్షేపణా లేదు, నేను తయారుచేసే మట్టిబొమ్మ కలకాలం అట్లానే ఉండాలని నాకూ అభిప్రాయం లేదు.

(ఇరువురికి అంగీకారం కుదిరింది. తదనుసారం బ్రహ్మదేవుడు బహుకాలంనుంచి భూదేవిదగ్గర మట్టి అరువుతీసికొని రకరకాల మట్టి బొమ్మలు తయారుచేస్తున్నాడు. భూదేవి కొంతకాలానికి తన మట్టిని వాపసు తీసికొని ఆ బొమ్మలను తనలో లీనం చేసుకుంటున్నది. అట్టి ఒకానొక బొమ్మవగు ఓ

జీవుడా! ఈ మృత్తికామయశరీరంపై దేనికి మమత్వం! నేడో
మాపో భూదేవికి దానిని సమర్పించాల్సిందేగదా! శాశ్వత
ఆత్మయే నీ స్వరూపమని భావించి బంకమట్టితో చేయబడిన
ఈ దేహంపై మమకారం తగ్గించుకో, పూర్తిగా తొలగించుకో)

నీతి: శరీరము పంచభూతాత్మకమైనది. జడమై
నది. నశ్వరమైనది. కాబట్టి దేహాభిమానమును పార
ద్రోలి తాను నిత్యశుద్ధ బుద్ధ ఆత్మయని తలంచవలెను.

## సోమరితనమునకు తగిన శిక్ష

పూర్వము బ్రహ్మదేవుడు మానవుని సృష్టించి లోక
ములో వదలి అతని చర్యలను గమనించుచుండెను. తాను
సృష్టించిన మానవుని అవయవములన్నియు ఎట్లెట్లు వ్యవహరిం
చుచుండెనో బాగుగ గమనించుచుండ ఒక వైచిత్రమాతనికి
దృగ్గోచరమయ్యెను కుడిచేతిని, ఎడమచేతిని ఒకేసారి సృష్టిం
చినప్పటికిని వానిలో కుడిచేయి కార్యదక్షతను, కార్యకుశలత్వ
మును, కార్యోత్సాహమును, కార్యకరణ అభిలాషను వ్యక్తము
చేయుచుండ, ఎడమచేయి కార్యవిముఖత్వమును, అలసత్వమును
జడత్వమును ప్రకటము చేయుచుండెను. ఏ పనికైనను కుడి
చేయి ముందుకు వచ్చుచుండెను. గాని ఎడమచేయి వెనుక
వెనుక దాగుకొనుచుండెను. ఇదియంతయు గమనించి బ్రహ్మ

దేవుడొకనాడు ఆ రెండుచేతులను తనయొద్దకు పిలిపించి వానితో ఇట్లు పలికెను.

ఓ చేతులారా! మీఇద్దరికి ఒకే సమయమున నేను సృష్టిచేసినప్పటికిని, మీలో కుడిచేయి పనిచేయుటలో చాల ఉత్సాహము చూపుచున్నది. ఎడమచేయి సోమరితనమును అలవాటు చేసికొని కార్యములందు పాల్గొనకున్నది. కాబట్టి ఓ కుడిచేయి! నీకొక వరమును ఒసంగుచున్నాను. పూజచేయు అధికారము నీకే ఉండుగాక! దేవునకు పూజచేయవలెననిన గాని, ఎవరికైనా దానధర్మమును చేయవలెనననగాని నీ ద్వారానే జరుగవలెనుగాని ఎడమచేతిద్వారా కాదు.

బ్రహ్మదేవుని ఆ వాక్యములను వినగానే ఎడమచేయి నిరుత్సాహియై, గుండెపగిలి బ్రహ్మదేవునితో దీనముగ నిట్లు మొరపెట్టుకొనెను.

ఎడమచేయి - మహాప్రభో! నాకును ఏదైన వరమును ఈయరా!

బ్రహ్మదేవుడు - ఇవ్వను. ముమ్మాటికిని ఇవ్వను. నీవు పరమ సోమరివి ఒక్క పనిలోకూడ ఉత్సాహమును చూపవు.

ఎడమచేయి - పోనిండు! వరమీయకపోయినను మీనోటిగుండా నాకు ఒక్క పనినైన చెప్పండి దానిని ఆచరించుచు ఉంటాను.

హ్మదేవుడు- సరే. ప్రతిరోజు నిద్రలేవగానే నీకొక పని ఇచ్చి
నాను. దానిని ఆచరించుము!

నీతి:చూచితిరా! సోమరితనమునకు ఎట్టి శిక్ష లభించినదో
గలుగువారు, అలసత్వమునకు చోటీయక సోమరితనమునకు
పూర్ణముగ తిలాంజలి ఒసంగి, కార్యదక్షులై, ఉత్సాహ
వంతులై దైవకార్యములందు, ధర్మకార్యములందు, పరమార్థ
ధనలందు ప్రగతిని సాధించెదరుగాక!

# నకులవల్లి

నకులమనగా ముంగిస వల్లి అనగా తీగ. ముంగిసకు
ములను గూర్చిన భయము ఒకింతైనను లేదు. పాములను
సునాయాసముగ ఓడించివేయగలదు. అయితే నాగు
ముతో నాగుతో యుద్ధము చేయవలసి వచ్చినపుడు అది
ంత ప్రతిబంధము నెదుర్కొనుచుండును. నాగుపామునకు
ము ఎక్కువ. అది మహా భయంకరమైన సర్పము. కావున
ంగిసకు ఎప్పుడైన నాగుపాము తటస్థపడినచో,దానిని వెంటనే
ఎదుర్కొనక ఒక తీగచెంతకు పిల్లగ దానిని గొనిపోయి అచట
నిపై వేటువేయును. నాగుపాము తక్షణము ముంగిసను
దును. అపుడు ముంగిస ప్రక్కనున్న ఆతీగను కొరికి రస
ంగును. ఈరసప్రభావముచే విషమంతయు దిగిపోవును. ఆ

తీగకు విషమును హరించు శక్తి కలదు. అందుచే ముంగిస అపాయమునుండి తప్పించుకొనును. ఈ ప్రకారముగ విషము హరించిన వెంటనే మరల ముంగిస నాగుపాముతో యుద్ధమునకు దిగును. ఇవ్విధముగ ఆ నకులము నాగుపామును ఎట్టకేలకు జయించివైచును.

ఈ సంసార మొక భయంకరమైన విషసర్పము. అది జీవులను కాటువేయుట వలన నానాదుఃఖములను వారనుభవించుచున్నారు. ఆ దుఃఖములను పోగొట్టుకొనుటకు వారు మహాత్ములగు సద్గురువులను ఆశ్రయించి వారి బోధలను అనుభూత మొనర్చుకొనవలసి యున్నారు. అనుభవపూర్వకములైన వారియొక్క సద్బోధలచే సంసార తాపత్రయ మంతయు తొలగిపోయి జీవుడు పరమానంద మనుభవించగలడు. నకుల వల్లియను తీగయొక్క ఆశ్రయముచే నాగుపాముయొక్క విషము హరించిన చందమున జీవుని దుఃఖమంతయు సత్సాంగత్యముచే పటాపంచలై పోగలదు.

**నీతి. సంసారతాపము శమించుటకు సత్సాంగత్యము, మహాత్ముల బోధలు అత్యవసరములు.**

—0—

# ఒకే అగ్గిపుల్ల

ఒక ఆసామి చుట్టకాల్చుకొనుచుండెను. అతని దగ్గర ఉన్న అగ్గిపెట్టెలో ఒకే అగ్గిపుల్ల ఉండెను. ఆ ఒక్కపుల్ల వెలిగించి చుట్ట కాల్చుకొనుచుండగా ఎవరో స్నేహితుడు వచ్చి "ఏమండీ బాగున్నారా?" అని కుశలప్రశ్న వేసెను. ఆ ప్రశ్నకు ఏమియూ సమాధానము చెప్పకుండగనే అతడు తనపనిలో తాను నిమగ్నుడై ఉండెను. తీరా చుట్ట వెలిగించిన తర్వాత స్నేహితుడు "ఏమయ్యా బాగున్నారా అని అడిగితే సమాధానము చెప్పకున్నారేమి?" అని ప్రశ్నించగా "మహానుభావా! అగ్గిపెట్టెలో ఒకే ఒక పుల్ల ఉన్నది. అది వెలిగించినాను. మీతో మాటలు పెట్టుకుంటే అదికాస్తా ఆరిపోతే యిక నాకు చుట్ట కాల్చే అవకాశం లేకపోతోంది. కాబట్టి మీతో మాట్లాడలేదు." అని ఆసామి సమాధానం చెప్పెను.

మానవజన్మ ఒకే అగ్గిపుల్ల ఉన్న నిప్పుపెట్టె వంటిది. అది ఆరిపోయినచో, అనగా వ్యర్థముగా గడపివేయబడినచో ఆత్మజ్యోతిని అనుభూతమొనర్చుకొనుటకు వేరే అవకాశములు దొరకవు. కాబట్టి ప్రాపంచిక ప్రవృత్తులను కట్టిపెట్టి, లేక తగ్గించుకొని భగవచ్చింతన, ధ్యానాదులందే ఉన్న అవకాశమును వినియోగించుట ఉత్తమము. అమూల్యమగు మానవ జీవితమును దృశ్యవ్యామోహములందే గడపివేయుట వెర్రి

తనమే కాగలదు. వైరాగ్యమును చేబట్టి, ప్రపంచోన్ముఖముగ సమయమును వ్యర్థముచేయక, అంతర్ముఖచిత్తులై, ఆత్మాన్వేషణపరులై,ఆత్మప్రాప్తిచే జీవితమును సార్థకపరచుకొనవలెను.

**నీతి:** మానవజన్మ మహా దుర్లభమైనది. కావున జీవితము పరిసమాప్తము కాక పూర్వమే లక్ష్యమగు ఆత్మసాక్షాత్కారమును బడయవలెను.

## రామరాజ్యము

అలెగ్జాండరు భారతదేశములో సంచరించుచుండ ఒకానొక గ్రామముగుండా పోవునపుడు ఆగ్రామములో ఒకచోట ఒక పెద్దజనులగుంపు కనుపించెను. ఆ గుంపులో కొందరు పెద్దగా కలహించుకొనుచుండిరి. రెండు పార్టీలవారుచేరి ఒకరి నొకరు తీవ్రముగ విమర్శించుకొనుచు వాగ్వివాదము చేసికొనుచుండిరి. కాని అకస్మాత్తుగ కొద్దిసేపటికి ఆ కలహమంతయు సమసిపోవ జనులు మందహాసవదనములతో తమ తమ గృహములకు పోయిరి ఇదియంతయు అలెగ్జాండరు దూరమునుండియే గమనించి ఆ గుంపులోని గ్రామస్థు నొకనిని ప్రక్కకు పిలిచి అచట జరిగినసమాచార మేమి యని ప్రశ్నింపగా అతడిట్లు సమాధానమొసంగెను-

అయ్యా! ఈ గ్రామములో ఒక రైతు తన భూమి కొంతభాగమును మఱియొకరైతునకు విక్రయించెను. రైతు తాను కొనిన భూమిని దున్నుచుండగా అందు ఒక బంగారపుబిందె బయటపడెను. అది కొన్ని లక్షల రూప ముల విలువ కలిగియుండెను. భూస్వామి దానిని తోడనే తనకు భూమిని అమ్మిన ఆసామిదగ్గరకు దానిని వకగొనిపోయి, అయ్యా! ఈ బిందె మీ భూమిలో పడినది మీరు భూమిని నాకు అమ్మిరే కాని ఈ అమ్మలేదు. కాబట్టి దయచేసి దీనిని తీసికొనుడు, అని అంతట భూమిని అమ్మిన ఆసామి అయ్యా! నేను ఆ భూమి మీకు పూర్తిగ అమ్మివేసినాను ఇక దానిలో ఏమి నను అదియంతయు మీదే కాని నాది కాదు. కాబట్టి మీరే తీసికొనవలయును. నాకు వలదు, అని పలికెను. రెండవరైతు అందులకు సమ్మతింపలేదు. ఏవిధముగ దానిని ఇచ్చి వేయుటకే పట్టుపట్టెను. సమస్య ఎంతకు తేలలేదు. అపుడు మధ్యస్థులు కొందఱు చేరి తీసికొ కాకపద్ధతిని సూచించిరి. అదియేదనగా - "రెండవరైతు కొమార్తెను మొదటిరైతు కొమారునకిచ్చి వివాహం పెండ్లి కానుకగా ఆ బంగారపుబిందెను అల్లునకిచ్చివేయు ఈ పద్ధతికి ఇరువురును సమ్మతించి ఆ ప్రకారం మే జరిగెను.

నీతి . రామరాజ్యమునందువలె జనులు సచ్ఛీల చరణ గలిగియుండవలెను.

# బండిలో ప్రయాణము

పితానొకడు తన పిల్లవానిని వెంటబెట్టుకొని రైలు స్టేషనుకు వెళ్ళి ఇద్దరికి టిక్కెట్లు కొని రైలుపెట్టెలో కూర్చొనెను. రైలుబండి కదలి పోసాగెను. కొంతదూర మేగిన పిదప తండ్రికి, కుమారునికి రైలుపెట్టెలో ఈ క్రిందివిధముగ సంభాషణము జరిగెను.

కుమారుడు- నాన్నా! మన మెక్కడికి వెళ్ళేది?

తండ్రి- నోరుమూసుకో. ఆ ప్రశ్న అడగబాకా ?

కుమారుడు- అయితే నాన్నా! టిక్కెట్టు చూపిస్తావా?

తండ్రి- చూపించను.

కుమారుడు- మరి మనం ఎక్కడికి వెళ్తున్నట్లు?

తండ్రి- నేను చెప్పను. దింపినచోట దిగు, అంతే.

ఈ ప్రకారముగ ఉన్నది. ప్రాణికోట్ల ఈ జీవిత ప్రయాణము ఎక్కడికో తెలియదు, ఎక్కడ దిగవలెనో తెలియదు. ఎంతసేపు ప్రయాణము మాత్రము సాగిపోతున్నది. శరీరమను రైలుబండిలో కూర్చొని అనాదికాలమునుండి జీవుడీ ప్రకారముగ యాత్ర కొనసాగించు చున్నాడు. ఎక్కడో ఒకచోట దిగక తప్పదు. నేను దిగను అని అనుటకు వీలులేదు ఒకవేళ అనినా, కర్మదేవతలు సమయము చూచికొని బలాత్కారముగ మెడపట్టి గెంటివేయుదురు. కాబట్టి దిగుట ఖాయం.

మెట్ల కొన్నాళ్ళకు ఎక్కట ఖాయం. కర్మ తొలగేవరకు ఈ ఎక్కటం దిగటం జరుగుచునే ఉంటుంది. కావున ఓజీవుడా అనాదికాలంనుంచి సాగిస్తున్న ఈ ఎక్కటం దిగటం అనే తెలివితక్కువ పనిని ఇప్పటికైనా ఆపి, చేసిన అపరాధానికి పశ్చాత్తాపపడి ఆ పరాత్పరుని పదపంకేరుహముల మనః పూర్వకముగ ఆశ్రయించి ఈ బంధి బెడదనుండి శీఘ్రముగ తప్పించుకో! ప్రయాణానికి స్వస్తి చెప్పు! పొరపాటున బంధి ఎక్కినావా దిగక తప్పదు. దిగినావా ఎక్కక తప్పదు, ఎందు కొచ్చిన గొడవ! ఈ దీర్ఘ ప్రయాణానికి ఇప్పటికైనా ఫుల్ స్టాప్ పెట్టి దైవ వాతావరణంలో హాయిగా కాలం గడుపుట ఉత్తమము.

**నీతి:** ఆత్మజ్ఞానమును పొంది జననమరణ రూప ఈ దీర్ఘ ప్రయాణమును అంతమొందించవలెను.

## యమభటు పాపి సంవాదము

ఒకానొక యమదూత పాపియగు జీవుని మెడలో పాశమును బిగించి నరకలోకమునకు ఈడ్చుకొనిపోవుచుండెను త్రోవలో ఆ జీవుడు పడరానిపాట్లు పడుచుండెను. అనేక బాధలకు లోనగుచుండెను. అపుడా పాపి యమభటుని ఈ ప్రకారముగ అర్థించెను.

పాపి—అయ్యా! కొంచెము ఆగుడు. నేను వెనుకకు తిరిగి చూచుటకు అనుమతిని అనుగ్రహింపుడు.

యమభటుడు—అట్లుచూచుటకు వీలులేదు. ఒక్కక్షణమైనను అన్యథా ప్రవర్తించుటకు అచట అవకాశములేదు. యమునిఆజ్ఞను మేము శిరసావహించవలసి యున్నది. కాలయాపన చేయగూడదు.

పాపి—మహాశయా! నావిషయము ఒక ప్రత్యేక పరిస్థితిగా భావించి నాకు అనుమతి ఒసంగ ప్రార్థన. తాము తప్పక సమ్మతించ గలరని ఆశించుచున్నాను.

యమదూత పాపియొక్క దీనాలాపమును విని ఎట్టకేలకు సమ్మతించెను. వెంటనే పాపి వెనుకకు తిరిగి చూచి మరల యమభటులతో "అయ్యా! ఇక నన్ను తీసుకొని పోవచ్చును. అని పలుకగా, భటునకు ఆశ్చర్యము కలిగి ఏఉద్దేశ్యముతో ఇతడు వెనుకకు తిరిగిచూచెనో తెలిసికొన అభిలషించినవాడై ఓరీ పాపీ! ఎందులకు వెనుకకు తిరిగిచూచినావు? అని యాతనిని ప్రశ్నింప అందులకతడు- యమదూతగారూ! జీవితకాలములో నేను ఎందరో బంధువులను, మిత్రులను నమ్ముకొని యుంటిని. వారిలో ఒక్కరైనను ఈ పరలోకప్రయాణములో, ఆపత్తులో నన్ను రక్షించుటకు వచ్చుచున్నారేమో అని తలంచి వెనుకకు చూచితిని. కాని ఒకరుకూడ రాకుండుటచూచి హతాశుడనై పోయితిని. అని పలికెను.

నీతి: పుణ్యమే సర్వత్ర జనులను కాపాడును కాని ఇతరులెవ్వరునుగాదు. కావున జీవితకాలములో దానినే అభివృద్ధిపరచుకొనుము.

# ఆభాస సుఖము

ఒక ఊరిలో ఒక ధనిక కుటుంబం ఉంది. ఇంటి యజమానికి ఒకే ఒక కుమారుడున్నాడు. అతను పెరిగి పెద్దయ్యి స్కూలులోచేరి, బాగా చదువుకొని క్రమంగా బి. ఏ.ప్యాసైనాడు. యుక్తవయస్సు వచ్చింది. తండ్రి అతనికి వివాహం చేయ సంకల్పించాడు. అది తెలిసి పిల్లవాడు తన తండ్రితో నాన్నా! నామాస్తరు బి.ఏ. ప్యాసైన పిల్లనే నేను పెళ్లిచేసుకుంటానుగాని, మరొదాన్ని చేసుకోను. ముందుగానే చెప్తున్నాను. జ్ఞాపకం పెట్టుకో! అన్నాడు. అతని అభిప్రాయం ఇంట్లో ఇక తెనుగుతో మాటాడటం మానేసి పూర్తిగా ఇంగ్లీషులోనే మాట్లాడాలని. అందుకోసం చక్కగా ఇంగ్లీషు తెలిసిన పిల్లనే చేసుకోవాలని.

తండ్రిగారు ఆడవాళ్ల కాలేజీలు,హాస్టళ్లు అన్నీ గాలించి గాలించి తుదకు బి. ఏ. ప్యాసైన ఒక అందాల భామను వెతకొనివచ్చాడు. పెళ్లిసిద్ధమైంది, వధువుయొక్క అందచందాలు విద్యాపై దుష్యాలుచూచి వరుడు మురిసిపోతున్నాడు. ఇక

సుఖానికి అంతులేదనుకొన్నాడు. " Life is entire happiness (జీవితం పరమానందమయం) అని లోలోన భావించుకొని చిందులుత్రొక్కసాగాడు. పెళ్లి పూర్తిఅయినది. పిల్ల కాపురానికి వచ్చింది ఇక భర్తగారు ఇంగ్లీషులో సంభాషణ మొదలుపెట్టాడు. హూణభాషావిశారదయగు తన భార్యతో-

'Go on, Prepare Coffee for me' (వెళ్ళు, వెంటనే నా కోసం కాఫీ తయారుచెయ్యి!

ఆ మాటలు వినగానే భార్య తడుముకోకుండా ఈ క్రింది జవాబు టకీమని చెప్పేసింది-

'My dear sir, You are a Graduate and I am a Graduate Why dont you prepare the Coffee for me ?'

(అయ్యా! మీరు బి.ఏ. ప్యాసైనారు. నేనూ బి.ఏ. ప్యాసైనాను. అటువంటప్పుడు మీరే నాకోసం కాఫీ ఎందుకు తయారుచేయకూడదు?) ఆ వాక్యాలు వినగానే భర్తగారికి వళ్లు ఝల్లుమనింది. సంసారంమీదే రోతపుట్టింది. Life is entire darkness' (జీవితం అంధకారమయం, దుఃఖమయం) అని అనుకుంటూ, తలపై గుడ్డ కప్పుకొని సరాసరి హోటల్‌కు వెళ్లి కాఫీత్రాగి ఇంటికి తిరిగి చక్కా వచ్చాడు.

ప్రపంచంలో ఉన్నది సుఖమో, సుఖాభాసమో విజ్ఞులే తెల్పుకోవాలి!

౬౮౬ పరమార్థకథలు

నీతి: విషయ సుఖములు చంచలములై స
ఆది అభాసమాత్రములే అయియున్నవి. కావునవి
లగువారు బింబభూతమగు ఆత్మసుఖమునే అపేక్షిం
వలెను.

## విషయదాసులు

ఒక గ్రామములో ఒక వర్తకుడు అంగడి పెట్టుకొని
పేరగాండ్రలకు వస్తువులను విక్రయించుచుండెను. ఒక నా
మధ్యాహ్నసమయమున వర్తకుడేదియో పనిమీద బయట
వెడలగా అంగడిలో ఎవరును లేని సమయము కనిపెట్టి ఒ
కోతి లోనికి ప్రవేశించి ఒక ఇనుపకూజాలో చేయిదూ
లోనుగల జీడిపప్పును గట్టిగా పట్టుకొని చేతిని పైకిలాగ
చేయి రాలేదు. ఏలయనగా కూజా మూతి సన్నగా నుం
గుప్పెట లావుగా నుండెను. ఇంతలో వర్తకుడు తదటి
గదిలో కోతియుండుట చూచి ఒక దుడ్డుకఱ్ఱ తీసికొని దా
గట్టిగా కొట్టెను. అది పారిపోవ యత్నించెను గాని చే
ఇనుపకూజాలో ఇరుకుకొనిపోవుటచే సాధ్యపడలేదు. ఆ దు
గ్యవాతపము తనగుప్పిటలోని జీడిపప్పును వదలివేసినచో చే
కూజానుండి సులభముగా బయటకు వచ్చివేసియుండెడిది. లో
ఆశ అడ్డుపడినది. కోతి వీపుపై దెబ్బలు ఏకధాటిగ పడుచు
డెను. తప్పలేకను కోతి తన ప్రాణములను వదలవలసివచ్చె

ప్రాణములనైన వదలుటకు అది సిద్ధపడినదే కాని జీడిపప్పున మాత్రము వదలలేదు.

నేటి విషయదాసుల పరిస్థితి సరిగా ఇదేవిధముగ నున్నది. ప్రపంచికభోగలాలసుడే ఆకోతి. విషయభోగములే జీడిపప్పు మృత్యువే వర్తకుడు. ఈ సంసారమే అంగడి.

**నీతి: మృత్యువు సంభవించక పూర్వమే, జనులు శాస్త్రగురు వాక్యములందు విశ్వాసముకలిగి తదుపదిష్ట ధర్మమార్గమును చక్కగ అనుష్ఠించి, విషయవ్యామోహమును త్యజించివేయుట ఉత్తమము.**

## సారగ్రహణము

ఒకానొక పాఠశాలలో చదువుచున్న ఇరువురు విద్యార్థులు తమలోతాము ఒక పందెము వేసికొనిరి. "ఒక డజన్ అరటిపండ్లను తొక్కతోసహా ఎవడు ముందుతినగలడో వాడు గెలిచినట్లు. మరియు వానికి ఓడినవాడు పది రూప్యములను చెల్లించవలసియుండును" ఇదియే ఆపందెముయొక్క స్వరూపము.

పందెమునకు ముహూర్తము నిర్ణయింపబడెను. వలుగురు ఉన్నతపాఠశాలవిద్యార్థులు న్యాయనిర్ణేతలుగా ఏర్పాటు చేయబడిరి. పందెము ప్రారంభింపబడెను. పందెమునందు

పాల్గొనిన ఇరువురిలో మొదటివాడు ఇట్లు తలం[illegible]
లోని తొక్కా గుజ్జు రెండును తినవలెనుగదా! [illegible]
పండ్ల లోని గుజ్జు తినివైచి తదుపరి అన్ని పం[illegible]
తినివైచెదను'- ఈ ప్రకార మాలోచించి 12 [illegible]
అందలి గుజ్జు తినివేసి కడుపు నిండగా ఇక ఏమాత్ర[illegible]
ఆగిపోయెను. రెండవవాడు ఇట్లాలోచించెను- [illegible]
పండ్లలోని గుజ్జు, తొక్కా తినవలెనుగదా! [illegible]
హైన తొక్కపని పూర్తి చేసి [illegible]
పని పూర్తి చేయవచ్చును.- అని ఈ ప్రకారం [illegible]
ముందుగా అన్ని తొక్కలను తినివేయగా [illegible]
ఇక ఏ మాత్రము తినలేక ఆగి పోయెను. [illegible]
"మేమిక తినలేము" అని చెప్పి పందెమును [illegible]
నిలిచిపోయినను మొదటివాడు సారభూతమైన [illegible]
కాబట్టి ఆరోగ్యముగా నుండెను. రెండవ[illegible]
తొక్కలు తినెను కాబట్టి అనారోగ్యముతో [illegible]

నీతి : ఈప్రపంచములో సారము ఆత్మ[illegible]
అసారము నామరూపములు, దృశ్యము, [illegible]
సేవించువాడు ధన్యుడు. అదృష్టవంతుడు. [illegible]
రూపములను, దృశ్యమును ఆశ్రయించువాడు [illegible]
సంసారరూపమున తిరుగాడుచుండును.

# గజదొంగ

ఒకానొక దేశములో పేరుమోసిన గజదొంగ ఒకడు కలడు. అతడు అనేకచోట్ల దొంగతనములు, హత్యలు, దోపిడీలు చేయుచుండ ఒకసారి పోలీసులకు పట్టుబడెను. పోలీసులు న్యాయస్థానమందు అతనిపై కేసు పెట్టగా న్యాయమూర్తి అతనికి యావజ్జీవ శిక్ష విధించి, అతని నొక చీకటి కొంపయందుంచునట్లు ఆజ్ఞాపించెను. తత్ఫలితముగ అతడు సంవత్సరముల కొలది ఒకానొక అంధకారబంధురమైన జైలుగదిలో నుంచబడెను. భోజనాదు లెవరో తెచ్చి ఆ చీకటిగదిలో ఉంచిపోవుచుందురు ఏకారణముచేకూడ అతడు ఆగది విడిచి బయటకు వచ్చుటకు అనుమతిలేదు

ఇట్లుండ ఆదేశపురాజు కాలధర్మముచెంద అతని కుమారునకు పట్టాభిషేకము జరిగెను. ఆ యానందోత్సవములో నతడు తన దేశమందు జైళ్ళలో మ్రగ్గుచున్న ఖైదీల నందరిని విడుదల చేయవలసినదిగా ఆజ్ఞాపించెను. తత్ఫలితముగ చీకటి కొంపలో బాధపడుచున్న ఆ గజదొంగను భటులు విడుదల చేసి సాగనంపుచుండగా, ఎన్నాళ్ళో చీకటిలో అలవాటుపడిన ఆ దొంగ బయట సూర్యరశ్మిలోనికి రాగానే, అప్రకాశమును చూడలేక ఒక అనిర్వచనమైన బాధననుభవించుచు భటులతో అయ్యా! నేనా చీకటిలోనే యుందును. నాకు బయట బాధగా

ఉన్నది. దయచేసి నన్ను చీకటిలోనికే తీసికొనిపొండు!" అని వేడుకొనెను.

అజ్ఞానుల మనస్తత్వ మీ విధముగనే ఉండును. ఎవరైన మహనీయులు వారికి దుఃఖరహితమైన పరమాత్మతత్వమునుగూర్చి బోధించి దానికై ప్రయత్నించుమని చెప్పినను, పట్టించుకొనక, మా కీ ప్రపంచదృశ్య విషయవిలాసములే పరమసుఖముగ నున్నవని పలుకుచు, వాని వెంటనే పరుగిడుచు తుదకు మృత్యువాతబడి సద్గతిని గోల్పోవుచున్నారు.

నీతి: అజ్ఞానులు ఈ దృశ్యప్రపంచమే గొప్పదని తలంచుచున్నారు. వారివలె ప్రవర్తించక శాశ్వతమగు ఆత్మనే ఆశ్రయించి తరించవలెను

## సత్రము

కొన్ని సత్రములలో మూడురోజులు మాత్రం ఉండనిస్తారు. తరువాత దయచేయమంటారు. ఈ ప్రపంచం ఒక సత్రం. బాల్యం ఒక రోజు, యౌవనం ఒక రోజు, వార్ధక్యం ఒక రోజు, ఈ మూడు కాలాలు దాటితే, మూణ్ణాళ్ళ ముచ్చటలు పూర్తి అయితే యమధర్మరాజు వచ్చి సత్రంనుండి సాగనంపుతాడు. కాబట్టి ఓ, మానవుడా! తరువాత ఎక్కడికి

కాల్లాలో ఇప్పుడే నిశ్చయించుకోవటం మంచిది. మూడు స్థానాలున్నాయి. ఒకటి నరకం, రెండు స్వర్గం, మూడు మోక్షం. పాపం చేసుకొంటే నరకానికి పోతారు. పుణ్యం చేసికొంటే స్వర్గానికి వెళతారు. జ్ఞానాన్ని సంపాదించే మోక్షం పొందుతారు. ఇక వారి వారి యిష్టం. తెలివిగలవాడు మూడోదానికే అనగా మోక్షానికే ప్రయత్నిస్తాడు. పాపాన్ని పారద్రోలి, పుణ్యాన్ని చేబట్టి, తద్వారా జ్ఞానాన్ని సముపార్జించి మోక్షం పొందటం విజ్ఞుడు చేయవలసినపని. ఇదంతా ఈ మూడు రోజుల సత్రింకాపురంలోనే పూర్తి చేయాలి.

నీతి. జీవితము క్షణభంగురము. త్వరితంగా ఆధ్యాత్మిక సాధనలు ప్రారంభించి సంసార సంతరణ కార్యక్రమమునకు పూనుకొనవలెను.

## జన్మాంతరవాసన

ఒకానొక అరణ్యములో కొన్ని జింకలు కాపురముండుచున్నవి. ఒకనాటవి యన్నియు ఒకచోట సమావేశమై తమ జాతియొక్క శక్తి స్తోమతలను గురించి మాటలాడుకొనుచుండెను. తీక్ష్ణబుద్ధిగల ఒకజింక తక్కిన జింకల నుద్దేశించి ఈ ప్రకారముగ గంభీరముగ పలుకసాగెను-సోదరులారా! బహు

కాలమునుండియు మనజాతిని ఒక దుర్భలత్వము పట్టి పీడించు
చున్నది. కుక్కను చూచినదే తడవుగా మనము పలాయ
నము చిత్తగించుచున్నాము. ఇదిచాల సిగ్గుచేటు. మనకు భగ
వంతుడు పొడవైన వాడిగల కొమ్ములను ప్రసాదించినాడు.
కొమ్ములేని కుక్కను చూచి కొమ్ములుగల జింక కాలికి బుద్ధి
చెప్పుట హాస్యాస్పదముగా నున్నది. మనము తలంచుకొని
నచో మన తీక్ష్ణశృంగములచే కుక్కలను చీల్చి చెండాడ
వచ్చును. ఇంతకీ మనదౌర్భాగ్యమునకు కారణము మన బల
ముపై మనకు విశ్వాసము లేక పోవుటయే యగును. కాబట్టి
ఇప్పుడు మనమందరము కలసి ఒక శపథము చేసి కొందుము.
ఇకమీదట ఏకుక్క అయినను మనలను సమీపించినచో కిరికి
పందలమై పారిపోక మన వాడికొమ్ములచే దానిని ధైర్యముగా
నెదుర్కొని దాని అంతు చూడవలసినదే, దానిని చీల్చి వేయ
వలసినదే యను తీర్మానమును మీరందరు ఏకగ్రీవముగా
ఆమోదించెదరని విశ్వసించు చున్నాను.

సోదరి జింకయొక్క అర్థవంతములగు ఆవాక్యములను
విని తక్కిన జింక లన్నియు భేష్, భేష్ అని పలుకుచు మీరు
ప్రతిపాదించిన ఈతీర్మానము హృదయ పూర్వకముగ
మేమందఱము ఆమోదించుచున్నాము. అని ఏకకంఠముతో
పలికినవి. ఆదేసమయమున దూరమునుండి ఒక కుక్కపరుగెత్తు

కొని వచ్చుచుండగా దానిని జూచి జింకలన్నియు మూకుమ్మడిగా ఒక్కసారిలేచి ప్రాణములను గుప్పెటలో పెట్టుకొని తమతమ ఇండ్లకు పారిపోయినవి! ఆహా! పూర్వవాసనా బలమెంత ఘనతరమైనది!

**నీతి. ముముక్షువు బహు జాగరూకుడై యుండి తనయొక్క వివేకబలముచే బాహ్యాంతర దృశ్యవాసనలను అణగద్రొక్కి వేయవలెను**

## బ్రహ్మానందము — విషయానందము

ఒక ధనికుడు బీదలకు అన్న సంతర్పణ చేయు చుండెను. దరిద్రనారాయణులకు సంతుష్టి కలుగజేయు నిమిత్తము అనేక పిండివంటలతో మత్రిసోపేతముగ వారికి భోజనము ఏర్పాటు చేసెను. అన్నము వడ్డించినపిదప అందరికిని వారి వారి పాత్రలలో పాయసము పోయుచుండిరి. కాని ఆ బీదవారిలో ఒకనికి పాత్రలేదు. అతడు అవిటివాడు. ఒక్కచేయిమాత్రమే అతనికి కలదు. పాత్రలేదు కాబట్టి దోసిలినిండా అతడు పాయసమును పోయించుకొనెను. దోసిలినిండి పాయసము మోచేతిమీదుగా ఒకింత కారెను. బీదవాడు ఆలోచనలోపడి దోసిటినిండా ఉన్న పాయసమును త్రాగక, మోచేతిమీదుగా కారిన పాయ

సమును చేయి పైకెత్తి ముందుగా నాక దొడగెను. చేయి పైకెత్తుటవలన దోసిలినిండా ఉన్న పాయసమంతయు క్రింద పడి మట్టిలో కలిసిపోయెను. దోసిటిలోని పాయసమును ముందుగనే త్రాగివేసి యుండినచో ఇట్టి ఆపత్తు కలిగియుండెడిదికాదు. కడుపునిండ సంతృప్తి లభించియుండెడిది.

దోసిటిలోనిది బ్రహ్మానందము, మోచేతిపై జారినది విషయానందము. అజ్ఞానులు తమ ఆత్మరూపముగనే యున్న శాశ్వత బ్రహ్మానందమును వదలివైచి, అద్దాని ప్రతిబింబరూపమగు నశ్వర విషయానందము నాస్వాదించుచు, దానికై పరువులిడుచు మోక్షప్రాప్తికి లభించిన చక్కటి అవకాశమును పోగొట్టుకొనుచున్నారు. వివేకవంతులు జాగ్రతపడి విషయసుఖముపై విరక్తి కలిగి పరమాత్మ సుఖమునే తమ లక్ష్యముగ నెంచుకొని అద్దానిని సాధించి కృతకృత్యులగుచున్నారు.

**నీతి: విషయసుఖము అల్పమైనది. బ్రహ్మానందము అనంతమైనది. విజ్ఞులగు వారు బ్రహ్మానందంకొఱకే యత్నించవలెను.**

—0—

# దుస్సంస్కారములను రూపుమాపవలెను

ఒక ఇంటిలో ఒక చిన్నపిల్లవానికి చేతిపై తేలుకుట్టినది అతడు పరమబాధను పొందుచు ఆ విషయము తన తల్లిదండ్రులకు చెప్పక ఆ వీధిలోనే ఉన్న ఒక డాక్టరుగారివద్దకు పరుగెత్తుకొనిపోయి- డాక్టరుగారూ! తేలుకుట్టింది. మందివ్వండి అని కేకవేశాడు. డాక్టరు అతనిపై జాలికలిగి ఒక చిన్న కాగితంముక్కలో కొంతమందుపెట్టి యిచ్చి, నాయనా! తేలు ఎక్కడకుట్టిందో అక్కడ ఈ మందు బాగా పూస్తే నొప్పితగ్గిపోతుంది అని చెప్పినాడు. పిల్లవాడు దానిని తీసికొని ఇంటికి పరుగెత్తుకొనివచ్చి ఈ ప్రకారంగా ఆలోచించినాడు- తేలు ఎక్కడ కుట్టిందో అక్కడగదా మందుపూయమన్నాడు డాక్టరు మరి తేలు గోడపై కుట్టిందిగదా. కాబట్టి దానిని గోడకు పూయసాగాడు. నొప్పితగ్గునా! ఆ ప్రకారముగ ఎన్నాళ్ళు గోడకు మందుపూసినా చేతికి కలిగినబాధ పోవునా! పోనేపోదు. చేతికిపూసినచో మాత్రము వెంటనే తగ్గిపోవును. అట్లే జీవునిహృదయంలో అనేకజన్మలనుండి బాగా పేరుకొనిపోయిన దుష్టవాసనల వలననే వానికి దుఃఖం కలుగుతూ ఉన్నది. ఆ వాసనలను పోగొట్టవలెను. పైపై క్రియల వలన, ఆ దుఃఖం పోనేపోదు. చక్కని విచారణచేసి అగాధంలో పుట్టలో ఉన్న పాములవలె లోని వాసనలను కనిపెట్టి దైవచింతన చేత, వైరాగ్యభావనచేత వాటిని సమూలముగ నాశనముచేసి

చేయాలి. ఈ ప్రకారంగా వాసనాక్షయముచే మోక్షం అవ
లీలగ సంభవిస్తుంది.

**నీతి: జనులు తమ హృదయమందలి దుస్సం
స్కారములను రూపుమాపి పవిత్రాచరణ కలిగియున్న
పుడు మాత్రమే శాంతి, సుఖము పరిపూర్ణముగ వారికి
లభించగలదు.**

## నవనీతహృదయము

బెంగాల్ దేశమున మహాదేవ గోవిందరానడే యను
గొప్ప తత్త్వవేత్త, మహావిద్వాంసుడు నివసించుచుండెను.
అతనిపై జనులకు ఎంతయో భక్తివిశ్వాసము లుండెను. ఒక
నాడు ఒకానొక భక్తుడు అతనికి ప్రేమతో ఒక మామిడిపండ్ల
గంపను రైల్వేపార్సెల్ ద్వారా పంపెను. పండ్ల గంప ఇల్లు
చేరెను. రానడే దానిని విప్పిచూడ అద్భుతమై, పరిపక్వమై
సువాసనను వెదజల్లుచున్నట్టి మామిడిపండ్లు అందు నిండుగా
కన్పించెను. వానినుండి ఒకపండును అతడు బయటకుతీసి
చాకుతో కోసి ఒకముక్కను తిని వెంటనే మిగిలిన పండుసం
తను ఆ గంపలోనే పడవైచెను.

ఆ చిత్రమంతయు పరీక్షచేయుచుండి చూచుచున్న అతని భార్య ఆశ్చర్యపడి భర్తతో నిట్లనెను—

(వారిద్దరి మధ్య ఈ క్రింది సంభాషణము నడిచెను.)

భార్య - ఏమండీ! మామిడిపండు పుల్లగా ఉన్నదా ఏమి?

రామన్న - లేదు, అపరిమితమైన తీపిగా ఉన్నది.

భా-మరి అంత తీపిగా ఉన్న తినకుండా గంపలోనే వేసారే?

రా-తీపిగా ఉన్నది కనుకనే గంపలో వేసినాను.

భా-ఇదేమి చిత్రమండీ!

రా-నీకు తెలియదు విను. పండు తీపిగా ఉన్నది కాబట్టి అది ఇతరులకు చక్కగ ఉపయోగించును. వారు దానిని తిని ఎంతయో ఆనందించుదురు. ఒకరి ఆనందమే నా ఆనందము ఒకరు సుఖము అనుభవించినచో నేను అనుభవించినట్లే. పరోపకారమే నా ధ్యేయము. నేను తగ్గించుకొని ఇతరులకు పెట్టుటయే నా సిద్ధాంతము. పరప్రాణియొక్క సుఖమే నాకు కావలసినది. అతడు ఆనందించినచో అదియే నాకు పదివేలు!

భా-(తనలో) ఆహా! ఎంతటి నవనీతహృదయుడు!

నీతి : జనులు పరోపకార పరాయణులై తమ కఠోర హృదయములను నవనీత హృదయములుగ పరివర్తనము చేసుకొని భగవత్కృపకు పాత్రులు కావలయును.

# పొట్ట - నాలుక

భోజనమునకు సంబంధించి రెండు ఇంద్రియములు కలవు. ఒకటి పొట్ట, రెండవది నాలుక. ఎంత ఆహారమును తిన వలెనో అది పొట్టవని. ఏమి ఆహారమును తినవలెనో అది నాలుకవని. పొట్ట అమాయకమైనది. దానికి అశుభము శుభము ఏమీ తెలియదు. ఏది లోనికి వేసిన కాదనదు. కడుపు నిండితే చాలు దానికి కావలసింది అంతే. అయితే ఇంకా కొద్దిసేపటికి నిండుతుందనగా అది "అలారం బెల్" మోగిస్తుంది."అయ్యా! నాలుకగారూ! ఇంకా వెయ్యకండి" అని హెచ్చరిక చేస్తుంది. ఆ హెచ్చరికను నాలుక ఖాతరు చేయదు. పొట్ట చేసే హెచ్చరికలను అది పాటించే పరిస్థితిలో ఉండదు. మహా కొవ్వెక్కి ఉంటుంది.

"ఓ పొట్టగారూ! పదార్థాలు రుచికరంగా ఉన్నవి కాసేపు మాట్లాడకుండ నోరుమూసుకొని నేను వేసినదంతా

లోపలికి పోనిస్తుంటు" అని బెదిరిస్తుంది. పాపం పొట్ట ఏం చేస్తుంది! నాలుక పంపినదంతా అట్లే స్వీకరించి, తీరా కడుపు ఉబ్బగా క్రిందపడి దొర్లి నానా అవస్థలు పడుతుంది. కాబట్టి నాలుక మహా ప్రమాదకరమైనది. అది ఎక్కడ లేని రుచులన్నీ కోరి కోరుతూ హెచ్చుమోతాదులో పదార్థాలను లోనికి పంపుతూ జీవునకు అధోగతిని, అనారోగ్యాన్ని తెచ్చిపెడుతుంది. కనుక విజ్ఞులైనవారు, తరించాలని తపలాటపడేవారు, భోజనం చేసేటప్పుడుగాని, తక్కిన సమయాల్లోగాని నాలుక చెప్పే సలహాలు పాటించకుండ పొట్ట చెప్పినట్లు వినాలి. బస్సు 'ఓవర్‌లోడ్' అయితే క్రిందపడదు! అట్లే శరీరమను బస్సుకు ఎక్కువ బరువు పెట్టకూడదు. నాలుకమాటలు విని దానిని అనవసరంగా బాధపెట్ట కూడదు. పొట్టమాట వినేవాళ్ళకు పునరపి జననం, పునరపి మరణమ్ - ఇదేగతి.

**నీతి : ఆహారమును గైకొనునపుడు పొట్టమాట వినవలెనే కాని నాలుకమాట కాదు. జిహ్వాచాపల్యమునకు లోనుకారాదు.**

—0—

# పుట్టిల్లు

చేపకు పుట్టిల్లు నీరు. ఆ నీటియందే దానికి ఆనందము ఆనీటియందే దానికి స్వేచ్ఛ, స్వాతంత్ర్యము. నిర్భయత్వము దానిని అచ్చోటినుండి బయటకు తీసుకొనివచ్చి చక్కటి పాన్పుపై పరుండబెట్టి, వింజామరలు వీచుచు సమస్త రాజోపచార, దేవోపచారములు చేసినను దానికి తృప్తి యుండదు,ఆనందము కలుగదు. స్వస్థానమగు నీటినే అది అహర్నిశములు వాంఛించు చుండును. దానియందే పరమశాంతి బడయుచుండును.

అట్లే జీవుని పుట్టిల్లు పరమాత్మ. అట్టి పరమాత్మను చేరువరకు అతడు విశ్రమించరాదు. ప్రతిపథుడు ఆ మహోన్నత లక్ష్యముకొరకే తీవ్రతర యత్నము సలుపుచుండవలెను. విషయభోగాదులందు ఆసక్తిని బొందరాదు. అవి యెంత రమణీయముగను, ఆకర్షణీయముగను ఉన్నప్పటికిని ఆత్మసుఖమునకు తీసికట్టే యగును. ప్రతిబింబసుఖము యెంత గొప్పదైనప్పటికి బింబసుఖమునకు సాటికాజాలదు.

**నీతి. ప్రతి మానవుడును తన పుట్టిల్లగు ఆత్మను జేరుటకొరకై వివేక వైరాగ్యాదులను చక్కగ అభ్యసించి, ఆత్మేతర వస్తువుల యెడల విరాగము గలిగియుండవలెను.**

# ఆచరణాత్మకబోధ

ఒక వృద్ధుడు తన మనుమని వెంటబెట్టుకొని గాంధి మహాత్ముని యొద్దకు వెళ్ళి నమస్కరించి ఈ ప్రకారముగ మొరపెట్టుకొనెను. 'మహాత్మా! ఈ పిల్లవాడు నా మనుమడు ఇంటిలో బెల్లము ఎక్కడ దాచియుంచినను తినివేయుచుండును. తినవద్దని ఎన్నిసార్లు చెప్పినప్పటికినీ వినుటలేదు. భయపెట్టినప్పటికి లెక్కచేయుటలేదు. తమవంటి మహనీయుల ముఖతః వచ్చిన వాక్యములకు విలువయుండును. కాబట్టి బెల్లము తినవద్దని ఇతనికి బుద్ధిచెప్పుడు. వృద్ధుని ఆ వాక్యములను విని మహాత్ముడు అట్లే చెప్పెదను. అయితే ఇప్పుడు కాదు, ఒక వారం దినములు గడచిన పిమ్మట ఈ పిల్లవానిని తీసికొని రండు. అప్పుడు చెప్పెదను అని పలుకగా వృద్ధుడట్లే చేసెను. ఏడురోజులు గడచిన పిదప తాతగారు మనుమని వెంట బెట్టుకొని మహాత్మునియొద్దకు రాగా వారిరువురిని కూర్చుండబెట్టి పిల్లవానికి మహాత్ముడీవిధముగ బోధ సల్పెను- నాయనా! బెల్లము తినకుము. ఇంటిలోని పెద్దలు చెప్పినట్లు ఆచరింపుము. గాంధిగారి ఆ వాక్యములను విని పిల్లవాడు అట్లే చేసెదనని ప్రతిజ్ఞ గావించెను. మహాత్మునిప్రియాబోధకు వృద్ధుడు చాల ఆనందించి, తన కృతజ్ఞతను దెలిపి వెడలిపోవుచూ "అయ్యా! బెల్లము తినవద్దని ఇదివరకే ఏల చెప్పలేదు! వారం దినములు గడచిన పిదప ఇప్పుడేల చెప్పినారు! అని గాంధిగారిని ప్రశ్నింప

అందులకు మహాత్ముడు "నేనుకూడ అప్పుడప్పుడు బెల్లము తిను చుందును. నేను తినుచూ ఒకరికి తినవద్దని ఎట్లు బోధించగలను? ఈ వారం దినములు నేను బెల్లమును మానివేసితిని. కనకనే తినవద్దని అతనికి బోధించుటకు తగిన యోగ్యత ఇపుడు నాకు లభించినది. అని నుడివెను. గాంధిమహాత్ముని ఆచరణశీలత్వ మునకు వృద్ధుడు ముగ్ధుడైపోయెను.

**నీతి:** తాను ధర్మములను ఆచరణయందుంచు కొని పరిశీలించిన పిదపనే వానిని ఇతరులకు బోధించుట ఉత్తమము.

# మేక - తోడేలు

ఒక అరణ్యములో ఒక మేక "మే మే" అని అరచుచు పోవుచుండగా ఆ శబ్దమును విని సుదూరమున ఉన్న ఒక తోడేలు పరుగు పరుగున వచ్చి ఆ మేకను చంపి తినివేసెను.

ఈ ప్రపంచమున జీవుడను మేక 'ఈపుత్రులునావారు ఈ భార్యనాది, ఈ ధనము నాకు చెందినది. ఈ బంధువులు నావారు"-అని ఈ ప్రకారముగ కేకలిడుచుండగా ఇంతలో మృత్యువను తోడేలు ఎక్కడనుండియో చల్లగా వచ్చి ఆ

మేకను తన పొట్టన బెట్టుకొనుచున్నది. ఈవిషయము గరుడ పురాణమందు ఈ ప్రకారముగ చక్కగ వర్ణింపబడియున్నది.

అపత్యం మే కళత్రం మే
ధనం మే బాంధవాశ్చ మే
జల్పన్త మితి మర్త్యాజం
హన్తి కాలవృకో బలాత్.

[సంస్కృతములో "మే" అనగా 'నాది' నాకు చెందినది అని అర్థము.] నాపుత్రుడు, నాభార్య, నాధనము, నాబంధువులు-అని గొప్పగ చెప్పుకొనుచు "మే, మే' అని అరచుచున్న మనుజుని మృత్యువనెడి తన వశము చేసుకొనివేయుచున్నదని ఈ శ్లోకముయొక్క అర్థము.

**నీతి. మృత్యువను తోడేలు రాక పూర్వమే జీవుడను మేక జీవితము తడతేరుటకు దారిని వెతక వలెను. భగవంతుని తెలిసికొనుటకు ప్రయత్నించ వలెను. స్వస్వరూపజ్ఞానమును బడయవలయును.**

## అపూర్వ సహనము

పూర్వము గ్రీసు దేశమునందొక గొప్ప తత్త్వవేత్త ఉండెడివాడు. అతని పేరు సోక్రటీసు. అతడు తత్త్వశాస్త్రమందు

చక్కటి అనుభూతి బడసినవాడు. సదా ఆలోచనామగ్నుడై యుండుచు ఏదియో యొక విషయమును గూర్చి చింతించుచుండును. అయితే అతనికి దాంపత్యము మాత్రము సరిగా లేకుండెను. భార్యగయ్యాళి అగుటవలనను, అప్పుడప్పుడు కలహించుటవలనను గృహమునందు కొంత అశాంతి కలుగుచుండెను. అయినను సోక్రటీస్ దానినంతను లెక్కసేయక తన అధ్యాత్మిక చింతనను విడనాడకయుండెను.

ఒకనాడు మధ్యాహ్నమాతనిని భార్య భోజనమునకు పిలిచెను. ఆ సమయమున సోక్రటీసు ఏదియో తత్త్వశాస్త్ర విషయమును గూర్చి తదేక నిష్ఠతో తీవ్రముగ యోచన సలుపుచుండెను. భార్య పిలుపు వినినప్పటికిని, తదేకధ్యానతో దానిని చింతన చేయుచుండుటవలన, అతని మనస్సు భోజనమున్కు మరలకుండెను. భోజనమునకు రమ్మని పిలిచినను భర్త ఖాతరు చేయనందువలన భార్యగారికి అమితమైన కోపము జనించినది. మరల రెండవసారి పెద్దగా కేకవేసినది భోజనమునకు రమ్మని సోక్రటీసు పలుకలేదు. మూడవసారి ఇంకను పెద్దగ అరచిన ఆకాశము చిల్లిపడునట్లు. కాని భర్త ఏమాత్రము పలకుండెను. అపుడు అమ్మగారికి రోషము ఉబికి ప్రక్కనేయు పాత్రలోని చల్లటి నీళ్ళను తెచ్చి అతనిపై గుమ్మరించెను. అపుడు సోక్రటీస్ మెల్లగా ఈ వాక్యములను పలికెను.

It is natural that so much thunder produces a shower 'ఉరిమిన తరువాత వర్షము పడుట సహజము' అన్నట్లుగాను ఆరంభించినది. తరువాత వానవలె నీళ్లు పోసినది. దీనిలో ఆశ్చర్యమేమున్నది!—

సోక్రటీసు యొక్క సహనశక్తి అపూర్వమైనది. ఆత్మ జ్ఞానమును అనుభూతిలో తెచ్చుకొనిన మహానుభావుడతడు. నిందాస్తుతులకు అతీతుడై ప్రవర్తించెను.

**నీతి : సహనశీలము గొప్ప సుగుణము. నిందాస్తుతులు, మానావమానములు, శీతోష్ణములు మొదలగు ద్వంద్వములను జయించవలెను.**

## పరమపదసోపానపటం

ఇదియొక గవ్వలాట. ఇండ్లలో తరచు పిల్లలు, పెద్దలు ఆడుచుందురు. ఒక పెద్ద పటములో నిచ్చెనలు, పాములు చిత్రింపబడి యుండును, ఎన్ని గవ్వలు పడునో దానినిబట్టి నిచ్చెనల ద్వారా ఎక్కుటగాని, పాముద్వారా దిగుటగాని, సంభవించుచుండును. 101 వ స్థానము వచ్చినచో ఆట గెలిచినట్లు. అయితే 100 వ స్థానమున బ్రహ్మాండమైన పాము ఉండును. అది కాటు పడిన 1 కు వచ్చును. ఈప్రపంచ మొక పరమపదసోపాన

పటము. ఇందు సుఖములే నిచ్చెనలు. దుఃఖములే పాములు, సంసారము సుఖదుఃఖ సమ్మిశ్రము. సుఖములు సంప్రాప్తమైనపుడు మనుజుడు ఎగిరెగిరి పడును. దుఃఖములు సంభవించినపుడు కృంగిపోవును. జీవితమంతయు ఈ విధముగనే గడచును. జీవన్ముక్తుడగు జ్ఞాని తన నిజస్వరూపమగు ఆత్మను తెలిసికొనినవాడై సంసారపరిధిని దాటి పటములోని 100 వ స్థానమును పొందినవాని చందమున నుండును. అతడు నిచ్చెనల యొక్కయు, పాములయొక్కయు ప్రభావమునకు ఏ మాత్రము లోను గాక సమబుద్ధికలవాడై యుండును. అయితే 100 వ స్థానమునగల పెద్దపామును దాటినవాడే ఆట గెలుచుకొనలాగున మాయ, లేక అజ్ఞానమను భయంకరసర్పమును జయించినవాడే సంసారబాధలను అధిగమించును. వైరాగ్యముద్వారా, ఆత్మవిచారణద్వారా జీవుడు స్వస్వరూపమగు ఆత్మను తెలిసికొనునపుడు ఇక మాయ అతని నేమియూ చేయజాలదు.

నీతి: తీవ్రతర అనుష్ఠానముద్వారా ఆత్మసాక్షాత్కారమును బడసి సుఖదుఃఖ మిశ్రితమగు ఈ సంసారమను పరమపదసోపానపటలీలను విజయవంతముగ పరిసమాప్తమొనర్చుకొని, ద్వంద్వరహితులై జనులు పరమానందమును అనుభవించవలయును.

# మోక్షం లిస్టులో

ఒకానొక తపస్వి ఏకాంతవనమున తపస్సు చేయుచుండెను. తలక్రిందపెట్టి కాళ్ళుపైన పెట్టి ఎండలో శరీరమును తపింపజేయుచుండెను. బహుకాలము ఈ ప్రకారముగ ఆచరించుచు శరీరశోషణము గావించుచుండెను. తానొక గొప్ప తపస్విననియు,ఘనకార్యమాచరించుచున్నాననియు తలంచుచు అహంభావము కలిగి యుండెను. ఇట్లుండ ఒకనాడొక గంధర్వుడుఆకాశమార్గమున పయనించుచు ఎచటికో వెళ్ళుచున్నట్లు గమనించి ఆతపస్వి అతనిని కేకవేసి పిలచి "మహాత్మా! తమరెచటికి వెళ్ళుచున్నారని ప్రశ్నింప, వైకుంఠమునకు అని అతడు సమాధానమొసంగెను. అప్పుడు తపస్వి అయ్యా గంధర్వుడుగారూ!మోక్షం పొందినవారి యొక్క లిస్టు వైకుంఠంలో వ్రేలాడగట్టబడి యుండునని విని యున్నాను. దయచేసి ఆ లిస్టులోదూచి అందులో నాపేరు ఉన్నదేమో పరిశీలించి తిరిగి మీరు వచ్చునపుడు నాకు తెలియజేసిన మెతల ధన్యుడను కాగలను. ఈ చిన్న ఉపకారము నాకు చేసిపెట్ట ప్రార్థన అని పలుకగా, అట్లేయని చెప్పి గంధర్వుడు వెడలిపోయెను. తిరిగి కొన్ని రోజులకు వచ్చి గంధర్వుడు తపస్వితో "అయ్యా తమపేరు ఆలిస్టులోలేదు. అహంభావము కలిగి, తానొక పెద్ద తపస్వినని విఱ్ఱవీగువారికి మోక్షార్హత లేదనియు, వినయము,

విధేయత, నిగర్వము, నిరహంభావముగల వారికి మాత్రమే మోక్షమున చోటు గలదనియు, దంభము, దర్పము గలవారి కచట తావు లేదనియు, కేవలము శరీరమును శుష్కింప చేయుట, ఎంతవానలలో నానాబాధలుపడుట మోక్షము నకు అవలంబించదగిన పద్ధతి కాదనియు, మనస్సులో దాగి యున్న దుస్సంకల్పములు,దుర్వాసనలు,దుర్గుణములు త్యజించు టయే మోక్షమునకు మార్గమనియు చెప్పి వెడలిపోయెను. తపస్వి ఆ వాక్యములను విని తాను సంస్కరించుకొని పరమ శాంతిని బొందగల్గెను.

**నీతి: మోక్షము నభిలషింపదలంచువారు తమ చిత్తమందేలాటి అవగుణములేక నిర్మలత్వము, పవిత్రత గలిగియుండ వలయును.**

## సోమరి శిష్యుడు

ఒకానొక ఆశ్రమములో ఒక గురువు ఒక శిష్యుడు నివసించుచుండిరి గురువు శిష్యునకు చక్కటి హితబోధ గావించుచుండెను.కాని శిష్యుని సంస్కారము పవిత్రముగా లేకుండుట వలనను, అతని నిత్యవ్యవహారములో పెక్కు దోషములు కాన వచ్చుటచేతను, ఒకనాడు గురువు శిష్యునిపిలచి "నాయనా! ఇకమీదట నీ ఆచరణలో చాల జాగ్రత వహింపుము. ఒక్క

తప్పైనా రాకుండ చూడుము. ఒకవేళ ఏదైనా దోషము నీ వలన సంభవించినచో వెంటనే దానిని దినచర్య పుస్తకము (డైరీ) లో నోట్ చేసికొనుము. మరునాడు అట్టి దోషమురాకుండ చేసి కొనుము. దీనిచే నీ చరిత్ర క్రమక్రమముగ శుద్ధము కాగలదు.

గుర్వాజ్ఞ ప్రకారము శిష్యుడు తన తప్పిదములను పుస్తకములో వ్రాయుచుండెను. కొద్ది రోజులైన వెనుక ఒక నాడు అకస్మాత్తుగ శిష్యుడు ఆశ్రమమంతయు బ్రహ్మాండముగ అలంకరించుచుండెను అతడు ఎందు కొఱకు ఆ విధముగ చేయుచున్నది గురువునకు అంతుపట్టక, శిష్యుడిట్లు వచించెను.- "మహాత్మా! నేను చేసిన దోషములను, తప్పులను పుస్తకములో వ్రాసికొనిన బాగుండునని తాము సెలవిచ్చితిరిగదా! అట్లు వ్రాయుచు రాగా, రాగా సరిగా ఈ దినమునకు నూఱు తప్పులు పూర్తి అయినవి. అందుచే ఆ తప్పులకు శతజయంతి జరుపుచున్నాను."

ఆవాక్యములను విని గురువు శిష్యుని మందలించి, మంచికి శతజయంతిగాని చెడ్డకు కాదని తెలిపి దోషములను, పెంచుకొనుచు పోక,ఎప్పటికప్పుడు వాటిని పోగొట్టుకొనుచుండ వలెనని హితము చెప్పెను.శిష్యు డందులకు అంగీకరించి అప్పటి నుండియు తన మనస్సు నందలి దోషములను బాగుగ కడిగివైచి సన్మార్గమున ప్రవర్తింప సాగెను.

**నీతి: సోమరితనము జీవితమును నిరుపయోగ మొనర్చును_కావున అద్దానిని దరికి చేర్చరాదు.**

# మాయ

## 1

శిష్యుడు - మహాప్రభో! తెలుపు మంచిదా? నలుపు మంచిదా?

గురువు - తెలుపు.

శి - మరి తెల్లజుట్టు చూచి జనులు ఏవగించుకొంటారేమి ?

గు - అదే మాయ !

## 2

శిష్యుడు - మహాప్రభో ! శరీరం దేనిచేత చేయబడింది ?

గురువు - రక్తమాంసాదులచేత.

శి - మరి అట్టి శరీరాన్ని చూచి జనులు మురిసిపోతారేమి ?

గు - అదే మాయ !

## 3

శిష్యుడు - మహాప్రభో! జీవితం ఎటువంటిది ?

గురువు - మూణ్ణాళ్ళముచ్చట.

శి - మరి జనులు దాన్ని శాశ్వతంగా భావించుకుంటూ ఏమో మునిగిపోయినట్లు వర్తిస్తుంటారేమి ?

' మాయ !

## 4

శిష్యుడు- మహాప్రభో! ప్రపంచములో శాశ్వతమైనది ఏది?
గురువు- భగవంతుడు
శి- మరి అట్టి భగవంతుణ్ణి జనులు మఱచిపోతూంటారేమి?
గు- అదే మాయ!
శి- మరి కడతేరటానికి మార్గమేదండి?
గు- ఆ భగవంతుని నిరంతరం జ్ఞాపకం పెట్టుకోటమే.
శి- మహాప్రభో! తమ బోధచే ధన్యుడనైతిని. సెలవు.

## సోమరిశిష్యుడు 1

గురువు- ఒరే కాంతారావ్! ఈ రోజు భక్తులు మంచి తీపి ఫలహారమేదో తెచ్చారు. దానిని తీసికొనివెళ్లి చీమలు పట్టనిచోట జాగ్రత్త చెయ్యి!
శిష్యుడు- మహాప్రభో! గుర్వాజ్ఞ! తమ ఆదేశాన్ని అక్షరాల అమలు పరుస్తాను.
(ఆరోజు రాత్రి శిష్యుడు గురువునకు తెలియకుండా ఆ ఫలహారములో చాల భాగము తినివేసెను.)
(మఱునటిరోజు)
గురువు-ఏమిరా! కాంతారావ్! ఫలహారము ఎక్కడ దాచినావు?

శిష్యుడు-చీమలు పట్టనిచోట.

గురువు-భద్రంగా ఉంచినావా?

శిష్యుడు-అతి భద్రంగా మహాప్రభో! నేను పెట్టినచోట ఒక్క చీమకాదు, దోమకాదు, పల్లికాదు, ఏదీ ప్రవేశింపలేదు.

గురువు-భేష్! అయితే శాంతారావ్! కొందరు మీద ఏనాది పిల్లలు మన ఆశ్రమం వచ్చారు. వారికి ఆ ఫలహారం పంచి పెట్టాలి, తీసుకురా!

(శిష్యుడు ఏమిచేయుటకు తోచక భయకంపితుడై యుండెను. అదిచూచి గురువు )

గురువు-ఏమిరా! కదలవేం!

శిష్యుడు-స్వామీ! మహాప్రభో! ఏమిచెప్పేది! తమరిచ్చిన ఫలహారం ఎక్కడ పెట్టినా చీమలబాధ ఉంటుందని తలంచి, తమ ఆజ్ఞను పరిపూర్ణంగా పాలించాలను ఉద్దేశ్యంతో పొట్టలో దాచిపెట్టాను.

గురువు-ఓరి తిండిపోతా! తిన్నావట్రా! మొత్తం తినేశావా!

శిష్యుడు-కాదుస్వామీ! ఇంకా కొంచెం మిగిలి ఉంది.

గురువు-దాన్నైనా తీసుకురా! తొందరగా!

(శిష్యుడు తెచ్చిన ఆ మిగులు ఫలహారంలో కొంచెం ఏనాది పిల్లలకు పెట్టి, తక్కిన దానిని గురువు ఒక సీసాలో పెట్టి మూతబిగించి ఇక మీదట శిష్యుడు దానిని తినకుండా ఉండేదుకై ఆ సీసామీద

'ఇది విషము' అని వ్రాసిపెట్టెను. ఆరోజు రాత్రి శిష్యుడు ఆ సీసా తెరచి దానిలోని ఫలహారం యథాప్రకారం తినివేసెను. మరునాటిరోజు గురువు ఫలహారం సీసా తెప్పించి చూడగా దానిలో ఏమీ లేకుండెను.)

గురువు-ఏమిరా! మరల ఫలహారం తినేశావా!

శిష్యుడు మహాప్రభూ! ఎంతటిమాట! నేనెగనక తినివుంటే
అది విషం కాబట్టి ఈపాటికి చచ్చి ఉండేవాణ్ణి!

గురువు-ఓరి సోమరిపోతా! ఇకమీదట ఇట్లా తినబాకా! తిండి
తగ్గించి బాగా ధ్యానంచేసుకో!

## 2

గురువు-అబ్బాయ్! పాఠశాలకు వెళ్ళిసంస్కృతం చదువు
కుంటున్నావా!

శిష్యుడు-స్వామీ! రోజూ వెళ్తున్నాను.

గు-వెళ్తున్నావు సరే. అక్కడ ఏమైనా నేర్చుకుంటున్నావా
లేదా!

శి-పంతులుగారు బాగా చెప్తున్నారు.

గు-పంతులుగారి సంగతి అట్లాఉంచు. నీ సంగతి అడుగుతున్నా
పంతులుగారు చెప్పింది నీకేమైనా వంటపడుతున్నదా లేదా!

శి-స్వామీ! ఈ సంస్కృతం ఇంకా ఎన్నాళ్లు చదవాలి?

గు-ఓరి సోమరీ! విద్య నేర్చుకోవటం నీకేదో భారంగా ఉన్నట్లు
తోస్తూంది. అయినా నిన్న ఏమి పాఠం చెప్పినారో చెప్పు!

శి-నిన్న స్కూలు లేదు.

గు-పోనీ, మొన్న ఏమి పాఠం చెప్పినారో చెప్పు?

శి-మొన్న సంస్కృతం మాష్టరు స్కూలుకు రాలేదు.

గు-పోనీ, అటు మొన్న

శి-మా సంస్కృతం మాష్టరు తెలుగు మాష్టరు ఇద్దరూ తిట్టుకున్నారు. పాఠం చెప్పలేదు.

గు-రామరామ! ఎన్ని సాకులు నేర్చుకున్నావు? నీకు చదువు మీద ధ్యాసలేదు. పోనీ, రోజూ పొద్దున్నే జపమైన చేస్తున్నావా?

శి-చేస్తున్నాను, జపమాలతో లెక్కకూడ పెడుతున్నా.

గు-సరేకానీ, జపం చేసేటప్పుడు నీదృష్టి దేనిమీద ఉంటుందో చెప్పు?

శి-స్వామీ! జపమాలలోని కొలికిపూస చేతికి ఎప్పుడు తగులుతుందా దేవుడా అని ఒకటే కలవరం దృష్టిఅంతా దానిమీదే ఉంటుంది.

గు-ఈ పద్ధతి బాగాలేదు. జపం చేసేటప్పుడు మనస్సు దేవుని మీదనే లగ్నం కావాలి. దైవం మినహా మనస్సులో ఇంకేదీ రాకూడదు. ఇకమీదట అయినా బాగా జపం చేసికో, పుణ్యం సంపాదించు తెలిసిందా?

శి-బ్రహ్మాండంగా తెలిసింది చక్కని బోధ చేసినారు స్వామీ ఇకముందు తమరు చెప్పినమాదిరే జపంచేస్తాను, ఒక వారం రోజులలోపల అంతా దారికి వస్తుందని ఊహిస్తున్నా.

పిబి: జపము చేయునపుడు దృష్టి పరమాత్మ యందే సంలగ్నము కావలెను. అలసత్వమును విడ నాడి దైవకార్యములను.అధ్యాత్మిక సాధనలనుగావింప వలయును.

## 3

గురువు-ఏమిరా! గోపీ! ఈరోజు గీతాపారాయణము మాని వేసినావేమి?

శిష్యుడు-స్వామీ! ఈ దినం ఆదివారం.

గు-ఆదివారం అయితే పారాయణము మానివేయాలా?

శి-ప్రభూ! ఆదివారం ఆఫీసులకు సెలవు, స్కూళ్ళకు సెలవు, అంగళ్ళకు సెలవు, మరి నాకుమాత్రం..

గు-అయితే ఇవ్వాళ ఆదివారం అని భోజనం మాని వేసావా?

శి- లేదు స్వామీ!

గు- ఆదివారం సూర్యుడు సంచారం మానివేస్తాడా? ఆదివారం గాలి వీచదా? ఆదివారం గుండెకాయ పనిచేయదా? ఆదివారం ఆహారవిహారాలేవీ నీవు వదల లేదుగదా?

శి- లేదు స్వామీ!

గు- మరి భగవచ్చింతనమాత్రం ఎందుకు వదలాలి దేనికి పారాయణాలు? పుణ్యము సంపాదించడానికిగదా!

మరి పుణ్యం ఎంత ఎక్కువ సంపాదిస్తే అంత మంచిదికదా! ఇక నుండి ప్రతిరోజూ పారాయణము నిలుపవద్దు! పైగా ఆది వారము సెలవు దినం కాబట్టి రెట్టింపుధ్యానం, రెట్టింపు పారాయణం చేయటం మంచిది. సోమరితనం వదిలెయ్. ఓరి పిచ్చివాడా! పారాయణం ఎగరగొట్టటానికి ఎంత ఊహ పన్నినావురా!

## 4

(ఒక గృహస్థుడు పరుగుపరుగున ఒకానొక ఆశ్రమమునకు వచ్చి ఆశ్రమాధిపతియగు గురువుయొక్క పాదములపై వ్రాలి తీవ్రతరముగ మొరపెట్టుకొనెను)

గృహస్థుడు-మహాప్రభో! నాకు తక్షణమే సన్న్యాసం ప్రసాదించాలి తమరు. ఒక్క నిముషమైనా ఆలస్యంచేయకూడదు.

గు-ఏమిటి ఆ తొందర! సన్న్యాసం నోటిమాట లనుకున్నావా? సాంసారికవ్యామోహాలు నీకు పూర్తిగా అంతరించాయో లేవో ముందు చెప్పు. నీకు పూర్ణవైరాగ్యం కలిగిందా? దృశ్యవస్తువులమీద రోతపుట్టిందా? భగవంతునిపొందుటకై తీవ్రమగు ఆపేక్ష జనించిందా? చెప్పు.

గృ-అట్టివి ఏమీ నాకు కలుగ లేదు స్వామీ!

గు-మరి యింత హడావుడిగా - ఏమో మునిగిపోతున్నట్లు

సన్న్యాసం పోతున్నారేమి?

గృ-ఏమీ లేదండీ! ఇంట్లో పెద్ద రచ్చగా ఉన్నది. ఒకటే కలహం, ఒకటే గొడవ ఇల్లంతా!

గు-ఎవరితో కలహం?

గృ-మా ఆవిడతో.

గు-అయితే మామల ఇంటికి వెళ్లావా?

గృ-సూర్యుడు పడమటిపక్క ఉదయించినా, జలనిధులింకినా, కులపర్వతములు కూలినా మామల ఇంటిగడప నేను తొక్కనే తొక్కను. గట్టిగా చెప్తున్నాను, నావిషయం తమకింకను అనుభవములేదు గాబోలు!

గు-అయితే నీవిక ఇంటికి వెళ్ళని మాట ఖాయమేనా?

గృ-ముమ్మాటికి ఖాయము.

గు-ఒకవేళ మీ ఆడవారిచటికి వచ్చి ప్రాధేయపడి తిరిగి నిన్ను యింటికి రావలసినదిగా వేడితే అప్పుడో?

గృ-అప్పటిసంగతి అప్పుడు ఆలోచించుకోవచ్చు!

—o—

5

శిష్యుడు-స్వామీ! ప్రాణాయామము నేర్పుతారా నాకు!

గురువు-అది అందరికి చెప్పకూడదు. గురువు చెప్పినట్లు ఆచరించే వారికి మాత్రమే చెప్పవలె. ఎందుకనగా, దాని సాధనలో ఏకొంచెం అజాగ్రత వహించినా శరీరం దెబ్బ తింటుంది.

శి- మహాత్మా! తమరు చెప్పిన దానిని "తు,చ" తప్పకుండా ఆచరిస్తాను.

గు-సరే, విను. చెప్తాను—ప్రాణాయామము మూడు అంగముల తో కూడియుంటుంది — పూరకం, కుంభకం, రేచకం అని. గాలిని లోనికి పీల్చటం పేరు పూరకం,పీల్చినగాలిని లోన కొద్దిసేపు అట్టిపెట్టడం కుంభకం, తిరిగి దానిని బయటకు వదలిపెట్టడం రేచకం.

శి- స్వామీ!తమరు చెప్పే వాక్యములు నాకు అర్థం కావటం లేదు, దయచేసి ఎట్లా చెయ్యాలో చూపించ ప్రార్థన.

గు-భేష్! అట్లా ఉండాలి. శిష్యునియొక్క జ్ఞానోత్కంఠ. నీ జిజ్ఞాసకు చాలా మెచ్చినాను. సరే! ఎట్లా చేయాలోచూపిస్తాను. ఎదురుగా వచ్చి కూర్చో!

(వెంటనే శిష్యుడు గురువునకు ఎదురుగావచ్చి కూర్చొనెను)

గు-ముక్కు పట్టుకో.

[గురువుగారి ఆ వాక్యమును వినగానే శిష్యునకు "ఎవరి ముక్కు పట్టుకోవాలి' అను సందేహమును కలుగగా, తికమక

పడి, చివఱకు ఏమిచేలేక ఎదురుగానున్న గురువుగారి ముక్కును అమాంతంగా పట్టుకొనెను. అపుడు గురువు కంగారుపడి యిట్లరచెను — ]

గు-ఒరేయ్! వదులురా!

(ఆమాట వినగానే శిష్యుడు "వదులు"గా పట్టుకొన్నందుకు గురువు ఆక్షేపించుచున్నాడని భావించి గురువుముక్కును ఇంకా బిగదీసి పట్టుకొనెను. అపుడు శిష్యుని చేతిని ఎట్లాగో వదిలించుకొని బ్రతికి బైటపడి గురువు శిష్యుని యిట్లు చీవాట్లు పెట్టెను) —

గు-ఏమిరా ఇంతటి మూర్ఖపుపనిని చేసినావు?

శి-స్వామీ! గుర్వాజ్ఞను అక్షరశః పాలించాను, అంతే.

గు-ఛీ! ఇప్పటికైనా బాగా తెలుసుకో! ప్రాణాయామంలో ప్రతివారు వారివారి ముక్కే పట్టుకోవాలికాని ఇంకొకరి ముక్కు కాదు. ఓరి మందమతీ! ఎంతపని చేసావురా!!



గురువు-ఏమిరోయ్! కంభా! పొద్దున్నే నోరు కదలిస్తున్నావు? ఏదో మంత్రం జపం చేస్తున్నట్లున్నావే!

శిష్యుడు-కాదు స్వామీ! పూజారి రామయోగికొంచెం వడపప్పు పెట్టినాడు. దానిని సేవిస్తున్నాను.

-పొద్దున లేస్తే తినటమేనా పని! ఇకమీదట రోజూ ఉదయం కొంచమైనను మంత్రజపం, దైవధ్యానం చేస్తేనే తప్ప ఏమీ తినకూడదను నియమం పెట్టుకో. ఈనియమం ఆత్మోన్నతికి చాలాముఖ్యం. తెలిసిందా!

-తెలిసింది స్వామీ! ఇకనుండి అట్లాగే చేస్తాను.

గు-(మరునాటిరోజు భోజనసమయమున)ఏమిరా! నిన్న చెప్పింది అప్పుడే మరచిపోయినావా!

-లేదు స్వామీ.

గు-మరి జపం చెయ్యకుండా భోజనానికి కూర్చున్నావేమి!

-జపం చేసినాను స్వామీ.

గు-ఎప్పుడు చేసినావురా! పొద్దున్నుంచి నేనిక్కడనే కూర్చొని ఉన్నానే, నిన్ను జపం చేస్తుండగా చూడనే లేదే!

శి-మనస్సులో చేసినాను స్వామీ!

(అపుడు గురువుగారు వెంటనేవంట సుబ్బన్నను పిలిపించి ఇట్లనెను)

గు-ఓరీ సుబ్బన్నా! ఇవ్వాళ శంభూప్రసాదుకు భోజనం పెట్టకు

సుబ్బన్న-ఎందుకు స్వామీ!

గు-వాడు మనస్సులోనే భోంచేసాడు.

(అది విని శిష్యుడిట్లనెను)

శి-స్వామీ! క్షమించండి ఇకమీదట తాము చెప్పినట్లు చేస్తాను.

గు-ఓరీ శంభూ! ఇప్పటికైనా తెలిసిందా. సాధనచేసేవారు సోమరితనాన్ని దగ్గరకు రానీయకూడదు. ఇక మీదట రోజూ ఒక జపమాల తీసికొని నేను చెప్పినమంత్రాన్ని 1008 తక్కువలేకుండా భక్తితో జపం చెయ్యి. నియమం తప్పించుకోటానికి సాకులు వెతకబోకు. ఇదంతా నీకోసమూ, నా కోసమూ! ఓం శాంతి శాంతి!

## 7

గురువు-ఓరీ! నాయనా! ఈరోజు ఏకాదశి కాపున పువ్వులు కొంచెము ఎక్కువగా కోసుకొనిరారా.

శిష్యుడు-స్వామీ! క్షమించండి, కాలిలో ముల్లుగుచ్చుకొన్నది. నడవలేను.

గు-పోనీ, ఒకచోట కూర్చొని గంధం అరగదీయి.

శి-నడుమునొప్పిగా ఉన్నది. వంగలేకుండా ఉన్నాను.

గు-పోనీ, ఏమీ చేయక ద్వారందగ్గర కూర్చొని ధ్యానసమయములో ఎవరినీ లోపలికి రానీయక చూస్తూఉండు

శి-స్వామీ! తలనొప్పిగా తిరుగుచున్నది. పండుకోవాలి అనిపిస్తున్నది.

గు-పోనీ, ఆశ్రమంగదిలో నిన్న భక్తులు తెచ్చిన ఫల
హారములున్నవి. వాటిని ఆరగించు.

శి-మహాప్రభో! గురువర్యా! తప్పక శిరసావహించెదను.

8

గురువు-ఏమిరా! ఈరోజు గీతాపారాయణకు రాలేదేమి?

శిష్యుడు- స్వామీ! రాత్రి అంతా కడుపునొప్పిగా ఉంది. అందు
చేత ఉదయం లేవలేకపోయాను.

గు-నిన్నటివరకు ఆరోగ్యంగా ఉన్నావే, అకస్మాత్తుగ ఈ
జబ్బు ఎందుకు వచ్చింది? అసలీ కడుపునొప్పి నీకు ఎప్పుడు
ప్రారంభమైందో చెప్పు?

శి- మహాప్రభో! నిన్నటిదినం ఆశ్రమంలో భిక్ష జరిగినప్పుడు
నేను భిక్ష భోజనం చేస్తూండగా మజ్జిగన్నం తిన్నానో
లేదో వెంటనే కడుపునొప్పి ప్రారంభమైంది.

గు-ఇంతకీ కడుపునొప్పి దేనివల్ల వచ్చిందంటావు?

శి- మజ్జిగన్నం తినటం వలన.

గు-శుద్ధతప్పు. అట్లా అనకూడదు. మజ్జిగ జీర్ణశక్తిని ఇంకా
పెంచుతుందేకాని తగ్గించదు. నీకడుపునొప్పికి ఇంకేదో
కారణం తప్పక ఉండిఉంటుంది. బాగా ఆలోచించి చెప్పు.

శి- లేదు స్వామీ! సత్యంగా చెప్తున్నాను, మజ్జిగన్నం తిన్న
ప్పటినుంచే అది ప్రారంభమైంది.

గు-సరేకాని, మజ్జిగన్నానికి ముందు ఏమేమి తిన్నావో చెప్పు!

శి- 6 గారెలు, 7 బూరెలు.

గు-అదీ కథ, నీ కడుపునొప్పికి కారణం బైటపడింది. అనవస
రంగా మజ్జిగ మీద నేరం పెట్టావు, మజ్జిగదికాదు దోషం.
ముక్కువఱకు ఫలహారం తినటంవల్ల ఈ బాధ వచ్చింది

శి- మహాప్రభో! అయినదేదో అయినది. ఇపుడీ కడుపు
నొప్పి పోయే మార్గం సెలవివ్వండి స్వామీ!

గు:-వేరే మార్గం ఏమిలేదు. ఒకరోజు పూర్తిగా ఉపవాసం
చెయ్యి. ఇకమీదట నాలుకపై కొంచెం నిగాఉంచు. అది
మహాప్రమాదకరమైన ఇంద్రియం. మహామహు
లని బోల్తా కొట్టించింది అది. మితాహారాన్ని తీస్తు
ఉండు. అధిక ఆహారం సేవించటంవల్లనే నీకు సోమరితనం వ
చ్చింది, బద్ధకం జాస్తి అయింది. ఎంతో పుణ్యాన్ని సంపాదిం
చిపెట్టే గీతాపారాయణకూడా నీవు దానివలన అన
వసరంగా పోగొట్టుకున్నావు, ఇకమీదట మితాహారాన్ని
చక్కగ అవలంబిస్తూ, నాలుకపై సంయమము కలిగి, నియ,
నియమంగా గీతాపారాయణ దైవధ్యానం చేస్తుఉండు
అన్నిబాధలూ దూరంగా పోతవి. తెలిసిందా?

శి:-బ్రహ్మాండంగా తెలిసింది!

## 9

గురువు-ఏమిరా! రవీ! నీమీద చాల ఫిర్యాదులు వస్తున్నవి! ఉదయం గీతాపారాయణకు రావటంలేదట! విద్యార్థులను కొడుతున్నావట! కొత్తగావచ్చిన సాధువులను తిడుతున్నావట! వంటాయనతో పోట్లాడుతున్నావట! నిజమేనా?

శిష్యుడు-వాళ్ళంతా కావాలని నామీద నేరంమోపుతున్నారు స్వామి! వాస్తవంగా నేను పరమశుద్ధుడను!

గు-వాళ్ళమాట అట్లాఉంచు. నీ తప్పులన్నీ నేను రోజూ వ్రాసి పెట్టున్నా. నిన్నటికి అవి సరిగా నూతైనవి! తెలుసా?

శి-క్షమించండి! మహాప్రభో! ఇకమీదట ఏ తప్పూ చేయను.

గు రేపట్నుంచి అందరితోబాటుసరిగా గీతాపారాయణకు వస్తావా?

శి-రేపొక్క రోజు మన్నించండి. ఎల్లుండినుంచితప్పకుండావస్తాను

గు-రేపేమి?

శి-గొప్పకార్యం ఒకటి తలపెట్టాను స్వామీ!

గు-ఏమిటో? అది?

శి-మూరుతప్పులు పూర్తిఅయినవి కాబట్టి శతజయంతి జరుపుకోవాలనుకున్నా!

గు-ఓరి సోమరిపోతా! మంచివాటికి జయంతి కాని చెడ్డవాటికేమిటో? ఆ పిచ్చిఊహ వదిలేసి రేపటినుంచి పారాయణానికి రా! సోమరితనం వదిలిపెట్టెయ్యి! దైవమార్గంలో సోమరితనానికి చోటిస్తే నువ్వు ఎందుకూ పనికిరాకుండ పోతావు! తెలిసిందా? భద్రం!

## 10

గురువు-ఏమిరా, అబ్బాయ్! ఆశ్రమంలో ఒకపనీ సరిగా చేయడం లేదేమి?

శిష్యుడు-పనులమీద దృష్టి పోవటం లేదు స్వామీ! ధ్యానం మీదే పోతున్నది.

గు-సరే! రేపటినుంచి నీవేపని చేయవద్దు.సదా ధ్యానం చేసుకుంటూ కూర్చో.

(కొన్నాళ్లైనతరువాత)

గు-ఏమిరా!శంభూ! ధ్యానం బొత్తిగా వదలివేసినావు?

శి-ధ్యానంలో మనస్సు నిలవటం లేదు స్వామీ!

గు-అది ఎక్కడకు పోతున్నదో కనిపెట్టావా?

శి-నేను ఆశ్రమానికి వచ్చేటప్పుడు మా పెద్దమ్మతో చెప్పి రాలేదు. ఆమె ఏమనుకుంటున్నదో అని ఒకటే కలవరంగా ఉన్నది.

గు-ఇదేమివైరాగ్యం అబ్బాయ్! ఇల్లు, వాకిలి వదలివేసికూడా మఱల వాళ్ళ తలంపులు నీకెందుకు? అన్ని వదిలేయ్. ఒక్క దేవుని తప్ప ఇంకెవరినీ మనస్సునకు రానీయవద్దు!

శి-తమరెన్నైనా చెప్పండి, నామటకు నాకు ఈ ధ్యానం కుదరటమే లేదు స్వామీ!

గు మరి ఏమి చేస్తానంటావు?

శి-నాకు సరిపడ్డ పని ఏదైనా ఇవ్వండి స్వామీ!
గు-అదేదో నీవే చెప్పు
శి-లోకసేవకు నన్ను వదలండి
గు-వచ్చినట్లుంది. ముందు నీసేవ చేసుకో. తరువాత లోకసేవ, మందత్వం పోగొట్టుకో, దుర్గుణాలు వదిలేయ్. ఓరి సోమరి పోతా! పని తప్పించుకోటానికి ఎన్ని వేషాలు వేస్తున్నావు!

## 11

గురువు-చెంచూ! పాఠాలు బాగా చదువుతున్నావా!
శిష్యుడు-స్వామీ! బ్రహ్మాండంగా చదువుతున్నాను.
గు-అన్ని పాఠాలు జ్ఞాపకముంటున్నవా?
శి-శ్రద్ధగా చదువుతున్నాను.
గు-చదువుతున్నావు సరే. చదివినవి జ్ఞాపక ముంటున్నవా అని.
శి-కొన్ని జ్ఞాపకం ఉంటున్నవి. కొన్ని మరచిపోతున్నాను.
గు-అన్నీ జ్ఞాపకముంచుకోనేటట్లు చూడు.
శి-స్వామీ నాకైతే జ్ఞాపకముంచుకోవాలనే ఉంది. కాని మొన్న ఒకాయన "అన్నీ 'జ్ఞాపకముంచుకుంటే తల వేడెక్కుతుంది అన్నాడు.
గు-అందుకని ఏం చేశావు?
శి-కొన్ని వదిలేశా. కొన్ని ఉంచుకున్నా.

గు-ఏ పేవి ఉంచుకొన్నావు!

శి-భోజనాన్ని గూర్చిన, పడకను గూర్చిన సంకల్పాలు ఉంచుకున్నా.

గు-మరి పాఠాల సంగతి?

శి-వేడిభయంవల్ల వదిలేశా.

గు-ఓరి సోమరిపోతా! పాఠాలు చక్కగా చదివి జ్ఞాపకం పెట్టుకో. దానివల్ల విద్య బాగా అలవడి భవిష్యత్తులో నీకు ఎంతో మేలు కలుగుతుంది.

శి-మహాప్రభో! బాగా సెలవిచ్చారు! ఇకమీందట తమ ఆదేశం ప్రకారమే చేస్తాను.

## 12

గురువు-ఏమిరా! మల్లయ్యా! అలా నిలబడ్డావు?

శిష్యుడు-మహాప్రభో! తమరు నాకొకటి అనుగ్రహించాలి.

గు-ఏమిటది?

శి-మోక్షం.

గు-అది నీ కెప్పుడు కావాలి?

శి-సాయంత్రం లోపల.

గు-ఒకవేళ ఇస్తే దానిని ఎక్కడ దాచుకుంటావు?

శి-నాగదిలో.

గు-ఓరి పిచ్చివాడా! మోక్షమనేది ఒక వస్తువుకాదు. ఇచ్చి పుచ్చుకొనే పదార్థంకాదు. గదిలో దాముకొనేది అంత రంటే కాదు. అంత సులభంగా అడిదొరకదు. దానికి ఎంతో కాలం జపం, ధ్యానం, విచారణ ఇంద్రియనిగ్రహం, మొదలైనవి చేయాలి. అటువంటివి నీవేమైనా చేశావా?

శి-మహాప్రభో! అవి తప్ప తక్కినవన్నీ చేశాను.

గు-పోనీ! ఇప్పుడైనా వాటిని చేయటానికి ఇష్టపడతావా? కష్ట పడందే, ఏదైనా కొంత త్యాగం చేయందే గొప్ప స్థితి ఎట్లా లభిస్తుంది?

శి-స్వామీ! తమరు ఎంతో కాలం బాగా సాధనచేసి, తపస్సు చేసి మోక్షాన్ని సంపాదించినారు. తమర్ని ప్రార్థించేది ఏమిటంటే ఆమోక్షం నాకు దయచేయమని.

గు-అట్లా వీలుపడదు. ఎవరిమోక్షం వారే ప్రయత్నంచేసి సంపాదించుకోవాలి. ఎవరి ఆకలి వారే పోగొట్టుకోవాలి, ఎవరి శుద్ధతనానికి వారే మందువేసుకోవాలి. గురువులు, పెద్దలు, శాస్త్రాలు దారి చూపుతవి.నడవాల్సింది శిష్యుడు తనకు తానే.ఇంతకీ నేను చెప్పిన సాధనలు చేస్తావాలేదా?

శి-మహాప్రభో! నా పనులు ఎవరైనా చేస్తారో లేదో కొందర్ని ముందుగా అడిగిచూడా లనుకొన్నాను, ఎవరూ దొరక్కపోతే స్వామీ! తప్పకుండా చేస్తాను.

గు-ఓరి సోమరిపోతా! నీబిడ్డలు ఎవరైనా అన్నంతింటే నీఆకలి తీరుతుందా? ఇప్పటికైనా తెలుసుకో, వెంటనే జపం మొదలుపెట్టు. గీతాపారాయణ ప్రారంభించు పెద్దల్ని ఆశ్రయించు, నియమాలు పెట్టుకో, సోమరితనాన్ని దూరంగా పారెయ్యి. ఒకింత శ్రమచేస్తే మోక్షం దానంతట అదే వచ్చి నిన్ను ఆశ్రయిస్తుంది. తెలిసిందా?

శి-బ్రహ్మాండంగా తెలిసింది. మహాప్రభో! నన్ను కడతేర్చారు. ఈ రోజే జపమాల తెచ్చుకొని సాధన ప్రారంభిస్తా!

## 13

(కుంభవర్షము కురియుచుండెను. పెనుగాలి వీచుచుండెను గురువు గారి పర్ణశాల పైభాగమునగల ఒక తాటి యాకు గాలికి ఎగిరిపోయెను. ఆ రంధ్రముగుండా వర్షపునీరు కుటీరము లోనికి కారుచుండెను.

గురువు-నాయనా! మన కుటీరంపైన తాటాకు గాలికి ఎగిరిపోయింది. కొంచెం కప్పరాదూ?

శిష్యుడు-స్వామీ! నెమ్మదిగా కప్పుతాను.

గు-ఆలస్యమైనకొద్దీ నేలంతా తడిసిపోవటం లేదా?

శి-స్వామీ! జోరున వాన కురుస్తూంటే పైకెక్కి ఎట్లా కప్పేది

తమరే చెప్పండి. కొంచెం వాన తగ్గనీండి. తప్పకుండా కప్పుతాను.

(కొంచెంసేపైన తర్వాత వాన పూర్తిగ నిలిచిపోయింది. అప్పుడు)

గు-శంభూ! వాన ఆగిపోయింది. తాటాకు కప్పరాదూ!

శి-స్వామీ! ఇప్పుడు వాన కురవడంలేదుగా. ఇల్లు తడవటం లేదుగదా. కప్పవలసిన అవసరం ఏమున్నది చెప్పండి!

గు-శంభూ! ఇంత తమోగుణం ఉంటే ఎప్పుడు బాగుపడతావు? ఆ పాడు బద్ధకాన్ని దులిపివేసి ఎప్పుడు చేయాల్సిన పనిని అప్పుడే చేస్తూండు. వాయిదా వేయకు, బద్ధకం, అలసత్వం- వీటిని దరికి చేర్చవద్దు. అవి జీవితాన్నే నాశనం చేస్తవి. భద్రం! తెలిసిందా!

శి-బ్రహ్మాండంగా తెలిసింది.

(భగవచ్చింతనను "రేపు-రేపు" అని వాయిదా వేయరాదు. ఎన్ని ఆపత్తులు కలిగినను దైవధ్యానమును విడనాడరాదు. కథలోని సోమరి శిష్యునివలె కాలయాపన చేయరాదు)

## 14

గురువు-నాయనా! గురువులు, పెద్దలు కనిపించినప్పుడు వెంటనే నమస్కారము చేయుట నేర్చుకొనుము.

శిష్యులు-అలాగే స్వామీ!

(గురువుగారు పొరపాటున బావిలోపడిరి. శిష్యులు ఒక తాడును బావిలో వదిలిరి. గురువుగారు తాడును పట్టుకొనగా శిష్యులు పైకిలాగుచుండిరి. బావిపై అంచుకు రాగానే శిష్యులు గురువుగారికి నమస్కరించాలని భావించి తాడు వదలి గురువుగారూ! నమోనమః అని చేతులెత్తి నమస్కరించిరి.

గురువు గారు తిరిగి బావిలో పడి పోయిరి)

**నీతి_పెద్దలు చెప్పిన విషయములను వివేకము ఉపయోగించి సందర్భమును పరించి పాటించవలెను.**

## 15

గురువు-ఏమిరా! సోమయ్యా! ఈమధ్య చాలాకాలంనుండి కనుపించటంలేదేమి?

శిష్యుడు-స్వామీ! ఒకటే ఆలోచన పట్టుకుంది మోక్షాన్ని ఎప్పుడు చేరదామా అని. ఆ ఆలోచనలో మనస్సు తన్మయమై కొద్దిరోజులు అట్లా తిరిగివచ్చా.

గు-ఏమైనా దారి దొరికిందా ఇనరికి?

శి-స్వామీ! ఇంతవరకు దొరకలేదు, అది తమరే అనుగ్రహిం చాలి. మోక్షం త్వరగా పొందాలని నాకు చాలా కాలం నుంచి తహతహగా ఉంది. మోక్షం పొందటానికి సులభ

మైన సాధన ఏదైనా ఉంటే దయచేసి సెలవిస్తారా?

గు-శిష్యా! "నీ వెవరవో తెలుసుకో" — ఇదే మోక్షానికి చక్కని సాధన.

శి- స్వామీ! నేనెవరో ఇది వరకే తెలుసుకున్నా.

గు-ఎవరు నీవు?

శి-తమరి శిష్యుణ్ణి.

గు-అదికాదు నాయనా, అసలు నీ స్వరూపమేమిటో తెలుసుకో. నీవు పంచ భూతాత్మకమైన దేహాది సంఘాతము కాదని నీవు నిత్య శుద్ధ బుద్ధ ముక్త ఆత్మవని తెలుసుకో.

శి- బాబా! అదేమిటో అర్థం కావటంలేదు. దానికంటె సులభమైన ఉపాయం ఇంకేమైనా ఉంటే చెప్పండి స్వామీ!

గు-పోనీ నామస్మరణ చేస్తావా? దానితో మోక్షం సులభంగా వచ్చేస్తుంది.

శి- స్వామీ! నామస్మరణ నేనే చేయవలసియుండునా, నా బదులు ఇంకెవ్వరైనా చేయవచ్చా?

గు-ఓరీ బాలా! భోజనం నీవే చేస్తున్నావా? నీ బదులు ఎవ్వరైనా చేస్తున్నారా? ఎవరు కష్టపడతారో వారే సుఖిస్తారు. చేసుకున్నవారికి చేసుకున్నంత మహాదేవ.

శి-చక్కగా సెలవిచ్చారు, అట్లాగైతే నామస్మరణ తప్పకుండా మొదలు పెట్టాను. అయితే బాబూ! ఒక సందేహం. ఈ నామస్మరణ కొద్దిరోజులైనాక ప్రారంభించవచ్చా?

గు-ఓరి సోమరిపోతా! చావు ఎప్పుడువస్తుందో ఎవరికీ తెలియదు గదా. ఎప్పటికప్పుడు పుణ్యఫలం సంపాదించి సిద్ధపడి ఉండవద్దా. ఫురే రేపని వాయిదాను వేస్తూ పోతూంటే ఎట్లా? ఇట్టి చక్కని అవకాశం మళ్లా దొరుకుతుందా? పిచ్చివాడా! ఈక్షణంనుంచే నామం మొదలుపెట్టు పో!

శి-బలే బోధచేసారు స్వామీ! తమ ఆదేశం శిరసావహిస్తా. ఇప్పుడే భజనమందిరానికి పోతున్నా నామం చెయ్యటానికి "రఘుపతి రాఘవ—" అయితే స్వామీ! ఈ ప్రారంచేస్తే సాయంత్రానికి పూర్తి మోక్షం వచ్చేస్తుందా?

గు-తొందరపడబాకా! ఓరి సోమరీ! నీకసలు శ్రద్ధే లేనట్లుందే? ముందు కార్యంచెయ్యి, ఫలితం తరువాత దానంతట అదే వస్తుంది. తెలిసిందా?

శి-బ్రహ్మాండంగా తెలిసింది. ఈరోజు మంచిమంచి సంగతులు చెప్పి నన్ను కడతేర్చారు. మహాప్రభో! కృతార్థుణ్ణి అయినాను, నా జీవితంలో ఇక నామస్మరణగాని దైవవిచారణగాని మరువనే మరువను. సెలవు!

—o—

గురువు- ఏమిరా మురళీ! సాధన ఎంతవరకు వచ్చింది?

శిష్యుడు-స్వామీ! ఈమధ్య బ్రహ్మాండంగా అభివృద్ధికి వచ్చింది. కాని మొన్ననే చప్పగా దిగజారిపోయింది.

గురువు- అజాగ్రతగా ఉన్నావా ఏమి?

శిష్యుడు- స్వామీ! తమరు ఎంతెంతో చెప్పారు, సాధనలో ఏమరుపాటు పనికిరాదని. కాని ఆదేమి ఖర్మమో నామటుకు నేను ఎంత జాగ్రత్తగా ఉన్నా మాయ ఒక్కతోసు తోసివేసింది. వెళ్ళి అమాంతంగా పాతాళంలోపడ్డా మధ్య ఎక్కడా ఆగకుండా!

గురువు- ఏంజరిగింది మురళీ అంతా వివరంగా చెప్పు?

శిష్యుడు- స్వామీ! చాలాకాలంనుంచి ప్రతిసోమవారం మౌనం పాలిస్తున్నా. కాని క్రిందటిసోమవారం నేను మౌనంగా ఉండగానే వాడెవడో వచ్చి నన్ను కుంక అని తిట్టాడు, ఆమాట వినగానే నాకు పొడుచుకొనివచ్చి "కుంక నేనా నువ్వా" అన్నాను. వాడు పోయినతర్వాత "అయ్యో! వ్రతపుణ్యానికి మౌనం చెడగొట్టుకున్నానే" అని దిగులుపడ్డా.

గురువు- ఇంతేనా ఇంకేమైనా పొరపాటు చేసావా?

శిష్యుడు- ఇంకొక్క పొరపాటుకూడ జరిగింది స్వామీ. ఇంతవరకు ప్రతి ఏకాదశీ తమరు చెప్పినప్రకారం ఉపవాసం చేస్తూ ఉన్నా. కాని మొన్న ఏకాదశికి ఆదేమిటోగాని

మధ్యాహ్నం ఒంటిగంటకు చాల ఆకలి పుట్టుకొచ్చింది. ఎట్లాగో కొంతసేపు బిగపెట్టుకొని కూర్చున్నా. ఆతర్వాత ఇక లాభం లేదనుకొని సరాసరి పూజామందిరంలోకి వెళ్లి భక్తులు తమకు సమర్పించిన ఫలహారం యావత్తు తినివేసినాను. పొరపాటు క్షమించండి.

గురువు- వ్రతంలో దృఢత్వం నీకింకా ఏర్పడలేదు. ఈమధ్య సోమరితనంకూడ నీలో కొంత ప్రవేశించింది. పొద్దున పారాయణానికికూడ సరిగా రావటంలేదు.

శిష్యుడు- మహాప్రభో! నాకేమో బాగుపడాలనే ఉంది. కాని ఏదో నన్ను పడగొట్టుతుంది. అదేమో నాకు అర్థం కావడం లేదు.

గురువు- అదే పాతవాసన. అనేక జన్మలనుండి తమో గుణం, రజోగుణం నిన్ను వెంటాడుతున్నాయి. అజాగ్రతగా ఉన్నవాళ్లను అవి పరమపదసోపానపటంలోని పెద్దపాములాగా క్రిందకుచేర వేస్తువుంటవి. తరించాలని పట్టుదలకలిగి కొంచం జాగ్రతగా ఉన్నవాళ్లని అవి ఏమీ చేయలేవు. కాబట్టి ఇక నియమాల్లో బహు జాగ్రతగా ఉండు.

శిష్యుడు- మహాప్రభో! ఇకమీదట సోమరితనాన్ని దూరంగా తరిమివేస్తా.

గురువు- ఎప్పట్నుంచి?

శిష్యుడు- వచ్చేవారం మొదలుకొని.

గురువు- ఓరి పిచ్చివాడా! అట్లా వాయిదాలు వేయబోకు! అధ్యాత్మమార్గంలో వాయిదాలకు చోటు లేదు. ఏక్షణంలో మంచి విషయాలు వింటావో ఆక్షణంలో ఆచరణం నుంచే ఆచరణలో పెట్టూఉండాలి.

శిష్యుడు. ధన్యోఽస్మి. అట్లాగే చేస్తాను మహాప్రభో! సకాలంలో హెచ్చరిక చేసి నన్ను గట్టెక్కించారు తండ్రి! తమకు శతకోటి నమస్కారాలు!

—x—

---

మంచి ఎంతచేయగలవో అంత చేయుము
ఎన్నివిధముల చేయగలవో అన్నివిధముల చేయుము
ఎన్నిచోట్ల చేయగలవో అన్నిచోట్ల చేయుము
ఎన్నిసార్లు చేయగలవో అన్నిసార్లు చేయుము
ఎంతమందికి చేయగలవో అంతమందికి చేయుము
ఎన్నిమార్గములద్వారా చేయగలవో అన్నిమార్గముల ద్వారా చేయుము
ఎంతకాలము చేయగలవో అంతకాలము చేయుము

---

## 7. మోక్షసాధన రహస్యము

(రచయిత : శ్రీ విద్యాప్రకాశానందగిరిస్వాములవారు)

ఇందు మానవుడు మోక్షమును బంధరాహిత్యమును, పరమశాంతిని బడయుటకు వలసిన సాధనోపాయములు, పద్ధతులు ఎన్నియో వివరింపబడినవి. ముముక్షువులకు చాల హితకరమైన గ్రంథము.

1/8 క్రౌన్ సైజు 676 పేజీలు వెల : రు. **14-00**

---

## 8. పరమార్థకథలు

[రచయిత : శ్రీ విద్యాప్రకాశానందగిరిస్వాములవారు]

నిగూఢమైన ఆధ్యాత్మికతత్త్వము కథలద్వారా, ఉపమానములద్వారా, దృష్టాంతములద్వారా తెలుపబడినప్పుడుమాత్రమే శ్రోతల హృదయమున చక్కగ ప్రవేశింపగలదు. వేదాంతతత్త్వమును సుబోధక మొనర్పగల ఆధ్యాత్మిక కథలు ఎన్నియో ఈ గ్రంథమున వ్రాయబడినవి. ప్రతికథ చివర ఆ కథకు సంబంధించిన నీతికూడ తెలుపబడినది. సాధకులకు ఆధ్యాత్మ క్షేత్రమున ఈగ్రంథము ఎంతయో ఉపకరించగలదు.

1/8 క్రౌన్ సైజు దాదాపు 780 పేజీలు, వెల : రు **18-00**

## 9. బ్రహ్మానంద వైభవము

రచయిత : శ్రీ విద్యాప్రకాశానందగిరిస్వాముల వారు

ప్రతి జీవియు ఆనందమును కాంక్షించుచుండును. ఆనందముయొక్క పరాకాష్ఠయే బ్రహ్మానందము. విషయానందము క్షణికమైనది. బ్రహ్మానందము శాశ్వతమైనది. అట్టి బ్రహ్మానందమును బడయుటకు పెక్కు ఉపాయములు ఈ గ్రంథమున తెలుపబడినవి. సర్వులకును ఆవశ్యకమైన గ్రంథము

1/8 క్రౌన్ సైజు దాదాపు 800 పేజీలు, వెల : **8-00**

---

## 10. భజనలు - కీర్తనలు

భగవంతుని భజించుటకు, సంకీర్తన మొనర్చుటకు వలసిన భజనలు - కీర్తనలు 665 ఈ గ్రంథమున ప్రకటింపబడినవి. ప్రతి భజన యొక్క తాత్పర్యమున్ను తెనుగులో వివరింపబడినది. కాబట్టి భజనలు సలుపువారికి సంకీర్తనాదులు నొనర్చువారికి ఈ గ్రంథము చాల సహాయకారిగ నుండగలదు.

1/8 క్రౌన్ సైజు 866 పేజీలు, వెల. రు. **8=00**

# 11. శ్రీ భగవద్గీత

(స్థూలాక్షరి)

(త్రివర్ణ ముఖచిత్ర ఫోటో - ప్లాస్టిక్ కవరుతో)

ఇందు భగవద్గీత మూల శ్లోకములు పెద్దటైపులో ప్రకటింపబడినవి. ప్రతి శ్లోకమునకు తెలుగు తాత్పర్యముకూడ కలదు. దృష్టిమాంద్యము కలవారుకూడ ఈ గ్రంథము ద్వారా గీతాపారాయణము చేయుటకు వీలుండును.

480 పేజీలు — వెల : రు. **6-00**

---

# 12. శ్రీ భగవద్గీత

(మూలం)

ఇందు భగవద్గీత మూలశ్లోకములు కలవు. పారాయణోపయుక్తమైనది. (కృష్ణుని త్రివర్ణ ముఖచిత్రము కవరు, ప్లాస్టిక్ కవరుతో).

ప్యాకెట్ సైజు 812 పేజీలు — వెల : రు. ***2-00***

## 13. వివేకానంద సంవాదం

శ్రీ వివేకానందస్వామివారియొక్క గంభీరమైన వాక్యములు ఆధ్యాత్మిక బోధలు ఇందు కలవు. ఇంగ్లీషువాక్యములు, వాని తెలుగు తాత్పర్యము కూడ ఇందు కలవు. ఆధ్యాత్మపథమున పయనించువారికి ఈ గంభీరవాక్యములు ఎంతెంతో ఉత్తేజమును కలుగజేయగలవు.

వెల. రు. 1-50 లు.

---

## 14. యమలోకవార్తలు

జీవులు ఏ పాపము చేసినచో యమలోకమున అక్కడ ఏ దండన లభించునో ఆ వివరములన్ని, నరకబాధలు లేకుండ చేసికొనుటకు మార్గములన్ని ఈ గ్రంథమున తెలుపబడినవి.

వెల. రు. 1-50 లు.

---

## ఆధ్యాత్మ జడ్జిమెంటు

ఇది ధర్మక్షేత్రమను కోర్టులో మమత్వమను వాది అజ్ఞానమను ప్రతివాదిపై దావా వేయగా కర్మగురువు అను జడ్జి ఇరుపక్షముల సాక్షులను విచారించి డిక్రీ ఇచ్చును. విచారణ అత్యంత మనోరంజకముగ నుండును. వెల. రు. 1-50

## 16. తత్త్వసారము

రచయిత : శ్రీ విద్యాప్రకాశానందగిరిస్వాముల వారు

నిగూఢమైన వేదాంతతత్త్వము సులభమైన తత్త్వములు (పాటలు)తో ఇందు తెలుపబడినవి. జనసామాన్యమునకు వీనిద్వారా ఆధ్యాత్మికజ్ఞానము చక్కగ బోధపడగలదు. ఈ తత్త్వములను (పాటలను) వారి వారికి అనుగుణ్యమైన రాగములతో పాడుకొని ఆనందించవచ్చును.

వెల. రు. **1-00**

---

శ్రీ శ్రీ శ్రీ విద్యాప్రకాశానందగిరిస్వాములవారి

## 17. జీవిత చరిత్ర

శ్రీ కాళహస్తియందలి శ్రీ శుకబ్రహ్మాశ్రమము యొక్క స్థాపకులును, గీతామకరందాది గ్రంథ రచయితలున్ను అష్టోత్తర శతగీతాజ్ఞానయజ్ఞ నిర్వాహకులున్ను అగు శ్రీ విద్యాప్రకాశానందగిరిస్వాములవారియొక్క జీవిత విశేషములు ఇందుకలవు.

వెల. రు. **1-50**

## 18. ప్రణవపూజ

నిర్గుణ పరబ్రహ్మముయొక్క వాచకమగు ప్రణవము (ఓంకారము) మహాపవిత్రమైనది. మహోన్నతమగు అట్టి ప్రణవముయొక్క పూజావిధానము ఇందు తెలుపబడినది.

వెల: రు. **0 75** పై

---

## 19. గౌరీపూజా విధానము

శ్రీ గౌరీదేవియొక్క పూజావిధానము, అర్చనపద్ధతి ఇందు తెలుపబడినది. వెల: రు. **0-75**

---

## 20. ద్వాదశ మంజరి

ముముక్షువులకు అత్యావశ్యకములైన పండ్రెండు బోధలు [వ్యాసములు] ఇందు కలవు.

వెల : రు. **0-50** పై

## 21. అధ్యాత్మిక హితోక్తులు

ఆధ్యాత్మిక క్షేత్రమున సాధకునకు అవశ్యకమైన పెక్కు హితోక్తులు ఇందు వివరింపబడినవి.

వెల : రు 0-50 పై.

---

## 22. మోక్షద్వారపాలకులు

పరిపూర్ణశాంతికి నిలయమైన మోక్షమును పొందుటకు ముముక్షువు ప్రయత్నించుచున్నాడు. మరి అట్టి ప్రయత్నములు ఫలించుటకు వలసిన అనేక సులభోపాయములను ఈ గ్రంథము తెలుపుచున్నది.

వెల రు. 1 00

---

## 23. మట్టిలో మాణిక్యము

ఈ శరీరము ఆత్మదేవునకు మందిరమనియు, భగవంతుకు ఊరేగుటకు దివ్యరథమనియు, అట్టి భగవంతుని స్వరూపమును తేటతెల్లముగ విపులీకరించిన గ్రంథమే మట్టిలో మాణిక్యము.

వెల రు 1-00

## 27. గీతోపన్యాసాల కేసెట్సు

పూజ్య శ్రీవిద్యాప్రకాశానందగిరిస్వాములవారిగీతోప న్యాసాలు చాలా ప్రశస్తి వహించాయి. వేలకొలది ప్రజా నీకం ఈ ఉపన్యాసాలు వినడానికి గీతాయజ్ఞాలకు హాజరయ్యే వారు, తిరుమల-తిరుపతి దేవస్థానంవారు పై ఉపన్యాసాల ప్రాముఖ్యం గుర్తించి వాటిని రికార్డుచేసి కేసెట్సుగా విడుదల చేశారు. ఒక అధ్యాయం కల కేసెట్. వెల రు. 45/-

---

## 28. అమృత బిందువులు

ఈ గ్రంథము మహనీయుల అనుభవపూర్వకమైనట్టి సూక్తులు, సదుపదేశములు, సుభాషితములు అన్నిటిని జేర్చి "అమృత బిందువులు" అను పేరున గ్రంథము ప్రకటించబడినది

ప్రాప్తిస్థానం-

మేనేజరు,
శ్రీ శుకబ్రహ్మాశ్రమం (Post)
శ్రీ కాళహస్తి,
చిత్తూరుజిల్లా (A.P.)
పిన్ - 517640

